

# అదృష్టవంతుని ఆత్మకథ

డి.వి. నరసరాజు

స్వీయ చరిత్ర



# అప్పటి కుటుంబం



భార్య, కూతురు, కొడుకు, నేను

# అదృష్టవంతుని
# ఆత్మకథ

డి.వి. నరసరాజు

స్వీయ చరిత్ర

క్రియేటివ్ లింక్స్ పబ్లికేషన్స్

1-8-725/ఎ/1, 103 సి, బాలాజి భాగ్యనగర్ అపార్ట్‌మెంట్స్,

నల్లకుంట, హైదరాబాద్-500044.

ఫోన్ : 9848065658, 9848506964

■ అదృష్టవంతుని ఆత్మకథ
డి.వి.నరసరాజు స్వీయ చరిత్ర

■ Adrushtavantuni Atma Katha
Autobiography of D.V. Narasa Raju

■ ప్రచురణ :
ఏప్రిల్ 2006

■ *Publication*
APRIL 2006



■ వెల :
రూ. **200**/-
US $ **15** (Abroad)

■ *Price*
Rs. **200**/-
US $ **15** (Abroad)

■ పుస్తక రూపకల్పన :
మాటూరి సూర్యనారాయణ (సూరిబాబు),
తాళ్ల శ్రీకాంత్
క్రియేటివ్ లింక్స్
1-8-725/A/1, 103C,
బాలాజి భాగ్యనగర్ అపార్ట్‌మెంట్స్,
నల్లకుంట, హైదరాబాద్-500 044.
ఫోన్స్: 98480 65658, 98485 06964.

■ *Book Layout & Design*
Maturi Suryanarayana (Suri Babu)
Thalla Sreekanth
**CREATIVE LINKS**
1-8-725/A/1, 103C,
Balaji Bhagyanagar Apartments
Nallakunta, Hyderabad - 500 044.
Phones : 98480 65658, 98485 06964

■ ముద్రణ :
కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్
విద్యానగర్, హైదరాబాద్.

■ *Printed at*
KARSHAK ART PRINTERS
Vidyanagar, Hyderabad.

■ పుస్తకం ప్రతులకు :
విశాలాంధ్ర బుక్ హౌస్ అన్ని శాఖలు
నవయుగ బుక్ హౌస్
నవోదయ బుక్ హౌస్
అనల్ప కమ్యూనికేషన్స్
వాల్డెన్

■ *Copies are available at*
VISALANDHRA BOOK HOUSE
NAVAYUGA BOOK HOUSE
NAVODAYA BOOK HOUSE
ANALPA COMMUNICATIONS
WALDEN

# అంకితం



చిరంజీవులు

## లగడపాటి శ్రీధర్, శిరీష దంపతులకు

ఆశీస్సులతో



## ముందుమాట

"జీవితంలో - మీ అనుభవాలు చెబుతూవుంటే గంటలకొద్దీ - వినబుద్ధి అవుతుంది.

ఇవన్నీ వ్రాసి - గ్రంధస్థం ఎందుకు చెయ్యగూడదూ? మాలాంటి వాళ్ళు - యింకా చాలమందికి ఉపయోగపడతాయ్ గదా!" అని - నలుగురయిదుగురు మిత్రులు - పదే పదే - అంటుండేవాళ్ళు!

మొదట - వాళ్ల సూచనలు చాలాకాలం నేను అంతగా పట్టించుకోలేదు.

ఈ మధ్య - అనిపించింది! "అవును! ఎందుకు వ్రాయగూడదూ?" అని.

అందుకే - ప్రారంభించాను!

ఈ 'గ్రంథాన్ని' - 'ఆత్మకథ' అనో - 'స్వీయ చరిత్ర' అనో - అనడం నాకు యిష్టంలేదు.

ఎందుకంటే -

నా జీవితంలో - పాఠకులకు ఆసక్తికరం కాని విషయాలు - ఘట్టాలు - చాలా వుంటాయ్.

అవన్నీ వ్రాసి - వాళ్లను విసిగించడం ఏం న్యాయం?

విసిగిస్తే - వాళ్లు తిట్టరు - కొట్టరు! పుస్తకం మూసేసి - అవతల పెడతారు! అంతే!

అది కాదు గదా - నా ధ్యేయం!

అందువల్ల - నా జీవితంలోని - అనవసర విషయాలు వదిలేసి చదివేవాళ్లకు - ఆసక్తికరమని నాకు అనిపించినవి మాత్రమే వ్రాయదల్చుకున్నాను.

ముందుగా - మా కుటుంబం - పుట్టుపూర్వోత్తరాలతో ప్రారంభిస్తాను.

## మా కుటుంబం

మా తాతలు - తండ్రుల స్వగ్రామం గుంటూరు జిల్లా - సత్తెనపల్లి తాలూకా - క్రోసూరు మండలం నం.88, తాళ్లూరు. (88 రెవిన్యూనంబరు)

వ్యవహారంలో - ఆ ఊరును - 'ఉయ్యందన తాళ్లూరు' అనేవారు. ఉయ్యందన-తాళ్లూరు పక్కనే ఉన్న - మరొక గ్రామం.

తాళ్లూరు అనే పేరు గల ఊరు - మరొకటి అమరావతి - సత్తెనపల్లి రోడ్డులో వున్నది. దానిని పరస తాళ్లూరు-అనేవారు.

మా తాతలు ముగ్గురు అన్నదమ్ములు. దాట్లవెంకట సుబ్బరాజు - అయ్యపరాజు - అనంతరాజు, ఉమ్మడికుటుంబం.

వెంకట సుబ్బరాజుగారికి ఒక కూతురు (రాజమ్మ), ఒక కుమారుడు. ఆ కుమారుడు చిన్న వయసులోనే చనిపోయాడు.





శ్రీ దాట్ల గురవరాజు (పెదతండ్రి కుమారుడు)

అయ్యపరాజు గారికి పిల్లలు లేరు. అనంతరాజుగారికి ఇద్దరు కొడుకులు - అంకమరాజు - పద్మరాజు.

ఒక కూతురు - బాపమ్మ.

బాపమ్మను అయ్యపరాజుగారు, పద్మరాజును వెంకట సుబ్బరాజు - పెంచుకున్నారు. అంటే దత్తత చేసుకున్నారు.

'దత్తత' అంటే - న్యాయశాస్త్రం పరంగా చేసుకున్నది కాదు.

వూరికే - అనుకోవడమే! మరణానంతరం శ్రాద్ధకర్మల కోసం - అనుకున్నవి.

ఆడపిల్లను - దత్తత చేసుకోవడం అనే ఆచారం లేదు. అయినా - పెంచుకుని పెళ్ళి చేసేవారు.

బాపమ్మకు పెళ్ళిచేసి - అల్లుణ్ణి ఇల్లరికం ఉంచుకున్నారు. 'ఇల్లరికం' అంటే ఆ రోజుల్లో - ఆ అల్లుడుగూడ - కొడుకులతో పాటు అరక దున్నేవాడన్నమాట!

ఒక పాలేరు తగ్గినా - తగ్గినట్టే గదా!

కొడుకులు - అంకమరాజు - పద్మరాజులలో - అంకమరాజు - పెద్దవాడు.

ఆయనకు - దగ్గరవూరులోనే సంబంధం చూసి - పెళ్ళిచేశారు!

ఆయనకు - ముగ్గురు కుమారులు గురవరాజు - అయ్యపరాజు - సీతారామరాజు, ఇద్దరు కూతుళ్లు - వెంకట సుబ్బమ్మ - వెంకాయమ్మ.





శ్రీ వెంకటప్పలరాజు, భార్య చిన వెంకాయమ్మ

వెంకట సుబ్బమ్మను - మేనత్త బాపమ్మ గారి కుమారుడు - సీతారామరాజుకు యిచ్చి పెళ్లి చేశారు. కాని - ఆమె బావిలో దూకి - ఆత్మహత్య చేసుకున్నది. కారణం తెలియదు.

వెంకాయమ్మను - యింటి ప్రక్కనే వున్న మరో మోతుబరి రైతు - ఉప్పలపాటి రామకృష్ణంరాజుగారి ఒకే ఒక కుమారుడు - వెంకటప్పలరాజు గారి కిచ్చి పెళ్ళి చేశారు.

ఇక - చిన్నకొడుకు - పద్మరాజుగారికి దగ్గర వూళ్లోనే సంబంధం చూసి - పెళ్ళి చేశారు! ఆమె పేరు సుభద్రమ్మ - ఆమె - ఒక ఆడపిల్లను కన్నది. కాని - ప్రసవించగానే - తల్లి, బిడ్డ - మరణించారు.

వెంటనే - పద్మరాజుగారికి - ద్వితీయ వివాహం జరిగింది. వధువు - బెజవాడ పక్కన చిన్న పల్లెటూరు - మొఖసా ముత్యాలంపాడు - నివాసి ఉప్పలపాటి రామరాజుగారి పెద్దకుమార్తె రుక్మిణమ్మ!

అప్పటికే - అంకమరాజు, పద్మరాజుగార్లది ఉమ్మడి కుటుంబమే.

దాదాపు - రెండు వందల ఎకరాల మెరక భూమి.

పదకొండు అరకల వ్యవసాయం. సంపన్న కుటుంబం!

చాలాకాలం - పద్మరాజుగారికి - సంతానం లేదు.

అన్నగారు - అంకమరాజు గారికి - అప్పటికి ఇద్దరు కొడుకులు - గురవరాజు - అయ్యపరాజు.

చిన్నకొడుకు - అయ్యపరాజును పద్మరాజుగారు దత్తత తీసుకోవాలని - మాటవరసగా నిర్ణయించుకున్నారు.

పద్మరాజుగారి భార్య రుక్మిణమ్మగారు నాలుగయిదేళ్ళ వయసున్న - అయ్యపరాజును తన పెంపుడు కొడుకుగానే - దగ్గరకు తీసేది!



యిక్కడ - ఆ కుటుంబం - ఆస్తిపాస్తులు యింటి పెత్తనం గురించి కొంత చెప్పాలి.

ఆస్తి మీద పెత్తనం - వ్యవసాయం మీద రాబడి వగైరాల అజమాయిషి - అన్నగారు - అంకమరాజు గారిది.

కాని - ఇంట్లో పెత్తనం - చిన్నకోడలు - రుక్మిణమ్మగారిది!

అందుకు కారణం - అంకమరాజుగారి భార్య - అంటే యింటి పెద్ద కోడలు నిరక్షరాస్యురాలు! అంతేగాక - పేద కుటుంబం నుంచి వచ్చినది.

చిన్నకోడలు - రుక్మిణమ్మ గారు పెద్దగా చదువు (తెలుగేననుకోండి) లేక పోయినా, బెజవాడ దగ్గర - ముత్యాలంపాడు నుంచి వచ్చింది గనక - పెద్ద కోడలు కంటె - నాగరీకురాలని యింటి పెత్తనం - ఆమెకు అప్పజెప్పారు.

పాలేళ్లు గాని - ఎవరైనా - దానధర్మాల కోసం వచ్చినా - పెద్దాయన అంకమరాజు గారు "వెళ్లి - చిన్నకోడల్ని అడగండి" అని పంపేవారు!

తాను యింటి పెద్దకోడలయినా అన్ని విషయాలలో - పెత్తనం చిన్నకోడలికి అప్పజెప్పినందువల్ల - బహుశా- అసూయ ఏర్పడివుండవచ్చు!

అందువల్ల తోడికోడళ్ల మధ్య చిన్న చిన్న తగాదాలు - మూతి విరుపులు ప్రారంభం కావడం సహజం!

అలాంటి - చిన్న చిన్న తగాదాలలో ఎప్పుడో - పెద్దకోడలు - చిన్నకోడల్ని సూటి పోటి మాటలతో నొప్పించి వుంటుంది.

"గొడ్రాలికేం తెలుసు - బిడ్డనొప్పులు" అనో-

యింకొంచెం ఘాటుగా -

"నా కొడుకు తల కొరివి పెడితేనేగాని - నీకు దిక్కులేదు" అనో-

చిన్నావిడ మనసు గాయపరచింది.

అందుకు - చిన్నకోడలు - రుక్మిణమ్మగారి మనసు - బాగా - గాయపడింది.

మనసులోని - బాధ - పెనిమిటికి గూడ చెప్పలేదు!

ముభావంగా వుండిపోయింది! ఒక రోజు - పుట్టింటికి వెళ్లి వస్తానని ప్రయాణమైంది. ముత్యాలంపాడు వెళ్లింది.

రుక్మిణమ్మగారి తండ్రి - రామరాజు గారికి అయిదుగురు కొడుకులు - ముగ్గురు కూతుళ్ళు.

రుక్మిణమ్మ గారు పెద్దకూతురు. రెండో కూతురు సుబ్బమ్మ - మూడో కూతురు నారాయణమ్మ.

ఒకరోజు - తండ్రి - పెద్దన్న సుబ్బరాజు రెండో అన్న - ఆదిరాజుల వద్ద - నోరు విప్పింది.

తన భర్తకు - తన చెల్లి సుబ్బమ్మను యిచ్చి పెళ్ళి చేయమని అడిగింది.

అందరూ ఆశ్చర్యపోయారు!





అక్కగారు వెంకటరామమ్మ, భర్త ఉప్పలపాటి రంగరాజు (ఐదవ మేనమామ)

"నీకేమైనా మతిపోయిందా! ఎంత సొంత చెల్లెలయితే మటుకు - కోరి - కోరి సవతి పోరు తెచ్చుకుంటావా?" అని హెచ్చరించారు.

"అన్నీ ఆలోచించే చెబుతున్నాను. నాకు - యిక - నా భర్తతో - సంసార సుఖం అక్కరలేదు!

ఆయనకు సంతానం కలగడమే నాకు కావలసింది.

మరొకరి బిడ్డను పెంచుకోవడం నాకు ఇష్టం లేదు!" అని గంభీరంగా చెప్పింది.

"ఈ విషయం - నీ పెనిమిటితో మాట్లాడావా" అని అడిగారు పెద్దన్నగారు!

"లేదు! ముందు మిమ్మల్ని ఒప్పించి... తరువాత ఆయన్ని ఒప్పించగలననే ధైర్యం నాకున్నది" అని ధీమాగా చెప్పింది!

ఆ రోజుల్లో - పెళ్లి విషయంలో ఆడపిల్లను అడిగి - అంగీకారం పొందే ఆచారం లేదు గనక-

అసలు పెళ్ళి కూతురు - సుబ్బమ్మ - అభిప్రాయం ఎవరూ అడిగే ప్రసక్తే లేదు.

రుక్మిణమ్మగారి పట్టుదలకు తండ్రి - అన్నలు - తలవొగ్గక తప్పలేదు!

రుక్మిణమ్మగారు - తిరిగి - అత్తవారింటికి తాళ్లూరు వెళ్లింది.

భర్తకు - బావగారికి - విషయం చెప్పింది.

వాళ్లూ ఆశ్చర్యపోయారు!



కాని, రుక్మిణమ్మ గారి - పట్టుదల ముందు వాళ్లు తల ఒగ్గక తప్పలేదు!

పద్మరాజుగారికి - మూడో పెళ్ళి సుబ్బమ్మగారితో జరిగింది! 1915-16 ప్రాంతంలో.

1918లో - సుబ్బమ్మగారికి - ఒక కూతురు! 'వెంకటరామమ్మ'

1920లో ఒక కుమారుడు - వెంకట నరసరాజు (అంటే నేను) జన్మించారు.

నా తరువాత ఒక ఆడపిల్ల పుట్టి పోయింది.

## అప్పటి సామాజిక పరిస్థితులు

ఇక్కడ - మా తండ్రుల కాలం నాటి - కుటుంబ ఆర్థిక, సామాజిక పరిస్థితులను గురించి - కొంత వ్రాయాలి!

యివన్నీ - మా తల్లి - పెత్తల్లి గార్లు చెబితే - నాకు తెలిసిన విషయాలు. మా పెత్తల్లి - రుక్మిణమ్మగారిని - 'తామ్మ' అని పిలిచేవాళ్లం. పెత్తల్లిని 'తామ్మ' అనడం - మా కుటుంబాలలో మాత్రమే వుండేది.

యితర కుటుంబాలలో - పెత్తల్లిని 'పెద్దమ్మ' - 'అన్నమ్మ' - 'దొడ్డమ్మ' అని పిలిచేవారు.

మా తండ్రులు - యిద్దరు అన్నదమ్ములు. తండ్రిని - మా కుటుంబాలలో - 'బాబు' అని పిలిచేవాళ్లు. మా పెదబాబు అంకమరాజుగారు - కుటుంబ ఆస్తి మీద - వూళ్లోను పెత్తనం చేసేవారు.

మా 'బాబు' - వ్యవసాయం చూసేవారు. వాళ్లిద్దరేకాదు - మిగతా భూస్వాములందరూ స్వయంగా, నాగలి పట్టి - భూమి దున్నే రైతులు.

ఊరి మొత్తం మీద, రాజుల కుటుంబాలు అరడజను కంటె ఎక్కువ వుండేవి కావు!

మిగతా కులాలు కమ్మ, తెలగ, వగైరాలు వున్నా - వారికి భూవసతి పెద్దగా వుండేది గాదు.

నాలుగయిదు బ్రాహ్మణ కుటుంబాలుండేవి. వారికి - భూవసతి బాగానే వుండేది.

ఊళ్లో రామాలయం వుండేది. ఇప్పటికీ వుంది. దానికి మా కుటుంబం - ధర్మకర్తలం!

శ్రీరామనవమికి - మా కుటుంబ సభ్యులే పీటల మీద కూర్చుని - సీతారాముల కళ్యాణం - చేయించేవారు.

ఆ తరువాత - 50-60 ఏళ్ల క్రితం ఆ వూరికి చెందిన - వ్యాకరణం - వెంకటేశ్వరావధాని గారు - ఆయన పలుకుబడితో - గుంటూరు - సత్తెనపల్లి మొదలగు పట్టణాలలో - చందాలు సేకరించి వూరి బయట - పడమట దిక్కున - ఒక శివాలయం కట్టించారు.

మా 'బాబు' 'పెదబాబు' మాత్రమే గాక మా మేనత్త గారి భర్త - ఉప్పలపాటి వెంకట సుబ్బరాజు గారు గూడ - (మా యింట్లోనే - 'ఇల్లరికం' వుండేవారు) అరక దున్నేవారు.

ఆయనకు - యిద్దరు కొడుకులు! పెద్ద కొడుకు సీతారామరాజుకు - మా పెదతండ్రి గారి - పెద్ద కూతుర్నిచ్చి - పెళ్ళి చేస్తే - ఆమె యింటి ముందు - బావిలో దూకి - ఆత్మహత్య చేసుకుందని చెప్పాను గదా! కారణాలు తెలియదు. అప్పుడు నేను చాలా చిన్నవాణ్ణి.



భూముల్లో - పండే - ఆహారపంటలు - ప్రధానంగా జొన్నలు, వరిగలు, సజ్జలు.

ఊళ్లో అందరూ వరిగన్నం, జొన్నన్నం తినేవాళ్లు.

మా కుటుంబానికి - తాళ్ళూరు పక్కన క్రోసూరులో - చెరువు కింద మాగాణి - రెండు మూడు ఎకరాలు వుండేది. అది మా తండ్రులు సంపాయించిందే!

అందులో మాత్రం - వరి పండేది.

నాకు వూహ తెలిసినప్పటి నుంచీ - మా యింట్లో - వరి అన్నమే తినేవాళ్లం.

కాయగూరలు - ఆయా సీజన్లలో తప్ప - ఎక్కువగా దొరికేవిగావు.

ముఖ్యంగా - కందిపప్పు - చింతకాయ పచ్చడి - (ఊరగాయ) పప్పుచారు - ముఖ్యమైన వంటలు. వెన్నకాచిన నెయ్యి - వెన్న - పెరుగు - మజ్జిగ సమృద్ధిగా వుండేవి.

తినుబండారాలు - ఊళ్లో వైశ్యుల కుటుంబాలు అమ్మేవాళ్లు!

వాళ్లు తయారు చేయినివ్వండి - సత్తెనపల్లి నుంచి - కొని తీసుకు రానివ్వండి - ముఖ్యంగా 'పప్పుచెక్క' అమ్మేవాళ్లు. వేయించిన శనగపప్పు బెల్లంతో చేసేవాళ్లు!

యిప్పటికీ 'పప్పుచెక్క' సత్తెనపల్లిలో దొరుకుతుంది.

మరో విశేషమేమిటంటే - ఊళ్లోకి వారానికోసారో - నెలకోసారో - తమలపాకులు తెచ్చేవాళ్లు.

ఆడవాళ్లకు గాజులు అమ్మేవాళ్లు వచ్చేవాళ్లు.

ఊళ్లోకి గాజులమ్మేవాళ్లు వస్తే మా 'తామ్మ' రుక్మిణమ్మగారు ఊళ్లో వున్న ముత్తయిదులనందరినీ పిలిపించి - గాజులు తొడిగించేది.

పప్పుచెక్కగాని - తమలపాకులుగాని - గాజులు గాని కొన్నప్పుడు - పైకం రొఖ్ఖం యిచ్చేవాళ్లు కాదు.

వరిగలో - సజ్జలో కొలిచేవారు. ఒక్కొక్కప్పుడు - 'పత్తి' గూడ యిచ్చి - కొనేవాళ్లు. అంటే- 'బార్టర్ పద్ధతన్నమాట!

సరుకు యిచ్చి - మరో సరుకు కొనడం!

నాకు బాగా జ్ఞాపకం! నా చిన్నతనంలో అంటే - మూడునాలుగేళ్ల వయసులో, మా యింట్లో 'నీలిమందు మొక్కలుండేవి! వాటిని 'చూర్ణం' చేసి నీళ్లలో కలిపి - 'సిరా' చేసేవాళ్లం!

మా తండ్రుల కాలంలో - నీలిమందు (యిండిగో) ప్రధానమైన - వాణిజ్యపంట - (కమ్మర్షియల్ క్రాప్)

ఇప్పుడున్నవో లేవో తెలియదు -

పాతికేళ్ల క్రితం వరకు - ఊరి పక్కనే - మా చేనులో - మోటుబావి 'నీలితొట్లు' వుండేవి!

నీలిఆకు - తొట్టిలోవేసి - నీరు పెట్టి ఎలాగో - నీలిమందు తయారు చేసేవారట!

ఆ రోజుల్లో - అంటే - ఈ శతాబ్దపు తొలి - మలి దశాబ్దాలు - క్రిందటి శతాబ్దపు - చివరి దశాబ్దం సంగతి చెబుతున్నాను -

నీలిమందుకు - విదేశాలకు ఎగుమతి చేసేటంత గిరాకి వుండేదట!



మా తండ్రి గారు యింకా యిద్దరు ముగ్గురు సాయంతో బండి మీద వేసుకుని - మదరాసు వెళ్లి - అమ్మివచ్చే వారట! మదరాసు నుంచి నీలిమందు - విదేశాలకు ఎగుమతి అయ్యేదట!

మదరాసులో నీలిమందు - అమ్మి - వెండి రూపాయలు - గోగునారతో అల్లిన - సంచులలో - పోసుకుని బళ్లమీద తీసుకువచ్చేవారట! అప్పుడు కరెన్సీ నోట్లు లేవనుకుంటా!

దోవలో దొంగల భయం గనక పగలు మాత్రమే ప్రయాణం చేసి - రాత్రిపూట - ఏదో ఒక వూళ్లో మకాం చేసేవారట!

అయినా - తుపాకులు వెంట తీసుకుపోయేవారట!

మా తండ్రులు పోయిన తరువాత గూడ మా యింట్లో - తుపాకులు వుండేవి. మా పెదతండ్రి గారి పెద్దకుమారుడు గురవరాజుగారు వాటిని వుపయోగిస్తుండేవాడు.

మదరాసు నుంచి - గోనె సంచుల్లో పోసి వెండి రూపాయలు తెచ్చేవారని చెప్పానుగదా!

ఆ సంచులు - దాదాపు - అడుగున్నర రెండడుగుల పొడవు వుండేవి. గోగునారతో పేని - ప్రత్యేకంగా - సంచులు - అల్లేవారు!

ఆ సంచులతో - రూపాయలు తెచ్చి యింట్లో పెడితే-

రాత్రి పూట మాత్రమే - ఆ సంచులు తెరచి - రూపాయలు - పరచిన దుప్పట్ల మీదపోసి లెక్కబెట్టి - యినప్పెట్టెల్లో - పెట్టేవారట!

ఆ రోజుల్లో - యినప్పెట్టెలు - పెద్దపెద్ద మోతుబరి రైతులు - వ్యాపారుల వద్ద - మాత్రమే వుండేవి.

రూపాయిలు - సంచులలో నుంచి - కుమ్మరించి లెక్కబెడుతుంటే -

"యింట్లో - లక్ష్మీదేవి - తాండవించినట్లుండేదని" - మా తల్లి - పెత్తల్లి గార్లు - చెబుతుండే వారు.

మా తండ్రులిద్దరికీ - తెలుగు భాషా ప్రవేశం బాగా వుండేదట!

రామాయణ - భారతాలు - ఒకరు చదివితే - ఒకరు వ్యాఖ్యానం చెప్పేవారట!

నా చిన్నతనంలో మా యింట్లో భాస్కర రామాయణం - ఆధ్యాత్మిక రామాయణం గ్రంధాలుండేవి.

మేము - ముత్యాలంపాడుకు వచ్చిన తరువాత గూడ.

మా బంధువు ఒకాయన నరసరావుపేట తాలూకా - సంక్రాంతిపాడు నివాసి సామంతపూడి పెదరామభద్రరాజుగారు- ముత్యాలంపాడు వస్తుండేవారు.

(ఆయన అక్కగారిని - ముత్యాలంపాడులో - పెనుమెత్స శేషంరాజు గారి కిచ్చి వివాహం చేశారు!)

రామభద్రరాజు గారు ముత్యాలంపాడు వచ్చినప్పుడల్లా - మా యింటికి వచ్చేవారు. చాపవేసి - కూర్చోబెట్టి- భాస్కరరామాయణం తెచ్చి ఆయన చేతుల్లో పెట్టి -

"రామభద్రం! చదివి అర్థం చెప్పరా" అనేది మాఅమ్మ. ఆయన బహుశ్రావ్యంగా చదివేవాడు. వ్యాఖ్యానం గూడ - చాలా వివరంగా వుండేది! ఆయనది మంచి కంఠం!



మరో విశేషం ! ఆయన - ఆయన తమ్ముడు చినరామభద్రరాజుగారు - యిద్దరూ - విలు విద్యాకోవిదులు. నరసరావుపేటకు చెందిన 'కలియుగార్జున' బిరుదాంకితులు.

'అప్పారావు పంతులుగారి' వద్ద - విలువిద్య నేర్చుకున్నారు.

చినరామభద్రరాజుగారు - నాలుగైదేళ్ల క్రితం వరకు బ్రతికివున్నారు.

ఆర్థికంగా చితికిపోయి - విజయవాడలో - ఒక కాలేజిలో - కాపలాదారుగా - జీవితం గడిపి - అతి దీనావస్థలో- తుది శ్వాస విడిచారు!

80 ఏళ్లు దాటిన వయసులో గూడ ఆయన 'కనుచూపు' బాగుండేది!

విలువిద్యా ప్రదర్శనలు యిచ్చేవాడు.

వాళ్ల స్వగ్రామం - సంక్రాంతిపాడులో ప్రతి ఏటా - సంక్రాంతి పండుగకు - విలువిద్యా ప్రదర్శనలు సోదరులిద్దరూ - యిచ్చేవారు.

నా చిన్నతనంలో - రెండుసార్లు - మా 'తామ్మ' రుక్మిణమ్మగారు నన్ను - ఆ వూరు తీసుకు వెళ్లింది.

'వీరాభిమన్య' సినిమాలో - 'డ్యూప్'గా బాణాలు వేయడానికి - చినరామభద్రరాజుగారు 1962-63 ప్రాంతాలలో - మదరాసు వచ్చారుగూడ.

మా తండ్రి గారు పోయేటప్పటికి - నేను పసివాణ్ణి. రెండుమూడేళ్ల వయసుండేదేమో.

ఆయన ముఖం 'లీల'గా జ్ఞాపకం!

ప్రతిరోజూ - ఉదయం - భోజనం చేసే ముందు-

వంటింటి ఎదురుగా - వసారాలో - పీటమీద కూర్చుని - తిరుచూర్ణం బొట్టు పెట్టుకునే అలవాటు ఆయనకు!

నన్నుగూడ - ముందు కూర్చో బెట్టుకుని నాకూ బొట్టుపెట్టేవారు!

ఆ ఒక్క దృశ్యమే జ్ఞాపకం నాకు!

ఆయన బొట్టు పెట్టుకునే - వెండి బొట్టు పుల్ల పైన 'హంస' వుండేది. హంసముక్కుకి - వెండి 'ముత్యాలు'ండేవి.

ఆ బొట్టుపుల్ల - మేము ముత్యాలంపాడులో స్థిరపడి - నేను హైస్కూలులో చదివేటప్పుడు గూడ ఉండేది. దానితో - నేను గూడ బొట్టు పెట్టుకునేవాణ్ణి!

హైస్కూలులో - నాకంటె - ఒక ఏడాది - సీనియర్ తిరుమలరాజు సత్యం - అని ఒక స్నేహితుడుండేవాడు.

ఇద్దరం ముత్యాలంపాడు నుంచి - బెజవాడ కొత్తపేట - హిందూ హైస్కూలుకు - నడిచి వెళ్లేవాళ్లం.

ఒక చేత్తో - టిఫిన్ కారియర్ - చంకలో - పుస్తకాలసంచి!

అతను పంగ నామాలు పెట్టుకునేవాడు. అది చూచి కొన్నాళ్లు, నేను పంగనామాలు పెట్టుకునేవాణ్ణి!

మా మేనమామలు -"గంగిరెద్దు ఏదిరా" అని - ఎగతాళి చేసేవాళ్లు!

తాళ్లూరులో - మా ఇల్లు - పెద్ద - పెంకుటి మండువాలోగిలి!



ప్రక్కనే - పెద్ద దొడ్డి! చావిళ్లు! ఇంటి ముందు ఆవులదొడ్డి! ఇంటికి - ఆవుల దొడ్డికి మధ్య గోడ! దొడ్డికి - ఇంటికి మధ్యలో, మంచినీళ్ల బావి!

మా తండ్రుల హయాంలో తవ్వించిన బావి యిప్పటికి అలాగే వుంది! మంచి నీళ్లు! యిప్పటికీ మా పెత్తండ్రిగారి మనుమళ్లకు - ఆ బావినీళ్లే!

నేను మదరాసులో సినిమారంగంలో స్థిరపడిన తరువాత గూడ నేనెప్పుడు వెళ్లినా - ఆ బావి దగ్గరే - నీళ్లు తోడించి - స్నానం చేసేవాణ్ణి. యిప్పుడు - నీళ్లు - కాస్త ఉప్పగా వుంటున్నాయని - యీ మధ్య - మా అన్నగారి మనమడు చెప్పాడు.

ఆ రోజుల్లో - గ్రామాలలో సామాజిక వ్యవస్థ ఎలా వుండేదంటే - మా ఊళ్లోనే గాదు - చాలా ఊళ్లలో - డబ్బిచ్చి - పనులు చేయించుకునే ఆచారం వుండేదికాదు. ఒకరియింట్లో పెండ్లి జరగాలనుకోండి. ఆ సంవత్సరం - వర్షాభావం వల్ల పంటలు పండలేదనుకోండి. పెళ్లి - మరుసటి సంవత్సరానికి వాయిదా వేసేవాళ్లు. అంతేగాని - పొలాలు - నగలు తాకట్టు పెట్టి - పెళ్ళి చేసి తీరాలనే నిర్భంధం వుండేదికాదు.

పెళ్లిళ్లు గూడ - ఎలా జరిగేవంటే - ఒక రైతు యింట్లో పెళ్లి గనక అయితే - ఆ ముందు రాత్రి పూట వచ్చి గ్రామస్థులు పందిళ్లు వేసేవాళ్లు. ఆ పందిళ్లకు కావలసిన గుంజలు, తాటాకు గూడ - ఎవరో ఒక మోతుబరి రైతు- నిలవ చేసేవాడు. అవే - ఊళ్లో - ఎవరింట్లో పెండ్లయినా - యిచ్చేవాళ్లు. రాత్రికి రాత్రి - ఊళ్లో రైతులు వచ్చి - గుంజలు పాతి - తాటాకులతో పందిళ్లు వేసి - తెల్లారే లోపలో - అర్ధరాత్రి వేళకో - పని ముగించి వెళ్లిపోయేవాళ్లు. కూలి అనే మాటే వుండేది కాదు. సహకార పద్ధతి అన్నమాట! కూతురు పెళ్లిచేసే రైతుకి - ఖర్చు లేకుండా చేయడం కోసం గ్రామస్తుల సహకారం ఎలా వుండేదంటే - వూళ్లల్లో కుటుంబాల వాళ్లంతా - పెళ్ళిరోజు - పెళ్ళి యింట్లోనే భోజనాలు చేసేవాళ్లు గనక వాళ్ల వాళ్ల చేలలోనో - దొడ్లలోనో కాసే కాయగూరలన్నీ తీసుకొచ్చి. పెళ్ళి యింట్లో పడేసేవాళ్లు. అలాగే పాలు గూడ! ప్రతి యింట్లో వున్న గేదెల - ఆవులపాలు - అన్నీ పిండి తెచ్చి పెళ్లియింట్లో పోసేసేవాళ్లు! వూళ్లో వాళ్లందరికి ఆరోజు భోజనము పెళ్లింట్లోనే గదా! అందుకని!

అంటే పెళ్లికూతురు తండ్రికి - కాయగూరలు - పాలు - పెరుగు ఖర్చు ఏమీ వుండేది కాదన్నమాట! ధాన్యం యింట్లోనే వుండేది. వంటలు గూడ ఊళ్లో వాళ్లే వచ్చి చేసేవాళ్లు. ఆడవాళ్లు వంటలు చేస్తే - మగవాళ్లు పంక్తి భోజనాలలో వడ్డించేవాళ్లు.

మరో విశేషమేమిటంటే - ఊళ్లో రైతుకుటుంబాలు - సహకరించినా -

పెళ్ళికూతురికి - మంగళసూత్రంతోపాటు కనీసం ఒకటి రెండు బంగారు నగలన్నా పెట్టాలిగదా! అందుకు డబ్బు - రొఖ్ఖం కావాలిగదా! ఊళ్ళో బంధువులు - పెళ్లికి వచ్చిన యితర చుట్టాలు - రొఖ్ఖం చందాగానో, అప్పుగానో- విరాళంగానో యిస్తే - అవమానంగనక 'చదివింపులు' అనే ఆచారాన్ని ప్రవేశపెట్టారు. పెళ్ళిపీటలమీదనే బంధువులు- 'చదివింపుల' పేరుతో - అయిదు రూపాయలో, పదిరూపాయలో చదివించేవారు. అది చాలా గౌరవమైన పద్ధతి గదా!

బంధువుల వరసలు చెప్పి - పౌరోహితుడు - "మీ మేనమామగారు - మీ వివాహ సమయంలో ఆశీర్వదించి- చదివించిన -" అని చెప్పి - కానుకలు సమర్పించేవారు.



చందాలు యిచ్చే - అప్పులిచ్చే కాకుండా - చాలా గౌరవంగా పెళ్లి కూతురు తండ్రికి - బంధువులు ఆర్థికంగా సహకరించే యీ పద్ధతి ఎంత మంచి ఆచారం!

పెళ్లిళ్లలో - యింకో తమాషా జరిగేది! పెళ్లికి తెచ్చిన కాయగూరలన్నీ అయిపోయినయ్యనుకోండి. కొంత మంది బంధువులు - పెళ్ళి అయిన మరునాడే వెళ్లేవాళ్లు గాదు. కొన్నాళ్ళు ఉండేవారు.

ఎందుకంటే - ఆ రోజుల్లో - ఒక ఊరి నుంచి ఒక ఊరికి ప్రయాణ సౌకర్యాలు ఉండేవిగాదు. రెండెడ్ల బళ్ల మీద ప్రయాణాలు చేయాలి! వర్షాకాలం - బురద! ప్రయాణాలు సాగవు! ప్రయాణాల అసౌకర్యమే గాక మిగతా సీజన్లలో - రైతులకు పొలం పనులుంటాయ్! ఒక్క వేసవికాలంలోనే - బంధువులు - పెళ్ళిళ్లకు రావడానికి వీలుంటుంది! అందుకే పెళ్ళి ముహూర్తాలు గూడ వేసవి కాలం - మంచి - ఎండలో - రోహిణీ కార్తెలో పెట్టేవాళ్లు.

అంటే - అన్నప్పుడల్లా - తరచుగా - బంధువుల వూళ్లకు వెళ్లడం పడదు గనక - యిటు వాన - పెళ్ళిళ్ల తరుణంలోనే - బంధువుల యిళ్లకు వెళ్లడం సాధ్యపడుతుంది గనక -

పెళ్లికి వచ్చిన చుట్టాలు కొందరు - పెళ్లి అయినాక గూడ - కదిలేవాళ్లు కాదు!

తెచ్చిన కాయగూరలు - మిగతా వుప్పులు - పప్పులు యితర సామాగ్రి - అయిపోయినయ్యనుకోండి!

ఆ సంగతి - వచ్చిన బంధువులకి తెలియజెప్పడానికి చింతకాయి వేసిన పప్పు - వడియాలు - చింతపండు చారు లాంటివి మాత్రమే వడ్డించేవారు. అంటే - "అయ్యా! తమరు ఇక దయచేయండి" అని పరోక్షంగా చుట్టాలకు తెలియజెప్పడమన్నమాట!

ఇప్పుడు నేను చెప్పినవి - గుంటూరు జిల్లా - మెట్టతాలూకాలలోని - గ్రామాల సంగతి!

గోదావరి జిల్లాల్లోని మాగాణి గ్రామాల పరిస్థితి మరోరకంగా వుండేది!

పశ్చిమ గోదావరి జిల్లాలో - మాకు బంధుత్వాలుండేవి! ఆ జిల్లాలోని గ్రామాలలో - పది ఎకరాల మాగాణి వున్న రైతువున్నాడనుకోండి చాల పెద్ద భూస్వామి అన్నమాట. వాళ్లకి కిరసనాయలు - ఉప్పు తప్ప మిగతావి ఏవీ కొనవలసిన అవసరం లేకుండా - గ్రామాలు స్వయంసమృద్ధిగా వుండేవి. నా చిన్నతనంలో - ఆ ఊళ్లకు వెళ్లేవాణ్ణి!

రైతుకి - మాగాణి చేలో - మధ్యన ఒక దిబ్బ వుండేది. ఆ దిబ్బమీద, చుట్టూ - కొబ్బరిచెట్లు వేసేవాళ్లు. ఆవులు, గేదెలు అన్నీ ఆ దిబ్బమీద పాకవేసి కట్టేసేవాళ్లు, ఒక పక్క కాయగూరలు వేసేవాళ్లు. ఇంటి పెరట్లో అరటిచెట్లు వేసేవాళ్లు. కొంత భూమిలో నువ్వులు పండించేవాళ్లు. ఆ నువ్వులతో కుటుంబానికి సరిపడ నువ్వుల నూనె గానుగకు పంపించి ఆడించి తెచ్చేవాళ్లు. యింటికి ఏ వేళప్పుడు చుట్టం వచ్చినా పెరట్లో ఉన్న అరటికాయలు కోసుకొచ్చి కూర వండడం, ఆవకాయ, పెరుగు, పప్పుచారు ఉండనేవుంటాయ్! కొబ్బరిచెట్లనుంచి ఎండుకొబ్బరి, కొబ్బరినూనె తలకురాసుకోవడానికి!-

కొందరు రైతులు, చెరకు వేసి, బెల్లం తయారుచేసుకునేవారు!

అంటే నేను చెప్పదలుచుకున్న దేమిటంటే - ఒక్క కిరసనాయిలు, ఉప్పు తప్ప - మిగతా విషయాలలో గ్రామాలు స్వయం సమృద్ధిగా వుండేవని! యిది 60-70 ఏళ్లనాటి పరిస్థితి;

గోదావరి జిల్లాల్లో - మా యింటిపేరిట వాళ్లు - అంటే 'దాట్ల' వారి కుటుంబాలు - గుంటూరు జిల్లానుంచి-



వలస వెళ్లినవాళ్లట; తూర్పుగోదావరి జిల్లాలో దాట్ల వారి కుటుంబీకుడొకాయన రిసెర్చి చేయించాడు. గోదావరి జిల్లాలకు వచ్చినవాళ్లు - మా ప్రాంతాల నుంచి - అంటే గుంటూరు జిల్లాల నుంచి వచ్చిన వాళ్లేనట.

కృష్ణా - గోదావరి డెల్టాలు ఎప్పుడైతే వచ్చినయ్యో, గుంటూరు జిల్లా మెట్టతాలుకా నుంచి - గోదావరి జిల్లాకు వలస వెళ్ళారన్నమాట!

ఎక్కడ జీవనోపాధి దొరుకుతుందంటే - అక్కడికి వలసలు పోవడం - మానవ సహజం గదా!

అందాక ఎందుకు - గుంటూరు జిల్లా - బాపట్ల తాలుకాలో - మా రాజుల గ్రామాలు వున్నాయ్ - మంతెనవారి పాలెం, ఖాజీపాలెం - బుద్దాం - వగైరా గ్రామాలు! వాళ్లంతా - గోదావరి జిల్లాల నుంచి - వలస వచ్చినవాళ్లు. బుద్దాం దగ్గర 'నాగరాజు కాలవ' అని వుంది. ఆ నాగరాజుగారు - గోదావరి జిల్లా నుంచి వచ్చి త్రవ్వించినారన్నమాట! ఆ ఊళ్లన్నీ యిప్పటికి చాలా సమృద్ధి గల గ్రామాలు !

మా 'దాట్ల' వారి కుటుంబాలలోనే - కొన్ని మాత్రమే 'దాయాదుల' కుటుంబాలు.

ఉదాహరణకి - ముత్యాలంపాడులో - (బెజవాడ దగ్గర) దాట్ల వారి కుటుంబాలున్నాయ్! మా అమ్మమ్మ దాట్ల వారి ఆడపడుచు! మా అత్తగారు (నరసన్నపాలెం) దాట్ల వారి ఆడపడుచు!

ముత్యాలంపాడులో - యింకా - రెండు మూడు దాట్ల వారి కుటుంబాలున్నాయ్! కాని - ఆ కుటుంబాలకు- మా కుటుంబానికి - దాయాద సంబంధాలు లేవు! అంటే - ఒక కుటుంబంలో ఎవరైనా చనిపోతే - 'మైల' 'సూతకం' అని పదకొండు రోజులు పాటిస్తారు! ముత్యాలంపాడులో మిగతా దాట్ల వారి కుటుంబాలకు మాకు అలాంటి - 'సూతకం' పట్టే ఆచారం లేదు.

గుంటూరు జిల్లా - మా ప్రాంతాలనుంచి - వలస వచ్చిన దాట్ల వారి కుటుంబం ఒకటి ముత్యాలంపాడులో వుండేది! ఆయన్ని - 'చిలకరామరాజు' అనేవారు. ఆయన - దగ్గరలోనున్న - అంబాపురంలో గూడ ఆస్తులు సంపాదించారు. ఆ కుటుంబంతో మాకు 'దాయాద' సంబంధాలు వుండేవి.

ఆ చిలకరామరాజుగారి కుమార్తె ఒకామెను మంతెనవారిపాలెం - కాంగ్రెసు నాయకుడు - మంతెన వెంకట్రాజుగారి తమ్ముడు కోటంరాజుగారి కిచ్చి పెళ్ళి చేశారు. భర్తతో పాటు ఆమె జైలుకు గూడ వెళ్లింది - సత్యాగ్రహం రోజుల్లో.

ముత్యాలంపాడుకి - మా ఊరు తాళ్లూరుకి - ఇచ్చిపుచ్చుకునే సంబంధాలు - మా 'తామ్మ' పెళ్ళితోనే గాదు - మా తాత (అంటే మాతామహుడు) గారి చెల్లెల్ని మా పితామహుడు - సుబ్బరాజు గారి కిచ్చిచేశారు! ఆ సుబ్బరాజుగారి కూతురే - రాజమ్మగారు. మా రెండో మేనమామ ఆదిరాజుగారు చేసుకున్నారు. అంటే - మేనరికన్నమాట!

ఆ రోజుల్లో - రవాణా సౌకర్యాలు గూడ చాలా తక్కువగా ఉండేవి. మా ఊరు - సత్తెనపల్లి - అచ్చెంపేట రోడ్డులో - పీసపాడు దగ్గర నుంచి ఆరోజుల్లో మా ఊరికి 'డొంక' వుండేది. చాలాకాలానికి - మట్టిరోడ్డు వేశారు.

మా ఊరు నుంచి - రోడ్డుకి రావాలంటే - వర్షాకాలం బురద. అప్పుడు సత్తెనపల్లికి బస్సులుండేవి కాదు. పీసపాడు - క్రోసూరు నుంచి - జట్కాల్లో సత్తెనపల్లికి వెళ్లాలి! జట్కాలంటే - గుర్రాలు వుండేవి? బక్కగా - చావుకు



సిద్ధంగా ఉండేవి! పట్టాల బళ్లు! టైరుబళ్లు కావు. కంకరరోడ్లు! ఎప్పుడో - పదేళ్ల కోసారి గూడ - కంకర వేసేవాళ్లు గాదు. జట్కా బళ్లకి - గుడిసెలుండేవి గదా! ఎండా - వాన - అన్నీ గుడిసెల లోపలే గాని - బయటికి పోయేవి గాదు!

మా ఊరి నుంచి - రోడ్డుకి - పీసపాడు రావాలి! పీసపాడు పక్కనే - వాగు ఒకటి వుండేది - యిప్పటికీ వుంది! దాన్ని 'ఎద్దువాగు' అంటారు! వాగుకి - అప్పటికీ - యిప్పటికీ - వంతెన లేదు! కాజ్‌వే! సిమెంటుతో రోడ్డన్నమాట!

ఎగువన వర్షం బాగా పడితే - వాగు వరదలాగ వచ్చేది. వాగులో మోకాళ్లలోతు నీళ్లే గదా అని - జట్కా దాటడానికి ప్రయత్నిస్తే జట్కా సగానికి వెళ్లేసరికే - వాగు ఉప్పెనలాగ వచ్చి - జట్కాలు వాగులో కొట్టుకుపోయిన సందర్భాలు గూడ వున్నాయ్!

ఆ రోజుల్లో రోడ్డు సౌకర్యం ఉన్నచోట్ల జట్కా బళ్లు వుండేవి. రోడ్డు సౌకర్యంలేని ఊళ్ల మధ్య - డొంకలు వుండేవి. ఆ డొంకలు దారుల్లో గుర్రాలు బళ్లు లాగలేవు. అందువల్ల రైతు లందరికీ ఎడ్ల బళ్లు వుండేవి గనక - ఒక ఊరి నుంచి ఒక ఊరు వెళ్లాలంటే ఎడ్ల బళ్ల మీద వెళ్లేవాళ్లు.

సత్తెనపల్లి, నరసరావుపేట, పల్నాడు, వినుకొండ తాలూకాల గ్రామాల నుంచి - ఎడ్లబళ్లు - 'ప్రభలు' కట్టుకుని రైతులు - కోటప్పకొండ తిరణాలకి వెళ్లేవాళ్లు. కోటప్పకొండ శివక్షేత్రం. బళ్లమీద ప్రభలు - పోటీలుపడి - అలంకరించి కట్టుకు వెళ్లేవాళ్లు.

రైతుకి ఎద్దులంటే - ఎంత ప్రాణమంటే తిరణాలకి - పెళ్ళిళ్లకు బళ్లు కట్టుకుని పోయేటప్పుడు ఎద్దుల్ని గంటల పట్టెడలతోనూ - ముఖాలకి - వెంట్రుకల తాళ్లతోనూ - అద్దాలతోనూ చేసిన - వాటిని ఏదో అనేవారు నేనిప్పుడు మరచిపోయాను - ఎంతో అందంగా - గర్వంగా అలకరించేవాళ్లు! గంటల పట్టీళ్లు - బొనుగులని ఒక రకం గంటలుండేవి - అవీ - వెంట్రుకల తాళ్లతో చేసిన అలంకారాలు అన్నీ కోటప్పకొండలో - తిరణాళ్లనాడు అమ్మేవాళ్లు.

తాళ్లూరులో - మా యింట్లో - నా చిన్నతనంలో ఎద్దుల గంటలు పట్టీళ్లు ఎన్నో యింట్లోనే - వేలాడ గట్టీ వుండేవి.

అప్పట్లో - రైతుకి భూమి ఎంత విలువైనదో ఎద్దులు - ఆవులు - గేదెలు - గూడ అంత విలువైనవి అంటే పశువులు గూడ - ఒక విధమైన ఆస్తి - భూమిలాగానే.

ఆ రోజుల్లో - రైతులు - ఎడ్లు దుక్కి దున్నే ఎద్దుల్ని ఎంతో అవసరమైతే తప్ప - కొనేవాళ్లు గాదు. ప్రతి రైతు-అతని తాహతును బట్టి - ఆవుల మందల్ని పెంచేవాళ్లు. ఆవులు యీని దూడల్నిపెడితే - గిత్తదూడలు రైతుకి పెద్ద ఆస్తిగదా! ఎంతో ఆప్యాయంగా - గిత్తల్ని రకరకాల దాణాలు - ముఖ్యంగా తవుడు, ఉలవగుగ్గిళ్లు పెట్టి సొంత బిడ్డల్ని పెంచుకున్నట్టు పెంచేవాళ్లు.

పశువులు కేవలం ఆస్తి మాత్రమే గాదు - పశువుల పేడ - అవి తినగా మిగిలిన గడ్డి - వగైరాలు - ఏ రోజుకారోజు - ఎత్తుకెళ్లి - 'నయ్' దిబ్బలని ఉండేవి అందులోవేసేవాళ్లు. పేడ - గడ్డి వేసిన నయ్‌దిబ్బలు యిళ్లపక్కనే వుండేవి! యిప్పుడు - దోమలు గీమలు అని చెత్త చెదారం దూరంగా పారేస్తారు గాని - అప్పుడు - దోమలు వున్నా-



పట్టించుకునేవాళ్లు కాదు. వేసవికాలం వస్తే నయ్ దిబ్బల్లోని ఎరువులు - బళ్లమీద వేసుకొని - పొలంలో వేసి వెళ్లేవారు. అదే యిప్పుడు 'సేంద్రియ' ఎరువులంటారు. ఇప్పటిలాగ - అప్పుడు - కృత్రిమ ఎరువులు - పురుగు మందులు వుండేవి గాదు!

నాకు మూడు నాలుగేళ్ల వయసు వచ్చిందాకా - తాళ్లూరులోనే ఎక్కువగా ఉండేవాణ్ణి! ముత్యాలంపాడు - ఎప్పుడు ఎందుకు వచ్చామో తరువాత చెబుతాను.

తాళ్లూరులో - నా చిన్నతనంలో - మాకు ఒక ముసలి ఎద్దు వుండేది. ఎద్దులు, ఆవులు అంటే రైతుకి కుటుంబ సభ్యులకిందే లెక్క. ఆ ముసలి ఎద్దుని - అరకగట్టడం - మానేశారు. దానికి పాపం నోట్లో వ్రణం లేచింది. మేత మేయిడానికి గూడ వీలుండేది గాదు. నోటివెంట చొంగ కారుతుండేది. దాన్ని దొడ్లో కట్టేసేవాళ్లు గాదు, వదిలేసేవాళ్లు! అది వచ్చి మా యింటి ముందు - సింహద్వారానికి ఎదురుగా - పడుకునేది - ప్రొద్దున్నే - వాకిలి వూడ్చి - కళాపి చల్లి - ముగ్గులు వేయడానికి - మనిషి రాగేనే - ఎవరూ చెప్పకుండానే - వెళ్లి అవతల పండుకునేది. కళాపి చల్లి - ముగ్గు వేసిన తరువాత మళ్లీ వచ్చి - యింటి ముందు పడుకునేది. గొడ్లకు జబ్బులు వస్తే - ఊళ్లోనే - పశువైద్యులు - నాటు వైద్యం చేసేవాళ్లు. అలా - నాటు వైద్యాలు ఎన్ని చేసినా - మనుషుల్లాగానే (మనుషులగ్గూడ బాగా వయసు దాటిన తరువాత మందులు పనిచేయవు గదా) అలాగే - ఆ ఎద్దుకి ఎన్ని వైద్యాలు చేసినా పనిచెయ్యక - క్రమంగా నీరసించి చనిపోయింది.

అది చనిపోయినరోజున - నాకు బాగా జ్ఞాపకం యింట్లో ఒక మనిషి పోయినంత విషాదం!

మావాళ్లు - ఆ ఎద్దుని పసుపు కుంకుమతో అలంకరించి బండి మీద వేసి ఊళ్లో వీధుల్లో ఊరేగించి ఊరి పక్కనే వున్న మా పొలంలో గొయ్యి తీసి ఉప్పుపాతర వేశారు. ఎద్దులు - ఆవులు అంటే రైతుకి అంత గౌరవం! యిప్పటిలాగ - గొడ్లు చస్తే - మాదిగలు చర్మాలు తీయడం - అప్పుడు అంతగా వుండేవికాదు - దీన్ని ఆధారం చేసుకుని - నేను ఒక కథ రాశాను. 1947-48 ప్రాంతంలో - విజయవాడు నుంచి ఆచార్య రంగాగారి ఆధ్వర్యంలో 'వాహిని' అని ఒక వారపత్రికో - మాసపత్రికో వస్తుండేది. దానికి ఎడిటరుగా - చిత్తూరుకు చెందిన ప్రముఖ రచయిత కె. సభా పని చేస్తుండేవాడు. ఆ పత్రికకి అప్పుడప్పుడు నేను వ్యాసాలు - కథలు రాస్తుండేవాణ్ణి!

యిప్పుడు నేను చెప్పిన - నా చిన్ననాటి మా ఎద్దుని దృష్టిలో వుంచికుని - 'ప్రతిబింబాలు' అని ఒక కథ రాశాను.

అప్పటివాళ్లకి - యిప్పటివాళ్లకి - తరాలు మారేటప్పటికి - సెంటిమెంట్స్ ఎలా మారుతాయని చెప్పడానికి ఆ కథ రాశాను.

ఇటువంటి - ముసలిఎద్దే ఒకటివుండేది - ఒక రైతు దగ్గర, తండ్రి హయాంలో వాళ్ల ఆవులదొడ్లోనే పుట్టినటువంటి ఎద్దు అది. యిప్పుడు తండ్రి పోయాడు. కొడుకు హయాం వచ్చింది. యింట్లో పెద్ద పాలేరు మాత్రం - తండ్రి కాలం నాటి వాడే - యింకా యిప్పటికీ పాలేరుగానే ఉన్నాడు. అతనికీ యీ ముసలి ఎద్దుకీ అనుబంధం! సెంటిమెంటు!

ఇప్పుడు వచ్చిన రైతు కొడుకు - ఆధునికుడన్న మాట! ఇస్త్రీ బట్టలు నలగకుండా - ఫ్లాస్కులో కాఫీ పోసుకుని పొలం వెళ్లి - గట్టుమీద - కుర్చీ వేసుకుని - నాట్లు, కోతలు వగైరా పనులు చేయించే రకమన్నమాట!



ఎద్దుకి జబ్బు చేస్తే - ఆ పెద్ద పాలేరు - రైతు కొడుకుతో అన్నాడు - "బాబూ! ఎద్దుకి జబ్బు చేసింది. పట్నానికీ, తీసుకెళ్లో లేకపోతే - పశువుల డాక్టర్ని యిక్కడికి పిలిపించో - వైద్యం చేయించండి" అన్నాడు.

యిటువంటి సెంటిమెంట్లు ఏమీలేని - యువరైతు అన్నాడు -"ఎందుకురా దండగ! ముసలిదైపోయింది! యిది దున్నడానికి పనికిరాదు! బండి లాగలేదు! దానికింకా వైద్యం గూడ ఎందుకు - దండగ! కబేళానికి తోసెయ్!" అన్నాడు.

ఆ మాట - ఆ ముసలి పాలేరుకి శూలం లాగ గుచ్చుకుంది. " నేను గూడ ముసలి వాణ్ణే గదా! రేపు నేను గూడ - ఎద్దులాగే - మూల బడితే నా గతి యింతేగదా! యిలాగే - ముసలోడు ఎందుకు పనికిరాడు గదా! వైద్యం గూడ ఎందుకు! దండగ! లాగి - అవతల పారేసి, తగలెయ్యండి అంటారు గదా!" అని ఆ రాత్రంతా మధన పడ్డాడు.

మరునాడు ఉదయం - యజమాని - రమ్మని కబురు చేస్తే - ఆ ముసలి పాలేరు - "రానని చెప్పు" అన్నాడు.

అంటే - అప్పటి రైతులకీ - వాళ్ల దగ్గర పనిచేసే పాలేర్లకీ భూమి - పశువులు - అంటే ఎటువంటి అనుబంధాలు వుండేవో చెప్పడానికీ కథ రాశాను. ఆ రోజుల్లో అది ఆర్థిక న్యాయమని చెప్పనుగాని సాంఘిక వ్యవస్థ ఎలా ఉండేదంటే - ఒక్కొక్క రైతు వద్ద - ఒక్కొక్క పాలేరు - పెద్ద పాలేరు అనేవాళ్లు. జీవితాంతం పాలేరు పనే చేసేవాడు. ఆ రోజుల్లో - యిప్పటిలాగ - పేదలు - హక్కులు అనే స్పృహ వుండేది గాదు. యజమానికి భూమి వున్నది - పాలేరుకు భూమి లేదు అనే తేడా తప్ప - మిగతా నిత్యజీవితంలో - ఇద్దరికీ భేదం వుండేది కాదు! ఆయన కట్టుకునే నీరుకావి పంచలే - పాలేరు కట్టుకుంటాడు! ఆయన ఏం తింటాడో ఆ ధాన్యమే పాలేరుకీ కొలుస్తాడు! జీతం డబ్బురూపంలో యివ్వడం లేదు గదా! ధాన్యం కొలవడమే గదా!

పొగాకు కూడా అంతే! మా తాతయ్య (ముత్యాలంపాడులో) చుట్ట కాల్చేవాడు. సాయంత్రం పాలేరు వచ్చేవాడు. మరునాడు చేయవలసిన పొలం పనులు గురించి మాట్లాడుకునేవారు.

పొగాకు పట్టాతీసి - నాలుగు కాడలు పొగాకు పాలేరుకు యిచ్చేవాడు. యింటి వెనక సందులోకి రమ్మని మా అమ్మమ్మ పాలేరుకి కూరా - నారా - ఇచ్చేది!

అలాగ - నిత్యజీవిత సరళిలో - పాలేరుకి, రైతుకి ఆట్టే తేడాలు ఉండేవి కాదు!

మరో విషయం ఏమిటంటే - పాలేరుకి జీవితంలో సెక్యూరిటీ - అంటే - రేపు ఎలా జరుగుతుంది - అనే సమస్య ఉంది గదా! ఆ దిగులు ఆ రోజుల్లో పాలేరుకు ఉండేది గాదు!

గాంధి గారు చెప్పారు గదా! "భూస్వాములు - మీరు ధర్మకర్తలు! ట్రస్టీలు మాత్రమే! మీ దగ్గర పనిచేసే వాళ్లకు ఏలోటు రాకుండా కనిపెట్టి వుండవలసిన పవిత్రబాధ్యత మీది!-"

రేపు ఎలా జరుగుతుంది అనే దిగులు పనివాడికి లేదు! ఇంట్లో ఏ ఇబ్బంది వచ్చినా - పెళ్లి - పండగలు వచ్చినా యజమాని ఉన్నాడులే అనే ధైర్యం!-

ముత్యాలంపాడులో - మా తాతయ్య గారి కమతంలో ఆరె కోటాయ అని పెద్దపాలేరు వుండేవాడు. మా తాతయ్య అతనికి - మాలపల్లిలో - రాతితో గోడలు కట్టి - పెంకుటిల్లు కట్టించి పెట్టాడు. మాలపల్లిలో పెంకుటిల్లు



కట్టిన మొట్టమొదటివాడు - ఆరె కోటాయ! గృహ ప్రవేశానికి - మేమంతా వెళ్లాం! అది అతనికి సాటివాళ్లలో - ఎంతో గౌరవం! గర్వం గూడ!-

ఒక చిన్న సంఘటన గురించి చెబుతాను! ముత్యాలంపాడులో - మాకు అంటే మా కుటుంబానికి (మా అమ్మ - అక్క - నేను) మా తాత గారి స్థలంలో ప్రత్యేకంగా ఒక ఇల్లు కట్టించారు. ఆ ఇంటి పక్కనే మా తాతగారి ఎడ్లచావిడి ఆవుల చావిడి ఉండేవి!

సాయంత్రం అయ్యేసరికి - మా తాతగారి ఇంటి నుంచి ఎద్దులకోసం ఉలవగుగ్గిళ్లు తెచ్చి పెట్టేవాళ్లు! ఎప్పుడో గాని వులవచారు కాసుకునే వాళ్లుగాదు!

అసలు చెప్పవచ్చిన విషయం ఏమిటంటే ఎద్దులు వులవ గుగ్గిళ్లు తింటుంటే సరదాగా చూడ్డానికి - నేను వెళ్లేవాణ్ణి! అప్పుడు నాకు నాలుగయిదేళ్లుంటాయ్! ఒకరోజు పెద్దపాలేరు ఆరె కోటాయ నన్ను ఎత్తుకుని ముద్దుపెట్టుకున్నాడు! వెంటనే - మా అమ్మ దగ్గరికి వెళ్లి "దొరసాని గారూ! బుల్లిదొరగారికి - బట్టలు మార్చి నీళ్ల పోయండి" అన్నాడు.

వ్యవస్థేమో - చాలా అనాగరికమైన వ్యవస్థ! హిందూ సమాజంలో - మాలమాదిగలను చూచినంత హీనంగా-ప్రపంచంలో మరెక్కడా చూడలేదేమో! అమెరికాలో నీగ్రోలని పశువులకంటె హీనంగా చూశారని చెబుతారే - అంతకంటే-ఘోరం హిందూసమాజంలో మాలమాదిగల పరిస్థితి. అందులో అనుమానం ఏ మాత్రం లేదు. అస్పృశ్యత! అంటరానితనం! ఎంత నీచం! ఎంత ఘోరం! ఎంత అమానుషం!

ఆ రోజుల్లో మాలమాదిగల్లో - ఆ స్పృహలేదు గాని - అంతమాత్రాన - ఆ దురాచారాన్ని ఎవరైనా ఎలా సమర్థించగలరు? అప్పట్లో వాళ్లకా స్పృహ లేదు గాని తరువాత తరువాత - వాళ్లలో గూడ చదువుకున్న వాళ్లు రావడం తమకు జరిగిన అన్యాయానికి ఎదురు తిరగడం ఉద్యమాలు నడపడం అంతా సహజమూ - న్యాయమే! అందులో అణుమాత్రం గూడ అనుమానం లేదు. అస్పృశ్యత హిందూసమాజానికి మాయని మచ్చ!

ముత్యాలంపాడులో - పాటిమీద - ఒక రావి చెట్టు, వేపచెట్టు చుట్టూ అరుగు వుండేది! దానికి పూజలు చేసేవాళ్లు! దాని పక్కనే ఒక ధ్వజస్థంభం ఉండేది! ఆ చెట్టుకీ - ధ్వజస్థంభానికి మధ్య దారివుండేది. ఆదారి గుండా మాలమాదిగల్ని నడవనిచ్చేవాళ్లు గాదు. దూరంగా - తిరిగి పోవలసిందే.

మా తాతగారికి - పెద్దపాలేరు మీద ఎంతో నమ్మకం!

వయసు పైబడి - మా తాతగారికి - ఉబ్బసం రావడం వల్ల పొలం పోవడం మానేశాడు. ఆయన చిన్నకొడుకు అంటే మా చిన్నమామయ్య వ్యవసాయం చేస్తుండేవాడు. అయినప్పటికీ సాయంత్రం చీకటి పడిన తరువాత పెద్దపాలేరు - కోటాయ యింటికి రావాలి! ఆ రోజు జరిగిన వ్యవసాయ పనులు - రేపు జరగవలసిన పనులూ మా తాతయ్యతో సంప్రదించాలి. అంతేగాని - మా తాతయ్య తన చిన్నకొడుకుని అడిగే వాడుకాదు! ఆయన చెప్పేవాడు కాదు.

ప్రఖ్యాత స్వాతంత్ర్య సమరయోధుడు - ఉన్నవ లక్ష్మీనారాయణ గారు - 'మాలపల్లి' అని గొప్ప నవల రాశాడు. 1920 - 30 మధ్యలో- దాన్ని అప్పటి బ్రిటీష్ ప్రభుత్వం నిషేధించింది! 1936-37లో కాంగ్రెసు గవర్నమెంటు-వచ్చినప్పుడు ఆ నిషేధం ఎత్తివేశారు!



'మాలపల్లి' నవల చదువుతుంటే-

ఆ కథ - సత్తెనపల్లి తాలుకా - మా తాళ్లూరులో జరిగినట్లే అనిపిస్తుంది. లక్ష్మీ నారాయణగారిది సత్తెనపల్లి తాలూకాయే! అది చాలా గొప్ప నవల!

ఉన్నవ లక్ష్మీనారాయణ గారు - బారిస్టరు, ఇంగ్లండులో చదివి వచ్చాడు. గాంధీగారి పిలుపుతో - కాంగ్రెసులో చేరి జైలుకు వెళ్లాడు. తరువాత - గుంటూరు - బ్రాడీపేటలో 'శారదానికేతనం' అని బాలికల పాఠశాల పెట్టాడు. ఆయన భార్య లక్ష్మీ బాయిమ్మగారు!

నేను గుంటూరులో - హిందూ కాలేజీలో యింటర్మీడియట్ చదివేటప్పుడు- శారదానికేతనం - ప్రక్కనే - వున్న బంగళాలో (చంద్రశేఖర విలాస్ ఆ ఇంటిపేరు) ఒక గదిలో ఉండేవాణ్ణి!

శారదానికేతనానికి చందాలు వసూలు చేయడంలో గూడ లక్ష్మీనారాయణగారి పద్ధతి విశిష్టమయినది!

పైర్లు ఇళ్లకు చేరిన తరువాత వేసవి కాలంలో ఆయన సత్తెనపల్లి, నరసరావుపేటల్లోని గ్రామాలకు వెళ్లేవాడు. డబ్బు అడిగేవాడుగాదు! శారదానికేతనానికి కావలసిన జొన్నలు, పెసలు, కందులు, చింతపండు, మిరపకాయలు వగైరాలు వసూలు చేసుకువచ్చేవాడు.

అప్పట్లో పల్లెలలోగాని - పట్టణాలలో గాని జనజీవితంలో - సెక్యూరిటీ వుండేది. ఆందోళన - అనిశ్చిత వుండేవికాదు యిప్పటి జీవితాలతో పోలిస్తే-

ఇప్పుడు ప్రతి విషయంలో అనిశ్చిత!

మూలకారణం - పేదరికం ఒక్కటేగాదు. మధ్యతరగతి వాళ్లకి గూడ - సెక్యూరిటీ లేదు! లక్షాధికారికి గూడ మనస్థిమితం లేదు! రేపు ఏమవుతుందో! యీ లక్షలు అయిపోతే? కోట్లు ఉన్నవాడికీ అంతే! అందుకే - కోట్లు వున్నా - యింకా సంపాయించాలనే తాపత్రయం! కారణం - యీ కోట్లు రేపు ఉంటయో లేదో!-

అప్పట్లో పరిస్థితులు యిలా వుండేవి గాదు. నాకు బాగా జ్ఞాపకం!- నా చిన్నతనంలో పల్లెటూళ్లలో రైతుల దైనందిక జీవితాలు - తాపీగా వుండేవి!-

యీ ఏడు వర్షాలు లేవు! పంటలు పండవు! అంతమాత్రాన రోజూ ఏడుస్తూ కూర్చునేవాళ్లు కాదు. యీ ఏడు పిల్ల పెళ్లి చేయాలనుకున్నాడు. పంటలు పండలేదు! వచ్చే సంవత్సరానికి వాయిదా వేసేవాడు!

తిండికి గింజలు లేకపోతే - వున్న రైతు దగ్గర బదులు తీసుకునేవాడు. పండినప్పుడు యిచ్చేవాడు.

సాయంత్రం అయ్యేటప్పటికి - తాపీగా చుట్ట కాల్చుకుంటూ - రచ్చబండ దగ్గర నలుగురితో కబుర్లు చెప్పుకుని పోయి గుర్రుపెట్టి నిద్రపోయేవాడు.

మెరకవూళ్లలో - అంటే - వర్షాధారపు భూములున్న ఊళ్లలో వేసవికాలం చేలకి ఎరువులు తోల్తారు. తొలకరి చినుకులు పడితే - దున్ని - గింజలు చల్లుతారు. వర్షాలు గనక పడకపోతే చల్లిన గింజలు గూడ దండగే! కాని - ఎరువు - వచ్చేఏటికి పనికి వస్తుంది.

ఒక విశేషమేమిటంటే - సక్రమంగా వర్షాలు కురిస్తే మెట్ట పైర్లలో వచ్చినంత ఆదాయం మాగాణిలో రాదు!



మాగాణి వల్ల లాభమేమిటంటే - సెక్యూరిటీ! చెరువుకిందనో - కాలువ కిందనో మాగాణి అయితే వరి గ్యారంటీగా పండుతుంది! అంతే!

మెరక తాలూకాలలో పండే కమర్షియల్ క్రాప్స్ పత్తి - పొగాకు - కంది - పెసర - మిరప వగైరాల వల్ల చాలా ఆదాయం వస్తుంది. అందుకే - మెరక పొలాల్లో సరైన వర్షాల వల్ల ఒక ఏడాది ఆదాయం వస్తే రెండు, మూడేళ్లు - వర్షాలు లేక ఆదాయం రాకపోయినా ఫరవా లేదు!

యిప్పుడు రొటేషన్ అఫ్ క్రాప్స్ అంటారే- పంటలు - మార్చి మార్చి వేయిడం అది అప్పుడూ ఉండేది. దానిని 'ఏవిలు' అనేవాళ్లు! ఉలవలు వేస్తే - భూమికి బలం! నీలి ఆకువేసి దున్నేస్తే - అది గొప్ప ఎరువు!

మెరక పంటల్లో ముఖ్యమైనది జొన్న పంట. లేత జొన్న కంకులు తెచ్చుకుని - కంకి చొక్కాలోపల పెట్టుకుని - ఒక చిన్నపుల్లతో జొన్నలు రాలగొట్టుకుని తినేవాళ్లం. తియ్యగావుండేవి. వాటిని ఊచ బియ్యం అనేవాళ్లం.

ఆ రోజుల్లో పల్లెటూళ్లలో - ఒకే కులం. రైతుల్లో ధనికులు, పేదలు ఉండేవాళ్లు. ఒక రైతుకి - 10 ఎకరాలు వుండవచ్చు! మరో రైతుకి వంద ఎకరాలుండవచ్చు. అయినా - పేదరైతుల్ని - ధనిక రైతులు సమాన గౌరవంతో చూచేవాళ్లు.

మా తాళ్లూరులోనే - రాజులకుటుంబాలు - అందరూ మోతుబరి రైతులు కారు. మా రెండుమూడు కుటుంబాలకే వందల ఎకరాల ఆస్తి వుండేది. మిగతా కుటుంబాలకి - పది - పాతిక - ముప్పయ్ ఎకరాల ఆస్తి వుండేది.

మా కుటుంబానికి దాదాపు 200 ఎకరాలు భూమి ఉండేది. మా పెదతండ్రి గారి వియ్యంకుడు - అంటే - మాపెదతండ్రిగారి చిన్నల్లుడు తండ్రిగారు - ఉప్పలపాటి రామకృష్ణంరాజుగారికి - మూడు వందల ఎకరాల ఆస్తి ఉండేది. అయినా పండగ వస్తే గాని, పెళ్లిభోజనాలకు గాని పంక్తి భోజనాలు పెడితే - అందరినీ సమానంగా గౌరవంగా చూసేవారు.

మా పెదతండ్రి గారి చిన్నఅల్లుడు పేరు - వెంకటప్పలరాజు గారు కవిత్వం రాసేవారు. ఆయన తండ్రికి ఆయన ఒక్కడే కొడుకు, యిద్దరు కూతుళ్లు. అందువల్ల ఆస్తి ఆయన ఒక్కడికే వచ్చింది. మా కుటుంబం విభాగాలయినందువల్ల నాకు సగభాగం, మా పెదతండ్రి గారి ముగ్గురు కొడుకులకి - సగభాగం!

మళ్లీ ఆ ముగ్గురు విభాగాలయితే - తలా 30 ఎకరాలు.

అలా - తరాలు మారే సరికి - వ్యక్తులకు ఆస్తులు తరిగిపోయేవి.

వెంకటప్పలరాజు బావగారి భార్య - అంటే మా చిన్నక్కయ్య పేరు వెంకాయమ్మగారు. చిన్నవెంకాయమ్మ అనేవారు. ఎందుకంటే - మా పెద్దన్నయ్య గురువరాజు గారి భార్య పేరు గూడ వెంకాయమ్మే! ఆమెను పెద్ద వెంకాయమ్మ అనేవారు. నా చదువు అయిపోయిన తరువాత - అంతవరకు నా ఆస్తివ్యవహారాలు - నా చదువు సంధ్యలు - చూస్తున్న మా నాలుగో మామయ్య - రామరాజుగారు - ఆయన్ని నేను 'రాంమామయ్య' అనేవాణ్ణి! ఆయన నన్ను మా ఊరు తీసుకెళ్లి - నా ఆస్తి అంతా నాకు అప్పజెప్పాడు. అంతవరకు - నాకు - ఏ చేను ఎక్కడుందో తెలియదు. మా అమ్మ మా వూళ్లోనే వుండేది.



నా భూమి దాదాపు వంద ఎకరాలు - మొత్తం ఒక కమ్మవారి కుటుంబం అజమాయిషీలో ఉండేది. రాయిపాటివారని ముగ్గురు అన్నదమ్ములు - రాయిపాటి పిచ్చయ్య, వెంకయ్య, గురవయ్య. మొదట్లో - అంటే 1928 ప్రాంతంలో - మా పెద్దమామయ్య - నా భూమి కౌలుకు ఇచ్చినప్పుడు - ఆ అన్నదమ్ములు ముగ్గురికి - పెద్దగా ఆస్తి వుండేదికాదు. సామాన్య రైతు కుటుంబం. సొంతంగా - దుక్కిదున్నే రైతులు గనక - కష్టపడి వ్యవసాయం చేసి - ఆ రాబడితో కౌలుకు పోగా - మిగిలిన సొమ్ముతో - ఆ ఊరిలోనే భూములు కొనుక్కుని రైతులయినారు. వాళ్ల సొంతభూములు - నా భూమి సాగుచేయడానికి భారమైనప్పుడు - వాళ్లే - నా భూమిలో కొంత భాగాన్ని మరి కొందరికి చిన్న రైతులకు - కౌలుకిచ్చేవాళ్లు. వాళ్ల దగ్గర నుంచి - కౌలు వసూలు చేసే బాధ్యత వాళ్లదే.

1942లో - నా హయాం ప్రారంభమైంది. నాలుగేళ్లకి అయిదేళ్లకి - కౌలుకివ్వాలి. మాగాణిలాగ ఏ ఏటి కాయేడు కౌలు కాదు. ఒక ఏడు వర్షాలు లేక - మెరక భూముల్లో పంటలు పండకపోతే ఆ ఏడు తోలిన ఎరువు రెండో ఏటికి పనికివస్తుంది. అందుకని - మెరక పొలాలు ఐదేళ్లకి ఒకేసారి కౌలుళ్లకిచ్చేవాళ్లు.

1945లో నేను మళ్లీ కౌలుకివ్వాలని మావూరు వెళ్లేసరికి అంతవరకు కౌలుకు చేస్తున్న రైతులందరూ కూడబలుక్కొని - వాళ్లలో వాళ్లే పంచుకుకి - యీ చేనుకి యింతకంటె ఎక్కువ కౌలు యివ్వగూడదు అని నిర్ణయించుకుని - కుమ్మక్కు అయినారు. నేను వచ్చి ఎలాగూ వ్యవసాయం చేయనని వాళ్లకి తెలుసు. అందుకని కౌలుకి వాళ్లు ఎంత చెబితే అంతకు యివ్వవలసిన పరిస్థితి వచ్చింది. నాకు విసుగు పుట్టి - 1945లో - దాదాపు 40 ఎకరాలు అమ్మేశా. దానిలో - ఊళ్లో ఉన్న డబ్బు అయిపోయింది. చిన్న ఊరు! రైతులు పెద్ద ధనవంతులేం కాదు. చివరికి - ఇద్దరు ముగ్గురు దగ్గర - కొంత రొఖ్ఖం తీసుకుని - మిగితా పైకానికి - నోట్లు రాయించుకోవలసి వచ్చింది.

ఆ తరువాత - నాగార్జునసాగర్ కాలువ వస్తుందన్న ఆశతో చాలా కాలం మళ్లీ భూములు అమ్మలేదు. కాని- దురదృష్టవశాత్తు కాలువ చివర అయింది మా ఊరు! నీరు మా ఊరి దాకా రాలేదు! కాబట్టి మా భూములు మాగాణి కాలేదు! మెట్ట భూములుగానే ఉండిపోయినై.

నేను 1951లో మదరాసు వెళ్లిన తరువాత - క్రమంగా మిగతా భూములు అమ్మడానికి - దాదాపు పాతిక సంవత్సరాలు పట్టింది. చిన్న ఊరు గనక - రైతు ఒత్తిడి ఉండేది కాదు. ధర బాగా పలికేది కాదు. అయినా - నేను ఎక్కడో ఉండి - మా ఊళ్లో భూములు ఉంచుకోవడం అంటే అన్యాయం గదా! అందువల్ల గూడ - త్వరగా భూములు అమ్మడం అవసరం అని భావించాను.

ఏమాటకామాటే నేను భూమి అమ్ముతుంటే అంతకు ముందు దశాబ్దాలుగా నా భూములు కౌలుకు చేస్తున్న రైతులు - ఏమి అభ్యంతరపెట్టలేదు!

అందుకు కారణం ఊళ్లో రైతులకు మా పెద్దలమీద మా కుటుంబం మీద చివరకు నామీద ఉన్న గౌరవభావమే!

మా అమ్మ 1968లో పోయింది. ఆ తరువాత 1974లో మా పెద్దన్నగారు గురవరాజుగారు పోయారు.

అప్పటికి - భూములు ఎక్కువ శాతం రాయిపాటి వారి ముగ్గురన్న దమ్ములలో చివరాయన - గురవయ్యగారి- ఏకైక కుమారుడు - చినకోటేశ్వరరావు! కౌలు వసూళ్లు చేసి నాకు పంపడంలోగాని - భూములకు సరైన ధర రాబట్టంలోగాని - అతని సహకారం చెప్పుకోదగినది.



ఆ తరువాత గత 15-20 ఏళ్లుగా వయసు పైబడడంతో ఆ ఊరు వెళ్లడం తగ్గించాను. నా భూములు కొన్న రైతులు - అప్పట్లో డబ్బు దండగ ఎందుకని నాచేత భూములు రిజిస్టర్లు చేయించుకోలేదు! స్టాంపులు ఖరీదు ఆదా చేసుకోవచ్చునని.

కాని - పది పదిహేనేళ్ల క్రితం - వాళ్లకి అవసరం వచ్చింది. భూమి తాకట్టు పెట్టి బ్యాంకుల్లో రుణాలు పొందాలంటే రిజిస్టరు చేసిన దస్తావేజులు కావలసివచ్చింది. అప్పుడు - వాళ్లు అడిగితే - పదేళ్ల క్రితం వెళ్లి - అందరికీ భూములు రిజిస్టరు చేసి వచ్చాను.

ఈ మధ్య - మా చిన్నక్కయ్య - చిన్నవెంకాయమ్మ గారి మనవడు - బలరామరాజు - తరచుగా నా దగ్గరకు వస్తూండేవాడు. అప్పటికి - మా పెదతండ్రిగారికి కుమారులు ముగ్గురు. చిన్న కూతురు - ఆమె భర్త వెంకటప్పలరాజుగారు కాలం చేశారు.

బలరాముణ్ణి అడిగాను - ఏమిటి అప్పటికీ యిప్పటికీ ఊళ్లో వచ్చిన మార్పులు అని.

"తాతయ్యా! ఇప్పుడు - ఊళ్లో రెండు సారా షాపులు, మూడు కాఫీ హోటళ్లు వెలిసినై. అదే - మార్పు! పురోగతి!" అన్నాడు నవ్వుతూ.

ఊళ్లో - ఇప్పుడు - వీధుల్లో - సిమెంటురోడ్లు వేసినట్టు - యీ మధ్య ఎవరో చెప్పారు.

కరెంటు దాదాపు 20 ఏళ్ల క్రితమే వచ్చింది. చాలా కాలంగా - మా ఊళ్లో - (తాళ్లూరు)లో కేవలం 4వ క్లాసు వరకు ఎలిమెంటరీ స్కూలు మాత్రమే వుండేది. పై చదువులు హైస్కూలు చదువుకు పోవాలంటే - దగ్గరలో ఉన్న క్రోసూరు పోవాలి.

మా పెదతండ్రిగారి - అల్లుడు మా బావగారు - వెంటప్పలరాజుగారు చనిపోయేముందు - వీలునామా రాస్తూ ఊళ్లో హైస్కూలుకు - కొంత భూమి రాసి యిచ్చాడు.

ఆయన మనమళ్లు - (ఆయనకు మగపిల్లలు లేరు, ముగ్గురూ ఆడపిల్లలే. రెండో అల్లుడి అక్క కొడుకుని దత్తత చేసుకున్నాడనుకోండి.) ఆయన రెండో కూతురు కొడుకు బలరామరాజు కాస్త రాజకీయ పరిజ్ఞానంకలవాడు. ఊళ్లో రైతుల దగ్గర చందాలు వసూలు చేసి, హైస్కూలు బిల్డింగ్ కట్టించాడు. హైస్కూలు ప్రారంభమైంది. యిప్పుడు 10 క్లాసు వరకు చెబుతున్నారు.

ఇప్పుడు - మా ఊళ్లోనే గాదు - రాష్ట్రంలో చాలా పల్లెటూళ్లలో పరిస్థితి - అయోమయంగా, అధ్వాన్నంగా వుంది.

ఊళ్లో హైస్కూలు ఉన్నది గనక - పిల్లలు పదోతరగతి వరకు చదువుతారు. ఆ పైన కాలేజీకి పోవాలంటే ఏ సత్తెనపల్లో - గుంటూరో - అమరావతో పోవాలి. చిన్నరైతులు - ఖర్చు భరించలేరు. అందువల్ల పిల్లల చదువు - 10వ తరగతితో ఆగిపోతుంది. చదువుకుని - తెల్లబట్టలు - కాఫీలు వగైరాలు అలవాటు పడ్డవాడు గనక పొలం పోలేడు. వ్యవసాయం చేయలేడు. పై చదువు చదవడానికి డబ్బు ఉండదు!

కాబట్టి - ఉద్యోగం కోసం - ఏ పట్టణానికో పోవాలి. అలా - పల్లెల నుంచి - బస్తీలకు - వలసలు ప్రారంభమైనాయి.



గుంటూరు - సత్తెనపల్లి కంటె - హైదరాబాద్‌లో ఉద్యోగావకాశాలు ఎక్కువ గదా అని - హైద్రాబాద్ వస్తాడు కుర్రాడు.

హైద్రాబాద్‌లో ఉండాలంటే అద్దెకు గది కావాలి గదా! చాలా ఖరీదు! భరించలేడు! చవకగా గది కావాలంటే ఏ 'బస్తీ'లోనో - అంటే గుడిసెల కాలనీలో ఒక చిన్న గుడిసెలోనో లేక డాబాలో ఏ గదో అద్దెకు తీసుకుంటాడు.

పదోక్లాసు చదివిన వాడికి ఏం ఉద్యోగం వస్తుంది. ఇంటి దగ్గరనుంచి తెచ్చుకున్న డబ్బు అయిపోతుంది. యీలోపల ఆ 'బస్తీ'లో వున్న - కుర్రవాళ్లతో పరిచయం - స్నేహం! వాళ్లు చేస్తున్న పనేమిటి! చిన్న చిన్న దొంగతనాలు! తేలిక సంపాదన! ఆకర్షణీయంగా ఉంటుంది! ఆ కుర్రాడు ఆ కుర్రాళ్లతో చేరతాడు! ముందు దొంగతనాలు! ఆ తరువాత దోపిడీలు - కిడ్నాపులు - హత్యలు!

పట్టుబడితే - శిక్ష ఏమిటి? జైలు! కొన్ని నెలలు! జైలులో - సీనియర్ దొంగలుంటారు గదా! వాళ్లు వీళ్లకి - కొత్త కొత్త రకాల దొంగతనాల కిటుకులు చెబుతారు! ఒక విధంగా ట్రెయినింగ్! రిఫ్రెషర్ కోర్సు లాంటివి! యిదీ - యిప్పటి - పల్లెటూళ్లలోని - యువకులలో వచ్చిన పరిణామక్రమం!

దీనికి బాధ్యులు - కారకులు ఎవరు? ఏమైన చేస్తే - ప్రభుత్వమే కల్పించుకుని - పరిస్థితుల్ని సరిదిద్దాలి! కాని, ప్రభుత్వం నడిపేదెవరు? రాజకీయ నాయకులు!

స్వాతంత్ర్యానంతరం - యీ 50-ఏళ్లలో! మన రాజకీయల్లో వచ్చిన పరిణామం చూస్తున్నాం గదా!

ఇప్పుడు - రాజకీయనాయకుల ఉపన్యాసాలు చూస్తుంటే - నవ్వు వస్తుంది.

రాజకీయం - వ్యాపారమై పోయింది. ఆ సంగతి అందరికీ తెలుసు.

రాజకీయనాయకులు - తాము తప్ప - మిగతా వాళ్లంతా నీతిగా - నిజాయితీగా ఉండాలని సందేశాలిస్తారు.

"నేను చెప్పినట్టు - చెయ్! నేను చేసినట్టు చేయకు" అనేది వీళ్ల ప్రజలకు చెప్పేపాఠం!

"Do as I say! But don't do as I do!"

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత - యీ 50 ఏళ్లలో దేశాన్ని పాలించిన నాయకులు - పల్లెటూళ్ల బాగోగులను పూర్తిగా విస్మరించారు!

గాంధీగారు మొత్తుకున్న - గ్రామ స్వరాజ్యం పూర్తిగా మరచిపోయారు మన నాయకులు.

అవినీతి అనేది - అన్నిరంగాలలో అదుపులేకుండా పెరిగిపోయింది.

ఏం చేసినా తప్పులేదు అనే సిద్ధాంతం - సమాజంలో నరనరాన పేరుకుపోయింది!

కేవలం - 'సంపాదనే' - తారకమంత్రంగా తయారైంది.

నా వయసిప్పుడు 85 సంవత్సరాలు! నా చిన్నతనంనాటి సామాజిక వ్యవస్థకీ - యిప్పటి వ్యవస్థకీ - వున్న తేడా సాంఘిక పరిణామాలు చెప్పడానికి - యిదంతా చెప్పవలసి వచ్చింది.

మళ్లీ - మా కుటుంబ చరిత్రకి వస్తే-

మా తాతలు - తండ్రుల తరంలో మాది జాయింటు కుటుంబం అని చెప్పానుగదా!



మా తాతలు ముగ్గురు అన్నదమ్ములు - తండ్రులు - ఇద్దరు అన్నదమ్ములు, ఒక తోబుట్టువు.

1920కి - రెండుమూడేళ్లు ముందు - రెండు మూడేళ్ల తరువాత కాలంలో - ముందు మా మేనత్త - ఆ తరువాత - మా తండ్రులిద్దరు - రెండు మూడేళ్ల వ్యవధిలో కాలం చేశారు.

మా తండ్రి గారు పోయేటప్పటికి - నాకు - రెండు మూడేళ్లు వయసు! అంటే మా అక్క నా కంటె రెండేళ్లు పెద్ద. నా తరువాత ఒక ఆడపిల్ల పుట్టి పోయిందట.

మా తండ్రులు పోయేటప్పటికి మా పెత్తండ్రిగారి పెద్దకుమారుడు గురవరాజు గారు - మేజరు! ఆస్తి పెత్తనానికి వచ్చాడు.

మా పెదతండ్రిగారికి - ముగ్గురు కొడుకులు - గురవరాజు - అయ్యపరాజు - సీతరామరాజు! ఇద్దరు కూతుళ్లు - వెంకటసుబ్బమ్మ - వెంకాయమ్మ! మూడో కొడుకు సీతారామరాజు నా కంటె ఏడాది పెద్ద. మా పెద్దన్నయ్య గురవరాజుగారి పెత్తనంలో - కొన్ని అవకతవకలు జరిగినాయట. వ్యాపారాలే చేశాడో - మరే కారణం వల్లనో - వచ్చే ఆదాయం పోగా - పైగా - అప్పులు గూడ చేశాడు. దురలవాట్లు ఏమీలేవు మరి! ఎందుకో - అప్పులు చేశాడు.

ఆ పరిస్థితిలో - ముత్యాలంపాడులోని - మా పెద్ద మేనమామగారు - కల్పించుకోవలసి వచ్చింది. నా ఆస్తి కాపాడడం కోసం!

మా మేనమామలు - అయిదుగురు అన్నదమ్ములు వెంకటసుబ్బరాజు - ఆదిరాజు - సీతారామరాజు - రామరాజు - రంగరాజు. ముగ్గురు అక్క చెల్లెళ్లు - రుక్మిణమ్మ - సుబ్బమ్మ - నారాయణమ్మ!

మా తాతయ్య - అమ్మమ్మ - రామరాజు - లక్ష్మీదేవమ్మగార్లు నాకు బాగా గుర్తు. మా అమ్మమ్మ - 1932-33లోనే పోయింది. అప్పటికి నాకు 12-13ఏళ్లు. అప్పటికే నాకు పెళ్లి అయింది. బాల్య వివాహం! ఆ సంగతి తరువాత చెబుతా. మా తాతయ్య 1940లో నేను మదరాసు లయోలా కాలేజిలో చదివేటప్పుడు పోయాడు.

మా పెద్దమేనమామ సుబ్బరాజుగారు మంచి వ్యవహర్త! ఆయన కొన్నాళ్లు - ప్లీడరు గుమాస్తా గిరి చేశాడట! అందువల్ల 'లా' వ్యవహారాలు బాగా తెలిసివుండాలి!

మా పెద్దన్నయ్య - గురవరాజుగారు - ఆస్తి అప్పులపాలు చేస్తున్నట్టు తెలిసి - మా పెద్దమామయ్య తాళ్లూరు వెళ్లి ఆస్తిలో నా సగంవాటా - పంచి యివ్వమని అడిగాడట! అందుకు మా అన్నయ్య గురవరాజు గారు ముందు ఒప్పుకోలేదట!

"మా తాతలు - తండ్రుల కాలం నుంచి మాది ఉమ్మడి కుటుంబం! వేర్లు పడడం (అంటే విభాగాలు) మా ఇంటా వంటా లేదు! వాడు నీకు మేనల్లుడయితే నాకు తమ్ముడుకాదా! వాడి మీద నీకున్న బాధ్యత నాకు లేదా?" అని మొరాయించాడట! యీ విషయం నేను పెద్దవాణ్ణి అయిన తరువాత మా మేనమామలు చెప్పారు. మా అన్నయ్య అన్నది సదుద్దేశంతోనే! నా మీద ప్రేమతోనే!

అయినా - పెద్దమామయ్య వ్యవహర్త గనక - గురవరాజుగారు ఆయనకంటె బాగా చిన్నవాడు గనక (అప్పటికి మా పెద్ద మామయ్యకి 35-40 ఏళ్లు వుండవచ్చును) "పిచ్చి పిచ్చి వేషాలు వేయకు" అని గద్దించి - ఒప్పించి నా సగంవాటా పంచి - విభాగాలు - రిజిస్టరు చేయించారు.



మా మేనత్తగారి భర్త - సుబ్బరాజుగారు యిల్లరికం వచ్చాడు గనక - ఆయనకు గూడ - కొంత ఆస్తి యిచ్చారు. ఆయనకు యిద్దరు కొడుకులు, ఒక కూతురు!

ఆయన పెద్దకొడుకు - సీతారామరాజుకు - మా పెదతండ్రి - పెద్దకూతురు - వెంకటసుబ్బమ్మ నిచ్చి - చేస్తే ఎందుకో ఏం జరిగిందో ఆమె బావిలో దూకి ఆత్మహత్య చేసుకుందని యిదివరకే చెప్పాను.

మా మేనత్త కూతురు - నరసమ్మగారు ! మేము ఆమెను నరసమ్మక్కయ్య అనేవాళ్లం. వరసకి వదినయినా!

ఆమె మంచి ఛాయ! కాస్త పళ్లు ఎత్తు! చాలా అందంగా ఉండేది. చిన్నప్పుడు నన్ను ఎత్తుకుని ఆడించేది.

నాకు మాటలు వచ్చీరాని వయసులో మాటలు చెప్పి నన్ను ఆటలు పట్టించేది.

"నరసమ్మక్కయ్య వోసింది. (వచ్చిందికి బదులు) నరసయ్యబావ (ఆమె తమ్ముడు) ఓశాడు" అనేవాణ్ణట!-

మా ఆస్తి విభాగాలు అయిన తరువాత నా వాటా భూములు సాగుచేయడానికి ముత్యాలంపాడు నుంచి - మా చిన్న మేనమామ రంగరాజుగారిని తాళ్లూరు తీసుకువచ్చి - వ్యవసాయం చేయించారు. అప్పుడు - నేను మా అక్కయ్య - మా అమ్మ - తామ్మ, తాళ్లూరులోనే ఉండేవాళ్లం. అలా రెండు మూడేళ్లు గడిచిందేమో - నాకు చాలా చిన్న తనం గదా బాగా జ్ఞాపకం లేదు.

ముత్యాలంపాడులో - మా తాతగారికి వయసుపైబడడం అందులో ఆయనకి ఉబ్బసం వ్యాధి ఉండేది. అందువల్ల ఆయన పొలం పోవడం మానేస్తే - మా చినమేనమామగారు - చదువుమానేసి - వ్యవసాయం చూస్తుండేవాడు. ఆయన్ని - తాళ్లురులో నాభూముల వ్యవసాయానికి తీసుకువస్తే - ముత్యాలంపాడులో వాళ్ల వ్యవసాయం ఎవరు చూస్తారు!

అందుకని - నా భూములు - తాళ్లూరులోనే - ఒక కమ్మవారి కుటుంబం - రాయిపాటివారిని - ముగ్గురు అన్నదమ్ములు - వాళ్లకి కౌలుకి యిచ్చారు. ఆ విషయం, వివరాలు - యిదివరకే చెప్పాను.

తాళ్లూరులో మా భూములు కౌలుకిచ్చి మా కుటుంబాన్ని - మామేనమామలు ముత్యాలంపాడు తీసుకువచ్చాడు.

నాకు అయిదారేళ్లు వచ్చేవరకు - మేము మా తాతగారి ఇంట్లోనే వున్నాం. ముత్యాలంపాడులో ఎలిమెంటరీస్కూలు ఉండేది. అందులో చేర్చారునన్ను. 5వ ఏట అక్షరాభ్యాసం చేయించి.

నాకు బాగా జ్ఞాపకం నాకు ఎ.బి.సి.డిలు స్కూల్లో చెప్పేటప్పుడు - ఇంటి దగ్గర - మా ఆదిమామయ్య (రెండో మేనమామ) ఇంగ్లీషు అక్షరాలు చెప్పేవాడు.

మా ఆదిమామయ్య చాలా విచిత్రమైన మనిషి. మా పెద్దమామయ్య సుబ్బరాజుగారు - ఆదిమామయ్య - యిద్దరూ ఒక బ్యాచ్ అన్నమాట! బెజవాడ స్కూల్లో చదివేవారట. మా అమ్మమ్మ చెప్పేది. మా పెద్దమామయ్య చదువులో చాలా **bright** గా వుండేవాడట! అప్పుడు - ఇప్పటిలాగా - ఒకటోక్లాసు - రెండోక్లాసుగా కాకుండా ప్రైమరీ-లోయర్-హైయర్ అని ఏవేవో వుండేవట! అంత చిన్న క్లాసులోనే - ఇంగ్లీషుతోపాటు లెక్కలు గూడ ఇంగ్లీషులో చెప్పేవారట? మా పెద్దమామయ్య చదివిన పుస్తకం -ఇంగ్లీషులో ఉండేది. మా పెద్దమామయ్యకి ఒక కుర్చీగూడా ఉండేది. మా అమ్మమ్మ చెబుతుండేది. మా పెద్దమామయ్య - పెళ్లికి ముందో-పెళ్లిఅయిన తరువాతనో



కొన్నాళ్లు ప్లీడరు గుమాస్తాగా పనిచేశాడట! గవర్నరుపేటలో మెట్లపల్లి కోటేశ్వరరావుగారని - ఆయన దగ్గర గుమాస్తాగా పనిచేశాడట. మా పెద్దమామయ్య 1935లో పోయిన తరువాత 1943-44 ప్రాంతంలో-నా కాలేజీ చదువు అయిన తరువాత మెట్లపల్లి కోటేశ్వరరావుగారు క్లబ్బు ప్రెసిడెంటుగా ఉండేవాడు. అప్పటికి ఆయన ముసలాయన. ఆయనకి నేను ఫలాన అని చెబితే "నువ్వు సుబ్బరాజు మేనల్లుడివటయ్య! మీ మామయ్య చాలా తెలివి గలవాడయ్యోయ్! గుమాస్తా అయినా - నాకే - డ్రాఫ్టులు రాసి యిచ్చేవాడు" అని చెప్పేవారు కోటేశ్వరరావుగారు.

మా ఆదిమామయ్యని గురించి చెప్పాలి! ఆయన అంత శ్రద్ధగా చదివేవాడు కాదట! 'పరీక్షల ముందు-పుస్తకాల మీద మంత్రపుష్పం చల్లితే చాలు' అనేవాడట! మా అమ్మమ్మ చెప్పేది.

ఆయన లోయర్‌తో చదువు మానేసి - టీచరు ట్రైనింగ్ చదివాడట! ముత్యాలంపాడు ఎలిమెంటరీ స్కూలులోనే అసిస్టెంటు టీచరుగా పోస్టింగు వేయించుకున్నాడట. స్కూలుకి ఇద్దరే టీచర్లుండేవారు. స్కూలుకు వెళ్లకపోయినా - హెడ్‌మాస్టరు ఈయనను ఏమి అనేవారు కాదట! ఊళ్లో మోతుబరి కొడుకాయే! భయం!

మా ఆదిమామయ్య - తోలుబొమ్మలు కత్తిరించి తోలు బొమ్మలాటలు ఆడించేవాడట! మొత్తం మీద విలాసపురుషుడు!

ఒకసారి - చిత్రమైన సంఘటన జరిగింది. నేను ఎలిమెంటరీ స్కూలులో చదువుతున్నప్పుడు రాఘవేంద్రరావు అని ఒక కన్నడిగుడు హెడ్‌మాస్టరుగా వుండేవాడు. ఒకసారి - నేను ఏదో సరిగా లెక్క చేయకపోతే నాకు తొడపాశం పెట్టాడు.

ఆయన వేళ్లకు పొడుగాటి గోళ్లుండేవి. గోరు గుచ్చుకుని - నా తొడకు రక్తం వచ్చింది. నేను తుడిచేసుకున్నాను. ఇంటికి వెళ్లాక - మా అమ్మ నాకు స్నానం చేయిస్తూ నా తొడమీద గీసుకుపోయిన చార చూసింది. ఏమిటని అడిగితే చెప్పాను. ఆమె మా ఆదిమామయ్యకు చెప్పింది. ఆయన కోపోద్రిక్తుడై - వెంటనే - ఆ హెడ్‌మాస్టరు ఇంటికి వెళ్లి కేకలు వేసి "ఇంకోసారి ఇలా చేశావంటే - జాగ్రత్త! ఈ ఊళ్లో వుండవు" అని వార్నింగ్ ఇచ్చి వచ్చాడు.

తండ్రిలేని పిల్లవాణ్ణిగాదా - అందుకని - నన్ను ఇంట్లో అందరూ చాలా గారాబంగా చూసేవారు!

మా సీతయ్య మామయ్య (మూడో మేనమామ - సీతారామరాజుగారు) మా బాబు పోయినప్పుడే పోయారు. ఆయనను నేను చూసిన జ్ఞాపకం లేదు! ఆయనకు ఒక కొడుకుండేవాడు! కోటీశ్వరరాజు! నాకంటె - ఏడాది చిన్నవాడు. మా సీతయ్య మామయ్య భార్య - పెద్దరంగమ్మత్త - నాకూ - తన కొడిక్కి తల దువ్వి బొట్టు పెట్టి స్కూలుకు పంపేది. ఆమె పుట్టిల్లు- నరసన్నపాలెం!

నేను పెద్దవాణ్ణయి - సినిమాలలో చేరిన తరువాత గూడ ఎప్పుడయినా ముత్యాలంపాడు వస్తే నేను వచ్చానని తెలిసి నన్ను చూడడానికి ప్రత్యేకంగా వచ్చేది - మా పెద్దరంగమ్మత్త!

ఆమెని పెద్దరంగమ్మని ఎందుకనే వారంటే మా మామయ్య (నాలుగో మేనమామ) భార్య పేరు గూడ - రంగమ్మే! ఆమెని చిన్నరంగమ్మ అనేవారు.

నేను రెండో క్లాసో - మూడో క్లాసో చదివేటప్పుడు మాకుటుంబం కోసం మా తాతయ్య గారి స్థలంలోనే చావిళ్ల దగ్గర మాకొక యిల్లు కట్టించి పెట్టారు. ఇటుకలతో గోడలు కట్టి - పైన పూరి కప్పు, రెండు నిట్రాళ్ల ఇల్లు!



నేను - మా అమ్మ - అక్కయ్య ఆ యింట్లో వుండేవాళ్లం. మా తామ్మ మటుకు - తన పుట్టింట్లో అంటే మా తాతయ్య గారి ఇంట్లోనే వుండేది. అప్పుడు మా తాతయ్య-అమ్మమ్మ ఉండేవాళ్లు!

మా యిల్లు కట్టక ముందు నేను మా తాతయ్యగారి ఇంట్లో వున్నప్పుడు - సాయంత్రం-పొద్దు గూకే ముందు - ఇంటిముందు నులకమంచం 'వెల్లకిల' వేసుకుని పండుకునేది మా అమ్మమ్మ. ఆడవాళ్లు నిలువు మంచాలమీద ఇంటిముందు పండుకునేవాళ్లు కాదు. మగవాళ్లు అటూయిటూ తిరుగుతుంటారని! మా తాతయ్యగారిది - పెంకుటిల్లు! మండువాలోగిలి! ఆమె పేరు లక్ష్మీదేవమ్మ! నన్ను పక్కలో పండుకోబెట్టుకుని - కథలు చెప్పేది. ఆమెఎప్పుడూ వక్కపొడి నములుతూండేది. మాతాతయ్యలాగే, ఆమెకుగూడ ఉబ్బసం ఉండేది. వైద్యుడి సలహా మేరకు-రోజూ-తెల్లవారు ఝామున లేచి ఎవరూ చూడకుండా గదిలో కూర్చుని ఒక చుట్టకాల్చేది. ఉబ్బసానికి మంచిదట-చుట్ట!

ఆమెకి-ఒకసారి-పిప్పిపన్ను అయింది. అప్పటికే కొన్ని పళ్లు ఊడిపోయినై. బెజవాడ దగ్గర్లో - గొల్లపూడి అనేవూరు వుంది-ఆవూళ్లో-పిప్పి పన్నుకి ఎవరో వైద్యుడు పసరుపోసేవాడు. అందుకోసం-మా అమ్మమ్మ-గుర్రపు బండిలో గొల్లపూడి వెళ్లేది తెల్లవారుఝామునే బయలుదేరి! అప్పుడు మా తాతయ్యగారికి సొంతగుర్రపు బండివుండేది!

అన్నట్టు చెప్పడం మరిచాను! మాతాతగారి జాయింటు కుటుంబానికి - కలప వ్యాపారం వుండేది. ఇప్పుడు సత్యనారాయణపురంలో సీతన్న పేట రైలుగేటుకు తూర్పున ఏలూరు కాలవఒడ్డున నాలుగు కలప అడితీలు ఉండేవి. అందులో ఒకటి - మామేనమామలది. దానిని మా ఆదిమామయ్య - రాంమామయ్య నడుపుతూండేవారు. అంతకుముందు - మా రాంమామయ్య - బెజవాడ పెద్దబజారులో ఖద్దరుకొట్టు పెట్టాడు. మా మేనమామలందరిలో మా రాంమామయ్యకు - గాంధీగారి ఉద్యమం ఖద్దరు ప్రచారం వగైరాలలో ప్రమేయం వుండేది.

కలప అడితీలో - (1920లలోనే ప్రారంభించారనుకుంటూ) మొదట్లో మా రాంమామయ్యే-సేల్స్‌మన్ ఎక్కవుంటెంటూ గూడ! ఆయన దస్తూరితో రాసిన అక్కౌంటు బుక్కు - యిన్ కంటాక్సు ముద్రలతో సహా - ఒకటి నా దగ్గర యిప్పటికి వుంది!

"ఉప్పలపాటి రామరాజు అండ్ సన్స్ కలప వ్యాపారం" అని లెటర్ హెడ్‌లు ఉండేవి. మా తాతయ్య పేరు గూడ రామారాజే! కనక జాయింటు కుటుంబానికే వ్యాపారం గూడ.

1927 ప్రాంతంలో నా పేర కలప అడితీల దగ్గర వెయ్యి గజాల స్థలం కొన్నారు. అప్పుడు నేను మైనర్ని. మా భూముల మీద వచ్చే ఆదాయం - అడితీ లెక్కలలో జమచేసి మా యింటికి కావలసిన సొమ్ము - ఖర్చు రాసి - మా అమ్మకి యిస్తుండేవారు.

అలా నా స్థలం కొన్నట్టు. ఆ అక్కౌంటు బుక్కులో రాసివుంది. మా రాంమామయ్య స్వదస్తూరితో! తరువాత వ్యాపారం పెరిగాక ఒక గుమాస్తాని పెట్టారు. ముత్యాలంపాడు-బెజవాడ మునిసిపల్ లిమిట్‌కి - పక్కనే వుండేది. ఇప్పుడు సిమెంటు ఫ్యాక్టరీ దగ్గర బ్రిడ్జి వుండే అక్కడ వుండేది మునిసిపల్ లిమిట్!

ఏలూరు కాలవ - ఊరి పక్కనే ఉన్నా - ముత్యాలంపాడుకి మాగాణి వ్యవసాయం ఉండేది కాదు! ముత్యాలంపాడు రైతులకి (మూడువంతులు-రాజుల కుటుంబాలు-మిగతావాళ్లు-గొల్లలు-చాకలి-తెగల కులాలవాళ్లు) భూములు-ఏలూరు కాలవకి అవతల కాలవకు ఉత్తరం వైపు ఉండేవి. కాలవ కంటె - భూములు మెరకగ ఉండడం



వల్ల - నీరు పారేదికాదు. అందువల్ల అంతా మెట్ల వ్యవసాయమే! పైగా, బుడమేరు ముంపు! రాత్రికి రాత్రి వరదవస్తే-పొలాల్లో- నాగళ్లు కొట్టుకు పోయేవి!

పశువులు - మేతకి కాలువదాటి పోవలసిందే! 'బీటిమేత - ఏటియీతకి సరిపోయిందని' సామెత!

పశువులు - కాలువ ఈది పోవాలి! రావాలి! మనుషులు దాటడానికి - కాలవ మీద 'బల్లకట్టు' ఉండేది! బల్లకట్టు మీద పల్లెకారి ఉండేవాడు. అతని పేరు వెంకటస్వామి! అతనికి రైతులు-ఏటా-ధాన్యం కొలచేవారు!

అన్నీ మెట్టపైర్లే! జొన్న, కంది, శనగ, ఉలవ, మిరప వగైరా నల్లవడ్లు మెట్టపైరు! వడ్లునల్లగానూ - అందులో బియ్యం ఎర్రగానూ వుండేవి. వాటిని 'జిలం వడ్లు' అనేవారు. ఎక్కువ మంది ఆ బియ్యమే వండుకు తినేవారు. చాలా పుష్టిగల ఆహారం!

ఆవులు - గేదెలు - ఎద్దులు సాయింత్రం కాలవ ఈది ఇళ్లకు వచ్చేవి. కాలువదాటి నేరుగా యిళ్లకు వచ్చేవి. పశువుల కాపర్లు పడవదాటి తరువాత వచ్చినా గేదెలు ఆవులు - తమతమ యిళ్లకు చేరుకునేవి!

మా తాతయ్య గారి ఇంటి ముందే కట్టేసే వాళ్లు. రెండుపాడిగేదెల్ని!

నేరుగా ఇంటికి వచ్చి - 'కుడితి' తాగేవి! ఇంటి ముందు - మా అమ్మమ్మ నులకమంచం 'వెల్లికిల' వేసుకుని పండుకునేదని చెప్పానే - అలా వెల్లికిల వేస్తే నులకనేలకి తగుల్తుంది. అందుకని - మంచం కోళ్లకింద - రాతి దిమ్మలు పెట్టేవాళ్లు - మంచం నులకనేలకి తగలకుండా!-

మా కోసం కట్టిన కొత్తయింటి పక్కనే ఎడ్లచావిడి ఆవుల చావిడి ఉండేవి. సాయంత్రం పూట - ఉలవగుగిళ్లు పెడుతూండేవాళ్లు ఎద్దులకి.

ఆవులు గేదెలు 'కట్టడం' - 'యీనడం' అనే పదాలు - యీకాలపు పట్టణాలలో పుట్టి పెరిగినవాళ్లకి అర్థం కావు!

ఆంబోతులు, ఆవుల్ని, దున్నపోతులు, గేదెల్ని 'దాడటం' అంటే - 'cross' చేయడమన్నమాట! ఆవుకట్టడం అంటే - pregnant అన్నమాట! యీనడం అంటే Delivery !

ఆవుకి గాని గేదెకి కాని - కట్టునిలవలేదు అంటే 'అబార్షన్' అయిందన్న మాట!

అప్పుడు - ఊళ్లో ఎలక్ట్రిసిటీ లేదుగదా! ఆవు రాత్రి పూట చావిల్లో యీనుతుంటే - లాంతరు పెట్టుకుని - పాలేరుతో పాటు - నేనూ - మా అమ్మమ్మ కూర్చునేవాళ్లం!

పెయ్యదూడ పుడుతుందా? కోడెదూడ పుడుతుందా? అని నేనూ - మా అమ్మమ్మ పందెం వేసుకునేవాళ్లం!

అలా మా అమ్మమ్మ నాకు 5 రూపాయలు బాకీ పడింది. బాకీ చెల్లించకుండానే వెళ్లిపోయింది.

మా అమ్మమ్మ బాగా 'భారీ'మనిషి. మంచి ఛాయ! మా తాతయ్య పొట్టి!

మా పెద్దమామయ్యకి - రాంమామయ్యకి - తల్లి పోలికలు వచ్చినై. భారీ మనుషులు. 6 అడుగుల ఎత్తు!

ఆదిమామయ్య - బుల్లిమామయ్య (చిన్న మామ) మామూలు ఎత్తు మనుషులు! మరీ పొట్టికాదూ!-

ఆవులు - గేదెలు యీనిన దృశ్యాలు - బహుచిత్రంగా ఉండేవి.



ఆవు 'మడి' నుంచి - దూడ బయటికి రావడం యీ తరం వాళ్లు ఎంతమంది చూచి వుంటారు!

దూడ కిందపడగానే - దాని ఒంటినిండా - మురుగు! తడి! తల్లి ఆవు - దూడ ఒంటిమీద తడినంతా - గబగబ నాలుకతో నాకేసేది!

కొన్ని ఆవులు, గేదెలు యీనగానే మనుషుల్ని దగ్గరకి రానిచ్చేవిగావు - తన బిడ్డను ఏమిచేస్తారోనని భయం! బిడ్డకు రక్షణగా బుసలు కొట్టేవి.

పాలేరు - దూడను ఎత్తి దాని మూతిని ఆవు పొదుగు దగ్గరపెడితే దూడ క్రమంగా పాలు తాగడం నేర్చుకునేది. ఆవులూ, గేదెలే కాదు! పశుపక్ష్యాదులన్నీ తమ బిడ్డలకు రక్షణ కోసం ఎలా ప్రవర్తిస్తాయో సృష్టివైచిత్రి! సృష్టిలో ఒక రహస్యం వుంది! పశువులుగాని, పక్షులుగాని చివరికి క్రూర మృగాలు గూడ కన్నబిడ్డని అవి పెద్దవయ్యేదాకా ఎంత ప్రేమగా పెంచుతాయో! వాటికి ఏ అపాయం రాకుండా - రక్షిస్తాయ్! కాపాడడానికి ఎంతైనా తెగిస్తయ్!

కోడిని చూశారా! కోడి పెట్ట పిల్లల్ని పెడుతుంది. ఆరు బయట - పిల్లల్ని వెంట వేసుకుని చెత్తదిబ్బలమీద కాళ్లతో చెత్తను విడదీసి పిల్లలకి మేపుతుంది. పైన, గద్దతిరుగుతున్న దనుకోండి వెంటనే 'కొకొకొ' అని అరిచి గోలపెట్టి పిల్లల్ని రెక్కలకింద దాచేసుకుంటుంది.

కుక్కల్ని చూడండి. కుక్కలు పిల్లల్ని పెడితూ మనుషుల్ని దగ్గరికి రానివ్వవు! పైనబడి కరుస్తాయి! పందులు గూడ! పిల్లల పంది దగ్గరకు పొండి ! వెంటబడి తరుముతుంది.

పశుపక్ష్యాదులు - క్రూరమృగాలు టి.వి.చానెల్స్‌లో చూపిస్తారు - మొసళ్లతోసహా!

తల్లులు, పిల్లలు పెద్దవి అయేదాకా ఎంత ప్రేమగా రక్షణ కల్పించి పెంచి పోషిస్తాయ్!

పశుపక్ష్యాదులు, మానవులతో సహా బిడ్డల మీద తల్లులకు ఆప్రేమ ఉన్నంతవరకు ఈ సృష్టి ఆగదండీ!

ఆ ప్రేమ నశించినప్పుడు యీ సృష్టి ఆగిపోతుంది. పిచ్చుకలు చూడండి! గూళ్లు కట్టుకుని, అందులో గుడ్లు పెట్టి పొదిగి పిల్లల్నికని - వాటికి తిండి పెట్టాలి గదా! తల్లిపిచ్చుక - తనుతిని గూటికి వచ్చి - తను తిన్న ఆహారాన్ని మళ్లీ బయటికి తెచ్చి పిల్లల నోట్లో పెడుతుంది. వాటికి రెక్కలు వచ్చే దాకా కాపాడి పెంచుతుంది.

అది తల్లి ప్రేమా? బాధ్యతా? పిచ్చుకకి ఎవరు నేర్పారు! దేవుడిపై నమ్మకమున్న వాళ్లు దేవుడికి ఆపాదిస్తారు! ఆ నమ్మకం లేనివాళ్లు 'సృష్టి' అంటారు.

పశుపక్ష్యాదులే కాదు, మనుషుల్లో గూడ! నా విషయమే తీసుకోండి. నాకు ఊహ గూడ రాని వయసులో నా తండ్రిగారు పోయారు. నన్ను - మాఅమ్మ - మా తామ్మ పెంచారు! ఎంతో గారాబంగా ప్రాణంతో సమానంగా పెంచారు. వాళ్లు నాపై చూపిన ప్రేమానురాగాలను వెలకట్టగలమా! మా అమ్మ అంటే - కన్నతల్లి! మా తామ్మ! చెప్పాను గా! నేను ఆమెకు వరపుత్రుణ్ణి! మా అమ్మ, తామ్మల్ని తల్చుకుంటే నాఒళ్లు జలదరిస్తుంది.

నా చిన్నతనంలో ముత్యాలంపాడులో మా తాతయ్యగారి యింట్లో వుండగానే - అంటే మాకువేరే యిల్లు కట్టకముందే నాకు ఒకసారి జ్వరం వచ్చింది. బహుశా అది టైఫాయిడ్ జ్వరం అయివుంటుంది. 15-20 రోజులకి గాని తగ్గలేదు. అప్పుడు ఆయుర్వేద వైద్యమే! సత్యనారాయణపురంలో సుబ్బయ్యగారని ఆయుర్వేద వైద్యులుండేవాడు. ఇప్పుడు సత్యనారాయణపురంలో మాజీ మునిసిపల్ కౌన్సిలర్ సిరిపురపు కోటేశ్వరరావు అని ఉన్నాడు. నాకు బాగా



ఫ్రెండు. అతని అన్నగారు - సుబ్బయ్యగారు. కోటీశ్వరరావు వెంకటరమయ్యగారికి పెంపుడు వెళ్లాడనుకుంటాను. ఆ సుబ్బయ్యగారే - ముత్యాలంపాడు ఊరంతటికీ వైద్యుడు! అప్పుడు నాకు 'తలచివ్వి' పట్టువేశాడు. అంటే నడినెత్తిన వెంట్రుకలు ఒకటి రెండు అంగుళాల వెడల్పున గుండ్రంగా కత్తిరించి ఒక ఆయుర్వేద మందుతో పట్టీవేసేవారు. అది జ్వరం తగ్గిన తరువాత గాని తీసేసే వారుగాదు!

అలా జ్వరం తగ్గిన తరువాత పథ్యం పెడతారు! నాకు యిప్పటికీ బాగా జ్ఞాపకం! పథ్యం పెట్టడం అంటే కడుపునిండా భోజనం పెట్టరు. ధనియాల కారంతో - కొద్దిగా నెయ్యివేసి పెడతారు! అదీ కడుపు నిండా పెట్టరు! పస్తులతో కాలిన కడుపుకి - ఆకలిగదూ! ఆ ధనియాలకారంతో అన్నం - అమృతంలా వుండేది!

కొద్దిగా పెడితే "యింకాస్త పెట్టమ్మా" అని మా అమ్మని దీనంగా అడిగేవాణ్ణి! అప్పుడు మా అమ్మ మొఖంలో expression యిప్పటికీ జ్ఞాపకం! జాలిగా యింకొంచెంపెట్టేది.

మరో చిక్కు ఏమిటంటే అన్నం తిన్న తరువాత వెంటనే నిద్రపోగూడదు! కాని నిద్ర వస్తుంది. నిద్ర పోతే మళ్లీ జ్వరం వస్తుందని - మా అమ్మ నన్ను ఎత్తుకుని అటూఇటూ తిప్పి నన్ను నిద్రపోనివ్వకుండా వుండడానికి నానా తిప్పలు పడేది. ఆ నెలరోజులు మా అమ్మ, తామ్మ, మా అమ్మమ్మ నా మీద చూపిన ప్రేమ అనండి - ఏమైన అనండి మరిచిపోగలనా?

కాని - విచిత్రమేమంటే అంత ప్రాణసమానంగా పెంచిన తల్లితో పిల్లలు పెద్దయిన తరువాత - ముఖ్యంగా పెళ్లి అయిన తరువాత ఏవో కారణాలవల్ల అభిప్రాయ భేదాలు, తగాదాలు రావడం వల్ల తల్లీ, బిడ్డలు వేరు కావడం, దూరం కావడం చాలా మంది విషయంలో జరుగుతుంటుంది.

ఇంగ్లీషులో ఒక నానుడి వుంది.

"A son is a son until he gets his wife.
A daughter is a daughter for life!"

పశుపక్ష్యాదులకు యీ problem లేదను కుంటాను! పశువుల దూడలు - పక్షుల పిల్లలు - పెరిగిన తరువాత వాటి దోవన అవిపోతాయి. ఆవు, పక్షి మానవుల్లాగ దూరమై పిల్లలకోసం బాధపడవను కుంటాను!

కొడుక్కి పెళ్లి అయిన తరువాత అతని loyalty divide అవుతుంది. భార్యని చూచుకోవసిన బాధ్యత భర్తదిగదా! ప్రేమ సంగతి అలా ఉంచండి! బాధ్యత భర్తదేగదా!

మరి, భార్యకి, తల్లికి అభిప్రాయభేదాలు తగాదాలు వస్తే కొడుకు అటో యిటో dicide చేసుకోవాలి మరి!-

Practical గా ఏం జరుగుతుందంటే తల్లి తన దగ్గర లేకుండా - బ్రతకడానికి అవకాశం ఉందిగాని - భార్యని దూరంగా ఉంచడానికి వీలులేదుగదా! కాబట్టి - ఇష్టం ఉన్నా లేకపోయినా తల్లి మీద ఎంత ప్రేమవున్నా - కాపురం నిలబెట్టుకోవాలిగనక - ఇప్పుడంటే విడాకులు వగైరాలు వచ్చినాయి గాని పూర్వం రోజుల్లో అటు తల్లి మీద ప్రేమ ఉన్నా తల్లిని వేరేవుంచి భార్యతో కాపురం చేయవలసిన పరిస్థిలు ఏర్పడేవి.

అందుకే అన్నారు - A son is a son until he gets his wife. కోడలు వచ్చే వరకే - నీకు వాడు కొడుకు! ఆ తరువాత - అత్తాకోడళ్ల మధ్య తగాదాలు వస్తే, కొడుక్కి చిక్కు! ఎవర్ని దగ్గర ఉంచుకోవాలి? ఎవర్ని దూరంగా ఉంచాలి?



కూతురు విషయంలో మామూలుగా అల్లుడు అభ్యంతర పెట్టకపోతే కూతురు తల్లిని దగ్గరకు తీసుకుంటుంది. యిది మన సమాజ పరిస్థితి!

విదేశాల్లో అయితే అమెరికా లాంటి దేశంలో కొడుక్కి 14-16 ఏళ్లు రాగానే పెళ్లి పెటాకుల సంగతి వాడికే వదిలేసి బయటికి పంపించేస్తారు. పక్షులకి రెక్కలు రాగానే ఎగిరిపోయినట్టు!

## చదువు

నేను ముత్యాలంపాడు ఎలిమెంటరీ స్కూల్లో చదివేటప్పుడు నాకు ఫిట్స్ వచ్చినయ్! మూర్ఛలు! మూర్ఛ అంటే, స్పృహ వుండేది. ఎడం చేతి వేళ్లు - కొంకర్లు పోయేవి. అదేగుర్తు. ఎడం చేయి వణికిపోయేది! కాని, ఎడం చెయ్యి చచ్చు పడేది. పట్టు యిచ్చేదికాదు!

ముందు - అమృతాంజనంతో చేతికి మర్దన చేయడం యింకా ఏదో ఆయుర్వేద వైద్యులు చేశారు గాని -

అప్పుడు - మా నాలుగో మేనమామ - మా రాంమామయ్యకి ప్రకృతి వైద్యంలో ప్రవేశం వుండేది. ఆయన మరి ఎందుకు చేశాడో తెలీదు - తొట్టి స్నానం - ప్రకృతి వైద్యం చేశాడు.

ప్రకృతివైద్యానికి - ఆద్యుడు - జర్మనీలో 'కూనే' అని ఒక డాక్టరు!

సత్యనారాయణపురంలో గంధం కృష్ణారావుగారని ఒకాయన ఉండేవాడు. సరిగా సిమెంటు ఫ్యాక్టరీకి కాలవ ఇవతల ఎదురు వీధి, బ్రహ్మయ్య పంతులు వీధిలో వుండేవాడు. ఆయన 'లా' కాలేజీలో చదువుతుండగా - టి.బి. వచ్చిందట! టి.బి. అంటే క్షయ!

క్షయ అంటే ఆరోజుల్లో నయం కాదనే! అందువల్ల ఆయన జర్మనీ వెళ్లి 'కూనే' వైద్యం చేయించుకున్నాడు! ప్రకృతి వైద్యంలో ముఖ్యమైనది - తొట్టిస్నానం! ఆయనకు క్షయ నయమైంది. ఇండియాకు వచ్చి ఆయన ప్రకృతి వైద్యం ప్రారంభించాడు. ఆయన దగ్గర మా రాంమామయ్య ఎందుకు చేయించుకున్నాడో తెలియదు - ప్రకృతి వైద్యం చేయించుకున్నాడు.

ఆ పరిచయంతో కృష్ణారావుగారిని తీసుకువచ్చి నా మూర్ఛలకు ప్రకృతి వైద్యం ప్రారంభించారు. తొట్టి వైద్యం ముఖ్యం! తొట్టి వైద్యం అంటే కోడిగుడ్డు ఆకారంలో చీనారేకు తొట్లు వుండేవి! దానిలో సగానికి నీళ్లు పోసి - మధ్యలో చిన్న పీట వేసి ఆ పీట మీద కూర్చుని కాళ్లు బయటికి పెట్టాలి! అంటే కింద తొడల దగ్గర నుంచి - రొమ్ముల వరకు నీళ్లలో ఉండేదన్న మాట! అప్పుడు తడిగుడ్డతో పొత్తికడుపు మీద మెల్లగా రుద్దడం! అలా 10నిముషాలు 15 నిముషాలు! నాకు బాగా గుర్తు! అప్పటికి - మేము కొత్త ఇంట్లో వుంటున్నాం! కాని, తొట్టిస్నానం కోసం మాత్రం మా తాతయ్యగారి యింటివెనక దొడ్లో తడికలు అడ్డం కట్టి లోపల తొట్టి వుండేది. బిగ్‌బెన్ గడియారం కొనిపెట్టారు. దాన్ని ఎదురుగా పెట్టుకుని - టైం చూస్తూ తొట్టి స్నానం చేసేవాణ్ణి.

ఆహారం చప్పిడి కూరలు! కారం లేకుండా! అన్ని కాయగూరలు తినవచ్చు. బంగాళా దుంపలతో సహా!

మూర్ఛలు పూర్తిగా తగ్గిపోయినై. మళ్లీ జీవితంలో ఎప్పుడూ రాలేదు;



నా వయసు విషయం చెప్పాలి! నేను పుట్టిన తేదీ ఎవరికీ తెలియదు. ఆరోజుల్లో రాసి పెట్టుకునే అలవాటు లేదు మాకుటుంబాల్లో.

స్కూల్లో చేరినప్పుడు పుట్టిన తేదీ అప్లికేషన్‌లో రాయాలి గదా! అప్పుడు మా అమ్మ ఒక కొండగుర్తు చెప్పింది.

"నువ్వు గోదావరి పుష్కరాలుకు పుట్టావురా" అన్నది. గోదావరి పుష్కరాలు లెక్కవేస్తే 1920 అని తేలింది. పుష్కరాలు సామాన్యంగా ఎప్పుడు వస్తాయి. వర్షాకాలం ప్రారంభంలో అంటే జూన్, జూలై మాసాల్లో! కాబట్టి జులై 15 తేదీ!

1920-జూలై-15 వతేదీ అని అప్పుడు స్కూలు రికార్డుల్లో రాశాను.

నేను బెజవాడ హిందూస్కూలులో - స్కూలు ఫైనల్ చదివుటప్పుడు స్కూలువాళ్లు పుట్టిన తేదీలు అవసరమైతే మార్చుకునే వీలు కల్పించారు.

ఎందుకంటే స్కూలు ఫైనల్ పబ్లిక్ పరీక్షల సమయానికి విద్యార్థికి 16 సంవత్సరాలు నిండాలి అని ఒక రూల్ వుండేది.

1936 మార్చి నెలలో స్కూలు ఫైనల్ పరీక్షలు నాకు 1936 జులై 15కి గాని 16 ఏళ్లు నిండవు!

అందువల్ల పరీక్షనాటికి వయసు చాలదు అని object చేస్తారనే భయంతో నెలలేం ఖర్మం - ఒక ఏడాది ఎక్కువ వేస్తే ఏం పోయింది. అని నేను యింట్లో చెప్పకుండానే జూలై-15-1919 అని ఒక ఏడాది ఎక్కువవేశాను!

అందుకే యిప్పుడు Pass port వగైరాలలో నా పుట్టినతేదీ school final certeficate ప్రకారం 1919-జూలై-15 అని వుంటుంది.

నేను మా తాతయ్యగారి ఇంట్లో ఉండగానే ఎలిమెంటరీ స్కూల్లో చేరానని చెప్పానుగదా!

సాయంత్రం స్కూలు బయట అందర్నీ నిల్చోబెట్టి ఎక్కాలు అప్పజెప్పుకునేవాళ్లు! రెండు రెళ్ల నాలుగు - మూడు రెళ్ల ఆరు - యిలా ప్రతి ఎక్కం ఇరవై వరకూ అప్పజెప్పేవాళ్లం - ఇప్పుడు calculators వచ్చినాయిగా! ఇక ఎక్కాలు అవసరం ఉండదేమో!

అప్పుడు దక్షిణామూర్తిగారని - హెడ్ మాస్టరుగా వచ్చారు ఆయనకు స్పోర్ట్స్ అంటే ఇష్టం! సాయంత్రం స్కూలు వేళ అయిపోయిన తరువాత స్కూలు ముందు మైదానం వుండేది. ఆటలు ఆడించేవారు. చెడుగుడు వగైరాలు! బస్కీలు తీయించేవారు! పోటీలు పెట్టి బహుమతులు యిచ్చేవారు. బహుమతులంటే, పెన్సిళ్లు, రబ్బర్లు లాంటివి.

ఒకసారి బస్కీలలో అంటే గుంజీళ్లు ఫస్ట్‌ప్రయిజ్ కొట్టేయాలని - నేను అందరికంటే ఎక్కువ బస్కీలు తీసి ఫస్టు ప్రైజ్ గెల్చుకున్నాను! కాని, నడిస్తే పడిపోయేటంత strain అయింది. ఇంటికి వెళితే మా అమ్మ కాళ్లకు నూనె రాసి మర్దన చేసి వేడి నీళ్ల స్నానం చేయిస్తే రెండు మూడు రోజులకి గాని మామూలు స్థితికి రాలేదు.

మేము కొత్త ఇంట్లోకి వచ్చిన తరువాత కప్పగంతుల వెంకయ్యాగారని ఒక మేస్టారు వచ్చారు. భార్య పోయిందేమో ఒక్కరే స్కూల్లోనే ఒక పక్క వంట చేసుకుని ఉండేవారు. ఆయనకి కాఫీ అలవాటు. పొద్దున్నే మా అమ్మ నాతో ఆయనికి పాలు పంపించేది. ఆయన కాఫీ కాచుకొని - నాకు గూడ కాఫీ యిచ్చేవారు.





ఉప్పలపాటి రామరాజు (నాలుగో మామయ్య)

ఎలిమెంటరీ స్కూల్లో నాలుగోక్లాసు వరకే ఉండేది! అంతటితో చాలామంది కుర్రాళ్లు చదువుమానేసేవాళ్లు. ఎందుకంటె 5వ క్లాసు చదవాలంటే బెజవాడ రావాలి! బెజవాడలో అప్పుడు రెండు హైస్కూళ్లు ఉండేవి. హిందూ హైస్కూలు, మునిసిపల్ హైస్కూలు. పాత బస్తీలో - రైల్వేస్టేషన్ అవతల ఉండేది. ఆ రెంటికీ గవర్నరుపేటలో బ్రాంచీలు ఉండేవి.

కాని - పిల్లల్ని అంతదూరం పంపాలంటే తల్లిదండ్రులు ఇష్టపడేవాళ్లు గాదు. పైగా పిల్లల్ని చదివించాలని పట్టుదల గూడ ఉండేది కాదు!

ఎలిమెంటరీ స్కూలు చదువు అయిపోగానే నన్ను గవర్నరుపేట స్కూలుకి పంపడానికి దూరమని ఇష్టపడక నా వయసు గూడ 8-9 ఏళ్లు! అందుకని మా రాంమామయ్య ---

ఇక్కడ మరో విషయం చెప్పాలి! నా చదువుకి ముఖ్య కారకుడు - మా రాంమామయ్య. అంటే నాలుగో మామయ్య.

ఎందుకంటే మా పెద్దమామయ్య సుబ్బరాజుగారు అంటే నా ఆస్తి విభాగాలు చేయించి నా ఆస్తి పాస్తులన్నీ అజమాయిషీ చేయిస్తూన్న ఆయన - అప్పుడు ముత్యాలంపాడులో ఉండేవాడు కాదు! ఆయన నరసన్నపాలెం అత్తవారింటకి ఇల్లరికం వెళ్లాడు. నరసన్నపాలెం నిజానికి రికార్డుల్లో ఆ ఊరి పేరు సీతారాంపురం! దాని పక్కనే నరసన్నపాలెం అని చిన్నగ్రామం ఉండేది. రెండూ దాదాపు కలిసే ఉండేవి. దీన్ని రాజుగారి నరసన్నపాలెం అని గూడ అనేవాళ్లు. కారణం ఆస్తిపరులు అందరూ రాజులే.



పోస్టల్ అడ్రసు "సీతారాంపురం"! కానుమోలు హనుమాన్ జంక్షన్ నుంచి - గుడివాడ వెళ్లేరోడ్డులో ఉండేది. నరసన్నపాలెం - హనుమాన్‌జంక్షన్‌కు దగ్గరగా ఒకమైలు దూరంలో వుండేది.

అప్పుడు - హనుమాన్ జంక్షన్‌ను ఒట్టి జంక్షన్ అని మాత్రమే అనేవాళ్లు. ఆ తరువాత చాలా సంవత్సరాలకి ఉయ్యూరు రాజాగారు - అక్కడ హనుమాన్ విగ్రహం పెట్టిస్తే అప్పటి నుంచి హనుమాన్ జంక్షన్ అనే పేరు వచ్చింది. మా పెద్దమామయ్య - నరసన్నపాలెం అత్తవారింటికి ఇల్లరికం వెళ్లాడని చెప్పాగదా! ఆయన భార్య ఆమె తల్లిదండ్రులకి ఒక్కతే కూతురు. అందుకని ఆమె తండ్రి పోయిన తరువాత ఆస్తి మేనేజ్‌మెంటుకు అల్లుడు ఇల్లరికం వెళ్లాడన్నమాట!

అందువల్ల ముత్యాలంపాడులో నా చదువు సంధ్యలన్నీ మా నాలుగో మామయ్య రాంమామయ్య చూస్తుండేవాడు! మా రెండో మామయ్య ఆదిమామయ్య ఏదో వ్యాపారాల్లో తిరుగుతుండేవాడు. ఏంచేస్తుండేవాడో - బాగా జ్ఞాపకం లేదు!

మొత్తం మీద నా చదువు బాధ్యత రాంమామయ్యదే! నాకింకా చిన్నతనం గనక - గవర్నరుపేట పంపడం ఇష్టంలేక - మా రాంమామయ్య, సత్యనారాయణపురంలో మా కలప అడితీ పక్కనే శేషగిరిరావు గారిని - ఒకాయన ఉండేవాడు. ఆయన ట్రెయినింగ్ స్కూల్లో టీచరు. నన్ను ఆయన దగ్గర ట్యూషన్‌కి ఏర్పాటు చేశాడు మా మామయ్య.

ఆ శేషగిరిరావుగారు అద్దెకున్న ఇల్లు ముందే నేను 1941లో ఇల్లు కట్టాను. ఆ స్థలం నాపేర 1927 ప్రాంతంలో మా మేనమామలు కొన్నారు. సీతన్నపేట రైలుగేటు దాటిన తరువాత సత్యనారాయణపురంలో అంటే కాలవ ఒడ్డున ఇప్పుడు నీళ్ల టాంకు వుంది! ఆచోటులో అంటే కాలవ ఒడ్డున నాలుగు కలప అడితీలు ఉండేవి. అందులో ఒకటి మా తాతయ్యగారిది. అని యిదివరకే చెప్పాను గదా!

శేషగిరిరావుగారు - 10 గంటలకి స్కూలుకి వెళ్లాలిగదా! నేను 8 గంటలకి వెళ్లితే - ఒక గంటో, గంటన్నరో ట్యూషన్ చెప్పేవాడు.

ఇంగ్లీషులో 'ఏట్స్ రీడర్' (Yates Reader) అని వుండేది. దానితో ప్రారంభించాడు ఆయన!

కాని - ఆయన స్కూల్లో ఉద్యోగం చేస్తున్నందువల్ల నాకు ఉదయం గంటకంటే - ఎక్కువసేపు ట్యూషన్ చెప్పడానికి వీలయ్యేదిగాదు. అందుకని - ఆయన దగ్గర మాన్పించి మా మామయ్య నన్ను ఆ వీధి చివరనే మరో ప్రయివేటు స్కూలులో చేర్చాడు. అది ఒక మామిడి తోట! చుట్టూ ప్రహరీ గోడ వుండేది. లోపల చిన్నయిల్లు! అది ఎవరో ఒక కోటీశ్వర శర్మగారిదని గుర్తు! ఆ తోటలోని ఇంట్లో అద్దెకుంటూ మరొక పాక వేసి ఆపాకలో ఒక స్కూలు పెట్టాడొకాయన. ఆయన పేరు గొల్లపూడి వెంకటేశ్వర్లుగారు. అక్కడ నేను చదువుకున్నప్పటి క్లాస్‌మేట్స్‌లో - మల్లాది సూర్యనారాయణ అని ఒకతనుండేవాడు అతను తరువాత గొప్ప నటుడైనాడు. బాగా పాడేవాడు. హరిశ్చంద్రుడుగా చాలా పేరు సంపాదించాడు. ఏదో ఒక సందర్భంలో విశ్వనాథ సత్యనారాయణగారు అతని నటనను ఎంతో మెచ్చుకున్నాడు - ఒక సభలో ఉపన్యసిస్తూ.

ఆ స్కూల్లో ఇంకొక చెప్పుకోదగిన సహాధ్యాయి ఎవరంటే నా మొదటి సినిమా "పెద్దమనుషులు"కు సంగీత దర్శకుడు - ఓగిరాల రామచంద్రరావుగారు - ఆయన తమ్ముడు కృష్ణమూర్తి అని అతను నా సహాధ్యాయి! రామచంద్రరావుగారి చెల్లెలు పాపం చిన్నప్పుడే పెళ్లి చేస్తే భర్త పోయాడు. ఆమె కూడా మాతో చదివింది.



అక్కడ కొన్నాళ్లు చదివిన తరువాత అంటే 5వ క్లాసు అయిపోయిన తరువాత-

ముత్యాలంపాడులోనే మా రాంమామయ్య ఇంకా కొందరు ఊళ్లో పెద్దలు కలిసి - ఒక ప్రవేటు స్కూలు స్థాపించారు. దానికి లక్కరాజు శంకరావుగారనే ఆయన టీచరు. ఆయన మెడ ఒక పక్కకు పెట్టి నడిచేవాడు.

స్కూలు ఎక్కడంటే మా కొత్త ఇంటికి పక్కనే వలివర్తి కృష్ణంరాజుగారి యిల్లు! పెద్దా డాబా - పెంకుటిల్లు! ఆ ఇంటికి ఉత్తరం వైపు వరండాలో స్కూలు! దాదాపు పదిమంది విద్యార్థులు ఉండేవాళ్లు. నా కంటె ఒక క్లాసు సీనియర్లు - తిరుమలరాజు సత్యనారాయణరాజు 'సత్యం' అనేవాళ్లం - తిరుమలరాజు సుబ్బరాజు 'సుబ్బులు' అనే వాళ్లం! మిగతావాళ్లు - నా కంటె చిన్నవాళ్లు.

వలివర్తి కృష్ణంరాజుగారి మనవడు రాంమూర్తి అతనికి నత్తి! నత్తి రాంమూర్తి అనేవాళ్లం!

ముత్యాలంపాడు మోఖాసా గ్రామం. ఆ ఊరి పెత్తందారు - వానపాల సుబ్బరాజుగారు. ఆయనకు మగపిల్లలు లేరు. ఆయన తమ్ముడు బసవరాజుగారి మూడో కొడుకు వెంకట్రాముడు - నా కంటె ఏడాది చిన్నవాడు!

ఆ తరువాత వెంకట్రాముడు కూతురు వరలక్ష్మి - మా మేనల్లుడు పద్మరాజు కిచ్చిచేశారు. స్కూలుకి టైంకోసం ఒక గడియారం కావాలి గదా! నా దగ్గర Bigben Time పీస్ వుండేది. నేను తొట్టి స్నానం చేసినప్పుడు-కొన్నది! ఆ Bigben రోజూ స్కూలికి తీసుకెళ్లేవాణ్ణి! స్కూలు అయిపోగానే యింటికి తెచ్చుకునేవాణ్ణి. శంకరరావుగారు ఆ గడియారం అటు తిప్పి పెట్టేవాడు! మాకు 'టైం' కనబడకుండా, ఎందుకంటే ఎప్పుడైపోతుందా అని గడియారం వంకే చూస్తుంటే పాఠాలమీద దృష్టి ఉండదని!

ప్రార్థన భాగవతంలోనిదనుకుంటాను "ఒక సూర్యుండు - సమస్త జీవులకు తానొక్కడై ......" పద్యం చదివి-మా చేత Repeat చేయించేవాడు.

ఆయన సకుటుంబంగా ఉండడానికి కొత్తూరులో వేగేశిన సూరపరాజుగారి కాంపౌడ్‌లో ఒక తాటాకుల ఇల్లు వేయించి ఇచ్చారు. ఆయనకి ఇద్దరు కూతుళ్లు, ఒక కొడుకు ఉండేవారు! ఆ కొడుకు నాకు ఫోర్తుఫారంలో - హిందూ హైస్కూల్లో క్లాస్‌మేట్!

1931లో శంకరరావుగారు నన్ను గవర్నరుపేటలోని - హిందూ బ్రాంచి స్కూలులో థర్డుఫారంలో (III Form) చేర్పించారు. హిందూబ్రాంచి స్కూలు సెలక్షన్ గూడ మా రాంమామయ్యదే. గవర్నరుపేటలోనే మునిసిపల్ బ్రాంచి స్కూలు గూడ ఉండేది. దానికి హెడ్‌మాస్టరు బసవరాజు సుబ్బరావుగారు. ఆయన స్టేజి యాక్టరు. 'బొబ్బిలి యుద్ధం' నాటకంలో హైదర్‌జంగ్ వేషం వేసేవాడు. ఎందుకో - ఆయనంటే మా రాంమామయ్యకు సదభిప్రాయం ఉండేది కాదు. అందుకని నన్ను హిందూ బ్రాంచిలో చేర్చమని - శంకరరావుగారితో చెప్పాడు.

శంకరరావుగారు - నన్ను హిందూబ్రాంచిలో చేర్పించాడు. అక్కడ కొంత గోల్‌మాల్ జరిగింది. నేను నిజానికి థర్డ్‌ఫారానికి ఫిట్ కాదు. శంకరరావుగారు మాకు ఇంగ్లీషు, తెలుగు, లెక్కలు మాత్రమే చెప్పేవాడు గాని సైన్స్, హిస్టరీ, జాగ్రఫీ చెప్పేవాడు కాదు. అందుకని ప్రవేశపరీక్షలో నాకు అన్ని సబ్జక్టుల్లో మార్కులు బాగా రాలేదు. కాని, థర్డ్‌ఫారంలో చేర్చకపోతే తను సరిగా చదువు చెప్పలేదని అంటారేమోనని - స్కూలు హెడ్‌మాస్టరుతోనూ, ఇతర టీచర్లతో ఎలాగో మాట్లాడి స్టాండర్డు లేకపోయినా నన్ను థర్డ్‌ఫారంలో చేర్పించాడు. నాతోపాటు మరో విద్యార్థి - ఉప్పలపాటి సుబ్బరాజుగారి పెద్దకొడుకు రంగడని - వాణ్ణిగూడ స్టాండర్డు లేకపోయినా సెకండ్ ఫారంలో చేర్పించారు.



ఆ రంగడు ఎవరంటే - ఇప్పుడు ఉప్పటపాటి సత్యనారాయణరాజు అని ఉన్నాడే అతన్ని కౌన్సిలర్ సత్యం అని అంటారు. అతనికి అన్న ఆరంగడు. పాపం దాదాపు 20 ఏళ్లకే పెళ్లి కాకుండానే అకస్మాత్తుగా చనిపోయాడు రంగడు. సన్నగా వుండేవాడు. నాకంటె 6 నెలలు పెద్ద.

స్టాండర్డు లేకపోయినా - నన్ను థర్డ్‌ఫారంలో చేర్చినందువల్ల నాకు క్లాసులో చెప్పేపాఠాలు ఏమీ అర్థమయ్యేవి కాదు. ఇంగ్లీషు, తెలుగు ఫరవాలేదు గాని - మిగతా సబ్జక్టులు అర్థమయ్యేవికాదు. ముఖ్యంగా లెక్కలు! లెక్కలు మాస్టరు సాంబశివరావుగారని ఉండేవాడు. ఆయన వైశ్యుడు. ఆయనే స్కూలు రైటరు గూడ! అంటే స్కూలు జీతాలు వసూలు చేయడం వగైరాలు చూసేవాడు! ఆయన నన్ను చెవి మెలిపెట్టేవాడు లెక్కలు హోంవర్కు చెయ్యకపోతే! పైగా "నిన్ను సెకండు ఫారంలో చేర్చమంటే - నీ ప్రైవేట్ టీచరు వినలేదు" అని అనేవాడు!

ఆయన లెక్కలు రోజూ మొదట పీరియడ్‌లో ఉండేది. అందుకని ఆయన చేత చివాట్లు తప్పించుకోడానికి స్కూలుకు ఆలస్యంగా వెళ్లేవాడిని! ఎలా అంటే - మా అడితీలో అప్పుడు మా మామయ్యగారికి - ఒక జట్కావుండేది. నేను పొద్దున్నే అన్నం తిని, అడితీ మీదగా స్కూలుకు వెళ్లడానికి వెళితే - ఆ జట్కాతోలే సాయిబు ఒకడుండేవాడు! గుర్రానికి మాలీషు చేస్తూ! ఉండండి బాబూ! జట్కాలో వెళుదురుగాని అని ఆలస్యం చేసేవాడు. లెక్కలు క్లాసు తప్పుతుంది గదా అని నేను గూడ గుర్రం మాలీషూ అయ్యే దాకా - కూర్చుని జట్కాబండిలో ఆలస్యంగా స్కూలుకు వెళ్లేవాణ్ణి - అప్పుడప్పుడు.

అప్పుడు స్కూలు గంటలు - ఉదయం 7 గంటల నుంచి 10 గంటల వరకు. మళ్లీ స్కూలు 2 గంటలు నుంచి 5 గంటలవరకు.

అందువల్ల పొద్దున 6 గంటలకే నిద్రలేవాలి. బద్ధకంగా ఉండేది. మా అమ్మ నిద్ర లేపేది! నేను కునుకుపాట్లు పడుతుంటే నడిపించుకు వెళ్లి మా యింటి పక్కనే చిన్న అరుగు వుండేది. అరుగు మీద కూర్చో బెట్టి మొఖం కడుక్కోడానికి చెంబుతో నీళ్లు అందులో మొఖంపుల్ల పెట్టేది. నేను కునికి పాట్లు పడుతూ నెమ్మదిగా పళ్లు తోముకుంటుంటే "తొందరగా కానియ్ నాయనా!" అని బ్రతిమాలేది!

నాకెందుకో పొద్దున్నే చద్ది అన్నం పడేది కాదు. తింటే వాంతి అయేది! అందుకని మా అమ్మ 6 గంటలకే అన్నం వండేది. నిన్నటి కూరలు వేసి అన్నం పెట్టేది. కొన్నాళ్లు ఆవిరి కుడుం మినప కుడుంచేసి దాని మీద వెన్నపూస వేసి పెట్టేది.

పుస్తకాల సంచి భుజానవేసుకుని నేనూ రంగడూ నడచివెళ్లే వాళ్లం స్కూలుకి. అప్పుడు హిందూబ్రాంచి స్కూలు గవర్నరుపేటలో కమ్మహాస్టలు ఎదురు సందులో ఉండేది. ఆ తరువాత ఆ స్థలంకొని పాత డాబా పడగొట్టి ప్రముఖ వ్యాపారవేత్త చుండూరు వెంకటరెడ్డిగారు - అధునాతనంగా మేడకట్టాడు. మాచర్ల పాలిష్డ్ నాపరాళ్లు పరచి! ఆ బిల్డింగ్ చూడడానికి చాలామంది వెళ్లేవాళ్లు! అందులోనే ఆయన 'త్రిలింగ పీఠం' అనే సంస్థ స్థాపించాడు. అందులో కాంచనపల్లి కనకమ్మగారు ప్రముఖంగా పనిచేసేవారు! ఆమె 1940-41లో మదరాసులోని క్వీన్‌మేరీస్ స్త్రీల కళాశాలలో తెలుగు లెక్చరర్‌గా వుండేది. అప్పుడు మా బి.ఎ. తెలుగు పేపరు ఒకటి ఆమె దిద్దినట్లు జ్ఞాపకం!

మళ్లీ, నా బ్రాంచి స్కూలు చదువుకు వద్దాం! నాకు తరువాత తెలిసిన విషయం చెబుతాను!



లెక్కలు మాస్టారు - సాంబశివరావుగారు మా రాంమామయ్యకు ఒక ఉత్తరం రాసి కవరులో పెట్టి నా చేతికే యిచ్చాడు. ఆ ఉత్తరంలో ఏముందో నాకు తెలియదు!

ఆ మరునాడో మూడోనాడో మా రాంమామయ్య స్కూల్‌కి వెళ్లాడట! సాంబశివరావుగారు ఆయనతో నా విషయం చెప్పాడట! వద్దన్న కొద్దీ ప్రయివేట్ మాస్టరు శంకరరావుగారు నన్ను థర్డ్‌ఫారంలో చేర్చాడని - నేను పాఠాలు ఫాలో కాలేక యిబ్బంది పడుతున్నానని. అందువల్ల నన్ను సెకండు ఫారానికి షిఫ్టు చేద్దామనీ చెప్పాడట!

అందుకు మా రాంమామయ్య ఆలోచనలోపడి అలా మధ్యలో సెకండ్‌ఫారంకు - డిమోట్ చేస్తే నేను మానసికంగా బాధపడతానని చెప్పాడట. అందుకు సాంబశివరావుగారు గూడ ఒప్పుకుని నన్ను థర్డ్‌ఫారంలోనే ఉంచేందుకు - ఒకవేళ ఫైనల్ పరీక్షలో సరిగా మార్కులు రాకపోతే మళ్లీ అదే క్లాసు చదివించడం మంచిది అని వాళ్లిద్దరూ నిర్ణయించుకున్నారని నాకు చాలా సంవత్సరాల తరువాత మా రాంమామయ్య చెబితే తెలిసింది.

అందువల్ల నేను సంవత్సరం థర్డ్‌ఫారంలోనే కొనసాగి మళ్లీ మరుసటి సంవత్సరం గూడ థర్డ్‌ఫారమే చదివి, మంచి మార్కులతో ప్యాస్ అయ్యాను. రెండో సంవత్సరం నేను క్లాసు మానిటర్‌గా గూడ నియమించబడ్డాను. అంటే 1933లో థర్డ్‌ఫారం ప్యాసయి హిందూహైస్కూలు - పాతనగరం, కొత్తపేటలో ఉండేది. అందులో ఫోర్త్‌ఫారంలో చేరాను. నేను రెండో సంవత్సరం థర్డ్‌ఫారం చదివేటప్పుడు బ్రాంచి స్కూలు అంతకుముందున్న పాత బిల్డింగ్ నుంచి కొంచెం దూరంలో వున్న బిల్డింగ్‌కు మార్చారు.

మొదట ఉన్న పాత బిల్డింగ్ తరువాత చుండూరు వెంకటరెడ్డిగారు కొన్నారని చెప్పాగదా! కొత్తగా షిఫ్టుచేసిన బిల్డింగ్ చల్లపల్లి బంగళా (ఇప్పుడు ఆ స్థలంలో పెద్దహోటల్ కట్టారు) నుంచి రామమోహన్ లైబ్రరీకి పోయే రోడ్డు మొదట్లో ఉండేది.

స్కూలు ఏప్రిల్ నెలలో గూడ ఉండేది. ఎండలు ముదిరేవి. ముత్యాలంపాడు నుంచి మధ్యాహ్నం ఎండలో 2గంటలకి స్కూలుకి వెళితే బాగా దాహం వేసేది. రోడ్డు మీద మునిసిపల్ కుళాయిలో నీళ్లు వచ్చేవికాదు. ఆ వీధిలో ఉన్న ఇళ్లకి వెళ్లి తలుపు కొట్టేవాళ్లం! ఇంటివాళ్లు - మధ్యాహ్నం నిద్రపోతుండే వాళ్లు కొందరు విసుక్కుని కోప్పడేవాళ్లు. కొందరు చల్లని తల్లులు చల్లని మంచినీళ్లు ఇచ్చేవారు.

దగ్గర్లోనే గణపతి విలాస్ అని చిన్నహోటల్ ఉండేది. (అది 1950-60 ప్రాంతం వరకూ ఉన్నట్లు గుర్తు). గణపతి విలాస్‌కి వెళ్లి మంచినీళ్లు అడిగితే ఏదైనా తింటే గాని మంచినీళ్లు ఇచ్చేవాడు గాదు. అందుకని - ఒక ఇడ్లీ తిని రెండుగ్లాసులు మంచినీళ్లు తాగేవాళ్లం!

థర్డ్‌ఫారం రెండో సంవత్సరం నాకు బాగా మార్కులు వచ్చినాయి. చెప్పానుగదా - నన్ను మానిటర్ని చేశారని. సాంబశివరావుగారు గూడ నన్ను ఆదరంగా చూసేవాడు. నాతో పాటు రంగడు గూడ సెకండ్ ఫారం రెండో ఏడు చదివాడు ఆ సంవత్సరం రంగడుతో పాటు అతని మేనమామ కొడుకు తాడేపల్లి పేరేచర్ల సీతారాయుడు గూడ సెకండ్ ఫారం చదివాడు. నేను రంగడు కలిసి వెళ్లేవాళ్లం! స్కూలు విడిచేక గూడ ఇద్దరం కలిసి ఇంటికి వెళ్లేవాళ్లం! పేరేచర్ల సీతారాముడు మటుకు త్వరత్వరగా నడిచి ఇంటికి వెళ్లేవాడు.

(1932 వేసవికాలంలో అంటే థర్డ్‌ఫారం మొదటి సంవత్సరం అయిన తరువాత నాపెళ్లి అయింది! అప్పుడు నాకు 12 ఏళ్లు! నాభార్య అంటే మా పెద్దమామయ్య కూతురుకు 10 సంవత్సరాలు! పెళ్లి వివరాలు - తరువాత చెబుతాను.)



1933 జూన్‌లో నేను కొత్తపేటలోని హిందూ హైస్కూలులో ఫోర్త్‌ఫారంలో చేరాను. అప్పుడు నాకు ఒక క్లాసు సీనియర్ తిరుమలరాజు సత్యం. హైస్కూలు వేళలో బ్రాంచి స్కూలులాగ కాదు -10 గంటల నుంచి ఒంటిగంటదాకా! మళ్లీ 2 గంటల నుంచి సాయింత్రం 5 గంటల దాకా. మధ్య ఒక గంట లంచ్‌బ్రేక్!

నేనూ - తిరుమలరాజు సత్యంతో పాటు - తిరుమలరాజు, సుబ్బరాజు-సుబ్బులు అనే వాళ్లం. అతను మునిసిపల్ హైస్కూలులో చదివేవాడు! ముగ్గురం కలిసి ముత్యాలంపాడు నుంచి రైలుస్టేషన్ మీదుగా నడిచివెళ్లేవాళ్లం-ఒక చేతిలో భోజనం క్యారియర్ భుజానికి తగిలించిన పుస్తకాల సంచి సునాయసంగా ఆడుతూ పాడుతూ నడచి వెళ్లేవాళ్లం.

తిరుమల రాజు సత్యం - సుబ్బులు గూడ - నాతో పాటు ముత్యాలంపాడులో శంకరరావు దగ్గర చదివారు. నాకంటె ఒక ఏడాది పెద్దవాళ్లు!

నేను రోజూ స్కూలుకు నడిచి వెళుతుంటే పాపం మా తాతయ్య బాధపడేవాడు. నాకు సైకిలు కొనిపెట్టమని మా రాంమామయ్యకి పదేపదే చెప్పేవాడు. ఆ విషయం ఆయన అంతగా పట్టించుకునేవాడు.

సైకిలు ఆరోజుల్లో పాతిక - ముప్పయి రూపాయిలు! అందుకు డబ్బు - మా తాతయ్య ఇస్తాననేవాడు. ఆయన దగ్గర నా డబ్బు ఉండేది. ఎలాగంటే అంతకు ముందు సంవత్సరం - 1932లో నా పెళ్లి సమయంలో ఆయన నాకు 116లు చదివించారు. ఆ డబ్బు మా పెద్దమామయ్యకు ఇస్తే ఖర్చు పెడతాడని తనే తిరిగి తీసుకుని వడ్డీకిచ్చాడు. అప్పట్లో మా తాతయ్య ఊళ్లోవాళ్లకి నోట్లు రాయించుకుని వడ్డీకి అప్పులు ఇచ్చేవాడు. అలా రాయించుకున్న నోట్లు మూడేళ్లకి లిమిటేషన్ దాటి పోతే చెల్లదు! ఆయనకు చదువురాదు! అందుకని - అప్పుడప్పుడు నాచేత ఆనోట్లు ఎప్పుడు రాసిందీ యింకా ఎంత టైం వున్నదీ చదివి చెప్పమని ఇచ్చేవాడు నాకు అంతగా తెలీకపోయి మెల్లగా చదువుతుంటే నాచేతిలో నోటులాక్కుని నాకు "తెలుసులేపోయ్! ఇంకా ఏడాది టైం ఉందిలే!" అనేవాడు.

అంటే ఆయనకు ఏనోటు ఎప్పుడు రాసిందీ గుర్తుండేదన్న మాట! అలా నాకు పెళ్లిలో చదివించిన నూటపదహార్లు వడ్డీకి యివ్వగా అది 1933-34కి నూటనలభైరూపాయలు చిల్లర అయింది.

నూరు రూపాయలు పోను పైన వున్న 40 రూపాయలతో సైకిలు కొనిపెట్టమని మా రాంమామయ్యతో అదే పనిగా పోరగా ఆయన పోరు పడలేక కొనిపెట్టాడు (1935లో) ఆ సంవత్సరంలో బెజవాడ మునిసిపాలిటీ వాళ్లు ప్రధాన రోడ్లన్నీ తారురోడ్లువేశారు. అంతకుముందు కంకరరోడ్లే.

కొత్తగా వేసిన తారు రోడ్లు! కొత్త సైకిలు మధ్యాహ్నం ఒంటిగంటకు - స్కూలు వదిల్తే మళ్లీ రెండు గంటలకు స్కూలుకు రావాలి. ఈ గంటసేపట్లో నేను కొత్త సైకిలు! తారు రోడ్లు! స్పీడుగా ముత్యాలంపాడు వెళ్లి (రైల్వే స్టేషన్ వంతెన మీదుగా వెళ్లి) భోజనం చేసి మళ్లీ స్కూలుకు - 15నిముషాలు ముందు అంటే ఒంటిగంట 45 నిముషాలకు వచ్చేసేవాణ్ణి!

అప్పుడు హిందూ హైస్కూలు అసిస్టెంట్ హెడ్మాస్టరు నిష్టల నరసింహగారని ఉండేవాడు. ఆయన కారా కిళ్లీలు నమిలేవాడు. నేను మధ్యాహ్నం 1-45 స్కూలుకు రాగానే ఆయన నన్ను కారా కిళ్లీ తెచ్చిపెట్టమని - డబ్బు ఇచ్చి పంపేవాడు!



ప్రత్యేకంగా తయారు చేసిన ఆ కారాకిళ్లీ మా రోడ్డులో ఉన్న కిళ్లీ కొట్లోనే కొనాలి. కారాకిళ్లీ - తమలపాకు తిరగవేసి కట్టేవాళ్లు! అది గుర్తన్నమాట - అది కారాకిళ్లీ అని!

ఒకరోజు - నాకు కుతూహలం కలిగి యింకో కిళ్లీ కట్టించుకుని నోట్లోపెట్టుకుని సైకిల్ ఎక్కాను! మామూలు కిళ్లీ లాగానే - నమిలాను! పక్కవీధిలో ఆప్టికల్ షాపు ఉండేది! ఆషాపు దగ్గరకు వెళ్లేసరికి - కళ్లు తిరిగినాయి. సైకిల్ మీద నుంచి కింద పడ్డాను! లేచి ఒళ్లు దులుపుకుని రోడ్డు పక్కనే వున్న కుళాయి దగ్గరకు వెళ్లి నీళ్లు పుక్కిళించివూసి ముఖం కడుక్కుని సైకిలెక్కి స్కూలుకి వెళ్లాను. మాస్టారికి కారాకిళ్లీ యిచ్చాను! ఆయన నా ముఖం వంక చూచి "ఏమిట్రా! కళ్లు ఎర్రగా వున్నాయ్!" అన్నారు! "ఏం లేదు మాస్టారు" అన్నాను. "కొంపదీసి కారాకిళ్లీ నమిలావేమిటి?" అని పకపక నవ్వారు! నేను సిగ్గుతో తలవంచుకుని చిరునవ్వుతో వెళ్లిపోయాను!

నాకు సైకిల్ కొనిపెట్టక ముందు అంటే హైస్కూలులో ఫోర్త్‌ఫారం చదివేటప్పుడు నేనూ, ఒక ఏడాది సీనియర్లు తిరుమల రాజు సత్యం - సుబ్బులు - ముగ్గురం కలిసి టిఫిన్ క్యారియర్లు చేతబట్టుకుని నడిచివెళ్లేవాళ్లమని చెప్పానుగదా!

సత్యం - సుబ్బులు ఇద్దరి ఇళ్లు ముత్యాలంపాడులో మా తాతయ్యా గారి యింటి వెనక వుండేవి! నేను టిఫిన్ క్యారియర్ పుస్తకాల సంచీ తీసుకుని ముందు సత్యంగారి యింటికి వెళ్లేవాణ్ణి! ఇద్దరం కలసి పక్కనే ఉన్నా సుబ్బుల్ని పిలుచుకుని వెళ్లేవాళ్లం. సత్యం పంగనామాలు పెట్టుకునేవాడు. అతనికి పిలక వుండేది! ముందు క్రాపు వెనక పిలక!

సత్యం మేనమామ కనుమూరి సింహాద్రి రాజుగారని మునిసిపల్ కంట్రాక్టర్. ఆయనకు గూడ అలాగే పిలకవుండేది. ఆయన సత్యానికి ఆదర్శమన్నమాట! నాకూ అంతే! ఇప్పటికీ గూడ మా రాంమామయ్యాలాగ ధోవతి-లాల్చీతో పాటు కండువా గూడ ఆయన లాగానే మెడలో వేసుకుంటాను! నిజంగా మా రాంమామయ్యే నా ఎడ్యుకేషన్‌కు శరణ్యం! అందువల్ల ఆయనంటే నాకు అంత గౌరవం!

అసలు చెప్పదల్చుకున్న విషయం ఏమిటంటే స్కూలుకు టైం అయిందని హడావుడి పడే వాళ్లం. మా ఇంట్లోనే గడియారం ఉండేది. మిగతా వాళ్ల ఇళ్లలో గడియారాలు ఉండేవి కాదు. మా యింట్లో నైనా నేను తొట్టి స్నానం చేసేటప్పుడు కొన్న గడియారం అది. నేను టైం ప్రకారం స్కూలు పదిగంటలకు గదా తొమ్మిది గంటలకే సత్యంగారి ఇంటికి వెళ్లేవాణ్ణి! ఆ తరువాత సుబ్బుల్ని కలుపుకునే వాళ్లం. సుబ్బులు తండ్రి పేరు రామరాజు గారు! విచిత్రమయిన మనిషి. తన కొడుకు రెడీ కావడం ఆలస్యమైతే "ఇంకా చాలా టైవుంది రా! చూడు. నీడ ఇంకా ఇక్కడే ఉంది" అని తన నీడ చూపేవాడు! గడియారం లేనప్పుడు నీడలు చూచే టైం చెప్పడం!

ఒకవేళ తన కొడుకు ముందే రెడీ అయితే మేము వెళ్లేటప్పటికి ఆయన "ఏమిటి యింత ఆలస్యం! చాలాలేటు అయింది. చూడు నీడ ఎంత పొడుగుందో!" అనేవాడు. ఆయన్ని మొండేలు రామరాజు అనేవారు! ఆయనికి ఎప్పుడో ఎడం చేతి చూపుడు వేలు ఒక అంగుళం తెగి పోయింది. అందుకని మొండేలు రామరాజు అనేవారు! ఊళ్లో ఒకే పేరు గల వాళ్లు యిద్దరు ముగ్గురుంటే పేరుకు ముందు ఏదో తగిలించి పిలిచేవారు! మా తాతయ్య పేరు గూడ రామరాజు! ఆయనికి ఉబ్బసం! అందుకని ఆయన్ని దగ్గు రామరాజు అనేవారు! అలాగే యిద్దరు సుబ్బరాజులుంటే ఒకాయన్ని పొట్ట సుబ్బరాజు అనేవారు. అంటే పొట్ట ముందుకు పొడుచుకొచ్చేదన్నమాట!



మరో సుబ్బరాజుని మూతల కళ్లు సుబ్బరాజు అనేవారు! ఆయన కళ్లు ఎక్కువ సార్లు రెప్పలు వాల్చేవాడు. యింకొకాయన నక్షి వెంకట్రాజు! మరొక అప్పలరాజు పళ్లు గొగ్గిపళ్లు! ఆయన్ని ముక్కపళ్ల అప్పలరాజు అనేవాళ్లు! ఆయన భార్య సుబ్బమ్మ మా ఆయనకి ముక్క పళ్లయితే నన్ను గూడ ముక్కపళ్ల సుబ్బమ్మ అంటారేమిటి? అనేది.

కట్టమీద సూరపరాజు పాటిమీద నరసింహరాజు డాబా శేషంరాజు - తత్తర రాఘవరాజు - బట్టీల రామరాజు ఆయన ఇటుక బట్టీల వ్యాపారి దగ్గర గుమాస్తా పని చేసేవాడు. వొణుకు భద్రరాజు - ఆయనకి తల ఎప్పుడూ ఆడుతుండేది. బక్క సుబ్బరాజు! ఆయన చాలా సన్నంగా ఉండేవాడు. యిలా గమ్మత్తయిన పేర్లు వుండేవి!

ఇక్కడ నా హైస్కూలు చదువును గురించి కొంత చెప్పాలి!

ఇది - చదువుకున్న వాళ్లందరికీ అనుభవంలో వుండే విషయమే! ఒక్కొక్క టీచరు ప్రభావం విద్యార్థి మీద ఎంతో ఉంటుంది. బెజవాడ హిందూ హైస్కూలులో శిష్టా లక్ష్మీకాంతశాస్త్రిగారని మా తెలుగు టీచరు! ఫోర్తు ఫారం- ఫిఫ్తు ఫారం - స్కూలు ఫైనల్ మూడు క్లాసుల్లోనూ ఆయన మా సెక్షనుకు తెలుగు టీచరు!

నేను ఫోర్తు ఫారంలో ఉండగా మాది 'సి' సెక్షన్! బి.సి. సెక్షన్లకు - లక్ష్మీకాంతశాస్త్రిగారు తెలుగు చెప్పేవారు. ఫోర్తు ఫారం 'ఏ' సెక్షనుకు పువ్వాడ శేషగిరి రావుగారని ఆయన తెలుగు చెప్పేవాడు. ఆయన పద్యం బహుచక్కగా చదివేవాడు. మంచి కంఠం! ఆ సంవత్సరమే ఆయన బందరు కాలేజీకి - తెలుగు లెక్చరర్‌గా వెళ్లాడు. ఆయన గారి అల్లుడు రెండు మూడు సంవత్సరాల క్రితం అంటే 1999-2000 సంవత్సరాలలో హైదరాబాద్‌లో నాకు పరిచయమైనారు. ఆయన పేరు పూర్ణచంద్రరావు గారు. ఏదో కాలేజీ ప్రిన్సిపాలుగా రిటైరై - ఆ తరువాత యిప్పుడు గూడ ఆంధ్రమహిళాసభ సెక్రటరీగా పనిచేస్తున్నారు! ఆయన కలిసినప్పుడు తన మామగారు పువ్వాడ శేషగిరిరావు గారు వ్రాసిన పుస్తకాలు నాకిచ్చారు! అవి చూసి నేను చెప్పాను "మీ మామగారు - పువ్వాడ శేషగిరిరావుగారు మాకు హైస్కూలులో టీచరండీ" అని!

మళ్లీ 'హైస్కూలుకు' వెళదాం! హైస్కూలులో ఫోర్తు ఫిఫ్తు స్కూలు ఫైనలు మూడు క్లాసుల్లో లక్ష్మీ కాంతశాస్త్రిగారే మా తెలుగు టీచరని చెప్పాను గదా! ఆయన ముఖ్యంగా తెలుగు ప్రతిపదార్థాలు వ్యాకరణంలో సంధులు - సమాసాలు నూరిపోసేవాడు. తెలుగులో నాకు బాగా ప్రవేశం, ఆసక్తి ఉండేవి! అందువల్ల తెలుగులో నేను క్లాసులో ఫస్టుగా ఉండేవాణ్ణి!

ఆయన ప్రశ్నలు అడుగుతుండేవాడు. పాఠంలో ఏదైనా సంధో సమాసమో వస్తే అది ఏ సంధి? ఏ సమాసం అని క్లాసులో ఒక్కొక్కణ్ణి అడిగేవాడు. ఎవరూ చెప్పలేకపోతే నా దగ్గరికి వచ్చేసరికి - నన్ను తప్పించి నా పక్కవాణ్ణి అడిగేవారు. నేను చెప్పేస్తానని నన్ను తప్పించి అడిగేవాడు. క్లాసులో ఎవరూ చెప్పలేకపోతే ఆఖర్న నన్ను అడిగేవాడు. నేను చెప్పేసేవాణ్ణి!

ఒకసారి - నేను గూడ చెప్పలేకపోయాను. అప్పుడు ఆయన నన్ను చురచుర చూసి "క్లాసు అయిన తరువాత ఒకసారి 'స్టాఫ్' రూంకి రా!" అన్నాడు.

స్టాఫ్ రూంకి వెళ్లాను! ఆయన కోపంగా "ఏం? సైకిల్ రాగానే చదువు సన్నగిల్లుతోంది. సైకిల్ అమ్మేయమని- మీ మామయ్యతో చెప్పనా?" అన్నాడు. సరిగ్గా అవే మాటలు - నాకిప్పటికీ జ్ఞాపకం!





శిష్ట్లా లక్ష్మీకాంతశాస్త్రిగారు



చల్లా సత్యనారాయణ గారు

నేను "యీ ఒక్కసారే గదా నేను చెప్పలేకపోయాను మాస్టారూ! మిగతా వాళ్లు చాలాసార్లు చెప్పలేక పోయారు గదా!" అన్నాను.

"రాని వాళ్లకు ఎలాగూ రాదు! వచ్చిన వాడివి నీకేం రోగం?" అన్నాడు.

నిజంగా నాకు తెలుగులో ఉన్న ప్రావీణ్యానికి కారణం ఆయన అప్పుడు పెట్టిన భిక్షే! ఆ తరువాత మళ్లీ నేను మదరాసులో లయోలా కాలేజీలో బి.ఏ. చదివేటప్పుడు చల్లా సత్యనారాయణ గారు! ఆయన దయవల్లే నేను బి.ఏ. తెలుగులో ఫస్టక్లాసు (first rank) సంపాయించుకోగలిగాను - 1941 లో!

ఆయనే - ఆ సంవత్సరం ప్రఖ్యాత మాసపత్రిక 'భారతి' - అక్టోబరు సంచికలో నా ఫోటో గూడ వేయించారు.

ఆయన దాదాపు 88ఏళ్లు బ్రతికాడు. 1999లో అనుకుంటాను - ఆయన గుంటూరులో అవసానదశలో ఉన్నారని తెలిసి చూడడానికి వెళ్లాను. నాతోపాటు హైదరాబాద్ నుంచి జస్టిస్ చలమేశ్వర్ గూడ వచ్చారు.

నేను సత్యనారాయణగారికి లయోలా కళాశాలలో ఆయన రెండో 'బ్యాచ్' విద్యార్థి! జస్టిస్ చలమేశ్వర్ ఆయన గారి ఆఖరు బ్యాచ్ విద్యార్థి! యిద్దరమూ - మాస్టారికి ప్రియ శిష్యులమే! నేను 1936లో స్కూలు ఫైనల్ ప్యాసయి - హైస్కూలు వదిలిన తరువాత - లక్ష్మీకాంత శాస్త్రిగారు బెజవాడలోనే ఉన్నా ఆయన్ని ఎక్కువ సార్లు కలవలేదు.

నేను 1951లో సినిమారంగ ప్రవేశం చేసి రచయితగా కాస్త పేరుప్రఖ్యాతులు సంపాదించాను. తరువాత 1969లోనో -1970లోనో లక్ష్మీకాంత శాస్త్రిగారు మదరాసు వచ్చారు! ఆయన అల్లుడు - మేనల్లుడు ఎల్.వి.కె.వి.శర్మగారు మదరాసు ఐ.ఐ.టిలో మాథమెటిక్స్ ప్రొఫెసర్!

శాస్త్రిగారు తన కుమార్తెను చూడడానికి మదరాసు వచ్చి అల్లుడుతో అన్నాడట! "నరసరాజు నాకు హైస్కూలులో శిష్యుడు. అతను రాసిన నాటకాలు చూశాను! ఇప్పుడు సినిమాలలో గూడ రచయితగా అతను



రాసిన సినిమాలు గూడ చూస్తున్నాను! అతను నేను గర్వించదగిన శిష్యుడు! అతన్ని ఒకసారి చూడాలి!" అన్నారట. అప్పటికి ఆయన ఎప్పుడో రిటైరైనారు. శర్మగారు మామగారిని తీసుకుని మా యింటికి వచ్చారు!

నాకు ఎంతో ఆశ్చర్యమూ - ఆనందమూ! ఇల్లు వెతుక్కుని వచ్చారని! నమస్కరించాను!

మాటల సందర్భంలో ఆయన నన్ను 'మీరు' అని సంభోదించారు!

"మాస్టారు! అలా సంబోధించి నన్ను మీకు దూరం చేయకండి" అన్నాను.

ఆయన గ్రహించి "ఇప్పుడు నువ్వు పెద్దవాడివైనావు గదా" అన్నారు!

"ఎంత పెద్దవాణ్ణయినా ఎప్పుడూ మీ కంటె చిన్నవాణ్ణే! మాస్టారూ!" అన్నాను.

నా నాటకాలను గురించీ సినిమాలను గురించి చాలాసేపు ప్రశంసాపూర్వకంగా మాట్లాడారు! నా నాటకాలకూ సినిమాలకు వచ్చిన అవార్డులన్నిటికంటె ఆయన నోటి వెంట వచ్చిన నాలుగుమాటలు నా మనసులో నిలిచిపోయాయి!

గురుశిష్యుల మధ్యవుండే అనురాగం - అభిమానాలు ఆప్యాయతలు - విలువ కట్టలేనివి! జీవితాంతం మరువలేనివి! మరపురానివి!

హిందూహైస్కూలులో నేను 1933 నుంచి 36 వరకు ఫోర్తు - ఫిఫ్తు - సిక్స్ ఫారాలంటే 9, 10, 11వ క్లాసులన్నమాట! స్కూలు ఫైనల్ అంటే - 11వ క్లాసు. ఆ తరువాత కాలేజీలో యింటర్‌మీడియట్ రెండేళ్లు, బి.ఏ., రెండేళ్లు, ఎం.ఏ. రెండేళ్లు!

హిందూహైస్కూలులో నేను ఫోర్తు ఫారంలో 1933లో చేరేసరికి కొన్ని సబ్జక్టులలో తెలుగు మీడియం వచ్చేసింది. లెక్కలు మాత్రం ఇంగ్లీషులో ఉండేవి. సైన్సు, హిస్టరీ, జాగ్రఫీ తెలుగులో ఉండేవి.

హిందూ హైస్కూలులో మా క్లాసు టీచర్ల పేర్లు ఇప్పటికీ గుర్తున్నాయ్. ఫోర్త్‌ఫారం 'సి' సెక్షన్ క్లాస్ టీచరు రాజేశ్వరరావుగారు. ఆయనే లెక్కలు గూడ చెప్పేవారు.

ఫిఫ్త్‌ఫారం క్లాసు టీచరు - రాఘవయ్యంగారు. సిక్స్‌ఫారం అంటే స్కూలు ఫైనల్ క్లాస్ టీచరు - హెడ్‌మాస్టరుగారే. పేరు కొఠారు రామారావుగారు. ఇంగ్లీషు మాత్రం చెప్పేవారు. ఫిఫ్త్, సిక్స్ ఫారాలలో లెక్కలు కొత్తూరు ఉమామహేశ్వరరావుగారు చెప్పేవారు. స్కూలుఫైనల్‌లో మాది 'సి' సెక్షను. 'ఎ', 'బి' సెక్షన్సుకు లెక్కల మాస్టారు వల్లభరాయుడు గారు. నేను ఫిఫ్త్ - సిక్స్ ఫారాలలో ఉమామహేశ్వరరావు గారి దగ్గర ట్యూషన్ గూడ చదివాను. ఆయన మా రాంమామయ్యకి హైస్కూలులో క్లాస్‌మేటట. అందుకని - నన్ను ఆయన దగ్గర ట్యూషన్‌కు పెట్టాడు. ఈ విషయంలో గూడ మా రాంమామయ్య నా చదువును గురించి ఎంత శ్రద్ధ తీసుకునేవాడో తెలుస్తుంది.

ఉమామహేశ్వరరావుగారు - వల్లభరాయుడుగారు - కాశీనాధుని నాగేశ్వరరావుగారి మేడ వెనక - తెన్నేటివారి వీధిలో వుండేవారు. ఉమామహేశ్వరరావుగారి మేనల్లుడు తెన్నేటి భాస్కరరావు మునిసిపల్ హైస్కూలులో చదివేవాడు. అప్పటి నుంచీ నాకు అతనితో స్నేహం. భాస్కరరావు తండ్రి తెన్నేటి కృష్ణమూర్తి గారు మునిసిపల్ ఆఫీసులో పనిచేసేవాడు. వాళ్ల ఇంటిపేరే ఆ వీధికి పెట్టారు తెన్నేటివారి వీధి అని. భాస్కరరావు ఇప్పటికీ ఆ ఇంట్లోనే ఉంటున్నాడు అతను ఇప్పుడు సీనియర్ అడ్వకేట్! రెండుమూడేళ్ల క్రితం విజయవాడ వెళ్లినప్పుడు అతన్ని ఇంటికి వెళ్లి చూశాను. 1999లో తుమ్మలపల్లి కళాక్షేత్రం విజయవాడలో ఒక సాంస్కృతిక సమాజం వాళ్లు నాకు సన్మానం



చేశారు. అప్పుడు భాస్కరరావు వేదిక మీదకి వచ్చి - నా మెడలో పూల మాలవేశాడు. అంటే దాదాపు 70 ఏళ్లనాటి స్నేహం!

అప్పటి స్నేహితుల్లో యిప్పటికీ విజయవాడలో ఉన్న మరో స్నేహితుడు - నా క్లాస్‌మేట్ నంబూరు హనుమంతరావు! అతను ఆయుర్వేద వైద్యులు - రిసర్చ్ చేసి చాలా డిగ్రీలు బహుమతులు పొందాడు. ఆలిండియా లెవల్‌లో!

ఫిఫ్తుఫారంలో మా క్లాస్‌టీచరు రాఘవయ్యం గారని చెప్పానే ఆయన విచిత్రమైన వ్యక్తి. ఆయన అసలు తమిళుడు. పొట్టిగా వుండేవాడు. ఖద్దరుధోవతి, ఖద్దరుకోటు, ఖద్దరు తలపాగా! ఎప్పుడూ కారాకిళ్లీలు నమిలేవాడు. బీడీలు కాల్చేవాడు. స్కూలుకు దగ్గరలోనే ఆయన నివాసం. యింటి దగ్గర బీడీ వెలిగించి స్కూలు గేటు ముందు మురికికాలవలో పారేసి స్కూలులోపలికి వచ్చేవాడు.

ఆయన తెలుగులోనూ, సంస్కృతంలోనూ ఎం.ఏ.! ఎందుకో మరి ఆయన్ని తెలుగులో గాని సంస్కృతంలో గాని టీచరుగా వేయలేదు.

ఆయన మాకు ఇంగ్లీషు - హిస్టరీ చెప్పేవాడు. హిస్టరీ తెలుగులోనే ఉండేదని చెప్పాగా! హిస్టరీ టెక్స్ట్‌లో నాలుగు పేజీలు చదివించేవాడు ఒక స్టూడెంట్‌తో! అంతే!

"వివరంగా ఎక్స్‌ప్లెయిన్ చెయిరేం మాస్టారూ?" అంటే "తెలుగులో వుంటే ఇంకా చెప్పేదేమిట్రా చదువుకోండి" అనేవాడు. ఏవేవో కబుర్లు చెప్పేవాడు. మొఖానపంగనామాలు పెట్టుకునేవాడు. మా క్లాసులో రంగాచారి అని వుండేవాడు. వాడు నామాలు పెట్టుకునేవాడు కాదు. అయ్యంగారు వాణ్ణి తిట్టేవాడు.

విశేషం ఏమిటంటే ఆయన రాసిన లక్షణగ్రంథం 'కావ్యాత్మ' ఎం.ఏ.కి టెక్స్ట్‌బుక్‌గా పెట్టారు. ఆయన కొడుకు వెంకటాచారి నా క్లాస్‌మేట్. వాడికి సెకండ్ లాంగ్వేజి ఉరుదు! వెంకటాచారి నాకు ఇంటర్‌లో గూడ (గుంటూరు హిందూకాలేజీలో క్లాస్‌మేట్! హాస్టల్లో రూంమేట్, తరువాత ఎమ్.ఎస్.సి లక్నోలో చదివాడు. తరువాత రాఘవయ్యంగారు గాంధీనగరులో హిందూబ్రాంచీ స్కూలు హెడ్ మాస్టరుగా వచ్చాడు. 1942 ప్రాంతంలో రిటైరై - పూర్ణానందం పేటలో వుండేవాడు. వాత్సాయనుడి కామసూత్రాలు తెలుగులోకి అనువదించాడు. గొప్పపండితుడు. సాయింత్రం పూట ఏలూరు కాలవ ఒడ్డున వున్న 'డౌలీ' పార్కుకు వచ్చేవాడు. ఇప్పుడు దానికి కాశీనాధుని నాగేశ్వరరావుగారి పేరు పెట్టారనుకుంటా!

ముత్యాలంపాడులో నేను మొట్టమొదటి గ్రాడ్యుయేట్‌ని! మా మేనమామలు అప్పుడు పాత నగరంలో వున్న సి.యం.యస్ హైస్కూలులో చదివారు. హైస్కూలు చదివే!

ఆ రోజుల్లో ముత్యాలంపాడులో రాజుల కుటుంబాలకు భూములువుండేవి గనక - వ్యవసాయం తప్ప పై చదువులపై ఆసక్తి ఉండేదికాదు. "ఆఁ! చదివేం చేస్తావేం! ఉద్యోగాలు చేస్తావా? ఊళ్లేలతావా?" అనే సామెత ఉండేది రైతు కుటుంబాల్లో!

మా నాలుగో మేనమామగారు - రామరాజుగారు చొరవతీసుకుని నాకు ప్రయివేటులు ఏర్పాటు చేసి ఊళ్లోనే శంకరరావుగారి చేత స్కూలు పెట్టించి - నన్ను హిందూబ్రాంచి హైస్కూళ్లలో చేర్పించ బట్టిగాని మిగతా వాళ్లలాగానే "ఆఁ! చదివింది - చాల్లే!" అని అంటే నా చదువు గూడ అంతటితో ఆగిపోయేది!



నేను చదవడం గూడ ఏదో పై చదువులు చదవాలనే పట్టుదలతో చదివిందిగాదు! ఒక క్లాసు ప్యాస్ అయినాను గనక తరువాత క్లాస్ చదవడం!

అప్పుడు హిందూ బ్రాంచి స్కూల్లో, స్కూలు ఫీజు నెలకు రెండురూపాయల ముప్పావలా! అప్పుడు యిప్పటిలా రూపాయిలు పైసలు గాదు. రూపాయిలు - అణాలు - పైసలు వుండేవి!

రూపాయికి 16 అణాలు - అణాకు 6 పైసలు. 3పైసలు ఒక కాణీ! రెండు కాణీలు అర్థణా! రెండు అణాలు బేడా! నాలుగణాలు పావలా! 8 అణాలు అర్ధరూపాయి! యిలా వుండేవి! ఎక్కువగా నాణాలే! కాగితపు కరెన్సీ లేదు!

హైస్కూలులో - ఫోర్త్ - ఫిఫ్త్ - సిక్స్‌ఫారాలకు ఫీజు నెలకు అయిదు రూపాయల పావలా!

స్కూలు ఫైనల్ పరీక్షలు 1936లో రాశా! రిజల్ట్స్ వచ్చే దాకా తరువాత చదవాలనే ఉద్దేశం వుండేది కాదు. స్కూలు ఫైనల్ ప్యాస్ అయ్యా గనక పై చదువు చదవాలని అనుకోవడమే!

మా మేనమామలకి కలప వ్యాపారం ఉండేదని చెప్పానుగదా! నా భూములమీద వచ్చే ఆదాయం కలప అడితీ ఎక్కౌంటులో నాపేర జమ రాసేవారన్నమాట! మాకుటుంబం ఖర్చులకు - మా అమ్మకు యిచ్చేడబ్బు ఖర్చు రాసేవాళ్లు! నా స్కూలు ఫీజు గూడ అడితీలో తీసుకుని స్కూల్లో కట్టేవాణ్ణి!

స్కూలు ఫైనల్ ప్యాస్ అయిన తరువాత నన్ను ఇంటర్ మీడియట్ చదివించాలని - మా రాంమామయ్య ఉద్దేశం. ఆయన అప్పటకే కొత్త పద్ధతిలో వ్యవసాయం చేస్తుండేవాడు. గవర్నమెంటు అగ్రికల్చరల్ డిపార్టుమెంటు వాళ్లు కొత్త వంగడాలు ప్రయోగాలు చేయాలంటే వాళ్లకు ఆ అభిరుచి వున్న రైతులు కావాలిగా!

అలా - మా రాంమామయ్యకి అగ్రికల్చరల్ డిపార్ట్‌మెంట్‌తో పరిచయం ఉండేది. నన్ను - అగ్రికల్చరల్ బి.యస్.సి చదివించాలని మా రాంమామయ్య ఉద్దేశం.

కాలేజి చదువు గురించి చెప్పే ముందు - స్కూలు ఫైనలుకు సంబంధించిన గమ్మత్తయిన విషయం ఒకటి చెబుతాను.

1936 మార్చిలో స్కూలు ఫైనల్ పరీక్షలు జరిగినాయి. ప్రతిరోజు ఒక్కో సబ్జక్టులో పరీక్ష జరిగేది. ఆ సబ్జక్టుకు సంబంధించిన పుస్తకాలు స్కూలుకు పట్టుకెళ్లేవాళ్లం. దోవలోగాని, పరీక్షరూంలోకి వెళ్లే ముందు ఏ కాస్త టైం దొరికినా ఆఖరి నిముషం చదువు కోసం!

ఆరోజు పరీక్ష అయిపోగానే తిరిగి ఇంటికి వచ్చేటప్పుడు రైలు స్టేషన్ ఇవతల ఏలూరు కాలవమీద వంతెన ఉండేది. (అప్పుడు ఒక వంతెన ఉండేది. ఇప్పుడు రెండో వంతెన కట్టినట్టున్నారు.)

ఆ రోజు పరీక్ష అయిపోయింది గదా ఆ సబ్జక్టు పుస్తకాలతో పనితీరిపోయింది గదా అని - ఆ పుస్తకాలు వంతెన మీద నుంచి కింద కాలువలోకి విసిరిపారేసే వాళ్లం. అంటే స్కూలుఫైనల్ తప్పక ప్యాస్ అవుతాం కదా అని ధైర్యం! ఒకవేళ తప్పితే - కొత్త పుస్తకాలు కొనుక్కోవచ్చుగదా! అలా అన్ని పుస్తకాలు కాలువలో పారేశాను.

తరువాత - ఆ సంవత్సరం వేసవి సెలవలకి అప్పుడు నెల్లూరు జిల్లా ఇప్పుడు ప్రకాశంజిల్లాలో వీరేపల్లి అని- కందుకూరు తాలూకాలో మా బంధువుల ఊరు ఉంది. మా మేనమామ రాంమామయ్యగారి ఇద్దరు మరదళ్లని ఇచ్చారు ఆ ఊళ్లో.



తులశమ్మ - సత్యనారాయణమ్మ అని వాళ్లపేర్లు. ఆ ఊళ్లో వేసవి కాలం చల్లగా వుంటుంది. సముద్రానికి దగ్గర గనక మా రాంమామయ్య చిన్న మరదలు - సత్యనారాయణమ్మ. నాకు చాలా క్లోజ్‌గా ఉండేది. 'అన్నయ్యా' 'అన్నయ్యా' అంటూ ఎంతో చనువుగా ఉండేది. నాకంటె రెండేళ్లు చిన్నది. అదే నేను ఆ ఊరికి మొట్టమొదటిసారి వెళ్లడం.

మా మామయ్య పెద్దతోడల్లుడు కోటలరాజు గారి తమ్ముడు నరసరాజు - నా వయసువాడు. మాకిద్దరికీ సావాసం! జతగా తిరుగుతూండేవాళ్లు!

నేను ఆ ఊళ్లో ఉండగా స్కూలు ఫైనలుకు రిఎగ్జామినేషన్లు - అంటే మళ్లీ పరీక్షలు పెడతారని - ఒక వార్త వచ్చింది. ఎందుకంటే - ఆ సంవత్సరం - స్కూలు ఫైనల్ పేపర్లు గుంటూరులో 'లీక్' అయినాయి! అవి తెల్లవారేసరికి బెజవాడ వచ్చేవి. నా పరిస్థితి ఏమిటంటే నాకు మా లెక్కల మాస్టారు ఉమామహేశ్వరరావు గారి వద్ద ట్యూషన్ గదా! రాత్రి పూట ఆయన యింటికి తెన్నేటివారి వీధి (గాంధీనగర్)కు వెళ్లి రాత్రిపూట చదువుకుని-ఉదయమే లేచి ఇంటికి వెళ్లి టిఫిన్-స్నానం ముగించుకొని పరీక్షకువెళ్లే వాణ్ణి! స్కూలుకి వెళ్లిన తరువాత - అక్కడ చెప్పేవాళ్లు. తోటిక్లాస్‌మేట్స్ కొందరు పొద్దున పేపరు 'లీక్' అయిందని! అదీ పరీక్షరాసిన తరువాత చెప్పేవాళ్లు! మా మాస్టారేమో బయటికి పోనిచ్చేవారు గాదు. పొద్దున్నే రైలులో గుంటూరు నుంచి వస్తుంది పరీక్ష పేపరు! ప్రతిరోజు పేపరు 'లీక్' అవుతున్నా నాకు ప్రొద్దున్నే ట్యూషన్ నుంచి - బయటికి పోయే ఛాన్సులేదు. గనక నాకు ఒక్కపేపరు గూడ ముందుగా తెలియలేదు. అయినా పేపర్లన్నీ నేను బాగానే రాశాను గనక దిగుల్లేదు.

గుంటూరులో కుర్రాళ్లు ఆ క్రితం రోజు పేపరు 'లీక్' అయితే ఆ పేపరు తీసుకెళ్లి గుంటూరు హైస్కూలు హెడ్మాస్టరు ఇంటి తలుపుకు అంటించే వాళ్లు! కుర్రతనమన్న మాట! "మేం ఎంత ఘనులమో చూడమని" గొప్పకోసం! అన్నీ కరెక్ట్ పేపర్లే లీక్ అయినయ్. అది దృష్టిలో వుంచుకొని మళ్లీ 'రీగ్జామినేషన్! పెట్టాలని విద్యాశాఖవాళ్లు నిర్ణయించారు. నాకు గుండెల్లో రైళ్లు పరుగెత్తాయి. పుస్తకాలన్నీ - పరీక్షలు కాగానే ఏలూరు కాలవలో పారేశాను గదా! ఇక ఆ ఊరు నుంచి బయలుదేరి బెజవాడ రావాలనుకుంటుండగా ఒక శుభవార్త వచ్చింది. ఏమిటంటే రీఎగ్జామినేషను గుంటూరుకు మాత్రమే గాని బెజవాడకు లేదు - అని! నాకు పెద్దరిలీఫ్! లేకపోతే మళ్లీ ఆ పుస్తకాలన్నీ సేకరించుకోవలసి వచ్చేది!

రిజల్ట్స్ వచ్చినాయి! నేను ప్యాసయినాను! ఇక తరువాత చదువు విషయానికి వస్తే మా రాంమామయ్యకు నన్ను అగ్రికల్చరల్ బి.యస్.సి. చదివించాలని ఉందని చెప్పాగదా!

అప్పుడు మదరాసు ప్రెసిడెన్సీలో అగ్రికల్చరల్ కాలేజీ ఒకేచోట కోయంబత్తూరులో ఉండేది.

అగ్రికల్చరల్ బి.యస్.సి. చదవాలంటే ముందు ఇంటర్మీడియట్‌లో 'బోటనీ' ఉండాలి. ఆ క్రిందటి సంవత్సరమే అంటే 1935లో బెజవాడలో యస్.ఆర్.ఆర్. కాలేజి ప్రారంభించారు! కామర్సు మాత్రమే గాని సైన్స్ సబ్జక్టు లేవనుకుంటా!

గుంటూరు హిందూ కాలేజీలోనూ బందరు హిందూ కాలేజీలోనూ 'బోటనీ' ఉందని తెలిసింది. గుంటూరు మావూరు తాళ్లూరుకు దగ్గరగదా అని - మా రాంమామయ్య గుంటూరు హిందూకాలేజీలో చేరమన్నాడు. ఆయన ముందు గుంటూరు వెళ్లి ఎంక్వయిరీ చేసి వచ్చాడు.



గుంటూరు హిందూ కాలేజి గూడ ఆ క్రితం సంవత్సరమే అంటే 1935లో ప్రారంభించారు! మొదటి సంవత్సరం కామర్స్ మాత్రమే పెట్టారు. రెండో సంవత్సరం సైన్సు, ఫిజిక్స్, కెమిస్ట్రీ, బాటనీ పెట్టారు. మొదటి సంవత్సరం హిందూకాలేజి కొత్తపేటలో ఓల్డ్‌బ్యాంక్ బిల్డింగులో ప్రారంభించారు! హాస్టలు గూడ అందులోనే ఉండేది.

ఇప్పుడున్న బిల్డింగు రెండో సంవత్సరానికి తయారయింది. ఆ కొత్త బిల్డింగ్‌లో 'గృహప్రవేశం' చేసిందిమా బ్యాచ్ అన్నమాట! సైన్సు ఫస్ట్ బ్యాచ్! కాలేజి రెండోబ్యాచ్! హాస్టల్ మటుకు ఓల్డ్ బ్యాంక్ బిల్డింగ్‌లోనే ఉండేది కొత్తపేటలో అది చాలా పాత బిల్డింగ్! ఎంత పాతది అంటే వర్షానికి గోడలు తడిస్తే ఎలక్ట్రిక్ షాకులు కొడుతుండేవి.

విశేషమేమిటంటే హాస్టల్లో భోజనాలు బ్రాహ్మణులకు వేరుగాను - బ్రాహ్మణేతరులకు వేరుగానూ పెట్టేవాళ్లు. బ్రాహ్మణుల కుర్రాళ్లు కిచెన్‌లోనూ మిగతావాళ్లు ఇవతల హాల్లో కూర్చుని తినేవాళ్లు! నేను ఇంటినుంచి పొరుగూరు వెళ్లి ఉండడం అదే మొదలు గదా! ఎలక్ట్రిక్ లైట్లు కింద చదవడం గూడ అదే మొదలు. అప్పటికి ముత్యాలంపాడులో ఎలక్ట్రిసిటీ లేదు. బెజవాడ మునిసిపాలిటీలో చేరలేదు గనక - ముత్యాలంపాడులో నేను చదువుకున్నది కిరసనాయలు లాంతరు వెలుతురులోనే! ముత్యాలంపాడుకు ఒక ఫర్లాంగు దూరంలో బెజవాడ మునిసిపల్ వీధి దీపాలు ఉండేవి!

1936 జూన్‌లో మా రాంమామయ్య వచ్చి నన్ను హాస్టల్లో చేర్చి వెళ్లాడు. హాస్టల్లో నా రూంమేట్ వెంకటాచారి! హైస్కూలులో టీచరు రాఘవయ్యగారి కొడుకు. హాస్టల్లో సాయంత్రం పూట క్యారంబోర్డు ఆడుకునేవాళ్లం!

హైస్కూలులోగాని, కాలేజిలోగాని అటెండెన్స్ నాకు ఎప్పుడూ హండ్రెడ్ పర్సెంట్! ఎప్పుడూ కాలేజి ఎగ్గొట్టేవాణ్ణిగాదు. క్లాసులో పాఠం శ్రద్ధగా వినేవాణ్ణా లేదా అనేది అనుమానమే. అది పాఠం చెప్పే టీచర్ని బట్టి వుంటుందండీ తెలుగు క్లాసులో బాగా అల్లరి చేసే వాళ్లం!

ఇక్కడ ఒక విషయం చెప్పాలి. టీచర్స్‌లో ఒకసారి గనక పిల్లలు అల్లరి చేసి టీచర్ని చులకనగా చూస్తే యిక ఆ టీచరు గతి - ప్రతి సంవత్సరం అంతే!

కాలేజిలో తెలుగు లెక్చరర్ పాపం చాలా మంచివాడు. మందలపర్తి ఉపేంద్రశర్మగారు. తెలుగు ఎం.ఏ. బాగా చదువుకున్నవాడు. కాని, కుర్రాళ్లను క్లాసులో మేనేజి చెయ్యడమనేది అదొక ఆర్ట్! కేవలం పాఠం చెప్పడమే గాదు!

బెజవాడ హిందూ హైస్కూలులో తెలుగు మాస్టారు లక్ష్మీకాంతశాస్త్రిగారని చెప్పానే ఆయనంటే స్టూడెంట్స్‌కి హడల్! తెలుగు మాస్టర్‌కి స్టూడెంట్స్ అంతగా భయపడడమనేది అక్కడే చూశాను. ఎవడన్న స్టూడెంట్ అల్లరిచేసి ఎదురు తిరిగితే జుట్టుపట్టుకుని ఆ చెంపా యీ చెంపా వాయించి వదిలి పెట్టేవాడు.

అలాంటిది గుంటూరు హిందూ కాలేజిలో తెలుగు లెక్చరర్ ఉపేంద్ర శర్మగారి కథ వేరు. మాకు ముందు బ్యాచ్ వాళ్లు ఎందుకో ఆయన క్లాస్‌లో తెగ అల్లరి చేసేవాళ్లు! అదిచూసి మేము గూడ ఆయన క్లాసులో అల్లరిచేసేవాళ్లం. అప్పుడు కొత్తగా 'బాటా' చెప్పులు వచ్చినై! వాటికి కింద హీల్ గుర్రపునాడాలాగ 'హాలో'గా వుండేది. నేలమీద కొడితే టపటపమని శబ్దంవచ్చేది! ఆయన పాఠం చెబుతుంటే పిల్లలు గలగల మాట్లాడుతుండేవాళ్లు. పిల్లల గోల కంటె బిగ్గరగా ఆయన పాఠం చెప్పేవాడు!

మొత్తం మీద ఆయనకు క్లాసు మేనేజ్ చేయడం చేతయ్యేది కాదు. మేము సీనియర్లయ్యేటప్పటికి మా జ్యూనియర్లు మమ్మల్ని చూసి ఆయన క్లాసులో అల్లరి చేసేవాళ్లు.



మాకు రెండేళ్లు అయిన తరువాత పరీక్షల ముందు ఒకసారి ఆయన కళ్లనీళ్ల పర్యంతమై "నేను మీకు ఎంతో బాగా చెప్పాలనుకున్నాను! చెప్పలేకపోయాను" అన్నారు బాధతో! మేము గూడ బాధపడ్డాం-అల్లరి చేసినందుకు! చాలా సంవత్సరాల తరువాత ఆయన రిటైరైనాకనో అయ్యేముందో చాలా సోషల్ సర్వీస్ చేసి చాలా మంచి పేరు తెచ్చుకున్నాడని విన్నాను.

జనరల్ హాస్పిటల్‌కు వెళ్లి రోజు సాయింత్రం పేషంట్లకి భారతభాగవతాలు - భగవద్గీత వగైరాలు చదివిచెప్పేవాడట! హిందూ కాలేజీలో మాకు ప్రిన్సిపాల్ బుద్ధిరాజు రామచంద్రరావుగారు. ఆయన అంతకుముందు పక్కనే వున్న టవున్ హైస్కూలు హెడ్మాష్టరు. టవున్ హైస్కూలు చాలా పురాతనమైనది. ఆ కమిటీవారే హిందూ కాలేజి స్థాపించి టవున్ హైస్కూలు పేరు హిందూ కాలేజి, హైస్కూలుగా మార్చారు. మాకు ఇంగ్లీషు లెక్చరర్ వల్లభజోస్యుల సుబ్బారావుగారు. ఆయనే హాస్టలు వార్డన్ కూడ. ఆయన ఇల్లు కొత్తపేటలో యడవల్లివారి సత్రం ఎదురుగా ఉండేది. రామచంద్రరావుగారి తరువాత వల్లభజోస్యుల సుబ్బారావుగారు కాలేజి ప్రిన్సిపాల్ అయ్యాడు. మామూలుగా ఎక్కువ మార్కులు వచ్చిన కుర్రాళ్లకే కాలేజీలో ఎడ్మిషన్‌లు ఇస్తారు. కాని - యావరేజ్ మార్కులు వచ్చి ప్యాస్ అయితే చాలు సుబ్బారావుగారు సీటు యిచ్చేవాడు. మిగతా లెక్చరర్లు ఎవరైనా బ్రైట్ స్టూడెంట్స్‌కే అడ్మిషన్ ఇవ్వాలని అంటే-

"బ్రైట్ స్టూడెంట్సుకు - నువ్వు చెప్పక్కర్లేదు. వాడే చదువుకుంటాడు. యావరేజి స్టూడెంటికి పాఠాలు చెప్పి-ఫస్టుక్లాసు తెప్పిస్తేనే టీచరు ప్రతిభ" అనే వాడాయన!

బుద్ధిరాజు రామచంద్రరావుగారు టౌన్‌హైస్కూలు హెడ్మాష్టరుగా ఉన్నప్పుడు ఆయన్ను గురించి కథలు చెప్పుకునేవారు. ఆయనంటె స్టూడెంట్స్‌కి హడల్! ఆయన పొట్టిగా ఉండే వాడు. స్టూడెంట్స్ ఎవరైనా సెకండ్ బెల్ కొట్టిన తరువాత ఆలస్యంగా స్కూలుకు వస్తే - ఆయన గేటు దిమ్మ చాటున నిలబడి లేటుగా వచ్చిన కుర్రాళ్లని బెత్తంతో చితకబాదేవాడట!

ఆయన ప్రిన్స్‌పాల్ అయిన తరువాత కుర్రాళ్లతో బాగా చనువుగా ఉండేవాడు. కుర్రవాళ్లు ఎవరైనా. కాలేజీ ఫీజు సమయానికి కట్టకపోతే ఆయన ఆ స్టూడెంటు ఇంటికి వెళ్లి స్టూడెంటు తల్లిదండ్రులతో "ఏమిటయ్యా! ఇంకా ఫీజు కట్టలేదు! త్వరగా కట్టండి" అని చెప్పేవాడు. ఆయన్ని మేము అడిగేవాళ్లం "మాస్టారూ! మీరు హెడ్మాష్టరుగా ఉండగా - కుర్రాళ్లని కొట్టేవారట! ఇప్పుడు కొట్టడంలేదేం?" అని! అంటే ఆయన "ఇప్పుడు వెధవలు, మీరు దున్నపోతుల్లా పెరిగారు! నేను కొడితే ఊరుకుంటారా? తిరిగి కొడతారు!" అనేవాడు నవ్వుతూ!

ఆయన ఖద్దరు కట్టేవాడు. ఖద్దరు ధోవతి, ఖద్దరు చొక్కా, కోటు, ఖద్దరు తలపాగా! ఆయనకు ఒకటే కన్ను పాపం రెండోకన్ను పోయింది. బహుశా - మశూచికం వల్లనో ఏమో తలియదు.

1942 మూవ్‌మెంట్‌లో కాలేజీలో కొందరు కమ్యూనిస్ట్, కాంగ్రెస్ పార్టీలకు చెందిన యూనియన్ విద్యార్థులు ఉండేవారు! పోలీసులు వాళ్లను అరెస్టుచెయడానికి వస్తే "వీల్లేదు! పోలీసులు కాలేజీ కాంపౌండ్ లోపల అడుగు పెట్టడానికి వీల్లేదు" అని ఖచ్చితంగా చెప్పేవాడట!

నాకు ఇంగ్లీషు, తెలుగు చాలా తేలికగానే ఉండేది గాని గ్రూపు ఫిజిక్స్, కెమిస్ట్రీ, బోటనీలలో ఫిజిక్స్, బోటనీ ఫరవాలేదు గాని కెమిస్ట్రీ మాత్రం బుర్రకెక్కేది కాదు. మొదటి సంవత్సరం కెమిస్ట్రీకి సాంబశివరావుగారని జూనియర్



లెక్చరర్ ఉండేవాడు. అసలు లెక్చరర్ పోస్టు ఖాళీగా ఉంచారు! వంగూరు సుబ్బారావుగారని హైస్కూలులో టీచరు ఆయన బి.యస్.సి, బి.ఇడి కాబోలు! లెక్చరర్‌కు యం.యస్.సి అవసరమేమో ఆయన యం.యస్.సి చదవడానికి బెనారస్ యూనివర్సిటీకి వెళ్లి యం.యస్.సి ప్యాసయి మాకు సీనియర్ క్లాసులో లెక్చరర్‌గా వచ్చాడు.

ఆయన గూడ మనిషి మంచి వాడే! తెలివిగలవాడే! కాని, లెక్చరర్లకి పాఠం చెప్పి స్టూడెంట్స్‌ని ఆకట్టుకునే నేర్పు ఉండాలండి. వంగూరు సుబ్బారావుగారు పాఠం చెప్పేవారు గాని నాలాంటి వాళ్లకి అయోమయంగా ఉండేది. ఆయన గూడ ఖద్దరు కట్టి గాంధీ టోపీపెట్టేవాడు. సైకిల్ మీదవచ్చేవాడు. బ్రాడీపేటలో ఉండేవాడు. రెండో సంవత్సరం నేను గూడ బ్రాడీపేటలో హాస్టల్లో భోంచేసి కొండా వెంకటప్పయ్యగారి ఇంటి ఎదురుగా ఒక బంగళాలో ఒక రూంలో ఉండేవాణ్ణి.

రెండో సంవత్సరం హాస్టలు బ్రాడీపేట ఒకటో లైనులో ఉండేది. వార్డెన్ ధూర్జటి సుబ్బహ్మణ్యంగారు. ఆయన కాలేజీలో మ్యాథ్స్(లెక్కలు) లెక్చరరు. చాలా మంచివాడు. నేను మొదటిసంవత్సరం హాస్టలు కొత్తపేటలో ఓల్డ్ బ్యాంకు బిల్డింగ్ నుంచి పోస్టాఫీసు ఎదురు ఇంట్లోకి షిఫ్టు అయినప్పుడు సెక్రటరీగా ఉండేవాణ్ణి! అప్పుడు వార్డన్ వల్లభజోస్యుల సుబ్బరావుగారని చెప్పాగదా! ఆ సుబ్బారావుగారు - సుబ్రహ్మణ్యంగారికి చెప్పారట! "నరసరాజు సెక్రటరీగా బాగా మేనేజ్‌చేశాడు!" అని.

ఇప్పుడు చెబితే ఎవరూ నమ్మరు! 1937 ప్రారంభంలో నేను హాస్టల్ సెక్రటరీగా ఉన్నప్పుడు రెండు పూటల భోజనం నెలకు 7 రూపాయలు! అక్షరాల ఏడురూపాయలు!

నేను కాయగూరలు వగైరా కొనడానికి డబ్బు - వంట వానికి గాని - నౌకరుగాని ఇచ్చేవాణ్ణి కాదు! వారానికి రెండుసార్లు హాస్టల్లో వున్న కుర్రవాళ్లే వంతులు వేసుకుని హాస్టలు ప్యూన్‌ని తీసుకుని కాయగూరల మార్కెట్టు కాలేజీ పక్కనే ఉండేది - కాయగూరలు కొని ప్యూన్‌కి ఇచ్చి కాలేజికి వెళ్లాలన్నమాట!

ఆ విషయం తెలిసి వార్డెన్ సుబ్రహ్మణ్యం గారు నన్ను హాస్టల్లోనే ఉండమని బలవంతం చేస్తే నేను "బయట రూం" బాగుంది మాస్టారు! చదువుకోడానికి" అని - భోజనం మాత్రం హాస్టల్లో చేసేవాణ్ణి!

అంతకు ముందు అంటే మొదటి సంవత్సరం హాస్టల్లో రెండు పూటల భోజనం వుండేది. మధ్యాహ్నం టిఫిన్, కాఫీ బయట హోటల్‌లో తినేవాళ్లం.

రెండో సంవత్సరం మూడు పూటలు భోజనం ఏర్పాటు చేశాం. అప్పుడు స్టూడెంట్స్ కొంతమంది పల్లెటూళ్లలో హైస్కూల్సులో చదివివచ్చి - కాలేజీలో చేరే వాళ్లు. వాళ్లకి పల్లెటూళ్లలో మూడుపూటలు భోజనం అలవాటు! మధ్యాహ్నం హోటల్‌లో ఒక స్వీటు - హాటు - కాఫీ తాగితే ఏమూలకి? ఆకలి తీరేది కాదు. ఎవరికీ చెప్పుకోలేరు. అప్పారావు అని ఒక కుర్రవాడుండేవాడు. అంతా పల్లెటూరి వాటం. ధోవతి చొక్కా! అతను - నాతో చెప్పాడు. 'మధ్యాహ్నం గూడ భోజనం ఏర్పాటు చేయగూడదా?" అని. నేను వార్డెన్‌గారితో మాట్లాడి మధ్యాహ్నం గూడ భోజనం ఏర్పాటు చేయించాను - మధ్యాహ్నం అన్నం మాత్రం వండేవారు. పొద్దుటి కూరలే వడ్డించేవారు. "మీ దయవల్ల మధ్యాహ్నం గూడ కడుపు నిండ - తింటున్నాం రాజుగారు!" అనేవాడు అప్పారావు.

నేను కూడ కాలేజీలో ఉండగా ధోవతీ కట్టేవాణ్ణి! ధోవతి కట్టడం నేను హైస్కూల్లో ఫిఫ్తు ఫారంలో స్టార్ట్ చేశానండి! మా రాంమామయ్య స్కూలు తెరిచేముందు ఒకేసారి ఏడాదికి సరిపడే బట్టలు కుట్టించేవాడు. నిక్కర్లు-



చొక్కాలు. ఫిఫ్త్ ఫారానికి వచ్చేటప్పటికి నేను మనిషిని బాగా ఎదిగాను! అప్పుడు - 14-15 ఏళ్లు.

బట్టల షాపుకి వెళ్లినప్పుడు - మా మామయ్య అన్నాడు "ఏం! భారీగా ఎదిగావు! ఇంకా నిక్కర్లు - లాగులు తొడుక్కోవాలా! పంచెలు కట్టుకోలేవా?" అన్నాడు నవ్వుతూ!

"కొనిపెట్టు - కట్టుకుంటా" అన్నాను! అప్పుడు - అంతా ఖద్దరే. ఆయన గూడ ఖద్దరే కట్టేవాడు! ఆయనకి 1930కి పూర్వం తరువాత ఖద్దరు షాపు ఉండేది- పాతబస్తీ-మెయిన్ బజార్లో. కాంగ్రెసు ఉద్యమంతో గూడ సంబంధం ఉండేది ఆయనికి. టింబర్ వ్యాపారం మొదలుపెట్టిన తరువాత ఖద్దరు షాపు మూసేసాడు.

ఇంటర్ మొదటి సంవత్సరం - మూడోఫారంలో కొత్తపేట పోస్టాఫీసు ఎదురు ఇంట్లోకి - హాస్టలు షిఫ్టు అయినప్పుడు ఒక గమ్మత్తు ఇన్సిడెంట్ జరిగింది. నాకు సైకిల్ ఉండేది. నాకు హైస్కూలులో ఒక క్లాస్‌మేట్ ఉండేవాడు. పేరు జ్ఞాపకం లేదు! అతను బెజవాడ కొత్తపేటలో ఉండేవాడు. అతని తండ్రికి ఏదో వ్యాపారం ఉండేది. యీ ప్రబుద్ధుడు నా క్లాస్‌మేట్. ఓల్డ్ టౌన్‌లో - వైశ్యాహాస్టల్లో ఉండే వంటమనిషితో ప్రేమలోపడి లేపుకుపోయాడు. అలా తండ్రికి దూరమయ్యాడు. ఆ తరువాత ఎక్కడ తిరిగాడో - ఏంచేశాడో తెలియదు. 1937 జనవరి ఫిబ్రవరిలో - గుంటూరులో - మా హాస్టలుకు వచ్చాడు. ప్రేయసిని ఎక్కడ ఉంచాడో తెలియదు. నాతోపాటు హైస్కూలులో చదివిన వెంకటాచారి, పత్సవ కోటయ్య వగైరాలు హాస్టల్లో ఉండేవాళ్లు. అతను ఇబ్బందుల్లో ఉన్నాను. సహాయం చేయమంటే ఏవో చందాలు వేసుకొని పదో - పాతికో యిచ్చాము.

ఒకసారి బ్రాడీపేటలో ఇంకో ఫ్రెండు ఉంటే అతన్ని చూసి వస్తానని - సైకిల్ ఇమ్మన్నాడు! ఇచ్చాను! ఆ రోజు శుక్రవారం! రాత్రికి గూడ అతను తిరిగిరాలేదు. ఆ ఫ్రెండ్ దగ్గర ఉన్నాడేమోలే అనుకున్నాను! శనివారం ఉదయం మా క్లాస్ బోటనీ స్టూడెంట్స్‌ని - బోటనీ లెక్చరర్ వెంకట్రావుగారు - బెజవాడ దగ్గర కొండపల్లికి - ఎక్స్‌కర్షన్‌కి తీసుకెళ్లారు.

ఆదివారం ఉదయం అందరం తిరిగివస్తూ నేను మాత్రం బెజవాడలో దిగిపోయాను. సొంతవూరు గదా! మిగతా వాళ్లు - గుంటూరు వెళ్లిపోయారు.

నేను సోమవారం ఉదయం - గుంటూరు హాస్టలుకు వెళ్లేటప్పటికి పరిస్థితి ఏమిటంటే "నిన్ను పోలీసుస్టేషన్‌కి వెంటనే రమ్మన్నారు" అని చెప్పాడు నా రూంమేట్! 'ఎందుకురా' అంటే-

"శుక్రవారం నాడు నీ సైకిల్ తీసుకెళ్లాడే మన ఫ్రెండ్ - వాడు చీరాలలో నీ సైకిల్ అమ్మడానికి ప్రయత్నిస్తుంటే పోలీసులు - అనుమానించి - పట్టుకున్నారట! పట్టుకుని - తన్నబోయారో ఏమో - నిజం చెప్పాడట! సైకిల్ గుంటూరులో ఫలాన ఫ్రెండుది - అని నీ పేరు అడ్రసు యిస్తే - నిన్న సాయంత్రం పోలీసు బంట్రోతు - హాస్టలుకు వచ్చాడు. నువ్వులేవు! మరునాడు వస్తావని చెప్పాం! రాగానే పోలీసుస్టేషన్‌కు రమ్మని చెప్పి - పోలీసు వెళ్లి పోయాడు!" అని చెప్పారు. ఆ వచ్చిన పోలీసుని మా ఫ్రెండ్స్ ఏదో ఆటలు పట్టించారేమో - అతనికి కోపం వచ్చిందట!

నేను పోలీసుస్టేషను వెళితే - సబ్ ఇన్‌స్పెక్టర్ నా మీద కేకలేశారు. "నాకేం తెలీదండి నేను నిన్న అక్కడ లేను" అని సర్దిచెప్పాను.





పత్సవ కోటయ్య

సబిన్స్పెక్టరు అన్నాడు. "ఇప్పుడు - నువ్వు - చీరాల వెళ్లాలి. నీ సైకిల్ గుర్తు పట్టాలి. పోలీసులు అతని మీద కేసుపెడతారు! నీతో పాటు ఒక సాక్షిని గూడ తీసుకెళ్లాలి." అన్నాడు. ఆ మరునాడు - నేను - నా రూంమేట్ - కోటయ్య - ఇద్దరం చీరాల వెళ్లాం! (కోటయ్య తరువాత డాక్టరై - గవర్నమెంటు పుద్యోగం చేసి - రిటైరై ఇప్పుడు (అంటే ఇదిరాస్తున్నది 2005 మార్చి 26వ తేదీ - కోటయ్య నేను ఇప్పుడు ఉండే హైదరాబాద్ - బంజారాహిల్స్ రోడ్డు నెంబరు 12లోనే వుంటున్నాడు. తరచూ కలుస్తుంటాం! అంటే - దాదాపు 70 ఏళ్ల స్నేహం!) నేను కోటయ్యా చీరాల వెళ్లాం. మేజస్ట్రేటు కోర్టులోనే పోలీసుకేసు. నేను బోనులో నిలబడి స్టేట్మెంటు యిచ్చాను. "ఫలాన మనిషి నా సైకిల్ తీసుకెళ్లాడు. స్నేహితుడే గదా అని యిచ్చాను." కోర్టు - బోనులో నిలబడి సాక్ష్యం చెప్పడం అదే మొదటి సారి చివరిసారి గూడ. నేను జీవితంలో ఎన్నడూ కోర్టులో అడుగు పెట్టలేదు. ఫిర్యాదిగా కాని - ముద్దాయిగా కాని, ఈ విషయమే ఇప్పుడు కొందరు లాయరు జడ్జీ మిత్రులకు చెబితే "నువ్వు అదృష్టవంతుడివి" అంటారు.

కోర్టులో - సైకిల్ నాది అని గుర్తు పట్టాను. ఆ సైకిల్ నాదేననీ - అడిగి తను తీసుకొచ్చాననీ - ముద్దాయే ఒప్పుకున్నాడు. అతని పేరు సీతయ్యో - రామయ్యో అనుకుంటాను.

అతన్ని పోలీసులు ఎలాపట్టుకున్నారంటే - అతను చీరాలలో ఒక సైకిల్షాపు వాడితో - సైకిల్ అమ్ముతానని బేరం పెట్టాడట!

అతి చౌక ధరకి అమ్మజూపాడట! తనదైతేగా! ఎంత వస్తే అంతే చాలు ననుకుని ఉంటాడు. ఏ అయిదుకో - పదుకో - అమ్మజూపాడు. అప్పుడు కొత్త సైకిలే 40-యాభై రూపాయలు!

అప్పుడు ఆ సైకిల్ షాపు ముందు ఒక బెంచిమీద ఒక పోలీసు కానిస్టేబుల్ మఫ్టీలో కూర్చుని ఉన్నాడు. అతనికి అనుమానం వచ్చింది. సైకిల్ చూస్తే కొత్తగా వుంది. ఇంత చవకగా అమ్ముతున్నాడు! సొంతసైకిలైతే ఇలా తెగనమ్ముతాడా? అని అనుమానం వచ్చి పోలీసు స్టేషనుకు తీసుకుపోయాడట!

పోలీసువాళ్ల సంగతి తెలిసిందేగా! లాఠీతో నాలుగు ఇచ్చుకొని ఉంటాడు. భయపడి వాడు నిజం చెప్పాడు. అతనే నా అడ్రసు గూడ చెప్పాడు. అందువల్లే పోలీసులు నాకు గుంటూరు హాస్టలుకు కబురు పంపారు.

సైకిలు - నేను హైస్కూలులో ఫిఫ్తు ఫారంలో ఉండగా కొన్నది. అంటే దాదాపు రెండు మూడుసంవత్సరాల



క్రితం కొన్నది. బాగా మెయిన్‌టెయిన్ చేసేవాణ్ణి గనక - కొత్త సైకిల్‌లా ఉండేది.

ఆ సైకిల్ పేరు మిల్నర్ - స్పెషల్! అప్పుడు అన్నీ యింపోర్టెడ్ సైకిళ్లే - మన దేశంలో సైకిళ్ల తయారీలేదు. ర్యాలీ - డేటన్ సైకిళ్లు అంతకంటె ఖరీదు. బి.ఎస్.ఎ. సైకిలు మా రాంమామయ్యకు ఉండేది. అది తరువాత మా చిట్టిబావ - మా పెద్దమామయ్య కొడుకు తీసుకున్నాడు. హెర్క్యులెస్ సైకిల్ - 40 రూపాయలు. అపోలో - 20 రూపాయలు.

అసలు - చిక్కు ఏమిటంటే కేసు పూర్తి అయ్యేదాకా సైకిల్ నాకు ఇవ్వనన్నారు - కోర్టువారు. కేసు ఎప్పటికి తేల్తుంది? సీతయ్య సైకిల్ దొంగతనం వల్ల - ఒక మేలు జరిగింది. అది ఏమిటంటే అతన్ని ఇంట్లోంచి వెళ్లగొట్టిన తండ్రి - కొడుకు జైలు పాలవుతున్నాడనగానే పాపం తండ్రి పరువుగా బతుకుతున్నాడు - పరువు కోసమని చీరాల వచ్చి జామీను ఉండి కొడుకును విడిపించుకుని విజయవాడ తీసుకుపోయాడు. అంటే - ఈ దొంగతనం కేసువల్ల విడిపోయిన తండ్రీకొడుకులు - మళ్లీ కలుసుకున్నారు.

కేసు వాయిదాలు పడుతున్నాయి. నెలలు గడుస్తున్నాయి. నా బాధేమిటంటే - నా సైకిల్. కోర్టులో - తుప్పు పట్టిపోతుంది. అప్పుడు - సీతయ్య తండ్రి - చీరాల మేజిస్ట్రేటు - పోలీసులతో ఎలాగో సర్దుబాటు చేసుకుని నాచేత తనకొడుక్కి అనుకూలంగా సాక్ష్యం చెప్పిస్తే - కేసు కొట్టేసే ఏర్పాటు చేసుకున్నాడు.

ఆ ప్రయత్నంలో - అతను బెజవాడ ముత్యాలంపాడులో మా ఇంటికి వెళ్లాడు. నా క్లాస్‌మేట్ అంటే నా స్నేహితుడనుకుని దొంగతనం విషయం తెలియక మా అమ్మ ఆ తండ్రి కొడుకులకి కాఫీలు - టిఫిన్‌లు పెట్టి మర్యాదలు చేసింది.

వాళ్లు వెళ్లిన పనేమిటంటే - నేను కోర్టులో "సీతయ్య నా స్నేహితుడనీ - అప్పుడప్పుడు - ఇలా సైకిల్ తీసుకెళ్లి మళ్లీ తిరిగి ఇచ్చే ఆనవాయితీ ఉందనీ - అతనికి సైకిల్ అమ్మవలసిన అవసరం లేదనీ - అమ్ముతున్నాడనడం- నేను నమ్మలేనని - కోర్టులో మళ్లీ సాక్ష్యం చెబితే కేసుకొట్టేస్తారన్నమాట! నేను శని ఆదివారాల్లో- గుంటూరు నుంచి - ముత్యాలంపాడు వెళ్లితే - మా అమ్మ రాంమామయ్య విషయం చెప్పారు. "పాపం! ఆ తండ్రి కన్నీళ్లు పర్యంతరం అయి - నా పరువు కాపాడమని - అడిగాడు. అయిందేదో అయిపోయిందిగదా! వాళ్లు చెప్పినట్లు- చీరాల వెళ్లి సాక్ష్యం చెప్పు" అని మా రాంమామయ్య చెప్పాడు. నేను సరేనన్నాను. నా ఆశ ఏమిటంటే సైకిలు మళ్లీ నా చేతికి వస్తుందిగదా అని!.

కాని - నేను కోర్టులో మొదట ఇచ్చిన స్టేట్‌మెంట్‌కీ ఇప్పుడు విరుద్ధంగా చెబితే - కోర్టులో నా మీదకి ఏమైనా వస్తుందేనని - నేను భయపడ్డాను. అప్పుడు మళ్లీ ఆ తండ్రీ కొడుకుల్నీ పిలిపించి నా భయం చెబితే వాళ్లు చెప్పారు.

"అక్కడ చీరాలలో పోలీసులు మెజిస్ట్రేటుకి మేము ఎలాగో మాట్లాడి సర్దుబాటు చేశాంలెండి! మీ మీదకు ఏంరాదులెండి" అన్నారు.

అప్పుడు నేను చీరాల వెళ్లి కోర్టులో కాకుండా ఎందుకో మెజిస్ట్రేటు ఇంట్లో పెట్టారు విచారణ. నేను మెజిస్ట్రేటు ముందు స్టేట్‌మెంటు ఇచ్చాను. అతను స్నేహితుడని - సైకిల్ అమ్మవలసిన అవసరంలేదని మొదటి స్టేట్‌మెంటుకి విరుద్ధంగా చెప్పినా మెజిస్ట్రేటు అలాగే రికార్డు చేసుకున్నాడు. కేసు కొట్టేసి నా సైకిలు నాకు యిచ్చేశారు.



ఆ విధంగా ఈ దొంగతనం కేసువల్ల - తండ్రీ కొడుకులు ఒకటైనారు. ఆ తరువాత ఏం జరిగిందో ఆ ప్రబుద్ధుడు లేపుకుపోయిన మనిషి సంగతి ఏమయిందో నాకు తెలీదు.

అది - చదువుకునే రోజుల్లో జరిగిన ఒక చిత్రమైన అనుభవం!

నేను హైస్కూలులో చదివేటప్పుడు గూడ పెద్దగా కష్టపడి చదివే స్వభావంగాదు. ఏదో, పరీక్షల ముందు గట్టిగా చదివి ముక్కున బెట్టుకుని - పరీక్షలు రాసి - ఏవో ప్యాస్ మార్కులు 45-50 శాతం మార్కులకు తంటాలు పడేవాణ్ణి. స్కూలు మాత్రం ఎప్పుడూ ఎగ్గొట్టేవాణ్ణి కాదు.

గుంటూరు హిందూ కాలేజీలో చేరిన తరువాత  అదొక కొత్త జీవితం. ఇల్లు వదిలి - హాస్టల్లో ఉండి - చదవడం - కొత్త అనుభవం!

హాస్టల్ జీవితం చాలా సరదాగా ఉండేది. సాయంత్రం కాలేజీ నుంచి తిరిగి రాగానే - హాస్టల్లో కేరమ్స్ ఆడుకునే వాళ్లం. చాలా రికామీ రిలాక్స్డ్ జీవితం. దురలవాట్లు ఏమీ ఉండేవి కాదు. సినిమాలు మాత్రం తెగ చూసేవాణ్ణి! వచ్చిన తెలుగు సినిమా తప్పకుండా చూసేవాణ్ణి. ఆ అలవాటు హైస్కూల్లో ఉండగా కూడా ఉండేది. గుంటూరులో - మా హాస్టల్ నుంచి కాలేజీకి వెళ్లే దోవలో ఒక సినిమా హాలు ఉండేది. పేరు గుర్తులేదు. అందులో ఎక్కువగా హిందీ సినిమాలు వస్తుండేవి. ఎక్కువగా ప్రభాత్ సినిమాలు - 'అమరజ్యోతి'-'అమృతమంథన్'. అమరజ్యోతిలో శాంతా ఆప్టే మంచి గాయకురాలు. 'సునో-సునో-బన్‌కే రాణీ' చాలా పాప్యులర్ సాంగ్ ఆ రోజుల్లో. వారానికి - రెండువారాలకీ - కొత్త సినిమా మార్చేవారు. బసంత్ పిక్చర్స్ అనుకుంటాను హోమివాడియా దర్శకనిర్మాత! 'వాడియా' వారి 'నాడియా' చాలా పాప్యులర్! నాడియా - అంటే ఫిమేల్ స్టంట్ హీరోయిన్. బాగా ఫైట్స్ చేసేది. తరువాత నాడియాని హోమివాడియా పెళ్లి చేసుకున్నాడు.

ఆ రోజుల్లో మంచి హిందీ సినిమాలు తీసే సంస్థలు మూడు ఉండేవి. పూనాలో-కొల్హాపూర్‌లో ప్రభాత్ కంపెనీ. కలకత్తాలో న్యూథియేటర్స్. బొంబాయిలో - బొంబే టాకీస్! హిమాంశురాయ్ నిర్మాత. ఆయన భార్యా దేవికారాణి. హీరోయిన్ చాలా అందగత్తె.

కలకత్తా న్యూథియేటర్స్ స్థాపకుడు - బి.యస్.సర్కార్ విదేశీ చదువులు చదివి వచ్చిన వాడు. మంచి అభిరుచి గల క్లాస్ పిక్చర్సు తీసేవాడు.

బొంబాయిలోని - బొంబే టాకీస్ గూడ - మంచి ఎంటర్‌టైన్‌మెంటు దృష్టితో తీసేవాళ్లు. హిమాంశురాయ్ భార్య దేవికారాణి హీరోయిన్. అశోక్‌కుమార్ హీరో.

బొంబాయిలో - రంజిత్ పిక్చర్స్ అని ఉండేది. వాళ్లు స్టంటు పిక్చర్స్ తీసేవాళ్లు. ప్రొడ్యూసర్ ఎవరో 'షా', 'చందూలాల్ షా' అనుకుంటాను హీరోయిన్‌లు - గోహర్ - సులోచన, మాధురి. హీరోలు - ఇ.బిల్లిమోరియా - డి.బిల్లిమోరియా! మరాఠీ ఆర్టిస్ట్ - విఠల్ అని ఉండేవాడు మంచి ఫైట్లు - స్టంట్సు చేసేవాడు. కుర్రవాళ్లకి విఠల్ అంటే ఎంత మోజు అంటే - విఠల్ లాగా - పెద్ద 'క్రాఫ్' (జుట్టు) పెంచుకునేవాళ్లు. దాన్ని 'విఠల్‌క్రాఫ్' అనేవాళ్లు.

కలకత్తా న్యూథియేటర్స్ సినిమాలు - ఇప్పటికీ పాత సినిమాలుగా - ఫెస్టివల్స్ జరుపుతారు. సైగల్-జమున నటించిన 'దేవదాసు' డైరెక్టర్ - పి.సి. బారువా! సైగల్ - పహరి సన్యాల్ బారువా కానన్ దేవి వగైరాలు నటించిన సినిమాలు - స్ట్రీట్ సింగర్ - ప్రెసిడెంట్ విద్యాపతి - జిందగీ వగైరా సినిమాలు ఆరోజుల్లో చాలా పాపులర్. సంగీతం



గూడ - ఆ సినిమాల్లో పాటలు చాలా పాప్యులర్. పంకజ్‌మల్లిక్ ఆర్.సి. బొరాలీ - మ్యూజిక్ డైరెక్టర్లు. కె.సి.డే అని అంధ గాయకుడు. అవన్నీ చెబితే పెద్ద గ్రంధం అవుతుంది. ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే నేను 45 ఏళ్లకు పైగా తెలుగు సినిమా రంగంలో ఉన్నానంటే దానికి బ్యాక్‌గ్రౌండ్ ఫౌండేషన్ గురించి చెప్పడానికి!

ఇంటర్మీడియట్‌లో అంత తాపీగా రికామీగా చదువుసాగడానికి ముఖ్యకారణం - హిందూ కాలేజి - కొత్తగా పెట్టిన కాలేజి కావడం వల్ల ఇంటర్మీడియట్ - ఫస్ట్ ఇయర్‌లో డిటెన్షన్లు ఉండవు! అంటే - సెకండ్ ఇయర్ - ఫైనల్ పరీక్షలు దాకా మనల్ని అడిగేవాడు ఉండడు - అన్న ధీమా! అలాగని - చెడు తిరుగుళ్లేమీ ఉండేవి కాదు. కాలేజికి మటుకు రెగ్యులర్‌గా వెళ్లేవాణ్ణి. హాస్టల్లో కేరమ్స్, కాలేజి గ్రౌండులో బ్యాట్‌మెంటన్ - ఆడుకునేవాళ్లం. సినిమాలు మాత్రం విడిచిపెట్టకుండా చూసేవాణ్ణి.

ఇంటర్ మీడియట్‌లో నాకు ఇంగ్లీషు, తెలుగే, ఫిజిక్స్. బోటనీ వీటిని గురించి పెద్ద సమస్య లేదుగాని - కెమిస్ట్రీ నాకు బగ్‌బేర్! బుర్రకెక్కేది కాదు. కెమిస్ట్రీ లెక్చరర్ - వంగూరి సుబ్బారావుగారు - మనిషి మంచివాడే! బ్రాడీపేటలో మా రూంకి - దగ్గరలోనే ఆయన ఇల్లు! "మాస్టారూ! ఇంటికొస్తాను! కెమిస్ట్రీ చెప్పండి!" అని అడిగితే "కెమిస్ట్రీ చాలా ఈజీనోయ్!" అనేవాడు గాని - చెప్పేవాడు గాదు!

ఇంటర్ రెండో సంవత్సరంలో - ఫైనల్ పరీక్షలకు - మూడు నెలలు ముందు పుస్తకాలు తెరిచాను. తెరచిచూస్తే. ఇంగ్లీషు - తెలుగుతో నాకు ప్రొబ్లంలేదు. తేలిగ్గానే ప్యాస్ అవుతా! బోటనీ ఫరవాలేదు! ఫిజిక్స్ గూడ అంతంత మాత్రమే! కెమిస్ట్రీ మటుకు అయోమయం!

ఇంగ్లీషు - తెలుగు గ్రూపు మూడు చదివితే మూడు తప్పుతానేమో! మార్చి పరీక్షకి - ఇంగ్లీషు - తెలుగు చదివి గ్రూపు సెప్టెంబరుకు - రిజర్వు చేసి - పరీక్ష రాయవచ్చు అనిపించింది.

ముందే చెప్పాగా! నాకు చదువు కాలక్షేపానికే! ఈ క్లాసు ప్యాసయితే - తరువాత క్లాసు చదువుదాం! చదవాలి - డిగ్రీలు తెచ్చుకోవాలి, ఉద్యోగాలు చేయాలి - ఉద్యోగాలు లేకపోతే బ్రతుకు గడవదు అనే బెంగ లేదు! అందుకని ఇంగ్లీషు - తెలుగులో మాత్రం మార్చి పరీక్షకు చదివి గ్రూపు సెప్టెంబరుకు రిజర్వు చేశాను.

నాతోపాటు - నాలాంటి వాళ్లు - ఇంకా ఇద్దరుండేవాళ్లు. 'జగన్నాధ్' - 'రవి' అని-

'రవి' అంటే - ఇప్పుడు 'వసంత' అని సినిమాల్లో ప్లేబాక్ పాడుతున్నదే ఆవిడ తండ్రి!

మేం ముగ్గురం - ఒకటే నిర్ణయం తీసుకున్నాం! గ్రూపు సెప్టెంబరుకు రిజర్వు చేశాం!

కాని - ఒక చిక్కు వచ్చింది. ఫిజిక్స్, కెమిస్ట్రీలలో ప్రాక్టికల్స్ ఉండేవి! అవి మేము ముగ్గురం పూర్తి చెయ్యలేదు!

"ప్రాక్టికల్స్ పూర్తి చెయ్యని వాళ్లని - పరీక్షకు పంపడానికి వీల్లేదు" అని కాలేజి నోటీస్ బోర్డులో వేశారు. అంటే ఇంగ్లీషు - తెలుగు పేపర్లు గూడ రాయడానికి వీల్లేదన్నమాట!

మాకు - ఫిజిక్స్ లెక్చరరు - రామనాథం గారని వుండేవారు. చాలా మంచివాడు. పాఠం బాగానే చెప్పేవాడు. ఆయనికి - ఉబ్బసంలాంటిది ఉండేదేమో ఆయాసపడుతుండేవాడు.

పాఠం చెప్పి -"అండర్‌స్టాండ్?" అనే వాడు మా వంక చూచి మేం ముగ్గురం ఏకగ్రీవంగా 'నోసార్' అనే వాళ్లం. ఆయన పాపం ఆయాసంతో దీర్ఘంగా నిట్టూర్చేవాడు.



ప్రాక్టికల్స్ పూర్తి చేయకపోయినా - ఆయన సంతకం పెడితే తప్ప మేం పరీక్షకు కూర్చోడానికి వీలులేదు. అందుకని ఒకరోజు మేం ముగ్గురం ఆయన ఇంటి కెళ్లాం!

ఆయన అన్నారు - "నేను మీకు ఎన్నో సార్లు చెప్పాను. "ప్రాక్టికల్స్ పూర్తి చేయందే - మీరు పరీక్షకి కూర్చోడానికి వీలులేదు అని! మీరు వినలేదు" అన్నాడు - పాపం - చాలా సానుభూతితో!

మేం చెప్పాం "మాస్టారూ! మేము గ్రూపు ఎలాగూ ఇప్పుడు రాయ దల్చుకోలేదు! సెప్టెంబరుకు రిజర్వు చేశాం! ఇప్పుడు ప్రాక్టికల్స్ చేయడానికి టైంలేదు! మీరు సంతకం చేయకపోతే మేము ఇంగ్లీషు-తెలుగు గూడ రాయడానికి వీలుండదు" అని దీనంగా చెప్పాం!

ఆయన - నిట్టూర్చి "సరే! అలాగే!" అని సర్టిఫికేట్‌పై సంతకం చేసి మమ్మల్ని పరీక్షలకి పంపారు.

ఇంగ్లీషు - తెలుగు పేపర్లు బాగానే రాశాం! గ్రూపుపేపర్లు మటుకు అరగంట లోపల బయటకు రాగూడదు గాబట్టి - పరీక్ష హాల్లో అరగంట కూర్చుని - ఆన్సరు పేపర్లు - తెల్లకాగితాలు ఇచ్చేసి బయటికి వచ్చేశాం!

పరీక్షలు అయిపోయినై! ఇంటి కెళ్లాను. మా రాంమామయ్య అడిగాడు "పరీక్షలు బాగా రాశావా?" అని .

"ఇంగ్లీషు - తెలుగు బాగానే రాశాను గ్రూపులో గూడ ఫిజిక్స్, బోటనీ బాగానే రాశాను గాని - కెమిస్ట్రీయే కాస్త అనుమానం" అని అబద్ధం చెప్పాను.

రిజల్టు వచ్చాయి! ఇంగ్లీషు, తెలుగు ప్యాసయినాను! గ్రూపుకోసం మళ్లీ గుంటూరు వెళ్లి అదే రూంలో వుండి సెప్టెంబరులో పరీక్షరాసి ప్యాస్ అయినాను!

ఆ తరువాత బి.ఏ - చదవడానికి గుంటూరులోనే ఎ.సి. కాలేజిలో చదవవచ్చు! హిందూ కాలేజి. అప్పుడు డిగ్రీకాలేజి కాదు. కాని, నేను బి.ఏ చదవడానికి - మదరాసు లయోలా కాలేజికి వెళ్లాను. ఎందుకంటే - దానికి ఒక కథ వుంది!

ఇంటర్ సీనియర్‌లో బ్రాడీపేటలో శారదానికేతనం పక్కనే "చంద్రశేఖర విలాస్" అని ఒక పెద్ద బంగళాలో రూం అద్దెకు తీసుకుని ఉన్నానని చెప్పానే - ఆ కాంపౌండ్‌లో - అవుట్ హవుస్ డాబా ఒకటి ఉండేది. అందులో నా క్లాస్‌మేట్ కటికినేని పురుషోత్తమరావు అని అతని ఫామిలీ ఉండేవాళ్లు. అతని తల్లి, తండ్రి, తమ్ముడు - ఒక చెల్లలు చిన్నపిల్ల అదీ ఆ ఫామిలీ!

ఆ ఫ్యామిలీ ఎవరంటే - వెలమవారు - ఇప్పుడు విజయరామరావు అని - రిటైర్డ్ సి.బి.ఐ డైరెక్టరు - తరువాత చంద్రబాబు నాయుడు మంత్రి వర్గంలో మంత్రిగా ఉన్నాడే - అతనిది స్వగ్రామం - వరంగల్ జిల్లా ఏటూరు నాగారం అయినా - అతని తల్లి గారి పుట్టిల్లు - నెల్లూరుజిల్లా వెంకటగిరి. విజయరామరావు తల్లిగారి తండ్రి - అంటే మాతామహుడు - కటికినేని కళ్యాణరావుగారు! ఆయన తమ్ముడు వెంకటరామారావుగారు. ఆయన రెండవ కుమారుడు నా క్లాస్‌మేట్ పురుషోత్తమరావు.

కళ్యాణరావు, వెంకటరామారావు గార్లు - కటికినేని సోదరులు అని ప్రొఫెసర్ రంగా గారు - నెల్లూరు రామానాయుడు గార్లతో కలిసి జమీన్ రైతు ఉద్యమంలో చురుకుగా పాల్గొని జైళ్లకు గూడ వెళ్లారు. గాంధీగారు వెంకటగిరి వచ్చినప్పుడు ఆయన వీళ్ల ఇంట్లో దిగాడు. కళ్యాణరావు గారికి - ముగ్గురు కూతుళ్లు - కొడుకులు లేరు.



రెండో కూతురు కొడుకు విజయరామారావు. వెంకటరామారావు గారికి ముగ్గురు కొడుకులు. ఒక మరదలు చనిపోతే ఆమె కూతుర్ని పెంచుకున్నారు.

ఆ ముగ్గురు కొడుకుల్లో - రెండోవాడు పురుషోత్తమరావు మూడోవాడు మోహన్‌దాస్ అప్పుడు టౌన్ హైస్కూలులో చదువుతుండేవారు. పెద్దకొడుకు - జగన్నాధరావు. (కటికినేని జగన్నాధరావు - హైదరాబాద్‌లో హైకోర్టులో - సీనియర్ అడ్వకేటుగా పనిచేసి నాలుగయిదేళ్ల క్రితం చనిపోయాడు)

మళ్లీ - నా చదువు కథకి వద్దాం! ఇంటర్మీడియట్ అయిన తరువాత పురుషోత్తమరావు కుటుంబం విజయవాడకు (అప్పుడు ఇంకా బెజవాడ) షిఫ్టు అయ్యారు. ఎందుకంటే - కటికినేని సోదరులు కళ్యాణరావు - వెంకటరామారావు గార్లు - కృష్ణాజిల్లా తిరువూరు తాలూకా గంపలగూడెం జమిందారు - జగన్నాధరాయణింగారికి మేనల్లుళ్లు!

జగన్నాధ రాయణింగారికి - ఇద్దరు కొడుకులు - సత్యనారాయణరావు - పార్థసారధి రావు! చాలాకాలం తరువాత పుట్టారు. లేట్ యిష్యూస్. తల్లి పోయింది. ఇద్దరూ - బందరు హైస్కూలులో చదువుతుండగా - పెద్దకొడుకు సత్యనారాయణరావు చనిపోయాడు. చిన్నకొడుకు పార్థసారధిని బందరులో చదువు మాన్పించి విజయవాడ హైస్కూలులో చేర్చాలని తండ్రి సంకల్పం! యింట్లో ఆడదిక్కులేదు! అందువల్ల - మేనల్లుడయిన వెంకట్రామారావు గారి కుటుంబాన్ని బెజవాడకు తరలించారు జగన్నాధరావుగారు! అదీగాక కటికినేని సోదరులు జమీన్‌రైతు ఉద్యమంలో వెంకటగిరిలోని ఆస్తులు గూడ తరిగిపోయినై.

అందువల్ల కటికినేని వెంకట్రామారావు గారి కుటుంబ ఆదరణలో చిన్నకొడుకు పార్థసారధిని మునిసిపల్ హైస్కూలులో - ఫోర్తుఫారంలో చేర్చారు. నాదీ - స్వగ్రామం ముత్యాలంపాడు (బెజవాడ) కావడం వల్ల ఆ కుటుంబంతో నాకు బాగా సాన్నిహిత్యం ఏర్పడింది.

వెంకట్రామారావుగారి పెద్దకుమారుడు - జగన్నాధరావు అని చెప్పానే - అతను ఆ క్రితం సంవత్సరం మదరాసు లయోలా కళాశాలలో బి.ఏ చదివి వచ్చాడు (1936-38). ఒక సంవత్సరం పాటు ఉద్యోగం కొరకు ప్రయత్నాలు చేశాడు. ఫలితం లేకపోయింది.

అప్పుడు - ఆయన తాతగారు గంపలగూడెం జమిందారు జగన్నాధరాయిణింగారు (ఆయన్ని అందరూ 'పాట్టియ్య' గారు అనేవారు) అన్నారు! "ఎందుకయ్యా ఉద్యోగం కోసం అందరి చుట్టూ తిరుగుతారు? మదరాసు పోయి 'లా' చదవరాదూ! మన ఎస్టేటు పైలే బోలెడు వుంటుంది." అని ప్రోత్సహించారు. దానితో జగన్నాధరావు 1939లో మదరాసు లాకాలేజీలో చేరడానికి నిశ్చయించుకున్నాడు.

అప్పుడు నేను ఇంటరు పూర్తి చేశాను గదా! గుంటూరు ఎ.సి కాలేజీలో బి.ఏ చదువుదామనుకుంటుంటే జగన్నాధరావు అన్నాడు! "రాజుగారు మదరాసు లయోలా కాలేజీ బాగుంటుంది దానిలో చేరండి! నేను 'లా' కాలేజిలో చేరబోతున్నాగదా! ఇద్దరం సరదాగా తోడుగా ఉండవచ్చు" అన్నాడు.

నాకు గుంటూరయినా ఒకటే! మదరాసయినా ఒకటే! సరేనని లయోలా కాలేజికి సీటుకు అప్లయిచేశాను.

ఈ విషయం మా రాంమామయ్యకు చెప్పాను! ఆయనికి చాలా ఆశాభంగం! నాచేత - కోయంబత్తూరులో అగ్రికల్చరల్ బి.యస్.సి. చదివించాలని ఆయన కోరిక! నేను మాత్రం ఖచ్చితంగా చెప్పాను! ఆ కెమిస్ట్రీ నావల్ల



గాదు. పైగా బి.యస్.సిలో ఆర్గానిక్ & ఇనార్గానిక్ కెమిస్ట్రీ రెండూ వుంటాయ్! నావల్ల కాదని మొండికేశాను. ఆయన గూడ అర్థం చేసుకుని - సరే! మదరాసే వెళ్లమని అన్నాడు.

బి.ఏ.లో సైన్స్ గ్రూపుకు ఒక దణ్ణం పెట్టి ఎకనామిక్స్ గ్రూపుకు అప్లయిచేశాను. మదరాసు లయోలా కాలేజీలో సీటు వచ్చింది.

లయోలా కాలేజి కాస్త ముందు తెరుస్తారు. 'లా' కాలేజి తరువాత తెరుస్తారు. కాబట్టి - జగన్నాధరావు తరువాత వస్తానంటే - ముందు నేను మదరాసు వెళ్లాను. గుంటూరులో ఇంటర్‌లో మా రాంమామయ్య నావెంట వచ్చి కాలేజీలో చేర్చి హాస్టల్‌లో దిగవిడిచి వెళ్లాడు. అలాగే ఈసారి గూడ మదరాసు దూరమూ కొత్తగనక మా అమ్మ మా రాంమామయ్యని "ఒరే! రాముడు! నువ్వు గూడ వెంటవెళ్లి అబ్బాయిని కాలేజీలో చేర్చిరారా!" అన్నది.

ఆయన నావంక చూచి "ఏం! బి.ఏ చదవ బోయేవాడివి ఒక్కడివే వెళ్లలేవా!" అన్నాడు చమత్కారంగా!

"అలాగే! వెళతాలే" అన్నాను.

ఫలాన తారీఖున వచ్చి చేరమని లయోలా కాలేజీ నించి అడ్మిషన్ కార్డు వచ్చింది. అదే తేదీకి మదరాసు వెళ్లాను.

అది-నేను మదరాసు వెళ్లడం రెండవసారి! మొదటిసారి 1937 జనవరి - ఫిబ్రవరి అనుకుంటాను - మా రాంమామయ్య పెద్దకొడుకు సీతారాముడు ఉపనయనం తిరుపతి కొండమీద జరిగింది. అక్కడ నుంచి మొట్టమొదటి సారి మదరాసు వెళ్లాం. మా తామ్మ రాంమామయ్యగారి కుటుంబం - ఇంకా ఒకరిద్దరు మా కుటుంబ సభ్యులు.

నా లయోలా కాలేజి అడ్మిషన్ సమయంలో ఒక గమ్మత్తు జరిగింది.

కలకత్తా మెయిలులో ఉదయమే మదరాసు సెంట్రల్ స్టేషనులో దిగాను. అప్పుడు లగేజి - ఒక స్టీలు సూట్‌కేసు బెడ్డింగు! హోల్డాలు గూడ కాదు. ఒక జంపకానా, ఒక బెడ్‌షీటు, దిండు, చుట్ట చుట్టి ఒక మెత్తని తాడుతో కట్టడమన్నమాట!

సూట్‌కేసు బెడ్డింగు సెంట్రల్ స్టేషను నుంచి ఒక రైల్వే కూలి నెత్తిన పెట్టి - 'పార్క్' స్టేషనులో ఎలక్ట్రిక్ ట్రెయిన్ ఎక్కాలి! కూలికి బేడ! రెండణాలు!

పార్క్ స్టేషన్‌లో ఎక్కి - కోడంబాకం స్టేషన్‌లో దిగి - మళ్లీ అక్కడ నుంచి లగేజి కూలినెత్తిన పెట్టి లయోలా కాలేజి వెనకగేటు గుండా లోనికివెళ్లాలి.

హాస్టలు ఆఫీసు దగ్గరికి వెళ్లి అడ్మిషన్ కార్డు చూపించాను! గుమాస్తా - ఏదో రూం యివ్వబోతే-

నాకు 10వ బ్లాక్‌లో రూం నెంబరు - 264 కావాలన్నాను! అది - అంతకు ముందు జగన్నాధరావున్న రూం! అది సెంటిమెంటు! హాస్టల్లో అప్పుడు 14 బ్లాకులు ఉండేవి దాదాపు 400 గదులు. సింగిల్ రూమ్స్. గదిఅద్దె పదిరూపాయలు.

ఇంకా హాస్టలు మెస్సు తెరవలేదు! భోజనానికి బస్సులో - పాండి బజారులో 'భారత్' కేఫ్‌కు పోవాలి!

కాలేజి ఆఫీసు గూడ తెరవడానికి ఇంకా రెండు రోజులు ఉంది. తెలిసిన మొఖం ఒక్కటి గూడ లేదు హాస్టల్లో! వచ్చిన కొద్దిమంది తమిళ, కన్నడ, మళయాళీ స్టూడెంట్స్.





ఊటుకూరు రామిరెడ్డి



వి.జి.యస్.వి. ప్రసాద్

"ఎందుకు వచ్చాన్రా! బాబు! హాయిగా గుంటూరులో ఎ.సి కాలేజిలో చేరితే పోయేది గదా" అనిపించింది.

అప్పుడు - ఇద్దరు విజయవాడలో నా హైస్కూలు క్లాస్‌మేట్స్ వచ్చారు. ఒకడు కడపకు చెందిన ఊటుకూరు రామిరెడ్డి. రెండోవాడు వి.జి.యస్.వి ప్రసాద్! వాళ్లను చూడగానే ప్రాణం లేచివచ్చింది. రామిరెడ్డి తరువాత 'లా' చదివి కడపలో ప్రాక్టీసు పెట్టి లాయర్‌గా మంచి పేరు సంపాయించాడు. కాంగ్రెసులో చేరి ఒకసారి యం.పిగా ఎన్నికయ్యాడు గూడ! చివరికి - కాన్సరుతో దాదాపు పదేళ్ల క్రితం పోయాడు.

ప్రసాద్ మదరాసులో వ్యాపారంలో సెటిలయ్యాడు. నేషనల్ ఇంజనీరింగ్ కంపెనీ పెట్టి - వ్యాపారంలో బాగా పైకి వచ్చాడు. ఇప్పటికీ ఇద్దరం సన్నిహిత కుటుంబ స్నేహితులం!

రామిరెడ్డి ఇంటర్ లయోలాలోనే చదివాడు. ప్రసాద్ మదనపల్లిలో చదివాడు. ఇద్దరూ నాలాగే ఇంటర్ తప్పారు! కాబట్టి ముగ్గురం లయోలా బి.ఏలో క్లాస్‌మేట్స్ అయ్యాం!

అసలు విషయం ఏమిటంటే - లయోలా కాలేజి ఆఫీసు తెరిచారు! జీతాలు కట్టి కాలేజీలో చేరాలి! కాలేజి ఆఫీసుకెళ్లి అడ్మిషన్‌కార్డు చూపాలి! చూపితే "వెళ్లి - ఫాదర్ ప్రిన్స్‌పాల్-సంతకం తీసుకురండి" అన్నారు! కాలేజి - క్యాథలిక్ మిషన్ కాలేజి గదా! 'ఫాదర్' అనాలి - క్యాథలిక్ టీచర్లని!

ప్రిన్స్‌పాల్ - ఫాదర్ మర్ఫి! ఆయన ఐర్లండు దేశస్థుడు!

అందరూ - ప్రిన్స్‌పాల్ రూంకి వెళ్లి - ఆయనతో సంతకం చేయించుకుని - ఆఫీసులో జీతాలు కట్టివస్తున్నారు. సంతకం కోసం - నేను ప్రిన్స్‌పాల్ రూంలోకి వెళ్లేసరికి - ఆయన నావంక ఎగాదిగ చూశాడు.

అప్పుడు నేను ఎలా వున్నాను? కోరా ఖద్దరు - ముతక ధోవతి! ఖద్దరు ఫుల్‌హాండ్ షర్టు! జుట్టు - పెద్దక్రాప్ వుండేది. మనిషి దాదాపు ఆరడుగుల ఎత్తు! చూస్తే - పల్నాటి రైతులాగ వున్నాను. అడ్మిషన్‌కార్డు చూశాడు. గుంటూరు కాలేజి నుంచి వచ్చినట్టు వుంది గదా!



ఆ క్రిందటి సంవత్సరమే - గుంటూరు ఏ.సి. కాలేజిలో (తరువాత - కమ్యూనిస్టు పార్టీ అగ్రనాయకులయిన) మాకినేని బసవపున్నయ్య, మోటూరి హనుమంతరావు - నాళం నరశింహారావు మొట్టమొదటిసారి స్ట్రయిక్ చేశారు! ఆ స్ట్రయిక్ విద్యార్థి లోకంలో పెద్ద సంచలనమన్నమాట! అది రాష్ట్రమంతా తెలిసిపోయింది! గుంటూరు అంటే - విప్లవ కేంద్రమని - పేరు బడిపోయంది.

ఆ నేపధ్యంలో - ఫాదర్ మర్ఫి నాకార్డు చూసి చిరునవ్వుతో "Oh! You are from Guntur!" గుంటూరును ఆయన 'గంటూర్' అన్నాడు. 'The notorious Guntur!' అన్నాడు.

నేనన్నాను:- "ఫాదర్! నేను హిందూకాలేజ విద్యార్థిని, స్ట్రయిక్‌లు లేవు!" అన్నాను.

"But, any way you are from Guntur! (గంటూర్) అన్నాడు. అని- "See me tomorrow" అన్నాడు. రూం నుంచి బయటికి వచ్చి జరిగిన సంగతి మా ఫ్రెండ్స్‌కి చెప్పాను.

వాళ్లంతా "అయితే నీకు సీటురాదు" అన్నారు. నాకు అనిపించింది- "హాయిగా గుంటూరులో చేరక ఇక్కడికెందుకొచ్చాను" అని కాస్త డిప్రెస్ అయినాను.

మరునాడు పొద్దున్నే మళ్లీ ప్రిన్స్‌పాల్ రూంకి వెళ్లాను. కార్డు యిచ్చాను. ఆయన చాలా స్ఫురద్రూపి! మంచి హైట్! చిరునవ్వుతో నావంక చూచి "This is not - Guntur!" This is LOYOLA! You must abide by the discipline of LOYOLA! Other wise - Back to Guntur! అన్నాడు - నవ్వుతూ.

"Father! I promise, I will abide by the discipline of LOYOLA" అన్నాను.

కార్డు మీద సంతకం పెట్టాడు. ఆఫీసుకెళ్లి జీతం కట్టాను. కాలేజీలో చేరాను.

ఇది జరిగింది 1939 జూన్‌లో.

దురదృష్టవశాత్తు -1940లో జవహర్‌లాల్ నెహ్రూని బ్రిటీష్ గవర్నమెంటు అరెస్టుచేసింది. అందుకు నిరసనగా మదరాసులోని అన్ని కాలేజిల విధ్యార్థులు సమ్మె తలపెట్టారు. మేమూ సమ్మెలో చేరాం. లయోలా కాలేజీ చరిత్రలో అదే మొట్టమొదటి సమ్మె. మా కాలేజి స్టూడెంట్స్ - హాస్టల్ నుంచి ప్రొసెషన్ ప్రారంభించాం. హాస్టలు - కాలేజ ఒకే కాంపౌడులో ఉన్నాయ్. మేమంతా - కాంగ్రెస్ జండాలు పట్టుకుని "డౌన్, డౌన్ - బ్రిటీష్ ఇం పీరియలిజం! "వుయ్ వాంట్ ఇండిపెండెన్స్" అంటూ నినాదాలు చేస్తూ బయలుదేరాం. ప్రిన్సిపాల్ - ఫాదర్ మర్ఫీ కాలేజి పై అంతస్తు వరండాలో నిలబడి - చిరునవ్వుతో మా ప్రొసెషన్ వంక చూస్తూ నిలబడ్డాడు.

మదరాసు అన్ని కాలేజీ విద్యార్థులు 'నేపియర్స్' పార్కులో కలవాలని నిర్ణయం. అక్కడ నుంచి మౌంట్‌రోడ్, ట్రిప్లికేన్, మైలాపూర్ వగైరా రోడ్లన్నీ తిరిగాం - నినాదాలు చేసుకుంటూ - గొంతులు బొంగురు పోయేట్టు!

చివరికి సాయింత్రం బీచ్‌లో పెద్దమీటింగు. రాత్రికి తిరిగి హాస్టలుకు చేరాం!

మరునాడు కాలేజి! ఫాదర్ మర్ఫీ మాకు 'డ్రామా' చెప్పేవాడు. మొదటి పీరియడ్ ఆయన క్లాసు!

ఆయన పాఠం ప్రారంభించే ముందు మానిటర్ - అటెండెన్స్ తీసుకోవాలి. మానిటర్ నంబర్లు పిలుస్తుంటే ఒక్కొక్కరే లేచి 'హియర్' అని చెప్పి కూర్చోవాలి. ఆ క్రితం రోజు ప్రొసెషన్‌లో పాల్గొని కేకలేసిన వాళ్లందరి గొంతులు బొంగురు పోయివున్నయ్. అటెండెన్స్ చెప్పడానికి లేచి 'హియర్' అంటే - సౌండ్ రావడంలా! ఫాదర్ మర్ఫీ చిరునవ్వుతో



చూస్తున్నాడు. సమ్మెలో ఎవరెవరు పాల్గొన్నారో - ఆ గొంతులే చెబుతున్నాయ్". పాఠం చెప్పాడు. షేక్స్పియర్స్ - హేంలేట్! క్లాసు అయిపోయింది. ఆయన వెళ్లిపోయాడు.

రెండో పీరియడ్ క్లాసు - ఎకనామిక్స్ క్లాసు ఒకటి తరువాత ఒకటి చీటీలు వస్తున్నాయ్. నంబర్ సో అండ్ సో! వాంటెడ్-బై-ఫాదర్ ప్రిన్సిపాల్! అని. ఒక్కొక్కళ్లే వెళ్లి వస్తున్నారు! నా వంతు వచ్చింది. ప్రిన్సిపాల్ రూంకి వెళ్లాను! రూంలోకి వెళ్లగానే ఫాదర్ మర్ఫీ చిరునవ్వుతో - "Do you remember the day when you came to me for admission?"

"yes, father!" అన్నాను.

"So, my fears came true! "అన్నాడు చిరునవ్వుతో! నేనన్నాను "No father! It is not indiscipline..." అని ఇంగ్లీషులో నేను - "మా నేషనల్ లీడర్ - జవహర్‌లాల్ నెహ్రూని అరెస్టు చేస్తే - మేము ఎట్లా ఊరుకోగలం? మా నిరసన ప్రభుత్వం మీద గాని - కాలేజి మీద కాదు గదా!" అన్నాను.

ఆయన ఐర్లండు దేశస్థుడు! ఐరిష్ దేశస్థులు గూడ బ్రిటీష్ గవర్నమెంటు మీద - స్వాతంత్ర్యం కోసం పోరాడి - సాధించాన వాళ్లే! మన మాజీ రాష్ట్రపతి - వి.వి. గిరి గారు ఇంగ్లండులో చదువుకున్నప్పుడు ఐరిష్ స్వాతంత్ర్య సమరం వల్ల ప్రభావితుడైనవాడే!-

నేనన్నాను - "ఫాదర్! మీరు గూడ మీ దేశ స్వాతంత్ర్యం కోసం బ్రిటీష్ ప్రభుత్వం మీద పోరాడి సాధించారు గదా! మరి - మా మనోభావాలు - స్వాతంత్ర్యం కోసం మా పోరాటం - మీరు అర్థం చేసుకోవాలి గదా!" అన్నాను.

"you can go" అన్నాడు.

అందిరినీ పిలిచి ఇలా అడిగాడే గాని. ఎవరినీ victimise చేయలేదు.

ఆ తరువాత ప్రపంచ యుద్ధం ఉధృతమైంది. హిట్లర్ - ఫ్రాన్స్ దేశం మీద దాడిచేసి ఆక్రమించుకున్నాడు. అప్పుడు మా హాస్టల్ వార్డెన్ 'ఫాదర్ సోలియర్' అని ఉండేవాడు ఆయన ఫ్రాన్స్ దేశస్థుడు. చాలా మంచివాడు. రాత్రి తొమ్మిది గంటలు దాటిన తరువాత చేతిలో పెద్ద టార్చ్‌లైటు తీసుకుని హాస్టలు బ్లాకులన్నీ తిరిగేవాడు. మేమూ మా రూంల ముందు వరండాల్లో చేరి గట్టిగా - ఏవో వాదించుకుంటుండే వాళ్లం. ఆయన మామీద టార్చ్‌లైట్ వేసేవాడు! మేము 'సైలెంట్' అయిపోయే వాళ్లం.

ఆయన గో-తు-యువర్ రూమ్స్" అని కేకవేసేవాడు. ఫ్రెంచి వాళ్లు 'టు' ని 'తు' అనేవాళ్లు.

'గో-టు-యువర్ రూమ్స్'కి బదులు గో-తు-యువర్ రూమ్స్' అనేవాడు.

ఆయన ఒకసారి ఏంచేశాడంటే - 'వార్ ఫండు' వసూలు చేయడానికి ప్రతి బ్లాక్‌కి వచ్చేవాడు.

ఆయన చాలా దీనంగా "మీ ఫాదర్ సోలియర్ - బంధువులు, స్నేహితులు ఫ్రాన్సులో నాజీల వల్ల బాధలు పడుతున్నారు. వాళ్లకు సహాయం చేయండి! వార్ ఫండుకు చందాలు యివ్వండి!" అని ప్రాధేయపడ్డాడు.

మేమన్నాము "అలాగే! మీ ఫ్రెంచి ప్రజలకోసం మేము చందాలిస్తాము. అందుకు మేము కోరేదేమంటే - 'సొసైటీ - ఆఫ్ - జీసస్' (ఆ సంస్థ యాజమాన్యం కిందనే - లయోలా స్థాపింపబడినది) కావున మీరందరూ మా దేశ స్వాతంత్ర్యోద్యమానికి మద్దతు యిస్తున్నట్టు పబ్లిక్ స్టేట్‌మెంటు యివ్వండి!" అని అడిగాము.



కాని - బ్రిటీష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా - అలా స్టేట్‌మెంటు ఎలా ఇవ్వగలరు!

ఫాదర్ సోలియర్ - ఎంత మంచి వాడంటే ఆయన చుట్ట కాల్చేవాడు. 'దొర' చుట్టలు! సిగార్స్!

కాలేజీ తెలుగు ఎసోసియేషన్ తరపున ఏకపాత్రాభినయం - పోటీలు నిర్వహించేవాళ్లం! నేను 'కన్యాశుల్కం'లో 'గిరీశం' పాత్ర. ఏకపాత్రాభినయం! గిరీశం చుట్ట తాగుతాడు. నేను అన్ని ఏర్పాట్లు చేసుకున్నా గాని 'చుట్ట' మరిచిపోయా! ఆ రోజుల్లో కాలేజీకి దగ్గరలో - షాపులు ఉండేవి గాదు. ఆఖరి నిముషంలో ఏంచేయాలి? ఫాదర్ సోలియర్ దగ్గరకు వెళ్లి "నాకు చుట్ట కావాలి!" అని ఎలా అడగడం! ధైర్యం చేసి వెళ్లా!

"ఫాదర్ ఐ వాన్ట్ ఎ సిగార్" అన్నా.

ఆయన ఆశ్చర్యంతో "వాట్!" అన్నాడు. విషయం చెప్పా!

"ఆల్‌రైట్" అని చుట్ట నా చేతికిస్తూ-

ఇంగ్లీషులో "ఇది చాలా విలువైనది. కాస్త కాల్చి అవతల పారేయ గూడదు! చివర వరకు కాల్చాలి. అందుకు రుజువుగా చివరి 'ముక్క' తీసుకు వచ్చి నాకుచూపాలి! అన్నాడు చిరునవ్వుతో.

అలాగే ఏకపాత్రాభినయం అయిన తరువాత కష్టపడి చుట్ట చివరి దాకా కాల్చి వెళ్లి ఆయనకి చూపించా!

"గుడ్ బాయ్" అన్నాడు చిరునవ్వుతో! అంత సెన్స్ ఆఫ్ హ్యూమర్ ఉన్న మనిషి.

లయోలా కాలేజి తెలుగు ఎసోసియేషన్ తరపున ప్రతి సంవత్సరం ఒక నాటకం వేయడం ఆనవాయితీ.

మొదటి సంవత్సరం 'చాణక్య' నాటకం వేశారు. అందులో 'చాణుక్యుడు' కొండముది గోపాలరాయ శర్మ బి.ఏలో నా క్లాస్‌మేట్.

రెండో సంవత్సరం నేను సమితి నాటకశాఖ కార్యదర్శిని. 'రాణాప్రతాప్' నాటకం వేశాం. బెంగాళీ - డి.యల్. రాయ్ నాటకం. తెలుగు అనువాదం. పద్యాలు లేవు. మాకు పద్యాలు రావుగదా! అందుకు!

కాలేజి క్రిస్టియన్ మిషనరీలది గదా! నాటకంలో ఆడపిల్లల చేత వేషాలు వేయిస్తే ఒప్పుకునే వాళ్లుగాదు.

నాటకం ప్రదర్శించేది ఎగ్మూరు - మ్యూజియం థియేటర్‌లో! కాలేజి కాంపౌండులోకి ఆడపిల్లల్ని తీసుకురావడానికి వీల్లేదు.

నాటకంలో రెండు ఆడవేషాలున్నాయ్. ఒకటి అక్బరు కూతురు మెహరున్నిసా. రెండు, రాణాప్రతాప్ కూతురు 'ఇరా' అనుకుంటాను.

కోకా రామచంద్రరావుగారు నాక్లాస్‌మేట్! (తరువాత ఆయన - ఆంధ్రప్రదేశ్ హైకోర్టు చీఫ్ జస్టిస్‌గా రిటైరైనారు. ఇప్పటికీ అప్పుడప్పుడు కలుస్తుంటాం)

ఆయన్ని అడిగాను! నాటకంలో ఆడవేషం వెయ్యమని. ఆడవేషం ఎవడువేస్తాడు? పో! అన్నాడు.

ఎలాగో బ్రతిమిలాడి ఒప్పించాను - ఆయన మంచి స్పోర్ట్స్‌మన్. టెన్నిస్, ఫుట్‌బాల్ ఆడేవారు.

రెండో వేషానికి అంటే రాణాప్రతాప్ కూతురు వేషానికి 'చంద్రశేఖర్' అని నాకు జూనియర్. అంటే ఇంటర్ చదువుతుండేవాడు. మా బ్లాక్‌లోనే ఉండేవాడు. బాగా పాడేవాడు. టంగుటూరి సూర్యకుమారి పాటలు. అచ్చం -




కోకా రామచంద్రరావుగారు

సూర్యకుమారి లాగానే పాడేవాడు! పొద్దున్నే సుప్రభాతంలా పాడి మమ్మల్ని మేలుకొలిపేవాడు. అతను రాణాప్రతాప్ కూతురు వేషం!

గోపాలరాయశర్మ నా పక్కగదే! రిహార్సల్సు కాలేజీ బిల్డింగ్‌లోనే ఒక రూంలో! రిహార్సలుకు రమ్మంటే 'వస్తానులే పద' అనేవాడు.

కోకా రామచంద్రరావు గారు టెన్నిస్ ఆడుతుంటేవాడు! రిహార్సలకు రమ్మంటే "ఈ ఒక్క గేమ్ ఆడి వస్తా" అనేవాడు. వచ్చేవాడుగాదు!

మళ్లీ వెళ్లి టెన్నిస్‌కోర్టులో కూర్చుని వెంటబెట్టుకుని తీసుకువచ్చేవాణ్ణి!

ఇలా అందర్నీ రిహార్సలుకు పోగుచేసి తీసుకురావడం నాకు పెద్ద తలనొప్పి.

ఏదో సామెత చెబుతారే - 'కప్పల తక్కెడ' అని ఒక కప్పని తెచ్చేసరికి - ఇంకో కప్ప ఎగిరిపోతుంది.

అలా!

మా తెలుగు లెక్చరర్ - చల్లా సత్యనారాయణగారు. ఆయన్ని గురించి చాలా చెప్పాలి. తరువాత చెబుతాను.

ఆయన - రిహార్సల్సు కండక్ట్ చేసేవాడు. నాటకం ప్రదర్శనలో గూడ - ఆయన ప్రాంప్టర్!

నేను - రాణాప్రతాప్ వేషం! రామచంద్ర కాశ్యప నాకు జూనియర్! అతను అక్బరు వేషం! అతనికి ప్రైజ్ వచ్చింది. కాలేజీ చదువు అయిన తరువాత గూడ - విజయవాడలో అతను, నేనూ, రామన్నపంతులు, కొప్పరపు సుబ్బారావు గారు - 'రాఘవ కళా సమితి' స్థాపించి నాటకాలు వేశాం! రామన్న - కాశ్యప - సినిమాలలో గూడ నటించారు.

నాకు నాటకాల అనుభవం అంతకు ముందే వుంది. గుంటూరు - హిందూ కాలేజీలో ఇంటర్మీడియట్ చదివేటప్పుడు కాలేజీ 'డే' చివరి రోజు నాడో ఎప్పుడో భమిటిపాటి కామేశ్వరరావుగారి "ఎప్పుడూ - ఇంతే" అని ఒక



నాటిక వేశాం! అందులో మూడు పాత్రలు - 'పర్వతాలు', 'పానకాలు', 'అమృతం'! 'పర్వతాలు', 'పానకాలు' - 'రవి', 'జగన్నాథ్'. వాళ్లిద్దరూ, నేను - మేం ముగ్గురం 'త్రీ మస్కటీర్స్'లాగ! నేను మొట్టమొదటిసారి మొఖానికి రంగువేసుకున్నది ఆ నాటకంలోనే!

మా తెలుగు మాస్టారు - చల్లా సత్యనారాయణగారని చెప్పానే ఆయనకి నాటకాలంటే సరదా! బాగా ప్రోత్సహించేవాడు.

1999 డిసెంబరులో - గుంటూరు వెళ్లి చూసి వచ్చాను. ఆయనకి అప్పుడు 87-88 ఏళ్లు! చాలా నీరసంగా వున్నారు.

నేను లయోలా కాలేజిలో చేరే ముందు - ఒకటి-రెండేళ్ల క్రితమే ఆయన కాలేజిలో లెక్చరర్‌గా చేరారు.

సీనియర్ లెక్చరర్ ఆకుండి పరబ్రహ్మశాస్త్రిగారు చల్లా సత్యనారాయణగారు జూనియర్ లెక్చరర్!

కాలేజి మేనేజిమెంటు వాళ్లు ఏం చేసేవాళ్లంటే ఒకరిని ప్రోజ్ ఒకరిని పొయిట్రీ చెప్పమని కాకుండా ఒక్కొక్క బ్యాచ్‌ని ఒకరికి అప్పజెప్పేవాళ్లు.

అంటే - ఇద్దరు లెక్చరర్ల మధ్య పోటీ అన్నమాట! ఎవరి బ్యాచ్‌లో ఎన్ని ప్యాసులు - క్లాసులు వస్తయ్యో చూడాలని! మా బ్యాచ్‌కి చల్లా సత్యనారాయణగారు. ఆయన వయస్సు అప్పటికి చాలా తక్కువ. 1999లో నాకు దాదాపు 80 అయితే యూనివర్సిటీలో తెలుగు యం.ఏ. ప్యాసయి వచ్చాడు. ఈ మధ్య ఎక్కడయినా పని చేశాడేమో!

ఆయనికి నేను తెలుగులో క్లాస్ బ్రైట్‌గా వుంటే నామీద శ్రద్ధ చూపేవాడు. నాకు క్లాసులో ఎప్పుడు ఫస్టుమార్క్ వచ్చేది! అందుకని నన్ను పట్టుకుని తోమేవాడు! మాకు తెలుగులో 'ముద్రారాక్షసం' నాటకం వుండేది. సంస్కృత నాటకానికి తిరుపతి వెంకట కవుల తెలుగు అనువాదం. అందులో - నాకు ఒక పద్యం ఇప్పటికీ జ్ఞాపకం!

ముందు - సూత్రధారుడు నాంది వగైరాలు వుంటయ్ గదా! అందులో 'చాణక్యుడి' 'పిలక'ను వర్ణిస్తూ ఒక పద్యం-

"అలుక నిప్పు నుండి వెలువడు పొగ తీగ!

నందకుల మడంచిన నల్లత్రాచు!"

మాకు ప్రోజ్‌లో బందరు కృష్ణా పత్రిక సంపాదకుడు ముట్నూరి కృష్ణారావు గారు 'కాళిదాసు' నాటకాల మీద వ్యాసాలు వ్రాశాడు. ఆ వ్యాసాలు 'సమీక్ష' అని - ఒక పుస్తకంగా వేశాడు! అది మాకు ప్రోజ్ టెక్ట్స్!

మోడ్రన్ పొయిట్రీ రాయప్రోలు సుబ్బారావు గారి "తృణ కంకణం" అవన్నీ నాకు కంఠస్థం! నేను క్లాసులో కాస్త బ్రైట్‌గా ఉండడం వల్ల మా మాస్టారు సత్యనారాయణగారు క్లాసులో చెప్పిన పాఠాలకు అదనంగా కాళిదాసు నాటకాలు మీద వేరే పుస్తకాలు విమర్శలు తెచ్చి నాకిచ్చి చదవమనేవాడు. 'ముద్రారాక్షసం' మీద గూడ పుస్తకాలు ఇచ్చేవాడు. 'ఇవి చదవోయ్' అనేవాడు. అవి తెచ్చి నేను నా రూంలో పడేసేవాణ్ణి! నాలుగు రోజులు తరువాత 'చదివావ?' అని అడిగేవాడు. లేదు మాస్టారు అని ఏదో వంక చెప్పేవాణ్ణి! మళ్లీ నాలుగురోజుల తరువాత మళ్లీ అడిగేవాడు "చదివావా" అని.

నేను చివరికి "ఎందుకు మాస్టారూ? నన్ను బాధపెడతారు? నేను ఎట్లాగూ పాస్ అవుతాను? నేను వచ్చింది



బి.ఏ డిగ్రీ కోసం! ఇంగ్లీషు ఎకనామిక్స్ ఎలాగూ పాస్ అవుతాను. డిగ్రీ వస్తుంది. నాకు చాలు! అనేవాణ్ణి! పాపం ఆయన "నా కోసం చదవవోయ్!" నీకు క్లాస్ వస్తే - నాకు క్రెడిట్ వస్తుంది అనేవాడు.

నేను ఎలాగూ ఆయన ఇచ్చిన పుస్తకాలు చదివేట్టులేనని గ్రహించి- ఆయనికి మధ్యాహ్నం పూట క్లాసు లేకపోయినా గూడ కాలేజి వదిలేదాకా స్టాఫ్ రూంలోనో - లేక - కాలేజికి - హాస్టలుకు మధ్య పెద్ద చెట్లు 'ఎవిన్యూ' ఉండేది. ఆ చెట్లకింద బెంచీ మీద కూర్చునేవాడు నాకోసం.

ఆయన ఇల్లు గూడ నుంగంబాకంలో ఉండేది. కాలేజికి రెండు మూడు కిలోమీటర్లు ఉండేది.

కాలేజి అయిన తరువాత నన్ను "పుస్తకాలు రూంలో పడేసి రా!" అనేవాడు. ఇద్దరం కాంటీన్‌లో కాఫీ తాగేవాళ్లం! డబ్బులు నన్ను ఇవ్వనిచ్చేవాడు కాదు. "నువ్వు నా స్టూడెంటుగా వున్నంతవరకూ నా కాఫీకి నేను డబ్బులు ఇవ్వవలసిందే" అనేవాడు.

కాలేజి నుంచి వాళ్ల ఇంటికి వెల్లడానికి ఒక చెరువు గట్టువుండేది! ఆ గట్టుమీద ఇద్దరం నడిచివెళ్లేవాళ్లం. ఆ నడక సమయంలో ఆయన నాకిచ్చిన పుస్తకాలలోని విమర్శలు, విషయాలు నాకు చెప్పేవాడు.

ఇక్కడ ఒక ఆసక్తికరమైన విషయం చెప్పాలి! 'ముద్రారాక్షసం' నాటకంలో 'నాయకుడెవరు?' అనేది ముఖ్యమైన ప్రశ్న! 'రాక్షసుడు' నందులకు మంత్రి. చాణక్యుడు - చంద్రగుప్తుని పక్షం! నందవంశాన్ని నాశనం చేయాలని చాణక్య శపథం!

చాణక్య - చంద్రగుప్తులలో ఎవరు నాయకుడు అని ప్రశ్న! పాశ్చాత్య విమర్శకుల ప్రకారం 'చాణక్యుడు' నాయకుడు! ఎందుకంటే చాణక్యుడే ప్రధానంగా కథ నడిపేవాడు గనక!

కాని - మన ప్రఖ్యాత విమర్శకుల ప్రకారం 'ఫలస్వామీ' నాయకుడని - ఒక థియరీ ఉంది. 'ఫలితం' ఎవరికి దక్కుతుందో అతడు 'నాయకుడు' అని! అందువల్ల నాయకుడు "చంద్రగుప్తుడు" అని పాశ్చాత్య విమర్శకుల వాదం!

క్లాసు పరీక్షల్లో నేను ఒకసారి అటూ ఒకసారి ఇటూ సమర్థిస్తూ రాసేవాణ్ణి! రెంటికీ మార్కులు వేసేవాడు!

నాకు బాగా జ్ఞాపకం! మాకు యూనివర్సిటీ పరీక్షలో 1941 మార్చిలో, బీచ్‌లో బిల్డింగ్స్ పక్కన 'సెనేట్ హాలులో' మాకు పరీక్ష వుంది.

హాస్టలు నుంచి ఉదయం 8 గంటలకి బస్సు బయలుదేరేది. సెనేట్ హాలుకు వెల్లడానికి ఆయన పనిగట్టుకుని హాస్టలుకు వచ్చేవాడు. ఆ రోజు తెలుగు పరీక్ష! బస్సు బయలుదేరబోతుంది. ఆయన నా దగ్గరికి వచ్చి "నాయకుడు ఎవరు?" అని ప్రశ్న వస్తుంది. "ఏం రాస్తావు?" అని అడిగారు. "చాణక్యుడనే రాస్తాను" అన్నాను.

ఆయన కోపంగా! "ఏమిట్రా మొండితనం? పేపర్లు దిద్దే వాళ్లను దృష్టిలో పెట్టుకుని రాయాలి? నువ్వు - 'చాణుక్యుడు' నాయకుడని ఎంత బాగా రాసినా వాళ్లు మార్కులు ఇవ్వరు! అన్నాడు.

"ఎలా ఇవ్వరో చూస్తాను! కన్‌విన్సింగ్‌గా రాస్తాను" అన్నాను!

బస్సు వెళ్లిపోయింది!

పరీక్ష పేపర్లో ఆ ప్రశ్న వచ్చింది. నాకు మాస్టారు జ్ఞాపకం వచ్చారు. ఆయన మీద గౌరవంతో పాపం ఆయన్ని



బాధపెట్టడం ఎందుకు లెమ్మని ఓరియంటల్ విమర్శకుల ప్రకారం 'ఫలస్వామి' చంద్రగుప్తుడే నాయకుడని రాశాను!

తిరిగి సాయింత్రం బస్సు హాస్టలుకు వచ్చేసరికి ఆయన హాస్టల్లో వెయిట్ చేస్తున్నారు. నేను బస్సు దిగగానే "ఏదీ! పేపరు ఇటితే" అన్నారు! ఇచ్చాను! ప్రశ్నలు చదివారు!

"అన్ని ప్రశ్నలు రాశావా? చందస్సు! వ్యాకరణం!..."

"అన్నీ రాశాను మాస్టారూ. ఏ ఒక్కటీ వదల్లేదు!"

"మరి! దీనికేం రాశావు! చాణక్యుడా? చంద్రగుప్తుడా?"

"మీకు ముందే చెప్పాగా! 'చాణక్యు'డేనని రాశాను" అన్నాను

ఆయన నా వంక తీవ్రంగా చూశారు.

నేను నవ్వుతూ "కోప్పడకండి మాస్టారూ! చంద్రగుప్తుడనే రాశాను."

తరువాత పరీక్షలు అయిపోయి రిజల్టు వచ్చేముందు యూనివర్సిటీలో ఆయనకి తెలిసిన వాళ్లద్వారా నా మార్కులు గురించి ఎన్క్వైరీ చేసి - నాకు - విజయవాడ ఉత్తరం రాశారు.

"నీకు ఫస్ట్క్లాసు మాత్రమే గాదు! ఫస్టు రాంక్ గూడ వచ్చింది. చాలా సంతోషంగా ఉంది." అని - "నీ ఫొటో ఒకటి పంపించు! 'భారతి'లో వేయిస్తాను" అని రాశారు. ఫొటో ఒకటి పంపించాను! 'భారతి'లో వేశారు.

1941 అక్టోబరు 'భారతి'లో వేశారు నా ఫొటో!

ఆ మధ్య మదరాసులో ఒకసారి మిత్రుడు బి.యస్.ఆర్ చెప్పాడు "1941 అక్టోబరు భారతిలో మీ ఫొటో ఉంది" అని.

నేను 1951లో సినిమారంగ ప్రవేశం చేసిన తరువాత మదరాసులో అప్పుడప్పుడు ఆలిండియా రేడియోకి వెళుతుండేవాడిని నాటకాలలో పాల్గొనేందుకు - నాటకాలు రాసేందుకు అప్పుడు అక్కడ జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రిగారుండేవారు. ఆయన ఒకసారి చెప్పారు. 'భారతి'లో మీ ఫొటో వేసింది నేనేనండి" అని. అప్పుడు ఆయన 'భారతి'లో పనిచేస్తుండేవాడట.

నేను 1941 సెప్టెంబరులో కాన్వకేషన్కి మదరాసు వెళ్లినప్పుడు గూడా కాలేజీలో మాకు టీపార్టీ ఇచ్చారు - యాజమాన్యం!

అప్పుడు గూడ మా మాస్టారు సత్యనారాయణగారు ఎంత సంతోషించాడో చెప్పలేను!

"ఊఁ! తరువాత ఏం జేస్తావు?" అని అడిగారు. తెలుగు ఎం.ఏ చదవమని సలహాయిచ్చాడు.

'చెప్పలేను' మాస్టారూ అన్నాను.

"ప్రైవేట్గా కూడా చదవచ్చు! రెండు నెలలు ఇక్కడ ఉంటేచాలు! లైబ్రరీలలో కొన్ని గ్రంథాలు చదవవలసి ఉంటుంది" అన్నారు.

విజయవాడ వెళ్లిపోయాను. మా మేనమామ రామరాజుగారు 'లా' చదవమన్నారు. 'లా' అంటే నాకు ఇష్టంలేదు.

మాస్టారి సలహా ప్రకారం ఎం.ఏ. ప్రవేటుగా చదువుదామనుకున్నాను. కొంత ప్రిపేర్ చేశాను గూడ. కాని,





ఆంధ్రాభ్యుదయము



శ్రీ డి. వి. నరసరాజుగారు

ఈ యువకుడు ఈయేడు జరిగిన మద్రాసు విశ్వవిద్యాలయ పట్టప్రదానసభలో బి. ఏ. డిగ్రీపరీక్షయందు తెలుగున రాష్ట్రమంతకును మొదటివాడుగా ఉత్తీర్ణుడైనందున బొబ్బిలిరాజా బంగారుపదకముతో బహూకరింపబడెను. ఇతడు మద్రాసు లయోలా కళాశాలవిద్యార్థి.

**భారతి 1941 అక్టోబర్ సంచిక**

తరువాత అనిపించింది ఎం.ఏ చదివి ఏంచేయాలి? మహా అయితే బడిపంతులు ఉద్యోగం వస్తుంది. ఉద్యోగాలు చేసే ఉద్దేశం ఎప్పుడూ లేదు! పైగా - అప్పటి వరకు మా స్వగ్రామం తాళ్లూరులో భూములు కవులుకిచ్చి మా మేనమామ రామరాజు గారే అజమాయిషి చేస్తుండేవారు.

ఆయన మా ఊరు తీసుకెళ్లి నా భూములు నాకు అప్పజెప్పి 'ఇక నువ్వే చూసుకో' అన్నారు.

అదీగాక - మా రెండో మేనమామ - ఆదిరాజుగారు ఆయనకి పిల్లల్లేరు. నా దగ్గర ఉండాలని ఆయన కోరిక. నేను చెల్లెలు కొడుకుని - నా భార్య ఆయనికి అన్న కూతురు. ఎప్పుడో నేను మైనరుగా ఉన్నప్పుడు 1927 ప్రాంతంలో నా పేర కొన్న స్థలం సత్యనారాయణపురంలో వుంది. దానిలో మా ఆదిమామయ్యే ఇల్లు కట్టించి పెట్టాడు.

మళ్లీ మదరాసులో మా మేస్టారు - సత్యనారాయణగారిని కలుసుకునే అవకాశం ఎప్పుడొచ్చిందంటే-



నేను 1951 లో సినిమా రంగప్రవేశం చేసినప్పుడు! మరో గొప్ప విశేషం ఏమిటంటే నేను లయోలాలో చదివేటప్పుడు ఆయన వున్న అద్దె ఇంట్లోనే ఆయన రిటైరై పదిహేను ఇరవై ఏళ్ల క్రితం వరకు ఆ ఇంట్లోనే కాపురం ఉన్నాడు. నుంగంబాకం పోలీసుస్టేషన్ దగ్గర్లో మెయిన్‌రోడ్డు మీద ఉండేది ఆ ఇల్లు! చిన్నడాబా!

మరో విశేషమేమిటంటే ఇంటి అద్దె కాస్తో - కూస్తో పెంచారు. అది సహజమేననుకోండి! కాని - ఆ ఇంటి యజమాని ప్రతి సంవత్సరం ఉగాది పండగకి - మాస్టారుకి ఆయన భార్యకు కొత్త బట్టలు పెట్టి గౌరవించేవాడు!

1961లో నేను నుంగంబాకం లేక్ ఏరియాలో ఒక ఇల్లు కొన్నాను. అది మాస్టారి ఇంటికి దగ్గర! ఒకసారి నేనూ నాభార్య మాస్టారి ఇంటికి వెళ్లాం. ఏదో పండగ నాడు. అప్పుడు నా భార్యతో చెప్పాను. 1938 నుంచీ మాస్టారు ఈ ఇంట్లోనే ఉంటున్నారు అని.

మాస్టారి భార్య అన్నారు - చమత్కారంగా! "అప్పటికీ - ఇప్పటికీ ఇంట్లో పెద్దమార్పేమీలేదు గాని - అప్పుడప్పుడు పైనుంచి పెళ్లలు - సున్నం రాలుతూ ఉంటుంది." అన్నారు నవ్వుతూ!

ఆయన మరో గొప్ప పనిచేశారు! నుంగంబాకం లేక్ ఏరియాలో కార్పోరేషన్ హైస్కూలు ఒకటి ఉండేది. నేను చదువుకునేటప్పుడు ఆ స్కూలు బిల్డింగ్ ఒక్కటే ఉండేది. మిగతాదంతా చెరువు! ఆ తరువాత ఇళ్లు కట్టి - డెవలప్ చేశారు. అందుకే దానికి లేక్ ఏరియా అని పేరు పెట్టారు.

ఇంతకు చెప్పవచ్చిందేమిటంటే ఆ హైస్కూలులో తెలుగు మీడియంలో బోధించే సెక్షన్ ఒకటి ఉండేది. క్రమంగా ఆ సెక్షన్‌లో చదివే తెలుగు పిల్లల సంఖ్య తగ్గడంతో తెలుగు సెక్షన్ మూసేసే పరిస్థితి వచ్చింది. ఆ స్కూలులో 5వ తరగతి నుంచి స్కూలు ఫైనల్ దాకా ఉండేది.

5వ తరగతికి, తెలుగు పిల్లల్ని తయారు చేయడం కోసం మా మాస్టారు తెలుగు మీడియం - ఎలిమెంటరీ స్కూలు ఒకటి ప్రారంభించారు. మొదట నలుగురైదుగురు చుట్టుపక్కల గుడిసెల్లో ఉండే పిల్లలతో తన ఇంటి వరండాలో ప్రారంభించారు స్కూలు!

1951లో నేను మదరాసు వెళ్లే సరికి ఆస్కూలులో పిల్లల సంఖ్య పెరగడంతో ఒక తెలుగాయన ఖాళీ స్థలంలో పాకవేసి ఆపాకలోకి మార్చారు స్కూలు!

నాలాంటి తన పాత విద్యార్థుల్ని మెంబర్లుగా చేర్చి మరి కొందరి విరాళాలతో కొంత డబ్బు సేకరించారు. మాస్టారి ఇంటికి దగ్గరలోనే - దాదాపు 300 గజాల స్థలం అమ్మకానికి వచ్చింది. కొనడానికి - ఆయన దగ్గర - పూర్తిగా పైకం లేదు. నాతో చెప్పారు. 'ఎంత కావాలి' మాస్టారూ! అన్నాను.

'ఇంకా పదివేలు కావలసివస్తుంది' అన్నారు. "నేను ఇస్తాను! కొనండి మాస్టారూ!" అన్నాను. అలా - ఆ స్థలం కొని అందులో మళ్లీ కొంత ధనం పోగుచేసి ఒక బిల్డింగ్ కూడా కట్టించారు. నా పదివేలలో - తొమ్మిదివేలు - చందాలు వసూలుచేసి నాకిచ్చేశారు.

నేనూ - మిత్రుడు ప్రసాద్ మరి కొందరు మాస్టారి పాత విద్యార్థులు కమిటీగా వుండి - మేనేజ్ చేసేవాళ్లం. మాస్టారికి వయసుపైబడి ఆరోగ్యం అంతంత మాత్రంగా ఉండడం వల్ల ఒకే ఒక్క కొడుకు - ఆంధ్రాబ్యాంకులో మేనేజరుగా చేస్తుంటే విజయవాడుకు మకాం మార్చారు!



నేనొకసారి హైదరాబాద్ నుంచి బెజవాడకు ఫోన్ చేస్తే "నిన్నూ - ప్రసాద్‌ను ఒకసారి చూడాలని ఉందోయ్" అన్నారు.

"అలాగే మాస్టారు" అని విజయవాడ వెళ్లి కలిశాను. తరువాత మదరాసు నుంచి ప్రసాద్ గూడ వచ్చి కలిశాడు. అప్పటికే బాగా నీరసంగా ఉన్నారు మాస్టారు.

చివరికి 1999 డిసెంబరులో గుంటూరు వెళ్లి ఆయన్ని చూశాను. అప్పటికే మనుషుల్ని గుర్తుపట్టలేని స్థితిలో ఉన్నారు. నేను - జస్టిస్ చలమేశ్వర్ - ఇద్దరం వెళ్లాం. జస్టిస్ చలమేశ్వర్ గూడ ఆయన శిష్యుడే! మేమిద్దరం- ఆయనకు ప్రియశిష్యులం. విశేషం ఏమిటంటే - నేను మాస్టారికి మొదటిదో - రెండవదో బ్యాచ్ శిష్యుణ్ణి. జస్టిస్ చలమేశ్వర్ ఆయన రిటైర్ అయ్యే ముందు ఆఖరి బ్యాచ్ శిష్యుడు.

మేమిద్దరం - ఆయన మంచం ప్రక్కనే కూర్చున్నాం! ఆయన నీరసంగా కళ్లు మూసుకుని పడుకుని ఉన్నారు. అప్పుడప్పుడు కళ్లు తెరచి చూస్తున్నారు. ముందు చలమేశ్వర్‌న్ని చూచి "నువ్వు జడ్జివి కదూ!" అన్నారు. నేను "నమస్కారం మాస్టారూ!" అన్నాను. "నువ్వు నరసరాజువి కదూ!" అని - భార్య వంక చూచి అన్నారు. "నరసరాజుకి లక్షలు, కోట్లు ఉన్నాయ్! కాని అతిశయం లేదు" అన్నారు. మళ్లీ కళ్లు మూసుకుని పడుకున్నారు.

ఆ తరువాత కొన్నినెలలకు ఆయన కన్నుమూశారని వార్త వచ్చింది. ఆయన కొడుకు - ఢిల్లీ - ఆంధ్రాబ్యాంక్ మేనేజరు. అతనే మాకు ఫోన్ చేశాడు "నాన్నగారు పోయారని".

గుంటూరు - మాస్టారి అత్తవారి ఊరు! విన్నపాముల సీతారామయ్యగారని పెద్ద వ్యాపారవేత్త. ఆయనగారి చెల్లెలు - మాస్టారి భార్య.

మదరాసులో - మాస్టారు ప్రారంభించిన స్కూలు విషయం చెప్పానే, ఆ స్కూలు హెడ్మాస్టరు ఉండేవాడు. ఆయన పేరు గూడ సత్యనారాయణే. ఆయన అప్పుడప్పుడు - మదరాసులో - మా ఇంటికి వస్తుండేవాడు. 1980లలో! నేను స్కూలు కమిటీలో లైఫ్‌మెంబర్ని గదా. కమిటీ మీటింగులకి - నాకు చెప్పడానికి వచ్చేవాడు.

అతను ఒకసారి చెప్పాడు.

"మాస్టారు - తన ఒక్కగానొక్క కొడుకుని గూడ ఎక్కువగా తలవరండి! మీరంటే మాత్రం - అమిత ప్రేమ! ఒకసారి నరసరాజుని వచ్చి కనబడమని చెప్పవోయ్" అన్నారట.

అప్పుడప్పుడు మాస్టారి యింటికి వెళ్లి కాసేపు కూర్చుని కబుర్లు చెప్పుకొని వచ్చేవాణ్ణి!

అదీ మా మాస్టారి కథ!

జీవితంలో మరపురాని - మరువలేని - మనుషులు - బహుకొద్దిమంది ఉంటారు! అందులో - మా మాస్టారు ఒకరు.

1999 డిసెంబరులో మాస్టారిని చూడ్డానికి గుంటూరు వెళ్లానని చెప్పానే - అప్పుడు ఏవో నాటకాల పోటీలలో నన్ను సన్మానించారు విజయవాడలో!

మాస్టారిని గుంటూరులో చూచి వచ్చిన తరువాత ఎందుకో జ్ఞాపకం వచ్చింది - నేను విజయవాడలో - స్కూలు ఫైనల్ వరకు చదువుకున్న హిందూహైస్కూలు.



నేను 1936లో స్కూలుఫైనలు ప్యాసయినాను. అప్పటినుంచి నేను విజయవాడలోనే ఉన్నాను. మదరాసుకు మకాం మార్చిన తరువాత ఎన్నో సార్లు విజయవాడ వస్తూనేవుండేవాణ్ణి! ఎప్పుడూ - హైస్కూలు ఎలా ఉందో చూద్దామని బుద్ధిపుట్టనేలేదు!

63 ఏళ్ల తరువాత ఎందుకో వెళ్లి హైస్కూలు ఎలా వుందో చూద్దామని అనిపించింది. ఆ రోజు సాయింకాలం- నాటకాలు - వగైరాలు. ఆ ఉదయం అనిపించింది వెళ్లి హైస్కూలు చూచిరావాలని! ఆర్గనైజర్స్‌కి చెబితే కారు ఏర్పాటుచేశారు. నాతోపాటు రావి కొండలరావు, సినీ రచయిత తోటపల్లి మధు, నటుడు కబీర్‌దాసు నాతో కారులో వచ్చారు!

నేను అనుకున్నాను - "నా మొఖం ఎవరికి తెలుస్తుంది! నన్నెవరు గుర్తుపడతారు?" ఊరికే - బిల్డింగ్ ఎలావుందో చూద్దామని వెళ్లాను.

కారుగేటు ముందు ఆగింది. నేను కారు దిగుతుంటే ఎవరో నన్ను గుర్తుపట్టి లోనికి వెళ్లి చెప్పారేమో ఒకామె పరుగెత్తుకుంటూ నా దగ్గరికి వచ్చి నా రెండు చేతులూ పట్టుకుని కళ్ల కద్దుకుని కన్నీళ్ల పర్యంతం అయింది.

"ఎవరమ్మా మీరు?" అన్నాను.

"నేను ఈ హైస్కూలు హెడ్ మిస్ట్రెస్‌ని! యీ రోజు మాకు పర్వదినం! మీరు వచ్చారు!" అని సంతోషంతో మమ్మల్ని లోపలికి తీసుకెళ్లింది. పాత బిల్డింగుకు వెనక కొంత స్థలం కొని - బిల్డింగ్ ఎక్స్‌టెన్ష్ చేశారు. ఏవో విదేశీ ధర్మ సంస్థల సహాయంతో - పేద విద్యార్థులకి - ఉచితంగా భోజనాలు వగైరా సోషల్ సర్వీస్ చేస్తున్నారట! ఆమె చెప్పింది. ఇంతలో స్టూడెంట్స్ - ఇరవై పాతికమంది పోగయ్యారు.

నాకు సినిమా గ్లామరు ఉందిగా! అందరూ చుట్టూ చేరి నా వంక చూస్తున్నారు. నేను వాళ్లకి చూపించా "నేను ఫోర్తుఫారంలో ఈ గది - ఫిఫ్తుఫారంలో ఈ గది - స్కూలుఫైనల్లో గది!" అని గతమంతా గుర్తు చేసుకున్నా.

మెయిన్ బిల్డింగ్ మొదట్లో 'యల్' షేప్‌లో ఉండేది. ఉత్తరం ప్రక్క పెంకుటిల్లు ఉండేది. దానిని డాబా చేశారు. హెడ్మాస్టరు గది అప్పుడు మేడ మీద ఉండేది. ఇప్పుడు దక్షిణం వైపు ఒక బ్లాక్ కట్టారు. అందులో హెడ్ మిస్ట్రెస్ రూము! ఆఫీసు!

మేము చదువుకునేటప్పుడు - పెద్దగంట ఒకటి వుండేది! దానికి ఒక చక్రము - దానికి ఒక తాడు. ఆ తాడు హెడ్మాస్టరు కొటారు రామారావు గారి గదిలో వుండేది. ప్యూన్ వెళ్లి తాడులాగుతుంటే గంట మోగేది. గంట చుట్టు పక్కల ఒక కిలోమీటరు వరకు వినపడేది. అది ఇప్పుడు గూడ వుంది! కాని - స్థానం మార్చారు! గంటకొట్టి- చూపించింది ఆవిడ!

నాలుగో ఫారంలో నేనూ - నాకు సీనియర్ తిరుమలరాజు సత్యం - ముత్యాలంపాడు నుంచి - నడిచివెళ్లే వాళ్లం - టిఫిన్ కారియర్లు తీసుకుని. మధ్యాహ్నం విరామ సమయంలో మేమిద్దరం ఏదోక్లాస్ గదిలో కూర్చుని టిఫిన్ కారియర్లు విప్పి - భోజనం చేసేవాళ్లం. స్కూలు గేటు పక్కన పంపు ఉండేది. ఆ పంపు దగ్గర - టిఫిన్ కారియర్లు కడిగేవాళ్లం! ఆ పంపుగూడ అక్కడ నుంచి తీసి మరోచోట పెట్టారు.

చెప్పానే - నేను థర్డు ఫారం గవర్నరుపేటలో హిందూబ్రాంచి స్కూలులో చదివాను. అప్పుడు - స్కూలు ఉదయం 7 నుంచి 10 వరకు మధ్యాహ్నం 2 నుంచి 5 వరకు. మధ్యాహ్నం ఎండలో ముత్యాలంపాడు నుంచి





శ్రీ కొటారు రామారావుగారు

నడిచివెళ్లే సరికి దాహం వేసేది. మార్చి - ఏప్రిల్ నెలలు! పంపుల్లో నీళ్లు ఉండేవి కాదు! పంపునోట్లో పెట్టుకుని పీల్చినా నీళ్లు వచ్చేవికాదు. ఆ వీధిలో ఇళ్లు ఉండేవి. పాపం! మధ్యాహ్నం - పడుకొని నిద్రపోతుండేవారు. తలుపులు కొడితే తలుపు తీసేవాళ్లు! "అమ్మ దాహం వేస్తుంది" అంటే - ఒకామె ఓపిగ్గా మంచినీళ్లు తెచ్చి యిచ్చేది. ఒకామె విసుక్కుని తలుపువేసుకుని పోయేది.

కొంచెం దగ్గర్లో - 'గణపతి విలాస్' అని చిన్న హోటల్ ఉండేది. అది యిప్పటికీ ఉందను కుంటాను! ఈ మధ్య వెళ్లినప్పుడు కూడ చూశాను! వెళ్లి - మంచినీళ్లు అడిగితే టిఫిన్ తింటే గాని - మంచినీళ్లు యిచ్చేవాడు గాదు! అందుకని ఇడ్లీ - కానీయో అర్ధణాయో వుండేది. రెండు ఇడ్లీలు తిని - నాలుగు గ్లాసులు మంచి నీళ్లు తాగేవాళ్లం.

1999లో హైస్కూలుకు వెళ్లానని చెప్పానే! హెడ్మిస్ట్రెస్ రూంలో బోర్డుమీద - పాత హెడ్మాస్టర్ల పేర్లు రాసి ఉన్నాయ్! ఆ స్కూలు పెట్టి దాదాపు వంద ఏళ్లు అయివుంటుంది. వైశ్యులు పెట్టిన స్కూలు అది!

పేరు "కన్యకాపరమేశ్వరీ - విస్సంసెట్టి - వెంకటరత్నం హిందూ హైస్కూలు" S.K.P.V.V. Hindu High School. ఆ వెంకటరత్నం గారు పెద్ద డొనేషన్ ఇచ్చివుంటాడు. అందుకని ఆయన పేరు పెట్టి ఉంటారు.

నేను చదివినప్పుడు - హెడ్మాస్టరు - కొటారు రామారావుగారు! ఆయనకు గాంధీనగర్‌లో సొంతయిల్లు ఉండేది. అందుకే ఆ వీధికి 'రామారావు వీధి' అని పేరు పెట్టారు. ఆ తరువాత - కొత్తూరు ఉమామహేశ్వరరావు గారు హెడ్మాస్టరయ్యారు. ఆయన మాకు లెక్కల మాస్టారు! ఆయన దగ్గర నేను ట్యూషన్ గూడ చదువుకున్నాను- స్కూలు ఫైనల్లో!

మధ్యలో - ఇంకెవరి పేర్లోవున్నాయ్. అందులో ఒకాయన పేరు - ఎంబెరుమనార్! ఆయన నాకు మదరాసులో పరిచయం! ఆయన స్వస్థలం ఒంగోలు.

తరువాత - గాంధీనగర్‌లో ఒక హైస్కూలు పెట్టారు. దానికి హెడ్మాస్టరుగా పనిచేశాడు ఎంబెరుమనార్!

చివరలో - హెడ్మిస్ట్రెస్ - 'జొన్నలగడ్డ అన్నపూర్ణ' అనివుంది. ఆమె - మొట్టమొదటి మహిళా హెడ్మిస్ట్రెస్ ఆ స్కూలుకి - ఆమె గూడ - ఆ స్కూలు పాత విద్యార్థి అట! ఎలా ఏర్పాటు చేసిందో - ఒక ఫొటోగ్రాఫరు వచ్చి మా ఫొటో తీశాడు. పాదాభివందనాలంటే - నాకు చెడ్డ చిరాకు! కాని - ఏంజేస్తాం! టీచర్లు వచ్చి - ఒక్కొక్కరే



పాదాభివందనాలు చేశారు! ఆడపిల్లలు చాలామంది ఉన్నారు! సినిమాలు చూస్తారు గదా! నా పేరు తెలుసు! వచ్చి పాదాభివందనాలు చెయ్యడం! ఆటోగ్రాఫులు!

హెడ్‌మిస్ట్రెస్ విజటర్స్ బుక్కు యిచ్చింది. అందులో రాశాను "నా పేరు డి.వి. నరసరాజు! నేను యీ స్కూలులో 1933 నుంచి 36 దాకా 4,5 ఫారాలు స్కూలు ఫైనలు చదివాను. అప్పుడు హెడ్మాస్టరు కొటారు రామారావు గారు, తెలుగు మాస్టారు శిష్ట్లా లక్ష్మీకాంతశాస్త్రిగారు. ఆయన నాకు తెలుగు వ్యాకరణం నూరి పోశారు. ఆయన చెప్పిన చిన్నయసూరి వ్యాకరణ సూత్రాలు, సంధులు, సమాసాలు యిప్పటికీ గుర్తు వున్నాయ్. ఇప్పుడు మళ్లీ 63 ఏళ్ల తరువాత ఇక్కడికి రావడం నాకు ఎంతో ఆనందంగా ఉంది" అని రాశాను.

ఆమెతో చెప్పాను - "ఏదో సోషల్ సర్వీస్ చేస్తున్నారని చెప్పారు గదా! దానికి డొనేషన్ ఒక వెయ్యి రూపాయలు చెక్కు పంపుతాను" అని చెప్పాను. హోటలుకు వచ్చి చెక్కు రాసి - మనిషితో పంపాను!

స్కూలులో దాదాపు గంటసేపు గడిపాం! తిరిగి వస్తూంటే కారు దగ్గరికి వచ్చి ఆవిడ రెండు చేతులు పట్టుకుని కళ్లకద్దుకుని కళ్లనీళ్లు పెట్టుకుంది. గద్గదస్వరంతో "యీ రోజు మాకు పండగరోజు! మీరు వచ్చారు" అన్నది.

నాకు మాత్రం, అది మధురానుభూతి! యింతవరకు నా చదువు సంగతి చెప్పాగా.

ఇప్పుడు చెప్పవలసిన మరో విషయం ఒకటి ఉంది. అది నా పెళ్లి విషయం.

## పెళ్లి

నా పెళ్లి 1932 'మే'లో జరిగింది. మాది Child marriage! బాల్య వివాహం! అప్పుడు నాకు 12 ఏళ్లు. నా భార్యకు 10 ఏళ్లు! మా ఇద్దరికీ తేడా రెండేళ్లు గూడ లేదు. ఇంకా తక్కువే. ఏడాది పైన 8 నెలలు వ్యత్యాసం. ఆమె మా పెద్దమేనమామ గారి కూతురు!

మా పెద్దమేనమామ సుబ్బరాజు గారిని గురించి చెప్పాను గదా! మా తండ్రి గారు పోయిన తరువాత మా పెద్ద మామయ్యే తాళ్లూరు వెళ్లి - ఆస్తి విభాగాలు చేయించి నా వాటా భూములు కౌలుకిచ్చి నన్ను మా అమ్మ మా అక్కయ్య, మా తామ్మని ముత్యాలంపాడు తీసుకువచ్చారు. ఆ వ్యవహారాలన్నీ మా పెద్దమామయ్యే నిర్వహించాడు. అది 1924-25 ప్రాంతాలలో!

హనుమాన్ జంక్షన్ దగ్గర నరసన్నపాలెంకు ఆయన తన అత్త వారింటికి యిల్లరికం వెళ్లాడు! అసలు రెవిన్యూ రికార్డుల్లో ఆ ఊరి పేరు సీతారాంపురం. ఆ ఊరి పక్కన చిన్న కుగ్రామం నరసన్నపాలెం. సీతారాంపురాన్ని అందరూ రాజుగారి నరసన్నపాలెం అనేవాళ్లు.

మా పెద్ద మామయ్యకి రెండుపెళ్లిళ్లు. మొదటి భార్యది గూడ నరసన్నపాలెమే. ఆమె ఒక మగబిడ్డని కని చనిపోతే, ఆమె పినతల్లి కూతుర్నిచ్చి చేశారు. అదే ఊరు! ఆమె మా అత్తగారన్నమాట! మా పెద్దమామయ్యకి మొదటిభార్యకు ఒక కొడుకు వెంకట్రామరాజు. అందరూ చిట్టిరాజు - చిట్టోడు - అనేవాళ్లు. నేను 'చిట్టిబావ' అనేవాణ్ణి!



మా మామయ్యకి - రెండోసంబంధానికి ఒక కూతురు - అంటే నా భార్య. తరువాత ఒక కొడుకు - పిచ్చిరాజు.

మా పెద్దమామయ్యకి - నరసన్నపాలెంలో ఒక కార్ఖానా ఉండేది. ఎడ్లబళ్లు - మేనాలు - పల్లకీలు - చేసి అమ్మడం! ఆయనికి ఇంకా చాలా వ్యాపకాలుండేవి. ఆయన మొదటి భార్య - సవతి తమ్ముడు ఆస్తి తాలూకు ఏదో లిటికేషన్ ఉంటే అదంతా నెత్తిన వేసుకుని కోర్టుల చుట్టూ తిరిగి ఆరోగ్యం పాడుచేసుకున్నాడు.

అలాగా - కోర్టుల వెంట తిరిగి తిరిగి మా పెద్ద మామయ్యకి ఆరోగ్యం చెడివుంటుంది. ఏం తిన్నా అరిగేది కాదు. తీపి మాత్రం అరిగేది. బెల్లం అరిసెలు - పూర్ణాలు తెగతినేవాడు. పాలుతాగేవాడు! ఏంలాభం! తిని - బయటికి పోగానే వాంతి అయ్యేది. పైపంచెతో - మూతి తుడుచుకుని - వెళ్లిపోయేవాడు. బహుశా కడుపులో - అల్సరేమో! కడుపులో నొప్పి ఎక్కువైతే డాక్టర్లకు చూపుదామని. మదరాసు వెళ్లాడు. అక్కడ డాక్టర్లు ఆపరేషన్ చేయాలన్నారు! ఆ రోజుల్లో ఆపరేషన్ అంటే తిరిగి ఇంటికి వస్తామనే గ్యారంటీ లేదు! అందుకని - ఇంటి దగ్గర ఏదో పనులున్నాయని వంకబెట్టి - ఆ పనులు చూసుకుని వస్తానని - రైలెక్కి వచ్చేశాడు. వచ్చి బెజవాడ స్టేషన్‌లో దిగి నేరుగా - ముత్యాలంపాడు వచ్చాడు. ఇంట్లో తల్లి - తండ్రి - తమ్ముడు - చెల్లెళ్లు ఉన్నారుగా. "డాక్టర్లు ఏం చెప్పారని" అడిగితే ఏదో చెప్పారులే అని మాట దాటేసి -

"ఒరేయ్! పౌరోహితుణ్ణి పిలిపించండ్రా!" అన్నాడట! ఎందుకు అంటే "నేను ఎక్కువ రోజులు బతకను! వెంటనే పిల్లల పెళ్లిళ్లు చేసేస్తాను." అన్నాడట! అంటే - పెద్దకొడుకు పెళ్లి. కూతురు పెళ్లి. మేనరికంగదా! కూతుర్ని నాకిచ్చి చెయ్యాలని ఎప్పుడో పుట్టినప్పుడే నిర్ణయించడం - ఆరోజుల్లో ఆచారం గదా!

"అదేమిటి? ఆడుకునే చిన్నపిల్లలు - వాళ్లకి అప్పుడే పెళ్లేమిటి?" అని తమ్ముళ్లు - చెల్లెళ్లు అంటే-

"ఆఁ నేను ఎక్కువ రోజులు బతకను!" అంటే "ఏం? నువ్వు లేకపోతే - మేము లేమా? మేం చెయ్యలేమా?" అన్నారట తమ్ముళ్లు.

"ఏమో! అప్పుడు వాడు చేసుకుంటాడో లేదో! నేను వాడి ఆస్తి కాపాడాను! అంత ఆస్తిపరుడు - అల్లుడు కావాలని కోరుకోవడం తప్పా!" అని ముహూర్తాలు పెట్టించేశారు.

మరో విశేషమేమిటంటే మా మేనమామలు అయిదుగురిలో - ఆడపిల్ల నా భార్య ఒక్కతే!

రెండోమామయ్యకి - పిల్లలు లేరు! మూడో మామయ్య చనిపోయాడు. ఆయనికి ఒక కొడుకు! నాలుగో మామయ్యకి నలుగురూ కొడుకులే - ఆడపిల్లలు లేరు. అయిదో మామయ్యకి రెండేళ్ల క్రితం మాఅక్కయ్య నిచ్చి వివాహం చేశారు.

అంటే అయిదుగురు అన్నదమ్ముల మధ్య నా భార్య ఒక్కతే ఆడపిల్ల!

నరసన్నపాలెంలో 5 రోజుల పెళ్లి. మా రెండో మామయ్య - ఆదిమామయ్య - బాగా శృంగార పురుషుడు. బోగం వాళ్లతో సంపర్కాలు గలవాడు. ఆయన నా పెళ్లికి - భోగం మేళం ఏర్పాటు చేశాడు.

మా పెద్దమామయ్య - నూజివీడు జమిందార్లు దగ్గరనుంచి - ఏనుగును తెప్పించాడు. (నరసన్నపాలెం-ఉయ్యూరు జమిందార్ల గ్రామం) ఏనుగుల మీద అంబారి కట్టాలి గదా! అందుకని - ఇంటి ముందు చాలా ఎత్తు పందిరి.



ఏనుగుల మీద అంబారి కట్టి - ఊరేగింపు చేయాలంటే అది చిన్నవూరు. ఒకటే బజారు. ఇంతా హడావుడి చేసి ఏనుగును తెస్తే - ఒక్కబజారు ఊరేగిస్తే ఏం ప్రయోజనం! అందుకని - దగ్గర్లో గుడివాడ వెళ్లే రోడ్డులో - కానుమోలు అని కాస్త పెద్ద ఊరు. రాత్రిపూట ఊరేగింపు. వేసవికాలం! అంబారీలో కూర్చో బెట్టారు - నన్ను మా చిట్టి బావని! ఒకటే ఉక్క - చెమట! పైగా - సూటు, నెత్తిన టోపి! మెడలో పెద్ద మల్లెదండలు! ఆ దండల్లో చిన్నచిన్న జీరోవాట్ బల్బులు. ఆ బల్బులు వెలగడానికి కోటుజేబులో బ్యాటరీ! ఆ బాధ వర్ణనాతీతం! అర్ధరాత్రి అవుతోంది. నాకు నిద్ర! పక్కనున్న మా బావమీద వాలేవాణ్ణి! 'సరిగా కూర్చోరా' అని ఆయన తోసేవాడు!

మరునాడు పొద్దున్నే ఇంటి ముందు పందిట్లో భోగంమేళం - మేజువాణీ! పెళ్లి కొడుకుల్ని తెచ్చి వాళ్లముందు కూర్చోబెట్టారు! మా బావ నాకంటె - అయిదారేళ్లు పెద్దవాడు. ఆయన ఏమైన ఎంజాయ్ చేశాడేమోగాని - ఆ భోగంవాళ్లు మేజువాణీ చేస్తూ - మా బుగ్గలమీద పొడుస్తుంటే నాకు సిగ్గు! చిరాకు! ఎప్పుడెప్పుడు పోయి ఆడుకుందామా అని నేను చూస్తుంటే - మా మామయ్య - కళ్లురిమేవాడు. మా పెద్దమామయ్యంటే నాకు చచ్చేభయం! నాకే గాదు ఆ ఊళ్లో నాయీడు పిల్లలందరికీ ఆయనంటే హడల్!

మరో విశేషం ఏమిటంటే - పెళ్లికి - బంధువులకి ముత్యాలంపాడు నుంచి నరసన్నపాలెంకు మా మామయ్య స్పెషల్‌గా బస్సు ఏర్పాటు చేశాడు. బస్సులో ఫ్రీగా పోవచ్చు గదా అని - పిలిచిన వాళ్లు పిలవని వాళ్లు బస్సు నిండా కిక్కిరిసినట్టు ఎక్కివచ్చారు జనం! పెళ్లి అయిన తరువాత - తిరిగి వెళ్లడానికి - బస్సుఏర్పాటు లేదు. ఎలా వెళ్లాలి! నూజివీడు నుంచి - ఏలూరి నుంచి 'జంక్షను' మీదుగా బెజవాడకు బస్సులు! మరి బస్సుకి చార్జీలుంటయ్‌గా! జేబులో డబ్బులు లేనివాళ్లు. వచ్చి అడిగితే - మా అమ్మ డబ్బులిచ్చి పంపింది.

'జంక్షన్' అన్నానే - అది - నూజివీడు - గుడివాడ రోడ్డు - ఏలూరు - బెజవాడ రోడ్డు అక్కడ క్రాస్ అవుతాయ్. అందుకని దానిని జంక్షన్ అనేవాళ్లు. అప్పుడు - జంక్షన్‌లో ఏమీవుండేది గాదు. నీడకి - ఒక చెట్టు గూడ ఉండేదిగాదు. నా చిన్నతనంలో అంటే నా పెళ్లికి ముందే - నేనూ మా పెదమామయ్య - బెజవాడ వెళ్లాలంటే బస్సుకోసం జంక్షన్‌కు వెళ్లేవాళ్లం. బస్సులు - ఉదయం ఒక బస్సు సాయింత్రం ఒక బస్సు వుండేది. ఎండ! నీడకి చెట్టు గూడ ఉండేది కాదు. ఇప్పుడు గూడ ఉన్నాయనుకుంటాను. జంక్షన్ నుంచి బెజవాడ వెళ్లే రోడ్డు మీద మా పెద్దమామయ్య నిద్రమాను మొక్కలు తెచ్చి - రోడ్డుకి రెండు పక్కల నాటించాడు. వాటికి నీళ్లు పోసి పెంచే బాధ్యత - ఆ పక్కన వున్న పొలాల వాళ్లకి అప్పజెప్పాడు. అవి తరువాత పెద్దమానులైనాయి.

జంక్షన్‌లో ఎండాకాలం కాసిని మంచినీళ్లు గూడ దొరికేవి గావు! అక్కడ - ఒక హోటలు పెట్టించాలని మా మామయ్య ఏలూరులో ముకుందారావని - కన్నడ బ్రాహ్మడు - అతన్ని తీసుకొచ్చి నూజివీడు - బెజవాడ రోడ్డు కార్నర్‌లో ఒక పూరిపాక వేయించి - ముకుందరావు చేత హోటల్ పెట్టించారు. అది మొట్టమొదటి హోటలు జంక్షన్‌లో.

ఆ ముకుందరావే - నా పెళ్లికి - వంటలు, టిఫిన్‌లు అన్నీ చేశాడు. ఆ తరువాత ముకుందరావు కొడుకు - ఒక పక్కా డాబా కట్టి - హోటలు అభివృద్ధి చేశాడని విన్నాను. ఇప్పుడు ఆ జంక్షన్ - గుర్తు పట్టలేనంతగా - పెరిగిపోయింది.

దానికి తరువాత 'హనుమాన్' జంక్షన్ అని పేరు ఎందుకు వచ్చిందంటే - అక్కడ ఒక పెద్ద హనుమంతుడి



విగ్రహం వుంది. ఆ విగ్రహం ఉయ్యూరు రాజాగారు పెట్టించారు. అందుకని దానికి హనుమాన్ జంక్షన్ అని పేరు వచ్చింది.

నా చిన్నతనంలో - అంటే - జంక్షన్‌లో మా పెద్దమామయ్య హోటల్ పెట్టించక ముందు - నేను 5వ క్లాసు ఫస్టు ఫారం చదివేరోజుల్లో సెలవలకి నరసన్నపాలెం వెళ్లేవాణ్ణి. సెలవల తరువాత ఒక్కొకసారి మా మామయ్య నన్ను వెంటబెట్టుకుని - బెజవాడ తీసుకెళ్లేవాడు.

నరసన్నపాలెం వూరికి - రోడ్డుకి మధ్య 'వద్దిగుంట' అని ఒక చెరువు వుంది. ఆ చెరువు గట్టు మీదకి వెళ్లేసరికి - రోడ్డు మీద నూజివీడు నుంచో బెజవాడకు బస్సు వెళుతుంటే మా మామయ్య పై పంచ ఊపుతూ "రేయ్! బస్ ఆపండి!" అని కేక వేసేవాడు. కేక వినపడితే బస్సు ఆపేవాళ్లు లేకపోతే బస్సు వెళ్లిపోయేది.

బస్సు కాకుండా రైల్లో బెజవాడ వెళ్లాలంటే నూజివీడు స్టేషన్‌కు వెళ్లాలి. వద్దిగుంట దగ్గర రోడ్డు దాటి చాపలపాడు మీదుగా నూజివీడు స్టేషన్‌కు వెళ్లేవాళ్లం. అప్పుడు రోజుకు రెండో-మూడో రైళ్లు ఉండేవి. అందులో మదరాసు-కలకత్తా మైలు, నూజివీడు స్టేషన్‌లో ఆగేది కాదు. అది చాలా చిన్న స్టేషను గనక. ఫస్టుక్లాసు ప్రయాణీకులు నూజివీడు స్టేషన్‌లో దిగాలంటే మైలు ఆ స్టేషన్‌లో ఆగేది. నూజివీడు జమిందార్లు ఎవరైనా మదరాసు నుంచి వస్తుంటే వాళ్లు ఫస్టుక్లాసులో వస్తారుగాబట్టి వాళ్లకోసం ఆగేది. నిజానికి స్టేషనుకు నూజివీడు టౌను పది పన్నెండు మైళ్ల దూరంలో ఉంది. అయినా జమిందార్ల వూరు గనక ఆ రోజుల్లో జమిందార్లకు బ్రిటిష్ ప్రభుత్వంలో పలుకుబడి స్టేటస్సు ఉండేవి గనక దూరమైన ఆ స్టేషనకు నూజివీడు పేరు పెట్టారు.

నరసన్నపాలెం నుంచి ఆడవాళ్లు బెజవాడకి వెళ్లాలంటె రెండెడ్ల బండి - గుడిసె బండిలో నూజివీడు స్టేషన్‌కు వెళ్లేవాళ్లు.

మేము గూడ - బస్సు దొరక్కపోతే రైలుకేవెళ్లేవాళ్లం! నూజివీడు స్టేషన్ చాలా చిన్నస్టేషన్. అరడజనుకు మించి ప్రయాణికులు వుండేవాళ్లుకాదు. రైలు వచ్చేముందు - పదినిముషాల ముందు బుకింగు కిటికీ తెరిచి - టికెట్లు యిచ్చేవాడు. అప్పుడు ఎంత? బెజవాడకు - ఆరణాలో - అర్ధరూపాయో ఉండేది చార్జి. పాసింజరు ప్రతిస్టేషన్‌లో ఆగేది. బెజవాడ నూజివీడు మధ్య అయిదారు స్టేషన్‌లు ఉండేవి. అంపాపురం, గన్నవరం, అవుటపల్లి, ముస్తాబాద్, గుణదల, బెజవాడ.

నాకు పెళ్లికి ఒక సూటు, ఫ్లెక్సుబూటు - ఒక చెమ్కీ టోపీ కొనిపెట్టారు. పెళ్లి అయిన తరువాత ఒకసారి ఆ టోపీ పెట్టుకుని బెజవాడకి రైలు ప్రయాణం చేస్తూ - కిటికీ గుండా - తలబయటికి పెట్టా! గాలికి - తలమీదవున్న చెమ్కీటోపీ ఎగిరిపోయింది. ఆ సూటు బూట్లు గూడ నేను ఎప్పుడూ వేసుకోలేదు. ఒకసారి బూట్లు వేసుకుని స్కూలుకి వెళితే అవి కరిచినాయి. అంతే - అవతలపారేశా! సూటు అంతే! పాంటు వేరుగా - కోటు వేరుగా ఎప్పుడైనా స్కూలుకు వేసుకెళ్లే వాణ్ణి! అంతే - ఆ తరువాత నా జీవితంలో యిప్పటివరకు సూటు సంగతి దేవుడెరుగు- పాంటు - బూట్లు గూడ వేసుకుని ఎరగను. స్కూలు ఫైనలు వరకు నిక్కర్లు, పైజామాలు! స్కూలు ఫైనల్లోనే ధోవతీ కట్టడం మొదలెట్టా!

అప్పటినుంచి - కాలేజీలో చదివేటప్పుడు గూడ - ధోవతి అరచేతుల చొక్కా - ఆ తరువాత ఫుల్ హాండ్ షర్టు - సినిమాలకు వెళ్లిన తరువాత లాల్చీలు! అంతే - ఇప్పటికి గూడ!



1941లో బి.ఏ ప్యాసయినప్పుడు - కాన్వకేషనుకు - యూనివర్సిటీ రూల్స్ ప్రకారం - తలపాగ మెడదాకా లాంగ్ కోటు ధోవతి యిదీ డ్రెస్. "తల పాగ అయితే మరీ - బడిపంతుల్లా ఉంటాను - మార్వాడీలు పెట్టుకునే ఫోల్డింగ్ టోపీ పెట్టుకుంటాను" అని అడిగితే - యూనివర్సిటీ వాళ్లు ఒప్పుకోలా! అందుకని మెడదాకా లాంగ్ కోటు- తలపాగతోనే వెళ్లి డిగ్రీ తీసుకున్నా!

ఆ కోటు తరువాత నాటకాల్లో ఉపయోగపడింది.

నా పెళ్లి 'శుభలేఖ'ను గురించి కొంత చెప్పాలి! నా పెళ్లి శుభలేఖలో ఒక విశేషం ఉంది.

నా పెళ్లి - మా బావ పెళ్లి ఒకసారేగదా జరిగింది. మా చిట్టి బావ అత్తవారు ఆ ఊరే - నరసన్నపాలెం! దగ్గర బంధుత్వమే! మా బావ అత్తగారి పుట్టిల్లు - పశ్చిమ గోదావరి జిల్లా, భీమవరం తాలూకానో తణుకు తాలూకానో!

మేము వాళ్లని తూర్పు రాజులనే వాళ్లం. కృష్ణా - గుంటూరు జిల్లాల రాజుల్ని వాళ్లు పడమటి రాజులనే వాళ్లు. తూర్పు రాజులు కొంచెం రాచరిక సాంప్రదాయం గలవాళ్లు. చాలా పాతకాలపు పద్ధతులన్నమాట!

పాతకాలం - ఎంతవరకంటే - మా బావగారి అత్తగారు (పశ్చిమ గోదావరి రాజుల కుటుంబాలలో ఆడవాళ్ల మాదిరే) మా జిల్లా ఆడవాళ్లలాగ చీరలు కట్టేదిగాదు. లంగా కట్టి - పైన - పైట వేసుకునేది. ఆమె చివరిదాక - చనిపోయేదాకా - అదే డ్రెస్సు.

గోదావరి జిల్లా రాజుల్లో మగవాళ్లు గూడ చాలా ఆర్థడాక్స్! మా బావగారి అత్తగారి అన్నదమ్ములు - అప్పుడప్పుడు వస్తూండే వారు. పెద్ద పెద్ద మీసాలు - గిరజాలు! మేము - అంటే మా మేనమామలు బంధువులు - మీసాలు కత్తిరించినా అసలు తీసేసినా, వాళ్లు "రాచపుటక పుట్టి - మీసం మీద కత్తెలాపెడతారురా!" అని మమ్మల్ని ఎగతాళి చేసేవాళ్లు.

వెస్టుగోదావరి జిల్లాలో - మగవాళ్ల పేరు చివర - 'రాజు' అని వుండేది. ఆడవాళ్ల పేరు చివర 'అమ్మ' అని ఉండేదిగాదు. సీతమ్మ-రంగమ్మకు బదులు సీతయ్య-రంగయ్య అని ఉండేది. ఆడ-మగ తేడా తెలియడానికి - మగవాళ్లకు 'రాజు' అని వుండేది గనక ఆడవాళ్లను 'సీతయ్య'గారు - 'రంగయ్య'గారు అనేవాళ్లు. ఆ తరువాత 'సీతయ్యమ్మ' అని మార్చారనుకోండి.

మా కుటుంబాలలో - ఆడవాళ్లకు చివర 'అమ్మ' అనే ఉండేది. పెళ్లి శుభలేఖలో - నాది మా బావది - ఇద్దరి పెళ్లిళ్లు ఉన్నాయి గనక శుభలేఖ ఎవరి పద్ధతి ప్రకారం వేయాలి అని మీమాంస వచ్చింది. మా పద్ధతి ప్రకారం వేస్తే తూర్పు రాజులు ఎగతాళి చేస్తారని వాళ్ల పద్ధతి ప్రకారమే శుభలేఖలు అచ్చువేశారు.

అంటే -

చి॥ ఉప్పలపాటి వెంట్రామరాజుకు (అంటే మా బావకు)

చి॥ సౌ॥ అన్నపూర్ణయ్యను (ఆమె పేరు అన్నపూర్ణమ్మ)

చి॥ దాట్ల వెంకట నరసరాజుకు (అంటేనాకు)

చి॥ సౌ॥ వెంకట్రామయ్యను (నాభార్య పేరు వెంకట్రామమ్మ)

ఇచ్చి - వివాహం జరప నిశ్చయించినారు గాన...........



ఈ శుభలేఖ చూచి - మా తరపు బంధువులు "యిదేమిటి నలుగురూ - మగవాళ్లేగాని పెళ్లి కూతురు పేరే లేదేమిటి" అని పగలబడి నవ్వుకున్నారు.

ఆ శుభలేఖ చాలా కాలం నా దగ్గర ఉండేది. తరువాత ఎక్కడ పోయిందో పోయింది.

రెండు పెళ్లిళ్ల నరసన్నపాలెంలోనే! ఒక గంటన్నర తేడాలో! మొదట నా పెళ్లి ఉదయం 6 గంటలకి. తరువాత మా బావపెళ్లి - పెళ్లి కూతురు ఇంట్లో! పక్క ఇల్లే! 7-30 - 8 గంటలకి.

తన ఆరోగ్యం బాగాలేదు - ఎక్కువ రోజులు బతకను అని పెద్దమామయ్య అనుకున్నట్టే 1932లో మా పెళ్లి అయిన తరువాత మంచాన బడి - 1935లో పోయాడు. అప్పుడు నేను 5వ ఫారం చదువుతున్నాను. తాళ్లూరులో ఆస్తుల అజమాయిషి ఆయన ఉన్నన్నాళ్లు - మా పెద్దమామయ్య చేసినా - నా చదువు విషయంలో మొదటినుంచీ - ముత్యాలంపాడులో - మా రాంమామయ్యే బాధ్యత తీసుకున్నాడు. పెద్దమామయ్య పోయాక - నా భూముల వ్యవహారం మా రాంమామయ్య చూసేవాడు.

మా రాంమామయ్య శ్రద్ధ తీసుకోవడం వల్లే - నేను డిగ్రీ వరకు చదవగలిగాను! ముత్యాలంపాడులో - నేను ప్రస్తు గ్రాడ్యుయేట్! అంతకు ముందు - ఇద్దరే - స్కూలు ఫైనలు వరకు చదివారు! నాతోటివాళ్లు మరో ఇద్దరు స్కూలు ఫైనలు ప్యాసయ్యారు గాని - ఆర్థిక కారణాల వల్ల కాలేజీ చదువులు చదవలేక పోయారు!

అప్పుడు బెజవాడలో కాలేజీలు లేవు. కాలేజీ చదువు చదవాలంటే - అటు బందరో - ఇటు గుంటూరో పోవాలి! ఆర్థికస్తోమత ఎంత మందికుంటుంది? బెజవాడలో ఎస్.ఆర్.ఆర్ కాలేజి - 1935లో ప్రారంభించారు. సైన్సు సబ్జక్టులు లేవని - నేను 1936లో గుంటూరు హిందూ కాలేజికి వెళ్లవలసి వచ్చింది.

ఇక్కడ నా భార్య ఆరోగ్యం గురించి కొంత చెప్పాలి.

1932లో పెళ్లి అయిందిగదా. అప్పటికి ఆమెకి 10 ఏళ్లు. రెండుమూడేళ్ల తరువాత రజస్వల అయింది. రజస్వల అయిన నెలకో - రెండు నెలలకో - హిస్టెరికల్ ఫిట్స్ - మూర్ఛలు అంటామే - అవి ప్రారంభమైనాయి. నరసన్నపాలెంలో ఆమె పుట్టింట్లోనే ఒకరోజు పెరట్లో ఎవరో ఏవో దంచుతున్నారు. ఈమె ఆడుకుంటూ సడెన్‌గా పడిపోయింది. సృహ లేదు. కాళ్ళ, చేతులు తీవ్రంగా నేలకేసి కొట్టుకోవడం శరీరం వంకర్లు తిరిగిపోవడం! రెండుమూడు గంటల తరువాత సాయింత్రం తేరుకున్నది. స్పృహ వచ్చింది.

అవే పోతాయిలే అనుకున్నారు.

మరునాడు మళ్లీ - మధ్యాహ్నం వచ్చినాయి - మూర్ఛలు! కాళ్లు - చేతులు నేలకేసి కొట్టుకుంటుంటే. పక్కనున్నవాళ్లు కాళ్లు చేతులు గట్టిగా పట్టుకున్నారు - కొట్టుకోకుండా!

విశేషమేమిటంటే - సాయంత్రం సుర్యాస్తమయం అయేటప్పటికి మూర్ఛలు ఆగిపోయేవి - లేచి కూర్చునేది! మనిషి మామూలాగానే వుండేది గాని కాళ్ల చేతులు - పట్టుకున్నందువల్ల నొప్పులు వస్తున్నయ్యని పట్టుకోవడం మానేశారు.

సాయంత్రం ఆగిపోయేవి. కాళ్ల చేతులు నేలకేసి కొట్టుకుని వాచి పుళ్లుపడి బాధపడేది.

యిక నాటు వైద్యాలు! ఎవరో ఆయుర్వేద వైద్యుడో, నాటు వైద్యుడో వచ్చి - ఆకుపసర్లు గ్లాసుడు పసరు తాగించడం! ఇంకా ఏవో చేదు మందులు! నానా హింస! మూర్ఛలు మటుకు తగ్గలేదు!



అప్పుడు నేను బెజవాడ హైస్కూల్లో చదువుతున్నాను. ఆవిడ మూర్ఛలు గురించి వినడమేగాని - పోయి చూడడానికి వీలులేదు. భార్యభర్తకు కనబడగూడదు. అలా రెండుమూడేళ్ల జరిగినై మూర్ఛలు వచ్చినప్పుడే గాని - తరువాత లేచికూర్చునేది మామూలుగానే ఉండేది. అసలు జబ్బు మనిషిలా ఉండేదేగాదు. చాలా ఆరోగ్యంగా ఉండేది.

సామాన్యంగా మన కుటుంబాలలో - అత్తలు - ఆడబిడ్డలు సూటీపోటీ మాటలనడం సహజంగదా!

"ఆఁ! అంతా నాటకం! దొంగ వేషాలు! మనిషి బాగానే తిని తిరుగుతోందిగదా!" అంటే మనసు నొచ్చుకుని- మూర్ఛలు మరీ ఎక్కువైనాయి.

అంతలో ఎవరో సలహా చెప్పారు - కాపురానికి వెళితే ఇటువంటి మూర్ఛలు తగ్గిపోతాయి అని!

అప్పుడు - నేను గుంటూరులో - హిందూ కాలేజిలో ఇంటర్ మొదటి సంవత్సరం చదువుతున్నాను. ఆ వేసవిలో - గర్భాదానం జరిగింది. అయినా - మూర్ఛల్లో మార్పురాలేదు. కళ్లారా చూచేవాణ్ణి గనక బాధపడేవాణ్ణి. కాని - ఏం చేయడం! అల్లోపతి, హోమియోపతి, ఆయుర్వేదం అన్నీ చేసినా ఫలితం కనిపించలేదు!

నేను బి.ఏ.కి మదరాసు లయొలా కాలేజీలో చేరాను. 1939లో! గుంటూరులో ఇంటర్ సీనియర్ అయితే ప్రతి శని, ఆదివారాలు బెజవాడ (ముత్యాలంపాడు) వెళ్లేవాణ్ణి. మదరాసు నుంచి క్వార్టర్లీ - హాఫ్ ఇయర్లీ సెలవలకి తప్ప రావడానికి వీలులేదు. అప్పుడు - మా కుటుంబాలు ఎంతగా వెనకబడి ఉండేవంటే భర్త - భార్యకు ఉత్తరం రాస్తే - ఆవిడకు ఇవ్వకముందే చించి చదవడం. భావ్యం కాదన్న అవగాహన గూడ లేదు మావాళ్లకు. అందువల్ల మదరాసు నుంచి నరసన్నపాలెంకు ఉత్తరం రాస్తే మా బావ అడ్రసుకు కాకుండా మా అత్తగారి మేనమామ కొడుకు - సింహాద్రిరాజుగారు అని ఉండేవాడు. ఆ ఊరే! ఆయన అడ్రసుకు రాసేవాణ్ణి! ఆయన రహస్యంగా ఉత్తరం నా భార్యకు ఇచ్చేవాడు.

ఆమె ముత్యాలంపాడులో ఉన్నప్పుడు రాయాలంటే బెజవాడ దుర్గాకళా మందిరంలో రంగరాజు అని - మా బంధువే - పనిచేస్తుండేవాడు. అతని కేరాఫ్‌కు దుర్గా కళామందిరం - గాంధీనగర్ - బెజవాడ అడ్రసుకు రాసేవాణ్ణి! అతను తీసుకెళ్లి - నా భార్యకు ఇచ్చేవాడు - రహస్యంగా! నాకు ఆమె ఉత్తరాలు రాసినా - వాళ్ల చేతికే ఇచ్చేది పోస్టు చెయ్యమని.

1941లో - నా డిగ్రీ చదువు పూర్తయి - బెజవాడ వచ్చేశాను. 1942లో బెజవాడ - సత్యనారాయణపురంలో ఇల్లు కట్టాం. చెప్పానుగా - మా రెండో మేనమామగారు నా దగ్గర వుండాలని ఆయనే కట్టించారు ఆ ఇల్లు!

అప్పుడు - కుటుంబంలో - చిన్నచిన్న - కలతలు వచ్చి మా అమ్మ "నేనిక్కడ వుండను" అని మా ఊరు - తాళ్లూరులో "ఇల్లు పాడయిపోతుంది! అక్కడకి వెళతాను" అని తాళ్లూరు వెళ్లిపోయింది.

ఈమెకు మూర్ఛలు నానాటికి ఎక్కువవుతున్నాయ్! విచిత్రమైన విషయమేమిటంటే - అంతవరకు మూర్ఛలు పగలు మాత్రమే వచ్చి సాయింత్రం సూర్యాస్తమయం కాగానే - ఆగిపోయేవి!

1942లో - కొత్తయింట్లో - కాపురం పెట్టిన తరువాత మూర్ఛల పరిస్థితి తారుమారు అయింది - పగలు మూర్ఛలు వచ్చేవికావు. రాత్రి గూడ - మూర్ఛలు వచ్చేముందు - కళ్లు తిరగడం - చేతులు కండెలు కట్టడం లాంటి



సూచనలు కనబడేవి! అప్పుడు ఒకగది నిండా - పరుపులు పరిచి (కాళ్లు చేతులు విసిరితే దెబ్బలు తగలకుండా ఉండేదుకు) పండుకునేది.

బెజవాడలో -మా ఫామిలీ డాక్టరు - టి.వి.ఎస్. చలపతిరావు గారు న్యూరోబియన్ యింజక్షన్లు యివ్వడం తప్ప - నేను చేయగలిగింది ఏమీ లేదు రాజుగారూ! అని బాధతో చెప్పేవాడు.

రాత్రి పదిగంటలకు ప్రారంభమైన మూర్ఛలు - ఒంటిగంట రెండుగంటల తరువాత ఆగిపోయేవి! లేచి మంచినీళ్లు తాగి మామూలుగా ఏమీ అలసట నీరసం లేకుండా పగలు వంట వగైరాలు చేసేది. చూచిన వాళ్లకు - మామూలు ఆరోగ్యంగానే కనబడేది. బంధువులు - స్నేహితులు ఎవరైన యింటికి వస్తే మామూలుగా వంట వగైరాలు స్వయంగానే చేసేది.

ఒకసారి - బందరులో అడ్వకేటు ముసునూరి జగన్నాధరావని - నాకు హైస్కూలులో క్లాస్‌మేట్. చాలా క్లోజ్ ఫ్రెండు. ఎప్పుడైనా బెజవాడ వస్తే - మా యింట్లోనే ఉండేవాడు. అప్పుడు బెజవాడలో ఇప్పటిలాగ హోటల్స్ - లాడ్జీలు లేవు.

మా ఇంట్లో ముందుగది గెస్టు రూంగా వుపయోగించేవాళ్లం. ఆ రోజు రాత్రి భోజనాలు చేశాం. జగన్నాధరావు ముందుగదిలో పడుకున్నాడు.

మామూలుగా - పడకగది పక్కగదిలో - గదినిండా ఆమే పరుపులు పరుచుకుని - పడుకునేది. అప్పటకి మూర్ఛలు వచ్చే సింటంస్ కనపించేవి. పండుకున్నది. నేను కుర్చీవేసుకొని కూర్చుని ఏదో పుస్తకం చదువుకుంటూ కూర్చున్నాను.

దాదాపు అర్ధరాత్రి వేళ - జగన్నాధరావుకి మెలుకువ వచ్చిలేచాడు. చూస్తే నా రూంలో లైటు వెలుగుతోంది. తలుపు కొట్టాడు తలుపు తీశాను. నా చేతిలో పుస్తకం చూసి.

"ఏం? అర్ధరాత్రి అయినా - ఇంకా చదువుతూ కూర్చున్నావా?" అన్నాడు.

నేను చనువుతో "ఇలా లోపలికరా" అన్నాను. వచ్చాడు. గదిలో పరుపులు మీద పండుకుని స్పృహ లేకుండా శరీరం మెలికలు తిరుగుతూ కాళ్లు చేతులు విసిరి విసిరి నేలకు కొడుతున్న నా భార్యను చూశాడు. ఒక్కసారి షాక్‌తో 'ఏమిటిది' అని వెనక్కి ఒక అడుగు వేశాడు.

నేను చిరునవ్వుతో "ఇది మాకు రోజూ ఉండేదే" అన్నాను. "అదేమిటి? డాక్టర్ని పిలవరాదూ?" అన్నాడు.

"డాక్టర్లు రావడం - చూడడం - వాళ్ల వల్ల కాదని చేతులెత్తేయడం - అన్నీ అయిపోయినయ్" అన్నాను. ముందుగదిలోకి వెళ్లాం. చరిత్ర అంతా చెప్పాను.

"మరి ఇప్పుడెలా?" అన్నాడు.

"ఇంకా రెండు మూడు గంటల్లో స్పృహ వస్తుంది. మూర్ఛలు తగ్గిపోతయ్‌లే" అన్నాను. అతన్ని పండుకోమన్నాను! నేను లోపలికి వెళ్లాను.

రోజూలాగానే రెండు గంటలకు లేచి మంచినీళ్లు తాగి మళ్లీ పడుకుంది.

తెల్లవారి ఉదయం 7 గంటలకి ఆమె మా ఇద్దరికీ కాఫీ తెచ్చియిచ్చింది. జగన్నాధరావు ఆమె వంక చూచి



ఏమీ మాట్లాడలేక పోయాడు. ఆమె ఏమీ జరగనట్టు లోనికి వెళ్లిపోయింది. రాత్రి జగన్నాథరావు ఆమె మూర్ఛల్లో ఉన్నప్పుడు చూచినట్టు ఆమెకి తెలియదు.

"రాత్రంతా నాకు నిద్రపట్టలేదు - రాజూ! నువ్వు ఎలా తట్టుకుంటున్నావోగాని" అన్నాడు జగన్నాథరావు. "తట్టుకోక చేసేదేముంది? అలవాటయిపోయింది" అన్నాను.

1945 డిసెంబరులో - ఒకరోజు - మా రాంమామయ్య వియ్యంకుడు - జాలంరాజుగారు మా ఇంటికి వచ్చాడు. ఆయనది తాడేపల్లి గూడెం! ఆయనకు పక్షవాతం వచ్చింది. భీమవరం ప్రకృతి ఆశ్రమంలో ప్రకృతి వైద్యం చేస్తే - కొంత గుణం ఇచ్చింది. నడవగలుగుతున్నాడు.

నా భార్య మూర్ఛల విషయం ఆయనికి తెలుసు! భీమవరంలోని ప్రకృతి ఆశ్రమ వివరాలన్నీ చెప్పాడు. నా భార్యను అక్కడకు తీసుకురమ్మని పట్టుపట్టాడు. తరువాత - మా మేనమామలతోను - అత్తగారితోనూ మాట్లాడి - 1946 జనవరిలో - నా భార్య - నేను మా అత్తగారు - భీమవరం ప్రకృతి ఆశ్రమానికి వెళ్లాం.

## భీమవరం ప్రకృతి ఆశ్రమం

భీమవరం ప్రకృతి ఆశ్రమాన్ని గురించి ఇక్కడ కొంత చెప్పాలి. భీమవరం వూరు పక్కనే - గోస్తనది కాలువ! ఆ కాలవ ఒడ్డున మామిడితోటలో ఆశ్రమం - దానిపేరు 'రామకృష్ణ ప్రకృతి ఆశ్రమం'. డాక్టరు గారి పేరు వేగిరాజు కృష్ణంరాజుగారు. ఆయనకు - రామకృష్ణం రాజు అనే ఆయన ఆ మామిడితోట విరాళంగా ఇచ్చాడు - ఆశ్రమం కోసం!

కృష్ణంరాజుగారికి తెలుగు చదువేగాని - ఇంగ్లీషు రాదు. ఆయన స్వగ్రామం గుంటూరుజిల్లా బాపట్ల తాలుకా అప్పికట్ల పక్కన మర్రిపూడి గ్రామం. ఆయన చిన్నప్పటి నుంచీ వ్యాయామం, కసరత్తు, కుస్తీలు వగైరాలు చేసేవారు. ఆయుర్వేదం చదువుకున్నాడు. ప్రకృతి వైద్యం ప్రారంభించాడు. గుంటూరులో - ఒకసారి ఎవరికో జ్వరం వస్తే ఈయన దగ్గరకు తీసుకెళ్లారట! ప్రకృతి వైద్యం ప్రకారం రోగికి ఉపవాసం చేయించి చన్నీళ్లతో తలస్నానం చేయించాడు. అంతకు ముందు ఆరోగికి వైద్యం చేస్తున్న అల్లోపతి డాక్టరు - పోలీసులకు రిపోర్టు చేశాడు. పోలీసులు Attempt to మర్డర్ క్రింద కృష్ణంరాజుగారిని అరెస్టు చేశారట!

అయినా - ఆయన ప్రకృతి వైద్యం మానకుండా సాగిస్తూనే ఉన్నాడు. ఈయన విషయం తెలిసి పశ్చిమగోదావరి జిల్లా భీమవరం తాలూకా కేశవరం గ్రామస్తుడు - గంగరాజుగారు - ఈయన్ని తీసుకు వెళ్లి తన ఊరు కేశవరంలో ప్రకృతి ఆశ్రమం పెట్టించారు. ఆ చుట్టుప్రక్క గ్రామాల్లో - ప్రకృతివైద్యం బాగా ప్రచారం పొందింది. రెండు మూడేళ్లలో- ఆ చుట్టుపక్క గ్రామాలలో ప్రకృతి వైద్యం తప్ప మరో వైద్యం లేకుండాపోయింది. ఆ వూళ్లలో అంతకు ముందు వైద్యం చేస్తున్న ఆయుర్వేద అల్లోపతి వైద్యులకు జీవనోపాధి పోయింది. కృష్ణంరాజుగారు పండ్లు - పచ్చికాయగూరలు- పాలు తప్ప యింక ఏ ఆహారం తీసుకునేవారు గాదు! జీవనోపాధి కోల్పోయిన - చుట్టు పక్కవూళ్ల వైద్యులు - ఒకసారి - కృష్ణంరాజు గారు తినే అరటిపండులో ఏదో విషం inject చేశారట! దాంతో కృష్ణంరాజు గారు కొన్నాళ్లు బాధపడి తన ప్రకృతివైద్యంతోనే స్వస్థత చేకూర్చుకున్నారట!



ఆ చుట్టుపక్కవూళ్లలో ఒకసారి మశూచివ్యాధి ఉధృతంగా వచ్చిందట! ఆ రోగులందరికీ ప్రకృతివైద్యంతోనే- కృష్ణంరాజుగారు నయంచేశారట!

ప్రకృతివైద్యం అంటే ఏమీలేదు! ఉపవాసం నిమ్మరసం మాత్రమే ఇస్తారు! రోజు ఎనిమా! రెండు పూటల - చన్నీళ్ల శిరస్నానం. పొత్తికడుపు మీద ఉదయం - సాయంత్రం - ఒండ్రుమట్టి - పట్టీవేయడం వేప మండలతో విసరడం! ఇంతే వైద్యం!

ఈ వైద్యంతో కోలుకున్న మశూచి రోగులకు మామూలుగా ఇతర వైద్యాల వైద్యంతో వచ్చే - మశూచి మచ్చలు - ఉండేవి కావట!

ఆ తరువాత - రామకృష్ణంరాజు గారు అనే ఆయన యీ మామిడితోట విరాళంగా ఇస్తే - ఆ తోటలో తాటాకు పాకలు వేసి కృష్ణంరాజు - ఆశ్రమం స్థాపించి - రామకృష్ణంరాజు గారి పేరు పెట్టారు. మామిడి తోటలో తాటాకు పాకలు. ఆ పాకల్లోనే రోగులు. రోగులతో వచ్చిన వారి కుటుంబ సభ్యుల నివాసం.

మేము వెళ్లినరోజే డాక్టరుగారు - నా భార్య మూర్ఛల చరిత్ర అంతా విన్నారు. ఒక తాటాకు పాక యిచ్చారు మేము ఉండడానికి. ఆ రోజునుంచీ నా భార్యకు ఉపవాసం ప్రారంభం. నీళ్లలో నిమ్మరసం పిండి ఎన్నిసార్లు కావాలన్నా తాగమనేవారు. రోజూ ఉదయమే కాలకృత్యాలయిన తరువాత ఎనిమా - పొత్తికడుపుమీద, ఒండుమట్టి పట్టీ ఒక అరగంటసేపు - ఆ తరువాత కాలవలో తలారా స్నానం. (చర్మరోగాలున్న వారికి, ఒంటికి - కాలువలోని ఒండుమట్టి శరీరానికి పూసి - కాసేపటి తరువాత స్నానం చేయమనేవారు.)

ఉపవాసం ప్రారంభించిన తరువాత మూడునాలుగు రోజులు మాత్రమే నీరసంగా ఉంటుంది. ఆ తరువాత నీరసం ఉండదు. నాభార్య ఉపవాసం వారం రోజుల తరువాత - మామిడి తోటలోని ఇసుకలో అరగంటసేపు - ఏమాత్రం ఆయాసం లేకుండా నడిచేది. ఇంకా యితర రోగుల సహవాసం ఉండేది.

వాళ్లు చెప్పే - ప్రకృతివైద్య సిద్ధాంతం ఏమిటంటే-

మామూలుగా మనశరీరం - మనం తినే ఆహారాన్ని జీర్ణించు కోవడం - assimilation process అంటారు.

ఎప్పుడైతే శరీరానికి మనం ఆహారం ఇవ్వకుండా - ఉపవాసం ప్రారంభిస్తామో - ఆ తరువాత - మన శరీరంలోనే వున్న కొవ్వు పదార్థాలను ఉపయోగించుకుంటుందట. అలా ఉపయోగించుకుంటున్న కాలంలో మనం బయట నుంచి ఆహారం యిచ్చినా - తీసుకోదట! అందుకే - ఆకలి ఉండదు. అంతవరకు assimilation process లో ఉన్న శరీరం - elimination process లోకి వెళుతుంది. అప్పుడు - మనం ఏమి ఇచ్చినా - తీసుకోక - బయటికి నెట్టేస్తుంది.

అలా - శరీరంలోని కొవ్వు - ఇతర పదార్థాలన్నీ అయిపోయిన తరువాత - వాంతుల రూపంలోనో - విరోచనాల రూపంలోనో - జ్వరం రూపంలోనో ఒంటి మీద ఎక్కడైన కణుతుల రూపంలోనో - శరీరం విజృంభిస్తుంది. దానిని వాళ్లు CRISIS అంటారు. నా భార్యకు శరీరం స్థూల్యంగా ఉండేది. నాలుగురోజుల ఉపవాసం తరువాత - ఆకలిపోయింది. ఏమీ తిన బుద్ధి కాదు. నిమ్మకాయ రసంలో నీళ్లు తప్ప వేరే ఆహారం ఏమీలేదు.

అలా యిరవై ఒక్క రోజులుగడిచినై - ఉపవాసంతో! ఒంట్లో కొవ్వు అంతా కరిగిపోయి - శల్యావశిష్టంగా - సన్నగా అయిపోయింది. జ్వరం - బాగానీరసం వచ్చింది. మంచం మీద పండుకుని - లేవలేని స్థితి వచ్చింది.



ఆ స్థితిలో గూడ వైద్యం మామూలే! ఎనిమా - మట్టి పట్టీలు తలారచన్నీళ్ల స్నానం.

ఆ స్థితిచూచి - నాకు భయం వేసింది. మా అత్తగారు కూడ చాటుగా కూర్చుని కన్నీళ్లు పెట్టుకునేది.

డాక్టరుగారు - వుదయం-సాయంత్రం వచ్చి చూచేవారు.

"ఏం డాక్టరు గారూ!" అంటే - "ఏం ఫరవాలేదు. తగ్గిపోతుంది" అనేవాడు వేరే మందు లేమీ లేవాయె!

ఏమైన జరగకూడనిది జరిగితే - నన్ను తిడతారేమోనని భయం! తీసుకుపోయి అల్లోపతి వైద్యం చేయిద్దామా అంటే డాక్టరు గారు ఏం ఫరవాలేదు అని ధైర్యం చెబుతున్నారాయె! ఇది వరకు ఇటువంటి కేసులు నయమై - ఆరోగ్యంతో వెళ్లిన కేసుల గురించి - ఆశ్రమంలో పని చేసేవాళ్లు చెబుతూ- మాకు ధైర్యం చెబుతున్నారు! ఏంచేయాలో పాలు పోలేదు!

ఉపవాసం ప్రారంభించిన 21వ రోజున - ఎనిమా చేసినప్పుడు ఎక్కడ నుంచి వచ్చినయ్యో. గట్టి వుండల్లాంటివి నాలుగైదు బయటికి వచ్చినై. ఆ సంగతి చెప్పగానే డాక్టరుగారు సంతోషంగా "ఇక ఫరవాలేదు! CRISIS వచ్చేసింది" అన్నారు.

అంతే! అంతకుముందు - స్నానం చేయించడానికి ఇద్దరు మనుషులు ఎత్తుకుని తీసుకువెళ్లే వాళ్లు!

ఆ విరోచనం అయిన తరువాత - సాయంత్రం స్నానానికి తనంతతానే లేచి కూర్చుంది. తలారస్నానం చేయిస్తే - బయట మామిడి చెట్టు క్రింద కుర్చీలో కూర్చుని - తల ఆరబెట్టుకుంటూ - కబుర్లు చెప్పడం మొదలెట్టింది. అంటే శరీరం elimination process నుంచి assimilation processకి వచ్చిందన్నమాట! అప్పుడు ఒకేసారి solid food పెట్టకూడదు. తరువాత క్రమంగా నారింజరసం రెండుమూడు రోజులు - ఆ తరువాత ఒక అరటిపండు- కొబ్బరిముక్క ఆ తరువాత పచ్చిపొట్లకాయ ముక్కలు - ఆ తరువాత వుడకబెట్టిన పొట్లకాయి - బీరకాయ కూరలు- అలా ఆహారం క్రమంగా పెంచుకుంటూ పోతారు. అలా రెండు మూడు నెలల్లో - అంటే - మేము 1946 జనవరిలో వెళ్లామని చెప్పానుగదా - ఫిబ్రవరి నుంచి - క్రమంగా - ఆహారం - పైన చెప్పిన విధంగా పెంచుకుంటూ పోయి - మార్చి - ఏప్రిల్ నాటికి - వుడకబెట్టిన చప్పిడి సొరకాయ, బీరకాయ కూరలు - పండ్లు -కొబ్బరి - మజ్జిగ - పాలు తీసుకునే స్థితికి వచ్చింది. చాలా ఆరోగ్యంగా రోజూ గంట గంటన్నర ఆ ఇసుకలో నడవడం - రోజూ కాలవలో స్నానం - హాయిగా వుంది ఆశ్రమవాసం!

నేను - మధ్యలో అప్పుడప్పుడు నాటకాలకు వెళుతుండే వాణ్ణి! మే నెలలో - మా బంధువుల ఇళ్లలో - రెండు మూడు పెళ్లిళ్లకు వెళ్లవలసి వచ్చింది. సరే - ఇదే ఆహారం - మన ఇంట్లో గూడ కంటిన్యూ చేయవచ్చు గదా అని బెజవాడ వచ్చేశాం!

పెళ్లిళ్లకు వెళ్లడం - బెజవాడలో ఇంట్లో వున్నప్పుడు గూడ ఎవరైనా బంధువులు వస్తే - వాళ్లకి మామూలు వంటలు చేసిపెట్టాలిగా! ప్రకృతి ఆహారం నియమబద్ధంగా చేయడం కష్టమనిపించింది. ఎంత నియమబద్ధంగా ఉన్నా - జిహ్వాచాపల్యంగదండి! కబుర్లు చెబుతాంగాని - జిహ్వాచాపల్యాన్ని తట్టుకోవడం చాలా కష్టమండి!

రోగులు ఉపవాసం చేసేటప్పుడు మామిడి తోటలో నడకకు వెళ్లి మామిడి పిందెలు కోసుకుని తినేవాళ్లు. అంతకంటె కక్కుర్తి! ఆశ్రమానికి రైల్వేస్టేషన్ దగ్గరగా వుండేది. రోగులు కొందరు - నడకవంక బెట్టి రైల్వేస్టేషన్ వైపు వెళ్లి - అక్కడ ఇడ్లీలు తిని వచ్చేవాళ్లు! తెల్లవారేసరికి - మొఖం వుబ్బేది. డాక్టరుగారు రోజూ ఉదయం రోగుల్ని



చూడ్డానికి వచ్చేవాడు. మొఖం ఉబ్బడం చూచి - నిన్న నడకకు స్టేషన్ వైపు వెళ్లారా? అని అడిగేవాడు. ఆయనికి తెలుసు - మొఖం చూస్తేనే తెలుస్తుంది.

మేము 'మే' నెలలో మకాం బెజవాడకు మార్చాం. ఏవో పెళ్లిళ్లు వుంటే - చూసుకుని - బెజవాడలో మకాం పెడితే నా భార్య నియమబద్ధంగా ఆహారం తీసుకోవడానికి ఇబ్బంది కలిగింది. కారణం - జిహ్వాచాపల్యమే! ఇంటికి వచ్చిన బంధువులకు, స్నేహితులకు మామూలు వంట చేస్తే ఆ వంట కాస్త రుచి చూసేది. జిహ్వాచాపల్యం.!

ఇలా లాభం లేదని - మళ్లీ భీమవరం ఆశ్రమానికి వెళితేనే ఆహార నియమాలు పాటించడం సాధ్యం అని- మళ్లీ - జూన్‌లోనో - జులైలోనో మళ్లీ భీమవరం ఆశ్రమానికి మకాం మార్చాం!

అంతకుముందు - ఆశ్రమం తాలుకు - తాటాకు పాకలో వుండేవాళ్లం. ఆ పాకల్లో గదులు చిన్నవిగా ఉండేవి. ఈసారి - డాక్టరు గారితో చెప్పి - నేనే సొంతంగా ఒక తాటాకు పాకవేసుకున్నాను! వెళ్లేటప్పుడు ఆ పాక ఆశ్రమానికి వదిలివెళ్లేటట్టు! పెద్ద తోట! బోలెడు ఖాళీ స్థలం ఉండేది.

ఒంటి నిట్టాడి పాక వేశాం! నాలుగు భాగాలుగా - మేదరి తడికలతో విభజించాలి! నాలుగు భాగాల్లో - ఒక భాగం వంటకి! ఒక భాగం పడకకి. ఒకగది - పెట్టెలు సామాన్లు పెట్టుకోడానికి! నాలుగోభాగం - ఓపెన్‌గా వరండా మాదిరి.

అక్కడ - ఏడాది ఉన్నాం! అది నా జీవితంలో బెస్ట్ పార్ట్ ఆఫ్ మై లైఫ్. నేను ప్రొద్దున్నే కాలకృత్యాలు తీర్చుకుని - పక్కనే వున్న గోస్తనది కాలవలో స్నానం చేసి - వచ్చి - ఒకటో రెండూ బత్తాయిపండ్లో - అరటిపండ్లో తిని యోగాసనాలు వేసి - ఉదయం దాదాపు 8 గంటల నుంచి మధ్యాహ్నం భోజనం వేళదాకా - చదువు! బోలెడంత అవకాశం! నా జీవితంలో - అంత స్టడీ - మళ్లీ ఏనాడు చేసే అవకాశం రాలేదు.

## నా రాజకీయ పరిజ్ఞానం

ముందు మార్క్సిజమ్‌తో మొదలు పెట్టాను! Sidnery and Beatrice Webb అని భార్యాభర్తలు, ఇంగ్లీషువాళ్లు. (FABIAN socialists) వాళ్లను ఎలా allow చేశాడో STALIN? రష్యా అంతా స్వేచ్ఛగా తిరిగి - పరిస్థితులు పరిశీలించడానికి వాళ్లకి స్టాలిన్ పర్మిషన్ యిచ్చాడు.

వాళ్లు రష్యా అంతా తిరిగి - అన్నీ రంగాలు పరిశీలించి-

'SOVIET COMMUNIUSM' అని ఒక పెద్ద పుస్తకం రాశారు ఆ దంపతులు! దాదాపు వెయ్యి పేజీల పుస్తకం! దానిలో వాళ్లు కమ్యూనిస్టు పార్టీని గురించి - ప్రభుత్వాన్ని గురించి వాటిలో ఉన్న లోపాలను గురించి గూడా రాశారు. అది చదివితే స్టాలిన్ పరిపాలనలో జరిగిన కొన్ని ఘోరాలు - హృదయ విదారకమైన దృశ్యాలు వాళ్లు వర్ణించారు. రష్యన్ భాషలో 'కులక్స్' అంటే - మన భాషలో పెద్దపెద్ద భూస్వాములు! వాళ్ల భూములన్నీ ప్రభుత్వం లాక్కుని - ఇళ్లు ఖాళీ చేయించి - వెళ్లి పొమ్మన్నారు! ఎక్కడికి వెళతారు? సంఘబహిష్కరణ! ఎవరూ - భోజనం పెట్టరు సరిగదా - మంచినీళ్లు గూడ ఇచ్చేవాళ్లు లేరు! వాళ్లు పాపం తిండీ - నీళ్లు ఉండానికి నీడగూడ లేకుండా చేస్తే ఆ భూస్వాముల కుటుంబాలు మలమల మాడి చచ్చిన దృశ్యాలు వర్ణించారు ఆ పుస్తకంలో! అంతేకాదు! కమ్యూనిస్టు పార్టీ నిర్మాణం, స్టాలిన్ తన కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని ఎలా నియంతలాగ నిర్దాక్షిణ్యంగా అమలుపరచిందీ వివరంగా రాశారు.



పొద్దున్నే ఇంటివరండాలో - చాప వేసుకుని కూర్చుని ఆ పుస్తకం చదువుతుంటే - డాక్టరుగారు రౌండ్స్‌కి వచ్చేవాడు. ఆయనికి ఇంగ్లీషు రాదు! ఏమిటి ఆ పుస్తకం అని అడిగితే 'సోవియట్ కమ్యూనిజం' అని చెబితే - ఆయన "భారతమో - రామాయణమో చదువుకోగూడదు? ఎందుకీ పుస్తకాలు?" అనేవాడు. "అంతకంటె - ఎక్కువ అవసరమండీ ఈ పుస్తకంలోని విషయం" అనేవాణ్ణి!

ఆ తరువాత - గాంధియన్ ఫిలాసఫీ చదవడం ప్రారంభించాను. గాంధీగారి - అహింసావాదం కంటె గూడ- నన్ను ఆకర్షించింది - గాంధియన్ ఎకనామిక్స్! ఆయన ఆర్థిక శాస్త్రం!

అప్పుడు - గాంధిగారి 'వార్ధా' ఆశ్రమం - 'సేవాగ్రాం' నుంచి వచ్చిన వాళ్లు - ప్రకృతి ఆశ్రమంలో ఇద్దరు ఉండేవాళ్లు.

'జకరయ్య' అని తెలుగు హరిజనుడు. అతనికి ఏదో దీర్ఘకాలిక జబ్బు వుంటే - ప్రకృతివైద్యం కోసం - గాంధిగారు అతన్ని భీమవరం ఆశ్రమానికి పంపాడు. ఇంకొకతను - శంకరన్ నాయర్! అతను అల్లోపతి డాక్టరు. 'సేవాగ్రాం'లో గాంధీగారి దగ్గర ఉండేవాడు. అతన్ని 'ప్రకృతివైద్యం' నేర్చుకుని రమ్మని గాంధీగారే పంపారు.

1946 - అంటే - దేశ స్వాతంత్ర్యానికి ముందు దేశంలో పరిస్థితులు ఎలాగున్నాయ్యంటే-

బెంగాల్‌లో - హిందూ - ముస్లిం కొట్లాటలు! హత్యలు! పేపర్లో వార్తలు చదువుతుంటే - భయంకరంగా ఉండేది! గాంధి 'నౌఖాలి'లో మకాం వేశాడు ముస్లింలు ఆయన్ని ఎక్కడ చంపుతారోనని - నెహ్రూకి - దేశంలో అందరికీ భయం! అయినా గాంధీ హిందూ - ముస్లిం సామరస్యానికి ప్రయత్నించాడు. దేశ విభజన ఆయనకి ఇష్టం లేదు!

అంత టెన్షన్‌లో వున్న పరిస్థితిలో గూడ - గాంధీగారు భీమవరం ప్రకృతి ఆశ్రమంలో ఉన్న - జకరయ్యకు శంకరన్ నాయర్‌కు - స్వహస్తంతో కార్డులు రాసేవాడు. ఆశ్చర్యం! జకరయ్యకేమో 'నీ ఆరోగ్యం ఎలా ఉంది?' అని శంకరన్ నాయర్‌కు నీ ప్రకృతి వైద్యంలో శిక్షణ ఎంతవరకు వచ్చింది? అని రాసేవాడు.

అంటే - గాంధిగారి లాంటి మహానాయకులది - అంత క్రమశిక్షణతో కూడిన జీవితాలన్నమాట! ఉత్తరాలు రాయడానికి ప్రతిరోజు - ఒక టైం! ఎన్ని సమస్యలు - వత్తిడులు వున్నా - ఆ టైంలో రాయవలసినవాళ్లకు ఉత్తరాలు రాసేయడమే! అంత క్రమశిక్షణ జీవితం వాళ్లది!

నేను దాదాపు 20 ఏళ్లు 'ఈనాడు'లో 'అక్షింతలు' కాలం రాస్తుంటే చదివేవాళ్లు "ఈయన సినిమా వాడు! రాజకీయాలని గురించి ఇంత బాగా రాస్తాడేమిటి?" అనుకునేవాళ్లు! కొందరు నన్ను స్వయంగా అడిగేవాళ్లు. నేను పొలిటిక్సులో నుంచి - సినిమాల్లోకి వచ్చానని - చాలామందికి తెలియదు!

అప్పుడు - గాంధిగారి రాజకీయ పాత్ర గురించి నాకు ఆయనమీద కొంత కోపం ఉండేది! ఎందుకంటే - అప్పుడు మేము యువకులం గదా! మాకు సుభాష్ చంద్రబోస్ అంటే చాలా ఇష్టం! బోస్‌కి - గాంధీ చాలా అన్యాయం చేశాడని - మాకు గాంధి మీద కోపం!

సుభాస్ చంద్ర బోస్‌ని - కాంగ్రెసు ప్రెసిడెండ్‌గా ఎన్నుకున్నారు. ఆయన భావాలు - గాంధికి నచ్చేవికాదు! గాంధికి భయమేమిటంటే- సుభాస్‌బోసు - కాంగ్రెసును - మిలిటెంట్ ఆర్గనైజేషన్‌గా తయారు చేస్తాడేమోనని! ఆయన భయం సమంజసమైనదే! బోస్‌కి గాంధీగారి నాన్ వయలెన్స్ - అహింస మీద నమ్మకంలేదు. చూశాంగా -



బోస్ - దేశాంతరంపోయి ఇండియన్ నేషనల్ ఆర్మీని తయారుజేసి - జపాన్ - జర్మనీలతో చేతులు కలిపిన సంగతి తరువాత రూఢి అయింది గదా!

అందుకే - బోస్ రెండోసారి కాంగ్రెసు ప్రెసిడెంట్‌గా పోటీచేస్తే - ఆయనకి పోటీగా - గాంధీ - పట్టాభి సీతారామయ్యగారిని నిలబెట్టాడు. బోస్ గెలిచాడు పట్టాభి ఓడిపోయాడు. గాంధికి అది ఎంత అవమానం - బాధ - అంటే - "పట్టాభి ఓటమి - నా ఓటమి" అని పబ్లిక్ స్టేట్‌మెంటు యిచ్చాడు గాంధి.

బోస్ - కాంగ్రెసు ప్రెసిడెంట్‌గా - వర్కింగ్ కమిటీలో నెహ్రూ పటేల్ మొదలైన నాయకుల్ని వేసుకుంటే వాళ్లు వర్కింగ్ కమిటీలో వుండమని - నిరాకరించారు! ఎందుకు? గాంధి ప్రభావం వాళ్ల మీద! అలా - గాంధీ వర్గం మొత్తం - బోస్‌కి సహాయనిరాకరణం చేస్తే బోస్ - విసుగు పుట్టి - కాంగ్రెసు అధ్యక్ష పదవికి రాజీనామా చేసి 'ఫార్వర్డ్ బ్లాక్' అని కొత్త పార్టీ పెట్టాడు! యిదంతా రెండో ప్రపంచ యుద్ధానికి ముందు! 1939కి ముందన్న మాట!

మేమంతా యువజనులంకదా! గాంధి - బోస్‌కి చేసిన అన్యాయానికి - మాకు గాంధి మీద కోపం! గాంధి దగ్గర యింకో లక్షణం వుండేది.

ఏదైనా క్లిష్టమైన సమస్య మీద కాంగ్రెసులో చర్చ వచ్చినప్పుడు - ఎదుటి వాళ్లవాదనకు - హేతుబద్ధంగా సమాధానం చెప్పలేనప్పుడు - ఆయన నా 'అంతర్వాణి' చెబుతున్నది అని ఎదటివాళ్ల నోరు మూయించేవాడు!

నేను 1949లో రాసిన మొట్ట మొదటి నాటిక పేరు 'అంతర్వాణి'. అది గాంధిగారి మీద 'వ్యంగ' రచన! ఆర్గుమెంటు ఫెయిల్ అయితే "అంతర్వాణి" అస్త్రాన్ని ప్రయోగించేవాడాయన! అదీగాక - ఆయన రాజకీయాలలో మతాన్ని ప్రవేశపెట్టాడు! అది నాకు నచ్చేదిగాదు! అప్పుడేగాదు - ఇప్పటికీ నాకు గాంధి రాజకీయాల మీద అదే నా complaint! గాంధిగారు - కాంగ్రెసు రాజకీయాలలో మతాన్ని చేర్చబట్టి అంతవరకు ఎప్పటి నుంచో కాంగ్రెసులో వున్న జిన్నాకు అనుమానం వచ్చింది. గాంధి నాయకత్వంలో స్వరాజ్యం వస్తే కాంగ్రెసు ప్రభుత్వంలో - ముస్లింలకు న్యాయం జరగదనే నమ్మకము, భయంతోనే - జిన్నా - కాంగ్రెసులోంచి విడిపోయి - ముస్లింలీగ్ స్థాపించి 'దేశ విభజన' పాకిస్థాన్ కోసం పట్టుబట్టాడు.

లేకపోతే - జిన్నా మొదటినుంచి గొప్ప దేశభక్తుడు. బ్రిటీష్ ప్రభుత్వం - బాలగంగాధర్ తిలక్‌ను అరెస్టు చేస్తే తిలక్ తరపున న్యాయవాది జిన్నా! పాశ్చాత్య నాగరికతే గాని - అతనికి ముస్లిం వాసన తక్కువ! అసలు ఖురాన్ చదివాడో లేదో గూడ! అతని జీవనశైలి అంతా - పాశ్చాత్యధోరణేగాని ఇస్లాం వాసనే ఉండేదిగాదు!

నేను కాలేజీలో ఉన్నప్పుడే - గాంధిజం గురించి చదివాను. ఆయన 'Young India' పాతవి తెచ్చి చదివేవాణ్ణి!

గాంధిజంతో - నాకు ఇన్ని విభేదాలున్నా - గాంధిగారి ఎకనామిక్స్ - ఆర్థికశాస్త్రం నన్ను బాగా ఆకర్షించింది.

జె.సి. కుమరప్ప అని బొంబాయి యూనివర్సిటీలో ఆర్థిక శాఖలో ప్రొఫెసర్. ఆయన ఆ ఉద్యోగం రాజీనామా చేసి - గాంధి సిద్ధాంతాలతో ఆకర్షితుడై, గాంధీగారితో చేరాడు. ఆయన - గాంధీయన్ ఎకనామిక్స్ మీద అధారిటీ అన్నమాట! ఆయన ఒకసారి - ఏదో సందర్భంలో - బెజవాడ వచ్చి - ఉపన్యాసం యిచ్చాడు - గాంధి ఆర్థిక విధానాల మీద! అప్పుడు బెజవాడలో ఆయన డా॥ టి.వి.యస్. చలపతిరావు గారి అతిథిగా ఉన్నాడు. ఆయన ఎంత గాంధేయుడంటే - ఆయన బట్టలు ఆయనే ఉతుక్కునేవాడు. ఆయన మళయాళీ. ఖద్దరులుంగీ - ఖద్దరు చొక్కా - ఖద్దరు టోపీ!



ఒకరోజు - అతిథి మర్యాదగా - చలపతిరావుగారు - కుమరప్ప గారి బట్టలు - తన నౌకరుచేత ఉతికించి ఆరవేయించాడట.

కుమరప్పకు కోపం వచ్చి - "నా బట్టలు నేను ఉతుక్కోలేనా? నాకు చేతులు లేవా? ఇంకెప్పుడు ఇటువంటి పనులు చేయకండి" అని కేకలు వేశాడట!

గాంధియన్ ఎకనామిక్స్ మీద కుమరప్ప చాలా పుస్తకాలు రాశాడు. అవన్నీ చదివాను. నన్ను బాగా ఆకర్షించినై. ఇప్పటికి గూడ గాంధియన్ ఎకనామిక్స్ - గ్రామ పరిశ్రమలు - వికేంద్రీకరణ మీద నాకు గట్టి నమ్మకం!

నెహ్రూ గనక గాంధియన్ ఎకనామిక్స్ ఫాలో అయివుంటే దేశ చరిత్ర మరోరకంగా వుండేది. నెహ్రూకి గాంధియన్ ఆర్థిక సిద్ధాంతాల మీద నమ్మకం లేదు. ఆయనకు సోవియట్ రష్యా అవలంభిస్తున్న పంచవర్ష ప్రణాళికలు - భారీ పరిశ్రమలు - సోషలిస్టిక్ - పాటర్న్ - ఆఫ్ - సొసైటీ మోజులో వున్నాడు. ఈ రోజున - దేశంలోని గ్రామాలు ఇంత అధ్వాన్నంగా ఉండడానికి కారణం - నెహ్రూ గాంధి ఆర్థిక సిద్ధాంతాలను అవలంబించక పోవడమేనని నా నమ్మకం.

కుమరప్ప రాసిన పుస్తకాలు చదివి - నేను 'వార్ధా' వెళ్లాను. 'వార్ధా'లో - విలేజ్ వుంది. industries అసోషియేషన్ వుంది. దానికి సెక్రటరీ కుమరప్ప. నేను కుమరప్ప దగ్గరకు వెళ్లేటప్పుడు - చలపతిరావు గారి దగ్గర నుంచి లెటరు తీసుకువెళ్లా. చలపతిరావుగారు మా ఫామిలీ డాక్టరు.

ఆయన దగ్గర లెటరు తీసుకుని వార్ధా వెళ్లాను. 1946 చివరలోనో 1947 మొదట్లోనో! అప్పుడు గాంధి - బెంగాలులో నౌఖాలీలో ఉన్నాడు. హిందూ ముస్లింల ఘర్షణల మధ్య నేను కుమరప్ప దగ్గరకు వెళ్లాను. నా సంగతి చెప్పాను. అక్కడ గ్రామ పరిశ్రమల సమాఖ్య ప్రధాన కేంద్రం - అందులో పనిచేసే వాళ్లకు ఒక హాస్టలు. నన్ను ఆ హాస్టల్లో ఉండమన్నాడు.

హాస్టలంటే - పూరిపాకలు - నేలపేడతో అలికి వుంచుతారు. వంటచేసుకోవడం వాళ్లే! పళ్లాలు కడుక్కోవడం వాళ్లే! కక్కోసులు కడుక్కోవడం వాళ్లే! అంతా గాంధి సిద్ధాంతాలన్నమాట! నాకొక గది ఇచ్చారు. నేనూ వాళ్లలాగనే - భోజనశాలకు వెళ్లి - ప్లేట్లు తీసుకుని - భోజనాలు వడ్డించుకుని తిని ప్లేటు కడిగి ఒక చోట పెట్టడం - హాస్టల్ స్టూడెంట్స్ - రౌండ్స్ ప్రకారం వంటలు వగైరాలు చేయడం.

నేను కుమరప్ప దగ్గరికి వెళ్లి చెప్పాను. నేను వెళ్లి - నా భార్యను గూడ తీసుకుని వస్తాను అని-

ఆయన "భార్యభర్తలు హాస్టల్లో వుండడానికి వీల్లేదు. మీరు మాత్రం యీ హాస్టల్లో వుండండి! మీ భార్యను మహిళా ఆశ్రమంలో చేర్చండి" అన్నాడు. మహిళా ఆశ్రమం వార్ధా నుండి గాంధిగారి సేవాగ్రాం వెళ్లే దోవలో ఉంది.

నేను మహిళా ఆశ్రమానికి వెళ్లాను. అక్కడ ఒక బెంగాలీ మహిళ ఆ ఆశ్రమానికి చీఫ్. ఆమెతో నా విషయం చెప్పాను. ఆవిడ మహిళా ఆశ్రమం గురించి చెప్పింది. అక్కడ గూడ మగవాళ్ల హాస్టలు లాగే - ఆశ్రమ వాసులే వంటలు చేయడం - బట్టలు వుతకడం - నేల తుడవడం వగైరాలన్నీ - చేయాలి! అంటే ఫిజికల్ వర్క్ శరీర శ్రమ చాలా ఎక్కువన్నమాట! నా భార్యేమో ఇంకా పచ్చికూరలు, పండ్లు తింటోంది. ఇంత శరీర శ్రమ చేయడం ఆవిడ వల్ల కాదేమోననిపించింది. ఎలాగూ వెళ్లానుగదా అని - ఒకటి రెండు రాట్నాలు, చేతి పరిశ్రమవాళ్లు చేసిన వస్తువులు కొన్ని కొనుక్కుని వచ్చేశాను.



ఆర్థిక విషయాలమీద నా నమ్మకాలు యిలా ఉండగా అప్పుడు రాజకీయంగా - నాకు కమ్యూనిజం మీద- గాంధీ సహాయనిరాకరణ సిద్ధాంతాల మీద - బ్రిటిష్ ప్రభుత్వం మీద ఆయన విధానాలు - యుద్ధంలో బ్రిటిష్ వాళ్లకి సహాయనిరాకరణ - వీటి మీద -నా అభిప్రాయాలలో మార్పులు వచ్చినయ్. అందుకు కారణం - యం.యన్. రాయ్! ఆయన గొప్ప మేధావి! రాజకీయాలేగాక - ఆయన గొప్ప సైంటిస్టు. ఆయన జీవిత చరిత్ర చాలా విచిత్రమయింది. ఆయన మొట్టమొదట - బెంగాల్ టెర్రరిస్టు! (ఆ రోజుల్లో బెంగాలీ టెర్రరిస్టులకు - కమ్యూనిజం-మార్క్సిజమూ ఇవేమీ తెలియదు. వాళ్ల ధ్యేయం - బ్రిటిష్ వాళ్లని ఇండియా నుంచి తరిమెయ్యడం. అందుకు వాళ్ల వ్యూహం తమ విధ్వంస కలాపాలకు జర్మనీ నుంచి బాంబులు - ఫిరంగులు - మందుగుండు సామాను రహస్యంగా తెచ్చి ఇండియాలోని ప్రధాన రైల్వే వంతెనలను పేల్చేయడం. అలా చేస్తే ఇండియాలోని బ్రిటీష్ సైన్యాలు - ఒక మూల నుంచి మరో మూలకు తేలిగ్గా తిరగలేరు గదా అని.) బ్రిటీష్‌వాళ్లు జైలులో పెడితే - తప్పించుకుని రాయ్ మెక్సికో వెళ్లాడు. వెళ్లి మెక్సికోలో - మొట్టమొదటి సారిగా మెక్సికన్ కమ్యూనిస్ట్ పార్టీని స్థాపించాడు. సోవియట్ యూనియన్ కాకుండా ఇతర ప్రపంచ దేశాల్లో - కమ్యూనిస్ట్ పార్టీని స్థాపించింది మెక్సికోలో యం.ఎన్. రాయ్ ఒక్కడే!

తమ దేశంలో తప్ప - ప్రపంచంలో - మరే దేశంలోనూ కమ్యూనిస్టు పార్టీ లేదనుకునే - సోవియట్ కమ్యూనిస్టు నేత లెనిన్‌కు మెక్సికన్ కమ్యూనిస్ట్ పార్టీని గురించి తెలిసింది. తెలిసి - యం.యన్. రాయ్‌ని కమ్యూనిస్ట్ ఇంటర్‌నేషనల్ సమావేశానికి - మాస్కో ఆహ్వానించాడు లెనిన్. అలా లెనిన్‌తో పరిచయమై యం.యన్. రాయ్ కమ్యూనిస్ట్ ఇంటర్‌నేషనల్‌లో చేరి, అక్కడే వుండిపోయాడు.

ఆ తరువాత 1920లలో జవహర్ లాల్ నెహ్రూ రష్యా వెళితే - యం.యన్. రాయ్ ఆయనకి ఇంటర్‌వ్యూ ఇవ్వలేదని చెబుతారు. అంటే - అక్కడ రాయ్ అంత ప్రముఖ స్థానంలో ఉన్నాడన్నమాట!

అప్పుడు - ఇండియన్ నేషనల్ కాంగ్రెసు బ్రిటీష్ సామ్రాజ్యవాదం మీద ఉద్యమం నడుపుతోంది గదా-

ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ పట్ల-కమ్యూనిస్ట్ ఇంటర్ నేషనల్ వైఖరి ఏమిటి? ఎలా వుండాలి? అన్న చర్చ వచ్చిందట! యం.యన్.రాయ్ ఇండియన్ గదా- అతని అభిప్రాయం తెలుసుకుందామని-ఆయన్ని అడిగారట!

అడిగితే-"అబ్బే! ఇండియన్ నేషనల్ కాంగ్రెస్-కాపిటలిస్టుల చందాలతో నడుస్తున్న ఉద్యమం. బిర్లాలు, టాటాలు లాంటి వారి ఆర్థిక సహాయంతో గాంధి - దానిని నడుపుచున్నాడు. అది బూర్జువా ఉద్యమ సంస్థ. దానిని మనం సపోర్టు చేయగూడదు" అని చెప్పాడట.

అప్పుడు - లెనిన్ అన్నాడట! ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ ఇప్పుడు - బూర్జువా ఆర్గనైజేషన్! సందేహం లేదు! కాని - ఆ కాంగ్రెసు బ్రిటీష్ సామ్రాజ్యానికి వ్యతిరేకంగా పోరాడుతున్నన్నాళ్ళు - అది progressive force! అభ్యుదయ శక్తే! దానిని మనం సపోర్టు చేయాలి! బ్రిటీష్ సామ్రాజ్యాన్ని పారద్రోలి - ఇండియాకు స్వాతంత్ర్యం వచ్చిన తరువాత - కాంగ్రెసు అధికారంలోకి వచ్చి - ఇండియాను పరిపాలిస్తుంది. అప్పుడది కాపిటలిస్టు గవర్నమెంటు అవుతుంది. అప్పుడు - ఆ ప్రభుత్వం మీద కార్మిక శక్తుల్ని సమీకరించి - కమ్యూనిస్టు ఉద్యమం నడిపి ఆ ప్రభుత్వాన్ని పడగొట్టాలి" అన్నాడట!

అప్పుడు - లెనిన్ చెప్పిన ప్రకారమే ఇప్పుడు ఇండియాలో కాంగ్రెసు పార్టీ అధికారంలోకి వచ్చి నడుపుతున్న



రాజ్యాంగం - ప్రజాస్వామ్యంకాదు! ధనస్వామ్యం! మనం ఇప్పుడు కళ్లారా చూస్తున్నాం.

ఇండియా ప్రపంచంలోకల్లా పెద్ద ప్రజాస్వామ్య దేశమని అమెరికా వగైరా విదేశాలన్నీ మనకి సర్టిఫికెట్లు ఇస్తున్నారు గాని-

మనం అనుభవిస్తున్నాం గదా! ఇది ప్రజాస్వామ్యమా? ధనబలం - కండబలం రాజ్యమేలుతున్నయ్యని - మనకు స్పష్టంగా తెలుస్తుంది.

స్వాతంత్ర్యం వచ్చాక - కాంగ్రెసు ప్రభుత్వం వస్తే దేశం ఇలాగే ధనస్వామ్యంగా మారుతుందని - గ్రహించే- గాంధి - స్వాతంత్ర్యం వచ్చాక కాంగ్రెసును రద్దు చేయమన్నాడు. ఇంతకు ముందు - నేను గాంధిగారి - 'అంతర్వాణి' సిద్ధాంతాన్ని బోస్‌కి అన్యాయం చేశాడని - విమర్శిస్తూ మాట్లాడానే దాని అర్థం గాంధి యొక్క గొప్పదనాన్ని శంకించి కాదు.

గాంధి - మహాత్ముడన్న బిరుదుకు ఊరికే ఆకర్షణ శక్తి లేకపోతే ఎటువంటి మహామహులు ఆయన ముందు శిరస్సు వంచి అనుయాయులుగా పాదాక్రాంతులైనారండి! మోతీలాల్ నెహ్రూ - జవహర్‌లాల్ నెహ్రూ - సి.ఆర్. దాస్ -వల్లభాయ్ పటేల్ - టంగుటూరి ప్రకాశం - మొదలైన వాళ్లంతా సామాన్యులా? విదేశాల్లో చదివి - బారిస్టర్లుగా - జడ్జీలుగా - ఎన్నో లక్షలు కోట్లు గడిస్తున్న వాళ్లు అవన్నీ వదిలేసి - గాంధి ఉద్యమంలో - చేరారంటే గాంధిలో ఉన్న ఆకర్షణశక్తిని మనం అర్థం చేసుకోలేమూ?

కాని - ఏనాయకుడైనా ఎంత గొప్ప వాడయినా ఎంత సదుద్దేశంతో చేసినా - కొందరు నాయకుల చర్యలు లోపభూయిష్టంగా ఉండవచ్చు.

గాంధిగారు - రాజకీయాల్లో మతాన్ని తీసుకొచ్చి కలిపాడండి! తన ఉద్యమం - దేశ స్వాతంత్ర్యం కోసం! దేశం మొత్తాన్ని దృష్టిలో పెట్టుకోవాలి గాని - పబ్లిక్ మీటింగులు పెట్టినప్పుడు "రఘుపతి రాఘవ రాజారాం" భజన లెందుకండి "ఈశ్వర్ అల్లా తేరానాం" అన్నంతమాత్రాన నీ ఉద్యమం ఒక వర్గాన్ని దూరం చేస్తోంది గదా!

ఇప్పుడుగూడ - మన ప్రభుత్వాలు - సెక్యులర్ గవర్నమెంట్లు అంటారు గదా! మరి - గవర్నమెంటు ఫంక్షన్స్‌లో - కొబ్బరికాయలు కొట్టడం హారతులు ఎందుకండి? "ప్రభుత్వం అన్ని మతాలవారిది!" అంటే - మిగతా వాళ్లు ఎవరు నమ్ముతారండి!

"నిజమైన ప్రజాస్వామ్యం రావాలంటే - ఎన్నికల సంస్కరణలు జరగాలి! ధనబలం - కండబలం యొక్క ప్రభావం పోవాలి" అని గొంతులు చించుకుంటాం గాని - ప్రభుత్వాన్ని నడుపుతున్న పార్టీలు వ్యక్తులు అటువంటి సంస్కరణలు చస్తే చేయరు! ఇప్పుడున్న పరిస్థితులు వాళ్లకు అనుకూలంగా ఉన్నయ్! అలాంటప్పుడు వాటిని మార్చడానికి వాళ్లు ఎందుకు ఒప్పుకుంటారు?

గాంధిగారిని గురించి మరో విషయం చర్చించుకుందాం. రాజకీయాల్లో మతాన్ని కలపడం క్షేమం కాదు అని- గాంధికి తెలియదని అనవచ్చు! ఆయన రాజకీయాల్లో మతాన్ని చేర్చింది - ఏదో సదుద్దేశంతోనే చేసివుండవచ్చు! కాని మనం ఫలితాలను బట్టి గదా దేనినయినా బేరీజు వేస్తాం!

మతాన్ని కలపకుండా వుంటే - బాగుండేదే! జిన్నాలాంటి వాళ్లు దూరమై - పరిస్థితులు దేశవిభజనకు దారితీసినయ్ గాదా అని విచారిస్తాం!



నెహ్రూ గూడా ఏం తక్కువ వాడేం గాదు. ఖండఖండాంతరాలలో - భారతదేశానికి ఎంతో గౌరవప్రతిష్ఠలు గడించి పెట్టినవాడు. సోవియట్ రష్యా ఆదర్శంగా దేశాన్ని సోషలిస్టు రాజ్యంగా చేద్దామనుకున్నది - సదుద్దేశమే.

కాని - ఫలితాలు చూస్తున్నాం గదా! గ్రామాలను - నిర్లక్ష్యం చేసి గాంధి సిద్ధాంతాలను వెనక్కినెట్టెయ్యడం వల్ల - ఫలితాలు చూస్తున్నాం గదా! ఇప్పుడు పల్లెసీమలు ఎలా వున్నయ్! పల్లె వాసుల జీవితాలు దుర్భరమై పట్టణాలకు వలస వస్తున్నారు. దాని వల్ల పట్టణాలలో - నిరుద్యోగ సమస్యలు! ఉద్యోగాలు లేక - యువకులు దొంగతనాలు - దోపిడీలు హత్యలకు దిగుతున్నారు గదా!

ఫలితాలు యిలా ఉన్నయ్ కాబట్టే - నెహ్రూ పాలనను తప్పుపడుతున్నాం! అంతేగాని - నెహ్రూ దేశభక్తిని శంకించగలమా?

రష్యాలో - స్టాలిన్ ఏంజేశాడు? పవర్ చేతికి వచ్చిన తరువాత తనను ఎదిరించిన - ట్రాట్స్కీ లాంటి నాయకుల్ని - నిర్దాక్షిణ్యంగా చంపించి - అవతల పారేశాడు. తనకు ఎదురు చెప్పే వాళ్లనందరినీ అంతమొందించి నియంతగా తయారయ్యాడు. ఆ పని - దేశభక్తితోనే చేశాడు. ఏకపార్టీ పాలన స్థాపించాడు! అతను చేసింది తప్పంటామా!

తన దేశాన్ని 20 ఏళ్లలో - అమెరికాకు - జర్మనీకి ధీటుగా సూపర్ పవర్‌గా తయారు చేశాడు! అదేం తక్కువ ఎచీవ్‌మెంటా? కాని - నియంతృత్వం! నిర్దాక్షిణ్యంగా లక్షల మందిని హతమార్చాడు. చెప్పానుగా - కులక్స్ - భూస్వాముల్ని ఎలా మాడ్చి చంపాడో! మరి స్టాలిన్ చేసింది తప్పంటామా? ఒప్పంటామా? రెండో ప్రపంచయుద్ధంలో-బ్రిటన్ అమెరికాలతో చేతులు కలిపి -రష్యా - జర్మనీ హిట్లర్‌ను మట్టికరిపించినందుకు స్టాలిన్ చేసింది - 'ఒప్పు' అనే అనాలిగదా!

కాని - తరువాత ఫలితాలను బట్టి ఏమనాలి? స్టాలిన్ మరణానంతరం పదిపదిహేనేళ్లలో సోవియట్ రష్యా కుప్పకూలిపోయి - కుక్కలు చించిన విస్తరిలా - ముక్కలుముక్కలయిందే! దానికి కారణం ఏమిటీ అని విచారించినప్పుడు - స్టాలిన్ నియంతగా ప్రజలనోళ్లు నొక్కి వ్యక్తి స్వాతంత్ర్యాన్ని హరించి - ఎంత సాధిస్తేమటుకు - ఏం లాభం! పర్యవసానం ఏమయింది? అన్నప్పుడు - స్టాలిన్‌ని యుద్ధానంతరం పొగిడినవాళ్లే - అతన్ని తెగ డినారుగదా?

అందాకా ఎందుకండీ - సోవియట్ యూనియన్ మూల పురుషుడు. లెనిన్ విగ్రహాన్ని - స్టాలిన్ విగ్రహాలను రష్యన్ ప్రజలే విరగొట్టి అవతల పారేశారు గదా! స్టాలిన్ హయాంలో పెట్రోగ్రాడ్ నగరం పేరు లెనిన్ గ్రాడ్‌గా మార్చారు గదా! ఇప్పుడేమైంది? లెనిన్ గ్రాడ్‌ని మళ్లీ పూర్వపు సెయింట్ పీటర్స్ బర్గ్‌గా మార్చారు. ఆపేరు రష్యన్ జార్ చక్రవర్తుల కాలం నాటిది! దీని కేమంటారు?

రెండవ ప్రపంచ యుద్ధకాలంలో - యుగోస్లావియాలో మార్షల్ టిటో - కమ్యూనిస్టుగా స్టాలిన్‌తో చేతులు కలిపి నాజీ జర్మనీ మీద పోరాటం సాగించాడు. ప్రపంచ యుద్ధం అయిపోయింది, జర్మనీ ఇటలీలు ఓడిపోయి రష్యా, అమెరికా - ఇంగ్లండు కూటమి విజయం సాధించిన తరువాత-

యుగోస్లావియాలో టిటోకి - రష్యా నియంత స్టాలిన్‌కి అభిప్రాయభేదాలొచ్చినై. ఇద్దరూ కమ్యూనిస్టులే! అయినా టిటో - స్టాలిన్ మీద ఎదురు తిరిగి యుగోస్లావియాలో - తన పద్ధతిలో కమ్యూనిస్టు ప్రభుత్వం స్థాపించాడు.



అదీ నియంతృత్వ ప్రభుత్వమే. అతనికి కుడి భుజంగా 'జిలాస్' అని ఒకడుండేవాడు. యుద్ధంలో టిటోకు కుడిభుజంగా నిలబడి పోరాడాడు.

టిటో కమ్యూనిస్టు ప్రభుత్వం ఏర్పాటు చేసి - కొన్నాళ్ళు గడిచిన తరువాత జిలాస్ టిటోతో విభేదించాడు. వర్గరహిత సమాజస్థాపన తయారువుతోందా? అని - జిలాస్ 'ది న్యూ క్లాస్' (The new class) ఒక పుస్తకం రాశాడు. ఆ పుస్తకం నా దగ్గర వుంది.

అతని వాదన ఏమిటంటే "వర్గరహిత సమాజ సూత్రానికి విరుద్ధంగా యుగోస్లావియాలో ఒక కొత్త వర్గం ఆవిర్భవిస్తోంది" అన్నాడు. ఆ వర్గం ఎవరంటే కమ్యూనిస్టు పార్టీ సభ్యులు! దేశంలో అన్ని రంగాలలో గూడ కమ్యూనిస్టు పార్టీలో చేరిన సభ్యులకే సకల సౌకర్యాలు పలుకుబడి అధికారం! మిగతా ప్రజల కంటె కమ్యూనిస్టు పార్టీ సభ్యులకు అధిక ప్రాబల్యం చేకూరి - ఇదొక వర్గంగా తయారవుతోందని జిలాస్ - టిటోను వదిలేసి - అమెరికా పోయి - అక్కడ స్థిరపడి పోయాడు!

సరిగ్గా - స్టాలిన్ పరిపాలనలో - సోవియట్ రష్యాలో - అదే జరిగింది. కమ్యూనిస్టు పార్టీ సభ్యులకే అన్ని అధికారాలు సౌకర్యాలు! ఎదిరించినవారిని స్టాలిన్ నిర్దాక్షిణ్యంగా అణచివేసి సైబీరియాలోని - కాన్సెన్ట్రేషన్ క్యాంపులకు తోలేసాడు.

స్టాలిన్ యుగం అంతరించిన తరువాత ఏం జరిగింది? అంతవరకు నియంతృత్వం క్రింద - నోళ్లు మూసుకుపోయిన అసంతృప్తులయిన ప్రజలంతా తిరగబడ్డారు. స్టాలిన్ తరువాత వచ్చిన నాయకులు - ఒకరి తరువాత ఒకరు సడలింపులు అమలు పరిచారు - చివరగా - గోర్బచేవ్ - ప్రజల స్వాతంత్ర్యకాంక్షకు తలుపులు తెరిచాడు. సోవియట్ రష్యాలోని - సభ్యదేశాలన్నీ విడిపోయి స్వతంత్ర రాజ్యాలుగా ప్రకటించుకున్నాయ్.

నా నమ్మకం ఏమిటంటే హింస - ద్వేషాల పునాదుల మీద నిర్మించబడిన రాజ్యాలు ఎప్పటికైనా - కూలిపోక తప్పదు? యిది చరిత్ర చెబుతున్న సత్యం!

చరిత్రలో కొందరు నాయకుల వల్ల - కొన్ని మేళ్లుజరుగుతయ్! కొన్ని కీళ్లు జరుగుతయ్!

గాంధి - కాంగ్రెసు వుద్యమంలో మతాన్ని చేర్చినందువల్ల - జిన్నా దేశ విభజన కోరి, పాకీస్థాన్ని సృష్టించాడా? పాకీస్థాన్‌లో ముస్లింలంతా జిన్నాను 'జాతిపిత'గా కొలిచారు. మనం గాంధీని జాతిపిత అన్నట్టే!

కాని - పాకిస్థాన్ ముస్లిం రాజ్యంగా ప్రకటించారు. తరువాత ఏమయింది. వాళ్లలో వాళ్లు కొట్టుకు చస్తున్నారు షియాలు - సున్నీలు! యిప్పుడు - రావణ కాష్టంలా రగులుతున్న మధ్య ఆసియా పాలస్తీనా - ఇజ్రాయిల్ యుద్ధానికి మూలకారణం ఏమిటి? మతమేగా!

కాబట్టి తేలిందేమిటంటే - మనుష్యుల్ని ఏకం చేసేది 'మతం' కాదు. వర్గాలు లేని - మతం పేరు ఒక్కటి చెప్పండి! క్రైస్తవంలో - కేథలిక్కులు - ప్రొటిస్టెంట్లు యింకా యింకా ఎన్నో వర్గాలు!

అన్ని మతాలు చెప్పేది ఒకటేనంటారు గదా - మరి యిన్ని మతాలు ఎందుకు! అన్ని మతాలు కలవ వచ్చుగా! ఒక మతం మీద మరోమతం యుద్ధాలు చేయడమెందుకు! 5 శతాబ్దంలో - క్రైస్తవులు-ముస్లింలను వేలమందిని ఊచకోతకోశారు - జెరూసలేంలో!



ఇతర మతాలను నాశనం చేయమని జీసస్ క్రైస్తు చెప్పాడా? అసలు ప్రపంచ చరిత్రలో - మతం పేరుతో జరగినంత మారణహోమం మరే కారణాల వల్ల జరగలేదు.

అందుకే అన్నాడు కారల్‌మార్క్స్ : "మానవాళి సుఖపడాలంటే ముందు" మతాన్ని "రద్దు చేయాలి" అని!

క్రైస్తవులు - ఇతర మతాల వాళ్లని - తమ మతంలోకి మార్చితేనే గాని వాళ్లకి సేవలు చేయరే! ఏం? ఇతర మతాలలోని వాళ్లు మనుషులు కారా? మానవసేవ మాధవసేవ అంటారుగా! ఇతర మతాలలో వాళ్లకి ఎందుకు సేవ చేయగూడదు.

మదర్ థెరెసాలాంటిది - దీనులు, బాధితుల తల మీద ఏసు క్రీస్తు 'క్రాస్' పెట్టి గాని సేవ చేయదే!

మనుషుల్లో తరతరాలుగా - కొన్ని కొన్ని భావాలు పాతుకుని పోయివుంటయ్! వాటికి భిన్నంగా - ఎవరైనా ఏవైనా చెబితే వెంటనే వాడికి ఏదో ముద్రవేసి వెలివేస్తారు.

నన్ను ఒక విధంగా యం.యన్. రాయ్ రక్షించాడు. అంతకుముందు - కమ్యూనిజం - గాంధీజం - వగైరా సిద్ధాంతాలలో ఏది మంచి ఏది చెడ్డా - అని నిర్ధారించుకోలేని స్థితిలో - రాయ్ నాకు ఒక 'సత్యం' భోధించాడు. పేర్లు ఏవైనా రాజకీయ పార్టీల వల్ల ప్రయోజనం లేదు! ప్రజలకు న్యాయం జరగదు!! అది గూడ - ఆయన తన అనుభవం మీద నేర్చుకున్న పాఠమే!

యం.యన్. రాయ్‌కి రష్యాలో స్టాలిన్‌తో విభేదాలు వచ్చినయ్. పారిపోయి ప్రాణాలు దక్కించుకుని - జర్మనీ వచ్చాడు - అక్కడ నుంచి తిరిగి ఇండియా వచ్చాడు. టెర్రరిస్టుగా వున్నప్పుడు - ఆయన మీద బ్రిటీష్ ప్రభుత్వం పెట్టిన కేసులు అలాగే వున్నాయ్.

రావడం రహస్యంగానే వచ్చాడు. ఏమాటకామాటే - నెహ్రూ అతనికి ఆశ్రయమిచ్చి కాపాడాడు. కాని - కొన్ని నెలలకి బ్రిటిష్ ప్రభుత్వం అతని ఆచూకీని తెలిసుకొని అరెస్టు చేశారు! జైలు శిక్ష వేశారు. 12 ఏళ్లు! అప్పీలులో శిక్షను 6 ఏళ్లు చేశారు. జైలులో వుండగా - మంచి పుస్తకాలు రాశాడు. భార్య - ఎలెన్ రాయ్‌కి జర్మనీకి వుత్తరాలు రాశాడు.

జైలు నుంచి బయటికి వచ్చాక - కాంగ్రెసులో చేరాడు. అందులో కాంగ్రెసు సోషలిస్టు పార్టీలో చేరాడు. వాళ్లతోనూ సరిపడక - చివరకి సొంత పార్టీ పెట్టాడు. 'రాడికల్ డెమొక్రాటిక్ పార్టీ'! ఆ పార్టీ తరపున ఎన్నికల్లో పోటీ చేశాడు. ఘోర పరాజయం పొందాడు! చివరికి సుదీర్ఘ రాజకీయ అనుభవాల ఫలితంగా - ఒక నిర్ణయానికి వచ్చాడు రాజకీయ పార్టీల వల్ల లాభం లేదు! రాజకీయ పార్టీల లక్ష్యం అధికారం ఆర్జనే గాని - ప్రజాక్షేమం కాదు అని తెలుసుకున్నాడు. జ్ఞానోదయం అయింది!

తన కొత్త ఉద్యమానికి "రాడికల్ హ్యూమనిస్ట్ మూవ్‌మెంటు" అని పేరు పెట్టాడు. అది ప్రజలను జాగృతం చేసే వుద్యమమేగాని అధికారం కోసం ఎన్నికల్లో పోటీ చేసే పార్టీకాదు!

నేను - పైనచెప్పిన - రాయ్ అవతారాలన్నీ ఫాలో అవుతూ పరిశీలిస్తూ వచ్చాను. 1948 - 49 ప్రాంతంలో అనుకుంటాను - రాయ్ ఒకసారి విజయవాడ వచ్చినప్పుడు - ఆయన్ని కలిశాను.

ఆయన ఆలోచనా సరళిలో - క్రమంగా వచ్చిన మార్పుల ఫలితంగా ఆయన 'Pacifist' అయినాడు. అదే 'హూమనిజమ్'! రాడికల్ హ్యూమనిజమ్! యీ విషయంలో గాంధి సిద్ధాంతాలకు దగ్గరయ్యాడు!





ఎమ్.యన్. రాయ్

మన రాష్ట్రంలో తెనాలిలోనూ, కాకినాడలోనూ నాలాంటి రాయ్ అభిమానులు కొందరున్నారు. వాళ్లను 'రాయిస్టులు' అనే వాళ్లు!

మేము ఎప్పుడయినా కలుసుకున్నప్పుడు - రాజకీయాలు చర్చించుకునే వాళ్లం! కొందరు రాయిస్టు మిత్రుల వాదన ఏమిటంటే-

"అసలు మార్క్సిజమ్ అనేది - సోవియట్ రష్యాలో లెనిన్ - స్టాలిన్ అమలుపరచింది కాదు! మార్క్సిజానికి- రాయ్ చెప్పే వ్యాఖ్యానమే - inferpretation కరెక్ట్! రాయ్ అసలు సిసలైన మార్క్సిస్ట్!" అని.

నేను అనేవాణ్ణి "ఆయన మార్క్సిజమ్ నుంచి ఎప్పుడో దూరమైపోయాడు. గాంధిజమ్‌కి దగ్గరవుతున్నాడు" అని.

వాళ్లు ఒప్పుకునే వాళ్లు కాదు.

ఒకసారి రాయ్ విజయవాడ వచ్చాడు! సూర్యారావుపేటలో డాక్టర్ గోవిందరాజులు నాయుడు అని - ఒక డాక్టరు వుండేవాడు. ఆయన యింట్లో మకాం - రాయ్ - ఆయన భార్య ఎలెన్ రాయ్!

ఒక మీటింగు పెట్టి రాయ్‌తో చర్చ ప్రారంభించాం! అందరూ ఏవేవో అడిగారు రాయ్‌ని! నేను - నాకున్న సందేహాలను వెలిబుచ్చుతూ రాయ్‌కి చెబుతున్నాను. మార్కిసిజమ్ ప్రకారం - సమాజ పరిణామం! ఎలా వస్తుంది? Dictatorship of the proletariat! state withers away? మార్క్స్ ప్రకారం ప్రొలిటేరియట్ (అంటే కార్మికవర్గం) నియంతృత్వం వచ్చిన తరువాత అసలు గవర్నమెంటుతో అవసరముండదని అలా ప్రభుత్వం అనేది అంతరిస్తుందని!

దానిలో ఒక సూత్రం ఉంది ప్రతివ్యక్తి "From each according to his capacity - to each according to his needs అని. అంటే ప్రతి మానవుడు - తన శక్తి వంచన లేకుండా ఉత్పత్తి చేయాలి! అందులో నుంచి ప్రతిమానవుడు తనకు అవసరమైనంతవరకే తీసుకోవాలి" అని.



'State withers away' అన్నారే - మరి మార్క్సిసిజం అమలు చేస్తున్న రష్యాలో - state అంతరించడానికి బదులు క్రమంగా బాగా బలపడుతోంది. యిలా నా సందేహాలన్నీ ఏకరువు పెడుతుంటే -రాయ్ అడిగాడు! "on what are you basing your questions" అన్నాడు. (దేనిమీద ఆధారపడి - నీవు ఈ ప్రశ్నలు అడుగుతున్నావు)

నేను "మీరు రాసిన మార్క్సిజమ్" అనే పుస్తకం ఆధారంగా! అన్నాను.

అంటే - ఆయన నవ్వుతూ "ఇప్పుడు - నాకే దాని మీద నమ్మకం లేదు" అన్నాడు.

ఆయన సిద్ధాంతం ఏమిటంటే 'మార్పు' అనేది శాశ్వతం ! ఏదీ 'స్థిరం'గా ఉండదు! static కాదు. Dynamic! చలనం గలది! మారుతుంది. అలాగే - పరిస్థితులను బట్టి - మన అభిప్రాయాలు గూడ మారుతుండాలి! కాని apply చేయవలసిన కొన్ని ప్రిన్స్‌పుల్స్ మారగూడదు. ఎప్పుడో - ఎవరో చెప్పింది నమ్మి దానినే గుడ్డిగా నమ్ముతూ కూర్చుంటే అది Dogma అవుతుంది! "మౌఢ్యం"!

యిప్పుడు హిందూ మతస్థులకి ఎంత మౌఢ్యం వున్నదో కమ్యూనిస్టులలో అంత మౌఢ్యం వున్నది. అదే వేదం! అందుకు భిన్నంగా ఏం చెప్పినా ఒప్పుకోరు!

ఈ విధంగా సాగింది ఆయన ఉపన్యాసం!

మీటింగ్ అయిపోయింది. భోజనాలకు లేచాం!

రాయ్ - ఆయన భార్య - వెళ్లి ఒకగదిలో కూర్చున్నారు!

నేను మా మిత్రులతో "యిప్పుడైనా - ఒప్పుకుంటారా! రాయ్ మార్క్సిజమ్‌కు దూరమయ్యాడని!" అన్నాను.

వాళ్లు -" No! No! ఆయన చెప్పినదే MARYISM! అని మళ్ళీ మొదటికొచ్చారు!

రాయ్‌కి కోపం జాస్తి! మళ్లీ వెళ్లి అడిగితే కోప్పడతాడని కాస్త వెనకాడి - తిడితే తిడతాడులే - అని - మా మిత్రులు ఇద్దరు ముగుర్ని "రండి! అడుగుదాం" అని వెళ్లాం.

గది తలుపు తట్టాను. ఎలెన్ రాయ్ తలుపు తీసింది. నేను ఇంగ్లీషులో "మిస్టర్ రాయ్! నేను మిమ్మల్ని ఒకే ప్రశ్న అడుగుతాను! 'అవును' 'కాదు' అని ఒక్క ముక్కలో చెప్పండి! అంతకు మించి మిమ్మల్ని బాధపెట్టను" అన్నాను.

'ఏమిటిది? అన్నాడు.

"Are you a Maryist?" అన్నాను.

ఆయన వెంటనే "No! I am not a Maryist! after all, that is not my Trump card" అన్నాడు! బయటికి వచ్చేశాం!

ఇప్పుడైనా ఒప్పుకుంటారా అని నామిత్రులని అడిగాను. అయిపోయింది.

ఆ తరువాత - రాయ్‌కి - ఒక వారపత్రిక ఉండేది. మొదట "Independent India" తరువాత "Radical Humanist" అని పేరు మార్చారు.

రెండు మూడు సంచికల తరువాత నాతో జరిగిన చర్చ ఆధారంగా "Radical Humanist" పత్రికలో ఆయన ఒక వ్యాసం రాశాడు. దానికి హెడ్డింగ్ "The ungandhian Gandhite" అని తనను తాను వర్ణించుకున్నాడు.



ఆయన ungandhian ఎందుకంటే గాంధిగారి pacifism అహింసా మొదలైనవి ఒప్పుకుంటాడు గాని రాజకీయాల్లో ఆయన 'మతం' చేర్చడం ఒప్పుకోడు. అందుకే - తనను 'ungandhian' అని వర్ణించుకున్నాడు.

తరువాత - రాయ్ తన అనుభవపూర్వకంగా తెలుసుకున్న దేమిటంటే డెమోక్రసీలో పార్టీ సిస్టం వల్ల ప్రయోజనం లేదు. ఒక కారణం రాజకీయ పార్టీలకు ముందు అధికారం తద్వారా ధనార్జన - యివి రెండే లక్ష్యాలుగా నిలుస్తయ్ (ఇప్పుడు మన దేశంలో జరిగేది అదేగా! ఈ విషయం - ఆయన 50 ఏళ్ల క్రితమే చెప్పాడు)

రాజకీయ పార్టీల వల్ల మరోనష్టం - డిసిప్లిన్ - క్రమశిక్షణ పేరిట - రాజకీయ పార్టీలు - సభ్యులనోళ్లు నొక్కుతయ్. అందువల్ల వ్యక్తి స్వాతంత్ర్యం నశిస్తుంది. అందువల్ల నేను ఏ రాజకీయ పార్టీలోనూ చేరలేదు! అప్పటికే - రాజకీయ పార్టీలు - అధికారం కోసం పాకులాట ప్రారంభమైంది!

నాకు కాలేజి రోజుల నుంచి - నాటకాలతో సంబంధం వుంది గనక దృష్టి అటు మళ్లించాను!

ఆంధ్రలో రాయిస్టు గ్రూపులు అప్పట్లో తెనాలిలోనూ - కాకినాడలోనూ - కొందరు ఉండేవాళ్లు. తెనాలిలో ప్రముఖ రచయిత త్రిపురనేని గోపీచంద్ మొదట్లో ప్రముఖ రాయిస్ట్. తరువాత తరువాత సినీరంగం - చివర్లో ఆయన అరవిందో సిద్ధాంతాలకు ఆకర్షితుడైనాడు.

అప్పట్లో తెనాలిలో రాయిస్టులు - కోగంటి రాధాకృష్ణమూర్తి - ఆవుల గోపాలకృష్ణమూర్తి - జి.వి. కృష్ణారావు - పి.వి. సుబ్బారావు - ప్రభృతులు, కాకినాడలో - యం.వి. శాస్త్రి - పాలగుమ్మి పద్మరాజు - ఇంకా ఎవరో ఉండేవారు. వాళ్లతో నాకు ఎక్కువగా - పరిచయాలు వుండేవి కాదు. నేను - యం.యన్.రాయ్ రచనలు మాత్రం ఫాలో అవుతుండేవాణ్ణి!

సరిగ్గా- అదే సమయంలో - అంటే - 1948లో - (నేను అప్పుడే - భీమవరం నుంచి - బెజవాడ వచ్చాను) ఆంధ్ర నాటక కళా పరిషత్తు తరుపున - సాంఘిక - నాటక పోటీలు ప్రారంభమైనాయ్ ! అంతకు రెండేళ్ల ముందు గుడివాడలో జరిగినై. 1948లో - బెజవాడలో జరిగినాయ్!

అప్పుడు ప్రజానాట్యమండలి చురుకుగా నాటకాలు వేస్తుండేవాళ్లు. బెజవాడ పరిషత్తులో - ఆత్రేయ - 'ఈనాడు' నాటకం - ప్రజానాట్యమండలి - ఇంకా పాలకొల్లు నుంచి మల్లాది సత్యనారాయణ - 'పేదపిల్ల' నాటకం- యన్.టి.రామారావు గారు - నాటకం - 'చేసిన పాపం' (కొప్పరపు సుబ్బారావు గారి రచన) - నార్ల వెంకటేశ్వర రావు గారి - 'కొత్తగడ్డ' నాటక సంపుటి నుంచి - రెండు మూడు నాటికలు - పోటీకి వచ్చినయ్ !

ఆ నాటకాలతో నాకు మళ్లీ నాటక రంగం మీదకి దృష్టి మళ్లింది. నాటక రంగప్రవేశం గురించి తరువాత చెబుతాను.

రాయిస్టులతో గూడ నేను వ్యక్తిగతంగా సంబంధాలు పెట్టుకునేవాణ్ని గాదు. అప్పటికి ఇప్పటికి గూడ నాకు వ్యక్తులతో అంటిపెట్టుకు తిరిగే అలవాటు లేదు. ఆ మధ్య ఎవరో 'ఈనాడు' లో నా 'అక్షింతలు'వ్యాసాలు చూచారు. యం.యన్. రాయ్ ప్రతిపాదించిన పార్టీలెస్ డమోక్రసీ - రాజకీయపార్టీలు లేని - ప్రజాస్వామ్యాన్ని గురించి రాశా!

అది చదివి - ఆయన "పార్టీ రహిత ప్రజాస్వామ్యం" మీద ఏదో సదస్సు జరుగుతున్నదండి!" అని నన్ను రమ్మని వుత్తరం రాశాడు.



'నేను రాను' అన్నాను - ఎందుకంటే - ఒక పాయింటు మీద ఏకాభిప్రాయం ఉన్నంతమాత్రాన - మిగతా ఎన్నో విషయాల మీద అభిప్రాయభేదాలు ఉండవచ్చు. ఎవరు నమ్మకాలు - ఎవరు వదులుకుంటారు? "నేను ఎవరి జోలికి రాను!" నాకు తోచినవి నేను రాస్తాను" అన్నాను.

ఈ రాజకీయపార్టీలలో పనిచేసేవారికి గూడ - 'పార్టీ సిద్ధాంతాలు' అని ప్రకటిస్తారే గాని - అందులోని మెంబర్లందరికీ - వాటిలో నమ్మకాలు ఉండవు.

ఆ రోజుల్లో - కమ్యూనిస్టు పార్టీలో గూడ - చేరిన మెంబర్లు కమ్యూనిస్టు సిద్ధాంతాల మీద నమ్మకం అవగాహన ఉండిగాదు.

'ఈనాడు' రామోజీరావుగారు - ఒకప్పుడు - కమ్యూనిస్టు పార్టీ మెంబరు ఈ మధ్య - ఆయన ఒకసారి - నాతో చెప్పాడు.

"అప్పుడు - నాలాంటి వాళ్లు చాలామంది - పార్టీలో చేరింది కమ్యూనిస్టు సిద్ధాంతాలు తెలిసి - వాటి మీద నమ్మకం ఉండిగాదు! అప్పటి కమ్యూనిస్టు పార్టీ అగ్రనాయకుల గొప్పదనం - మంచితనం చూచి ఆకర్షితులై చాలామంది పార్టీలో చేరారు.

పుచ్చలపల్లి సుందరయ్యగారు - చాలా గొప్ప నాయకుడు. అలాగే - చండ్ర రాజేశ్వరరావు - యిలాంటి గొప్ప వ్యక్తుల్ని చూచి - వాళ్లు పనిచేసే పార్టీగూడ వాళ్లంత గొప్పదై ఉంటుందని చేరినవాళ్లే ఎక్కువ!

వాళ్లని కూర్చోబెట్టి - కమ్యూనిస్టు పాఠాలు చెప్పేవాళ్లు! అవి బట్టీ పట్టి చిలకల్లాగ పలికేవాళ్లు చాలామంది మెంబర్లు. ఈ విషయాలు నాకు సెట్టి ఈశ్వరరావు, తాపీ మోహనరావు చెబుతుండేవాళ్లు. వీళ్లు క్లాసులు పెట్టి ఉపన్యాసాలు ఎలా ఇవ్వాలి అని బోధిస్తే మిగతావాళ్లు చిలకపలుకుల్లాగా - పల్లెల్లో తిరిగి ఉపన్యాసాలిచ్చేవాళ్లు! అంతేగాని - "వీళ్లకి కమ్యూనిజం - పాడూ తెలీదు" అని చెప్పేవాళ్లు.

కమ్యూనిస్టు పార్టీలో చేరడమంటే - నా విషయం చెబుతాను. నేను 1941లో కాలేజి నుంచి వచ్చి బెజవాడలో 1942లో ఇల్లు కట్టుకున్నానని చెప్పానుగదా! సత్తెనపల్లి తాలూకా మా స్వగ్రామం - తాళ్లూరులో నా భూములు చూచుకోవడానికి వెళ్లేవాణ్ణి! మా ఊళ్లో మా పెత్తండ్రిగారి - పెద్దకుమారుడు గురవరాజుగారు కమ్యూనిస్టు. ఆయనకు వావిలాల గోపాలకృష్ణయ్యగారు సహచరుడు. ఆ రోజుల్లో చుట్టు పక్కల ఊళ్లలో కలరా - మశూచికాలు వస్తే వీళ్లు వెళ్లి సంఘసేవ చేసినవాళ్లు!

మా పెద్దన్నయ్య కమ్యూనిస్టు అంటే - నేనే నవ్వాను! ఆయనకి కమ్యూనిజం స్పెల్లింగు కూడ తెలీదు. పార్టీలో ఎందుకు చేరాడంటే, వావిలాల గోపాలకృష్ణయ్యగారు మంచి సంఘసేవకుడు - నాయకుడు గనక ఆయన ఏ పార్టీలో వుంటే - యీయన ఆ పార్టీ! అంతే! సిద్ధాంతాలు తెలిసి కాదు!

మా ఊళ్లో మా పెద్దన్నయ్యది పెత్తనం! ఊళ్లో వాళ్లు ఆయన ఎంత చెబితే అంత! ఎలక్షన్లు వస్తే కాంగ్రెసు వాళ్లను ఆ వూళ్లో మీటింగు పెట్టుకోనిచ్చేవాళ్లు కాదు.

ఒకసారి కోట్ల విజయభాస్కరరెడ్డిగారు గుంటూరు నాయకుడు మేడూరి నాగేశ్వరరావు - ఇద్దరు మదరాసు వచ్చారు - 1956- ఆ ప్రాంతంలో! వాళ్లు బి.యన్ రెడ్డిగారి యింటి దగ్గర నాకు కలిశారు.



నాగేశ్వరరావు గారు అన్నాడు "ఏమిటండీ! మీ ఊరు వెళితే మీ అన్నయ్య మీ ఊళ్లో మీటుంగు కూడ పెట్టుకోనివ్వలేదు." ఆయన ఒకటే మాట చెప్పాడట- "మీటింగు పెట్టుకోండి. జనం ఎవ్వరు రారు. పైగా ఎవరన్నా రాళ్లు వెయ్యవచ్చు! అందుకు నేను బాధ్యుణ్ణి కాదు. నన్నేమీ అనవద్దు".

ఒకసారి గోపాలకృష్ణయ్యగారు నాతో చెప్పాడు. మా ఊళ్లో గోపాలకృష్ణయ్యగారు చూస్తుండగానే - మా అన్నయ్య - పాలేరు ఏదో పొరపాటు చేస్తే కర్ర తీసుకుని - పాలేరును చితక బాదాడట! గోపాలకృష్ణయ్యగారు - ఆశ్చర్యపోయి "అదేమిటి! గొడ్డును బాదినట్టు బాత్తారు" అని అడ్డుపోయాడట! "ఆఁ! మీకు తెలీదు వూరుకోండి అట్లా బాదితే తప్ప వాడు మాట వినడు" అన్నాడట మా అన్నయ్య.

అదీ మా అన్నయ్య కమ్యూనిజమ్. ఆయనది ఫ్యూడల్‌మైండ్! ఆయనదేకాదు. ఇప్పుడు రాజకీయాలలో ఉన్న చాలామందివి ఫ్యూడల్‌మైండ్స్! పెత్తందారీ తత్వం! మా అన్నయ్య కమ్యూనిస్టు పార్టీలో ఎందుకు చేరాడు అంటే గోపాలకృష్ణయ్య గారి మీద గౌరవం కొద్దీ! అలాగే చాలా మంది నాయకుల మీద గౌరవాభిమానాలుండి పార్టీలలో చేరారు గాని సిద్ధాంతాలు తెలిసి గాదు!

నేను 1942లో మా భూములు చూచుకోడానికి వెళ్లానని చెప్పాగదా! మా అన్నయ్యకి - సత్తినపల్లిలో చాలా మంది రాజకీయ స్నేహితులుండేవాళ్లు! చతుర్వేదుల సీతారామశాస్త్రి అని ఒక డాక్టరు ఉండేవాడు! అతను కమ్యూనిస్టు! పేదవాళ్లకు వుచితంగా వైద్యం చేసేవాడు. నిజమైన సంఘసేవకుడు. సత్తినపల్లిలో - కమ్యూనిస్టు పార్టీ యూనిట్‌కి సెక్రటరీగానో - ప్రధాన నాయకుడుగానో ఉండేవాడు. నాళం నరసింహారావు! అతను గుంటూరు ఏ.సి. కాలేజిలో మాకినేని బసవపున్నయ్య సహాధ్యాయి.

మరో విషయం చెప్పనా!- జంధ్యాల ఆంజనేయ శాస్త్రి అని నాకు హైస్కూలులోనూ గుంటూరు హిందూ కాలేజీలో - ఇంటర్‌లోనూ క్లాస్‌మేట్. వాడు కమ్యూనిస్టు పార్టీలో చేరి కృష్ణాజిల్లా పార్టీ సెక్రటరీ అయినాడు. ఆ తరువాత కొన్ని సంవత్సరాలు మేము కలవలేదు! ఆ మధ్య పదిపదిహేనేళ్ల క్రితం వాణ్ణి చూద్దామనుకుని ఎవర్నో అడిగితే వాడు అంతకుముందు వారం పది రోజుల క్రితమే హైదరాబాద్‌లో చనిపోయాడని చెప్పారు!

వాడి పూర్తి పేరు - జె.యస్సార్. ఆంజనేయశాస్త్రి. హైస్కూలులోనూ కాలేజిలో చదివేటప్పుడు వాడికి రాజకీయాలే తెలియవు. నేను లయోలా కాలేజి నుంచి వచ్చి బెజవాడలో ఇల్లు కట్టుకున్న తరువాత - ఆంజనేయశాస్త్రి మా ఇంటికి వచ్చి నా ప్రాణం తీసేవాడు నన్ను కమ్యూనిస్టు పార్టీలో చేరమని. వాడు పార్టీలో చాలా యాక్టివ్‌గా ఉండేవాడు. నన్ను గూడ చేరమంటే నేను చెప్పేవాణ్ణి! "ఒరే! శాస్త్రి! నేను కమ్యూనిజం గురించి చదువుకున్నానురా! నేను కమ్యూనిస్టు పార్టీలో చేరడానికి అర్హుణ్ణి కాదురా! నాది బూర్జువా తత్వం! పెద్దలు సంపాయించి ఇచ్చింది పోతుందేమోనని భయపడే వాణ్ణి! నేను కమ్యూనిస్టుని ఎలా అవుతాను రా?" అనేవాణ్ణి!

"అదేమిట్రా! కాలేజీలో వుండగా అందరికీ చెప్పేవాడివి గదరా! అందరికీ లీడర్‌గా ఉండేవాడివి గదరా!" అని మొండికేసి కూర్చునేవాడు.

"ఒరే! శాస్త్రి! కమ్యూనిస్టు పార్టీ ఆర్గనైజేషన్ గురించి నాకు తెలుసు! పుస్తకాల్లో చదివాను. నన్ను నువ్వు పార్టీలో ఎందుకు చేరమంటున్నావంటే పార్టీకి నన్ను విరాళాలివ్వమంటారు! విరాళాలు ఎంతవరకు? నా ఆస్తి హరించే వరకు విరాళాలు అడుగుతూనే వుంటారు. నేను ఇవ్వను! ఎందుకంటే ఉన్నది పోతుందేమోనని భయపడే





జంధ్యాల ఆంజనేయ శాస్త్రి

బూర్జువా తత్వం నాది! పార్టీ ఆర్గనైజేషన్ గురించి నేను చదివాను! వెబ్స్ రాసిన "సోవియట్ కమ్యూనిజం" పుస్తకంలో ఉంది. రష్యాలోనే కమ్యూనిస్టు పార్టీ పెట్టినప్పుడు "ప్రొలిటేరియట్" అంటే పారిశ్రామిక కార్మిక వర్గం లేదు! అసలు విప్లవం ముందు ఏ దేశంలో రావాలంటే పారిశ్రామికరంగం బాగా అభివృద్ధి చెందిన దేశంలో రావాలి. పారిశ్రామిక కార్మికుల్నే ప్రొలిటేరియట్ అంటారు. వ్యవసాయ కార్మికుడు ప్రొలిటేరియట్ కాడు.

వ్యవసాయకార్మికుడు అంటే ఎవరు? రైతుగా వుండి భూములు పోతే వ్యవసాయకార్మికుడవుతాడు. విప్లవానికి ముందు రష్యా పారిశ్రామికంగా చాలా వెనకబడిన దేశం! పరిశ్రమలు ఎక్కువగా లేవు! నిజానికి విప్లవం పారిశ్రామికంగా వెనకబడిన రష్యాలో రావసిందిగాదు! రష్యాలో విప్లవం పరిస్థితుల ప్రాబల్యం వల్ల accidentalగా వచ్చింది. మార్క్సు ప్రకారం ముందు విప్లవం రావలసింది - పారిశ్రామికంగా అభివృద్ధి పొందిన జర్మనీలో!

రష్యన్ కమ్యూనిస్టు పార్టీ నిర్మాణానికి బాధ్యులైన సెంట్రల్ కమిటీలోని చర్చలన్నీ రహస్యంగా జరుగుతయ్! బయటికి తెలియనివ్వరు. సెంట్రల్ కమిటీలో జరిగిన చర్చల్లో - తీర్మానించింది ఏమిటంటే "రష్యా పారిశ్రామిక దేశం కాదు! కాబట్టి - నిజమైన ప్రొలిటేరియట్ లేదు! ఉన్నవాళ్లు వ్యవసాయ కార్మికులు! వ్యవసాయకార్మికులు - భూములు పోయిన భూస్వాములు! వాళ్లు ప్రొలిటేరియట్ కాదు! దేశం పారిశ్రామికంగా అభివృద్ధి పొంది నిజమైన ప్రొలిటేరియట్ తయారయ్యేవరకు ఇప్పుడున్న వ్యవసాయ కార్మికుల్ని తాత్కాలికంగా విప్లవానికి ఉపయోగించుకోవాలి!" ఈ తీర్మానాలు రహస్యంగా ఉంటయ్యేగాని - బయటికి పొక్క నివ్వరు! అంటే ప్రజలకి నిజం చెప్పకుండా - వాళ్లని మనం ఉపయోగించుకోవాలి. ఇది కారల్‌మార్క్సు చెప్పింది గాదు! మార్క్సు గొప్ప హ్యూమనిస్టు! వ్యవసాయ కార్మికుల్ని మోసం చేసి - తమ పార్టీ అభివృద్ధికి వాడుకుని తరువాత వాళ్లని చెత్తబుట్టలో పారెయ్యమని - మార్క్సు ఎన్నడు చెప్పలేదు! అవసరానికి పార్టీ నిర్మాణానికి స్టాలిన్ చేసిన పని అది! కారల్‌మార్క్సు సిద్ధాంతాలను తనకు అనుకూలంగా అధికారం కోసం - వ్యాఖ్యానించి నియంతగా తయారయినవాడు స్టాలిన్!

ఇవన్నీ సిడ్నీ అండ్ బియాట్రిస్ వెబ్ వ్రాసిన 'సోవియట్ కమ్యూనిజం' అనే పుస్తకంలో ఉన్నాయి! వీళ్లు - స్టాలిన్ కాలంలోనే సోవియట్ రష్యా అంతటా పర్యటించి రాసిన పుస్తకం అది!

ఒక్క ఆంజనేయ శాస్త్రికాదు - సత్తెనపల్లిలో నాళం నరసింహారావు మొదలైనవాళ్లు - మా అన్నగారి ద్వారా - నన్ను పార్టీలో చేర్చాలని ప్రయత్నించారు!



1943 ప్రాంతంలో బెజవాడలో జరిగిన రైతు మహాసభలు కమ్యూనిస్టు అధ్వర్యంలోనే - జరిగినప్పుడు సత్తెనపల్లి కమ్యూనిస్టు మిత్రులు బెజవాడలో మా ఇంట్లోనే వున్నారు.

అందరూ - నాకు మంచి స్నేహితులే! పార్టీలో బెజవాడలో గూడ స్నేహితులుండేవారు!

కాని - నేను పార్టీలో చేరలేదు. కారణం - 'సోవియట్ కమ్యూనిజం' పుస్తకంలో కమ్యూనిస్టు పార్టీ రహస్యాలు చదవడమే!

తరువాత - ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు చరిత్ర తిరగేస్తే నా నమ్మకాలు నిజమైనయ్!

అప్పుడు పార్టీ అగ్రనాయకులుగా చలామణీ అయినవారిలో కొందరు పార్టీ పలుకుబడితో పొగాకు వ్యాపారాలు చేసి - లక్షలు సంపాదించారు!

చదలవాడ పిచ్చయ్య అని - తెనాలి తాలూకా పెదపూడి! మంచి సిన్సియర్ కమ్యూనిస్టు! అభ్యుదయ రచయితల సంఘానికి కార్యదర్శిగా కూడా పని చేశాడు! కమ్యూనిస్టు అగ్రనాయకులనబడే వాళ్ల చేసిన వ్యాపారాలు - స్వార్థ రాజకీయాలు స్వయంగానే చూసి - బిత్తరపోయి పార్టీ నుంచి బయటికి వచ్చి-

"కమ్యూనిస్టు అగ్రనాయకుల నగ్న సత్యాలు" అని పుస్తకం రాసి ప్రచురించాడు.

కమ్యూనిస్టు పార్టీ నిర్మాణం సిద్ధాంతాలలో మరో విశేషమేమిటంటే-

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల పాలనలో - పారదర్శకత 'ట్రాన్స్‌పరెన్సీ' వుండాలని కమ్యూనిస్టు పార్టీలు డిమాండ్ చేస్తుంటయ్ గదా!

ఒకవేళ కమ్యూనిస్టు పార్టీ అధికారంలోకి వస్తే, వాళ్ల ప్రభుత్వాల్లో 'పారదర్శకత' ఉంటుందా? ప్రభుత్వం ఏంచేస్తుందో - అంతా బహిరంగంగా ప్రజలకు చెబుతారా?

అసలు కమ్యూనిస్టు పార్టీ కార్యక్రమాలలోనే పారదర్శకత వుండదు! పొలిట్‌బ్యూరో - కమ్యూనిస్టు సెంట్రల్ కమిటీలు చేసే చర్చలు - తీర్మానాలు వాళ్ల పార్టీ సభ్యులకే తెలియనివ్వరు. అంతా రహస్యమే!

అందాకా ఎందుకు - కేంద్రంలో జనతా ప్రభుత్వం పడిపోయిన తరువాతనో - వాజ్‌పాయి మొదటి ప్రభుత్వం పడిపోయిన తరువాతనో బాగా జ్ఞాపకం లేదు. సి.పి.యం. నేత వెస్ట్ బెంగాల్ ముఖ్యమంత్రి - జ్యోతిబసు ప్రధానమంత్రి అయ్యే అవకాశం వచ్చింది. జ్యోతిబసు అందుకు సుముఖంగానే ఉన్నాడు. ఇతర పార్టీలు గూడ కొన్ని సపోర్టు చేసి- మెజారిటీ సపోర్టుతో సి.పి.యం. కేంద్రంలో ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసి - జ్యోతిబసు ప్రధానిగా ఎన్నికయ్యే అవకాశం వచ్చింది. అప్పుడు సి.పి.యం. పొలిట్‌బ్యూరో అభ్యంతరం చెప్పింది. "ఇతరుల సపోర్టుతో కేంద్రంలో ప్రభుత్వాన్ని స్థాపించి జ్యోతిబసు ప్రధాని అయితే ప్రజాసమస్యలు పరిష్కరించలేక అభాసుపాలవుతాం!" అని నిరాకరించింది.

అప్పట్లో ఆ తీర్మానం అతి రహస్యంగా ఉంచారు! బట్టబయలు చేయలేదు! తరువాత చాలా కాలానికి - ఆ రహస్యం బయటపడింది. జ్యోతిబసే స్వయంగా "కేంద్రంలో ప్రభుత్వస్థాపన అవకాశాన్ని జారవిడుచుకోవడం - చారిత్రక ఘోర తప్పిదం" అని పబ్లిక్‌గా స్టేట్‌మెంట్ యిచ్చాడు.



## అప్పటి రాజకీయ వాతావరణం

కమ్యూనిస్టు పార్టీ కార్యకలాపాలు తీర్మానాలలో 'అతి రహస్యం' కొత్తేమికాదు. రెండవ ప్రపంచ యుద్ధానంతరం భారత స్వాతంత్ర్యానంతరం కమ్యూనిస్టు పార్టీ అగ్రనాయకుల్లో విభేదాలు వచ్చినై. (అప్పుడు కమ్యూనిస్టు పార్టీ ఒకటిగానే వుండేది. 1964 ప్రాంతంలో నాయకుల్లో విభేదాలు వచ్చి సి.పి.ఐ - సి.పి.ఐ.యం.గా చీలిపోయినాయి. ఇప్పటికీ అలాగే ఉన్నాయి. ఆ రెండిటి మధ్య తేడా ఏమిటో ఇప్పటికీ - అర్థం కాదు!

అసలు చెప్పవచ్చిన విషయం ఏమిటంటే - స్వాతంత్ర్యానంతరం కమ్యూనిస్టు పార్టీ సెక్రటరీ పి.సి.జోషి స్థానంలో రణదివే జనరల్ సెక్రటరీ అయ్యాడు. రణదివేది హింసాయుత విప్లవ పంథా! ఈ పంథా ప్రకారం బూర్జువా భూస్వాముల్ని హత్యలు చేయడం - పోలీసు స్టేషన్లు మీద దాడులు చేయడం - సాయుధ విప్లవం ద్వారా అధికారం హస్తగతం చేసుకోవడం! అందుకు అంతకు ముందున్న పి.సి. జోషి నాయకత్వంలో వున్న పార్టీ మెంబర్లు అసమర్థులు. అనర్హులుగా కనిపించారు! వాళ్లందరి చేత రాజీనామాలు చేయించి - పార్టీ నుంచి బయటికి పంపించాడు. ఆ స్కీములో మా పెద్దన్నయ్యకు గూడ పార్టీ సభ్యత్వం రద్దు చేశారు! పాతమెంబర్ల స్థానంలో విప్లవ పంధాకు పనికి వచ్చే రౌడీలను - గుండాలను దారులుకొట్టే యువతను పార్టీలో చేర్చుకున్నారు. వాళ్లయితేనే హింసాయుతంగా ఖూనీలు దోపిడీలు చేయగలరని పార్టీ అగ్రనాయకుల నమ్మకం!

మా ఊరు, తాళ్లూరులో - కత్తులు చూపి - పట్టపగలు దారులుకొట్టే కుర్రకారుని పార్టీలో చేర్చుకున్నారు. 1948లోనో - 1949లోనో సత్తెనపల్లి తాలూకా అచ్చంపేటలో ఒక రాత్రి పూట కమ్యూనిస్టులు సాయుధులై పోలీసుస్టేషన్ మీద దాడిచేశారు. అప్పుడు అక్కడ సబిన్స్పెక్టర్ లేడు. అది చిన్న ఊరు. పోలీసుస్టేషన్లో అయిదారుగురు కానిస్టేబుల్స్ ఉన్నారు. వాళ్లను తుపాకులతో బెదిరించి - స్టేషన్లో తుపాకులు లాక్కున్నారు. రాత్రిపూట! వీధుల్లో తిరుగుతూ- "ఎవరూ బయటికి రాబోకండి! బయటికి వస్తే కాల్చేస్తాం!" అని కేకలువేస్తూ వీధుల్లో అరిచారు! భయపడి ఎవరూ బయటికి రాలేదు! సబిన్స్పెక్టరు ఇంటి మీదకి దాడి చేశారు. సబిన్స్పెక్టరు ఎక్కడికో డ్యూటికి వెళ్లాడు. అతని భార్య వుంది! గర్భవతి! ఇద్దరు చిన్నపిల్లలు!

"మమ్మల్ని ఏమి చేయవద్దు! మీకు కావలసినవి తీసుకుపొండి" అని ఆమె పిల్లల్ని దగ్గరకు తీసుకుని ఒక మూల నిలబడింది. అందరూ ముసుగుల్లో వున్నారు! ఇల్లంతా గాలించి చిందరవందర చేశారు! ముసుగు తొలిగిందో లేక గొంతు గుర్తుపట్టిందో సబిన్స్పెక్టరు భార్య అందులో ఒకణ్ణి గుర్తుపట్టింది. అంతకుముందు వాడు ఆ ఇంట్లో నౌకరుగా పనిచేశాడు - ఎంతో నమ్మకస్తుడుగా!

వాణ్ణి పేరు బెట్టిపిలిచి "ఒరే! నువ్వే యీ పని చేయిస్తున్నావటరా?" అన్నది గుర్తు పట్టిందిగా! రేపు చెప్పేస్తుందని వెంటనే తుపాకితో ఆవిడని కాల్చేశాడు. ఆవిడ కుప్పకూలి అక్కడే చనిపోయింది. వాళ్లంతా పారిపోయారు. ఆ దాడి చేసినవాళ్లలో మా ఊరు కుర్రవాళ్లు ముగ్గురో నలుగురో ఉన్నారు! ఆ తుపాకులు తీసుకువచ్చి నా చేనులో పూడ్చి పెట్టారు. ఒక తూటాల ప్యాకెట్ మా బావిలో పారేశారు!

ఆ దాడి జరిగిన తరువాత వారం పదిరోజులకి మా పెద్దన్నయ్య బెజవాడ వచ్చాడు! ఎందుకంటే బకెట్ సిస్టంతో మాపెద్దబావి కింద కొంత మాగాణి చేద్దామని - నేను మా అన్నయ్య నిర్ణయించుకున్నాం.



అందుకోసం బకెట్లు కొనడం కోసం మా అన్నయ్య బెజవాడ వచ్చాడు. అచ్చంపేట పోలీసుస్టేషన్ పై దాడి జరిగింది గదా దాని వివరాలు అడిగాను. "అబ్బే! మనకేం సంబంధం లేదు! నేను పార్టీలో లేను గదా!" అన్నాడు. రెండు మూడు రోజుల తరువాత పొద్దున్నే కాఫీ తాగడానికి సత్యనారాయణపురం సెంటర్‌కి వెళ్లాడు! కాఫీ తాగి హోటలు నుంచి బయటికి రాగానే ఒక మనిషి వచ్చి "రా జట్కా ఎక్కు" అన్నాడట! ఈయనకి తెలిసింది. అతను మఫ్టీలో వున్న పోలీసు కానిస్టేబుల్ అని! "సిగరెట్లు కొనుక్కుని వస్తా" అని పక్కనే బడ్డీ కొట్టు దగ్గరికి వెళ్లి - సిగరెట్లు కొనుక్కుని రహస్యంగా ఆ కొట్టు వాడితో "నన్ను పోలీసులు పట్టుకెళుతున్నారని మావాడికి కబురు చెయ్" అని చెప్పి ఆ పోలీసువాడితో జట్కా ఎక్కి వెళ్లి పోయాడు.

నేను క్లబ్బులో బిలియర్డ్స్ ఆడుతున్నాను. మా ఇంట్లో నౌకరు వచ్చి మిమ్మల్ని వెంటనే అమ్మగారు రమ్మంటున్నారు అన్నాడు! నేను ఇంటికి వెళ్లాను. "మీ అన్నయ్యని పోలీసులు పట్టుకెళ్లారట! కబురు వచ్చింది" అని చెప్పింది నా భార్య.

అప్పట్లో ప్రభుత్వ పోలీసు శాఖ పాలసీ ఎలా ఉందంటే అనుమానం ఉన్న వాళ్లని తీసుకెళ్లి కాల్చేయడం - ఎక్కడో పాతి పెట్టడం! అంతే! అడిగేవాడు లేడు. చెప్పేవాడు లేడు.

నాకు ఏం చేయాలో తోచలా! నాకు క్లబ్బులో పరిచయమైన సి.ఐ.డి ఇన్‌స్పెక్టరు ఒకాయన ఉన్నాడు. ఆయన ఇంటికి వెళ్లాను. విషయం చెప్పాను!

"మా అన్నయ్య ఒకప్పుడు పార్టీలో ఉన్నమాట నిజమే! ఇప్పుడు పార్టీతో సంబంధం లేదు! తొందరపడి కాల్చేస్తారేమో! సహాయం చేయండి" అన్నాను.

"ఆయనకు దాడిలో సంబంధం వుంటే - ఎవరూ ఏంచేయలేరు!" అన్నాడాయన.

"సంబంధం లేదని చెప్పాడు! విచారించమనండి! తొందరపడి కాల్చకుండా చూడండి" అన్నాను!

ఆయన ఆ సాయంత్రం మా ఇంటికి వచ్చి "కాల్చరులెండి! కాని వదిలిపెట్టరు! సంబంధం ఉందో లేదో విచారిస్తారు" అన్నాడు.

కాస్త ఊపిరి పీల్చుకున్నాను!

మూడు వారాలు గడిచింది! మా ఊరి నుంచి - మా అన్నయ్య ఉత్తరం రాశాడు. "ఇవాళే - విడుదలై వచ్చాను. వారం రోజుల్లో మళ్లీ బెజవాడ వస్తాను" అని.

వారం రోజుల తరువాత వచ్చాడు. చెప్పాడు. మొదట వారం రోజులు మంగళగిరిలో వుంచారట! మరో వారం గుంటూరులో మూడో వారం అచ్చంపేటలో! ఊళ్లలో జరిగిన దోపిడీకి సంబంధించిన పౌరుల్ని పిలవడం మా అన్నయ్యని చూపడం ఈయన దోపిడిలో ఉన్నాడా? అని ప్రశ్నించడం! ఎవరూ - ఆయనను చూచినట్టు చెప్పలేదు! చివరికి - తాళ్లూరుకు కబురు చేశారు. ఎవరన్నా వచ్చి 'హామీ' రాసియిస్తే విడుదల చేస్తామని. మా పెద్దన్నయ్య చిన్నతమ్ముడు - బావ మరిది - వెళ్లి పూచీకత్తు ఉత్తరాలు రాసి ఇచ్చి - తీసుకువచ్చారు! అదీ జరిగింది. మా పెద్దన్నయ్య మళ్లీ బెజవాడ వచ్చాడు బకెట్లు కొనడానికి!

బెజవాడలో మా పెద్దన్నయ్య మా ఇంట్లో భోజనం చేసి వెళ్లి మా అక్కయ్యగారింట్లో పండుకునేవాడు. ఒక



రోజు తెల్లవారు జామున 4 గంటలకు వచ్చి తలుపు కొట్టాడు! తలుపు తీశాను. మనిషి కంగారుగా ఉన్నాడు! "ఏమిటి" అన్నాను?

"రాత్రి మన ఉరు నుంచి - ఫలనా బంధువులు వచ్చారు! వాళ్లు చెప్పారు - మన ఊళ్లో ఫలాన ఫలాన కుర్రవాళ్లని పట్టుకున్నారట!" అన్నాడు.

"వాళ్లని పట్టుకుంటే - నీకేమీ అన్నాను!"

"వాళ్లే - అచ్చంపేట దాడిలో ఉన్నవాళ్లు" అన్నాడు!

"నీకెలా తెలుసు! నీకేం సంబంధం లేదన్నావు గదా!"

"సంబంధం లేకపోయినా - తప్పలేదు! తుపాకులు పాతిపెట్టడానికి కొయ్యచెక్కతో - పెట్టెలు చేయించాలన్నారు! వడ్రంగిని పిలిపించి చేయించా! మన చేలో పాతిపెట్టారు! రోజూ - వాళ్లు జొన్నచేలలో దాక్కుంటే అన్నం వండించి పంపించాను! వాళ్లు చెప్పినట్టు చెయ్యకపోతే నన్ను కాల్చేస్తారు! చేసినట్టు తెలిస్తే - పోలీసులు కాల్చేస్తారు! నేనిక్కడ ఉండడం క్షేమం కాదు! నన్ను ఎలాగైనా మదరాసు పంపించెయ్! ఆ ప్రాంతంలో సత్తెనపల్లికి చెందిన వాళ్లు అండర్‌గ్రౌండ్‌లో వున్నారు! ఎలాగో వాళ్లతో చేరిపోతాను" అన్నాడు.

ఆయన అంతకు ముందు మద్రాసు పోయి ఎరగడు! మదరాసులో ఎవరింటికి పంపాలి! నాకు స్నేహితులున్నారు! కాని ఇటువంటి మనిషిని స్నేహితులింటికి ఎలా పంపడం?

అప్పుడు అదృష్టవశాత్తు - మద్రాసులో చదలవాడ కుటుంబరావు అడ్రసు నా దగ్గర ఉంది! అతను కమ్యూనిస్టు! బెజవాడలో పోలీసుల దెబ్బలు తినలేక మద్రాసు పోయి - సినిమాల్లో చేరాడు. అతనేకాదు - అలాంటి వాళ్లు చాలా మంది సినిమాలలో తల దాచుకున్నారు!

అప్పుడు నేను 'వీలునామా' అని ఒక నాటకం రాశా! ఆ సంగతి కుటుంబరావుకి తెలుసు! "ఇక్కడ వాహినీ స్టూడియోలో నెలజీతం మీద ఉన్నాం. పని ఏమీలేదు! తోచడం లేదు! మీరు రాసిన నాటకం పంపండి! కాపీ చేసుకుని నాటకం ప్రాక్టీసు చేస్తాం" అని ఉత్తరం రాశాడు కుటుంబరావు! అందులో అతని అడ్రసు వుంది! ఆ అడ్రసు రాసియిచ్చాను మా అన్నయ్యకి. ఆయన నీరుకావి బట్టలు చూస్తే - పోలీసులు అనుమానిస్తారు! అందుకని- నా యిస్త్రీ బట్టలు -దోవతి - లాల్చి - ఇచ్చి - '8 గంటలకి - ఢిల్లీ నుంచి గ్రాన్డ్ ట్రన్క్ ఎక్స్‌ప్రెస్ వస్తుంది - స్టేషనుకు వెళ్లు" అన్నాను.

ఆయనతో నేను గూడ స్టేషనుకు వెళ్లాలంటే అప్పుడు పరిస్థితులు ఎలా ఉన్నాయో తెలుసా! మధ్యలోనే - పోలీసులు పట్టుకుని - ఆయనతో పాటు నన్ను గూడ బొక్కలో తోసేట్టున్నారు! అందుకని 'నువ్వు వెంటనే జట్కాలో వెళ్లు! నేను స్నానం చేసి - అరగంటలో వస్తాను" అని పంపేశాను!

తరువాత ఒక అరగంటకి - అంటే దాదాపు 7.30 అయింది. బెజవాడ స్టేషన్‌కి వెళ్లాను. ప్లాట్ ఫారం మీద గ్రాన్డ్ ట్రన్క్ ఎక్స్‌ప్రెస్ ఉంది! ట్రైన్ అంతా వెతికా! ఈయన కనబల్లా! ప్లాట్‌ఫారం మీద లేడు! మంతెన వెంకట్రాజుగారు (కాంగ్రెసు లీడరు) ఉన్నాడు ప్లాట్‌ఫారం మీద! ఆయనకి మా అన్నయ్య తెలుసు! "అన్నయ్య కనిపించాడా?" అన్నాను! 'లేదే' అన్నాడాయన! "ఈయన్ని - దారిలోనే - పట్టేసి వుంటారు పోలీసులు" అనుకున్నా! యింటికి వెళ్లిపోయా!



తరువాత ఆయన తిరిగి వచ్చాక చెప్పిందేమిటంటే - ఆయన స్టేషన్‌కు వెళ్లేసరికి 5 గంటలకి రావలసిన పూరీ ప్యాసంజరు లేటుగా వచ్చి - ప్లాట్‌ఫారం మీద ఉందట! ఆ ట్రైన్ ఎక్కేశాడు! జి.టి. ఎక్స్‌ప్రెస్ వచ్చేదాకా ఆగితే. ఈలోపల ఏం జరుగుతుందోనని భయం!

ట్రయిన్‌లో గూడ - ఒంటిరిగా ఉంటే - మఫ్టీ పోలీసుల భయం! అందుకని - ఒక ఫ్యామిలీ తిరుపతి పోతున్నారట! అ ఫ్యామిలీలో మెంబరుగా కనబడ్డానికి - వాళ్లతో మాటలు కలిపి - ఎలాగో మదరాసు చేరాడు!

కుటుంబరావుని కలుసుకుని - ఆ తరువాత - సెంట్ థామస్ మౌన్ట్ అండర్‌గ్రౌన్డ్‌లో ఉన్న సత్తెనపల్లి కామ్రేడ్స్‌లో కలిసిపోయాడు.

బెజవాడలో కొందరు కమ్యూనిస్టులు కాన్‌టాక్ట్ మసులుతున్నారు! కృత్తివెంటి కుటుంబరావని - వెలిదండ్ల హనుమంతరాయ గ్రంథాలయం - సెక్రటరీ! కమ్యూనిస్టు! అతను మదరాసు వెళుతుండేవాడు! అతనితో అప్పుడప్పుడు మా అన్నయ్యకి డబ్బు పంపిస్తుండేవాణ్ణి!

తరువాత - నెలారెండు నెల్లకి - నేను మదరాసు వెళ్లా! మా అన్నయ్యని తెలిసిన వాళ్లు - కుటుంబరావు - ఇంకా కొందరున్నారు. వాళ్లనడిగితే 'అప్పుడప్పుడు - పాండీబజారులో కనబడేవాడండి! వారం పదిరోజుల నుంచీ కడబడడం లేదు" అని చెప్పారు! నేను నా పనులేవో చూసుకుని బెజవాడ వచ్చేశాను!

ఆ తరువాత గవర్నమెంటు పాలసీలో మార్పు వచ్చింది. "వాళ్లంతట వాళ్లు వచ్చి లొంగిపోతే చంపం! సాక్ష్యాలు దొరికితే కేసులు మాత్రం పెడతాం" అదీ కొత్తపాలసీ!

సత్తెనపల్లిలో ఒక కమ్యూనిస్టు రెడ్డి వున్నాడు. అతను బెజవాడలో నా దగ్గరకు వచ్చి "నేను పోలీసులకి సరెండర్ అయ్యాను! నన్ను ఏమి చేయలేదు! మీ అన్నయ్య ఎక్కడున్నాడో చెప్పు! తీసుకెళ్లి సరెండర్ చేయిస్తాను! ప్రమాదం ఏమీ వుండదు! నేను హామీ!" అన్నాడు.

"నాకు తెలీదయ్యా స్వామీ! మద్రాసులో గూడ లేడు! ఎక్కడున్నాడో తెలీదు" అని చెప్పాను.

ఆ తరువాత నెలరోజులకి గుంతకల్ ప్రాంతం నుంచి మా అన్నయ్య నాకు ఒక ఉత్తరం రాశాడు.

"నా ఆరోగ్యం బాగాలేదు! పోలీసులకి సరెండర్ అయితే ప్రమాదం ఏమీ లేదంటున్నారు! నన్ను తీసుకెళ్లి - సరెండర్ చేయించు" అని రాశాడు.

ఆ ఉత్తరం వచ్చినప్పుడు - మా అమ్మాయికి - వయసు ఏడాదిలోపే. కొద్దిగా - మశూచికం పోసింది. ఏంచేయాలి! మా అన్నయ్య దగ్గరికి ఎవరిని పంపాలి! నేను పోడానికి వీల్లేదు! గుంటూరుల్లో నాజర్ బుర్ర కథా దళంలో రామకోటి అని వుండేవాడు. అతన్ని పంపుదాం - అనుకున్నాను.

మరునాడు పొద్దున్నే మా అన్నయ్య బావమరిది పున్నంరాజు వచ్చాడు. ఆయనిది - మా అన్నయ్య అత్తగారి వూరు - నరసరావుపేట దగ్గర - సంక్రాంతిపాడు!

పున్నంరాజు వచ్చి చెప్పాడు "బావ మా ఊరు వచ్చేశాడు! ఊళ్లోకి వస్తే అందరికీ తెలిసిపోతుందని - ఊరి బయట వాముల దొడ్లో చావడిలో వుంచాను! సరెండర్ చేయడానికి ఏర్పాటు చేయమని నన్ను పంపించాడు" అన్నాడు.



అప్పుడు - గుంటూరులో - ఎస్.వి.ఎల్ నరసింహం అని ప్లీడరు ఒకతను ఉన్నాడు. కమ్యూనిస్టు సపోర్టుతో ఒకసారి యన్.జి. రంగాగారి మీద పోటీచేసి ఎమ్.పి. గా గెలిచాడు. అతను గాంధీగారి శిష్యుడు! కాంగ్రెసు! అతను పార్టీ ప్రమేయం లేకుండా రాజకీయవర్కర్ల కేసులన్నీ ఫ్రీగా చేసేవాడు.

అప్పుడు ఎస్.వి.ఎల్. పనేమిటంటే - ఇలా సరన్‌డర్ అయ్యేవాళ్లనందరినీ తీసుకెళ్లి సేఫ్‌గా మేజిస్ట్రేటు ముందు సరన్‌డర్ చేయించడం!

గుంటూరులో రోజూ కోర్టులో అడిగేవారట ఎస్.వి.ఎల్.ని "ఇవాళ ఎంతమందిని సరన్‌డర్ చేయిస్తున్నావ్" అని!

నేను గుంటూరు వెళ్లి ఎస్.వి.ఎల్‌తో విషయం చెప్పాను! "తీసుకురా! నాకు అప్పజెప్పు! నేను సేఫ్‌గా సరన్‌డర్ చేయిస్తాను" అన్నాడు. మా అన్నయ్య బావమరిదికి చెబితే అతను మా అన్నయ్యను గుంటూరుకు ట్రైన్‌లో తీసుకువచ్చాడు. స్టేషన్‌లో దిగితే పోలీసులు పట్టుకుంటూరేమో! అందుకని outer సిగ్నల్ దగ్గర బ్రాడీపేటలో ఇంజన్‌లో నీళ్లు నింపుకోడానికి ట్రైన్ ఆగుతుంది. అప్పుడు అక్కడ ట్రైన్ దిగి ఎస్.వి.ఎల్ ఇంటికి వస్తే నేను అక్కడే ఉన్నాను! ఆయన్ని ఎస్.వి.ఎల్‌కి అప్పజెప్పి నేను బెజవాడ వెళ్లిపోయాను!

ఎస్.వి.ఎల్ మరునాడు తీసుకెళ్లి సరన్‌డర్ చేయించాడు. కేసుపెట్టి జైలులో పెట్టారు! హెల్త్ కారణంగా గుంటూరు జనరల్ హాస్పిటల్‌లో చేర్పించాం!

అంతకు ముందే - నెల రెండు నెలల క్రితం మాపెత్తల్లి (మా తామ్మ) పోయింది. హాస్పిటల్లో మా అన్నయ్యని చూడ్డానికి వెళ్లి "తామ్మ" పోయిందని చెప్పాను! ఆమె అంటే - మా అన్నయ్యకి ఎంతో ప్రేమ గౌరవం! కళ్ల నీళ్లు పెట్టుకున్నాడు!

మధ్యలో కథ వుంది చెప్పవలసింది! ఆయన ఎప్పుడయితే అండర్‌గ్రౌండ్‌కి వెళ్లాడో - పోలీసులు మా ఊరు వెళ్లి - మా వదినని - పిల్లల్ని - దబాయించి కొట్టినంత పని చేయడం "మా అన్నయ్య ఫొటోలు ఎక్కడున్నాయ్?" అని వేధించడం!

నేను వెళ్లి మా వదినని పిల్లలను ఓదార్చి వద్దామంటే ఒక చిక్కువచ్చింది.

ఊళ్లో గ్రామస్థులు పాపం అనుభవంలేక అమాయికంగా "ఆయనకేం ఫరవాలేదు! బెజవాడలో ఆయనగారి తమ్ముడున్నాడు గదా! ఆ తమ్ముడికి బాగా పలుకుబడివుంది. ఆయన ఎక్కడికో పంపాడట రహస్యంగా!" ఇలా చెప్పుకుంటుంటే - ఆ సంగతి పోలీసులకు తెలిసింది!

సత్తెనపల్లి పోలీసు ఇన్‌స్పెక్టరు - నేను ఆ ఊరు వెళితే నన్ను అరెస్ట్ చేయడానికి సిద్ధంగా వున్నాడు! నా మీద 'నిఘా' ఉంచమని నా వివరాలు బెజవాడ పోలీసులకి పంపారు.

అప్పుడు లయోలా కాలేజీలో నా క్లాస్‌మేట్ ఒకతను పేరు ఎ.ఎస్. ఉడ్ (క్రిస్టియన్) సి.ఐ.డి సబ్‌ఇన్‌స్పెక్టరుగా సత్యనారాయణ పురంలో వుండేవాడు. అతని వైఫ్ మళయాళీ! మాట్లాడుకోడానికి ఎవరూ దొరక్క - మా ఇంటికి నా భార్యతో కబుర్లు చెప్పుకోడానికి వచ్చేది. ఉడ్ ఒకరోజు మా యింటికి వచ్చి "ఏమిటోయ్! నీపేరు వాన్‌టెడ్ లిస్ట్‌లో వుంది?" అన్నాడు నవ్వుతూ! నేను విషయం చెప్పాను! జాగ్రత్తగా ఉండు అని నన్ను హెచ్చరించాడు!

ఆ రోజుల్లో అంటే 1949 ప్రాంతం రాజకీయ వాతావరణం - అంతా tension!



మా ఊరు తాళ్లూరులో విచిత్రమైన పరిస్థితి! మా పెద్దన్నయ్య గురవరాజుగారు కమ్యూనిస్టు ఊళ్లో ఆయన ఎంత చెబితే అంత! ఆయన బావగారు - అంటే చెల్లెలి భర్త - వెంకటప్పలరాజుగారు. ఊళ్లో మోతుబారిరైతు! దాదాపు మూడు వందల ఎకరాల ఆసామి! ఆయనకు - మా అన్నయ్యకు పడదు! ఊళ్లోకి రెవిన్యూ ఆఫీసర్లుగాని, పోలీసు ఆఫీసర్లుగాని వస్తే ఆతిథ్యం బావగారిది.

అప్పట్లో కమ్యూనిస్టుల పాలిసీ చెప్పాను గదా! హత్యలు - దోపిడీలు! ఊళ్లో పెద్దరైతు మా బావగారు వెంకటప్పలరాజు గారు! ఆయనను చంపుతామని - ఆయన ఇంటి గోడకు కాగితం అంటించారు కమ్యూనిస్టులు! ఆయన భార్య అంటే మా అక్కయ్య - ఒకటే ఏడుపు! అన్న కమ్యూనిస్టు! భర్త పోలీసుల పక్షం!

నేను ప్రతి సంవత్సరం వేసవిలో ఆ ఊరు వెళ్లేవాణ్ణి నా భూముల కౌలు వసూలు చేసుకోడానికి!

మా బావగారు నాతో అన్నాడు "చూడవోయ్! మీ అన్న నన్ను చంపిస్తాడట! గోడలకు నోటీసులు అంటిస్తున్నాడు" అన్నాడు.

ఈ మాట నేను మా అన్నయ్యతో అంటే ఆయన "నేను అడ్డుపడకపోతే - ఈపాటికి అతన్ని చంపేసే ఉండే వాళ్లు! నేను వాళ్లను బ్రతిమాలాను! మా చెల్లెలి పసుపు కుంకుమ కాపాడండిరా - అని కాళ్లవేళ్లపడి బ్రతిమాలి. ఆ ప్రయత్నం మాన్పించాను. ఆ సంగతి అతనికి తెలియక నేనే చంపిస్తానని ప్రచారం చేస్తున్నాడు" అన్నాడు.

ఈ విషయం ఎందుకు చెబుతున్నానంటే - పల్లెటూళ్లలో అప్పుడు పరిస్థితులు అలా వున్నాయి!

కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శిగా రణదివే దిగిపోయిన తరువాత 1952 ఎలక్షన్లలో కమ్యూనిస్టులు పోటీచేసి కాంగ్రెసు పార్టీలోని బడా నాయకుల్ని మంత్రుల్ని ఓడించారు.

ఆ స్ఫూర్తితోనే నా మొదటి చిత్రం 'పెద్దమనుషులు'లో కొసరాజు పాట రాశాడు-

"ఒక్కసారి మంత్రి చెయ్ గణనాథా!

నువ్వు ఓడకుంటె ఒట్టుబెట్టు గణనాథా" అని!

బెజవాడ పార్లమెంటు సీటుకు - హరీంద్రనాథ్ చటోపాధ్యాయ కమ్యూనిస్టు అభ్యర్థిగా పోటీ చేసి గెలిచాడు.

## నాటకాలు - సినిమాలు

ఇప్పుడు చాలా ఇళ్లల్లో పెద్దవాళ్లు అంటుంటారే "పిల్లలు టి.విలు చూస్తే చెడిపోతారు! సినిమాలు చూస్తే చెడిపోతారని-

నా చిన్నతనంలో పిల్లలు నాటకాలు చూస్తే చెడిపోతారని మమ్మల్ని నాటకాలు చూడనిచ్చే వాళ్లు కాదు! నేను నాటకాలు, సినిమాలు తెగ చూసే వాణ్ణి!

ఇప్పుడు గూడ నేను చెబుతుంటాను - "చిన్నతనంలో నాటకాలు సినిమాలు తెగ చూసి చెడిపోయిన వాణ్ణి నేను! చూడండి! నేను ఎంత చెడిపోయానో" అని చెబుతుంటాను మీటింగుల్లో!

ఆరోజుల్లో నాటకాలు చూడవద్దని ఎందుకు అనేవారంటే నష్టం నాటకాల వల్ల కాదు! నాటకాలలో నటించే నటీనటుల నైతిక జీవితాల వల్ల!



ఇప్పటికీ నేను నా ధోరణిలో చెబుతుంటాను "ఈ నాటక కళామ తల్లికి మొదటి నుంచి సభా మర్యాదలేదు! ఈవిడని ఎవరూ పేరంటానికి - పిలిచేవాళ్లు కాదు. పెళ్లిళ్లలో మేజువాణీలకే గాని ముత్తయిదు మర్యాదలు లేవు ఈవిడకి" అని.

నాటకాల వాళ్లకి పిల్లనిచ్చే వాళ్లు కాదు. నాటకాలలో ఆడవేషాలు - వేశ్యావృత్తిలో ఉన్నవాళ్లు తప్ప - సంసార స్త్రీలు వేసేవాళ్లుకాదు. పైగా - నాటకాలలో వేషాలు వేసే నటులకు ఎక్కువ మందికి తాగుడు అలవాటు ఉండేది! నటీనటులకు మధ్య అక్రమ సంబంధాలు గూడ వుండేవి!

ఈ కారణాలన్నిటి వల్లనే పిల్లల్ని నాటకాల వాతావరణానికి దూరంగా ఉంచేవారనిపిస్తుంది!

నాకు నాటకాలు చూడడం ఎలా మొదలయిందంటే నా చిన్నతనంలో - నాలుగయిదేళ్ల వయసులోనే ముత్యాలంపాడులో పాటి మీద వీధి నాటకాలు వేసేవాళ్లు! ముత్యాలంపాడులోనే మాలపల్లిలో కొందరు మా పాలేళ్లతో సహా వీధి నాటకాలు నేర్చుకుని - ప్రదర్శించేవాళ్లు! మా తాతయ్యగారి ఆవులు కాచే కోటాయి అని ఉండేవాడు. వాడు హీరో వేషాలు వేసేవాడు. ఇంకొకడు బిక్షాలు అని సావిత్రమ్మగారి పాలేరు. వాడు హీరోయిన్ వేషాలు వేసేవాడు. పున్నాయి అని రైల్వేలో గ్యాంగ్‌మాన్‌గా పనిచేసేవాడు. వాడు విలన్ వేషాలు వేసేవాడు. రావణుడు - హిరణ్యకశిపుడు వగైరాలు! వాళ్లకి నాటకాలు నేర్పే గురువు - అయ్యన్న అని అతను మాలవాడు కాదు! అతను సాతాని! అతను నారదుడు వేషం వేసేవాడు.

"గోవిందుడేల రాడే! గోపాలుడేల రాడే!

నా మందపాలుతాగి - ఏమందకేగినాడో!" అని కృష్ణుని మీద పాట! నాటకానికి ఏ పదిరూపాయలో ఇచ్చేవాళ్లు. అది మొఖాసాగ్రామం. కొంత ఆదాయం ఉండేది. ఆ ఆదాయం నుంచి ఇచ్చేవాళ్లు! మరునాడు పొద్దున్నే ఊళ్లో ఇళ్ల వెంట వెళితే కొందరు చందాలు ఇచ్చేవాళ్లు!

బెజవాడ - ఏలూరు రోడ్డులో మాచవరం అని వుంది. ఆ ఊరి మాలవాళ్లు వీధి నాటకాలు వేసేవాళ్లు. విరాట పర్వం చాలా ఫేమస్!

ఇవి గాక తోలు బొమ్మలాటలు! మేము పిల్లలం - గోనె సంచులు - చాపలు తీసుకుపోయి - వాటి మీద కూర్చుని చూసేవాళ్లం! తెల్లవారిందాకా ఉండేవి నాటకాలు! నిద్రవస్తే నిద్రపోయి - "ఒరే! కేతిగాడు బంగారక్క వచ్చినప్పుడు లేపరా!" అని పక్కవాడికి చెప్పి నిద్రపోయేవాళ్లం!

అలా ప్రారంభం అయింది నాటకాల అనుభవం!

ఆ తరువాత ముత్యాలంపాడులోనే కుర్రవాళ్లు అంటే యువకులు - పద్యాలు - పాటలు పాడగలిగినవాళ్లు - సమాజంగా ఏర్పడి పురాణ నాటకాలు వేసేవాళ్లు! "రాధాకృష్ణ" "శ్రీకృష్ణతులాభారం" "కృష్ణలీలలు" బాగా పాడేవాడు గొడవర్తి సూర్యనారాయణరాజు - ఆడవేషాలు వేసేవాడు. 'రాధాకృష్ణ'లో రాధ! కళ్లేపల్లి జగ్గయ్య నారదుడు. వీళ్లకి పాటలు పద్యాలు నేర్పడానికి బెజవాడ నుంచి ఒక హార్మోనిస్టు వచ్చేవాడు. హార్మోనిస్టు నాటకానికి డైరెక్టరు. ఓగిరాల జానకిరామయ్యగారని - సత్యనారాయణపురంలో ఉండేవాడు. తరువాత ఆయన సూరిబాబు - రాజేశ్వరి వాళ్లకి హార్మోనిస్టుగా వుండేవాడు. ఆయన కొన్ని నాటకాలను తర్ఫీదు ఇచ్చేవాడు.



రిహార్సల్సు అంటే పాటలు పద్యాలే! సావిత్రమ్మగారి మేడ అని ఉండేది - ఇప్పటికీ ఉంది! మా మేనమామగారి మేడ పక్కన ఉండేది!

మేడ మీద ఖాళీగా ఉండేది! అక్కడ నాటకాల రిహార్సల్సు! అప్పటికీ - ఇప్పటికీ గూడ పురాణనాటకాలంటే పాటలు - పద్యాలేగాని డైలాగ్సు మీద శ్రద్ధ ఉండేది కాదు!

'రాధాకృష్ణ' నాటకం పానుగంటి లక్ష్మీనరసింహంగారు రాసిందేమో బాగా జ్ఞాపకం లేదు! అందులో ఒక పద్యం వుంది - కృష్ణుడు రాధతో అంటాడు.

"సఖియ! నినుజూచి ఆరు మాసంబులయ్యె!

కనులు - కాయలు గాచిన కరణినుండె!

రావాలని లేక - ఇనాళ్లు రాకయుంటి!

అలసించిన తపోర్చి - ఏలుకోనవె!"

నాకు అప్పటికీ ఇప్పటికీ నువ్వు వచ్చేది ఎందుకంటే-

'సఖియ - నిను చూచి 'ఆరుమాసం'బులయ్యె" అంటాడు. 'ఆరుమాసాలు'! ఏమిటి అని నాకు ధర్మసందేహం! చాలాకాలం అయిందని అన వచ్చుగా! ఆరుమాసాలేమిటి!

ముత్యాలంపాడులో మా మామయ్యగారి యింట్లో నౌకరు ఒకడుండేవాడు. కట్టె వీరాస్వామీ! అతని అల్లుడిది బెజవాడ! పేరు సూర్యనారాయణ! అతనికి నాటకాల అనుభవం వుంది! బాగా పాడేవాడు! అతను మా దృష్టిలో పెద్దహీరో!

'తులాభారం'లో అతను కృష్ణుడు! వెంటపతిరాజు సత్యభామ! 'కృష్ణలీల'ల్లో గొట్టుముక్కల సూర్యనారాయణ రాజు అని ఉండేవాడు! అతను కంసుడు! అతను - చాలాకాలం తరువాత మున్సిపల్ కౌన్సిలర్‌కు పోటీ చేసి ఓడిపోయాడు.

ఆడవేషాలు వేసేవాళ్లకి - ఊళ్లో పెద్ద కుటుంబాలలోని ఆడవాళ్లే - వాళ్ల పట్టు చీరలు ఇచ్చేవాళ్లు!

వెంకటపతిరాజు - సూర్యనారాయణరాజు - జగ్గయ్య - పాటలు పద్యాలు రాగాలు ఎక్కడ నేర్చుకున్నారో! అప్పుడు నాకు చిన్నతనంగదా! తెలియదు!

మా చిన్నమేనమామ గారు రంగరాజుగారు - ఓగిరాల జానకిరామయ్యగారి దగ్గర కొన్నాళ్లు హార్మోనియం నేర్చుకున్నాడు గాని ఆయన సంగీతం - "పరబ్రహ్మ! పరమేశ్వర!" ప్రార్థన గీతంతోనే ఆగిపోయింది.

నేను కాస్త పెద్దవాణ్ణయి - ఫస్టు - సెకండు ఫారాలు చదివేటప్పటికి బెజవాడలో కాశీనాధుని నాగేశ్వరరావుగారు- దుర్గాకళామందిరం నిర్మించారు. 1929-30 ప్రాంతం అనుకుంటాను. దాన్ని ఆరోజుల్లో 'నాగేశ్వరరావు గారి హాలు' అనేవాళ్లే గాని - దుర్గాకళామందిరం అనేవాళ్లు కాదు. ఆ హాలు చూడడానికి చుట్టుపక్క పల్లెల నుంచి బళ్లుకట్టుకుని వచ్చేవాళ్లు!

నాటకాల కోసం - పెద్ద స్టేజి! చాలా అందంగా ఉండేది హాలు! ముత్యాలంపాడు రాజులంటే నాగేశ్వరరావు పంతులు గారికి మంచి నమ్మకం! ఆయన సొంతకారు డ్రైవరుతో సహా కళామందిరం గేట్లులోను, అప్పుడు ఆయిల్



ఇంజన్ ఉండేది. కరెంట్‌కి జనరేటరు. అందులో గూడ! అందరూ ముత్యాలంపాడు రాజులే!

బెజవాడలో కాంగ్రెసు మహాసభలకి గాంధిగారు వస్తే ఆయనకి నాగేశ్వరరావుగారి కారు! డ్రైవరు పేరు ఉప్పలపాటి వెంకట్రామరాజు! గాంధిగారిచ్చిన సర్టిఫికెట్టు గూడ ఉండేది ఆయన దగ్గర!

దుర్గాకళామందిరం - నాగేశ్వరరావు గారు ముఖ్యంగా నాటకాల కోసం కట్టించారు. ప్రారంభోత్సవం మద్రాసు నుంచి కన్నయ్య అండ్ కంపెనీ అనే సమాజం వాళ్ళు దశవతారాలతో ప్రారంభించారు. అందులో యస్.జి. కిట్టప్ప - కె.బి. సుందరాంబాళ్ గొప్ప గాయకులు! నాటకంలో వైర్ వర్కులు! నారదుడు - పై నుంచి కిందికి రావడం! అంతా తమిళం! వాళ్లకు బస - నాగేశ్వరరావుగారి సొంతమేడ! కిట్టప్ప చెవులకి రవ్వల దుద్దులు పెట్టుకునేవాడు. మంచి ఛాయ! వరండాలో కూర్చుంటే మేమంతా వెళ్లి ఎగబడిచూసే వాళ్లం. అతను మా దృష్టిలో పెద్ద 'స్టార్' అన్నమాట!

నాగేశ్వరరావుగారి డ్రైవరు - వెంట్రామరాజు మా చిన్న మేనమామయ్య - చాలా మంచి స్నేహితులు. నాటకాలకి- ఆయన ఫ్రీగా పాసులు తెచ్చి మా చిన్న మామయ్యకిచ్చేవాడు. ఈయన పోయి - హాల్లో ఫస్టుక్లాసులో కూర్చుని చూసేవాడు. నేను మటుకు నాటకాలు చూడడానికి వీలులేదు. పిల్లలు చెడిపోతారని భయంగదా! నేను నాటకాలు చూడాలని ముచ్చట పడుతుంటే మా అమ్మ హాల్లో గేటులో ఉండేవాళ్లతో-

"ఒరే! ఒరే! మా అబ్బాయి నాటకం చూస్తానంటున్నాడురా! తీసుకెళ్లండిరా!" అనేది! వాళ్లు తీసుకెళ్లి హాల్లో ముందు కూర్చోబెడితే - మా మామయ్య చూస్తాడని నన్ను స్టేజి లోపలికి తీసుకెళ్లి కూర్చోబెట్టేవాళ్లు. నేను చాలా నాటకాలు స్టేజిలోపల నుంచి చూశాను!

నాకు 'వ్యంగ్య రచన' Satire అందుకే వచ్చిందనుకుంటాను! ఎందుకంటే శ్రీకృష్ణ పరమాత్మ వేషధారి స్టేజిమీద బ్రహ్మాండంగా పాడి లోపలికి వచ్చి బీడీలు కాలుస్తుండేవాడు!

అప్పటి మేటి నటీనటులు - రామతిలకం - శ్రీరంజని - యడవల్లి సూర్యనారాయణ - మాధవపెద్ది వెంకట్రామయ్య - అద్దంకి శ్రీ రామమూర్తి - డి.వి సుబ్బారావు వగైరాల నాటకాలు చాలా వరకు - స్టేజిలోపల కూర్చోనే చూశాను. ఆ నాటకాల పుస్తకాలు సంపాదించి వాటిలోని పద్యాలు కంఠస్థం చేసి పాడేవాణ్ణి! మా అమ్మ ఎంతో సంతోషించేది!

అప్పుడు - 'ఉద్యోగ విజయాలు' నాటకంలో ఇద్దరు కృష్ణులు ఉండేవాళ్లు! మొదట 'రాయబారం'లో బందా కనకలింగేశ్వరరావు అయితే 'విజయం'లో కృష్ణుడు బెల్లంకొండ సుబ్బారావు! ఆయన నరసరావుపేట లాయరు! ఆయన మీసాలు తీసేవాడు గాదు! ఆయన్ని మీసాల కృష్ణుడు అనేవాళ్లు!

మొదటి కృష్ణుడికి మీసం ఉండేది గాదు! రెండో కృష్ణుడికి మీసాలుండేవి! బెల్లంకొండ సుబ్బారావు గారు సంగీతం కంటె పద్యం భావయుక్తంగా పాడేవాడు. కృష్ణుడు ఒక రాజకీయ వేత్తగా!-

నా చిన్నతనంలో అంటే 1920లలో అంతకుముందు గూడ నేమో! ఆంధ్రదేశంలో మంచి నాటక సమాజాలు ఉండేవి!

బెజవాడలో మైలవరం కంపెనీ 'బాలభారతీ సమాజం' అనుకుంటాను. మైలవరం జమిందారుగారు పోషకుడు! ఆయనకు పిల్లలు లేరు. ఎస్టేటు మొత్తం నాటకాల పోషణకే పోయింది. బెజవాడలో పాతటవున్‌లో మైలవరం హాలు అని నాటకాల హాలు ఉండేది.





యడవల్లి సూర్యనారాయణ



అద్దంకి శ్రీ రామమూర్తి

ఏలూరులో - మోతేవారి సమాజం! రాజమండ్రిలో ఒక సమాజం! తెనాలిలో రామవిలాస సభ. నెల్లూరులో ఒక సమాజం!

తెనాలి రామవిలాస సభలో మాధవపెద్ది వెంకట్రామయ్య, స్థానం నరసింహారావు, త్రిపురారిభట్ల వీరరాఘవ స్వామి, గోవిందరాజుల సూర్యారావు, పెద్దిభొట్ల చలపతి వగైరాలు ఉండేవారు.

బెజవాడ, మైలవరం కంపెనీలో ఉప్పులూరు సంజీవరావుగారు 'సావిత్రి', యడపల్లి సూర్యనారాయణ 'సత్యవంతుడు', గురజనాయుడు 'యముడు' వేస్తే పిల్లలు భయపడేవారట! విజయనగరం నుంచి ముందుగా టికెట్లు రిజర్వు చేసుకునేవారట!

ఉప్పులూరి సంజీవరావు గారు ఆఖరి దశలో సత్యనారాయణపురంలో వుండేవాడు. నేను చూశాను! ఆయన గొంతు సన్నగా ఉండేది. బాగా పాడేవాడట!

ఆ రోజుల్లో నాటకాలకి ముందుగా టికెట్లు రిజర్వు చేసుకునే వారంటే - అటువంటి రోజులు మళ్లీ వస్తయ్యా? అనిపిస్తుంది.

నేను హైస్కూలుకు వచ్చేటప్పటికి - అంటే 1933 నాటికి పైన చెప్పిన నాటక సమాజాలు చాల వరకు మూతబడినయ్! నటుల్లో విభేదాల వల్ల కొన్ని సమాజాల పోషకులు దివాలా దీసికొన్ని సమాజాలు అంతరించినాయి. బెజవాడలో మైలవరం రాజా గారు చనిపోవడం వల్ల సమాజం చెల్లా చెదురైంది. తెనాలి రామవిలాస సభలో - స్థానం నరసింహారావు - మాధవపెద్ది వెంకట్రామయ్య ప్రభృతులి మధ్య విభేదాలు వచ్చి - సమాజం మూతపడింది. అంతకుముందు గుంటూరులో ఫస్టు కంపెనీ - సెకండు కంపెనీ అని వుండేవి. అందులో హరిప్రసాదరావు గారు హరిశ్చంద్రుడికి చాలా గొప్ప పేరు. రాజకీయనాయకుల్లో కొండా వెంకటప్పయ్య గారు టంగుటూరి ప్రకాశం పంతులుగారు. కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు గారు గూడ నాటకాల్లో వేషాలు వేసేవారట.





మాధవపెద్ది వెంకట్రామయ్య



బందా కనకలింగేశ్వరరావు

నాటక సమాజాలు విడిపోయిన తరువాత - అందులోని నటులు వేరు కుంపట్లు పెట్టుకున్నారు. స్థానం నరసింహారావు గారు సత్యభామ 'తులాభారం' నాటకం వేసినప్పుడు ముందు మాధవపెద్ది వెంకట్రామయ్యగారు కృష్ణుడు వేసేవాడట రామవిలాస సభలో! వాళ్లిద్దరికీ విభేదాలు వచ్చాక - స్థానం కొన్నాళ్లు సి.యస్.ఆర్ ఆంజనేయులు కృష్ణుడుగానూ ఆ తరువాత ఏలూరు బందా కనకలింగేశ్వరరావు కృష్ణుడుగానూ నాటకాలు ప్రదర్శించాడు.

త్రిపురారిభట్ల రామకృష్ణశాస్త్రి అని 'తులాభారం'లో నారదుడు వేసేవాడు. బ్రహ్మాండంగా పాడేవాడు. తరంగాలు పాడుతూ స్టేజి మీద నాట్యం చేసేవాడు. నేను చివరగా 'తులాభారం' చూసింది - మదరాసులో నేను లయోలా కాలేజీలో చదువుతున్నప్పుడు! అప్పుడు - తేనాంపేటలో 'సన్' థియేటరు అని వుండేది. దాని యజమాని సుందరరావు నాయుడు అని మదరాసు మేయరు చేశాడు. తెలుగు వాడు. ఆ సన్ థియేటరు ప్రారంభోత్సవానికి 'కృష్ణతులాభారం' నాటకం వేశారు! స్థానం - బందా - రామకృష్ణశాస్త్రి వగైరాలు.

ఈ దశలో ఆంధ్రలో కంట్రాక్టు నాటకాల యుగం ప్రారంభమైంది. ఎవడో ఒక కంట్రాక్టరు వేరు వేరు ఊళ్లలో ఉన్న నటీనటుల్ని కలిపి ఆడిస్తే తప్ప నాటకాలు ఆడలేని స్థితి వచ్చింది. కంట్రాక్టరు పుణ్యమా అని తెనాలి నుంచి ఒక నటుడు - గుంటూరు నుంచి ఒక నటుడు బెజవాడ నుంచి ఒకడు - ఏలూరి నుంచి ఒకడు వచ్చి నాటకాలు వేసేటప్పటికి నాటకాల నాణ్యత క్వాలిటీ పడిపోయింది. రిహార్సల్సు లేవు! క్రమశిక్షణ లేదు! నాటకం బాగుండాలంటే ఎలా వుంటుంది? నాటక సమాజాల విషయం వచ్చినప్పుడు చెప్పడం మరిచాను - దైతా గోపాలం గారి అధ్వర్యంలో 'సతీసక్కుబాయి' వేసే వాళ్లు. మల్లాది అచ్యుతరామ శాస్త్రి గారు రాసిన నాటకం - పాటలు సంగీతం - గోపాలంగారే నిర్వహించేవారు.

తుంగల చలపతిరావు సక్కుబాయిగా - జొన్నవిత్తుల శేషగిరిరావు (ఆంధ్ర గంధర్వ బిరుదాంకితుడు) కృష్ణుడుగా బ్రహ్మాండంగా పాడేవాళ్లు! దైతా గోపాలంగారు యోగివేషం వేసేవారు. ఆ నాటకంలో చెప్పుకోదగిన నటుడు సూరవరపు





పి. రాజేశ్వరి



దాసరి కోటిరత్నం

వెంకటేశ్వర్లు. సక్కుబాయి అత్త - విధవరాలు వేషం బ్రహ్మాండంగా వేసేవాడు.

దాసరి కోటిరత్నం సక్కుబాయిగా సినిమా తీస్తే అత్తవేషం సూరవరపు వెంకటేశ్వర్లు చేత వేయించారు. అతనికంత పేరన్నమాట ఆవేశంలో!-

అలాగే - బందరులో - డి.వి. సుబ్బారావు గారు ఇండియన్ డ్రమెటిక్ కంపెనీని చాలా క్రమశిక్షణతో నడిపాడు. ఆయన 'హరిశ్చంద్ర' చాలా ఫేమస్.

దైతా గోపాలంగారి 'సక్కుబాయి' గ్రూపు గూడ క్రమంగా విడిపోయింది.

నాటకాలు వేయాలంటే కంట్రాక్టర్లే దిక్కయ్యారు. బెజవాడలో పున్నయ్య అని ఒక కంట్రాక్టరు ఉండేవాడు! అతను హేమాహేమీల చేత నాటకాలు వేయించాడు. అతనికి అన్ని నాటకాల్లో అన్ని పాత్రలు కంఠోపాఠం! హరిశ్చంద్రలో లోహితుడితో పాటు దర్భలు తీసుకు రావడానికి నలుగురు కుర్రాళ్లు గూడ వెళతారుగా? కుర్రాళ్లు ఎవరూ దొరక్కపోతే ఒక కుర్రవాడి వేషం కూడ పున్నయ్య వేసేవాడు! ఆజానుబాహువు! నల్లగా ఉండేవాడు.

ఆ రోజుల్లో తిరుపతి వెంకట కవులు రాసిన 'పాండవోద్యోగ విజయాలు' చాలా పాప్యులర్! అందులో కృష్ణుడు బందా బెల్లంకొండ సుబ్బారావు వేసేవారు. దుర్యోధనుడు - మాధవపెద్ది వెంకట్రామయ్యగారు - బ్రహ్మాండంగా ఉండేది. ధర్మరాజు - అద్దంకి శ్రీరామమూర్తి, అర్జునుడు - పులిపాటి వెంకటేశ్వర్లు, తెనాలి వాస్తవ్యుడు.

ద్రౌపదీ వస్త్రాపహరణంలో - యడవల్లి సూర్యనారాయణ గారు దుర్యోధనుడుగా ప్రసిద్ధి.





బెల్లంకొండ సుబ్బారావు



డి.వి సుబ్బారావు

బళ్లారి రాఘవాచారి గారు - ఇంగ్లీషు నాటకాలు వేసి విదేశాలు తిరిగి వచ్చినవాడు! తరువాత రోజుల్లో సాంఘిక నాటకాలు వేసినా అంతకుముందు "చంద్రగుప్త"లో చాణిక్యుడు - ప్రహ్లాదలో హిరణ్యకశిపుడు, 'రామదాసు'లో రామదాసు వేషాలు వేసేవాడు. ఆయనగారి మేనమామ ధర్మవరం రామకృష్ణమాచార్యులు గారు - నాటక రచయిత నటుడు! ఒక విధంగా ఆంధ్రలో నాటకరంగానికి ఆద్యుడని చెబుతారు! 'ఆంధ్రనాటక పితామహ' బిరుదాంకితుడు.

రాఘవాచారి గారికి ఒక సిద్ధాంతం ఉండేది "నాటకాల్లో ఆడవేషాలు - ఆడవాళ్లే వేయాలి" అని! ఆయన స్ఫురద్రూపి! పెద్దకళ్లు మంచి ముఖవర్ఛస్సు! గొప్పనటుడు! కాని - ఆయన భాష - బళ్లారి - రాయలసీమ భాష ఏమో! చాలా 'స్లో'గా చెప్పేవాడు డైలాగులు!-

'ద్రౌపదీ వస్త్రాపహరణం' సినిమా యిద్దరు నిర్మాతలు తీశారు! "ద్రౌపదీ వస్త్రాపహరణం" ఒకటి "ద్రౌపదీ మానసంరక్షణం" రెండోది! 'వస్త్రాపహరణం'లో సి.యస్.ఆర్. ఆంజనేయులు కృష్ణుడు - యడవల్లి సూర్యనారాయణగారు దుర్యోధనుడు. 'మానసంరక్షణం'లో బందా కనకలింగేశ్వరరావు కృష్ణుడు. రాఘవాచారి గారు దుర్యోధనుడు! బాక్సాఫీసు వద్ద డబ్బు 'వస్త్రాపహరణాని'కి వచ్చింది! పేరు 'మాన సంరక్షణాని'కి వచ్చింది! వస్త్రాపహరణంలో - పెద్ద నటీనట వర్గం! కన్నాంబ - రామతిలకం - వేమూరి గగ్గయ్య - శిశుపాలుడు!

యడవల్లి సూర్యనారాయణగారు మామూలుగా బయట గూడ మీసం - తలపాగా చాలా ఠీవిగా ఉండేవాడు. ఆయనది బెజవాడే. గవర్నరుపేటలో చెట్ల బజారులో ఉండేది ఆయన ఇల్లు! ఆయనకు సంస్కృతంలో గూడ





జొన్నవిత్తుల శేషగిరిరావు



తుంగల చలపతి రావు

పరిచయం ఉండేది. 'శకుంతల' నాటకంలో - కాళిదాసు శ్లోకం చదివి - మళ్లీ దానికి తెలుగు అనువాదం పద్యం చదివేవాడు. నేను 1937లో గుంటూరులో ఇంటర్ చదివేటప్పుడు చూశాను 'శకుంతల నాటకం'! యడవల్లి - దుష్యంతుడు - స్థానం - శకుంతల - అద్దంకి శ్రీరామమూర్తి - కణ్వుడు - ఆ రోజుల్లో అది పెద్ద క్యాస్టింగ్!

స్థానం గూడ - గొప్పగా నటించేవాడు! నాకు ఇప్పటికీ జ్ఞాపకం! స్థానం విరహగీతం "ఏల వీతురమ్మ నాకు- చాలమైక మగును గాన..."-

మరో విషయం! అప్పుడు నేను చూసిన నాటకాలు బ్రహ్మాండంగా ఉండేవి అని చెప్పాగా! అప్పటికి - అవి బాగుండేవి! మరి - ఇప్పుడు ప్రమాణాల ప్రకారం అవి ఎలా ఉండేవో చెప్పడం కష్టం! ఉదాహరణకు 'దేవదాసు'! హిందీ సినిమా సైగల్ దేవదాసుగా నటించాడు. అది బ్రహ్మాండంగా ఉందని - అది మొదటి రిలీజు అయినప్పుడు చూచి అనుకున్నాను! తెలుగులో - అక్కినేనితో - దేవదాసు తీసేటప్పుడు నేను వాళ్లతో అనేవాణ్ణి- " అబ్బ! సైగల్ దేవదాసు ఎంతో - బ్రహ్మాండంగా ఉందని! తెలుగులో దేవదాసు తీస్తున్నప్పుడు మదరాసులో సైగల్ హిందీ దేవదాసు రిలీజు అయింది. పోయి - చూస్తే పరమ 'స్లో'గా వుంది. అప్పుడనిపించింది - ఈ సినిమా చూచి ఒకప్పుడు "బ్రహ్మాండంగా ఉందని ఎలా అనుకున్నామా?" అని-

అప్పటి - పురాణ నాటకాలు రాసిన రచయితలకు ప్రదర్శన అనుభవం ఉండేదేమో?

నా దగ్గర యిప్పటికీ ఆ పాత పురాణ నాటకాల పుస్తకాలున్నాయ్. తిరుపతి వెంకటకవుల - 'పాండవోద్యోగ విజయాలు'- పానుగంటి లక్ష్మీ నరసింహారావు గారి - 'రాధాకృష్ణ', 'పాదుకా పట్టాభిషేకం' - శ్రీరాముల సచ్చిదానందశాస్త్రిగారి 'సతీ సావిత్రి' - ముత్తరాజు సుబ్బారావు గారి 'శ్రీకృష్ణ తులాభారం' - ధర్మవరం రామకృష్ణమాచార్యులు గారి 'విషాద సారంగధర' - బలిజేపల్లి లక్ష్మీకాంతంగారి "సత్యహరిశ్చంద్రీయము" - చిలకమర్తి లక్ష్మీనరసింహాగారి 'గయోపాఖ్యానం' - బళ్లారి సుబ్రహ్మణ్య శాస్త్రులు గారి 'కృష్ణలీల' (సుబ్రహ్మణ్యశాస్త్రి గారు





కన్నాంబ



వేమూరు గగ్గయ్య

'లవకుశ' 'భక్తకుచేల' నాటకాలు గూడ రాశారు. అవి నా దగ్గరలేవు) అయ్యవారు వెంకట సరసయ్యగారి "స్వదేశ ప్రహ్లాద నాటకం". సంస్కృతం నుంచి అనువదించిన నాటకాలు - శూద్రకుని "మృచ్ఛకటికం' నాటకానికి తిరుపతి వెంకటకవుల తెలుగు అనువాదం! వీరిదే - 'ముద్రారాక్షసం'. భవభూతి 'ఉత్తర రామచరిత్ర'కు మల్లాది సూర్యనారాయణ శాస్త్రి గారి తెలుగు అనువాదం.

ఈ నాటకాలలో చాలా నాటకాలు - సంస్కృత నాటకాల మాదిరిగానే 'నాంది' 'ప్రస్తావన' 'సూత్రధారుడు' 'నటి' - తిరుపతి వెంకట కవుల పాండవోద్యోగ విజయాలతో సహా - రాయబడినవి!

ఆ రోజుల్లో - వీధినాటకాల వలె - తెల్లవారే వరకు ప్రదర్శించే వారేమో! పద్యాలు - పాటలు - స్వగతాలు- డైలాగులు - ఒకటి రెండు పేజీలు! అప్పటి రోజుల్లో ప్రేక్షకులు వాటికే అలవాటు పడి ఉంటారు.

నేను నాటకాలు చూడడం ప్రారంభించిన తరువాత - నాటక సమాజంవారు ఆ నాటకాలను - ఎడిట్ చేసి- కుదించి - ప్రదర్శించేవారు.

పద్యాలు - పాటలు చాలా తీసివేసి ప్రదర్శించేవారు. 'సావిత్రి' నాటకం తరువాత సినిమా తీశారు. అందులో- సత్యవంతుడు నిడుముక్కల సుబ్బారావు. బెజవాడ మునిసిపాలిటీలో శానిటరీ ఇన్‌స్పెక్టరను కుంటాను. రామతిలకం సావిత్రి. పాటలు - పద్యాలు కొన్ని నాటకంలోనివే సినిమాలో ఉపయోగించారు.

"తగునా యిది జనకా!

త్వాదృశులీ స్థితిని పలుక

తగునా యిది జనకా!" అని సావిత్రి పాట. తను సత్యవంతుణ్ణి చేసుకోడానికి - తండ్రి ఒప్పుకోక పోతే సావిత్రి పాడేపాట!





దైతా గోపాలం



బళ్లారి రాఘవాచారి

సత్యవంతుడు చనిపోతే - సావిత్రి - భర్త శవం దగ్గర కూర్చుని శోకిస్తుంటుంది? యముడు ప్రత్యక్షమవుతాడు!

"ఎవరు నీవు?" అని సావిత్రి అడిగితే- యముడంటాడు "యమలోకమున కధిపతిని! యముండ!" అంటాడు. యముడు - వేమూరి గగ్గయ్య! "యముండ" అని మేము ఆ రోజుల్లో నవ్వుకునే వాళ్లం! అదే 'యముండ' నేను 'యమగోల' సినిమాలో ఉపయోగించుకున్నాను.

నాకు చాలాచిన్నతనంలో కపిలవాయి రామనాథ శాస్త్రి పేరు మారుమోగుతుండేది. అతని నాటకాలు నేను చూడలేదు గాని అతడు పాడిన పాటలు, పద్యాలు గ్రామఫోన్ రికార్డులు - ప్రతి పెళ్లి పందిరిలోనూ గుంపులు గుంపులుగా కూర్చుని వినేవాళ్లం! అతని కంఠం - ఏమి కంఠం! నాటకాలలో తనువేసిన పాత్రల పాటలు - పద్యాలేగాక - ఎన్నో నాటకాలలోని పాత్రల పాటలు - పద్యాలు గ్రామఫోన్ రికార్డులు యిచ్చాడు.

చిత్రకూటంలో రాముడి దగ్గరకు వచ్చి భరతుడు - రాముణ్ణి - అయోధ్యకు వచ్చి రాజ్యం ఏలుకోమని అడగితే రాముడంటాడు 'పాదుకా పట్టాభిషేకం'లో పద్యం "స్థిరమైన నడవడి జనులకందరకు వలయు! నేను రాజ్య చాపల్యము నను తండ్రిమాటను నిరసింప లోకులు పరిహసింపరే! రాముడు వంటి కొడుకు - భరతసౌమిత్రుల వంటి తమ్ములును - సీతవంటి భార్య - వసుధయందు లేరు, లేరనుచు ముందు యుగంబున పురుషులు తలలూప వలదె? ఈ రీతి వారు నడచుకొన వలదె?" ఈ పద్యాలు నాకు ఇప్పటికీ జ్ఞాపకం! ఇవే గాదు - పాండవోద్యోగ విజయాలు - హరిశ్చంద్ర - తులభారం - నాటకాల పద్యాలు ఇప్పటికీ జ్ఞాపకం!

యడవల్లి సూర్యనారాయణగారికి సంస్కృతంలో ప్రవేశం ఉందన్నానే - ఆయన 'రత్నావళి' సంస్కృత నాటకానికి తెలుగు అనువాదం ప్రదర్శించేవాడు. అందులో - ఆయన 'వత్సరాజు'!

ఈలపాట రఘురామయ్య అని తరువాత సినిమాలలో హీరో వేషాలు వేశాడు. ఆ రఘురామయ్యని పైకి తెచ్చినవాడు - యడవల్లి సూర్యనారాయణ గారు. రఘురామయ్య అసలు పేరు - వెంకట సుబ్బయ్యో - ఏదో





కపిలవాయి రామనాథ శాస్త్రి



ఈలపాట రఘు రామయ్య

ఉండేది. అతను బాలనటుడుగా - రామదాసు నాటకంలో రామదాసు కొడుకు 'రఘురాముడు' వేషం వేస్తే ఆ పేరే అతనికి స్థిరమై పోయింది.

'రత్నావళి' నాటకంలో - రఘురామయ్య 'రత్నావళి' ఆడవేషం వేసేవాడు. 'వాసవదత్త' పారుపల్లి సత్యనారాయణ! అదీ ఆడవేషమే! అందరూ - బాగా పాడేవాళ్లు! పాడటం రాని వాడు - ఆరోజుల్లో నాటకంలో వేషానికి అనర్హుడు!

'రత్నావళి' కథకు సంబంధించినవి - సంస్కృతంలో మూడు నాటకాలున్నాయ్!

ఒకటి 'రత్నావళి' రెండు - 'స్వప్నవాసవదత్త'. మూడు 'ప్రతిజ్ఞా యౌగంధరాయణం'. రత్నావళి - ఇంటర్మీడియట్‌లో మాకు తెలుగు డ్రామా! బెజవాడ దుర్గా కళామందిరంలో - నేను 'రత్నావళి' నాటకం చూశాను!

కంట్రాక్టు నాటకాల యుగం ప్రారంభం అయిన తరువాత కొన్ని 'రసాభాస' నాటకాలు గూడ ఉండేవి!

ఉదాహరణకి! 'వేణీ సంహారం' నాటకం! కంట్రాక్టరు పున్నయ్య అని ఉండేవాడిని చెప్పానే అతను 'వేణీ సంహారం' నాటకం ప్రకటించి వాల్‌పోస్టర్లు వేశాడు - బెజవాడలో దుర్గా కళా మందిరంలో నాటకం! ఆ నాటకంలో అందరూ - హేమాహేమీలు! పెద్ద casting! పెద్ద పెద్ద పోస్టర్లు వేశాడు. నటీనటుల బిరుదులతో సహా!

ఆ రోజుల్లో నటులకి బిరుదులుండేవి! స్థానం నరసింహారావుకి 'నటకావతంస' బిరుదు. కపిలవాయి రామనాథశాస్త్రి 'రంగమార్తాండ'.

'వేణీ సంహారం'లో యడవల్లి సూర్యనారాయణ - మాధవపెద్ది వెంకట్రామయ్య - అద్దంకి శ్రీరామమూర్తి - మిగతావాళ్లు గూడ ప్రసిద్ధులైన నటులు!

నేను - నా అలవాటు ప్రకారం -స్టేజిలోపల కూర్చుని నాటకం చూస్తున్నాను. మొదటి సీను - దుర్యోధనుడిది- అయిపోయింది! ధర్మరాజు - అద్దంకి శ్రీరామమూర్తిగారు! ఆయన రాలేదు! ఆయన ఇల్లు దుర్గా కళామందిరానికి



50-60 గజాల దూరంలో ఉండేది. ఆయన సొంత యిల్లే!

అప్పుడు - అంతపెద్ద నటీనటుల నాటకాలకు ప్రేక్షకుల ఆరాటం ఎలా ఉండేదంటే - కరపత్రాలలో వేసేవాళ్లు "హాలు నిండిన వెనుక ప్రక్కన గట్లపై కూర్చుండవలెను" అని! House full అయి కొందరు ప్రక్కన నిలబడి చూసేవాళ్లు!

హాలునిండి - టికెట్లు అమ్మకపోతే బయట నుంచి జనం హాలు మీద రాళ్లు వేసేవాళ్లు! హాలు పై కప్పు - రేకులేగా! 'ధనా' 'ధనా' మని వినబడుతుండేవి!

యడవల్లి సూర్యనారాయణ గారు పున్నయ్యని అడిగాడు "శ్రీరామమూర్తి ఇంకా రాలేదేం?" అని.

"దగ్గరే గదండయ్యా! ఒకేసారి మేకప్ - డ్రెస్ వేసుకుని వస్తానన్నారండి! ఆయన వచ్చేది మూడో సీనులో గదండి!" అన్నాడు పున్నయ్య! అసలు రహస్యమేమిటంటే - పున్నయ్య - శ్రీరామమూర్తి గారికి అంతకుముందు రెండు నాటకాలకు బకాయి పెట్టాడు!! ఆ డబ్బు యిస్తే గాని - రాను పొమ్మన్నాడు" శ్రీరామమూర్తి గారు!

పున్నయ్య 'తరువాత ఇస్తానని' బ్రతిమలాడాడు! ఆయన వినలే! రాను పొమ్మన్నాడు.

నాటకంలో - రెండో సీను గూడ అయిపోయింది. శ్రీరామమూర్తి గారు రాలేదు! సూర్యనారాయణ గారు పసిగట్టారు! 'పున్నయ్య' ఏడీ? అంటే పున్నయ్య లేడు! గల్లా పెట్టి తీసుకుని మాయమై పోయాడు.

అది కంట్రాక్టర్లకు మామూలు! ఒక పక్క నాటకం జరుగుతుండగానే, కంట్రాక్టరు డబ్బుతో మాయమైపోయాడు.

మూడో సీనుకు తెర ఎత్తాలి! ధర్మరాజు రాలేదు! 'రసాభాస' అయ్యేట్టుందని - సూర్యనారాయణగారు గ్రహించాడు! ఆయన దగ్గర అసిస్టెంట్లుగా కుర్రాళ్లుండేవాళ్లు! "ఒరేయ్! వెళ్లి జట్కా తీసుకురారా!" అని కుర్రాణ్ణి పంపాడు. కళామందిరం దక్షిణం వైపు ఆడవాళ్ల గేటు వుండేది! అక్కడికి వచ్చింది జట్కా! సూర్యనారాయణ గారు కిరీటం మాత్రం తీసేసి మిగతా విగ్గు - డ్రెస్సుతోనే - తలమీద టవల్ ముసుగు వేసుకుని - ఆడవాళ్ల గేటు వైపు పోతుండగా - ప్రేక్షకుల్లో ఎవడో చూశాడు.

"ఒరేయ్! యడవల్లోడు పోతున్నాడురోయ్" అని అరిచాడు! జనం మూగారు! ఆయన పెద్ద అబద్ధం ఆడాడు!

"నాయనా! మా అబ్బాయికి నూటనాలుగు జ్వరం! ఇంటి దగ్గర ఆడవాళ్లు కంగారు పడి - కబురు చేశారు! వెళ్లి వాళ్లను ఓదార్చి ధైర్యం చెప్పి వెంటనే జట్కాలో వచ్చేస్తాను. మళ్లీ రెండు సీన్ల తరువాత గాని రాదు నా వేషం! అందుకే - విగ్గు - డ్రెస్ తీసెయ్యకుండా వెళుతున్నాను" అని - వాళ్లని నమ్మించి - వెళ్లిపోయాడు!- ధర్మరాజు రాలేదు! ఎంతసేపటికి తెరలేవదు! కంట్రాక్టరు పరారయ్యాడు! ప్రేక్షకులు తెలుసుకున్నారు! 'అద్దంకోడు' రాలేదంట్రా! అని కేకలు! సినిమాల్లో 'రేలంగోడు' అన్నట్టే అప్పుడు నటుల్ని గూడ 'యడవల్లోడు' 'అద్దంకోడు' అనే అనేవాళ్లు!

ప్రేక్షకులు మొత్తం లేచి - స్టేజి మీదకి వెళ్లి తెరలన్నీ చించి గందరగోళం చేశారు! మాధవపెద్ది వెంకట్రామయ్య గారు - పాపం ఒక మూల కూర్చుని ఉన్నాడు - బిక్కు బిక్కు మంటూ! నేను చూస్తున్నాను. జనం ఆయన మీదకి వెళ్లేసరికి ఆయన (వెంకట్రామయ్య గారు తరువాత నాటక కళా పరిషత్తు ద్వారా - నాకు మంచి స్నేహితుడైనాడు) మాటల్లో ఒక ఊత పదం వుండేది!



"అయ్యా! 'యధార్థం' మనవి చేస్తున్నాను. ఇదుగో టెలిగ్రాం చూడండి. నాటకం వుందని నాకు తెలీనే తెలియదు! నన్ను అడగకుండా - పున్నయ్య నా పేరు పోస్టర్ల మీద వేసి - ఇవాళ సాయంత్రం నాలుగు గంటలకి ఈ టెలిగ్రాం యిచ్చాడు! "వేణీ సంహారం! బెజవాడ! స్టార్ట్ ఇమ్మీడియట్లీ!" అని. రాకపోతే - డబ్బు తీసుకుని గూడ రాలేదని - ప్రచారం చేస్తాడు. అందుకని సొంత డబ్బుతో టికెట్టు కొనుక్కుని రైలులో తెనాలి నుంచి వచ్చాను. యధార్థం మనవి చేస్తున్నాను! తరువాత మీ యిష్టం!" అన్నాడు.

వాళ్లు - ఆయన్ని వదిలేసి సినిమా స్క్రీన్‌తో సహా చించేశారు! హాలులో కుర్చీలు గూడ - ఒక్కొక్కడు ఒక్కొక్క కుర్చీ తీసుకుని పోవడానికి సిద్ధపడితే హాలువాళ్లు అడ్డం వెళ్లారు.

"మా టికెట్టు డబ్బు లివ్వండి! లేదా కుర్చీ తీసుకుపోతాం" అని కేకలు వేశారు కొన్ని కుర్చీలు విరగ్గొట్టి - నానా భీభత్సం చేశారు!

కళామందిరం యజమాని - కాశీనాధుని నాగేశ్వరరావుగారి అల్లుడు - శివలెంక శంభుప్రసాద్ గారు. ఆయన తరువాత ఆంధ్రపత్రిక ఎడిటర్ అయ్యాడు.

ఆయన "ఇక నాటకాలకు థియేటరు ఇవ్వగూడదు" అని నిర్ణయించుకున్నాడు.

సినిమాలకి ఆఖరి క్లాసు బెంచి క్లాసు! తెర ముందు ఉంటుంది! ఆ క్లాసు - నాటకాలకి - ఫస్టుక్లాసు అవుతుంది. కుర్చీలు వేస్తారు.

అందుకని - ఆయన ఏం చేశాడంటే సినిమాలకి బెంచిక్లాసులో వుండే - బెంచీలను తీయడానికి వీలులేకుండా నేలకి నట్లు వేసి బిగించేశాడు.

తరువాత చాలా రోజులు నాటకాలకి హాలు ఇవ్వలేదు!

అంతకుముందు కళామందిరంలో ఒకసారి 'చింతామణి' నాటకం చూశా. రామతిలకం, చింతామణి - సీనియర్ శ్రీరంజని - రాధ - జొన్నవిత్తుల శేషగిరిరావు - బిల్వమంగళుడు - సి.యస్.ఆర్ ఆంజనేయులు భవానీ శంకరుడు. సి.యస్.ఆర్ ఆరోజుల్లో చాలా అందంగా వుండేవాడు. బ్లేజర్‌కోటు వేసుకుని సైకిల్ మీద స్టేజి మీదకి వచ్చి దిగేవాడు. బాగా పాడేవాడు. జొన్నవిత్తుల శేషగిరిరావుకి 'ఆంధ్రగంధర్వ' అని బిరుదు. 'బాలగంధర్వ' అని మరాటీ నటుడుండేవాడు. అతని లాగా బాగా ఆలాపన చేస్తూ బ్రహ్మాండంగా పాడేవాడు జొన్నవిత్తుల!

జొన్నవిత్తులకీ సి.యస్.ఆర్‌కి పోటీ అన్నమాట! ప్రేక్షకుల నుంచి 'వన్స్‌మోర్'లు ఎన్నిసార్లు వస్తే - ఆ నటుడికి అంత గొప్పన్నమాట!

ఒక సీనులో జొన్నవిత్తుల పద్యాలకి 'వన్స్‌మోర్' వస్తే ఆ తరువాత సీనులో సి.యస్.ఆర్ పోటీగా అంతకంటె బ్రహ్మాండంగా పాడి 'వన్స్‌మోర్'లు గెల్చుకునేవాడు. జొన్నవిత్తుల శేషగిరిరావు - బిల్వమంగళుడుగా సంస్కృత శ్లోకాలు పాడేవాడు "బాలాయనీలవముషే నవకింకిణీక జాలభిరామ జగదాయ దిగంబరాయ" నాకు శ్లోకం బాగారాదు!

ఇదే 'చింతామణి' నాటకం - మరోసారి చూశాను - కళామందిరంలోనే! అప్పుడు స్థానం నరసింహారావు చింతామణి పులిపాటి వెంకటేశ్వర్లు - భవానీ శంకరుడు - బెల్లంకొండ సుబ్బారావు బిల్వమంగళుడు! ఆయన నరసరావుపేటలో ప్లీడరు! పాండవ విజయంలో కృష్ణుడు వేశేవాడు. మరి - చింతామణిలో బిల్వమంగళుడు వేయడానికి కారణం - డబ్బే అయివుండాలి! ఆ రోజుల్లో కంట్రాక్టు నాటకాలలో కంట్రాక్టరు దయ, నటీనటుల ప్రాప్తం!





రామతిలకం



సి.యస్.ఆర్. ఆంజనేయులు

'చింతామణి' నాటకం చాలా మంచి నాటకం! కాళ్లకూరి నారాయణరావు గారు 1920లలోనో అంతకు ముందు మూడు మంచి నాటకాలు రాశాడు. సంఘ సమస్యలు - వాటి పరిష్కారాలు - సంస్కరణలు దృష్టిలో పెట్టుకుని రాశాడు. చింతామణి - వరవిక్రయం - మధుసేవ! చింతామణి వేశ్యావృత్తిని గురించి! వరవిక్రయం - కట్నాల గురించి. మధుసేవ - మద్యపానం గురించి.

వాటిలో చింతామణి బాగా పాప్యులర్! చాలా మంది సుబ్బిసెట్టి వేషాన్ని చాలా చౌక బారుగా - అసభ్యమైన హాస్యంతో ప్రేక్షకుల్ని మెప్పించడం కోసం - బూతులతో సహా ప్రదర్శించేవారు. ఆ వేషాన్ని రచయిత రాసినట్టు నటించి మెప్పించినవాడు నేను చూసినంతలో కాకినాడ - జోగినాధంగారు!

ఇంతకీ చెప్పవచ్చిందేమిటంటే బెల్లంకొండ పులిపాటి శ్రీరంజని - రామతిలకం - వేసిన నాటకం - ఎంత రసాభాస అయిందో చెబుతాను. ఈ కంట్రాక్టర్లు - ప్రధాన పాత్రలకే పేరున్న నటీనటుల్ని ఎంపిక చేసే వాళ్లుగాని చిన్న చిన్న వేషాలకి - ప్రత్యేకించి - ముందుగానే నటుల్ని ఎంపిక చేసేవారు కాదు!

చింతామణి నాటకంలో - బిల్వమంగళుడి తండ్రి పేరు వాసుదేవ మూర్తి అనుకుంటాను. అతనిది చిన్న వేషం. ఒకటి రెండు సీన్ల కంటె ఉండదు! డైలాగులు కూడ చాలా తక్కువ! అందుకని కంట్రాక్టరు తాలూకు ఎవరి చేతనైనా వేయించేవాళ్లు!

చింతామణి నాటకంలో బిల్వమంగళుడి తండ్రికి చాలా జబ్బు చేస్తుంది. అప్పుడు బిల్వమంగళుడు - చింతామణి ఇంట్లో వుంటాడు. అతని భార్య - రాధ - అతనికి కబురు చేస్తుంది. "మీ నాన్నగారికి చాలా జబ్బుగా వుంది! నాకు భయంగా వుంది! త్వరగా రండి!" అని!

బిల్వమంగళుడు వస్తాడు. అతని తండ్రి వేషానికి - ఎవరూ లేక నాలాగ సైడ్ వింగ్‌లో కూర్చున్నవాణ్ణి ఎవర్నో - తీసుకెళ్లి స్టేజి మీద మంచం మీద పండుకోబెట్టి దుప్పటి కప్పారు! తెర లేచింది.





పులిపాటి వెంకటేశ్వర్లు



గండికోట జోగినాధం

బిళ్వమంగళుడు హడావుడిగా ప్రవేశిస్తాడు. "ఏమిటి? ఎందుకు హడావుడిగా కబురు చేశావు?" అని అడిగితే భార్య రాధ నాకు భయంగా ఉండి - కబురు చేశానంటుంది. అప్పుడు తండ్రి కొడుక్కి నీతిబోధలు చెయ్యాలి! 'కట్టుకున్న భార్యకు అన్యాయం చేస్తే - దేవుడు క్షమించదురా - అని నాలుగు ముక్కలు చెప్పి చచ్చిపోవాలి! అదీ సీను! తండ్రి వేషం వేసినవాడికి డైలాగులు రావు!

"ఏం? నాన్నగారు! ఎలావుంది?" అని కొడుకు అడిగితే తండ్రి మాట్లాడడు! వాడికి డైలాగులు రావు గదా! ఏం చేయాలి? రెండు నిముషాలు చూచి - రాధ వేషధారి శ్రీరంజని - లేచి లోనికి వెళ్లిపోయింది!

"నాన్నగారూ! నాన్నగారూ" అంటే వాడు మాట్లాడడు. నేను సైడ్ వింగులో కూర్చుని వింటున్నాను. ప్రేక్షకులు అల్లరి మొదలు పెట్టారు. బిళ్వమంగళుడు మెల్లగా "చచ్చిపోరా! చచ్చిపోరా" అని తండ్రి వేషధారికి హస్కీవాయిస్‌తో చెప్పాడు.

చచ్చిపొమ్మంటే - ఎలా చావాలో వాడికి తెలిస్తేగా! వాడు మాట్లాడకుండా అలాగేపండుకున్నాడు.

నాటకంలో అప్పుడు బయట వర్షం - పిడుగు పడుతుంది! ఆ శబ్దం విని బిళ్వమంగళుడు "ఆ! పిడుగుపడింది! పిడుగంటే చింతామణికి చాలా భయం!" అని వెళ్లిపోవాలి!

అలాగే - బిళ్వమంగళుడు ఆ డైలాగ్ చెప్పి పక్కకి వెళ్లిపోయాడు తెరపడాలి! పడలేదు! ఈలోగా - తండ్రి వేషధారి చచ్చినవాడు దిగ్గునలేచి పక్కకు పరుగెత్తాడు! ప్రేక్షకులు ఒకటే కేకలు! ఈలలు! గోల! ఇలా రసాభాస అయిన కంట్రాక్టు నాటకాలు - ఆ రోజుల్లో సర్వసాధారణం! స్థానం నరసింహారావు గారు - చింతామణి పాత్ర చాలా బాగా పోషించేవాడు.

పైన చెప్పానే సీను - బిళ్వమంగళుడు తండ్రి చావు బతుకుల్లో ఉన్నా విడిచిపెట్టి స్త్రీ వ్యామోహంతో చింతామణి ఇంటికి వస్తాడు! వర్షం! బట్టలు తడిసివుంటయ్, చొక్కామీద రక్తపు మరకలు ఉంటాయి! అసలేం



జరిగిందంటే బిల్వమంగళుడు వచ్చేసరికి - చింతామణి యింటి తలుపు వేసి వుంటుంది. పిలిస్తే ఎవరూ పలకరు! అప్పుడు గోడ పక్కన పొగడ చెట్టును అల్లుకున్న లత పట్టుకుని పైకి పాకి మేడమీదకి వెళతాడు. ఆ లతతో పాటు పాము ఉంటుంది. అది చూడకుండా పామును లతనూ ఏకం చేసి పైకి పాకాడన్నమాట! అదీ - పాము రక్తం!

అది చూచి చింతామణిలో పరివర్తన వస్తుంది. తనవల్ల ఎందరు యిలా భ్రష్టుపట్టిపోతున్నారోనని విరక్తి పుడుతుంది. కృష్ణుడు కలలో కనబడినట్టు - కలగంటుంది! వైరాగ్యంతో భక్తురాలుగా మారుతుంది.

తన వ్యామోహంలో పడిన బిల్వమంగళుడు - భవానీ శంకరుడు - సుబ్బిసెట్టి - గార్లకు నీతిబోధ చేస్తుంది. "తాత్కాలికము - అశాశ్వతము అయిన" తన దేహ సౌందర్యం చూచి భ్రమించారు! యీ శరీరం కేవలం మాంసం ముద్ద! ఇలాగు వాళ్లకు జ్ఞానబోధ చేస్తుంది.

చింతామణిగా స్థానం నరసింహారావు గారు చాలా బాగా చేసేవాడు!

కులవృత్తి అయినా - ఇష్టంలేక - తల్లి బలవంతం వల్ల వేశ్యగా కొందరి కొంపలు కూల్చినందుకు బాధపడుతుంది.

వేశ్యలకు గూడ - కొందరికి - నీతి ఉంటుంది! "చెడని వాళ్లను చెడగొట్టని నీతి" కన్యాశుల్కంలో మధురవాణిది! అదొక రకం నీతి!

నేను చూసిన మంచి నాటకాలలో 'సతీసక్కుబాయి' ఒకటి. చెప్పానే దైతా గోపాలంగారు ప్రదర్శించేవారని! క్రమశిక్షణతో ప్రదర్శించిన నాటకం అది. అందులో తుంగల చలపతిరావు - సక్కుబాయి. జొన్నవిత్తుల శేషగిరిరావు కృష్ణుడు! అతని తమ్ముడు జొన్నవిత్తుల సత్యనారాయణ - సక్కుబాయి భర్త! మరో గొప్ప నటుడు సూరవరపు వెంకటేశ్వర్లు! సక్కుబాయి అత్త! విధవరాలు! బ్రాహ్మణబాషలో బ్రహ్మాండంగా చేసేవాడు. సినిమాలు గూడ అతనే ఆవేషం వేశాడు. దైతా గోపాలంగారు యోగి వేషం! "రామజోగి మందు కొనరే! కామక్రోధ లోభమోహ -ఘనమైన రోగాలకి మందు" రామదాసు కీర్తన! గోపాలం గారు పాడేవారు! బెజవాడ పాత టౌనులో మైలవరం హాలులో సక్కుబాయి నాటకం! హాలు నిండా కిటకిటలాడుతూ జనం! నేల క్లాసు హాలులో చివర ఉండేది! జనం తోసుకుంటూ ఒకటే గోల! జనం గోలలో చివరి క్లాసుకు ఏమీ వినపడేది గాదు.

సక్కుబాయి స్టేజిమీద - తిరగలితో పిండి విసురుతూ పాట! తుంగల చలపతిరావు - సక్కుబాయి! గొప్పగాయకుడు! ఆలాపనతో ప్రారంభం! జనం గోల సమసిపోయే వరకు - ఆలాపనే! ఎంత మంచి కంఠమో!

"పాండవోద్యోగ విజయాలు" నాటకంలో మొట్టమొదట "అర్జునుడు" ప్రవేశం!

"అదిగో ద్వారక! ఆలమందలివిగో! అందందు గోరాడు...." పద్యం ప్రారంభించి ఉచ్చస్వరంతో పాడుతుంటే క్రమంగా జనంగోల సద్దుమణిగేది. ప్రేక్షకులే వాళ్లలో వాళ్లే ఒకర్ని ఒకరు 'సైలెన్స్' అని మందలించుకునే వాళ్లు!

'వన్స్‌మోర్'లు! జనం పాడమంటే మళ్లీ పాడాలి పద్యం! నాటకంలో పద్యం 'వన్స్‌మోర్' అంటే మళ్లీ పాడడం ఒక పద్ధతి!

బందా కనకలింగేశ్వరరావు కృష్ణుడు వేషం వేసేవాడు! నాటకం అయిపోయిన తరువాత జనం కేకలు!

"బందా! 'గుత్తివంకాయ' పాటపాడాలి! ఒకటే గోల" ఆయన తెర ముందుకు వచ్చి కృష్ణుడి వేషంతోటే పాడేవాడు. బసవరాజు అప్పారావు గారు రాసింది.



"గుత్తివంకాయ కూరోయ్ బావా!

కోరి వండినా నోయ్ బావా"

నాటకానికి ఏమీ సంబంధం లేదు! అయినా పాడమంటే పాడాలిసిందే!

ఔచిత్యమా? కాదా? అనే ప్రశ్నలేదు!!-

నేను రసాభాస అయిన నాటకాలు చూశాను! మంచి నాటకాలూ చూశాను!

ఆ రోజుల్లో పెద్దపెద్ద నటుల మధ్యనే అసూయ - ద్వేషాలు వుండేవి. ఒకడికి పేరు వస్తే ఇంకొకడు సహించేవాడు గాదు. ఈ ఓర్వలేని తనం - అసూయల వల్లనే చాలా సమాజాలు విడిపోయినై. గొప్ప నటుల మధ్యనే - అసూయలు ఎలా ఉండేవో ఒక బ్రహ్మాండమైన ఉదాహరణ చెబుతాను!

ఏలూరులో 'సారంగధర' నాటకం! స్థానం నరసింహారావు చిత్రాంగి! యడవల్లి సూర్యనారాయణ - రాజరాజనరేంద్రుడు!

నాటకంలో చివరి సీనులో - స్థానం నరసింహారావుకు గొప్ప పేరు తెచ్చే - పెద్ద స్పీచ్ ఉండేది!" చిత్రాంగి చిత్తావేదన" అని స్థానం - గ్రామఫోన్ రికార్డు గూడ ఇచ్చాడు! అది చాలా ఫేమస్!

నాటకంలో చివర - సారంగధరుడి కాళ్లు నరికేసిన తరువాత రాజరాజ నరేంద్రుడికి నిజం తెలుస్తుంది. నేరం సారంగధరుడిది కాదు! కుట్రపన్ని అతని మీద నేరం మోపినది చిత్రాంగి అని తెలిసి రాజరాజ నరేంద్రుడు పట్టరాని కోపంతో చిత్రాంగి మందిరానికి వస్తాడు. ఆవేశంతో చిత్రాంగిని - 'రాక్షసి! ఇంత ఘాతుకానికి ఒడిగడతావా?" "నీకు ఏశిక్ష వేసినా తప్పులేదు" అని చడామడా తిడతాడు. అప్పుడు చిత్రాంగి సమాధానం!

"నాకా శిక్ష! నీకు లేదేమి శిక్ష!" అని దెప్పుతుంది! నీ కొడుక్కిచ్చి పెళ్లి చేస్తానని. నా తండ్రికి మాటయిచ్చి మోహాంధుడవై యీ వయసులో నువ్వే పెళ్లాడినావే! నీకు ఏ శిక్ష విధించాలి?" అన్న ధోరణిలో - నాటకంలోనే ఉందో ఒకవేళ స్థానం తనే రాసుకున్నాడో - మరే కవిచేతనయినా రాయించాడో చాలా బాగా చేసేవాడు! అది చాలా ఫేమస్ స్పీచ్! చివరికి ఒక పెద్ద కత్తి తీసుకుని పొడుచుకుని ఆత్మహత్య చేసుకుంటుంది చిత్రాంగి.

స్థానం చాలా బాగా చేసేవాడు! పెద్ద కత్తితో పొడుచుకుని కిందపడేవాడు! కత్తి - భుజానికి మెడకు మధ్య గాలిలో ఊగులాడుతుండగా తెరపడేది! బ్రహ్మాండమైన సీను! ప్రేక్షకుల్లో ఒకటే చప్పట్లు! ఆ ఒక్క సీనుతో స్థానం గొప్ప పేరు సంపాయించుకునేవాడు!

నాటకంలో రాజరాజనరేంద్రుని పాత్ర ఏముంది! దాదాపు విలన్! ప్రేక్షకుల సానుభూతి అంతా చిత్రాంగి మీదే!

ఆరోజు - చివరి సీనులో యడవల్లి సూర్యనారాయణ (రాజరాజ నరేంద్రుడు) ఎంత mischief చేశాడో తెలుసా!

స్థానంకి పేరు రావడం ఇష్టంలేక - చివరి సీనులో చిత్రాంగి మందిరానికి కోపంతో వచ్చి 'రాక్షసీ' అని తిట్టడానికి బదులు- చేసిన పనికి పశ్చాత్తాపడుతున్నట్టు - "చిత్రాంగీ! నేను తప్పు చేసినాను! నీకు అన్యాయం చేసినాను! నన్ను క్షమించు!" అన్న ధోరణిలో డైలాగ్ చెప్పాడు. అప్పుడు చిత్రాంగిగా స్థానం ఏంచేయాలి!



రాజు తిడితే గదా తను తిరిగి అతని మీద ప్రత్యారోపణ చేయవలసింది? అతనే వచ్చి క్షమించమని అడిగితే ఇంకేముంది? స్థానం మాట్లాడకుండా - లోపలికి వెళ్లిపోయాడు - తెరపడింది. అప్పుడు - ఆడియన్స్‌లో గోల! కేకలు! వాళ్లకి తెలుసాయే! ఆఖరి సీనులో స్థానం స్పీచ్ వినడానికి ఎంతో కుతూహలంతో కనిపెట్టుకు కూర్చున్న వాళ్లు ఊరుకుంటారా? "స్థానం రావాలి! చిత్రాంగి - చిత్తావేదన చూపించాలి" అని కేకలు వేశారు!

స్టేజి మీదకి ఎగబడేట్టున్నారు! అప్పుడు యడవల్లి సూర్యనారాయణ ఎంత పెద్ద అబద్ధం ఆడాడంటే తెరముందుకు వచ్చి-

"స్థానం నరసింహారావు తనకు ఒంట్లో బాగలేదన్నాడు - ఆ స్పీచ్ - ఎమోషనల్‌గా చెప్పలేనన్నాడు. అందుకని నేను పశ్చాత్తాప పడినట్టు చెప్పాను." అని లోనికి వెళ్లిపోయాడు! జనం కేకలు! "స్థానం! రా బయటికి! ఆ సీను నువ్వు చేయాలి! చేసి తీరాలి! లేకపోతే మర్యాద దక్కదు! జాగ్రత్త" అని కేకలు.

అప్పుడు - స్థానం తెరముందుకు వచ్చి-

"ఆయన చెప్పింది అబద్ధం! నేను అలా అనలేదు! చిత్రాంగి చిత్తావేదన స్పీచ్ నాకు ప్రాణం! ఆ స్పీచ్ లేకపోతే చిత్రాంగి లేదు....."

"అయితే ఇప్పుడు చెయ్!" జనం కేకలు!

"చెయ్యను!" అని స్థానం అనేసరికి-

ప్రేక్షకులు ఆయన మీద చెప్పులు విసిరారు "క్షమాపణ చెప్పు" కేకలు.

"నేను ఈ స్టేజి మీద ప్రాణమయినా వదుల్తాను గాని ఇవాళ ఆ సీను చేయను! తప్పు నాది కాదు! నేను చెయ్యని తప్పుకు క్షమాపణ చెప్పను!" అని లోనికి వెళ్లాడు. అప్పటికే యడవల్లి మేకప్ తీసేసి వెళ్లిపోయాడు-

ఆడియన్స్‌లో కొంతమంది స్థానం పక్షాన మాట్లాడడం! కొందరు అటు - కొందరు ఇటు మాట్లాడి ఎవరి దోవన వాళ్లు వెళ్లిపోయారు!

ఆ తరువాత స్థానం ప్రతిజ్ఞ చేశాడు-

"ఏలూరులో - ఇక - నాటకం వెయ్యను! ఏలూరు ప్రజలు నన్ను అవమానించారు" అని!

అలా ఒకటి రెండు సంవత్సరాలు ఏలూరులో స్థానం నాటకం వెయ్యలేదు!

ఆ రోజుల్లో - స్థానం - బందా కనక లింగేశ్వరరావు కలిసి - నాటకాలు వేసేవారు! 'తులాభారం' -'సారంగధర' చాలా ఫేమస్! కనక లింగేశ్వరరావుది ఏలూరు!

అప్పుడు - కనకలింగేశ్వరరావు - స్థానం నరసింహారావును బ్రతిమిలాడి - ఏలూరు పుర జనుల చేత నీకు క్షమాపణ చెప్పిస్తానని - మాటయిచ్చి - పురజనుల తరుపున - ఏలూరులో - స్థానం నరసింహారావుకు ఘనంగా సన్మానం ఏర్పాటు చేశాడు. -

ఆ తరువాత - మళ్లీ - స్థానం ఏలూరులో నాటకాలు వేయడం ప్రారంభించాడు.-

స్థానం గూడ ఏమి తక్కువ వాడు కాదండి!



ఇదే 'సారంగధర' నాటకం - బెజవాడ దుర్గా కళామందిరంలో వేశారు. స్థానం - చిత్రాంగి. అద్దంకి శ్రీరామమూర్తి రాజరాజనరేంద్రుడు;

నాటకంలో పైన చెప్పిన ఆఖరి సీను;

రాత్రిపూట; రాజరాజనరేంద్రుడు - నిజం తెలుసుకుని - కోపొద్రిక్తుడై - చిత్రాంగి మందిరానికి వస్తాడు. చిత్రాంగి - మంచం మీద పండుకుని నిద్రపోతుంటుంది.

రాజరాజనరేంద్రుడు - 'ఓసీ ! రాక్షసీ !' అంటూ - ప్రవేశిస్తాడు. చిత్రాంగి చేసిన మోసానికి ఆమెను ఎడాపెడా తిడుతూ అరుస్తాడు. చిత్రాంగి లేవదు! రాజరాజు మరీ కోపంగా - 'లే' అని ఆమెను చెయ్యిపట్టుకుని లాగుతాడు - చిత్రాంగి - లేచి - మంచం మీద కూర్చుంటుంది. రాజరాజు తన డైలాగులు ఉచ్ఛస్థాయిలో చెబుతాడు - చిత్రాంగిని హంతకురాలుగా వర్ణిస్తూ!

ఆయన అంత ఆవేశంగా అరిచినా - చిత్రాంగి - కూర్చుని కునికి పాట్లు పడుతుంటుంది. అతను యింకా ఆవేశంతో - "ఏం? మాట్లడవు? - వినబడడంలేదా? చెవుల్లో చెట్లు మొలిచినయ్యా?" అని ఆవేశంగా - అంటే- చిత్రాంగి - తాపీగా - ఆవులించి - "అబ్బ! ఏమిటండీ! అర్ధరాత్రి వేళ - మద్దెలదరువు లాగా - కేకలు! నాకు నిద్రవస్తోంది; పండుకోండి! అని తను మళ్లీ పండుకుంటుంది.

రాజరాజు మళ్లీ ఆమెను చేయిపట్టుకులాగి - కుర్చోబెడతాడు. తన డైలాగులు మళ్లీ ఏకరువు పెడతాడు.

అప్పుడు - చిత్రాంగి అతని మాటలు సావధానంగా వింటూ కూర్చుని ఒక్కసారి లేస్తుంది. అప్పుడు - 'స్పీచ్' ప్రారంభిస్తాడు స్థానం! "నాకా శిక్ష! నీకు లేదేమి శిక్ష?....."

రాజరాజును కామాంధుడుగా నిందించి చివరికి రాజరాజు చేతిలో కరవాలం తీసుకుని - ఆత్మహత్య చేసుకుంటుంది చిత్రాంగి.

అంటే - స్థానం తన మార్కులు తను కొట్టేస్తూనే తోటినటుణ్ణి - యిబ్బందిలో పెట్టి ఎంత ఆభాసుపాలు చేస్తాడో చూశారుగా! అవతల ఆర్టిస్టు - ఆవేశంగా డైలాగు చెబుతుంటే - తను తగినట్లుగా రియాక్టు కావాలిగదా! అతను ఆవేశంగా అరుస్తుంటే - నువ్వు ఏమీపట్టనట్టు - ఆవులింతలతో "నిద్రవస్తోంది! పండుకోండి" అంటే జనం నవ్వుతారు! నిజమే! కాని పక్కనున్న ఆర్టిస్టు ఏమవుతాడు?

ఇటువంటిదే - మరో ఉదాహరణ చెబుతాను! తెనాలి రామవిలాస సభలో - స్థానం మాధవపెద్ది వెంకట్రామయ్య గార్లు చాలా నాటకాలు ఆడారు. తులాభారంలో స్థానం - సత్యభామ - మాధవపెద్ది కృష్ణుడు! వాళ్లలో వాళ్లకి ఏదో విభేదాలొచ్చి - విడిపోయారు! సమాజం గూడ మూలపడింది! ఇద్దరూ తెనాలి వాళ్లే! మంచి స్నేహితులే! కాని - తరువాత ఇద్దరూ కలిసి నాటకాలు వెయ్యడం మానేశారు!

స్థానం - ఎవర్నో చిన్న చిన్న వాళ్లను పెట్టుకుని - నాటకాలు ఆడేవారు. మాధవపెద్ది గూడ అంతే! ఉద్యోగ విజయాలు - ద్రౌపదికి ఎవరో చిన్న ఆర్టిస్టును పెట్టుకుని - నాటకాలు ఆడేవాడు.

మాధవపెద్ది వెంకట్రామయ్యగారు - నాటక కళాపరిషత్తు సందర్భంగా నాకు బాగా చనువైన తరువాత ఒకసారి అన్నాడు స్థానం నరసింహారావును ఉద్దేశించి - "వాడికి మగ దిక్కులేదు! నాకు ఆడ దిక్కులేదు!" అని.



వీళ్లిద్దరినీ - ఎలాగైనా ఒప్పించి - ఇద్దరినీ కలిపి నాటకం వేయించాలని - మేము - తిరువూరు తాలూకా. 'గంపల గూడెం'లో నాటకం వేయించాం!

ఊటుకూరి సత్యనారాయణరావు గారు "వీరాభిమన్య" నాటకం రాశారు. గంపల గూడెం రాజాగారికి నాటకాలంటే మహామోజు! ఆయనే గాదు - ఆయన బంధువులందరికీ!

ముఖ్యంగా రాజాగారి మేనల్లుడు - కటికినేని జగన్నాధరావు (తరువాత - ఆంధ్ర హైకోర్టులో సీనియర్ అడ్వకేట్‌గా గవర్నమెంటు ప్లీడరుగా పనిచేశాడు) అతనికి స్థానం బాగా సన్నిహితుడు. జగన్నాధరావు స్థానం - వీరాభిమాని.

మాధవపెద్ది గూడ - బాగా తెలుసు గనక - ఇద్దరినీ ఒప్పించి. గంపల గూడెంలో నాటకం ఏర్పాటు చేశాం! యిది 1940-50 మధ్యలో!

స్థానం - సుభద్ర! మాధవపెద్ది - కర్ణుడు!

నాటకంలో ఆరోజు యుద్ధం అయిపోయింది! పద్మవ్యూహంలో దుష్టచతుష్టయం - అధర్మయుద్ధంలో - అభిమన్యుణ్ణి చంపేస్తారు!

ఆ రాత్రి కర్ణుడు వికల మనస్కుడై - బాధపడతాడు. అభిమన్యుడు లాంటి వీరుణ్ణి - అధర్మయుద్ధంలో అన్యాయంగా చంపేశామే అని - బాధపడతాడు. తను గూడ వీరుడు గనక! మథనపడతాడు. నిద్రపట్టదు! అటూయిటూ తిరుగుతాడు. మనసు వుండబట్టలేక ఒకసారి యుద్ధాభూమికి వెళ్లి (ధర్మయుద్ధం గనక - రాత్రి పూట యుద్ధం చేయరు) అభిమన్యుడి శవాన్నయినా చూచి ఆ వీరకిశోరానికి - నివాళులర్పించాలని - వెళతాడు.

చచ్చిపడివున్న అభిమన్యుడి శవం దగ్గర మోకరిల్లి - వల వల ఏడుస్తాడు.

అప్పుడే - సుభద్ర గర్భవతియైన కోడలు ఉత్తరను వెంటబెట్టుకుని - కొడుకు శవాన్ని చూడడానికి - వెతుక్కుంటూ యుద్ధభూమికి వస్తుంది.

ఆమె రాక చూచి - మొఖం చెల్లక - కర్ణుడు చీకట్లో ఒక పొదచాటున నక్కుతాడు.

సుభద్ర - ఉత్తర - అభిమన్యుడి శవాన్ని చూస్తారు. ఉత్తర మూర్ఛపోతుంది! సుభద్ర - ఆమెను పట్టుకుని పండబెట్టి శైత్యోపచారాలు చేస్తుంది!

కొడుకు శవం మీద పడి ఏడుస్తుంది. వెంట వచ్చిన సైనికుడు ఒకడు చెబుతాడు. "అధర్మ యుద్ధం చేసి - నీ కొడుకును పొట్టన బెట్టుకున్నారు!" "ఎవరా దుర్మార్గులు?" అంటుంది సుభద్ర! సైనికుడు పేర్లు చెబుతాడు. అందులో కర్ణుడు పేరు గూడ చెబుతాడు.

"కర్ణుడా?! నేను నమ్మను! కర్ణుడు మహావీరుడు. అధర్మ యుద్ధం చేయడు" అంటుంది సుభద్ర! అంటే - కర్ణుడంటే - ఆమెకు - అంత గౌరవభావం ఉందన్నమాట! ఆమె మాటలు - చాటు నుండి విని కర్ణుడు లోలోన కుమిలిపోతాడు. (అప్పుడు చూడాలి - మాధవపెద్ది అభినయం!) తలపక్కకు తిప్పుకుని - పోబోతాడు. కాలికి ఏదో తగిలి - చప్పుడవుతుంది.

ఆ చప్పుడు విని - సుభద్ర - అటుచూచి - 'ఎవరది?' అని కాగడా చేతబట్టుకుని చీకట్లో వున్న కర్ణుడి వైపు వెళుతుంది. అతని మొఖం వైపు కాగడ పైకి ఎత్తి చూస్తుంది. కర్ణుడు మొఖం పక్కకు తిప్పుకుంటాడు.



"ఎవరు? ఎవరునీవు?" అని అడుగుతుంది. కర్ణుడు మాట్లాడడు!

'ఎవరునీవు? మాట్లాడవేమి? ఎవరు నీవు?" ఇక్కడ మాధవపెద్ది గడుసుతనం! ఎన్నిసార్లు అడిగినా - మాట్లాడడు. నాటకంలో అయితే రెండుసార్లు అడిగిన తరువాతనైనా తను ఫలాన అని చెప్పాలి మాధవపెద్ది మాట్లాడడు!

స్థానం - అరడజను సార్లు అడిగిన తరువాత - అప్పుడు చెబుతాడు కర్ణుడు.

"అమ్మా! అధర్మయుద్ధమున నీ కుమారుని వధించిన పాపాత్ముడను! రాధేయుడను!" అంటాడు.

సుభద్ర ఆశ్యర్యపోయి "నా కుమారుని ఒంటరి వాణ్ణి చేసి పదుగురు ఒకటై - అధర్మయుద్ధంలో - హతమారుస్తారా?" అని - కుమారుని శవం వద్దకు వెళ్లి వలవల ఏడుస్తుంది.

కర్ణుడు ఆమెను ఓదారుస్తాడు! ధైర్యం చెబుతాడు. సత్యనారాయణరావు గారు చాలా మంచి పద్యాలు రాశారు...

"చావగలేదు నీ కొడుకు - చచ్చిరి కర్ణుడు - దుస్ససేనుడున్.." చచ్చింది నీ కొడుకు కాదమ్మ! అధర్మయుద్ధం చేసి నిజంగా చచ్చింది మేము! అని

అభిమన్యుడి శౌర్యాన్ని పొగుడుతాడు.

"కౌరవక్షితి నాథమౌళి కిరీటమ్మునూపిన మేటిబలుడు"

""గర్వాంధమతి - సైంధవు నడంచి-

వెంటాడి తరిమిన వేటకాడు!

"కౌరవ ప్రతి వీర యుధముల్ చెండి చీల్చిన రణశేఖరుండు" అటువంటి కొడుకును కన్నందుకు-

"ధైర్యము వహింపగ జెల్లదె - వీరమాతవై? అని ధైర్యం చెబుతాడు కర్ణుడు-

సీను అయిపోయి తెరపడిన తరువాత లోపల గ్రీన్ రూంలో-

స్థానం - మాధవపెద్దితో అంటాడు "ఎవరునీవు? అని ఎన్నిసార్లు అడిగినా - మాట్లాడవేం? నువ్వు మాట్లాడకుండా - మొద్దులా నుంచుంటే ఎన్నిసార్లని అడగను 'ఎవరునీవు? అని?

దానికి మాధవపెద్ది సమాధానం!-

"కర్ణుడు అంత బాధలో వున్నాడు - వెంటనే జవాబు చెప్పడానికి మాటపెగలదు! గొంతు గద్గదమైపోయింది! ఎలా మాట్లాడతాడు?"

"అందుకని - ఎవరునీవు? ఎవరునీవు? అని ఎన్నిసార్లు అడగమంటావ్?"

"నువ్వు గొప్ప నటుడివిరా! నరసింహాయ్! అక్కడే నీ ప్రతిభ బయటపడేది? అటువంటి సన్నివేశాలే నటుడికి పరీక్షలు?"

యిలా రసవత్తరంగా జరిగేవి - నటులమధ్య వాగ్వాదాలు! 'వీరాభిమన్య' నాటకం - 1940లో మదరాసులో ఆంధ్రమహాసభ విక్టోరియా హాలులో వేశారు!



అప్పుడు సత్యనారాయణరావు గారికి (రచయిత) సుస్తీచేసి మదరాసు స్టాన్లీమెడికల్ హాస్పిటల్‌లో చేర్చారు. ఆయనకు ఆర్థిక సహాయం కోసం - మదరాసు 'లా' కాలేజి తెలుగు ఎసోసియేషన్ తరుపున కొంత చందాలు వసూలు చేసి - ఆ నాటకం వేసి - ఆ సొమ్ము సత్యనారాయణరావు గారికి యిచ్చారు!

నాటకానికి చందాలు వసూలు చేయాలంటే అందరికీ సాధ్యంకాదు! అప్పుడు గుమ్మడిదల దుర్గాబాయి గారు (ఆంధ్ర మహిళాసభ స్థాపకురాలు) 'లా' కాలేజిలో చదువుతున్నారు! ఆమె తెలుగు ఎసోసియేషన్ ప్రెసిడెంటు! తోట లక్ష్మయ్య గారు (తరువాత ఆంధ్ర హైకోర్టు జడ్జిగా పనిచేశారు) సెక్రటరీ - కటికినేని జగన్నాథరావు -సహాయకార్యదర్శి.

దుర్గాబాయి గారు చందాలు వసూలు చేయడంలో దిట్ట. వీరాభిమన్య నాటకంలో ఆమె 'సుభద్ర'గా నటించింది. బళ్లారి రాఘవాచారి గారితో కూడా నటించింది.

ఈ విషయాలు చెబితే హైద్రాబాద్ ఆంధ్రమహిళా సభ అధ్యక్ష - కార్యదర్శులు - కార్యకర్తలు "ఆమె నాటకాలలో నటించినట్లు మాకు తెలియదండి! ఇప్పుడు మీరు చెబితే తెలుసుకుంటున్నాం" అన్నారు.

ఇలా ఆ రోజుల్లో నేను ఎన్నో నాటకాలు చూశాను! నటుల మధ్య ఉండే - ఈర్ష్యా - అసూయ - ద్వేషాలు స్టేజిమీద ఎలా బయటపడేవో చెప్పాను గదా!

సమాజాలు పకడ్బందీగా ఉన్నప్పుడు ఇటువంటి రసాభాసలకు తావు ఉండేదికాదు!

బందరులో - డి.వి. సుబ్బారావుగారు - ఇండియన్ డ్రమెటిక్ కంపెనీ అని చాల క్రమశిక్షణతో నడిపాడు. ఆయన హరిశ్చంద్ర చాలా ఫేమస్! ఆ సమాజంలోనే - మేనేజరుగా - రచయిత గానూవుండి - పింగళి నాగేంద్రరావు గారు 'నారాజు' 'వింధ్యరాణి' నాటకాలు రాశారు.

డి.వి. సుబ్బారావు గారి 'హరిశ్చంద్ర' చాలా బాగా క్రమశిక్షణతో ప్రదర్శించేవాళ్లు. పద్యం చదవడంలో - సుబ్బారావు గారిది ఒక ప్రత్యేకమైన బాణీ!

నాటకం చివర - కాటిసీను - హైలైట్! ఆయన బ్రహ్మాండంగా చేసేవాడు!

ఇప్పటికీ - ఆ నాటకాలు - బాగావేస్తే - ఎంతో బాగుంటయ్! ఒక ఏడాది క్రితం - హైదరాబాద్ రవీంద్రభారతిలో 'కృష్ణతులాభారం' వేశారు. అందులో 'సత్యభామ' వేసింది - ఒకామె! పేరు జమునారాయలు! ఎంతో బాగా చేసింది. నాటకం అయిన తరువాత - గ్రీన్ రూంలోకి వెళ్లి - ఆమెను అభినందించాను!

"అమ్మా! స్థానం 'సత్యభామ'ను చూశాను! చాలా రోజులకి అంతకుమించిన అభినయం ఈ రోజు చూశాను." అని చెప్పాను!

ఆ నాటకం డైరెక్టరు అన్నాడు ఆమెతో! "నరసరాజుగారు కాంప్లిమెంటు యిచ్చారు! నీ జన్మధన్యమైంది." అని - ఆమె గూడ చాలా సంతోషించింది.

డి.వి. సుబ్బారావు గారి 'హరిశ్చంద్ర' సినిమా తీస్తామని ఎవరో దర్శకుడు వస్తే - నేను రాను పొమ్మన్నాడు! ఆ తరువాత చాలానాళ్లకు 'వింధ్యరాణి' సినిమాగా తీయడానికి ఒప్పుకున్నాడు. ఆ సినిమా ఫెయిల్ అయింది.-

సుబ్బారావు గారి నటనకు - సన్నివేశ ఔచిత్యానికి - ఒక ఉదాహరణ!



హరిశ్చంద్ర నాటకంలో - చివర - కాటిసీను! చాలా ఫేమస్! 'హరిశ్చంద్ర'లో పద్యాలన్నీ నాకు కంఠస్థం!

చంద్రమతి - చనిపోయిన కొడుకు లోహితుణ్ణి దహనం చేయడానికి - ప్రయత్నిస్తే - (రాత్రిపూట చీకటిలో) "సుంకం చెల్లించడానికి - నా దగ్గర చిల్లిగవ్వ గూడ లేదు" అంటుంది చంద్రమతి!

అప్పుడు - హరిశ్చంద్రుడికి - ఒక పద్యం ఉంది.

"దళమౌ - పయ్యెదలో నడంగియు - సముద్యత్కాంతు లీరెండలన్
మలయింపన్ దిశలన్ - త్వదీయ గళసీమన్ - బాలసూర్య ప్రభా
కలితంబై - వెలుగొందుచున్నదది - మాంగల్యంబు కాబోలు! ఏ
వెలకైనన్ తెగనమ్మి - నీసుతునికై వెచ్చించినన్ - చెల్లదే!"

వశిష్ఠుని వరం వలన తన మాంగల్యం - తన భర్తకు తప్ప - యితరులకు - కనబడదు గనక యీతడు తన భర్త హరిశ్చంద్రుడేనని నిశ్చయించి - చంద్రమతి "హా! నాథా!" అని హరిశ్చంద్రుని పాదాల మీద పడుతుంది!

ఇదీ - నాటకంలో వున్నది.

సుబ్బారావుగారు ఈ పద్యం - చివరదాకా చదివేవాడు కాదు!-

.....త్వదీయ గళసీమన్ వెలుగొందుచున్నదది మాంగల్యంబుకాబోలు" అనగానే - చంద్రమతి గ్రహించి 'నాథా' అని హరిశ్చంద్రుని పాదాలమీద పడితే-

హరిశ్చంద్రుడు - తన భార్యను ఓదార్చడానికి బదులు చనిపోయినవాడు - తన కొడుకు లోహితుడని తెలిసి!

"హా! కుమారా! లోహితా!" అని మొదలు నరికిన చెట్టులాగా - లోహితుని శవం మీద వాలేవాడు.

కవి రాశాడు గదా అని - చివరి పాదం కూడ చదివిన తరువాత చంద్రమతి 'హా! నాథ!' అంటే అతడు తన భర్త అని ఆలస్యంగా గ్రహించినట్లు అవుతుంది గదా!

నటులు కానివ్వండి - దర్శకులు కానివ్వండి - నాటకాలలో ఇటువంటి ఔచిత్యాలు పాటించేవాళ్లు చాలా అరుదు! నాటకసమాజాలు - క్రమశిక్షణతో - రిహార్సల్సు బాగావేసి ప్రదర్శించిన నాటకాలలోనే ఇటువంటి 'ఔచిత్యాలు' 'నాటకీయ సన్నివేశాలు' సాధ్యం!

కంట్రాక్టు నాటకాలయితే - నటులలో - అసూయ - ద్వేషాలు ప్రబలి పక్క నటుణ్ణి ఎలా అభాసుపాలు చేయాలి అనే ప్రయత్నాలు తప్ప నాటకం రసవత్తరంగా ప్రదర్శించాలి అనే చిత్తశుద్ధి ఉండదు.

ఆంధ్రదేశంలో - నాటకరంగాన్ని గురించి చెప్పుకునేటప్పుడు తప్పనిసరిగా చెప్పుకోవలసింది సురభి నాటకసమాజం!

సురభి నాటకాలలో - అందరూ - ఆడ-మగ అందరూ కుటుంబ సభ్యులే - పిల్లలతో సహావేషాలు వేసేవారు! సంగీతం - తెరలు అన్నీ! సమాజం అంటే కుటుంబం అనే అర్థం!

వాళ్లు ఎక్కువగా పల్లెటూళ్లు - చిన్నచిన్న పట్టణాలకు వెళ్లి వూరిబయట రేకులతో షెడ్లువేసుకుని అవే నాటక శాలలు - వాళ్లు ఉండడానికి ఇళ్లు గూడ అవే! నెలల తరబడి - పురాణనాటకాలు వేసేవాళ్లు!



అటువంటి సమాజాలు - ఒకప్పుడు - డజన్ల సమాజాలు వుండేవట! ఇప్పటికి - రెండు మూడు సమాజాలు మాత్రం కొనవూపిరితో సినిమాలు - టి.వి.ల ధాటికి తట్టుకుని నిలబడి ప్రదర్శనలు ఇస్తున్నాయ్యని చెబుతారు.

1932 ప్రాంతంలో సినిమా టాకీలు వచ్చినప్పుడు అందులో నటించడానికి - పాటలు - పద్యాలు పాడేవాళ్లు కావాలి గదా! అందుకు సురభి సమాజం వాళ్లే గతి!

హెచ్.యం. రెడ్డిగారు - మొట్ట మొదటి టాకీ - "భక్తప్రహ్లాద" తీసినప్పుడు అందులో ప్రధానపాత్రధారులు సురభిసమాజం సభ్యులే!

ప్రహ్లాదుని తల్లి 'లీలావతి' వేషం సురభి కమలాబాయి. ఆవిడే "శకుంతల" సినిమాలో - శకుంతల వేసింది. బాగుండేది అందంగా! బాగా పాడేది!

తరువాత - తరువాత సినిమాలలో చిన్నచిన్న వేషాలు "పాతాళభైరవి"లో హీరో తోటరాముడు (యన్.టి.ఆర్) తల్లిగా, "మల్లీశ్వరి"లో - 'ఎవరెట్లాపోతే నాకేం లేమ్మా!" అనే ఊత పదంతో చిన్న వేషం వేసింది.

ఆమె చాలా పొట్టిగా వుండేది! లావు గూడా అయింది. కె.వి. రెడ్డిగారు (పాతాళభైరవి డైరెక్టరు) నవ్వుతూ అనేవాడు సురభి కమల నడుస్తుంటే "గుండ్రాతికి కాళ్లు వచ్చి గునగున నడిచెన్" అన్నట్లుంటుంది - అని!

అప్పటి ప్రహ్లాదలో హిరణ్యకష్యపుడు సురభి సమాజం వాడే వి.వి. సుబ్బారావు!

ఇప్పుడు అందరూ అతన్ని 'మునిపల్లె సుబ్బయ్య' అంటారు! నాటకరంగాన్ని గురించి రిసెర్చ్ చేసేవాళ్లు గూడ అతన్ని 'మునిపల్లె సుబ్బయ్య' అనే అంటున్నారు!

కాని - నేను చెప్పేవాణ్ణి "నేను ఆ సినిమా చూశాను! టైటిల్స్‌లో వి.వి. సుబ్బారావు అని ఉంది!" అని.

ఈ మధ్య - యిప్పుడున్న సురభి సమాజాలలో ఒకదాన్ని నడుపుతున్న 'బాబారావు' అని ఒకతన్ని కలిశాను! అతన్ని అడిగితే - అతను 'వి.వి. సుబ్బారావే' నండి - అని ధృవపరచాడు.

ఆ 'బాబారావు'ను అడిగాను - యిప్పుడు సురభి సమాజాలు ఎలా ఉన్నయ్యని! అతను చెప్పాడు - "రెండు మూడు సమాజాలు వున్నాయి! ఎక్కువగా - తెలంగాణాలో నాటకాలు ఆడుతున్నాం."

కాకపోతే - ఇప్పుడు వచ్చిన లైటింగ్ - మైకులు వగైరాలతో కొంత మోడర్నైజ్ చేసి ప్రదర్శిస్తున్నారు. మనకు క్రూడ్‌గా కనిపించవచ్చుగాని - పల్లెల్లో బాగానే చూస్తున్నారని చెప్పాడతను!

ఇంతవరకు - ప్రేక్షకుడుగా నేను చూచిన నాటకాల చరిత్ర - అనుభవాలు జ్ఞాపకం ఉన్నంతవరకు చెప్పాను. జ్ఞాపకం తెచ్చుకుని రాస్తే ఇంకా వున్నయ్!

నేను - మొఖానికి రంగువేసుకుని నటుడుగా స్టేజిమీద నటించడం అదొక ప్రత్యేక అధ్యాయం!

నేను మొట్టమొదట మొఖానికి రంగు వేసుకుని - స్టేజిఎక్కింది గుంటూరు హిందూకాలేజిలో - ఇంటర్ మీడియట్ చదువుతున్నప్పుడు.

ఇంటర్ రెండవ సంవత్సరం అయిన తరువాత కాలేజి 'డే' సందర్భంగా ఏదో సాంస్కృతిక కార్యక్రమాలు ఉంటయ్‌గా!



అందులో భమిడిపాటి కామేశ్వరరావు గారి నాటిక 'ఎప్పుడూ ఇంతే' ప్రదర్శించాం. అందులో మూడే వేషాలు! పర్వతాలు, పానకాలు, అమృతం! ఆడవేషాలు లేవు!

నేను 'అమృతం' వేషం వేషాను! మిగతా రెండు వేషాల్లో ఒకటి - రవి! బొడ్డుపల్లి రవీంద్రనాథ్! తరువాత సినిమాల్లో ప్లేబాక్ సింగర్‌గా వచ్చింది - వసంత! ఆవిడ తండ్రి రవి! మూడోవేషం - జగన్నాథ్! అని మేమందరం క్లాస్‌మేట్స్. జగన్నాథ్ పెంపుడు తల్లిగారిని బర్మా హనుమాయమ్మ గారనేవారు. బ్రాడీపేట - ఒకటో లైన్‌లో - రైలుకట్ట పక్కనే ఉండేది ఇల్లు!

తరువాత - బి.ఏ చదవడానికి - మదరాసు లయోలా కాలేజీకి వెళ్లాను! అక్కడ గూడ - తెలుగు ఎసోసియేషన్ ఉండేది! దాని తరుపున - ప్రతిఏటా - ఒక తెలుగు నాటకం వేసే ఆచారం ఉంది!

నా కంటె రెండేళ్లు సీనియర్ కటికినేని జగన్నాథరావు. అతను బి.ఏ చదివేటప్పుడు 'శకుంతల' నాటకం వేశారట!

కర్నూలు జిల్లా కోవెలకుంట్లకు చెందిన - రామనాథ శాస్త్రి శకుంతల! బాపట్లకు చెందిన కోన ప్రభాకరరావు కణ్వమహర్షి! వాళ్లిద్దరూ బాగా పాడేవాళ్లేనట! దుష్యంతుడు వేషానికి అప్పుడు 'లా' కాలేజీలో చదువుతున్న - శివలెంక బసవయ్య శాస్త్రిని ఎరువు తెచ్చుకున్నారట! బసవయ్యశాస్త్రి గారు - తరువాత - 'కనకతార' సినిమాలో కనకసేనుడి తండ్రిగా నటించాడు. తరువాత విజయవాడలో లాయర్‌గా ప్రాక్టీసు పెట్టాడు. అప్పుడు నాకు పరిచయమయ్యాడు.

'శకుంతల' నాటకం సంగతి - జగన్నాథరావు చెబుతుండేవాడు. రామనాథశాస్త్రిగారు - జగన్నాథరావు 'లా' కాలేజీలో చేరారు! రామనాథశాస్త్రి గారు 'లా' కాలేజీ హాస్టలు - బ్రాడ్‌వేలో - యూనివర్సిటీ క్లబ్‌లో వుండగా. జగన్నాథరావు ద్వారా నాకు పరిచయం!

నాలుగయిదేళ్ల క్రితం - జగన్నాథరావు హైద్రాబాద్‌లో చనిపోయినప్పుడు - అతనిని గురించి నా 'ఈనాడు' కాలం 'అక్షింతలు'లో రాశాను. అది చదివి కోవెల కుంట్ల నుంచి రామనాథశాస్త్రిగారు నాకు ఉత్తరం రాశారు. తరువాత హైద్రాబాద్ వచ్చినప్పుడు నన్ను కలిశారు! జగన్నాథరావు - ఆయన చాలా ఆప్తమిత్రులు! ఆ సంగతులు చెప్పారు.

అలాగే - నేను 'లయోలా'లో చేరిన మొదటి సంవత్సరం 'చంద్రగుప్త' నాటకం వేశారు. అందులో నాకు చిన్నవేషం యిచ్చారు. అలెగ్జాండరు సేనాని - సెల్యూకస్ వేషం! అందులో 'చంద్రగుప్తుడు'! మాకు సీనియర్ సుందరరామారావు! అతను తెలంగాణావాడు. 'ఖమ్మం' అనుకుంటాను. 'చాణక్యుడు' కొండముది గోపాల రామశర్మ! అతను నా క్లాస్‌మేట్! అతను ఇంటర్ గూడ - 'లయోలా'లోనే చదివాడు. అతని స్వగ్రామం తెనాలి! మంచి నటుడు!

చంద్రగుప్తుని తల్లి వేషం - దాసు అనిరుద్ధరావు వేశాడు. అతనిది విజయవాడ! బ్రాంచిస్కూలులో - థర్డ్ ఫారంలో నా సహాధ్యాయి. ఆడవేషాలు మగవాళ్లే వేయాలి. ఆడవాళ్లను కాంపౌండులోకి రానిచ్చేవాళ్లు కాదు కాలేజి యాజమాన్యం. క్రిస్టియన్ క్యాథలిక్కులు గదా! ఈ విషయాలు ఇంతకు ముందే వ్రాశాను.

యిక్కడ చంద్రశేఖర్ విషయం కొంత చెప్పాలి! రాణాప్రతాప్ కూతురు వేషం వేశాడని చెప్పానే - చంద్రశేఖర్



అతను - కృష్ణాజిల్లా కలెక్టరుగా పనిచేశాడు. అప్పుడు - కృష్ణాజిల్లా యస్.పి.గా (సూపరింటెండెంట్ అఫ్ పోలీసు) కె రామచంద్రారెడ్డి వుండేవాడు. అతను గూడ లయోలా స్టూడెంట్. మా సమకాలీనుడు - 'రాణాప్రతాప్'లో చిన్నవేషం గూడ వేశాడు.

అప్పటికి - నేను సినిమాల్లోకి వెళ్లిపోయాను! ఒకసారి నేను విజయవాడ వచ్చినప్పుడు - విజయవాడలో రామచంద్ర కాశ్యప చెప్పాడు "చంద్రశేఖర్ బందరు నుంచి వచ్చాడురా" అని చెప్పాడు. బందరు రోడ్డు ప్రక్కన - బంగాళాలో వున్నాడు - చంద్రశేఖర్ - పిల్లలతో సహావచ్చాడు. నేను వెళ్లి కలిశాను! అప్పుడు చంద్రశేఖర్ తన పిల్లలతో నవ్వుతూ చెప్పాడు! "రేయ్! నాచేత రాజుగారు నాటకంలో ఆడవేషం వేయించాడు రా" అని!

చంద్రశేఖర్ కలెక్టరుగా - రామచంద్రారెడ్డి యస్.పి.గా జిల్లాలో ఎంతో మంచిపేరు తెచ్చుకున్నారు!

నేను ఒకరోజు బెజవాడ నుంచి గుంటూరు వెళుతున్నా ఎవరో స్నేహితుణ్ణి చూడడానికి! ఆ కంపార్ట్మెంటులోనే ఒక టీచరు తన అనుభవం చెబుతున్నాడు. నేను ఫలాన అని - చంద్రశేఖర్ నాకు తెలుసని - అతనికి తెలియదు! ఆయన భార్య గూడ టీచరు! ఇద్దర్నీ ఒక ఊళ్లో వెయ్యమని ప్రభుత్వాన్ని అడుగుతూ మూడు సంవత్సరాల నుంచీ ప్రయత్నాలు చేస్తున్నాడట! హ్యూమన్ కన్సిడరేషన్‌తో చేయమని అప్లికేషన్ పెడితే దిక్కు మొక్కులేదట!

ఇప్పుడు వచ్చిన కలెక్టరు మంచి వాడని తెలిసి ఆ టీచరు ఒకరోజు బందరులో - కలెక్టరు ఆఫీసుకు వెళ్లాడట! వెళితే గుమాస్తాలు కలెక్టరును చూడనివ్వలేదట! చివరికి - సాయింత్రందాకా బయటే ఉండి 5 గంటలకి కలెక్టరు గారు జీపులో ఆఫీసు నుంచి బయటికి వెళుతుంటే ఆ టీచరు - జీపుకు అడ్డంగా నిటబడ్డాడట!

ఆయన అడిగాడట - సంగతి ఏమిటని! "నా గోడు మీకు చెప్పుకోవాలని వచ్చాను! నన్ను లోనికి రానివ్వలేదు" అనగానే - చంద్రశేఖర్ జీపు దిగి - 'రా లోపలికి' అని ఆఫీసులోకి వెళ్లాడట టీచర్ని తీసుకుని! ఆఫీసులోకి వెళ్లాక టీచరు తనగోడు చెప్పుకున్నాడు! కలెక్టరు గుమాస్తాను పిలిచి - ఆ టీచరు ఫైలు తెప్పించి వెంటనే ఆర్డరు వేసి - ఇన్నాళ్లు ఎందుకు ఆలస్యం చేశారో విచారించి తనకు రిపోర్టు సబ్‌మిట్ చెయ్యమని రాశాడట!

ఆ విషయం ఆ టీచరు చెబుతుంటే విని నేను ఎంతో గర్వించాను.

చంద్రశేఖర్ - విజయవాడలో కలిసినప్పుడు మరో అనుభవం చెప్పాడు. అతను గొప్ప పర్సనాలిటీ ఏమీకాదు! పొట్టిగా ఉండేవాడు. కాస్త నలుపు రంగు!

మామూలుగా కలెక్టరు తాలూకా ఆఫీసుల తనిఖీకి బయలు దేరేటప్పుడు - కలెక్టరు ఆఫీసు గుమాస్తాలే ఆయా తాలూకా ఆఫీసులకు ముందుగానే వార్త చేరవేస్తారు! దాంతో తాలూకా ఆఫీసు - తహసిల్దార్లు జాగ్రత్త పడతారు!

చంద్రశేఖర్ - బందరులో బయలు దేరేటప్పుడు తను ఎక్కడికి వెళ్లేదీ - గుమాస్తాలకు గాని - డ్రైవరుకు గూడ ముందు చెప్పేవాడు కాదు! జీపులో కూర్చుని డ్రైవరుతో "ఈ రోడ్డులో పోనియ్" తరువాత "ఇటు పోనియ్" అని చెబుతూపోయేవాడట!

ఒకసారి గన్నవరం దరిదాపులకు పోయి - టవునుకు కిలోమీటరు దూరంలో - జీపు ఆపి - తను దిగి - నడిచి ఒక్కడే ఊళ్లోకి వెళ్లాడట. తాలూకా ఆఫీసుకు వెళ్లాడట! అతని రూపం ఎలా వుంది? పిట్టల దొరలాగ నిక్కరు - షర్టు, బూట్లు తల మీద హ్యాట్!



ఆఫీసులోపలికి వెళ్లి "తాసీల్దారు గారు ఉన్నారా?" అని అడిగాడట. ఇతను - రూపంచూసి కలెక్టరని తెలియక - కుర్చీలోంచి లేవకుండానే ఒక గుమాస్తా "లేరు" అన్నాడట! మిగతా కుర్చీలన్నీ ఖాళీగా ఉన్నయ్యట! మాటలు వినబడుతుంటే - ఆఫీసు వెనక యార్డులోకి వెళ్లాడట! అక్కడ - గుమాస్తాలందరూ సిగరెట్లు కాలుస్తూ కబుర్లు చెప్పుకుంటున్నారట!

"తాసీల్దారు గారు ఎప్పుడొస్తారండి" అని అడిగితే వాళ్లు "ఏమో! చెప్పలేం! ఎందుకు? రేపురండి! అన్నారట! అతను కలెక్టరని వాళ్లు కలలో గూడ అనుకుని ఉండరు!

కలెక్టరు తిరిగి లోనికి వెళ్లి - తాసీల్దారు కుర్చీలో కూర్చున్నాడట! అక్కడున్న గుమాస్తా తెల్లబోతె-

"నేను కలెక్టర్ని! వాళ్లందరినీ లోనికి రమ్మను" అన్నాడట! వాళ్లందరూ - గజగజ వణుకుతూ లోనికి వచ్చి వంగి వంగి నమస్కారాలు చేసి చేతులు కట్టుకుని నిలబడ్డారట!

"తాసీల్దారు గారిని వెంటనే రమ్మని పిలుచుకురండి" అని ఒక మనిషిని పంపాడట!

"ఇప్పుడు నేను వచ్చిన తరువాత ఇక్కడ జరిగినదంతా మీరు స్వహస్తాలతో రాసి సంతకాలు చేసి - నాకివ్వండి" అన్నాడట! వాళ్లంతా - జరిగిందంతా - రాసి - సంతకాలు పెట్టి - యిచ్చి "క్షమించండి సార్! పొరపాటయిపోయింది" అని కన్నీళ్ల పర్యంతమై వాపోయారట! అంతలో తాసీల్దారు గారు వచ్చారు - ఉరుకులు - పరుగులతో!

తాసీల్దారు చేత గూడ - తను ఆఫీసుకు ఎన్ని గంటలుకు వచ్చిందీ - రాయించుకున్నాడట!

తాసీల్దారు కాళ్లా వేళ్లా పడితే-

"ఎందుకయ్యా! జరిగిందేగా! ఇందులో - ఏముంది?" అని వెళ్లిపోయాడట!

కాని - వాళ్ల మీద ఏమీ యాక్షన్ తీసుకోలేదట!

"ఈ వార్త తెలిస్తే చాలు గదా! మిగతా వాళ్లు ఒళ్లు దగ్గర పెట్టుకుంటారు గదా" అన్నాడు చంద్రశేఖర్!

చంద్రశేఖర్ జిల్లా కలెక్టరు గానూ - కె. రామచంద్రారెడ్డి జిల్లా యస్.పి.గానూ ఉన్నప్పుడు - జిల్లా ఎడ్మినిస్ట్రేషన్ ఎంతో బాగున్నదని - విజయవాడలో నా స్నేహితులు - మా బంధువులు (మాది ముత్యాలంపాడేగా) ఎంతోమంది చెప్పేవాళ్లు!

కాని సిన్సియర్‌గా పని చేసే ఆఫీసర్లంటే ఈ రాజకీయ నాయకులకి గిట్టదుగా! వాళ్లు చెప్పినట్టు వినాలి. లేకపోతే తమ పలుకుబడి ఉపయోగించి ట్రాన్స్‌ఫర్ చేయిస్తారు.

దేశానికి రాజకీయనాయకులు చేసినంత ద్రోహం మరెవ్వరూ చేయలేదండి!

అప్పుడు బ్రహ్మానందరెడ్డి ముఖ్యమంత్రి. కృష్ణాజిల్లా రాజకీయ నాయకుల వత్తిడి వల్ల - చంద్రశేఖర్‌ని - హైద్రాబాద్‌కు సెన్సస్ కమీషనర్‌గా బదిలీ చేశారు. సెన్సస్ - అంటే - జనాభా లెక్కలు చూడడం!

అతను హైద్రాబాద్ బదిలీ అయిన తరువాత - నేను ఒకసారి హైద్రాబాద్ వెళ్లాను - ఏదో పనిమీద! నేను సామాన్యంగా మదరాసు నుంచి కదిలేవాణ్ణిగాదు. హైద్రాబాద్‌లో నాకేం పని?

హైద్రాబాద్‌లో చంద్రశేఖర్ ఆఫీసుకు వెళ్లాను. చాలా చిన్న ఆఫీసు! స్టాఫ్ చాలా తక్కువ!



"ఏం చంద్రశేఖర్! ఏమిటి? యింత చిన్న ఆఫీసులో నువ్వు చేసే పనేముంటుంది?" అన్నాను.

"ఇది గవర్నమెంటు ఉద్యోగం! వాళ్లు ఎక్కడికి వెళ్లమంటే అక్కడికి వెళ్లవలసిందే! నాదేం పోయింది! ఇక్కడ నాకూ హాయిగానే వుంది! పని తక్కువ! ప్రొద్దున్నే బ్రేక్‌ఫాస్ట్ తీసుకుని కారులో - పిల్లల్ని స్కూల్లో డ్రాప్ చేసి - ఆఫీసుకు వస్తాను! సాయింత్రం 5 గంటలకి - పిల్లల్ని స్కూలు నుంచి ఇంటికి తీసుకెళతాను! ఒక కప్పు టీ - ఏవైనా స్నాక్స్ తీసుకుని క్లబ్‌కి వెళ్లి టెన్నిస్ ఆడుకుంటాను. రాత్రికి యింటికి పోతాను! హాయిగా వుంది!" అన్నాడు.

తరువాత అతనికి - ఢిల్లీ నుంచి - ఆలిండియా సెన్సస్ కమీషనర్‌గా ఢిల్లీకి రమ్మని ఆఫర్ వచ్చింది. అతను రాను అనవచ్చు! కాని - పోయి చీఫ్ మినిస్టరుకు యీ విషయం చెబితే - సిన్సియర్ ఆఫీసరు గదా! సెంటర్‌కు పంపడమెందుకు? ఇక్కడే ఉంచుకోవచ్చు అని అంటాడేమోనని - వెళ్లి ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డి దగ్గరకు వెళ్లి విషయం చెప్పాడట! "సెంటర్‌కి ఎందుకు? ఇక్కడే వుండు" అంటాడేమోనని! కాని ముఖ్యమంత్రి "అలాగా! వెళ్లు! విష్ యు ఆల్ ది బెస్ట్" అన్నాడట!

అప్పుడు ఢిల్లీకి వెళ్లాడు! ఆలిండియా సెన్సస్ కమీషనర్‌గా చాలా రిసెర్చిచేసి - యు.యన్.ఓ.కి కొన్ని విలువైన పేపర్లు సబ్‌మిట్ చేశాడు. అక్కడ గూడ మంచి ఆఫీసరుగా మంచి పేరు తెచ్చుకున్నాడు.

అంతలో - కేంద్రంలో మొరార్జీ నాయకత్వంలో జనతా ప్రభుత్వం వచ్చింది. అప్పుడు - చంద్రశేఖర్ - సెన్సస్ నుంచి బదిలీ అయి హెల్త్ సెక్రటరీగా వున్నాడు. జనతా ప్రభుత్వంలో రాజ్‌నారాయణ్ హెల్త్ మినిస్టరుగా వచ్చాడు. అతనొక చపలచిత్తుడు. ఎలక్షన్లలో యు.పి.లో ఇందిరాగాంధిని ఓడించాడనుకుంటాను!

అతను 'ఏ-సబ్-హిందీమే-చల్‌నా' అని పిచ్చిపిచ్చిగా మాట్లాడడం మొదలెడితే 'వీడితో నాకెందుకు గొడవ! నన్ను నా హోమ్ స్టేట్ - ఆంధ్రకు పంపించేయండి' అని అడిగాడట చంద్రశేఖర్!

"అక్కర్లేదు! 'హెల్త్' కాకుండా - వేరే శాఖకు బదిలీ చేస్తామ"న్నారట! "లేదు! నాకు ఆంధ్ర మీద గాలి మళ్లింది! పోతాను!" అంటే అప్పుడు చంద్రశేఖర్ ఆంధ్రాకి రెవిన్యూ సెక్రటరీగా వచ్చాడు.

నాకు ఒక అలవాటు ఉండేది. నేను మదరాసులో సినిమా రంగంలో ఉండి - బయట ఊళ్లకు వెళ్లేవాణ్ణిగాదు! అందుకని - స్నేహితులందరినీ ఏటా - తెలుగు ఉగాది శుభాకాంక్షలు పంపేవాణ్ణి. అలా మిత్రులతో కాన్‌టాక్ట్‌లో వుండేవాణ్ణి!

చంద్రశేఖర్ రెవిన్యూ సెక్రటరీగా వచ్చానని - నాకు మదరాసు ఉత్తరం రాశాడు. నేను ఏదో పని మీద హైద్రాబాద్ వచ్చి హోటల్ 'సరోవర్'లో బసచేసి చంద్రశేఖర్‌కు - సెక్రటేరియట్‌కు ఫోన్ చేశాను!

"రండి! రాజుగారు! నేను ఫ్రీగానే వున్నాను" అన్నాడు.

"నాకు హైద్రాబాద్‌లో ఏమూల ఏముందో తెలీదయ్యా! నీ సెక్రటేరియట్ ఎక్కడో నాకు తెలియదు" అన్నాను.

"మీరిప్పుడు ఎక్కడ నుంచి మాట్లాడుతున్నారు?" అన్నాడు.

"హోటల్ 'సరోవర్' నుంచి" అన్నాను.

అతను పకపక నవ్వి - సరిగ్గా మీ హోటల్‌కు ఎదురుగానే సెక్రటేరియట్" అన్నాడు.



అతని ఆఫీసుకు వెళ్లాను చాలా కాలం తరువాత కలిశాం గదా! ఎన్నో పాత కబుర్లు చెప్పుకున్నాం!

"మీకు గుర్తుందా రాజుగారు! మీరు బి.ఏ. పరీక్షల్లో తెలుగు పేపరు - నాపెన్ - పార్కర్ - డ్యూఫోల్డ్‌తో రాశారు?" అన్నాడు.

"జ్ఞాపకం ఉంది చంద్రశేఖర్! ఆరోజు నీ పెన్ లేకపోతే తెలుగు పేపరు - ఒక్క బిట్టు గూడ వదలకుండా కంప్లీట్ చేయగలిగేవాణ్ణి గాదు! అందుకే - నీ పుణ్యమా అని నాకు తెలుగులో యూనివర్సిటీ ఫస్టు - గోల్డ్ మెడల్ వచ్చింది" అన్నాను.

ఇంకా - ఉభయుల కుటుంబ విషయాలు మాట్లాడుకున్నాం! అతనికి - ఢిల్లీలోనే - ఒకసారి హార్ట్ఎటాక్ వచ్చిందని చెప్పాడు!

డాక్టర్ల సలహా మన్నించకుండా - ఆ సంవత్సరం - గోదావరి పుష్కరాలు ఏర్పాట్లు చూడడానికి రాజమండ్రి వెళ్లి తిరిగి వస్తూ రైలులో తాడేపల్లి గూడెం దాటగానే హార్ట్ఎటాక్ వచ్చి - విజయవాడ వచ్చేసరికి రైల్లోనే చనిపోయాడు.

లయోలా కాలేజీలో 'రాణాప్రతాప్' నాటకం విషయం చెబుతూ చంద్రశేఖర్ గురించి చెప్పవలసి వచ్చింది.

1941లో - నా బి.ఏ. చదువు పూర్తి కావడంతో బెజవాడ వచ్చేశాను. మా రాంమామయ్య నన్ను 'లా' చదవమన్నాడు. నాకెందుకో 'లా' అంటే ఒక రకమైన అయిష్టం! తెలుగు ఎం.ఏ. ప్రయివేటుగా చదివి - పరీక్ష రాయవచ్చు! ఆ పని చేద్దాములెమ్మనుకున్నాను. కొంత వరకు ప్రిపేర్ అయ్యాను. కాని - మళ్లీ అనిపించింది. ఎం.ఏ డిగ్రీ వస్తే ఏమిటి జరిగేది. మహా అయితే బడిపంతులు అవుతాను. అసలు - ఉద్యోగం చేసే ఆలోచనేలేదు.

అప్పుడు - సత్యనారాయణపురంలో ఇల్లు కట్టి - 1942 జనవరిలో గృహప్రవేశం చేశాం! ఆ స్థలం - వెయ్యి గజాలు - నేను మైనర్‌గా ఉండగా 1927లో నాపేర - నా డబ్బుతో - మా మేనమామలు కొన్నారు. దానితో పాటు 500 గజాలు వాళ్ల జాయింటు కుటుంబానికి కొన్నారు!

అప్పటివరకు - మా కుటుంబానికి (అంటే - నేను - మా అమ్మ - మా అక్కయ్య) మా కోసం ముత్యాలంపాడులో మా తాతయ్య గారి స్థలంలోనే 1926-27 ప్రాంతంలో ఇటుక గోడలు - పైన పూరికప్పుతో - ఒక ఇల్లు కట్టించియిచ్చారు. అందులో ఉండేవాళ్లం. నేను బి.ఏ పూర్తి చేసేవరకు.

సత్యనారాయణపురంలో ఇల్లు - మా ఆదిమామయ్యే కట్టించాడు. నా స్థలం పక్కనే వాళ్లది 500 గజాలుంది గదా! అందులో ఒక చిన్న పెంకుటిల్లు కట్టుకుని - అందులో ఉండేవాడు ఆయన ఆయన భార్య! వాళ్లకు పిల్లలు లేరు. అప్పుడు - నా యిల్లు - డాబా - ఖరీదు 11 వేలు!

1942 నుంచి - 1945 వరకు - నా కార్యక్రమం ఏమిటంటే మా స్వగ్రామం తాళ్లూరు - అప్పుడప్పుడు వెళ్లి భూముల కౌలు వసూళ్లు చేసుకోవడం - జింఖానాక్లబ్బులో - బిలియర్డ్స్ ఆడుకోవడం చీట్లపేక నాకు ఎప్పుడూ అలవాటు లేదు!

1942 క్విట్ ఇండియా ఉద్యమం గదా! అప్పుడు కాంగ్రెసు కమ్యూనిస్టు పార్టీలు రెండే ప్రధాన పార్టీలు!

ఇదివరకే చెప్పాను గదా - నన్ను కమ్యూనిస్టు పార్టీలో చేరమని సత్తెనపల్లిలో కమ్యూనిస్టులు - ఆంజనేయశాస్త్రి లాంటి మిత్రులు ప్రయత్నాలు చేశారు!



కాని - నాకు రాజకీయాల గురించి - మంచి అవగాహన ఉండేది. అందుకు కారణం - బి.ఏ లో నా గ్రూపు ఎకనామిక్స్ మెయిన్ - పాలిటిక్స్, ఇండియన్ హిస్టరీ సబ్సిడియరీ!

హైస్కూలులో - శిష్టా లక్ష్మీకాంత శాస్త్రిగారి దయవల్ల నాకు తెలుగులో ఎలా గట్టి పునాది పడిందో-

అలాగే - లయోలా కాలేజీలో పాలిటెక్స్ లెక్చరర్ డా॥ అప్పాదొరై అని ఉండేవాడు. తరువాత ఆయన ఢిల్లీ వెళ్లి తేజ్‌బహద్దూర్‌సప్రు - జయకర్లు స్థాపించిన - ఇండియన్ కౌన్సిల్ ఫర్ వరల్డ్ ఎఫైయిర్స్‌కి సెక్రటరీగా పని చేశాడు. నాకు పాలిటిక్స్‌లో ఆసక్తి కలగడానికి - అప్పాదురై కారణం! అంత బాగా చెప్పేవాడు. లెక్చరర్లకి ఒక సబ్జక్టు క్షుణ్ణంగా తెలియిడం వేరు దానిని విద్యార్థులకు బోధించడంవేరు. టీచింగ్ ఈజ్ ఆన్ ఆర్ట్!

పాలిటిక్స్ సబ్జక్టు విషయంలో - మరో సంగతి చెప్పాలి! నోరి ఆదినారాయణ శర్మ అని - ఎకనామిక్స్ ఆనర్సు - చదువుతుండేవాడు. మా బ్లాక్‌లోనే ఉండేవాడు! తరువాత అతనికి బ్రహ్మాండమైన కెరియర్! అతను 1942లో - ఫైనల్ ఆనర్సు ప్యాసయి మదరాసు యూనివర్సిటీలో స్కాలర్‌షిప్ మీద పి.హెచ్.డికి చేరాడు. పి.జె. థోమస్ -హెడ్ అఫ్ ఎకనామిక్స్ డిపార్ట్‌మెంటు ఇన్ ది యూనివర్సిటీ!

శర్మ Staunch Gandhian . 42 క్విట్‌ఇండియా ఉద్యమంలో పాల్గొని జైలుకు వెళ్లాడు. యూనివర్సిటీ స్కాలర్‌షిప్ పోయింది. అతని స్వగ్రామం కృష్ణాజిల్లా, ఉయ్యూరు! అతని తండ్రి రిటైర్డ్ హెడ్‌మాస్టరు!

శర్మ జైలు నుంచి విడుదలై నేరుగా విజయవాడలో మా ఇంటికి వచ్చాడు. నేను నవ్వుతూ "ఏం! శర్మగారూ! 'గాంధికి జై' అని జైలుకు పోయారు. స్కాలర్‌షిప్ పోగొట్టుకున్నారు" అన్నాను.

"ఆఁ - ఈ మాత్రం స్కాలర్‌షిప్ నాకు ఎక్కడయినా వస్తుంది" అని మా ఇంటి దగ్గర నుంచే బొంబాయి యూనివర్సిటీకి అప్లికేషన్ పెట్టాడు. అప్పుడు సి.ఎన్. వకీల్ అని - బొంబాయి యూనివర్సిటీలో హెడ్ అఫ్ ది డిపార్ట్‌మెంటు. శర్మ మార్కులు చూచి - వెంటనే రమ్మని - వకీల్ ఉత్తరం రాశాడు. శర్మకి ఒక్క పేపర్లో తప్ప మిగతా అన్ని ఇన్‌డివిడ్యుయల్ పేపర్సులో ఫస్ట్ మార్క్. అన్నీ కలిసి ఫస్టు రావడం సర్వసాధారణం! ఇతనికి ఇన్‌డివిడ్యుయల్ పేపర్సులో ఫస్టు!

బొంబాయి వెళ్లి పిహెచ్.డి చేశాడు. రిజర్వు బ్యాంకులో ఉద్యోగం వచ్చింది. ఆ తరువాత వాషింగ్‌టన్‌లో వరల్డ్ బ్యాంకులో మూడేళ్లు - ఐ.యం.యఫ్.లో మూడేళ్లు పనిజేశాడు. తిరిగి యిండియాకి వచ్చి - రిజర్వు బ్యాంకులో చేరాడు. ఇందిరాగాంధి ప్రధానిగా ఉన్నప్పుడు - శర్మను భారతప్రభుత్వ ఆర్థిక సలహాదారును చేయాలని సూచన వచ్చింది. ఆమె చెప్పినట్టు వినేవాళ్లు కావాలి! శర్మ చాలా ఇన్‌డిపెన్‌డెంటు! ఎవరికీ తలవొగ్గే రకం కాదు! అందువల్ల ఆ పదవి రాలేదు.

అంతకుముందు - నెహ్రూ మంత్రివర్గంలో ఉన్న - సి.డి. దేశ్‌ముఖ్ (ఆయన అంతకుముందు రిజర్వు బ్యాంకు గవర్నరు) శర్మను - ఢిల్లీ తీసుకుపోయాడు. తరువాత - మొరార్జీదేశాయ్ - ఆర్థికమంత్రి గా - గోల్డ్‌కంట్రోల్ పెట్టినపుడు శర్మ - గోల్డ్ కంట్రోల్ బోర్డు సహాయ కార్యదర్శిగా నియమింపబడ్డాడు. గోల్డ్ కంట్రోల్ బోర్డులో పనిచేసేటప్పుడు - నాకు ఢిల్లీ నుంచి ఉత్తరం రాశాడు. అది 1952. అప్పుడే - సినిమాల్లో చేరి - మదరాసులో మకాం పెట్టాను కుటుంబంతో!

నేను ఎయిర్‌పోర్టుకి వెళ్లాను శర్మను రిసీవ్ చేసుకోవడానికి! గోల్డ్ కంట్రోల్ ఆఫీసరుగదా - అందుకని -





నోరి ఆదినారాయణ శర్మ

మదరాసులోని - నగల వ్యాపారస్తులు ఉమ్మిడియార్ - మొదలైన వాళ్లు ఎయిర్‌పోర్టుకి వచ్చారు. శర్మను రిసీవ్ చేసుకోడానికి! వాళ్లందరూ - తమను తాము అతనికి పరిచయం చేసుకుని 'మాకారెక్కండి' 'మాకారెక్కండి' అని పోటీపడుతుంటే శర్మ "అక్కర్లేదు" అని నా కారులో వచ్చికూర్చున్నాడు! నగల వ్యాపారస్తులంతా తెల్లబోయారు 'వీడెవడురా' అని నా వంక చూశారు! నేనప్పుడు అనామకుణ్ణి గదా!

బీచ్‌లో హైకోర్టుకు దగ్గర్లో రిజర్వు బ్యాంకు బిల్డింగ్ వుంది. దాని పై అంతస్తులో - గెస్టు రూంలో - శర్మ దిగాడు.

కాలేజీలో - నా పాలిటిక్స్ చదువు సందర్భంగా గదా శర్మ విషయం వచ్చింది. మళ్లీ వెనక్కి వెళదాం!

నేను బి.ఏ. సెకండు ఇయర్ చదివేటప్పుడు శర్మ ఫోర్త్ ఆనర్సు! తెలుగు ఎసోసియేషన్‌కు నేను సెక్రటరీగా ఉండాలని - మిత్రులందరి కోరిక! కాని - అందుకు - మా తెలుగు లెక్చరర్ - చల్లా సత్యనారాయణ గారు ఒప్పుకోలేదు!

"ఈ సంవత్సరం నీకు యూనివర్సిటీ పరీక్షలుంటయ్! నువ్వు ఎసోసియేషన్ పనిలో అటూయిటూ తిరుగుతుంటే - నీ చదువు దెబ్బతింటుంది." అని ఆయన అభ్యంతరం!

ఆ సంవత్సరం - శర్మగారికి - ఫోర్తు ఆనర్సు గదా! పబ్లిక్ పరీక్ష ఉండదు! అందుకని - శర్మగారిని సెక్రటరీ చేసి - నేను సహాయకార్యదర్శిగా - ముఖ్యంగా నాటక శాఖ చూసుకుంటానంటే - మాస్టారు ఒప్పుకున్నారు. శర్మగారు కాలేజీ ఎసోషియేషన్‌కు గూడ కార్యదర్శిగా ఎన్నికయ్యాడు.

అసలు చెప్పదల్చుకున్న విషయమేమిటంటే శర్మ క్లాసులో ఎప్పుడూ ఫస్టు! విచిత్రమేమిటంటే - అందరం ఒకే బ్లాక్‌లో ఉండేవాళ్లం గదా! ఎప్పుడు చదివేవాడో రాత్రి! మా అందరికంటే ముందు నిద్రపోయేవాడు. ఉదయం మా అందరికంటె లేటుగా లేచేవాడు. అసలు రహస్యం ఏమిటంటే అర్ధరాత్రి పూట లేచి - రెండు - మూడు గంటలు చదివి మళ్లీ నిదరపోయేవాడు. ఎందుకని అడిగితే "ఆ టైంలో చాలా 'కామ్'గా ఉంటుంది. బాగా చదువుకోవచ్చు - డిస్టర్‌బెన్స్ లేకుండా!" అనేవాడు.



నేను - ఎకనామిక్స్ పేపరుకిగాని పాలిటిక్స్ పేపరుకిగాని శర్మని కొన్ని కొటేషన్స్ రాసివ్వమనేవాణ్ణి. అంటే మా pass course కంటే Honours course వాళ్లు ఎక్కువ పుస్తకాలు చదువుతారు గనక గొప్పగొప్ప ఆథర్స్ చెప్పిన కొటేషన్స్ రాసి ఇచ్చేవాడు. ఆ కొటేషన్స్ ఎగ్జామ్ పేపరులో ఎక్కడో ఎలాగో యిరికించి నేను చాలా పుస్తకాలు చదివినట్టు impression ఇచ్చి రాసేవాణ్ణి!

శర్మగారూ - నేను చాలా సన్నిహితంగా వుండేవాళ్లం! మాది 10వ బ్లాక్! పైన 13 గదుల్లో - 8 మంది తెలుగు వాళ్లం ఉండేవాళ్లం! ఒక చివర శర్మగారు! ఆ తరువాత - చంద్రశేఖర్ - కృష్ణమూర్తి రెడ్డి - నరసింహారెడ్డి (ఇతను తరువాత చిత్తూరు నుంచి ఎం.పి అయినాడు) వుడ్ - సూర్యనారాయణ - ఆ తరువాత నేను - నా తరువాత కొండముది గోపాలరాయశర్మ! ఈ 8మందిలో ముగ్గురం - నేను - శర్మ - గోపాలరాయశర్మ మాత్రం శాకాహారం! మిగితావాళ్లు నాన్‌వెజ్. మెస్‌లో భోంచేసేవారు. మేము ఆంధ్రమెస్‌లో భోంచేసేవాళ్లం! రోజూ - నేనూ - శర్మగారూ కలిసి - భోజనానికి వెళ్లే వాళ్లం! పక్కపక్కనే కూర్చుని భోంచేసే వాళ్లం!

అప్పటి నుంచి - యిప్పటి వరకు (2005 సెప్టెంబరు) మా స్నేహం అలానేవుంది. ఆయన జూబ్లిహిల్స్‌లో ఇల్లు కట్టుకుని ఉంటున్నాడు. అప్పుడప్పుడు కలుసుకుని - కబుర్లు చెప్పుకుంటుంటాం!

శర్మగారు చాలా ఆర్థడాక్స్ man! జన్మలో మద్యమాంసాలు ముట్టుకుని ఎరగడు! వాషింగ్టన్‌లో వున్నప్పుడు గూడ లండన్ నుంచి - మిత్రుల ద్వారా - కందిపప్పు తెప్పించుకునేవాడు. ఇప్పుడు అన్నీ దొరుకుతున్నయ్‌గాని - అప్పుడు వాషింగ్టన్‌లో కాకరకాయ దొరికితే పండగలా ఉండేదట!

ఆదినారాయణశర్మగారు - పదవుల్లో చేరిన తరువాత డా॥ ఎన్.ఎ. శర్మగా దేశవిదేశాల్లో ప్రసిద్ధ ఆర్థిక శాస్త్రవేత్తగా నీతి - నిజాయితీ - క్రమశిక్షణకు ప్రతీకగా పేరు తెచ్చుకున్నాడు. ఇందిరాగాంధి హయాంలో - తనకంటె జూనియర్‌ను రిజర్వుబ్యాంక్ గవర్నరుగా నియమించినందుకు - నిరసనగా పదవికి రాజీనామా చేశాడు. తరువాత బెంగుళూరులోనూ - దుబాయిలో యునైటెడ్ యారబ్ ఎమిరేట్స్‌కు కరెన్సీ బోర్డ్ ఛైర్మెన్‌గా పని చేశాడు.

నాకు - గర్వించదగిన మిత్రుడు!

మళ్లీ నా నాటకాల చరిత్రకి వద్దాం!

1942లో - విజయవాడ సత్యనారాయణ పురంలో ఇల్లు కట్టినప్పటి నుంచి 1945 వరకు - నాటకాల ప్రమేయం లేదు!

నా భార్య హిస్టీరియా వ్యాధిగ్రస్తురాలని చెప్పాగదా! ఎన్ని వైద్యాలు చేయించినా లాభం లేక పోయింది. బిడ్డను కంటే - ఆరోగ్యంలో మార్పు వస్తుంది అన్నారు. 1944 'మే'లో ఒక ఆడపిల్ల పుట్టి నాలుగయిదు రోజుల్లో పోయింది. తల్లి ఆరోగ్యంలో ఏమీ మార్పు రాలేదు. పైగా కొన్ని కుటుంబ వ్యవహారాల వల్ల మానసికంగా కలతపడి హిస్టీరియా ఎక్కువైంది. 1946 జనవరిలో ఆమెకు ప్రకృతి వైద్యం నిమిత్తం పశ్చిమగోదావరి జిల్లా భీమవరం ప్రకృతి ఆశ్రమానికి తీసికెళ్లినట్టు - ఇది వరకే చెప్పాను గదా!

అక్కడ గుంటూరు జిల్లా బాపట్ల నివాసి అయిన వి.యల్. సుందర్రావుతో పరిచయమైంది. అతని తండ్రి రిటైర్డ్ హెడ్ కానిస్టేబుల్. పక్షవాతం వచ్చింది. ప్రకృతి ఆశ్రమం డాక్టరు గారిది కూడ బాపట్ల తాలూకా అయినందువల్ల ఆ పరిచయంతో సుందర్రావు తండ్రిని ఆశ్రమంలో చేర్చాడు. అతని తల్లి అక్కడే ఉండేది.



సుందర్రావు స్వాతంత్ర్య సమరయోధుడు. ఆచార్య యన్.జి రంగా గారి శిష్యుడు. 42- క్విట్‌యిండియా వుద్యమంలో పోలీసులు అరెస్టు చేసి రైలులో తీసుకెళుతుంటే - స్పీడుగా వెళుతున్న రైలులోంచి బయటికి దూకి తప్పించుకుని - పారిపోయాడు.

1946లో ప్రకృతి ఆశ్రమంలో నాకు పరిచయమైనప్పుడు అతను - ఇండియన్ నేషనల్ థియేటరు - ఆంధ్రశాఖకు కార్యదర్శి. బాపట్లలో ఒక సమాజాన్ని స్థాపించి - బుర్రకథలు నాటకాలు వేయించే కార్యక్రమం చేపట్టాడు.

అప్పుడు - సుభాస్ చంద్రబోస్ - ఇండియన్ నేషనల్ ఆర్మీ చాలా ప్రసిద్ధి పొందిన రోజులు. బాపట్లలో సుందర్రావు అధ్వర్యంలో 'చలో ఢిల్లీ' నాటకం తయారు చేస్తున్నారు! నాటకాలలో నా అనుభవాలు విన్న తరువాత సుందర్రావు నన్ను బాపట్ల తీసుకెళ్లి ఆ సమాజకార్యక్రమాలకు సలహాలు తీసుకునేవాడు. నేను రిహార్సల్స్‌లో సహాయపడేవాణ్ణి! ఆ నాటకంలో మాధవపెద్ది సత్యం (సినిమా ప్లేబ్యాక్ గాయకుడు) -స్టేజి నటుడు - కొండా శేషగిరిరావు - దేశభక్తి గేయాలు పాడేవారు.

'చలో ఢిల్లీ' నాటకాన్ని గురించి కొంత చెప్పాలి. సుందర్రావుకు - రాజకీయాలు - యువజన కాంగ్రెసుతో సంబంధాలు ఉండేవి. ఆ కారణంగా కర్నూలు జిల్లా - నంద్యాలలో - తాలూకా కాంగ్రెసు కమిటీ సహాయార్థం 'చలో ఢిల్లీ' నాటకం ప్రదర్శించడానికి ఏర్పాట్లు జరిగినై. నేనూ - నంద్యాల వెళ్లాను.

ఒక సినిమా హాలులో నాటక ప్రదర్శన! హాలు ప్రొప్రయిటరు ఒక ముస్లిం! తాలూకా కాంగ్రెసు వాళ్లు పార్టీ ఫండుకోసం ముందుగానే టిక్కెట్లు కాన్వాస్ చేసి అమ్మడం వల్ల-

నాటకం చూడ్డానికి - హాలు దగ్గరకు వచ్చిన - నాటకాభిమానులకు టికెట్లు దొరకలేదు. బయట 'హౌస్ ఫుల్ బోర్డు తగిలించారు!

దాంతో నిరాశ చెందిన అభిమానులు - హాలు మీద రాళ్లవర్షం కురిపించారు! హాలు యజమాని భయపడి "రేపు - సినిమా ప్రదర్శన రద్దుచేసి - ఈనాటకమే మళ్లీ రేపు గూడ వేయిస్తాను" అని చెప్పి సర్దుబాటు చేశాడు.

నాటకం అయిపోయింది. మరునాడు మాకు ఏదో ఒక మేడలో విడిది ఏర్పాటు చేశారు!

ఉదయం కాఫీలు టిఫిన్‌లు అయినై! మేడమీద కూర్చుని నాటకం విషయాలు మాట్లాడుకుంటున్నాం!

కింద - నాటకంలో జమిందారు వేషధారి - ఆచారి అతని పేరు - ఆలస్యంగా 12 గంటలకి నిద్ర లేచాడు. టిఫిన్ అయిపోయింది. కాఫీ గూడ చల్లారిపోయిన కాఫీ ఇచ్చారు. అతనికి కోపం వచ్చింది.

"నేను ఉండను! 2 గంటల రైలుకు వెళ్లిపోతాను" అని పెట్టె - బెడ్డు సర్దుకున్నాడు. యీ విషయం మేడ మీద ఉన్న మాకు తెలిసింది. సుందర్రావు గూడ మా దగ్గరే ఉన్నాడు..

"ఆచారి పోతే ఎలాగ? రాత్రికి నాటకం ఉందిగదా! వెళ్లి ఎలాగో - బ్రతిమాలి - నచ్చచెప్పు" అన్నాను సుందర్రావుతో! సుందర్రావు "ఏడిశాడు! ఎక్కడికి పోతాడు?" అని కుర్రవాడితో "స్టేషనకు వెళ్లడానికి - జట్కా పిలవబోకండి" అని ఆర్డరు వేశాడు.

ఆచారి - తనే వెళ్లి జట్కా తెచ్చుకుని - సామాను జట్కాలో వేసుకుని రైలు స్టేషన్‌కు బయలుదేరాడు!

"వెళ్లి - ఆపవోయ్! అని నేను సుందర్రావును తొందర పెట్టాను.



"పోతే - పోనియ్" అన్నాడు సుందర్రావు!

"మరి -రాత్రికి నాటకమో!" అన్నాను.

"వాడి వేషం - నువ్వు వెయ్! నీకు నాటకం అంతా వచ్చుగా" అన్నాడు. నేను ఆశ్చర్యపోయాను! "అదా నీ ధైర్యం?" అన్నాను.

"లేకపోతే - వాణ్ణి ఎవడు బతిమాలుతాడు! బాపట్ల వెళ్లాక వాడిపని చెబుతాను" అన్నాడు సుందర్రావు!

ఆ రాత్రి నాటకంలో జమిందారు వేషం వేశాను! కిందటి రాత్రి గూడ నాటకం చూసినవాళ్లు-

"రాత్రి వేసిన వాడికంటె - ఇవాళ వేసినవాడే బాగా చేశాడురా" అన్నారట కొంతమంది!

తరువాత - పదిపదిహేను రోజుల్లో భీమవరంలోనూ - పాలకొల్లులోనూ - తూర్పుగోదావరి జిల్లాలో రాజోలు తాలూకాలో 'మోరి' గ్రామంలో మూడు నాటకాలు - యిదివరకే ఒప్పుకున్నాడు సుందర్రావు.

నేను చెప్పాను - సుందర్రావుతో! ఆచారితో నైనా రాజీపడి ఒప్పించు! లేదా - మరొక నటుణ్ణి చూసుకో! నేను మాత్రం వెయ్యను!" అన్నాను!

సరేనన్నాడు! నేను భీమవరం వెళ్లిపోయాను!

నాటకం ముందు రోజు - సుందర్రావు నాటకసమాజంతో భీమవరం వచ్చి "ఆచారిని అడగదల్చుకోలేదు! ఆ వేషానికి ఇంకెవరూ దొరకలేదు! నీకు తప్పదు" అన్నాడు.

అలా - ఆ మూడు నాటకాలలో - జమిందారు వేషం వెయ్యక తప్పలేదు!

అంతటితో - ఆ అధ్యాయం ముగిసింది--

తరువాత అధ్యాయం 1948లో ప్రారంభమైంది. 1947 జూన్‌లో - నాభార్య ఆరోగ్యం కొంత బాగుపడటం వల్ల తిరిగి - విజయవాడకు మకాం మార్చాం!

ఆ క్రిందటి సంవత్సరం అనుకుంటాను - గుడివాడలో ఆంధ్రనాటక కళాపరిషత్తు సాంఘిక నాటక - నాటికల పోటీలు ప్రారంభమైనయ్!

అందులో నా క్లాస్‌మేట్ - కొండముది గోపాలరామశర్మ రాసిన 'ఎదురీత' నాటకం - ఉత్తమ నాటకంగా బహుమతి పొందింది.

దానిని - నెల్లూరు జిల్లా - వెంకటగిరికి చెందిన - ఎమెచూర్ ఆర్టిస్ట్స్ అసోసియేషన్ వారు ప్రదర్శించారు! దానికి సూత్రధారి - దర్శకుడు - ఆచార్య ఆత్రేయ! అతను నాటకంలో నటించాడు గూడ. టి.జి. కమలాదేవి హీరోయిన్!

1947 డిసెంబరులోనో - 48 జనవరిలోనో - నాటక కళాపరిషత్తు నాటకపోటీలు - విజయవాడలో - దుర్గాకళామందిరంలో జరిగినయ్. బొంబాయి నుంచి - ప్రసిద్ధ సినీదర్శకుడు వి. శాంతారాం - ముఖ్యఅతిధిగా వచ్చాడు. వెంకటగిరి అసోసియేషన్ వారు ఆత్రేయ రాసిన 'ఈనాడు' నాటకం వేశారు. ప్రథమ బహుమతి వచ్చింది.

ఆ పోటీలలో - పాలకొల్లుకు చెందిన - మల్లాది సత్యనారాయణ 'పేదపిల్ల' అనుకుంటాను నాటకం వేశాడు.



ఆంధ్రప్రభ ఎడిటర్ నార్ల వెంకటేశ్వరరావు గారు అంతకుముందు - 'కొత్తగడ్డ' అనే నాటికా సంపుటిని రాసి ప్రచురించాడు. ఆ సంపుటిలోనివి - రెండో మూడో నాటికలు ప్రదర్శించారు.

జగ్గయ్యగారు - గుంటూరుజిల్లా - ప్రజానాట్యమండలిలో నటించారు!

విజయవాడ ప్రజానాట్యమండలివారు - ఒక నాటకం ప్రదర్శించారు! పేరు జ్ఞాపకం లేదు! అందులో ప్రముఖనటుడు 'పెరుమాళ్లు' ఆడవేషం వేశాడు.

యన్.టి. రామారావు గారు - కొప్పరపు సుబ్బారావు గారు రాసిన 'చేసిన పాపం' ప్రదర్శించారు!

ఆ నాటకం చూసేననుకుంటాను. యల్.వి. ప్రసాద్‌గారు, యన్.టి. రామారావు గారిని సినిమాలకి తీసుకెళ్లి 'మనదేశం'లో వేషం వేయించారనుకుంటాను.

ఆ నాటకాలన్నీ చూసిన తరువాత మళ్లీ నాకు నాటకాల మీద గాలి మళ్లింది!

ఆ మరుసటి సంవత్సరం - అంటే 1949 ఏప్రిల్ - మే నెలల్లో ఆంధ్రనాటక కళా పరిషత్తు - నాటకపోటీలు ఏలూరులో జరుగుతయ్యని ప్రకటించారు.

సామాన్యంగా ఏప్రిల్ - మే నెలలో పోటీలు ఎందుకు నిర్వహించేవారంటే - ఆ నెలల్లో - స్కూళ్లకు వేసవి సెలవలిస్తారు గనక పోటీలలో పాల్గొనే నాటక సమాజాలకి లాడ్జింగ్ - ఆ ఊరి స్కూలు భవనాలలో ఏర్పాటు చేయడానికి వీలుగా ఉంటుంది కాబట్టి.

ఏలూరు వెళ్లి - నాటకాలు చూడాలని - నా తపన! ఉండడానికి - ఏలూరులో అప్పుడు మంచి లాడ్జీలుగాని - హోటళ్లు గాని లేవు. దగ్గర బంధువులూ లేరు. వెళ్లి ఎక్కడ ఉండాలి?

అప్పుడు ఒక ఆలోచన వచ్చింది. ఒక చిన్ననాటిక రాసి పోటీకి పంపిస్తే బోర్డింగ్ అండ్ లాడ్జింగ్ ఫ్రీ గదా!

ఎక్కువ పాత్రలు ఉంటే - నటుల కోసం వెతుక్కోవాలి. ఆడవేషాలు అసలే ఉండగూడదు! ఆడవేషాలు వేసే నటీమణులు - విజయవాడలో నాకు తెలిసినవాళ్లు ఎవరూ లేరు! పోనీ ఏ గుడివాడ నుంచో గుంటూరు నుంచో - తీసుకు వద్దామంటే - రిహార్సల్సు వేసినన్నాళ్లు విజయవాడలో వాళ్ల వసతి - భోజనాలు ఖర్చులు - పైగా పారితోషికం! చాలా అవుతుంది! మనం నాటకాలు వేసేది సరదా కోసం! సంపాదన లేదు!

అందుకని - ఒక రాత్రి కూర్చుని - ఒక చిన్న నాటిక రాశాను. మూడే మగపాత్రలు! ఆడవేషాలు లేవు!

నేను 1938లో గుంటూరు హిందూ కాలేజీలో భమిడిపాటి కామేశ్వరరావు గారి "ఎప్పుడూయింతే" నాటికలో నటించిన ముగ్గురం - నేనూ - గుంటూరు రవి - జగన్నాథ్! బస్! సమస్య తీరిపోతుంది.

నాటక కళాపరిషత్తు ఆఫీసు - విజయవాడ గాంధీనగర్‌లో - విజయా పిక్చర్స్ డిస్ట్రిబ్యూటర్ల ఆఫీసే!

నాటకాల ప్రతులు అందజేయవలసిన ఆఖరు తేదీన ఒక రోజు ముందు - నా నాటిక రాతప్రతి తీసుకెళ్లి - పరిషత్తు ఆఫీసులో ఇచ్చి రసీదు తీసుకున్నాను.

స్క్రూటినీ - అంటే - ప్రదర్శన చూపవలసిన తేదీ అడిగితే చెప్పారు!

వెంటనే గుంటూరు వెళ్లి రవికి - జగన్నాథ్‌కి విషయం చెప్పాను. వాళ్లిద్దరూ సరేనన్నారు!



స్క్రూటినీ తేదికి ముందు రోజు - పరిషత్తు ఆఫీసుకు వెళ్లి "నా నాటిక ప్రదర్శన ఎప్పుడు చూస్తారు?" అని అడిగాను!

"ప్రదర్శన అక్కర్లేదండి! కమిటీ మెంబర్లు నాటిక చదివారు! బాగుంది అని - సెలెక్ట్ చేశామని చెప్పమన్నారు" అని ఆఫీసులో చెప్పారు! అబ్బ! పెద్ద రిలీఫ్!

నా దగ్గర నాటిక రెండో కాపీలేదు!

కాపీ చేసుకుని - తిరిగి యిస్తానని చెప్పి - పరిషత్తు ఆఫీసు నుంచి నా రాతప్రతి తీసుకున్నాను.

కాపీ చేసే ఓపిక గూడ లేదు!

గుంటూరు వెళ్లి - జగన్నాథ్‌కి యిచ్చాను - 'కాపీ చెయ్యరా' అని! మూడు రోజుల తరువాత మళ్లీ గుంటూరు వెళ్లి జగన్నాథ్‌ని అడిగాను "కాపీ చేశావా?" అని.

"చేశాను! నాటిక బాగానే ఉంది! కాని - పేరు మార్చాను" అన్నాడు.

నేను నాటికకు పెట్టిన పేరు 'సత్యం వధ'. 'సత్యం' హీరో పేరు. "ఆ పేరు కంటె - 'అంతర్వాణి' బాగుందనిపించి ఆ పేరే ఖాయం చేసి - వ్రాత ప్రతి ఒకటి తీసువెళ్లి పరిషత్తు ఆఫీసులో ఇచ్చేశాను!

ఆంధ్రనాటక కళా పరిషత్తుకు - పర్మనెంటు అధ్యక్షులు - ఉయ్యూరు జమిందారు యం.ఆర్. అప్పారావు గారు. సెక్రటరీ - తాడేపల్లి గూడెం నివాసి - పసల సూర్యచంద్రరావుగారు. వైస్ ప్రెసిడెంటు - గుడివాడ కాజ వెంకట్రామయ్య గారు!

నాటక కళా పరిషత్తుకు ప్రాణం కాజ వెంకట్రామయ్యగారు. ఆయనే లేకపోతే ఆ రోజుల్లో పరిషత్తే లేదు. పరిషత్తు ఫలాన ఊళ్లో జరపాలంటే - ముందుగా ఆ ఊరు వెళ్లి ఆ ఊరి ప్రముఖులతో మాట్లాడి ఆహ్వాన సంఘాన్ని ఏర్పాటుచేసి నాటక సమాజాల వాళ్లకి వసతులు వగైరాలు స్వయంగా చూసేవారు వెంకట్రామయ్యగారు. నాటకాలంటే అంత అభిమానం ఆయనకు! ఆయనికి గుడివాడలో ఒక సినిమా హాలు ఉండేది. ఆంధ్రదేశంలో మొట్టమొదట సినిమాహాల్సు నడిపిన వాళ్లలో ఆయన ఆద్యుడు.

"పరిషత్తు నాటకాలు చూద్దాం - రండిరా" అంటే - రవి - జగన్నాథ్ 'అంతర్వాణి' ప్రదర్శన రోజుకి వస్తాంలే అన్నారు!

నేను ఏలూరు బయలుదేరుతుంటే నా భార్య "నేను గూడ వస్తానంది. అప్పుడు ఆమె గర్భవతి! ఆరోనెలో ఏడోనెలో! పైగా వేసవి ఎండలు! "మాకంటే - ఏ స్కూలులోనో లాడ్జింగ్ ఏర్పాటు చేస్తారు! ఉండడానికి మంచి హోటల్స్ గూడ లేవు. నువ్వు రావద్దు!" అన్నాను. నేను ఏలూరు వెళ్లిపోయాను!

నాటకాల పోటీలు మొదటి రోజు! నేను హాలు దగ్గరికి వెళ్లేసరికి - ఆడవాళ్ల సీట్లలో - నా భార్య - బొందలపాటి శకుంతల కూర్చుని వున్నారు. నాకు ఆశ్చర్యం వేసి - వాళ్ల దగ్గర కెళ్లాను! నేను అడగక ముందే తెలిసిన వాళ్లున్నారు. ఈ ఊరు మహిళామండలి ఆఫీసులో గదులున్నాయ్! అందులో ఉంటాంలెండి" అన్నది!

నాకు ఒక భయం ఏమిటంటే పరిషత్తు నాటకపోటీలు నాలుగు రోజులు! ఒకవేళ నా నాటిక మొదటిరోజే ప్రదర్శించాల్సి వచ్చిందనుకోండి! అది బాగుండకపోతే - పరిషత్తు నాలుగు రోజులు ప్రేక్షకుల్లో ఎవరైనా " ఒరేయ్!



వీడేరోయ్ 'అంతర్వాణి' రైటరు, నటుడు" అని ఎగతాళి చేస్తారేమోనని భయం!

అదృష్టవశాత్తు పరిషత్తు ప్రోగ్రాంలో నా నాటిక చివరిరోజు రాత్రి చివరి నాటికగా పడింది. "అబ్బ! బతికానురా బాబు!" అనుకున్నాను.

అంటే ఏమిటన్నమాట "మా నాటిక - చివరి రోజువుంది చూడండి" అని కాలర్ పైకెత్తుకుని నాలుగు రోజులు గర్వంగా తిరగవచ్చునన్న మాట!

మూడు రోజులు నాటకాలు చూశాం! నాలుగోరోజు రాత్రికి ఆఖరు నాటికమాది! గుంటూరు నుంచి - రవి - జగన్నాధ్ - ఆరోజు ఉదయమే వచ్చారు! నాటిక ప్రదర్శించాం!

తరువాత - జడ్జీలు కూర్చుని - ఉత్తమ నాటక - నాటికలు ఉత్తమ నటీనటులను తేల్చుస్తారన్నమాట!

ఆ కాసేపు - ఏదో డ్యాన్స్ ప్రోగ్రాం వుంటుంది.

జడ్జీలు - బహుమతులు ప్రకటించారు!

ఆత్రేయ యన్.జి.వో నాటకం ఉత్తమ ప్రదర్శనగా బహుమతి వచ్చింది.

గోపాలరామశర్మ 'గౌతమబుద్ధ' నాటకం రాశాడు. అందులో 'బుద్ధుడు'గా రామశర్మ నటించాడు. అతను తరువాత సినిమాల్లో హీరోగా నటించాడు.

అన్నిటికంటే - విచిత్రం ఏమిటంటే - నాటకాలు చూడడానికి ఫ్రీ బోర్డింగ్ అండ్ లాడ్జింగ్ కోసం రాసిన నా "అంతర్వాణి" నాటికకు సెకండ్ ప్రైజు నాకు నటుడుగా స్పెషల్ ప్రైజు!

నేను అనుకున్నాను "కూలిగిట్టింది! ఫ్రీ బోర్డింగ్ అండ్ లాడ్జింగ్‌తో పాటు ప్రైజులు గూడ వచ్చినయ్ గదా " అని సంతోషించాను.

అలా ప్రారంభమైంది - నా నాటక 'రచన'! తరువాత - నాటక కళా పరిషత్తు ఆఫీసు విజయవాడే గనక నన్ను పరిషత్తు వర్కింగ్ కమిటీ సభ్యుడుగా వేసుకున్నట్టు నాకు తెలియజేశారు.

అంతకు ముందు నుంచే - వర్కింగ్ కమిటీలో వున్నారు. దుక్కిపాటి మధుసూదనరావు గారు పోలవరపు సూర్య ప్రకాశరావుగారు. పసల సూర్యచంద్రరావు గారు ప్రధాన కార్యదర్శి అయినా - ఇంకా ఇద్దరు ముగ్గురు కార్యదర్శులు ఉండేవారు! యర్రోజు మాధవాచార్యులు గారు, హిందీ ప్రచార సభ తాలూకు - వేమూరి ఆంజనేయశర్మ గారు, రామచంద్ర కాశ్యప వగైరాలుండేవారు!

అదే సమయంలో - మరో సంఘటన - నా నాటక జీవితంలో మరో మలుపు తిప్పింది.

రామచంద్ర కాశ్యప - కాలేజీలో నా జూనియర్ అని చెప్పాను గదా! తరువాత వాడు మదరాసులో 'లా' చదివి - విజయవాడలో ప్రాక్టీసు పెట్టాడు.

వాడు - నాకు - కొప్పరపు సుబ్బారావుగారిని గురించి చెప్పాడు! సుబ్బారావు గారిని గురించి వినడమే గాని ఆయనతో నాకు పరిచయం లేదు! ఆయన అప్పటికే గొప్ప నాటక రచయిత! స్థానం నరసింహారావు గారికి 'రోషనారా' గొప్ప నాటకం రాసిచ్చాడు. అందులో ముస్లిం వనిత - హిందువయిన శివాజీని ప్రేమిస్తుంది. అప్పటి - హిందూ ముస్లిం వాతావరణంలో బ్రిటిష్ ప్రభుత్వం 'రోషనార' నాటకాన్ని నిషేధించింది.





సూరిబాబు



కొప్పరపు సుబ్బారావు

కొప్పరపు సుబ్బారావుగారు సూరిబాబు - రాజేశ్వరి నాటక సమాజానికి 'తారాశశాంకం' నాటకం రాసిచ్చాడు. ఆధునిక నాటకాలు గూడ రాశాడు - 'చేసినపాపం'! 'అల్లీముతా' అని మరో నాటకం! ఆయన అంతకుముందే హిస్ మాస్టర్స్ వాయిస్ (H.M.V) వాళ్లకి ఏజంటుగా చిత్తూరు నాగయ్య, కన్నాంబ వగైరాలచేత పాటలు పాడించి రికార్డు చేయించాడు. చాలా అనుభవజ్ఞుడు. మంచి పండితుడు, నాటక కర్త!

ఆయన 'లిటిల్ -థియేటర్' అని ఒక సంస్థ స్థాపించి నాటక రంగాన్ని గురించిన అనేక పుస్తకాలు సేకరించి మంచి గ్రంథాలయం తయారు జేశాడు.

"ఆయన దగ్గర నాటక రంగానికి సంబంధించిన లిటరేచర్ పుస్తకాలు మంచివి ఉన్నాయ్‌రా' అని రామచంద్ర కాశ్యప ఒక రోజు సుబ్బారావుగారింటికి తీసుకెళ్లి పరిచయం చేశాడు. ఆయన యిల్లు లైబ్రరీ - విజయవాడ బీసెంటు రోడ్డు చివర పక్కసందులో డా॥ క్షీరసాగరం కంటి ఆసుపత్రికి ఎదురుగా వుండేది. సుబ్బారావుగారి భార్య కొప్పరపు సరోజనిగారు! నాకు ఆకర్షణ - ఆయన లైబ్రరీలో పుస్తకాలు. ఇప్పటిలాగా ఆరోజుల్లో నటులకు శిక్షణ ఇచ్చే స్కూల్సు ఏమీ లేవు.

అప్పటి రాజకీయ పరిస్థితి ఏమిటంటే కమ్యూనిస్టుల మీద పోలీసు జులుం రిప్రెషన్ ఎక్కువయింది! ఆ బాధలు పడలేక అప్పటి వరకు యాక్టివ్‌గా నాటకాలు ప్రదర్శిస్తున్న ప్రజానాట్యమండలిని రద్దుచేశారు! కొప్పరపు సుబ్బారావుగారు - నేను, కాశ్యప 'రాఘవ కళాకేంద్రం' అని ఒక నాటక సమాజం ప్రారంభించాం!

ప్రజానాట్య మండలి రద్దుకావడంతో అందులోనుంచి - మాచినేని వెంకటేశ్వరరావు - వెంపటి రాధాకృష్ణ వీరమాచనేని సరోజిని (వి. మధుసూదనరావు భార్య) వచ్చి మా సమాజంలో చేరారు.



కాకినాడ 'ఆంధ్ర నాటక కళాపరిషత్' నాటక పోటీల (1950) సందర్భంగా -

కూర్చున్నవారు ఎడమనుంచి కుడికి - కె.వి. గోపాలస్వామి, బందా కనకలింగేశ్వరరావు, మాధవపెద్ది వెంకటరామయ్య, పృథ్వీరాజ్ కపూర్, ఎం.ఆర్. అప్పారావు (ఉయ్యూరు జమీందార్), పసల సూర్యచంద్రరావు, స్థానం నరసింహారావు, కాజా వెంకటరామయ్య

నిల్చొని ఉన్నవారు ఎడమనుంచి - వేమూరి ఆంజనేయ శర్మ, ఫన్ డాక్టర్ చంద్రశేఖర్, ఎర్రోజు మాధవాచార్యులు, డి.వి. నరసరాజు, మల్లాది సత్యనారాయణ, వింజమూరి శివరామారావు, కొప్పరపు సుబ్బారావు

నిల్చొని ఉన్నవారు - పై వరస - ఎడమనుంచి- రామచంద్ర కాశ్యప, కోటగిరి పార్థసారథిరావు (గంపలగూడెం జమీందారు), పోలవరపు సూర్యప్రకాశరావు



మొట్టమొదట రాఘవకళాకేంద్రం తరపున ఒక నాటకం వేశాం. నాటకం పేరు 'విశ్వంపెళ్లి' రచయిత సోమంచి యజ్ఞన్న శాస్త్రి అని బొంబాయి కార్పొరేషన్‌లో అసిస్టెంటు కమీషనర్‌గా పనిచేస్తుండేవాడు. తరువాత అక్కడే సెటిల్ అయ్యాడు. ఆయనది అసలు ఏలూరు.

'విశ్వంపెళ్లి' నాటకం - బెర్నార్డ్‌షా నాటకం Man and Superman కి స్వేచ్ఛానువాదం! 'విశ్వంపెళ్లి'లో నేను ఒక చిన్న వేషం వేశాను. రామచంద్ర కాశ్యపది ప్రధానపాత్ర! గుడిపాటి వెంకటచలంగారి కుమార్తె - నిర్మల నూర్జహాన్- ప్రధాన స్త్రీ పాత్ర.

ఆ నాటకం వేస్తుండగానే కొప్పరపు సుబ్బారావు గారు J.B. Priestley నాటకం 'An Inspector Calls' ని 'ఇనపతెరలు' పేరుతో అనువదించారు!

దానిని - 1950లో కాకినాడలో జరగబోయే నాటక కళాపరిషత్తు నాటక పోటీల కోసం తయారు చేశాం! దానిలో నేను ప్రధాన పాత్ర Inspector వేషం వేశాను! మిగతా పాత్రలు - మాచినేని వెంకటేశ్వరరావు - రామచంద్ర కాశ్యప - వెంపటిరాధకృష్ణ - కొప్పరపు సరోజని - వీరమాచనేని సరోజిని!

కాకినాడ పరిషత్తుకు నేనొక నాటిక రాశాను. ఒక ఇంగ్లీషు నాటిక 'Refund' ఆధారంగా 'వాపస్' నాటిక రాశాను అందులోనూ - 'అంతర్వాణి' లాగానే ఆడవేషాలు లేవు.

1950లో పరిషత్తు - కాకినాడలో జరిగింది. పృథ్వీరాజ్ కపూర్ ముఖ్య అతిథిగా వచ్చాడు! ఆ పోటీలలో పాలకొల్లు నుంచి పినిశెట్టి శ్రీరామమూర్తి రాసిన 'పల్లె పడుచు' నాటకానికి మొదటి బహుమతి మా 'ఇనప తెరలు'కు రెండో బహుమతి వచ్చినయ్.

అప్పుడు సావిత్రి - చిన్నపిల్ల! విజయవాడలో సుంకర కనకారావు అరుణోదయ నాట్యమండలి తరపున డ్యాన్సులు చేస్తుండేది.

కాకినాడ పరిషత్తులో డ్యాన్సు చేసింది సావిత్రి! పరిషత్తులో అదనంగా మదరాసు నుంచి 'లలిత-పద్మినీ' (Travancore) ట్రావన్కూరు సిస్టర్స్ అని - చాలా ఫేమస్ డ్యాన్సర్సు ! వాళ్లని పిలించారు.

వాళ్లడ్యాన్సులో వ్యాఖ్యానం చెప్పాలిగా. వాళ్లకి తెలుగురాదు. ఇంగ్లీషులో రాసి ఇస్తే - వాటిని తెలుగులో అనువదించి నేను మైక్‌లో చెప్పే వాణ్ణి.

ఆ పరిషత్తుకి - స్థానం మాధవపెద్ది వెంట్రామయ్య, కొప్పరపు సుబ్బారావు గార్లు ఫన్ డాక్టర్ నెల్లూరు చంద్రశేఖరం, వింజమూరి శివరామారావు కూర్మా గోపాలస్వామి వచ్చారు. నా దగ్గర ఆ గ్రూప్ ఫొటో గూడ ఉంది.

1950 లో కాకినాడలో పరిషత్తు అయిన తరువాత 1951 పరిషత్తు పోటీలకి ఒక నాటకం తయారు చేయాలని ప్రయత్నం. ఆరోజుల్లో కొప్పరపు సుబ్బారావుగారి 'లిటిల్ థియేటర్'కి 'Theatre Arts' అని అమెరికన్ మ్యాగజైన్ ప్రతి నెల వస్తుండేది. ప్రతి సంచికలోనూ ఒక full length నాటకం పబ్లిష్ చేస్తుండేవాళ్లు.

'ఇనప తెరలు' నాటకానికి మూలం J.B. Priestley's "Inspector Calls" అని చెప్పానే - అది గూడ Theatre Arts Magazineలో వచ్చింది 1950లో. నెల జ్ఞాపకం లేదు. Theatre Arts Magazine లో ఒక full length play వచ్చింది. దాని పేరు "Juno and the Pay cock" - Peacock Slang అన్నమాట Paycock! దాని రచయిత ఒక Irish Playwright Sean O' Casey. అతను కమ్యూనిస్టు! ఇంగ్లండులో settle అయినాడు.



ఆ నాటకంలో నన్ను ఆకర్షించింది ఏమిటంటే కష్టాలలో మునిగి విషాద వాతావరణంలో బ్రతుకుతున్న ఒక మధ్యతరగతి కుటుంబ కథని Entertaining గా దాదాపు హాస్య రసస్ఫోరకంగా చెప్పాడు అంటే Tragedy and Comedy చాలా చక్కగా blend చేశాడు.

దానిని నేను తెలుగులోకి స్వేచ్ఛానువాదం చేశాను. దానికి ముందు 'కీళ్లనొప్పులు' అని పేరు పెట్టాను అందులో కుటుంబ యజమాని రిటైరై ఏమీ ఆదాయంలేక క్లబ్బుకి పోతూ చీట్లపేక ఆడడం ఇంట్లో భార్య సతాయిస్తుంటే తను "ఈ కీళ్ల నొప్పుల్తో నేను ఏం ఉద్యోగం చేయగలనే' అని కీళ్లనొప్పుల్తో బాధపడుతున్నట్టు నటిస్తుంటాడు! (ఆనాటకానికి తరువాత 'వీలునామా' అని పేరుపెట్టాం! ఆ పేరు పెట్టింది 'రక్తకన్నీరు' నాగభూషణం! ఆ కథ తరువాత చెబుతా!)

ఆ నాటకం రిహార్సల్సు ప్రారంభించాం - కొప్పరపు సుబ్బారావు గారి లిటిల్ థియేటర్లో! ఆయన కాపురం గూడ ఆ ఇంట్లోనే! ఆ నాటకంలో ప్రధానపాత్ర - విన్నకోట రామన్న పంతులు! అతను లాయరు! క్రిమినల్ ప్రాక్టీసు ఎక్కువ! సాయంత్రం 5 గంటలకు రిహార్సల్సు మొదలుపెట్టాలి! అతను రోజూ ఆలస్యంగా వచ్చేవాడు. కారణం మేజిస్ట్రేటు! ఆ మేజిస్ట్రేటు కోర్టులో రామన్న పంతులుకి కేసులు ఉండేవి! రోజూ 6-7 గంటల దాకా కోర్టు నడిపించేవాడు మేజిస్ట్రేటు. అందువల్ల రామన్న రోజూ గంట గంటన్నర లేటుగా రావడం మేమంతా అతని కోసం ఎదురు చూస్తూ కూచోడం! అతను వచ్చిన తరువాత "చాలా లేటు అయింది! ఇవాళ వద్దులే! రేపు చేద్దాం రిహార్సలు" అని వాయిదాలు వేయడం. ఇలా రిహార్సల్సు సక్రమంగా జరగడంలేదు!

ఒకరోజు నేను ఏదోపని మీద గుంటూరు వెళ్ళాను. అక్కడ ఇప్పుడు సినిమాల్లో 'నిర్మలమ్మ' ఉండే ఆవిడ భర్త కృష్ణారావు కలిశాడు. అతను 'రాజుగారూ! మాకు గూడ ఒక నాటకం రాసిపెట్టండి" అని అడిగాడు. వాళ్ల నాటక సమాజం పేరు "ఉదయినీ థియేటర్స్"

ఆ నెలలో Theatre Arts magazine లో "The play is the thing" అని ఒక యింగ్లీషు నాటకం వచ్చింది. దానికి మాతృక ఒక హంగేరియన్ నాటకం దాని రచయిత పేరు Ference Molnar. దానిని P.G. Wodehouse ఇంగ్లీషులోకి స్వేచ్ఛానువాదం చేశాడు "The play is the thing" అని. Shakespeare's Hamlet నాటకంలోని "The play is the thing - Wherein I will catch the conscience of the King" అనే Hamlet dialogue నుంచి 'The play is the thing' తీసుకున్నాడు Wodehouse.

నాటకం full length comedy నాకు బాగా నచ్చింది. కృష్ణారావుతో చెప్పాను "ఆ నాటకం తెలుగులో రాసి ఇస్తానయ్యా" అని. ఆ నాటకంలో మూడు సీన్లు! రాత్రి భోజనం చేసిన తరువాత కూర్చుని రోజుకొక సీను చొప్పున మూడు రాత్రుల్లో ఆ నాటకం రాశాను!

ఆ మరునాడు సాయంత్రం 'లిటిల్ థియేటర్'లో చదివి వినిపిస్తానని మా రాఘవ కళాకేంద్రం సభ్యుల్ని కృష్ణారావును గూడ రమ్మని పిలిచాను. రైల్వే సమాజం 'రసన సమాఖ్య'లో ప్రముఖుడు కె. వెంకటేశ్వరరావును గూడ రమ్మన్నాను వచ్చాడు. నాటకం మొత్తం చదివి వినిపించాను. అందరూ బాగుందని ఏకగ్రీవంగా చెప్పారు. ఆ నాటకానికి "నాటకం" అని పేరు పెట్టాను. అంతా విని కృష్ణారావు "ఈ నాటకం వేయడం నావల్ల కాదు! నాకున్నది ఒకే ఆర్టిస్టు - నిర్మల! ఈ నాటకంలో అన్ని పాత్రలకూ ప్రాధాన్యత వుంది. ఇంతమంది నటుల్ని నేనెక్కడ నుంచి తీసుకురాను? నావల్ల కాదు" అన్నాడు.





రామచంద్ర కాశ్యప, రామన్న పంతులు గార్లతో



కె. వెంకటేశ్వరరావు

అప్పుడు రామన్నపంతులు అన్నాడు "నరసరాజు గారూ! 'కీళ్లనొప్పులు' నాటకం రిహార్సల్సుకు రాలేకపోతున్నాను. మీరందరూ రోజూ నాకోసం ఎదురు చూస్తూ కూర్చుంటే నేను గిల్టీగా ఫీల్ అవుతున్నాను. ఈ మేజిస్ట్రేట్ యీ ఊళ్లో ఉన్నన్నాళ్లు నాకీ బాధ తప్పదు! అందువల్ల 'కీళ్లనొప్పులు' ప్రస్తుతానికి అవతల పెట్టి - ఈ 'నాటకం' పరిషత్తుకు తయారు చేద్దాం! ఇందులో బట్లరు పాత్ర చిన్నదయినా నాకు బాగా నచ్చింది! ఆ పాత్ర నేను వేస్తాను. రోజూ ఈ రిహార్సలుకు రాలేకపోయినా దానిని సాధనచేసి ఎలాగో ఒప్పించగలను" అన్నాడు 'సరే' ననుకున్నాం!

కె. వెంకటేశ్వరరావు అప్పుడు రైల్వేలో ఉద్యోగం చేస్తున్నాడు. అన్నాడు "నరసరాజుగారూ! మాకూ పరిషత్తుకు నాటకమేమీ దొరకలేదు దొరుకుతుందనే ఆశ గూడ లేదు. (అప్పటికి పరిషత్తు పోటీలు తెనాలిలో జరగబోతున్నట్టు ప్రకటించారు) ఈ నాటకంలో నాకో వేషం ఇవ్వండి. మూడో సీనులో వచ్చే 'శివశంకరం' వేషం ఇవ్వండి" అన్నాడు.

వెంటనే మాచినేని వెంకటేశ్వరరావు అన్నాడు "అయ్యో! ఆ వేషం యివ్వమని నేను అడుగుదామను కుంటున్నాను. (అప్పుడు మాచినేని విజయ కమర్షియల్ బ్యాంకులో చిన్న ఉద్యోగం చేస్తున్నాడు) నాకు బ్యాంకు పని రోజు 6 గంటల దాకా ఒకోరోజు 7 గంటల దాకా తెమలడం లేదు! మూడో సీనులో మాత్రమే వస్తుంది కాబట్టి ఆ 'శివశంకరం' వేషం నాకివ్వండి" అన్నాడు.

నేను కె. వెంకటేశ్వరరావుతో "వెంకటేశ్వరరావ్! నువ్వు రామానుజం వేషం వెయ్యి! అది reacting role, ఆ పాత్ర సమర్థుడైన నటుడు వెయ్యకపోతే పక్కనున్న 'రఘుపతి' పాత్ర దెబ్బతింటుంది. 'రఘుపతి' వేషం కాశ్యప వేస్తాడు. నాటకంలో అది ప్రధాన పాత్ర!" అన్నాను.

"అదేమిటి? 'రఘుపతి' నువ్వు ఎందుకు వెయ్యగూడదు?" అన్నాడు కాశ్యప! కొప్పరపు సుబ్బారావుగారు గూడ "ఆమాటే నేనూ అనబోతున్నాను" అన్నారు. నేనన్నాను. "నా ఆరోగ్యం బాగా లేదు! చూస్తున్నారు గదా! నీరసంగా వుంటుంది. పైగా నాకు నాటకం డైరెక్టు చేయాలని ఉంది. నేను నాటకం డైరెక్ట్ చేస్తాను" అన్నాను.

నాటకంలో ఒకే స్త్రీ పాత్రకు 'నిర్మల' నిశ్చయమైంది. ఇకపోతే నిర్మల పాత్రను ప్రేమించే యువకుడు పేరు గుర్తు లేదు. 'మధు' అనుకుంటాను. దానిని గుంటూరు నుంచి రవిని తీసుకు వస్తాను! కామరాజు పాత్రకి - గుంటూరులో 'కాళిదాసు' ఉన్నాడు. చాలా గొప్ప ఆర్టిస్టు! వెళ్లి అతన్ని అడుగుతాను" అన్నాను! అలా మొత్తం Casting పూర్తి అయింది.



ఆంధ్ర నాటక కళాపరిషత్తు పోటీలు, తెనాలి (1951) సందర్భంగా ఉదయినీ-రాఘవ కళాకేంద్రం, విజయవాడ వారి 'నాటకం'లో పాల్గొన్న కళాకారులు

కూర్చున్నవారు ఎడమ నుండి - నిర్మల, డా॥ పి.వి. ఆచార్, డి.వి. నరసరాజు, రామచంద్ర కాశ్యప,

నిల్చున్నవారు - బి. గోపాలం, కృష్ణారావు, విన్నకోట రామన్న పంతులు, మాచినేని వెంకటేశ్వరరావు, రామరాజు, కె. వెంకటేశ్వరరావు, ప్రఖ్య శ్రీరామమూర్తి, కె.వి.ఎస్.శర్మ



ఆ మరునాడు గుంటూరు వెళ్లి రవి (హిందూ కాలేజీలో 1938లో నేను మొట్టమొదటగా నటించిన నాటికలో వేషం వేసిన రవీంద్రనాథ్) కాళిదాసుకు విషయం చెప్పాను! యిద్దరూ ఒప్పుకున్నారు. రోజూ సాయంత్రం 4 గంటల రైలులో విజయవాడ రావడం రిహార్సల్సు అయిన తరువాత 9 గంటల బండిలో తిరిగి గుంటూరు వెళ్లడం! అదీ ఏర్పాటు!

రిహార్సల్సుకు సుబ్బారావు గారి ఇంట్లో హాలు చాలదనిపించింది. వేరే ఏదైనా హాలు చూడాలని వెతికాను!

గాంధీ నగర్‌లో పార్కు పక్కన 'పూర్ణానంద' సత్రం వుంది. అందులో మేడమీద గదులున్నాయ్. అన్ని గదులూ అప్పటికే అద్దెలకిచ్చి ఉన్నయ్! చివర పెద్దహాలు వుంది. రిహార్సల్సుకు ఐడియల్‌గా వుంటుంది అది ఖాళీగా వుంది. సత్రం యజమాని కొతా సుబ్బారావుగారు. ఆయన్ని వెళ్లి అడిగాను. నెలరోజులు రిహార్సల్సుకు కావాలన్నాను. ఆయన 'సరే' వేసుకోమన్నారు.

రిహార్సల్సు ప్రారంభించాం! సాధ్యమయినంత తక్కువ ఖర్చుతో నాటకం తయారు చేయాలని సంకల్పం!

గుంటూరు నుంచి వచ్చే ఇద్దరు వాళ్ల రైలు ఖర్చులు వాళ్లే పెట్టుకునేట్టు సమాజ సభ్యుల కాఫీలు, టిఫిన్లు- సమాజం మీద పడకూడదు. పక్కనే మోడరన్ కేఫ్ వుంది! ఎవరి బిల్లు వాళ్లే చెల్లించుకోవాలి. నిర్మల సత్యనారాయ పురంలో ఉంటోంది! ఆమె రిక్షాలో రావాలి. రిక్షాఖర్చులు మాత్రం సమాజం భరిస్తుంది.

రిహార్సులు హాలు అద్దె యాభైరూపాయలు. నిర్మల రిక్షాఖర్చు దాదాపు 25 రూపాయలు! మొత్తం 75 రూపాయలతో రిహార్సల్సు ముగించి నాటకం తయారు చేశాం.

నాటకం "ఉదయినీ రాఘవ కళాకేంద్రం పేరుమీద ప్రదర్శించాలని నిర్ణయించాం!

రిహార్సల్సు ప్రారంభించిన వారం రోజుల వరకు గుంటూరు నుంచి రవి ఒక్కడే వస్తున్నాడు గాని కాళిదాసు ఏదో పని ఉందని చెప్పి రాలేకపోతున్నాడు. రిహార్సల్సులో అతని డైలాగులు నేను చెప్పవలసి వస్తోంది. ఆ డైలాగులు గట్టిగా అరవాలి! నాకు నీరసం! కాళిదాసు వచ్చేట్టు లేడు. ఏంచేయాలి?

అదృష్టవశాత్తు - అంతకంటే మంచి నటుడు దొరికాడు. కె.వి.యస్. శర్మ! అతను సుంకర కనకారావు స్థాపించిన అరుణోదయ నాట్యమండలిలో సభ్యుడు. వాళ్లకీ నాటకం దొరకలేదు! ఒకరోజు శర్మ నాదగ్గరకు వచ్చాడు!

"మాకు ఒక నాటకం రాసి పెట్టండి" అన్నాడు. "మీకు నాటకం రాయను! నీకు మటుకు ఒక మంచి వేషం యిస్తాను. నాటకంలో కామరాజు వేషం". మరుసటిరోజు నుంచి రిహార్సల్సుకు వచ్చాడు శర్మ! చివరికి అందరినీ మింగేసేటంత పేరు తెచ్చుకున్నాడు.

'పాతాళభైరవి' సినిమా శత దినోత్సవాలకి నిర్మాతలు విజయవాడ వచ్చినప్పుడు ప్రదర్శించిన 'నాటకం' చూచిన తరువాత 'చక్రపాణి' గారు కబురు చేశారు. "కామరాజు వేషం వేసిన నటుణ్ణి మదరాసు పంపండి! 'విజయ'లో నెలజీతం ఆర్టిస్టుగా తీసుకుంటాం అని! అది వేరే కథ! తరువాత చెబుతాను!)

'నాటకం' లో రామానుజం పాత్ర వేసిన కె. వెంకటేశ్వరరావు అప్పుడు రైల్వేలో ఉద్యోగం చేస్తుండేవాడు. ఆ తరువాత ఉద్యోగం రిజైన్‌చేసి ఢిల్లీలో Drama School లో Training కు వెళ్ళాడు. అతనితో పాటు పొట్టి ప్రసాద్ గూడ వెళ్లాడు. తరువాత ఆంధ్ర యూనివర్సిటీలో రిజిస్ట్రార్‌గా పనిచేస్తున్న కె.వి. గోపాలస్వామి నాయుడు



గారికి నాటకాలంటే చాలా ఇంటరెస్టు. యూనివర్సిటీలో డిపార్ట్‌మెంట్ ఆఫ్ థియేటర్ ఆర్ట్స్ అని నాటకంలో వివిధ శాఖల్లో విద్యార్థులకు శిక్షణ ఇచ్చే వసతి కల్పించాడు. దానికి కె. వెంకటేశ్వరరావును డైరెక్టరుగా నియమించారు కొన్నాళ్లు మంత్రి శ్రీనివాసరావు ఆ పదవిలో పని చేశాడు.

ఆ రోజుల్లో విజయవాడలో చాలా నాటక సమాజాలుండేవి. ప్రతి సమాజంలో ఒకరో ఇద్దరో సమర్థులయిన నటులుండేవాళ్లు. కె. వెంకటేశ్వరరావు రైల్వే సమాజం రసన సమాఖ్య అని ఉండేది. కె.వి.ఎస్. శర్మ అరుణోదయ నాట్యమండలిలో ఉండేవాడు. అలా విడివిడిగా ఉండడం ఎందుకు? అని నాటకంలోకి వెంకటేశ్వరరావును కె.వి.ఎస్. శర్మని తీసుకు వచ్చాను.

అప్పుడు నాటకశాలలు నటన ప్రదర్శన వగైరాలకు శిక్షణ ఇచ్చే స్కూల్స్ ఏమీ ఉండేవి కావు! కొప్పరపు సుబ్బారావు గారు సేకరించిన పుస్తకాలు చదివి acting and production నేర్చుకున్నాను.

ఒకసారి జవహర్ టాకీస్‌లో (ఏలూరు రోడ్డులో వుండేది) అది తరువాత 'విజయాటాకీస్' అయినట్టుంది. ఆ జవహర్ టాకీస్‌లో నేను నటన గురించి అంతకంటే ముఖ్యం Play Production గురించి Demonstration lecture ఇచ్చానట! విన్న తరువాత తనకు నాటకాలు వెయ్యాలని కోరిక కలిగిందట చాట్ల శ్రీరాములు గారికి. అప్పుడు శ్రీరాములుగారు రైల్వేలో కె. వెంకటేశ్వరరావుతోపాటు ఉద్యోగం చేస్తుండేవాడు. ఆయన తరువాత ఇంగ్లండు వెళ్లి థియేటర్ ఆర్ట్స్ లో శిక్షణ పొంది ఆంధ్రాయూనివర్సిటీలోనూ, ఉస్మానియా యూనివర్సిటీలోనూ, థియేటర్ ఆర్ట్స్ డిపార్ట్‌మెంట్ కు హెడ్‌గా ఉండి ఎంతోమంది నటీనటులకు శిక్షణ ఇచ్చి మంచి నటులను తయారు చేశాడు. అలాగే మొదలి నాగభూషణ శర్మ గారు అమెరికన్ యూనివర్సిటీలో థియేటర్ ఆర్ట్స్ లో శిక్షణ పొంది డిగ్రీలు తెచ్చుకుని అధ్యాపకులుగా ఇప్పటికీ ఆధునిక నటన రంగానికి సేవలు చేస్తున్నారు.

రాజా రాందాసు ఒకడు. 1955 ప్రాంతంలోనే అమెరికా వెళ్లి థియేటర్ ఆర్ట్ అధ్యయనం చేసి డిగ్రీలు పొంది వచ్చారు. మదరాసులో ఫిల్మ్ చాంబరు వారు ఏర్పాటుచేసిన డ్రామా స్కూల్‌కు ప్రిన్సిపాల్‌గా పని చేశారు. ఇప్పుడు తమిళంలో టాప్ హీరో రజనీకాంత్ ఆయన శిష్యుడు. తరువాత తనే ఒక సినిమా నిర్మించుకుని ఆర్థికంగా దెబ్బతిని ఆరోగ్యం పాడయి అకాలమరణం పాలయ్యాడు పాపం!

పైన చెప్పిన వాళ్లందరి లాగా డ్రామా స్కూల్స్‌లో శిక్షణ పొందే అవకాశాలు ఆరోజుల్లో మాకు లేవు. నేనూ, కాశ్యప రామన్న పంతులు పుస్తకాలు చదివి నేర్చుకున్నదే నాటక కళ!

కొన్నాళ్లు విజయవాడలో నటరాజకళాసమితి తరపున ఒక నాటక శిక్షణా కళాశాల రన్ చేశారు. దానిలో రామన్న పంతులు, కాశ్యప, అధ్యాపకులుగా పనిచేశారు. నేను నవ్వుతూ అనేవాణ్ణి మీకు ఏం తెలుసని మీరు వాళ్లకి శిక్షణ యిస్తారయ్యా అని.

రామన్న నాటక కళ - మేకప్ వగైరాల మీద ఒకటో రెండో పుస్తకాలు గూడా రాశాడు.

ఇప్పుడు అంటే 21వ శతాబ్ది ప్రారంభం నాటికి నాటక రంగం టెక్నికల్‌గా చాలా అభివృద్ధి చెందింది. నాటక శిక్షణాలయాలు అవతరించినయ్! నాటక పోటీ పరిషత్తులు ఆంధ్రప్రదేశ్ అంతటా కొన్ని డజన్లు ఉద్భవించినయ్! కాని నాటక ప్రమాణం అంటే స్టాండర్డ్ చెప్పుకోదగ్గంతగా పెరగలేదని అంటారు.

☆ ☆ ☆



మళ్లీ - నాటక కళాపరిషత్తుకు వద్దాం

1951లో మార్చి-ఏప్రిల్‌లో తెనాలిలో పరిషత్తు నాటిక నాటక పోటీలు జరిగినవి.

మేము 'నాటకం' తీసుకు వెళ్లాం! గరికపాటి రాజారావు ప్రజానాట్యమండలి స్థాపకుడు ఒక నాటకం తీసుకువచ్చాడు. పేరు జ్ఞాపకం లేదు. అతనికి బెస్ట్ యాక్టర్ బహుమతి వచ్చింది. మా 'నాటకం'లో నిర్మలకు ఉత్తమ నటి బహుమతి వచ్చింది.

ఆ పోటీలలోనే పాలకొల్లునుంచి పరకాల శేషావతారంగారు రాసిన 'కూడు-గుడ్డ' నాటకంలో అల్లు రామలింగయ్య మొదటగా పరిషత్తు పోటీలలోకి వచ్చాడు!

ఆత్రేయ 'ఎవరు దొంగ' అనే నాటిక వచ్చింది. మొత్తం మీద అన్ని నాటకాలు, నాటికలు పేదరికం మీద, పేదల మీద ధనవంతుల exploitation మీద! చినిగినవి పాత గుడ్డలు, కుండలు వగైరాలే గదా కావలసింది!

ఒక నాటకానికి ఇచ్చినవే - మిగతా నాటకాలకు గూడ అవే ఇచ్చేవాళ్లు!

పరిషత్తు ఆఖరి రోజు నాటకాలన్నీ అయినాక జడ్జీలు ఉత్తమ నాటక - నాటికలను నిర్ణయించడానికి రహస్య సమావేశం జరుగుతోంది. అప్పుడు ఆహ్వాన సంఘం అధ్యక్షుడు (ఆయన తెనాలి మునిసిపల్ ఛైర్మన్‌గా గూడ పనిచేశాడు) నన్నపనేని వెంకట్రావుగారు అన్నారట నవ్వుతూ! - "ఉత్తమ నాటకం గురించి వాళ్లు చెప్పడమెందుకు? నేను చెబుతాను. ఏ నాటకమయితే కుక్కి నులకమంచం, చినిగిన గుడ్డల దండెం, పగిలిన కుండలు చూపలేదో ఆ నాటకానికి ఉత్తమ బహుమతి ఇవ్వమనండి" అని! అవన్నీ లేనిది మా నాటకమే! మా నాటకానికి ఉత్తమ రచన - ఉత్తమ ప్రదర్శన బహుమతులు, నిర్మలకు ఉత్తమ నటి, కె.వి.ఎస్. శర్మకి కూడ ఏదో బహుమతి వచ్చినట్లు గుర్తు.

నేను ఒక నాటిక గూడ రాశాను. 'ఆత్మహత్య' అని నాటకాల మీద వ్యంగ్య రచన! దానికేమో బహుమతి రాలేదు! బహుమతులు రావలసినంత నాటిక కాదు గూడ.

☆ ☆ ☆

తెనాలి పరిషత్తులో ప్రథమ బహుమతి పొందిన నా 'నాటకం' ద్వారా నేను సినిమారంగ ప్రవేశం చేశాను.

ఆ కథాక్రమం బెట్టి దనిన -

అదే సంవత్సరం అంటే 1951 జూన్‌లోనో జూలైలోనో విజయా ప్రొడక్షన్స్ వారి "పాతాళభైరవి" సినిమా శతదినోత్సవాలు జరిగినై - ఆంధ్రదేశమంతటా! "పాతాళభైరవి" తాలూకు బృందం అంతా అంటే - నిర్మాతలు నాగిరెడ్డి, చక్రపాణి, దర్శకుడు శ్రీ కె.వి. రెడ్డి, రచయిత పింగళి నాగేంద్రరావుగారు, మ్యూజిక్ డైరెక్టరు ఘంటసాల, ఆర్ట్ డైరెక్టరు గోఖలే వగైరాలు, నటీనటుల్లో హీరో యన్.టి.రామారావు, హీరోయిన్ మాలతి, పద్మనాభం, బాలకృష్ణ వగైరాలు అందరూ వచ్చారు. విజయవాడలో మకాం ఏర్పాటు చేసుకుని ప్రతిరోజూ సాయంత్రం అటు గుంటూరు, ఇటు బందరు, ఏలూరు వగైరా కేంద్రాలకు వెళ్లి ఆ థియేటర్లలో ఉత్సవాలు జరుపుకొనడం, తిరిగి రాత్రికి విజయవాడలో మకాం!

ఆ ఏర్పాట్లన్నీ డిస్ట్రిబ్యూటర్స్ విజయా పిక్చర్స్, విజయవాడ వారు చేశారు. అప్పుడు ఇప్పటిలాగా వంద, రెండువందల కేంద్రాలలో విడుదల అయ్యేవి కావు పిక్చర్లు!



కోస్తా జిల్లాల్లో ప్రధాన కేంద్రాలు నెల్లూరు, గుంటూరు, తెనాలి, విజయవాడ, బందరు, ఏలూరు, రాజమండ్రి, కాకినాడ, వైజాగ్, విజయనగరం, ఇలా పది కేంద్రాలు, రాయలసీమ ఏరియాలో రెండు కేంద్రాలు, నైజాంలో ఒకటో, రెండో మొత్తం దాదాపు డజను కేంద్రాలలో మొదటి రిలీజు వుండేది.

పాతాళభైరవి బృందం విజయవాడలో మకాం వేసుకున్నారు. విజయవాడ, దుర్గాకళామందిరంలో జరిగిన సభకు డిస్ట్రిబ్యూటర్స్ విజయా పిక్చర్సు వారి కోరిక మేర అందరికీ సన్మాన పత్రాలు వ్రాసే బాధ్యత నాకూ, రామచంద్ర కాశ్యపకు అప్పజెప్పారు. మొదట సభ విజయవాడలో అయిపోయింది. మిగతా కేంద్రాలకు రోజుకొకటి చొప్పున వెళ్లి వస్తున్నారు.

ఒకరోజు శనివారంనాడు గుడివాడ నుంచి కాజ వెంకట్రామయ్య గారు విజయవాడ విజయాపిక్చర్సు మేనేజరు ధార సత్యనారాయణ గారికి ఫోన్ చేశారు.

"రేపు ఆదివారం ఉదయం పాతాళభైరవి బృందం విజయవాడలోనే ఉంటారు. ఖాళీగా ఉంటారు. రేపు వుదయం 10 గంటలకు కళామందిరంలో నరసరాజుగారిని 'నాటకం' ప్రదర్శించమని చెప్పు వాళ్లు చూస్తారు" అని.

ఇక్కడ కాజ వెంకట్రామయ్య గారిని గురించి కాస్త చెప్పాలి. ఆయనది గుడివాడ. సినిమాహాలు ఉండేది. విజయా పిక్చర్సు డిస్ట్రిబ్యూటింగ్ కంపెనీలో ఆయన భాగస్వామి కాకపోయినా ఆ సంస్థ నిర్మాణ సారథి ఆయన! ఎందుకంటే అటు నిర్మాతలు నాగిరెడ్డి, చక్రపాణి, బి.యన్. రెడ్డి-కె.వి. రెడ్డి గార్లతో ఎగ్జిబిటర్‌గా వెంట్రామయ్య గారికి సన్నిహిత సంబంధాలు ఉండేవి. నాగిరెడ్డి-చక్రపాణి గార్లు 1949లో విజయా ప్రొడక్షన్స్ స్థాపించి మదరాసు వాహినీ స్టూడియో మూలా నారాయణస్వామి గారి దగ్గర నుంచి లీజుకు తీసుకున్నప్పటి నుంచి అంతకు ముందు వాహినీ ప్రొడక్షన్సు స్థాపకులయిన బి.యన్. రెడ్డి, కె.వి. రెడ్డి గార్లతో ఉన్న స్నేహ సంబంధాల వల్ల వెంట్రామయ్య గారు వాహినీ బృందానికి చాలా సన్నిహితులు.

అప్పుడు విజయా ప్రొడక్షన్సుకు ఒక డిస్ట్రిబ్యూషన్ కంపెనీ కావలసి వచ్చింది. దానికి కాజ వెంట్రామయ్య గారు పూనుకుని కాటూరు గ్రామ కాపురస్తులు సూరెడ్డి వెంకట్రామయ్య గారు ప్రధాన వాటాదారుగా చెరుకూరు పూర్ణచంద్రరావు గారు మేనేజింగ్ పార్టనర్‌గా మరికొందరు చిన్న చిన్న వాటాదార్లతో విజయా పిక్చర్స్ అనే డిస్ట్రిబ్యూషన్ కంపెనీ స్థాపించారు!

అదీ అటు నిర్మాతలతోనూ యిటు డిస్ట్రిబ్యూటర్లతోనూ కాజ వెంకట్రామయ్య గారికి ఉన్న సాన్నిహిత్యమూ, సంబంధమూ!

(కాస్త వెనక్కి వెళితే-)

కాజ వెంట్రామయ్య గారు కళామందిరంలో నా 'నాటకం' ప్రదర్శించామని విజయా పిక్చర్స్ మేనేజరు ధారా సత్యనారాయణ గారికి విజయవాడకు ఫోన్ చేశారని చెప్పాను గదా!

ఆయన నాకు కబురు చేశారు. శనివారం సాయంత్రం నేను గాంధినగర్‌లో విజయాపిక్చర్స్ ఆఫీసుకు వెళ్లాను. సత్యనారాయణగారు విషయం చెప్పారు! రేపు ఉదయం 10 గంటలకు 'నాటకం' వెయ్యమని - వెంట్రామయ్యగారు గుడివాడనుంచి ఫోన్ చేశారని. నేను వెంటనే కాస్త విసుగ్గా "ఏం? నాటకం వెయ్యడమంటే ఆషామాషీ అనుకున్నారా? ఉదయం 10 గంటలకా? పగటి భాగోతంలా ఉంటుంది. పైగా అక్కడు ఉన్నస్టేజి





కాజ వెంకట్రామయ్య

ఎంత? మీరు సినిమా స్క్రీన్ తీయరుగా?" అన్నాను. "సినిమా స్క్రీన్ తీస్తే ఎలాగ? మళ్లీ మాకు మ్యాట్నీ షో వుందిగా? అన్నాడాయన"

"అయితే సినిమా స్క్రీన్‌కి ముందు స్టేజి ఎంత ఉంటుంది? చాలదు! నాటకం వెయ్యడానికి వీలు పడదు" అన్నాను గట్టిగా. అయితే మీరే మాట్లాడండి వెంకట్రామయ్య గారితో" అని "గుడివాడకు ట్రంక్ ఫోన్ చేసి నాచేతికిచ్చారు.

నేను వెంకట్రామయ్య గారితో "ఎలా వెంకట్రామయ్యగారూ! జానాబెత్తెడు స్టేజి మీద నాటకం ఎలాగండి వేయడం! పైగా ఉదయం! పగటి భాగోతంలాగా? ఆయనేమో సినిమా స్క్రీన్ తీయనంటున్నాడు!" అన్నాను.

ఆయన "నాకవన్నీ తెలుసులేవయ్యా! నాటకాల సంగతి నువ్వు నాకు చెబుతున్నావా? నేను చెబుతున్నాను! రేపు ఉదయం 10 గంటలకు నాటకం వెయ్యాలి! వేసి తీరాలి".

"ఎలాగండి! స్టేజి కర్టెన్లు గూడ లేవు. అది సినిమాహాలు" అన్నాను.

"నాటకానికి కర్టెన్లు బందరు నుంచి రేపు ఉదయం 6 గంటలకి రైలులో నేను పంపిస్తాను. సరేనా?" అన్నారు కాస్త తీవ్రంగా.

పెద్దాయన! ఆయనంటే మాకు ఎంతో గౌరవం! చెప్పాగా - నాటక కళాపరిషత్తుకు ఆయన ప్రాణం అని. మాకు అందరికీ ఆయన మాట శిలాక్షరం! విధిలేక సరేలెండి' అని ఫోన్ పెట్టేశాను.

వెంటనే వెళ్లి రామన్న పంతులుకీ, కాశ్యపకీ చెప్పాను! సినిమా వాళ్లు చూస్తారంటే అందరికీ ఆశేగా! వాళ్లు వేద్దామన్నారు. నిర్మల ఇంటికి వెళ్లాం - సత్యనారాయణపురంలో ఆమె ఇల్లు. కృష్ణారావు గూడా ఉన్నాడు. విషయం చెప్పాను! వాళ్లిద్దరూ పరమానందంతో 'వేద్దాం' అన్నారు. అప్పుడు నిర్మలకి 102 డిగ్రీల జ్వరం! నేను "స్టేజిమీద నీకు ఏమన్నా అయితే..." అన్నాను.

కృష్ణారావు అడ్డువచ్చి "నరసరాజు గారూ! నాటకం ఏర్పాట్ల విషయం మాకు వదిలెయ్యండి! మీరు రేపు ఉదయం 9 గంటలకి కళామందిరానికి రండి" అన్నాడు.

కాశ్యప "నిజమేరా! నీకు అంతా ఆదుర్దాయే! నువ్వు దగ్గరుంటే మా ప్రాణాలు తీస్తావు! తీరిగ్గా నాటకానికి అరగంట ముందురా" అన్నాడు.



నిజమే! ప్రతి నాటక ప్రదర్శనకీ నాకు ఒకటే అదుర్దా! సతాయింపు! గంట ముందే వెళ్లి "ఏరా! ఇంకా కూర్చున్నారు మేకప్ ఎప్పుడు వేసుకుంటారు?" అని కేకలు వేసేవాణ్ణి! మరునాడు ఆదివారం ఉదయం కొద్దిగా చినుకులు! బందరునుంచి కర్టెన్లు వచ్చినా.

నేను 9 గంటలకు కళామందిరానికి వెళ్లాను. స్టేజి లోపల అందరూ మేకప్ వేసుకుంటున్నారు. కృష్ణారావు, నాటకానికి కావలసిన సామాగ్రి సమకూరుస్తున్నాడు. నాకు మాత్రం చీమలు, జెర్రులు పాకుతున్నాయ్.

అప్పుడు గుడివాడనుంచి కారులో వెంకట్రామయ్య గారు వచ్చారు. ఆయనకి చెవర్లెట్ కారుండేది. పొందూరు ఖద్దరు దోవతి! సిల్కుషర్టు! దానిమీద కోటు! బట్టతల. లోపలకి వచ్చారు.

నేను చూడండి మీరు కర్టెన్లు పంపారు సరే! కట్టడానికి పైన...."

ఆయన "నువ్వు ఉండవయ్యా" అని కోటు తీసి కుర్చీకి తగిలించి పంచె ఎగ్గట్టి స్టేజి ఎక్కి కర్టెన్లు కట్టించారు.

క్రితం రాత్రే డిస్ట్రిబ్యూటరు సత్యనారాయణ గారు ఊళ్లో ప్రముఖులకు ఫోన్లద్వారా కొందరికి సైకిల్ మీద మనిషిని పంపి మరికొందరికి ఆహ్వానాలు పంపారు!

9.45కి హాలు నిండా జనం! పాతాళభైరవి బృందం ముందు సీట్లలో!

10 గంటలకు తెరలేచింది. నాటకం ప్రారంభమయింది. నేను గూడ ముందు వరసలో కూర్చున్నాను. నన్ను ఎప్పుడూ స్టేజిలో ఉండనిచ్చేవాళ్లు గాదు! "నువ్వుంటే మమ్మల్ని కన్ఫ్యూజ్ చేస్తావు! నువ్వు పోయి ఆడియన్స్‌లో కూర్చొని చూడు" అని బయటికి పంపేసేవాడు కాశ్యప!

నాటక ప్రదర్శన బ్రహ్మాండంగా ఉంది. ఆడియన్స్ రియాక్షన్ - నేను ఆశించిన దానికంటే వందరెట్లు! నాటకం అయిన తరువాత అందరూ నన్ను అభినందించారు. "నాటకం చూచి బాగాలేదని ఎవరు చెబుతారు?" అనేది నా సిద్ధాంతం!

భోజనాల అనంతరం పాతాళభైరవి బృందం బందరు వెళ్లాలి. ఆ రాత్రికి బందరులో పాతాళభైరవి ఉత్సవం!

ఆ మరునాడు - మళ్లీ వెంకట్రామయ్యగారు నాకోసం ఫోన్ చేశారట! నేను దొరకలేదు.

తరువాత ఎప్పుడో కలుసుకున్నప్పుడు చెప్పారు వెంకట్రామయ్యగారు "మీరు ఫోన్‌లో దొరకలేదు నరసరాజుగారు. నేను ఎందుకు మీకోసం ఫోన్ చేశానంటే మీ నాటకం చూచిన తరువాత ఆ సాయంత్రం బందరు వెళ్లాం గదా! నేనూ కె.వి. రెడ్డిగారూ ఒకే కారులో వెళ్లాం బందరు.

బెజవాడ నుంచి బయలుదేరి బందరు చేరే వరకు కె.వి. రెడ్డిగారు మీ నాటకాన్ని గురించే మాట్లాడారు! ఆయన అంత ఇంప్రెస్ అయ్యారు! నాటకంలో అది అంత బాగుంది! ఇది ఇంత బాగుంది ఇది ఇంకా బాగుంది అని వివరంగా ఎన్నో విషయాలు ఏకరువు పెడుతూ కొన్ని డైలాగులు రిపీట్ చేస్తూ పగలబడి నవ్వుతూ ప్రయాణం చేశాం బందరుకు కారులో" అన్నారు వెంకట్రామయ్యగారు!

నాకు ఇష్టంలేకపోయినా ఆరోజు ఉదయం కళామందిరంలో నాటకం వెంకట్రామయ్య గారు అంత పట్టుబట్టి ఎందుకు వేయించారో నేను తరువాత చెబుతాను! ఆయన చాలా గొప్ప వ్యక్తి! ఆయన ఎందరికో ఎన్నో సహాయాలు చేశాడు! నేను సినిమా రంగానికి వెళ్లటానికి ఆయన ఎంత ప్రముఖ పాత్ర వహించాడో తరువాత చెబుతాను.



"పాతాళభైరవి" శతదినోత్సవాలు పూర్తి చేసుకుని ఆ బృందం మదరాసు తిరిగి వెళ్లిపోయారు!

తరువాత పది పదిహేను రోజులకి నేను ఏదో సొంత పనిమీద మదరాసు వెళ్లాను! నేను ఎప్పుడు మదరాసు వెళ్లినా నా మిత్రుడు హైస్కూలునుంచి కాలేజీ వరకు నా సహాధ్యాయి వి.జి.యస్.వి. ప్రసాద్ ఇంట్లో ఉండేవాణ్ణి. అతని ఇల్లు టి.నగర్‌లో తిరుమల పిళ్లై రోడ్డులో వుంది. ఆ పక్క వీధి సారంగపాణి స్ట్రీట్‌లో అక్కినేని నాగేశ్వరరావు గారిఇల్లు! దుక్కిపాటి మధుసూదనరావు గారు, నాగేశ్వరరావు గారి ఇంట్లో ఉంటున్నారు.

ఆయన నాగేశ్వరరావు గారి ప్రోద్బలంతో అన్నపూర్ణ పిక్చర్సు ప్రారంభించే ప్రయత్నంలో ఉన్నారు. నాగేశ్వరరావు గారిని సినిమాలలో ప్రవేశపెట్టి ఆయన అభివృద్ధికి ఎంతో దోహదం చేసిన గాడ్ ఫాదర్ మధుసూదనరావు గారు. ఆయన ఆంధ్ర నాటక కళాపరిషత్తు కార్యకలాపాలలో నాకు సన్నిహితుడు. ఒకరోజు దుక్కిపాటి మధుసూదనరావుగారిని చూడ్డానికి నాగేశ్వరరావు గారి ఇంటికి వెళ్లాను. మధుసూదనరావుగారు నాగేశ్వరరావు గారిని నాకు పరిచయం చేశారు. అదే నాకు ఆయనతో ప్రథమ పరిచయం!

అప్పుడు అన్నపూర్ణ పిక్చర్సు స్థాపించి సినిమాలు తియ్యాలనే ప్రయత్నాలు చేస్తున్నట్టు ఆ వివరాలు చెప్పారు.

మధుసూదనరావుగారు చాలా జాగ్రత్తయిన మనిషి. తొందరపడే స్వభావం కాదు. అసలు సినిమా నిర్మాణం మీద గూడ ఆయనకు అంత పెద్ద ఆసక్తి లేదు. నాగేశ్వరరావు గారే ప్రోత్సహించారట!

"నన్ను సినిమాలకి తీసుకువచ్చి నన్ను ఇంత వాణ్ణి చేశారు! మీరు ఊరికే వుండడం ఎందుకు? సినిమా ప్రొడక్షన్ కంపెనీ పెడదాం! నిర్మాతగా సినిమాలు తియ్యండి! ఆవిధంగా మీరు వృద్ధిలోకి వస్తే నాకు కొంత తృప్తి!" అని నాగేశ్వరరావుగారు ప్రోత్సహించారని మధుసూదనరావుగారు నాతో చెప్పారు.

అన్నపూర్ణ పిక్చర్సులో భాగస్థులుగా నాగేశ్వరరావు, మధుసూదన రావుగార్లతోపాటు నవయుగ ఫిలిం డిస్ట్రిబ్యూటర్సు మేనేజింగ్ డైరెక్టరు కాట్రగడ్డ శ్రీనివాసరావుగారు దుక్కిపాటి మధుసూదనరావు గారి బావమరిది (భార్య తమ్ముడు) జనార్ధనరావుగారు (స్వగ్రామం కృష్ణాజిల్లా కాటూరు అయినా ఆయన అప్పుడు గుడివాడలో ఉంటున్నారు) పశ్చిమగోదావరి జిల్లా - ఏలూరుకో - చింతలపూడికో చెందిన ఒక మిత్రుడు సూర్యారావు అనుకుంటాను. గుంటూరు జిల్లాకు చెందిన ప్రకాశరావు అనే మరో మిత్రుడు వీరు భాగస్థులు. నాగేశ్వరరావు గారు కంపెనీ ఛైర్మన్. మధుసూదనరావు గారు మేనేజింగ్ డైరెక్టరు- ప్రొడ్యూసరు.

రెండు మూడు రోజుల తరువాత ఒకసారి మధుసూదనరావుగారు నన్ను నాగేశ్వరరావు గారి ఇంటికి తీసుకెళ్లారు. అంతకుముందే వాళ్లిద్దరూ నా విషయం మాట్లాడుకుని ఉంటారు. మధుసూదనరావు అన్నారు:- "నరసరాజుగారూ! మా కంపెనీలో మొదటి పిక్చరుకు మీచేత స్క్రిప్టు రాయించాలని మా కోరిక! కాని మేమింకా సినిమాకి డైరెక్టరునే నియమించుకోలేదు. మనది కొత్త కంపెనీ గదా డైరెక్టరును నియమించుకుని ఆయనతో మా నరసరాజుగారి చేత స్క్రిప్టు రాయించుకుంటామని చెబితే డైరెక్టరు ఏమంటాడో! అన్నీ మేమే డిక్టేట్ చేస్తున్నామనుకోవచ్చు! ఒకవేళ డైరెక్టరు కూడ మనస్ఫూర్తిగా ఇష్టపడితే మిమ్మల్నే రైటర్‌గా పెట్టుకుంటాం. అలా వీలు కాకపోయినా మీకు నాటకాల డైరెక్షను అనుభవం ఉందిగనుక డైరెక్టర్‌కి అసిస్టెంట్ డైరెక్టరుగా ఉందురుగాని! నాకు గూడ సినిమా ప్రొడక్షను కొత్త గనక మీరు ప్రక్కన వుంటే నాకూ కొంత సహాయంగా ఉంటుంది. ఇక్కడ మీ ఖర్చులకు మటుకు లోటులేకుండా నే ప్రొవైడ్ చేయగలను" అన్నారు.



నేను చిరునవ్వుతో అంతా విని "మీరు చెప్పడం అయిందా?" అన్నాను. "ఏం?" అన్నాడు మధుసూదనరావుగారు కుతూహలంతో!

"మీ మొదటి పిక్చర్‌కి మీరు రాయమన్నా నేను రాయను! కొత్తగా కంపెనీ పెట్టి నాచేత రాయించి రిస్కు తీసుకోవడం నాకసలు ఇష్టంలేదు! సినిమాలకి రాయాలని నాకు అంత దురద ఏమీలేదు! కాని సినిమాల మీద మోజు ఇంటరెస్టు ఉందిగనక మీరు చెప్పినట్టు అసిస్టెంటు డైరెక్టరుగా ఉంటాను. కంపెనీ వృద్ధిలోకి వస్తే నేను ఎప్పుడైనా రైటర్‌గా రాయవచ్చు! అన్నాను.

"అలాగేలెండి" అన్నారు మధుసూదనరావుగారు, నాగేశ్వరరావుగారు.

నాలుగయిదు రోజుల తరువాత నేను తిరిగి విజయవాడ వెళ్లి పోవాలనుకున్నాను. ఆ సాయంత్రం నాగేశ్వరరావుగారికి వాహినీ స్టూడియోలో ఏదో పిక్చరు షూటింగ్ ఉంది. ఆయనకి చెప్పివద్దామని నేను, మధుసూదనరావు గారు వాహినీ స్టూడియోకి వెళ్లాం! రికార్డింగ్ థియేటర్ పక్కన లాన్‌లో నాగిరెడ్డి - చక్రపాణి - కె.వి.రెడ్డిగార్లు కుర్చీల్లో కూర్చుని ఉన్నారు. అంతకుముందు విజయవాడలో పరిచయం ఉంది గనక నేను నమస్కరించగానే 'రండి! రండి' అన్నారు. నేనూ మధుసూదనరావుగారు వాళ్లతో కూర్చున్నాం!

నాగిరెడ్డి, చక్రపాణి - కె.వి.రెడ్డి గార్లు ఆ క్రితం రోజే బెంగుళూరులో పాతాళభైరవి శతదినోత్సవాలకు వెళ్లి వచ్చారట!

ఒక పావుగంట ఏవో కబుర్లు చెప్పుకున్నాక నేను లేచి "వస్తానండి! ఈ రాత్రికి నేను విజయవాడ వెళుతున్నాను" అన్నాను.

"అప్పుడే వెళుతున్నారా?" అన్నారు కె.వి.రెడ్డిగారు.

"నేను వచ్చి వారం పది రోజులయిందండి" అన్నాను.

"ఇలా రండి" అని కె.వి.రెడ్డి గారు లేచి నన్ను పక్కకు తీసుకెళ్లి "నరసరాజుగారూ! మీరు విజయవాడలో ఏం చేస్తుంటారు?" అని అడిగారు!

"నేను ఏమీ చేయనండి!" అన్నాను.

"అదేమిటండి ఏమీ చేయకుండా ఎలా వుంటారు?"

"నిజంగా ఏమీ చేయనండి! పిత్రార్జితం మా గ్రామంలో భూములున్నయ్ వాటిమీద ఆదాయం వస్తుంది. విజయవాడలో ఇల్లుంది. నేనూ నా భార్య మాకు ఒక ఆడపిల్ల. రెండేళ్ల వయసు! నేను క్లబ్బులో బిలియర్డ్స్ ఆడుకోవడం, కాలక్షేపానికి, మీరు చూశారుగా నాటకం, అలా నాటకాలు రాయడం, వెయ్యడం!" అన్నాను నవ్వుతూ!

"అయితే మీరు కుటుంబంతో మదరాసుకు షిఫ్టు కావడానికి ఇబ్బంది ఏమీ ఉండదు గదా!" అన్నారాయన.

"ఎందుకు?" అన్నాను.

"నేను - వాహినీకి ఒక సాంఘిక చిత్రం తీయాలనుకుంటున్నాను. దానికి మీరు స్క్రిప్టు రాస్తే బాగుంటుందనుకున్నాను. మదరాసు రావడానికి మీకేమీ ఇబ్బంది లేదుగదా" అన్నారు.



"ఇబ్బంది ఏమీ లేదండి! పైగా నాకు మదరాసు కొత్తగాదు. 1939-41లో లయోలా కాలేజీలో బి.ఏ. చదివాను. విజయవాడలో ఇల్లు అద్దెకిచ్చి ఇక్కడ అద్దెకు ఇల్లు తీసుకుంటాను. ఇబ్బంది ఏమీ ఉండదు" అన్నాను.

"అయితే యివాళ మీరు ప్రయాణం మానుకోవద్దు! మాకు కంపెనీ తీర్మానాలు వగైరా చేయవలసిన పనులుంటయ్. తరువాత నేను కబురు చేస్తాను! అప్పుడు రావచ్చు" అన్నారు.

"అలాగే" అని వచ్చేశాను. మధుసూదనరావు గారూ నేనూ నాగేశ్వరరావుగారికి చెప్పడానికి వెళుతూ మధుసూదనరావుగారితో కె.వి. రెడ్డిగారు చెప్పిన విషయం చెప్పాను.

మధుసూదనరావుగారు సంతోషంతో కంగ్రాట్యులేషన్స్ అని కరచాలనం చేశారు.

"మరి నన్ను 'అన్నపూర్ణ'లో పనిచేయాలన్నారు గదా అన్నాను.

"మీరు ఖాళీగా ఉన్నారని అలా అనుకున్నాం! కె.వి. రెడ్డిగారి లాంటి టాప్ డైరెక్టరు మీకు ఆఫర్ ఇస్తే అంతకంటె ఏంకావాలి? మన కంపెనీది ఏముంది! ఎప్పుడైనా రాసుకోవచ్చు" అన్నారు.

వెళ్లి నాగేశ్వరరావుగారికి చెప్పి ఆరాత్రి మెయిలుకు విజయవాడ వెళ్ళిపోయాను.

(కె.వి.రెడ్డి గారు నన్ను "మీరు ఏంచేస్తుంటారు" అని అడిగారని చెప్పానే దానిలో ఒకకిటుకువుంది!

నేను ఏదైనా ఉద్యోగంలోనో, వ్యాపారంలోనో నిమగ్నమై ఉంటే ఆయన నాకు సినిమా రైటర్‌గా ఆఫర్ ఇచ్చి ఉండేవాడు గాదు.

ఆ విషయం నేను వాహినీలో చేరి 'పెద్దమనుషులు' పిక్చరుకు కథా చర్చలు జరుగుతుండగా కె.వి.రెడ్డి గారే నాకు చెప్పారు.

"ఇది గ్యారంటీలేని ఫీల్డు నరసరాజుగారూ! సినిమాల్లో ఎవడు పైకొస్తాడో, ఎవడు ఫెయిల్ అవుతాడో చెప్పలేం!

అందువల్ల మీరు జీవితంలో ఏదో రంగంలో సెటిల్ అయి హాయిగా ఉంటే మిమ్మల్ని లాక్కొచ్చి ఈ సినిమాల్లో చేరిస్తే ఇక్కడ ఫెయిల్ అయితే మీకు నేను ద్రోహం చేసిన వాణ్ణి అవుతాను గదా! అందుకే అడిగాను మిమ్మల్ని "మీరు ఏంచేస్తుంటారు?" అని)

నేను విజయవాడకు తిరిగివచ్చిన పది పదిహేను రోజులకి కాజ వెంకట్రామయ్య గారు మదరాసు వెళ్లి అక్కడనుంచి విజయవాడ విజయపిక్చర్సు ఆఫీసుకు ఫోన్ చేశారు.

"నేను ఈరాత్రి మెయిలులో బయలుదేరి వస్తున్నాను. నేరుగా గుడివాడ వెళతాను! నరసరాజుగారిని విజయవాడ స్టేషనుకు వచ్చి నన్ను కలవమని చెప్పండి" అని

విజయ పిక్చర్సునుంచి నాకు కబురు వస్తే నేను మరునాడు ఉదయం విజయవాడ రైల్వే స్టేషనుకు వెళ్లాను. మదరాసు నుంచి మెయిల్ వచ్చింది. నేను ప్లాట్‌ఫారంమీద నిలబడి వున్నాను. వెంకట్రామయ్యగారు కంపార్టుమెంటులోంచి దిగి అమాంతం నన్ను కావలించుకుని ఆనందంతో "అనుకున్నది సాధించానయ్యా!" అన్నారు. అప్పుడు చెప్పారు. పాతాళభైరవి శతదినోత్సవాలకు వచ్చే ముందు పరిస్థితి. కెవి.రెడ్డిగారు ఒక సాంఘిక చిత్రానికి రచయిత కోసం వెతుకుతున్నారు. ఆయన అంతకుముందు 'భక్త పోతన', 'యోగి వేమన', 'గుణసుందరి కథ',



'పాతాళభైరవి' నాలుగు సినిమాలు తీశారు. ఇప్పుడు ఒక సాంఘిక చిత్రం తీయాలనిపించింది. 'పాతాళభైరవి' విడుదల తరువాత మదరాసులో పరిస్థితి ఏమిటంటే

నాగిరెడ్డి గారు విడుదలకు ముందు 'పాతాళభైరవి' ఫెయిల్ అవుతుందనే అనుకున్నారు. ఆకథ వేరే చెబుతాను.

'పాతాళభైరవి' బాగా పోతున్న 10వ వారం - 11వ వారంలోనో నాగిరెడ్డిగారు - కె.వి.రెడ్డిగారితో "మళ్లీ ఒక పిక్చరు 'విజయా'కి ప్లాన్ చెయ్యి బ్రదర్" అన్నారు. కె.వి.రెడ్డిగారు "విజయాకి కాదు బ్రదర్ - వాహినీకి తీయాలి! బి.యన్. వాహినీకి 'మల్లీశ్వరి' తీస్తున్నాడు గదా! దాని తరువాత నేను వాహినీకి తీస్తాను" అన్నారు.

వాహినీకి గూడ మేనేజింగ్ డైరెక్టరు నాగిరెడ్డిగారే! అందుకని "అదిగూడ నా కంపెనీయే గదా" అన్నారు నాగిరెడ్డి గారు.

"నీవు మేనేజింగ్ డైరెక్టరు అయితే కావచ్చు! వాహినీ నాకు మాతృసంస్థ! దానికే తీస్తాను" అన్నారు కె.వి.

నిజానికి 'పాతాళభైరవి' నిర్మాణ సమయంలో కె.వి.రెడ్డిగారికి, నాగిరెడ్డి గారికి కొన్ని అభిప్రాయ భేదాలేర్పడినయ్!

(వాహినీ సంస్థ 1938-39లోనూ, విజయా సంస్థ 1959లోనూ స్థాపించబడినై).

కె.వి.రెడ్డిగారు వాహినీకే పిక్చరు తీస్తాననడానికి మరో కారణం గూడ ఉండి ఉండవచ్చు! విజయాకి తీస్తే రెమ్యూనరేషన్ ఫిక్స్‌డ్‌గా 'లంప్‌సమ్' గా ఇంత అని వుంటుంది. వాహినీకి తీస్తే నెల నెల కొంత జీతం కాక మరికొంత 'లంప్‌సమ్' ఎమౌంట్ కాక పైగా పిక్చరు మీద వచ్చే లాభాలలో కొంత షేర్ గూడ వస్తుంది. బి.యన్.కి గూడ అంతే! అది వాహినీ ఏర్పాటు!

నాగిరెడ్డి-కె.వి.రెడ్డి గార్ల మధ్య వున్న విభేదాలకు తోడు 'పాతాళభైరవి' విడుదలయిన తరువాత మదరాసులో ఏదో ఒక మందుపార్టీలో మందు ప్రభావంలో కె.వి.రెడ్డిగారు - "పాతాళ భైరవి లేకపోతే నాగిరెడ్డి మళ్లీ ఉల్లిపాయలు అమ్ముకునేవాడే" అన్నారట! (నాగిరెడ్డి గారి తండ్రికి రంగూన్‌కు ఉల్లిపాయల ఎగుమతి వ్యాపారం వుండేది)

అందుకు నాగిరెడ్డి గారు "నాకేం తక్కువ! నా స్టూడియో 5 సంవత్సరాలవరకు బుక్ అయివుంది! నాకేం దిగులు లేదు. కె.వి. పిక్చరు చేస్తే ఎంత? తీయకపోతే ఎంత? అని ఒకరిమీద ఒకరు మాటలు దురుసుగా విసురుకున్నారు.

సాధారణంగా మందు మత్తులో ఏమాటలు అనుకున్నా మత్తు దిగిపోయిన తరువాత ఆ మాటలు మటుకు మరచిపోరు! (ఈ విషయాలన్నీ వాహినీలో చేరి 'పెద్ద మనుషులు'కు పనిచేస్తున్నప్పుడు తెలిసినయ్!)

అప్పటి పరిస్థితి ఏమిటంటే 'పాతాళభైరవి' రచయిత పింగళి నాగేంద్రరావుగారిని - కె.వి. రెడ్డిగారు తెచ్చినవాడే! అంతకుముందు కె.వి.రెడ్డిగారి 'గుణసుందరికథ'కి రచయిత నాగేంద్రరావుగారే!

అయినా 'పాతాళభైరవి' తీసేటప్పుడు నాగేంద్రరావుగారు విజయ ప్రొడక్షన్సు 'పేరోల్'లో వున్నాడు. నెలజీతం కాంట్రాక్టు మీద.

అలాంటప్పుడు నాగేంద్రరావుగారు కావాలంటే - నాగిరెడ్డి గారి పర్మిషన్ తీసుకోవాలి గదా! అందుకని కె.వి.రెడ్డిగారు నాగిరెడ్డిగారిని అడిగారు "బ్రదర్! వాహినీకి ఏదైనా కథ చూసుకుంటాం! నాగేంద్రరావు గారిని నాకివ్వు" అని.



దానికి నాగిరెడ్డిగారు "ఎందుకులే బ్రదర్! వాహినీ విజయా వేరు వేరుగానే ఉండనియ్! Let them be separate అన్నారు.

అంటే "నేను విజయాకి పిక్చరు తీయమంటే వాహినీకి తీస్తానన్నావుగదా! అదిగూడ నాదే గదా అంటే అది వేరు - ఇదివేరు అన్నట్టు మాట్లాడావు గదా! అలాంటప్పుడు విజయా రచయిత వాహినీకి ఎందుకు పనిచేయాలి!" అని నాగిరెడ్డిగారి భావం!

"అంటే నాగేంద్రరావు లేకపోతే నేను పిక్చరు తీయలేను అనేనా?" అని, కె.వి. గారు దానిని ఒక ఛాలెంజ్‌గా తీసుకుని "అలాగేలే బ్రదర్! Let Vauhini , Vijaya be separate" అన్నారు. అప్పటి నుంచి తను తీయబోయే సాంఘిక చిత్రానికి ఒక రచయిత కోసం వెతుకుతున్నారు కె.వి. రెడ్డిగారు!

ఆ విషయాలన్నీ సన్నిహితుడు గనక కాజ వెంకట్రామయ్య గారికి తెలుసు! కాని నాపేరు కె.వి. రెడ్డిగారికి రికమెండ్ చేయడం ఇష్టం లేదు! రెడ్డిగారే స్వయంగా నా 'నాటకం' చూస్తే తప్పక ఇంప్రెస్ అవుతారనే నమ్మకంతో "ఆరోజు కళా మందిరంలో, అదీ ఉదయం మీకు ఇష్టంలేకపోకపోయినా నేను పట్టుబట్టి మీచేత 'నాటకం' వేయించాను. కె.వి.రెడ్డిగారు చూడడం కోసం" అని వెంకట్రామయ్యగారు ఆరోజు రైల్వే ప్లాట్ ఫారం మీద నాకు చెప్పారు. వెంకట్రామయ్యగారు ఎంత గొప్ప వాడంటే ఆయన నాచేత ఆరోజు 'నాటకం' వేయించిన అసలు ఉద్దేశం రెండో మనిషికి చెప్పలేదు. వెంకట్రామయ్యగారు అప్పుడు నాతో చెప్పారు.

'కె.వి. రెడ్డిగారు మీ వీలునుబట్టి పది పదిహేను రోజుల్లో మదరాసు రమ్మన్నారు! మరో విషయం గూడ అడిగారు నన్ను రెడ్డిగారు - 'నరసరాజుగారు రచయితగా నాకు బాగా నచ్చారు! కాని మనిషి ఎటువంటివాడు?' అని అడిగితే-

నరసరాజు గారు మీ గ్రూప్‌లో ఉండదగిన వ్యక్తి! మంచివాడు. జెంటిల్‌మెన్! అందుకే నేను ఆయన్ని రికమెండ్ చేయడం ఇష్టంలేకే మీరు స్వయంగా చూడడం కోసం నేనే ఆరోజు 'నాటకం' ప్రదర్శన కళామందిరంలో ఏర్పాటు చేశాను అని చెప్పాను" అన్నారు వెంకట్రామయ్యగారు.

అప్పుడే చక్రపాణిగారు - కె.వి.యస్. శర్మను విజయాలో ఆర్టిస్టుగా తీసుకోడానికి అతన్ని పంపమని గూడ నాకు చెప్పారు వెంకట్రామయ్యగారు. శర్మకు చెబితే అతను వెళ్లి విజయాలో చేరి అప్పుడు ప్రొడక్షనులో వున్న "చంద్రహారం"లో వేషం వేశాడు.

నేను 1951 సెప్టెంబరు మొదటి వారంలో నేను మదరాసు వెళ్లాను. వెళ్లి ఎప్పటిలాగానే మా ఫ్రెండ్ ప్రసాద్ ఇంట్లో వున్నాను. అప్పటికి నాగేశ్వరరావుగారు నా 'నాటకం' చూడలేదు. మధుసూదనరావుగారు 'నాటకం' బాగుందని చెప్పడంతో నాగేశ్వరరావుగారు నాతో "నాటకం" ప్రదర్శన మదరాసులో 'వాణీమహల్‌'లో ఏర్పాటు చేయండి' ఖర్చు ఎంతవుతుందో చెప్పండి! నేనిస్తాను! ఇండస్ట్రీలో అందరినీ నేను ఆహ్వానిస్తాను" అన్నారు.

సెప్టెంబరు 11వ తేదీ అనుకుంటాను టి.నగర్ వాణీమహల్‌లో నాటకం ఏర్పాటు చేశాను. ట్రూప్ మొత్తం విజయవాడ నుంచి వచ్చారు. ట్రిప్లికేన్‌లో ఒక హోటల్‌లో లాడ్జింగ్ ఏర్పాటు చేశాం' ఖర్చు మొత్తం వెయ్యి - పన్నెండు వందలు అవుతుందనిన చెప్పాను. నాగేశ్వరరావుగారు తన ప్రొడ్యూసర్ల దగ్గర తలా 50 రూపాయల చొప్పున 7,8 వందలు - కె.ఎస్. ప్రకాశరావు మిగతా మూడునాలుగువందలు వసూలుచేసి యిచ్చారు.



కె.యస్. ప్రకాశరావు నాతో అన్నాడు "ఏమిటి? నీకు సినిమాల్లోకి రావాలని వుందని - నాతో ఎప్పుడూ చెప్పలేదే?"

"ఇప్పుడు గూడ నువ్వు రమ్మంటే వచ్చేవాణ్ణి గాదు. మధుసూదనరావు గారికి గూడ అదే చెప్పాను. లక్షలు పెట్టి పిక్చరు తీస్తూ నామీద రిస్కు తీసుకోవడం నాకిష్టంలేదు. కె.వి.రెడ్డి గారంటే పెద్ద డైరెక్టరు. నాలో ఏవైనా లోపాలుంటే ఆయన సర్దుకుంటాడని ఒప్పుకున్నాను" అన్నాను.

కె.యస్. ప్రకాశరావు అంతకు 7,8 సంవత్సరాలకు ముందు విజయవాడలో ఫ్రెండు! జింఖానాక్లబ్‌లో బలియర్డ్స్ ఆడేవాళ్లం! అప్పుడు అతను ఏదో యిన్సూరెన్స్ కంపెనీకి బ్రాంచి మేనేజరు. అంతకు ముందు అతను గూడవల్లి రామబ్రహ్మంగారి సినిమాలు రెండిట్లో హీరో వేషాలు వేశాడు. 1940 ప్రాంతాల్లో 'అపవాదు', 'పత్ని' సినిమాల్లో ఆ తరువాత 1945-46లో నిర్మాతగా 'గృహప్రవేశం' తీశాడు. అది ఎల్.వి. ప్రసాద్‌గారి మొదటి దర్శకత్వం!

తరువాత ప్రకాశరావు నిర్మాతగా 'ద్రోహి' సినిమా తీశాడు. అందులో హీరోగా కూడ నటించాడు.

ఆ తరువాత సొంత కంపెనీ ప్రకాశ్ ప్రొడక్షన్స్ పెట్టి 'మొదటి రాత్రి' 'దీక్ష' తీశాడు. నేను వాహినీ లో చేరేటప్పటికి 'దీక్ష' తీస్తున్నాడనుకుంటాను.

ఆ రోజు వాణీమహల్లో 'నాటకం' చూడ్డానికి ఇండస్ట్రీలో ప్రముఖులంతా వచ్చారు. ముఖ్యంగా కె.వి.రెడ్డిగారు మదరాసులోని రచయితలెవరినీ కాదని ఎవరో కొత్త రచయితను తెచ్చాడు. అతని రచన 'నాటకం' ఎలావుంటుందోనని కుతూహలం! ఆ నాటకం చూడ్డానికి కె.వి.రెడ్డిగారిని గూడ రమ్మని పిలవడానికి వారి యింటికి వెళ్లాను.

"ఎందుకండీ! విజయవాడలో చూశానుగా!" అన్నారాయన! "అబ్బే అది పగటి భాగోతంలా వేశాం! ఇది రెగ్యులర్ షో గదా" అన్నాను.

"అంతకంటె బాగుంటుందంటారా?"

"తప్పకుండా"

"ఏమో: అది పెరఫెక్ట్‌గా వుంది. దానిమీద improve చేయగలరా! చూద్దాం! వస్తాను" అని వచ్చారు.

నాటకం చూశాక "నాకు అదే బాగుంది" అన్నారు. ఆరోజు నాటకంలో టెలిఫోన్ సెట్ ప్రాపర్టీగా తీసుకురావడం మరచి పోయాం. ఆఖరి నిమిషంలో చెబితే నాగేశ్వరరావు గారు స్వయంగా తన కారులో వెళ్లి సినిమాలకి పరికరాలు సప్లయ్‌చేసే గిరి మ్యూజియంనుంచి టెలిఫోన్ తెచ్చి ఇచ్చారు!

అప్పటికి వాహినీ ప్రొడక్షన్స్‌కు ఆఫీసు తీసుకోలేదు. అంతకుముందు బి.ఎన్.రెడ్డిగారు 'మల్లీశ్వరి' పిక్చరు తీస్తూ - ప్రొడక్షన్ ఆఫీసు వాహినీ స్టూడియోలోనే పెట్టుకున్నాడు. నాగిరెడ్డితో విభేదాలు ఉండడంవల్ల కె.వి.రెడ్డిగారు ప్రొడక్షన్ ఆఫీసు స్టూడియోలో పెట్టడం ఇష్టంలేక కొడంబాకం హై రోడ్డులో - ఇప్పుడు Palmgrove hotel ఉన్నదానికి ఎదురుగా ఒక పాత బంగళా అద్దెకు తీసుకున్నారు. "ఆ బిల్డింగుకు కొన్ని మరమ్మతులు ఫర్నిచరు ఏర్పాటు చేయడానికి కొంత టైంపడుతుంది! అక్టోబరు 1కి తయారవుతుంది! అంతవరకు కథాచర్చలకు మా ఇంట్లో కూర్చుందాం" అని సెప్టెంబరు 16వ తేదీనుంచి కె.వి.రెడ్డిగారి ఇంట్లో స్క్రిప్టు పని ప్రారంభించాం.

అదీ నా సినిమా రంగప్రవేశానికి ముందు కథ! ముఖ్యంగా కాజ వెంకట్రామయ్యగారు చేసిన సహాయం



అంతా యింతా కాదు! ఆయన ఋణం తీర్చుకోలేను. నాకే గాదు ఎంతోమంది ఆర్టిస్టులకి సినిమా దర్శకులకి, నిర్మాతలకి, ఎంతోమందికి సహాయం చేశారు! చాలా గొప్పవ్యక్తి.

కాని ఆయనలో ఉన్న ఒకే ఒక్కలోపం! డబ్బు ఖర్చు! ఎవరి డబ్బన్నా కానీయ్యండి ఖర్చుపెట్టేయడమే. తన సినిమాహాల్లో పిక్చరునడుస్తుంటే ఆరోజు కలెక్షన్‌లో తనకు కావలసిన డబ్బు తీసుకుని జేబులో వేసుకోవడమే! పరిషత్తుకు వస్తూ వందలు వేలు జేబులో వేసుకువచ్చి ఖర్చు పెట్టేవాడు. నిర్మాతలకు యివ్వవలసిన షేరు డబ్బు బకాయి పెట్టేవాడు. ఇవిగాక మిత్రుల దగ్గర అప్పులు చేసేవాడు. ఎవరిసంగతో ఎందుకు అక్కినేని నాగేశ్వరరావుగారి దగ్గర ఒకసారి అవసరం వచ్చి పదివేలు తీసుకున్నాడు. ఆ రోజుల్లో పదివేలంటే మాటలా? తిరిగి ఇవ్వనేలేదు! నాగేశ్వరరావుగారు కూడ ఆయన మీద గౌరవంతో అడగనులేదు.

అదొక్కటే ఆయనలో లోపం! అంతకుముందు ఆయన సినిమా హాల్సు లీజుకు తీసుకునేవాడు. గుడివాడలో ఒక థియేటరు విజయనగరంలో ఒకటి. చివరికి గుడివాడలో సొంత థియేటరు కట్టాలని శరత్ టాకీస్ డబ్బులేక చాలా రోజుల వరకు పూర్తికాలేదు. చివరిరోజుల్లో ఆర్థికంగానూ, ఆరోగ్యం విషయంలోనూ చాలా బాధలు పడ్డాడు.

☆ ☆ ☆

'పెద్దమనుషులు' రిలీజు .అయిన తరువాత 1954లో బందరులో నాటకకళాపరిషత్తు నాటకపోటీలు జరిగినై. దానికి నేను మధుసూదనరావుగారూ, కె.వి.రెడ్డిగారు వెళ్లాం. హైదరాబాద్‌నుంచి చెన్నారెడ్డి గారు వచ్చారు. అప్పుడు ఆయన హైదారాబాద్‌లో మినిస్టరు. ఇంకా విశాలాంధ్ర ఏర్పాటుకాలేదు. ఆయన మరుసటి సంవత్సరం అంటే 1955కి పరిషత్ పోటీలకు హైదరాబాదు ఆహ్వానించాడు. బందరునుంచి తిరిగి మదరాసు వెళుతూ నేనూ కె.వి.రెడ్డిగారు విజయవాడలో ఆగాం. విజయవాడలో వాహినీకి డిస్ట్రిబ్యూషన్ ఆఫీసు ఉంది. అప్పుడు కె.వి.రెడ్డిగారిని ముత్యాలంపాడులో మా మేనమామ (రాం మామయ్య) రామరాజుగారింటికి తీసుకెళ్లాను. నాకూ - కె.వి.రెడ్డిగారికి ఒక విషయంలో పోలిక వుంది. నాలాగే ఆయనకు గూడ తండ్రి చిన్నతనంలోనే పోతే మేనమామల ఇంట్లో పెరిగి మేనమామ కూతుర్ని పెళ్లి చేసుకున్నాడు. మా మామయ్యగారింటికి breakfast కి తీసుకెళ్లాను రెడ్డిగారిని. మా మామయ్య "రెడ్డిగారూ! మావాణ్ణి ఇక్కడకు తీసుకువచ్చి చదువు చెప్పించబట్టి ఇప్పుడు ఇంతవాడయ్యాడు. వాళ్ల వూళ్లోనే ఉంటే అతని పెత్తండ్రి కొడుకుల్లాగే ఎద్దుముడ్డి పొడుచుకుంటూ వుండేవాడు" అన్నాడు పకపక నవ్వుతూ.

కె.వి.రెడ్డిగారు గూడ నవ్వారు. నేను అన్నాను "మామయ్యా! నువ్వు చెప్పింది అక్షరాలా నిజమే! కాదనను! కాని నాకు గూడ కొంత క్రెడిట్ ఇవ్వాలి గదా! నువ్వు నన్ను చదివించావుగాని - నీ కొడుకుల్లో ఒక్కడూ హైస్కూలు చదువు దాటలేదు గదా!" అన్నాను చనువుగా.

☆ ☆ ☆

అలా సినిమారంగంలో ప్రవేశించాను. చాలా Happy and successful Career in films. నేను చేరిన గ్రూప్ కూడ వాహినీ గ్రూప్! చాలా గర్వించదగిన గ్రూప్!

నన్ను చాలామంది అభినందిస్తుండేవారు! "మీరు చాలా అదృష్టవంతులండి! మంచి కంపెనీలు దొరికాయి!" నిజంగా నేను అదృష్టవంతుణ్ణే!



అందుకే ఈ ఆత్మకథకి 'అదృష్టవంతుని ఆత్మకథ' అని పేరు పెట్టాను. నేను నిజంగా అదృష్టవంతుణ్ణి! నా జీవితంలో కష్టం అంటే ఏమిటో ఎరగను! తండ్రిలేని లోటులేకుండా మా మేనమామలు పెంచారు.

మరో విషయం చెప్పనా! నేను తండ్రిలేని బిడ్డననే కాకుండా మా మేనమామల భార్యలు అందరూ ఆడబిడ్డ కొడుకునని నన్ను 'మీరు' అనే పిలిచేవారు! అది మా కుటుంబాలలో ఆచారం!

అన్నిటికంటే ఆశ్చర్యం మా అత్తగారితల్లి అంటే మా పెద్ద మామయ్య అత్తగారు ముసలామె ఆమె నన్ను చిన్నవాణ్ణి 'మీరు' అనేది. అందుకు కారణం మా అమ్మమ్మ ఆమెకు ఆడబిడ్డట! ఆడబిడ్డ మనమడు గనక నన్ను 'మీరు' అనేది చిన్నప్పటినుంచి.

మా అత్తగారి తల్లి చల్లమ్మగారు నా భార్యని 'శ్యామల' అని పిలిచేది. నా భార్యకి తల్లిదండ్రులు పెట్టిన పేరు వెంకట్రామమ్మ! కాని ఆమె అమ్మమ్మ చల్లమ్మగారికి ఆపేరుతో పిలవడానికి ఒక అభ్యంతరం ఉంది అది ఏమిటంటే -

చల్లమ్మగారి అక్కగారి భర్త పేరు వెంకట్రామరాజు! అందువల్ల భర్తపేరే గాక ఆమె బావగారి పేరుతో గూడ పిలవగూడదు. అందుకని నా భార్యకు ఆమె సొంతంగా 'శ్యామల' అని పేరుపెట్టుకుని ఆపేరుతోనే పిలిచేది.

మా అత్తగారూ అంతే! ఆమె భర్త అంటే మా పెద్దమామయ్య పేరు సుబ్బరాజుగారు. మా అత్తగారికి ఒక (కజన్) బ్రదర్ ఉండేవాడు. అతని పేరు సుబ్బరాజు. అతనికొక తమ్ముడు కృష్ణంరాజు! మా అత్తగారు సుబ్బరాజుని ఆపేరుతో పిలిచేదిగాదు!' ఒరే పెద్దోడా' అనేది.

నన్ను మా మేనమామల భార్యలు 'మీరు' అని పిలవడమేగాక తమ సొంతబిడ్డలకంటె ప్రేమగా చూచేవాళ్ళు!

నాకు గూడ చాలా బుద్ధిమంతుడని పేరు మాఊళ్లో! తరువాత నేను విశ్లేషించుకుంటే నాకు ఒకటే అనిపించింది. ఇందులో సైకలాజికల్ ఫ్యాక్టరు గూడా ఉందనిపిస్తోంది.

చిన్నపుడు క్లాసులో మీకు ఫస్టుమార్కు వస్తుందనుకొండి! ఆ ఫస్టు స్థానం నిలబెట్టుకోడానికి చాలా తాపత్రయ పడతాం! అలాగే నాకూ మా కుటుంబాలన్నిటిలోనూ 'బుద్ధిమంతుడు' అనిపేరు! నాముందు నా పరోక్షంలో గూడ "నరసయ్య చాలా మంచోడు" అంటుండేవారు!

ఆ మంచిపేరు నిలబెట్టుకోవాలనే తాపత్రయం వల్లనే ఏ తప్పుడు పనులు చేయడానికి జంకే వాణ్ణేమోనని పిస్తుంది. మా కుటుంబాల్లో చాలామంది వాళ్ల పిల్లలను "వాణ్ణి చూచి నేర్చుకోండిరా!" అని నన్ను ఆదర్శంగా చూపేవారు. 1972లోనో - 73లోనో ముత్యాలంపాడులో ఒక ఇల్లు కొన్నాను. సత్యనారాయణపురంలో ఇల్లు పోస్టల్ డిపార్టుమెంటువాళ్లకు అంతకు ముందే అద్దెకిచ్చాను. విజయవాడ ఎప్పుడైనా కుటుంబంతో వెళితే హోటళ్లలో ఉండవలసి వస్తోంది. అప్పుడు ముత్యాలంపాడులో ఒక ఇల్లు బేరానికి వచ్చింది. మంచి ఇల్లు బాగా కట్టిన ఇల్లు అని మా రాంమామయ్య చెబితే కొన్నాను. ఆ ఇల్లు నారాయణరాజుది. ఆయనది అసలు నరసన్నపాలెం. ఈ ఇల్లు కట్టి ఆయన భార్య పోయిన తరువాత అద్దెకిచ్చి ఆయన పటమటలోనో ఎక్కడో అద్దె ఇంట్లో వుంటున్నాడు. ఆ ఇల్లు కొని దాన్ని నా భార్యపేర రిజిస్టరు చేయించాను.

"అదేమిటి? నాపేరెందుకు పెట్టారు?" అన్నది నా భార్య "ఏమో! ఎవరు ముందో! ఎవరు వెనకో? ఎవరు చెప్పగలరు? నేను ముందుపోతే నువ్వుండడానికి నీపేర ఒక ఇల్లుంటే మంచిదిగదా!" అన్నాను నవ్వుతూ!



"ఆఁ మీరు పోయిందాకా - నేనెందుకుంటాను? నాకిక్కడ ఏంపని? నేనే ముందుపోతాను" అన్నది నవ్వుతూనే!

"మరి ముందు నువ్వుపోతే ముసలితనంలో నన్నెవరు చూస్తారు?" అన్నాను.

"మీకేం మిమ్మల్ని బాగానే చూస్తారు? మీరంటే అందరికీ ఇష్టమే! కాస్తనోరు పారేసుకుంటానని నేనంటేనే కొందరికి ఇష్టం వుండదు. నేను లేకపోయినా మీకు ఏ లోటూ రాదు" అన్నది.

ఆమె 1980 జనవరి 10వ తేదీన పోయింది. ఆమె అన్నట్టుగానే ఇప్పటికీ నేను సుఖంగానే ఉన్నాను. మా పిల్లలు నాకు ఏ లోటూ రాకుండా చూసుకుంటున్నారు. కష్టం అంటే ఏమిటో అప్పటికీ ఇప్పటికీ తెలియదు.

నేను ఎన్నోసార్లు స్నేహితులతో చెబుతుంటాను. పత్రికల్లో నా రచనల్లో గూడ రాస్తుంటాను. జీవితంలో నేను భయపడేది రెండే రెండింటికి! 1) పేదరికం (2) అనారోగ్యం! ఇవి రెండూ నేను భరించలేను. భయంగూడ! మిగతా కష్టాలు, సమస్యలు మనం తెచ్చుకునేవే! స్వయంకృతాలు! కాని పేదరికం అనారోగ్యం ఈ రెండు మనకు కంట్రోల్ లేనటువంటివి.

'పేదరికం' అంటే ఒక్కోసారి మనమేమీ చేయలేం! ఉన్నది ఎలా పోతుందో పోతుంది! కరిమింగిన వెలగపండు కరణిని సుమతీ! అన్నాడు సుమతీ శతక కారుడు! 'అనారోగ్యమూ' అంతే! ఎంత క్రమశిక్షణతో జీవితంలో ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా అనారోగ్యం ఎలా ఎందుకు వస్తుందో చెప్పలేం! Health is a matter of luck!

అదృష్టవశాత్తూ అవి రెండూ ఇంతవరకు నా జోలికి రాలేదు. 85 ఏళ్లు నిండినాయి! ఇక ముందుగూడా అవి నాకు దూరంగా ఉంటాయనే ఆశిస్తున్నాను!

సినిమాల్లో గూడ చాలామంది అనేవాళ్లు - "మీరు అదృష్టవంతులండీ" అని! ఆత్రేయ అన్నాడు ఒకసారి - "మీరు అదృష్టవంతులు నరసరాజుగారు! మీకు మంచి కంపెనీలు ఉన్నయ్" అని. "నిజమేనయ్యా! నేను సినిమాల్లోనే గాదు జీవితంలోనే అదృష్టవంతుణ్ణి" అనేవాణ్ణి!

జీవితంలో నేను దేనికోసమూ ప్రయత్నం చేయలేదు! అదొక విచిత్రం! I never planned anything! "ఈ పని చెయ్యాలి: సాధించాలి!" అనే సంకల్పమూ, పట్టుదలా ఏమీ ఉండేవి కాదు! కాని ఏది జరిగినా నాకు మంచే జరిగేది!

అన్నిటికంటే అదృష్టం ఏమిటంటే - నాకేకాదు ఎవ్వరికైనా - 'మీ ప్రవృత్తికి తగినటువంటి వృత్తి దొరకడమనేది పెద్ద అదృష్టం! లేకపోతే - నేను చదివిన బి.ఏ డిగ్రీకి నాకేం ఉద్యోగం వస్తుంది? భూములున్నయ్! కౌలు కివ్వడమే కాని నేను వెళ్లి ఆ ఊళ్లో ఉండి వ్యవసాయం చేయలేను గదా! మరి జీవితంలో ఎల్లకాలం వూరికే ఎలా వుంటుంది! ఏదో ఒకటి చెయ్యాలి గదా! అందుకనే 1948 ప్రాంతంలో ఏదైనా చిన్న వ్యాపారం చేద్దామనుకున్నాను. 1941లో చదువు పూర్తిచేసి 42లో ఇల్లు కట్టి, క్లబ్బులో బిలియర్డ్స్ ఆడుకోవడం, స్నేహితులతో తిరగడం - చివరలో నాటకాల మీద మోజు మళ్లడం తప్ప 1948 వరకూ నేను ఏమీ చేయలేదు! భూముల మీద వచ్చే ఆదాయం బ్యాంకులో వేసుకోవడం, తింటూ కూర్చోవడం! అప్పుడు ఏదైనా చిన్న వ్యాపారం చేద్దామని 'దుర్బుద్ధి' పుట్టింది. నాకు క్లాస్‌మేట్స్-కాలేజీమేట్స్ ముగ్గురు నలుగురున్నారు. గుంటూరులో గుంటుపల్లి వెంకటేశ్వరరావు లా చదివి ప్రాక్టీసు పెట్టాడు. బాపట్లలో ఆచంట రంగనాయకులు ప్రొఫెసర్ యన్.జి. రంగాగారి మేనల్లుడు. వాళ్లిద్దరూ గుంటూరు హిందూ కాలేజీలో నాకు జూనియర్స్! నూజివీడు ప్రాంతంలో ఒక మొఖాసాదారు చింతపట్ల వెంకట్రావు మరొకతను మొరవినేని



గోపాలస్వామి అని కాలేజీలో నాకు సీనియర్! స్వగ్రామం ఒంగోలు ప్రాంతంలో ఏదో ఊరు. ఎర్రపాలెం అనుకుంటాను. ఏలూరు దగ్గర బుర్రంపాలెంకి ఇల్లరికం వెళ్లాడు.

వీళ్లు నలుగురూ ఏమన్నారంటే "మేం ఏదో వృత్తిలో ఇరుక్కుపోయాం! నువ్వు ఫ్రీగా ఉన్నావుగదా! పైగా విజయవాడ మంచి వ్యాపార కేంద్రం! నలుగురం భాగస్థులుగా ఏదైనా వ్యాపారం చేద్దాం" అన్నారు.

నేను సరేనని నా ప్రవృత్తికి కాస్త దగ్గరగా వుంటుంది గదా అని బుక్ పబ్లికేషన్స్ పెడదామని ప్రగతీ పబ్లికేషన్స్ అని కంపెనీపెట్టి ఆర్టికల్స్ ఆఫ్ అసోసియేషన్ గూడ ప్రింట్ చేయించాను. మా ఇంటి స్థలం పెద్దది. వెయ్యి చదరపు గజాల కాంపౌండ్! ఇల్లు ఒక పక్కన ఉండేది. మిగతా ఖాళీస్థలంలో ప్రెస్‌పెట్టాలని షెడ్ వెయ్యడానికి మునిసిపాలిటీకి అప్లికేషన్ గూడ పెట్టాను. మెషినరీ కొనడానికి మదరాసు వస్తున్నానని మా ఫ్రెండు వి.జి.ఎస్.వి. ప్రసాద్‌కు ఉత్తరం గూడ రాశాను.

ఇన్నీ చేసిన తరువాత ఒక రోజు రాత్రి నిద్ర పట్టక ఆలోచిస్తుంటే అనిపించింది. "సుఖంగా వున్న ప్రాణాన్ని ఎందుకు కష్టాల్లో ముంచుకోవడం" అని. వ్యాపారంలో నష్టం వస్తే మనడబ్బు పోయినా ఫరవాలేదు గాని లోకుల డబ్బూ పోతుంది. డబ్బు తోపాటు స్నేహమూ దెబ్బతింటుంది. ఎందుకీ గొడవంతా? ఈ వ్యాపారం చేయకపోతే ఎవడేడిశాడు" అని మొత్తం కాగితాలు చించిపారేసి ఆ నలుగురికీ ఉత్తరాలు రాసేశాను.

ఎందుకు చెబుతున్నానంటే నాకు మొదట్నుంచీ బిజినెస్ మెంటాలిటీ లేదు! భయం!

అప్పుడు 1948లో నాటక కళాపరిషత్తు నాటకాలు నన్ను ఆకర్షించినాయి! చెప్పానే ఆ రోజుల్లో పిల్లలు నాటకాలు చూస్తే చెడిపోతారని అనుకునేవాళ్లని! నాటకాలు అప్పుడు చూడకపోతే ఇప్పుడు నేను ఈ స్థితిలో ఉండేవాణ్ణి గాను!

నాటక రచన గూడ ఎలా ఏ పరిస్థితుల్లో, చేయవలసివచ్చిందో చెప్పాగదా! ఏలూరు పరిషత్తు నాటకాలు చూడటానికి Free boarding & Lodging కోసం! నాటకాలు రాసి ఏదో పేరు సంపాదించాలని కాదు!

చెబితినే! ఏదీ ప్లాన్డ్ కాదు!

నాటకాల ద్వారా సినిమాలకి! అదీ ప్లాన్ చేసింది కాదు. అందులో గూడ పెద్ద అదృష్టం ఆరోజుల్లో 1951లో 'పాతాళభైరవి' సినిమా టాప్ డైరెక్టర్ కె.వి. రెడ్డిగారు ఆయనంతట ఆయన రమ్మని నన్ను పిలవడం! నేను సైలెంట్ సినిమాలు మూకీల దగ్గరనుంచి టాకీ సినిమాలన్నీ ఎంతో మోజుతో చూడడం - సినిమా రంగానికి వెళ్లాలని ఏనాడూ ఎటువంటి ప్రయత్నమూ చేయకుండానే అవకాశం దానంతట అదే రావడం! ఇవన్నీ అదృష్టాలు గాక మరేమిటి?

ప్రవృత్తికి తగిన వృత్తి దొరకడం అదృష్టం అన్నానే నాకు తెలిసిన నా సహాధ్యాయులు కొందరు సంగీత సాహిత్యాలలో ఇతర లలితకళల్లో ఎంతో అభినివేశం ప్రావీణ్యం ఉండి గూడ జీవితంలో అవసరం కొద్దీ వేరే వృత్తులు చేయవలసి రావడం - దురదృష్టం గదూ!

అటువంటి వాళ్ల ఉదాహరణలు చెప్పగలను! కటికనేని జగన్నాధరావు సంగతి చెప్పానే నేను మదరాసు లయోల కాలేజికి వెళ్లడానికి అతనే కారణమని చెప్పానే అతనికి తెలుగు - ఇంగ్లీషు లిటరేచర్స్‌లో నిష్ణాతుడు. అతని influence చాలావుంది నామీద!



కాని అతను 'లా' చదివాడు! కుటుంబ పరిస్థితులవల్ల అవసరం కొద్దీ ప్రాక్టీసు పెట్టవలసి వచ్చింది. అతని తండ్రులు ఇద్దరన్నదమ్ములు. నెల్లూరుజిల్లా వెంకటగిరి! కాంగ్రెసు ఉద్యమంలో ఆస్తిఅంతా పోయింది. తండ్రికి ఇతనే పెద్దకొడుకు! కుటుంబం గడవాలి! Law is a jealous mistress' అంటారు! లాయరు వృత్తికి లలితకళలకు పొత్తుకుదరదు!

'సంగీతము చేత బేరసారములుడిగెన్' అని సామెతే వుంది. అభిరుచి ఒకచోట! అవసరం వేరేచోట! ఇలాంటి వాళ్లు చాలామంది వున్నారు. It is a loss to the Literary world!

నేను మాత్రం దేనికీ ప్రయత్నం చేయకుండానే అంతా నాకు మంచే జరిగింది జీవితంలో!

ఇష్టంలేకపోయినా జీవితంలో నేను చేసిన 'విఫల' ఉద్యోగ ప్రయత్నం ఒకే ఒక్కటి!

అది 1948లో విజయవాడలో స్థాపించిన ఆలిండియా రేడియో కేంద్రంలో ఉద్యోగం!

ఆ కథ చెప్పాలంటే రెండు మూడేళ్ల వెనక్కి వెళ్లాలి. 1946లో భీమవరం ప్రకృతి ఆశ్రమంలో నాకు కొందరి ప్రముఖులతో పరిచయాలయినాయి.

ఒకరు తూర్పుగోదావరిజిల్లా రాజోలు తాలూకా, సఖినేటి పల్లి వాస్తవ్యులు, శ్రీ రుద్రరాజు రామలింగరాజుగారు! ఆయన తరువాత ఆంధ్రప్రదేశ్ గవర్నమెంటు 1971 ప్రాంతంలో మంత్రిగా పనిచేశారు. ఆయన గారి భార్య వైద్యం నిమిత్తం ప్రకృతి ఆశ్రమానికి వచ్చారు.

మరో పరిచయం పశ్చిమ గోదావరిజిల్లా భీమవరం తాలూకా చిననిండ్రకొలను వాస్తవ్యులు శ్రీ చింతలపాటి సీతారామచంద్ర వరప్రసాద మూర్తి రాజుగారు. ఇప్పుడు ప్రముఖ గాంధీయుడు మరొకరు భీమవరంలో డి.ఎన్.ఆర్. కాలేజీ వ్యవస్థాపకులు దంతులూరు నారాయణరాజుగారు. మరోముఖ్యులు అల్లూరి సత్యనారాయణగారు తరువాత ఆయన ఆంధ్ర ప్రభుత్వంలో మంత్రిగానే గాక ఆలిండియాలో కాంగ్రెసు కమిటీ కార్యదర్శిగా కూడా పనిచేశారు.

నేను 1947 లో తిరిగి విజయవాడకు వెళ్లిన తరువాత పైన చెప్పిన పెద్దలందరూ రాష్ట్ర కాంగ్రెసు వర్కింగ్ కమిటీ ఇతర కాంగ్రెసు సమావేశాలకు విజయవాడ వస్తుండేవారు.

వచ్చినప్పుడు మా ఇంట్లోనే దిగేవారు! అప్పుడే 1948లో ననుకుంటాను. ఆలిండియా రేడియోస్టేషన్ విజయవాడలో పెట్టారు. దాని ప్రారంభోత్సవానికి ఆరోజుల్లో కాస్త నాటకానుభవం ఉన్న వాళ్లం నేనూ రామచంద్ర కాశ్యప వగైరాలే గనక. ఆ ప్రారంభోత్సవంలో ఒక నాటకంలో నేను పాల్గొన్నాను. అందుకుగాను ఆలిండియా రేడియో వారు ఇచ్చిన చెక్కు పాతిక రూపాయలో యాభైరూపాయలో నేను జీవితంలో స్వయంగా సంపాదించిన మొట్టమొదటి సంపాదన!

మేము రేడియో నాటకాలలో పాల్గొనేటప్పుడు రేడియోవాళ్లు మా గొంతులు వాయిస్ పరీక్షిస్తుండేవాళ్లు! ఎందుకంటే వాళ్లకి అనౌన్సర్ కావాలి!

అప్పుడు స్టేషన్ డైరెక్టర్ ఎ.వి. రావు గారు అయ్యగారి వీరభద్రరావుగారు! అసిస్టెంటు స్టేషన్ డైరెక్టరు ఎవరో రామచంద్రన్!

ప్రోగ్రాం ఎగ్జిక్యూటివ్‌గా బాలగురుమూర్తి అని నాకు మదరాసులో పరిచయం. నేను లయోలాలో





**విజయవాడ రేడియో నాటకంలో పాత్రధారులు (1949-50 ప్రాంతంలో)**
**ఎడమ నుండి - చదలవాడ కుటుంబరావు, వైకుంఠరామశర్మ, బేబి శేషు, (రేడియో స్టాఫ్ ఆర్టిస్ట్), నిర్మల(మ్మ), డి.వి.నరసరాజు, రామచంద్ర కాశ్యప,**

చదివేటప్పుడు. అతను ప్రెసిడెన్సీ కాలేజీలో చదువుతుండేవాడు! అతనిది నెల్లూరు! అతని మిత్రుల్ని చూడడానికి మా హాస్టలుకు వస్తుండేవాడు అలా పరిచయం!

ఒక రోజు నన్ను రేడియోస్టేషనుకు పిలిచి అసిస్టెంట్ స్టేషన్ డైరెక్టరు నాకు అనౌన్సర్‌గా జాబ్ ఆఫర్ చేశాడు. వున్నఊళ్లో వుద్యోగం. పైగా ఆ రోజుల్లో ఆలిండియా రేడియో అంటే గ్లామరు గూడా! సరేనని చెప్పి పక్కరూంలో ఉన్న బాలగురుమూర్తి దగ్గరికి వచ్చాను.

"బాల గురుమూర్తీ! నేను గూడ మీ ఆలిండియా రేడియోలో చేరుతున్నాను" అన్నాను. అతను ఆశ్చర్యంగా "ఎలా?" అన్నాడు విషయం చెప్పాను.

"మీరు గనక అనౌన్సర్‌గా వస్తే నేనిక్కడనుంచి ట్రాన్సఫర్ చేయించుకుంటాను" అన్నాడు.

"ఏం?" అన్నాను.

"announcer గా చేరి మీరు గనక ఇలా నా రూంలోకి వస్తే మీకు నేను కూర్చోమని కుర్చీ గూడ ఆఫర్ చేయను! జీతం ఎంతో తెలుసా! నెలకు 80 రూపాయలు! మీకయితే వంద ఇస్తారేమో!" అని "announcer గా చేరవద్దు. ముందు ముందు programme assistant job కి దరఖాస్తులు పిలుస్తారు! దానికి మీరు బాగా



qualified! బి.ఏ చదివారు. తెలుగులో నాటకాలు గూడ రాశారుగదా! దానికి అప్లైచేయండి" అని సలహా ఇచ్చాడు.

అప్పుడు తిరిగి వెళ్ళి స్టేషన్ డైరెక్టరుతో నాకా ఉద్యోగం వద్దన్నాను. 'జీతం ఎక్కువ యిస్తాం' అని గూడ అన్నారు! అయినా 'నాకు అక్కరలేదు' అన్నాను.

తరువాత కొన్నాళ్లకి ప్రోగ్రాం అసిస్టెంట్ కోసం advertise చేశారు.

అప్పుడు అల్లూరు సత్యనారాయణరాజుగారు కాంగ్రెసు పనిమీద విజయవాడ వచ్చారు. ఆయనతో చెప్పాను ఉద్యోగం విషయం.

అప్పుడే ఢిల్లీలో భోగరాజు పట్టాభిసీతారామయ్య గారు ఆలిండియా కాంగ్రెస్ ప్రెసిడెంట్! ఆయన సెక్రటరీగా కళా వెంకట్రావు గారిని తీసుకెళ్లాడు. కళా వెంకట్రావుగారు అల్లూరి సత్యనారాయణరాజు గారికి సన్నిహితుడు!

"కళా వెంకట్రావుగారికి లెటర్ ఇస్తాను. ఢిల్లీ వెళ్లి ఆయన్ని కలుసుకోండి" అన్నారు సత్యనారాయణ రాజుగారు. లెటర్ ఇచ్చారు.

తరువాత ఆచంట రంగనాయకులు అని చెప్పానే బాపట్లలో లాయరు. గుంటూరు కాలేజీలో నాకు జూనియర్. అతను రంగాగారి మేనల్లుడు! అతను "నేను కూడా ఢిల్లీ వస్తాను! రంగాగారితో గూడ చెప్పి రికమెండ్ చేయిద్దాం" అన్నాడు. ఇద్దరం కలిసి గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్‌లో ఢిల్లీకి వెళ్లాం!

ఆలిండియా కాంగ్రెసు ఆఫీసుకు వెళ్లాం! కళా వెంకట్రావు గారికి సత్యనారాయణ రాజుగారి ఉత్తరం ఇచ్చాను! ఆయన వుత్తరం చదివి "తమ్ముడూ! నేనూ ఢిల్లీకి కొత్తగా వచ్చాను. నాకు యిక్కడ యింకా ఎవరి 'పిలక' దొరకలేదు. రేడియో న్యూస్ డిపార్ట్‌మెంటులో మనవాడు కపిల కాశీపతి అని ఉన్నాడు అతనికి ఫోన్ చేసి చెబుతాను! వెళ్లి అతన్ని కలుసుకో" అన్నారు.

నేనూ రంగనాయకులు కాశీపతి గారి ఇంటికి వెళ్లాం. ఆయన నాకు ఢిల్లీ కేంద్రంలో తెలుగు న్యూస్ రీడర్‌గా ఉద్యోగం ప్రయత్నిస్తాను అన్నాడు!

జీతం ఏ 250 రూపాయలో ఉంటుంది. దానికోసం ఢిల్లీ పోవడం ఎందుకని "ఢిల్లీ అయితే వద్దండి" అన్నాను.

ఆయనకి కోపం వచ్చింది. 'ఆహాఁ! వున్న ఊళ్లోనే కావాలన్నమాట ఉద్యోగం! మేమంతా ఎందుకొచ్చామనుకున్నావ్! నీకంటే క్వాలిఫికేషన్ గల వాళ్లు చాలామంది ఉన్నారు!" అంటూ చివాట్లు పెట్టడం మొదలెట్టాడు! నా ప్రక్కనే కూర్చున్న రంగనాయకులు నా పిర్రగిల్లి ఆయన చూడకుండా "పోదాం- రా" అన్నాడు వచ్చేశాం!

తరువాత నేను సినిమాలలోకి వెళ్లాక కాశీపతిగారు సెన్సారు ఆఫీసరుగా మదరాసు వచ్చారు! అప్పుడు నేను ఫలాన అని ఢిల్లీలో తన దగ్గరకు వచ్చానని గుర్తులేదు! బాగా ఫ్రెండ్ అయ్యాడు.

ఢిల్లీలో నేనూ రంగనాయకులు బిర్లామందిర్‌లో మకాం! ఢిల్లీ చుట్టుపక్కల ఎర్రకోట, కుతుబ్‌మినార్ వగైరాలు చూశాం! ఆగ్రా వెళ్లి తాజ్‌మహల్ చూశాం! అలహాబాద్ వెళ్లి త్రివేణి సంగమం చూశాం! అలహాబాద్ నుంచి కాశీ వెళ్లాం!



కాశీ గనక చూస్తే అంతకు ముందున్న పవిత్రాభిప్రాయం గూడ పోతుంది. అంత డర్టీ ప్లేస్! అక్కడనుంచి కలకత్తా వచ్చి అక్కడ రెండు రోజులున్నాం. విక్టోరియా మెమోరియల్ వగైరాలు చూసి వచ్చేశాం!

ఉద్యోగ ప్రయత్నం పుణ్యమా అని అన్నీ చూసి వచ్చాం. అలహాబాద్, కాశీ, కలకత్తా చూడడం అదే మొదటి సారి. అదే ఆఖరి సారి. డిల్లీ మాత్రం తరువాత రెండు మూడుసార్లు వెళ్లాను. తరువాత ఆలిండియా రేడియో వాళ్లు Programme assistants ఉద్యోగాలు withdraw చేసుకున్నారు. అంతకుముందు క్రింది ఉద్యోగాలనుంచి వాళ్లనే సెలక్ట్ చేసి తీసుకున్నారు! దాంతో ఆ ఉద్యోగం ప్రయత్నం అలా ముగిసింది!

చాలా కాలం తరువాత బాలగురుమూర్తి హైదరాబాద్ స్టేషన్ డైరెక్టరుగా వచ్చాడు. అప్పటికి నేను సినిమాలలో రైటర్‌గా బాగా గుర్తింపు పొందాను.

ఒకసారి హైదరాబాద్‌లో కనిపిస్తే అన్నాడు "అదృష్టవంతుడివి! ఆలిండియా రేడియోలో ఆనాడు చేరి ఉంటే మాలాగే ఇలాగే గొర్రెతోకలా ఉండేవాడివి" అన్నాడు.

నిజమే! నేను రేడియోలో వుద్యోగం చేస్తుంటే కె.వి. రెడ్డిగారు నన్ను సినిమాలోకి తీసుకునేవాడు కాదు.

అదీ నేను చేసిన ఒకే ఒక ఉద్యోగ 'విఫల' ప్రయత్నం.

☆ ☆ ☆

ఇంతవరకు నాటకరంగంతో నాకు గల పరిచయాన్ని గురించి నా నాటకరచనల గురించి చెప్పాను! ఇప్పుడు తెలుగు 'సాహిత్యం'తో నాకు గల సంబంధాన్ని గురించి చెబుతాను.

ఇదివరకే చెప్పానుగదా - బెజవాడ హిందూ హైస్కూలులో తెలుగు మాస్టారు శిష్ట్లా లక్ష్మీకాంత శాస్త్రిగారి పుణ్యమా అని తెలుగులో నాకు మంచి పునాది పడింది.

ఆ తరువాత ఇంటర్మీడియట్‌కు గుంటూరు హిందూ కాలేజీలో చేరాను. హిందూ కాలేజీ ఆ క్రిందటి సంవత్సరమే ప్రారంభించారు(1935). మాది రెండవ బ్యాచ్ 1936-38. మొదటి సంవత్సరం కాలేజీ కొత్తపేటలో పాత బ్యాంకు బిల్డింగులో పెట్టారు. హాస్టలు గూడ ఆ బిల్డింగులోనే ఉండేది. యిప్పుడు ఉన్న కాలేజి బిల్డింగులో 'గృహప్రవేశం' చేసింది మా బ్యాచే. హాస్టలు మాత్రం మొదటి సంవత్సరం ఆ పాత బిల్డింగ్‌లోనే ఉండేది. బిల్డింగు మరీ పాతబడి కూలి పోయేటట్లుంటే ప్రక్కనే పోస్టాఫీసుకు ఎడమగా ఒక చిన్న బిల్డింగులో మూడో టరంలో (అంటే 1937 జనవరి అనుకుంటాను) హాస్టలు షిఫ్టు చేశారు. హాస్టల్‌లో గుంటుపల్లి వెంకటేశ్వరరావు అని ఒక మిత్రుడుండేవాడు. తరువాత మేమిద్దరం చాలా దగ్గర స్నేహితులమయ్యాం! గుంటూరులో లాయరుగా ప్రాక్టీసు చేసి 7-8 సంవత్సరాల క్రితం పోయాడు.

వెంకటేశ్వరరావు నాకు ఒక సంవత్సరం జూనియర్. అంటే నేను ఇంటర్ మొదటి సంవత్సరం చదివేటప్పుడు అతను టౌను హైస్కూలులో స్కూలు ఫైనల్ చదువుతూండేవాడు. టౌన్ హైస్కూలు విద్యార్థుల్ని గూడ హాస్టల్లో ఉండనిచ్చేవాళ్లు.

వెంకటేశ్వరరావుకి సాహిత్యంలో మంచి అభిరుచి ఉండేది. 1937లోనో 38లోనో బందరులో నవ్యసాహిత్య పరిషత్తు సభలు జరిగినాయి అంతకు ముందు తల్లావఝుల శివశంకరశాస్త్రి ప్రభృతుల ఆధ్వర్యంలో 'సాహితీ సమితి' ఉండేదట! నవ్యసాహిత్య పరిషత్తు ఆవిర్భావంతో భావకవుల యుగం ప్రారంభమైందని చెప్పవచ్చు.



నేనూ వెంకటేశ్వరరావు బందరు నవ్యసాహిత్య పరిషత్తుకు వెళ్లాం! ఆ సభలు బందరు నేషనల్ కాలేజీ ఆవరణలో జరిగినై. అక్కడే ఆనాటి ప్రసిద్ధ కవులందరినీ చూశాం! దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు, అడివి బాపిరాజుగారు, రుక్మిణీనాథ శాస్త్రి - కృష్ణశాస్త్రిగారి మేనల్లుడు, వింజమూరి శివరామారావు, అప్పుడు ఆ కవులంటే మాకు చాలా గ్లామర్ ఉండేది ఆ సభల్లో 'కాంచనమాల' అని ఒక నాటకం వేశారు. కాంచనమాల వేషం దాడి గోవిందరాజులుగారని ఒక జడ్జి! ఆయన వేశాడు.

బందరులో మేము ఉండడానికి పురాణం సూరిశాస్త్రిగారి ఇంట్లో వసతి దొరికింది. సూరిశాస్త్రి గారంటే మల్లాది రామకృష్ణ శాస్త్రిగారి మామగారు! ఆయన గూడ నాటక కళ మీద పుస్తకాలు రాశారు! 'నాట్యాంబుజం' అని ఆయన రాసిన పుస్తకం చాలా ప్రసిద్ధి పొందింది. ఆయన దగ్గర పెద్ద లైబ్రరీ ఉండేది. మంచి మాటకారి! చమత్కారంగా మాతో కబుర్లు చెప్పేవాడు. సూరిశాస్త్రి గారితో మాకు పరిచయం ఎలా అయిందంటే గుంటూరులో 'పరమయ్య' అని వెంకటేశ్వరరావుకు ఒక మిత్రుడుండేవాడు. ఆ పరమయ్య బందరులో సంస్కృత పాఠశాలలో చదువుతూ సూరిశాస్త్రిగారి యింట్లో వుండి చదువుకునేవాడు. బందరులో ఎక్కడ ఉండడమా అని మేము ఆలోచిస్తుంటే పరమయ్య మమ్మల్ని తీసుకెళ్లి సూరిశాస్త్రిగారికి పరిచయం చేసి వారింట్లో వసతి కల్పించాడు. నవ్యసాహిత్య పరిషత్తు సభలో ఆనాటి భావకవుల కవితా గానం వినడం అప్పుడు అది గొప్ప అనుభూతి.

ఆ తరువాత సంవత్సరం నవ్యసాహిత్య పరిషత్తు గుంటూరులో జరిగింది. టౌన్ హాల్‌లో అనుకుంటాను. కృష్ణశాస్త్రిగారి పాటలు ఆయన మేనకోడళ్లు వింజమూరి అనసూయ, సీత చక్కగా పాడేవాళ్లు.

నవ్యసాహిత్య పరిషత్తు తరఫున 'ప్రతిభ' అనే పేరుతో ఒక మాసపత్రికో - త్రైమాసపత్రికో వస్తుండేది. దానికి ఎడిటర్ తెలికిచర్ల వెంకట రత్నంగారు! ఆయన గుంటూరు ఏ.సి. కాలేజీలో తెలుగు లెక్చరర్! ఆయన కృషి వల్లే 'ప్రతిభ' నడుస్తుండేది. కవులు కవిత్వాలు రాయడంవేరు, అలాంటి సాహిత్య పత్రికలు నడపడం వేరు!

ఆ పత్రికలో ఆనాటి భావకవులందరూ రాసేవాళ్లు! శ్రీశ్రీ, కృష్ణశాస్త్రిగారు వగైరాలు.

ఆనాటి భావకవులందరికీ గురుతుల్యుడు తల్లావఝుల శివశంకరశాస్త్రిగారు. తరువాత ఆయన శివశంకర 'స్వామి' అయ్యాడు. "పద్మావతీ చరణ చారణ చక్రవర్తి" అని ఆయన ప్రసిద్ధరచన! ఖండకావ్యం!

అప్పుడు మా కందరికీ ఆదర్శ భావకవి కృష్ణశాస్త్రిగారు. ఆయన రచనలు మూడు "కృష్ణపక్షం", "ఊర్వశి", "ప్రవాసం" చాలా జటిలమైన సమాసభూయిష్టమైన కవితకవం. కృష్ణశాస్త్రిగారి గేయం ఒకటి స్థానం నరసింహారావుగారు గ్రామఫోన్ రికార్డు గూడ యిచ్చాడు. కృష్ణపక్షంలోని 'ఆశ' అనే గేయం!

"కన్నీటి కెరటాల వెన్నెలేలా? నిట్టూర్పుగాడ్పులో నెత్తావి ఏలా? ప్రళయకాళ మహోగ్ర భయద జీమూతోరు గళఘోర గంభీర ఫెళఫెళార్భటులలో మెరపేలా?

అశని పాతమ్ములో నంబువేలా?

హాలహలమ్ములో నమృతమేలా?

ప్రబల నీరంధ్రాభ్ర జనితగాఢధ్వాంత నిబిడహేమంత రాత్రి కుంతలములో చుక్కేలా?

.......





పురాణం సూరి శాస్త్రి



మల్లాది రామకృష్ణ శాస్త్రి

వికృత క్రూర క్షుధా క్షుభిత మృత్యు కఠోర వికట పాండుర శుష్క వదన దంష్ట్రాగ్నిలో నవ్వేలా?

అప్పటి అటువంటి కవిత్వం నుంచి కృష్ణశాస్త్రిగారు సినిమారంగానికి వచ్చి సినిమాలకు తేలిక భాషలో రాసిన పాటలు ఎన్నో!

కృష్ణశాస్త్రిగారే చెప్పేవారు "ఆలిండియా రేడియోలో రజనీకాంతరావును సినిమాలకి తీసుకువచ్చి బి.యన్. రెడ్డిగారు నన్ను 'కవి'గా రక్షించారు. లేకపోతే నాకవిత్వం గూడ విశ్వనాథ సత్యనారాయణగారి కవిత్వం లాగ పుస్తకాలకే పరిమితమై ఉండేది" అనేవారు.

పైన చెప్పిన 'కృష్ణపక్షం' వగైరా కవిత్వం రాసిన రోజుల్లో కృష్ణశాస్త్రిగారు తన కవిత్వమే గాకుండా ఆంధ్రదేశంలో ఊళ్లు ఊళ్లు తిరిగి ఇతర కవుల గేయాలు కవిత్వాలు గూడ గానం చేసి ప్రచారం చేసేవాడు! ఇది మనిషిలో అరుదైన గొప్ప గుణం! నండూరి సుబ్బారావుగారి 'ఎంకిపాటలు' గూడ ఆయన పాడి ప్రచారం చేశాడట!

ఆ రోజుల్లో అంటే మేము కాలేజీలో చదివే రోజుల్లో 'భావకవి' అంటే కృష్ణ శాస్త్రి గారి లాగానే వుండాలి అని చిన్న చిన్న కవులు ఆయనలాగ - పెద్ద జుట్టు వగైరాలతో ఆయన కవిత్వాన్నే గాక - రూపాన్ని గూడ అనుకరించేవాళ్లు!

నవ్య సాహిత్య పరిషత్తు కార్య కలాపాలన్నీ మేము 'ఫాలో' అయ్యేవాళ్లం! వెంకటేశ్వరరావే నాకు inspiration యిద్దరం కలిసి వెళ్లేవాళ్లం!

ఆ తరువాత ఒక సంవత్సరం విజయవాడ - రామమోహన్ లైబ్రరీలో జరిగింది పరిషత్తు! విశ్వనాథ సత్యనారాయణగారు అధ్యక్షుడు. ఆ సభలోనే శ్రీశ్రీ ప్రసిద్ధ గేయం 'దేశ చరిత్రలు' అనే గేయం గానం చేశాడు.

"ఏదేశ చరిత్ర చూచినా ఏమున్నది గర్వకారణం? నరజాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం" ఆ గేయం గానం చేయగానే పక్కనే కూర్చుని వున్న విశ్వనాథ సత్యనారాయణ గారు శ్రీశ్రీని దగ్గరకు తీసుకుని కావలించుకున్నాడు.



తరువాత 'మహాప్రస్థానం'లో ఆ గేయాలు ప్రింట్ అయినయ్.

భావుకవిత్వం తరువాత అభ్యుదయ కవిత్వం వచ్చింది ఒక వుద్యమంగా! దానికి కమ్యూనిస్టుల అండ వుండేది. 'అభ్యుదయ' అని మేగజైన్ గూడ వచ్చేది.

ప్రయాగ కోదండ రామశాస్త్రి, అనిసెట్టి సుబ్బారావు వగైరాలు, నరసరావుపేట నుంచి నయాగరాకవులని నలుగురయిదుగురు కవులు మంచి అభ్యుదయ కవిత్వం రాశారు.

అనిసెట్టి సుబ్బారావు - యేల్చూరి సుబ్రహ్మణ్యం (యేసు) బెల్లంకొండ రామదాసు - కుందుర్తి ఆంజనేయులు, రెంటాల వగైరాలు.

ఆ తరువాత విప్లవరచయితలనీ, దిగంబరకవులనీ వుద్యమాలు వచ్చినయ్! వాటితో నాకు ప్రత్యక్ష సంబంధం లేదు. కారణం నేను సినిమాలలో మదరాసులో వుండి పోయాను గనుక! మదరాసులోనే వున్నారు గనక శ్రీశ్రీ, ఆరుద్ర, అనిసెట్టి, సెట్టి ఈశ్వరరావు వగైరాలతో నాకు పరిచయాలు వుండేవి! నాకు కృష్ణశాస్త్రిగారితో చాలా సన్నిహిత సంబంధం వుండేది.

మరో విచిత్రమైన విశేషం ఏమిటంటే మనం చిన్నతనంలో అంటే చదువుకునే రోజుల్లో ఎవరి రచనలను బాగా అప్రిషియేట్ చేసి వాళ్ళమీద ఎంతో గౌరవ భావంతో వుండేవాళ్ళమో-

ఆ రచయితలు మన తరువాత జీవితంలో మన సహాయానికి రావడం అనేది విచిత్రానుభవం!

మునిమాణిక్యం నరసింహారావు గారి "కాంతం కథలు" నేను హైస్కూల్లో చదువుకున్నప్పటినుంచి తరువాత గూడ నాకెంతో యిష్టం! ఆయన హైస్కూలు మాస్టరుగా రిటైరై, 1955-56 ప్రాంతంలో నేను సినిమాల్లో రచయితగా వున్నప్పుడు ఆయన నా దగ్గరకు వచ్చి "రాజుగారూ! నాపేరు మునిమాణిక్యం నరసింహారావు..." అని తనకు తాను పరిచయం చేసుకోబోతే నేను నవ్వి ఆయన రెండు చేతులూ పట్టుకుని-

"నేను మీ అభిమానిని! చిన్నప్పట్నుంచీ మీ కథలు చదివి ఆనందించినవాణ్ణి మాస్టారూ!" అన్నాను.

"నేను సినిమాకథలకి పనికిరానా? రాజుగారూ" అని అంటే నాకు కళ్లంట నీళ్లు తిరిగినయ్!

మునిమాణిక్యం నరసింహారావు గారికి మొదటి భార్య పోయింది. ఆయన మళ్లీ పెళ్లి చేసుకున్నాడు! రెండోపెళ్లి గురించి 'తిరుమాళిగ' అని పెద్ద కథ రాశాడు. అప్పుడు ఆయన రెండో భార్యతో మదరాసు వచ్చి ఆయన స్నేహితుడొకాయన పోస్టల్ డిపార్ట్‌మెంటులో ఒక పెద్ద వుద్యోగి ఆయన ఇంట్లో దిగాడు. ఆ వుద్యోగి చెట్‌పట్‌లో వుండేవాడు. ఆయన కూర్మా వేణుగోపాలస్వామి గారికి బంధువని జ్ఞాపకం!

నరసింహారావుగారు ఆయన ఫ్రెండు అడ్రసు చెబితే మరునాడు ఆయన్ని ఆయన శ్రీమతిని చూద్దామని వెళ్లాను. నరసింహారావుగారు భార్యను పిలిచి నన్ను పరిచయం చేసి "ఏమే! నేనంటే ఏమనుకున్నావు నువ్వు? నరసరాజుగారు నా ఫ్యాన్! అభిమాని" అని సగర్వంగా చెప్పారు.

ఇలాంటి అనుభవమే దైతా గోపాలంగారితో! గోపాలం గారు మ్యూజిక్ డైరెక్టర్ పెండ్యాల నాగేశ్వరరావుకి అక్కినేని నాగేశ్వరరావుగారికి గురువు- నాటకాలు వేసేటప్పుడు! ఆయన నా చిన్నతనంలో జొన్నవిత్తుల శేషగిరిరావు తుంగల చలపతిరావుగార్లతో 'సక్కుబాయి' నాటకం దర్శకత్వం బాధ్యతలతో ప్రదర్శించడం నేను తన్మయుడనై చూశాను. ఆయన అంటే ఎంతో గౌరవం!



అటువంటాయన మదరాసువచ్చి పెండ్యాల నాగేశ్వరరావు ఇంట్లోవుండి నేను రాసే సినిమాలలో తనచేత పాటలు రాయించడానికి సహాయం అడిగితే ఎలా ఉంటుందో ఆలోచించండి!

మరొక అనుభవం! విశ్వనాథ సత్యనారాయణగారితో! నా మొదటి చిత్రం 'పెద్ద మనుషులు' తీసేటప్పుడు అందులో ప్రధాన పాత్రధారి జంధ్యాల గౌరీనాథశాస్త్రిగారు! ఆయన కె.వి.రెడ్డి గారి మొట్టమొదటి చిత్రం 'భక్త పోతన'లో శ్రీనాథుడు వేశాడు. బ్రహ్మాండం!

ఆయన సొంతంగా 'గీతాంజలి' అని ఒక సినిమా తీశాడు! అది పరమప్లాప్! ఆస్తి అంతా పోయింది. ఆయన ధనవంతుడు. అగ్రహారీకుడు. సినిమాలముందు అగ్రహారాలు, జమీన్‌లు ఆగవండి!

'పెద్ద మనుషులు' సినిమాలో గౌరీనాథశాస్త్రిగారు వేసిన వేషం మొదట యస్.వి.రంగారావు చేత వేయించాలని ఒకరోజు రెడ్డిగారు రంగారావును ఆఫీసుకు పిలిపించారు. రంగారావుగారికి నేను కథ చెప్పాను.

నేను విజయవాడ వెళ్ళి 'పెద్ద మనుషులు' డైలాగ్స్ రాసి తిరిగి మదరాసు వచ్చేసరికి పరిస్థితి మారింది.

కె.వి.రెడ్డిగారు "నరసరాజుగారూ! మన పిక్చర్‌లో చైర్మన్ వేషం రంగారావు కాదు గౌరీనాథశాస్త్రిగారిని చేశాను" అన్నారు. నేను కొంచెం సందేహం వెలిబుచ్చేసరికి ఆయన "లేదు! లేదు! ఆయన మంచి ఆర్టిస్టు! మనం అనుకున్న పాత్రకు బాగా suit అవుతాడు. 'తేనెపూసిన కత్తి' లాంటి వాడనిగదా - మనం పాత్రని సృష్టించాం. అందుకు రంగారావు కంటే శాస్త్రిగారు బాగుంటాడు చూద్దురుగాని అన్నారు.

ఆ పాత్రకు శాస్త్రిగారు బాగా suit అవుతాడనేగాక ఆయన్ను తీసుకోవడానికి యింకా రెండు మూడు సెంటిమెంటల్ కారణాలున్నాయ్!

1941-42లో కె.వి.రెడ్డిగారు తీసిన మొట్టమొదటి చిత్రం 'భక్త పోతన' గురించి కొంత చెప్పాలి!

వాహినీ సంస్థకు మొదటి మూడు పిక్చర్లకు బి.యన్.రెడ్డి గారు నిర్మాత-దర్శకుడు. 'వందేమాతరం', 'సుమంగళి', 'దేవత'. ఆ మూడు పిక్చర్లకు కె.వి. రెడ్డిగారు ప్రొడక్షను మేనేజరు. అసిస్టెంటు డైరెక్టరు గూడకాదు. అటువంటి వాడు పిక్చరు డైరెక్టు చేయడమంటే బి.యన్.రెడ్డి గారికి, ఆయన కుటుంబీకులకు అసలు ఇష్టంలేదు. కె.వి. రెడ్డిగారికి బి.యన్.రెడ్డి గారికి అసలు ఎక్కడా దూరపు బంధుత్వం గూడ లేదు. బి.యన్.గారిది కడపజిల్లా పులివెందల తాలూకా, కె.వి.రెడ్డిగారిది అనంతపురం జిల్లా తాడిపత్రి. వాహిని పిక్చర్సులో పెద్ద వాటాదారు ఆ కంపెనీకి చైర్మను అయిన మూలా నారాయణస్వామి గారు, కె.వి. రెడ్డిగారు తాడిపత్రిలో హైస్కూల్లో సహాధ్యాయులు! ప్రాణస్నేహితులు! కె.వి. రెడ్డిగారిని బి.యన్.రెడ్డిగారికి 'గృహలక్ష్మి' సినిమా (దర్శకుడు హెచ్.యం.రెడ్డి) నిర్మాణ సమయంలో పరిచయం చేసింది నారాయణస్వామిగారే!

నారాయణస్వామిగారు అండగా నిలబడి 'భక్త పోతన' సినిమాకి లాభం వస్తే కంపెనీది. నష్టం వస్తే నాది అన్న తరువాత బి.యన్.రెడ్డిగారు ఇక ఏమీ అనలేక కె.వి.రెడ్డిగారికి 'భక్త పోతన' డైరెక్షన్ ఛాన్స్ ఇచ్చారు.

అయినా బి.యన్.రెడ్డిగారు అంత అనుభవంతో తీసిన మూడు పిక్చర్లు అంతంత మాత్రంగా వుంటే ఏమీ అనుభవం లేని కె.వి.రెడ్డి తీస్తే యిక కంపెనీ మూత బడవలసిందేనని వాళ్ల నమ్మకం! కె.వి.రెడ్డిగారు నాతో చెప్పారు "వాహినీ సంస్థను దివాలా తీయించడానికే నేను అవతరించినట్టుగా నన్ను చూసేవారు B.N. His family! ఎందుకులే నారాయణస్వామీ! వాళ్లందరికి ఇష్టం లేనప్పుడు నాకు 'భక్త పోతన' ఎందుకులే మానేద్దాం!" అంటే, నారాయణస్వామి



"వాళ్ల ఇష్టమేమిటి? నేను చెబుతాను ఉండు" అని డైరెక్టర్ల బోర్డు మీటింగ్ పెట్టి "కె.వి. 'పోతన' తీస్తాడు! లాభం వస్తే కంపెనీది. నష్టం వస్తే నాది" అన్న తరువాత వాళ్లేమంటారు! అలా నారాయణస్వామి వల్ల కె.వి.కి 'పోతన' ఛాన్సు వచ్చిందిగాని లేకపోతే వచ్చేదిగాదు.

నారాయణస్వామిగారు కె.వి. రెడ్డిగారిది ఒకే ఊరని చెప్పాగా! వాళ్లిద్దరు సహాధ్యాయులు! నారాయణ స్వామి గారి చదువు స్కూలు ఫైనల్‌తోనే ఆగిపోయింది. కె.వి. B.Sc., Honours pass అయినాడు. కె.వి. చెబుతుండేవాడు "హైస్కూలులో పరీక్షల్లో నా వెనక బెంచి మీద కూర్చుని కాపీకొట్టడానికి పెద్ద పెద్ద అక్షరాలతో రాయవోయ్ అనేవాడు!" అని

నారాయణస్వామిగారు అబ్కారీ కంట్రాక్టరు. ధనవంతుడు. ఆయన తండ్రి మూలా రంగయ్య రాయలసీమ మొత్తానికి అబ్కారీ కంట్రాక్టరు. ఆయన పోయిన తరువాత నారాయణస్వామి మైనర్ అయితే ఆస్తి Court of Wards లో గవర్నమెంట్ తీసుకుని నారాయణస్వామి మేజరు అయిన తరువాత ఆయనకి అప్ప జెప్పింది ప్రభుత్వం.

ఆయన్ని 'బిర్లా - ఆఫ్. రాయలసీమ' అనేవారట. కాంగ్రెసుకు గూడ బాగా విరాళాలు ఇచ్చేవాడట. చాలా పలుకుబడి గలవాడు. అటువంటి వాడి అండతో కె.వి.కి డైరెక్షన్ ఛాన్సు వచ్చింది.

అసలు చెప్పవలసిన విషయం ఏమిటంటే గౌరీనాథ శాస్త్రిగారి సంగతి! ఆయన మంచి ఆస్తిపరుడు. 'పోతన' సినిమాలో వేషం వేయడమే పెద్ద ఆబ్లిగేషన్ అన్నమాట. శ్రీనాథుడు బ్రహ్మాండంగా చేశాడు. క్రాపు తీసేయించి గుండు కొట్టించుకుని పిలక! ఎంతో గంభీరంగా వున్నాడు.

టైటిల్స్‌లో గూడ కె.వి.రెడ్డి దర్శకత్వం - బి.యన్.రెడ్డి సూపర్ విజన్ అని వుంటుంది.

షూటింగుకు వెళ్లేముందు ఆ సెట్లో సీన్లు అన్నీ ముందుగా ఆఫీసులో క్షుణ్ణంగా రిహార్సల్సు వేసేవారు. నాగయ్య గారు, లింగమూర్తి, గౌరీనాథ శాస్త్రి వగైరాలు.

ఒకరోజు షూటింగ్‌లో అంతకుముందు రిహార్సలు చేసిన పద్ధతిలో షాట్‌కు ముందు రిహార్సలు చేస్తుంటే బి.యన్.రెడ్డిగారు సిన్సియర్‌గా "శాస్త్రిగారూ! అలాకాదు! ఇలా చేయండి! ఇక్కడ నుంచి అక్కడకు ఇలా నడచివెళ్లి" అని చెబితే శాస్త్రిగారు కొంటెగా ఏమీ తెలియనట్టు "ఏదీ? ఒకసారి చేసి చూపండి" అన్నాడట.

పాపం! బి.యన్. నిజంగానే నడిచి చూపాడట! బి.యన్.రెడ్డి - నాగిరెడ్డి గార్ల నడక ఒకరకంగా వుంటుంది. పాదాలు పక్కకు పెట్టి నడుస్తారు! శాస్త్రిగారు కొంటెగా బి.యన్. నడిచినట్టే వెక్కిరించినట్టు నడిస్తే సెట్‌లో ఉన్న వాళ్లంతా light boys తో సహా పకపక నవ్వారట!

బి.యన్. చిన్నబుచ్చుకుని బయటికివెళ్లి పోయి ఆ తరువాత ఎప్పుడూ సెట్‌లోకి రావడంగాని, వచ్చినా కల్పించుకోవడంగాని చేసేవాడు కాదట.

కె.వి. చెప్పేవాడు "ఆ రోజున గనక గౌరినాథశాస్త్రి "ఈ కుర్రాడికేం తెలుసు! మీరు రండి బి.యన్.గారు! చేద్దాం" అని అంటే నన్ను డైరెక్టర్‌గా తీసేసేవాళ్లు! ఆ తరువాత గూడ పిక్చరు మొత్తంమీద నాతో ఎంతో సహకరించి సపోర్టు చేశారు శాస్త్రిగారు!"

అదీగాక గౌరీనాథ శాస్త్రిగారి మామగారు గుంటూరులో లాయరు. పేరు తూములూరు నాగభూషణం గారు ఆయనకీ కె.వి.రెడ్డిగారికి సంబంధం ఏమిటంటే-



కె.వి.రెడ్డిగారి తల్లి గారు ముసలివయసులో మతిస్థిమితంలేక దేవాలయాలు, పుణ్యక్షేత్రాలు తిరుగుతుండేదట. అలా ఒకసారి ఇంట్లో చెప్పకుండా పోయి, గుంటూరు జిల్లా మంగళగిరి వెళ్లిందట! నరసింహ స్వామి దేవాలయం దగ్గర కూర్చుని ఉందట! అక్కడికి శాస్త్రిగారి మామ గారు గూడ వెళ్లారట. చూస్తే ఆ ముసలావిడ ఒంటరిగా కూర్చుని ఉందట! ఏదో వెర్రిచూపులు చూస్తుంటే ఆమెను గుంటూరు తన ఇంటికి తీసుకెళ్లి వివరాలు అడిగితే ఆవిడ తను ఫలాన అని, కె.వి.రెడ్డిగారి అడ్రెసు చెబితే అప్పుడు ఆయన కె.వి.రెడ్డిగారికి కబురు చేస్తే రెడ్డిగారు గుంటూరు వెళ్లి తల్లిని ఇంటికి తీసుకెళ్లాడట! అదీ ఆయనపట్ల కె.వి.గారి కృతజ్ఞతాభావం!

ఆయన 'పెద్దమనుషులు' సినిమా తీయబోతున్నారని తెలిసి కె.వి.రెడ్డిగారి దగ్గరకు వచ్చి "రెడ్డిగారూ! మీకు తెలుసుగదా! మా అల్లుడు గౌరీనాథ శాస్త్రి సినిమాతీసి ఆస్థి అంతా పోగొట్టుకుని అప్పుల పాలయ్యాడు! వీలయితే అతనికేదైనా సాయం చేయండి' అని అడిగాడట!

పైన చెప్పిన రెండు కారణాలవల్ల నటుడుగా శాస్త్రిగారు 'పెద్దమనుషులు'లో ఛైర్మన్ పాత్రకు బాగా Suit అవుతాడన్నధీమాతోనూ. శాస్త్రిగారికి ఆ సినిమాలో చాన్సు యిచ్చారు రెడ్డిగారు!

ఇంత చేస్తే శాస్త్రిగారు ఏంచేశాడూ! 'పెద్దమనుషులు' రెండు మూడు సెట్లు షూటింగ్ అయిన తరువాత-తను తీసిన ఫ్లాప్ సినిమా 'గీతాంజలి'ని మార్పులు ఏవైనా చేసి మళ్లీ షూట్ చేసి విడుదల చేయాలని సంకల్పం! డబ్బుకోసం డిస్ట్రిబ్యూటర్ల దగ్గరికిపోతే విజయా డిస్ట్రిబ్యూటరు పూర్ణచంద్రరావుగారు "ఆ చేసే మార్పులేవో కె.వి.రెడ్డిగారు చేసి మళ్లీ షూటింగు చేస్తే నేను పెట్టుబడి పెడతాను" అన్నాడు.

ఆ విషయం శాస్త్రిగారు వచ్చి కె.వి. రెడ్డిగారికి చెప్పి సాయం చేయమని అడిగాడు!

కె.వి.రెడ్డి గారు 'పెద్దమనుషులు' పిక్చరుతో సతమతమవుతున్నాడు. నాగిరెడ్డి గారికి, తనకు వున్న అభిప్రాయభేదాలు గురించి చెప్పాను గదా! అది దృష్టిలో పెట్టుకుని నాగిరెడ్డిగారు 'పెద్దమనుషులు' నా స్టూడియోలో తీయవద్దు! మరెక్కడయినా తీసుకొండి' అని ఆర్టు డైరెక్టరు శేఖర్‌గారు వేసి ఇచ్చిన సెట్ డిజైన్స్ తిరిగి పంపించేశాడు!

అటువంటి చికాకుల్లో ఉండి రెడ్డిగారు శాస్త్రిగారితో"మీ పిక్చరుకు మార్పులు - చేర్పులు చేయడం నావల్ల కాదండి" అని నిరాకరించాడు.

(వాహినీ ప్రొడక్షన్స్ పిక్చరు మొదటి సెట్టు - వాహినీ స్టూడియో పక్కనే వున్న రేవతీ స్టూడియోలో షూట్ చేశారు! తరువాత బి.యన్.రెడ్డిగారు కల్పించుకుని రాజీ చేస్తే మిగతా పిక్చరు వాహినీలో షూట్ చేశారు)

కె.వి.రెడ్డిగారు అలా అనేటప్పటికి శాస్త్రిగారు blackmail చేయడం మొదలెట్టాడు. షూటింగ్‌లో డైలాగులు సరిగా చెప్పకపోవడం ఏదో విచారంగా వుండడం ఇలా చేసేసరికి కె.వి. అడిగారు "ఏమిటలావున్నారు" అంటే "నా మనసు ఏమీ బాగాలేదండి" అన్నాడాయన. కె.వి రెడ్డిగారు గ్రహించి పిక్చరు చెడగొడతాడన్న భయంతో. "శాస్త్రిగారు! ఈ సెట్టు షూటింగు కానీవ్వండి! తరువాత మీ పిక్చరు 'గీతాంజలి' మీద పని చేద్దాం" అని మాట ఇవ్వవలసి వచ్చింది.

తరువాత రెడ్డిగారు నాతో అన్నారు. "చూశారా నరసరాజు గారు! మంచి చేయబోతే చెడు ఎదురైందంటారే!" అని శాస్త్రిగారు చేసిన పని చెప్పారు.



గౌరీనాథశాస్త్రిగారు - విశ్వనాథసత్యనారాయణగారూ మంచి స్నేహితులు. 'గీతాంజలి' సినిమా మార్పులు చేసే పనికి సత్యనారాయణ గారిని తీసుకువచ్చాడు.

పగలు 'పెద్దమనుషులు' షూటింగు, రాత్రి భోజనానంతరం కె.వి.రెడ్డిగారి ఇంట్లో 'గీతాంజలి' సినిమా మార్పులు, చేర్పుల చర్చ! రెడ్డిగారు, శాస్త్రిగారు, విశ్వనాథ సత్యనారాయణగారు, ముదిగొండ లింగమూర్తి. లింగమూర్తి రెడ్డిగారికి సన్నిహితుడు. మార్పులు గురించి చర్చలు జరుగుతున్నయ్!

ఒకరోజు రెడ్డిగారు వాహినీ ఆఫీసుకు వచ్చి నాతో అన్నారు నవ్వుతూ! "నరసరాజుగారూ! అందుకే నేను ఈ మహాకవుల జోలికి పోనండి! పెద్దవారు! పండితులు! నిజమే! సినిమా మీడియంను స్టడీ చేయరు.

మొన్నరాత్రి 'గీతాంజలి'లో ఒక కొత్త సీను అనుకున్నాం! హీరో హీరోయిన్ల మధ్య ఒక శృంగార ఘట్టం! మరునాడు రాసుకొస్తాను అన్నారు సత్యనారాయణగారు. రాత్రి వచ్చారు. 'రాశానండి' అన్నారు. చదవమన్నాను! సీనులో మొదటి వాక్యమే "మాధవీ! నేను చచ్చిన వెనుక - నా ఆత్మ నీ చుట్టునే తిరుగుచుండును" అంటాడు హీరో! అని నవ్వి రెడ్డిగారు" శుభమా అని శృంగారం రాయమంటే వాక్యం చావుతో మొదలు పెడతాడేమిటండి! ఏం చేయాలో తోచడంలేదు. ఆయన గొప్ప రచయిత! No Doubt! కాని ఇది సినిమా! ఎలా చెప్పడం ఆయనతో!" అన్నారు బాధతో!

అలా మరికొన్ని రాత్రులు చర్చలతో గడిచినాయి! చివరికి సత్యనారాయణగారే పరిస్థితి గ్రహించి "నావల్ల కాదయ్యా! మీ ఏడుపు ఏదో మీరే ఏడవండి" అని లేచిపోయాడట. తరువాత నేను ఒకసారి సత్యనారాయణ గారిని విజయవాడలో 'లీలామహల్లో' కలిశాను! ఇంగ్లీషు పిక్చరు! ఆయన బెంచి క్లాసులో కూర్చుని చూస్తున్నారు. నేను మరికొందరు స్నేహితులు బాల్కనీలో కూర్చుని చూస్తున్నాం! పిక్చరు అయిపోయాక బయటికి వచ్చి "మాస్టారు! మీరు Western culture ని అంతగా తిడతారు! మరి యింగ్లీషు సినిమాలు చూస్తారేం?" అని అడిగితే - "చూడకుండా తిట్టడమెలాగ?" అన్నారు. ఆయన సహజ ధోరణిలో.

మరొకసారి విజయవాడలోనే బీసెంట్ రోడ్డులో రాములు కిళ్లీ కొట్టు ఉండేది! అది కిళ్లీలకు ప్రసిద్ధి! సత్యనారాయణగారు ఆ కొట్టు ముందునిలబడి కిళ్లీ కట్టించుకుంటున్నారు. నేను తలవంచుకుని వెళుతున్నాను! ఆయన్ని చూడలేదు. చప్పట్లు కొట్టారు. చూచి ఆయన దగ్గరకి వెళ్లాను.

ఆయన "ఏమయ్యా! మాస్! మాస్! అంటారే! ఎవరు వాళ్లు? నాకెక్కడా కనబడరే!" అన్నారు అటూ ఇటూ చూస్తూ.

నేను నవ్వుతూ "వాళ్లు పాపాత్ములకే గాని పుణ్యాత్ములకు కనబడరు మాస్టారూ!" అన్నాను.

"బాగా చెప్పావు" అన్నారాయన!

☆ ☆ ☆

వాహినీ పిక్చర్సు 1939లో స్థాపించారు. బి.యన్.రెడ్డిగారి దర్శకత్వంలో 'వందేమాతరం', 'సుమంగళి', 'దేవత' తీశారు. తరువాత కె.వి.రెడ్డిగారు 'భక్త పోతన' తీశారు. అప్పటినుంచి వాళ్లిద్దరూ ఒకరి తరువాత ఒకరు వాహినికి పిక్చరు తీయడం ఆనవాయితీ!



అలాగే కె.వి. 'భక్త పోతన' తరువాత బి.యన్. 'స్వర్గసీమ' తీశారు. ఆ తరువాత మళ్లీ కె.వి. 'యోగివేమన' తీశారు. ఆ తరువాత బి.యన్. పిక్చరు తీయవలసింది. కాని ఆయన మూలా నారాయణ స్వామిగారి తరపున వాహినీ స్టూడియో నిర్మాణ పనులలో వుండడం వల్ల మళ్లీ కె.వి. రెడ్డిగారే 'గుణసుందరి కథ' తీశారు! ఆ తరువాత బి.యన్. 'మల్లీశ్వరి' తీశారు. 'మల్లీశ్వరి' విడుదలకు ముందే కె.వి 'పెద్ద మనుషులు' స్క్రిప్టు వర్కు ప్రారంభించారు. చెప్పానుగా 'పెద్ద మనుషులు' స్క్రిప్టు రచన 1951 సెప్టెంబరు 16న ప్రారంభించాం! ట్రీట్మెంటు సీన్ ఆర్డర్ పూర్తి అయిన తరువాత నేను విజయవాడ వెళ్లి డైలాగులు రాసుకుని 1952 జనవరి సంక్రాంతి పండుగ తరువాత మదరాసు తిరిగి రావాలని అనుకున్నాం!

1951 డిసెంబరు చివర్లో 'మల్లీశ్వరి' రిలీజు అయింది. 1952 జనవరి మొదటి వారంలో బి.యన్.రెడ్డి గారు నాకు విజయవాడకు ఉత్తరం రాశారు. "పండగ తరువాత మీరు రావద్దు" నేను విజయవాడ వస్తున్నాను. ఇద్దరం కలిసి విజయనగరం వరకు వెళ్లి వద్దాం. ఈ మధ్య సెంటర్లలో 'మల్లీశ్వరి'కి ప్రేక్షకుల రియాక్షన్ ఎలావుందో చూద్దాం! అన్నారు. అలా విజయనగరం వరకు వెళ్లి తిరిగి విజయవాడ వచ్చి, నేను సకుటుంబంగా బి.యన్. రెడ్డి గారితో మదరాసు వెళ్లాను. అప్పుడు నా కుమార్తె 'కవిత' కు వయసు దాదాపు రెండున్నర సంవత్సరాలు.

మదరాసు వచ్చిన తరువాత కె.వి. గారికి డైలాగులు చదివి వినిపించాను. డైలాగులు వ్రాయడానికి విజయవాడ వెళ్లేముందు కె.వి. గారు నాకోమాట చెప్పారు. "ఇది మీకు మొదటి పిక్చరు గనక పిక్చరును దృష్టిలో పెట్టుకోకుండా సీన్లు, మీకు ఎన్ని తోస్తే అన్నిరాయండి: మనం కూర్చుని ఫైనలైజ్ చేసేటప్పుడు మీకు అనుభవం వస్తుంది" అన్నారు.

అందుకని మొత్తం 120 సీన్లు రాశాను: దాదాపు 60 సీన్లుచాలు. లేకపోతే పిక్చరు పొడవు పెరిగి పోతుంది. 120 నుంచి 60 సీన్లకు కుదించడానికి మాకు రెండు నెలలు పట్టింది. కొన్ని సీన్లు సీక్వెన్సులే తీసి వేయవలసి వచ్చింది. 'వంగర' కుటుంబానికి సంబంధించిన సీన్లన్నీ తీసివేశాం!

ఈలోగా బి.యన్.రెడ్డిగారు రచయితగా నన్ను గురించి కె.వి. ని అడిగారు.

కె.వి. "చాలా బాగా రాశాడు బ్రదర్! I am more than satisfied" అన్నారు.

అప్పుడు బి.యన్. "అయితే స్క్రిప్టు అయిపోయిన తరువాత నీకు రైటర్‌తో ఎక్కువపని వుండదు గనక నేనూ నరసరాజు కూర్చుని నా తరువాత పిక్చరుకు కథ రాసుకుంటాం" అన్నారు.

ఆ మరునాడు కె.వి. ఆఫీసుకు రాగానే నాతో "కంగ్రాట్యులేషన్స్! నరసరాజుగారూ!" అన్నారు. "ఎందుకు?" అన్నాను. బి.యన్. తరువాత పిక్చరు నాతో రాయిస్తారన్న విషయం చెప్పి "కంగ్రాట్యులేషన్స్" ఎందుకు చెప్పారంటే...

"నాకూ, బి.యన్‌కు అభిరుచులు వేరు! నాకు నచ్చిన వాళ్లు ఆయనకు నచ్చరు! ఆయనకు నచ్చినవాళ్లు నాకు నచ్చరు. 'గుణసుందరి కథ'కు రాసిన పింగళి నాగేంద్రరావు గారి చేత 'మల్లీశ్వరి'కి రాయించుకో-బ్రదర్" అని నేనంటే -

బి.యన్ "ఆయనది ఎరుకల యానాదిభాష! 'గిడిగిడి' 'మామగోరు' నాకు నచ్చవు అన్నాడు.

నేనిప్పుడు మీతో రాయిస్తున్న పిక్చరుకు ఆయన కృష్ణశాస్త్రిగారి చేత పాటలు రాయించుకోమన్నాడు.



రాజేశ్వరరావుని మ్యూజిక్ డైరెక్టరుగా పెట్టుకోమన్నాడు. "నాకీ మహాకవులు! జీనియస్సులు వద్దుబ్రదర్ అన్నాను" అన్నారు.

(అలాగే మ్యూజిక్ డైరెక్టరుగా 'గుణసుందరి కథ'కి పనిచేసిన ఓగిరాల రామచంద్రరావుగారిని 'పెద్ద మనుషులు'కు పెట్టుకున్నారు!)

"మా ఇద్దరికీ నచ్చిన రైటరు మీరు ఒక్కరే! అందుకే కంగ్రాట్స్ చెప్పాను" అన్నారు.

ఆ ప్రకారమే నేను బి.యన్ గారి తరువాత పిక్చరుకు రాసేట్టు ఏర్పాటు చేసుకున్నాం.

ఆ తరువాత కొన్నాళ్లకు కె.వి. రెడ్డిగారు 'అన్నపూర్ణ' వారి మొదటి పిక్చరు "దొంగరాముడు"కి ఒప్పుకుని తనకు ఎప్పటిలాగే ఎవరైనాసరే exclusive writer కావాలన్నారు. 'పెద్దమనుషులు' పూర్తి అయిన తరువాత 'అన్నపూర్ణ' పిక్చరు ప్రారంభిస్తాను అనే షరతుమీద ఒప్పుకున్నాడు కె.వి.గారు. అప్పుడు అన్నపూర్ణ పిక్చర్స్ ప్రొడ్యూసరు డి. మధుసూదనరావుగారు (ఆయన నేను అంతకుముందే నాటక కళాపరిషత్తు ద్వారా మిత్రులం) కె.విని అడిగారు. "మీకు స్క్రిప్టు అయిన తరువాత రైటర్‌తో ఎక్కువ పని ఉండదు గదా! నరసరాజుగారిని రిలీజ్ చేస్తే మేమిద్దరం కథ కోసం పనిచేసుకుంటాం" అన్నారు. కె.వి. "సరే అలాగే" అన్నారు.

మరునాడు కె.వి.గారు నాతో "నరసరాజుగారూ! మీరు బి.యన్. తరువాత పిక్చరుకు రాస్తానని ఆయనకు మాటయిచ్చారు. ఇప్పుడు 'అన్నపూర్ణ'కు రాస్తానంటే మిమ్మల్ని నేను తీసుకుపోతున్నాను అనుకుంటాడేమో బి.యన్. మా యిద్దరికీ అభిప్రాయభేదాలు వచ్చే ప్రమాదం వుంది. ఎలాగ? అన్నారు.

"ఫరవాలేదులెండి! నేను బి.యన్ గారితో మాట్లాడతాను" అన్నాను. బి.యన్. గారితో విషయం చెప్పాను. ఆయన పెద్దమనసుతో ఉదారంగా "అలాగే నరసరాజుగారూ! మీరె కె.వి.తో మరొక పిక్చరు పనిచేయడం మీ కెరీర్ కి మంచిది. అదీగాక మధుసూదనరావుగారు మీరు ఇదివరకే మంచిమిత్రులని నాకు తెలుసు! మీరు వాళ్లకే రాయండి! నేను భీమవరం నుంచి పాలగుమ్మి పద్మరాజును పిలిపిస్తాను! ఆయన కృష్ణశాస్త్రిగారి ద్వారా పరిచయం. ఆయనకు సినిమాలకు రాయాలని ఉంది. నన్ను చాలాసార్లు అడిగాడు" అన్నాడు.

అలాగే ఆయన పద్మరాజుగారిని పిలిపించి 'బంగారుపాప'కు రాయించారు. అంతకుముందు పద్మరాజుగారు భీమవరం కాలేజీలో కెమిస్ట్రీ లెక్చరర్‌గా పని చేస్తున్నారు. ఆయన గొప్ప కథకుడు. అంతర్జాతీయ కథల పోటీలో (ఒక అమెరికన్ పత్రిక నిర్వహించింది) ఆయనకథ 'గాలివాన'కు రెండో బహుమతి వచ్చింది.

ఇక్కడ జ్ఞాపకం వచ్చింది కాబట్టి చెబుతున్నాను. ఆలిండియో రేడియో వాళ్లు చేసిన మంచి పనుల్లో కొన్ని చెప్పుకోదగినవి, అభినందించదగినవి.

స్థానం నరసింహారావు, మునిమాణిక్యం నరసింహారావు, దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి లాంటి దాదాపు రిటైరైన రచయితలు నటుల్ని హైదరాబాద్ రేడియో స్టేషన్లో ఏదో శాఖలో నియమించుకుని, వారి ప్రతిభను ఉపయోగించుకున్నారు. ఒక విధంగా వాళ్లకు అండగా నిలబడింది ఆలిండియో రేడియో.

హైదరాబాద్ ఆలిండియా రేడియోలో పని చేస్తున్నప్పుడే పాపం కృష్ణశాస్త్రిగారికి ఒక ట్రాజెడీ జరిగింది. ఆయన ఏకైక పుత్రిక సీత చనిపోయింది. దాంతో ఆయన చలించిపోయాడు. దానికితోడు ఆయన గొంతులో



కాన్సర్ వచ్చి బొంబాయిలో ఆపరేట్ చేస్తే వాయిస్ పోయింది. ఆ తరువాత ఆయన మదరాసు వచ్చి మళ్లీ సినిమాకు పాటలు రాశారు!

కృష్ణ శాస్త్రిగారిది పిఠాపురం ఆయన తండ్రిగారు పెద తండ్రిగారు, పిఠాపురం రాజాగారి ఆస్థానకవులు! శాస్త్రిగారికి పెద్ద ఆస్తిఉండేది. ఆయన మహా భోగి! ఆయన 'మల్లీశ్వరి'కి పనిచేసిన తరువాత నేను వాహినీలో చేరిన తరువాతే నాకు ఆయనతో పరిచయం.

పొందూరు ఖద్దరు ధోవతి తెల్లటి లాల్చీ, జుట్టుకు నల్లటి రంగు, కస్తూరి అత్తరు, కళ్లకు సురమా, ఘుమఘుమలాడే తాంబూలం! ఎప్పుడూ ఇంట్లో కవి మిత్రులు. ఆస్తి అంతా అలా వెనకాముందూ చూసుకోకుండా ఖర్చు పెట్టేశాడు. గొంతు పోయి మళ్లీ ఆయన మదరాసు వచ్చాక ఆయనతో నాకు సాన్నిహిత్యం ఏర్పడింది!

గొంతు పోయాక ఎప్పుడూ చేతిలో చిన్న పాడ్ పట్టుకుని రాసేవాడు! అలాగే పాడ్‌మీద రాస్తూనే అందరినీ ఎంటర్‌టెయిన్ చేసేవాడు.

ఒకసారి శాస్త్రిగారి ఇంటికి మాధవపెద్ది సత్యం వచ్చాడు. అప్పుడు నేను అక్కడే వున్నాను. సత్యం, నేనూ 1946-47లో నాటకాలు వేశాం! ఆ చనువుతో "ఏం సత్యం? ఎలా ఉన్నావు అని నేను అడిగితే "నాకేం? రాయిలా ఉన్నాను!" అని గుండెమీద చేత్తో గట్టిగా కొట్టుకున్నాడు.

అప్పుడు శాస్త్రిగారు నన్ను దగ్గరికి పిలిచి పాడ్ మీద్ రాసి చూపుతూ "పైకి చదవకండి! యితన్ని రెచ్చగొట్టకండి. గుండెలు బాదుకుంటున్నాడు. అతనికి ఏదైనా అయితే మనం చిక్కుల్లో పడతాం" అని రాశాడు పాడ్ మీద. నేను నవ్వానుగాని ఆయన మాత్రం ఏమీ ఎరగనట్టు సీరియస్‌గా ఉండేవాడు. నేను డైలాగ్స్ రాసిన పిక్చర్లకు కొన్నిటికి ఆయన పాటలు రాశారు!

అలా నేను రాసిన ఒక పిక్చరుకు ఆయన పాటలు రాయవలసి వచ్చింది. "నరసరాజుగారిని గూడ రమ్మనండి! కథలో SITUATION ఆయన చెబితే నాకు వీలుగా ఉంటుంది అని ప్రొడ్యూసరుతో చెబితే అలాగే నేను వెళ్లాను. మ్యూజిక్ సిటింగ్‌కు కూర్చున్నాం. ఆ మ్యూజిక్ డైరెక్టరు ముందు ఒక ట్యూన్ ఇచ్చాడు. మామూలుగా జరిగే పద్ధతే! గురులఘువులతో -

"తాన తానన - తాన తానన

తాన - తాన - తాన - తాన

తాన తానన!" అని ట్యూన్ యిచ్చాడు.

శాస్త్రిగారు వెంటనే పక్కన కూర్చున్న నాకు సైగ చేసి చేతిలోని పాడ్ మీద రాశాడు.

"పైకి చదవకండి! ఇప్పుడు ఇతను ఇచ్చిన ట్యూన్‌కి నాకు వెంటనే స్ఫురించిన పాట యిది."

"గేదె వచ్చెను! మేత మేసెను!
గేదె వచ్చి మేత మేసి
పేడవేసెను!"

నేను పెద్దగా నవ్వాను. ఆయన మాత్రం ఏమీ ఎరగనట్టు మామూలుగా ఉన్నారు. మ్యూజిక్ డైరెక్టరు



కుతూహలంగా "ఏవిటండి? ఏవిటండి" అని అడిగితే నేను "ఏదో మా స్వంత విషయంలే" అని జవాబు చెప్పాను.

నేను తరచు శాస్త్రిగారి ఇంటికి వెళ్లేవాణ్ణి!. టి.నగర్ జగదాంబాళ్ వీధిలో ఇల్లు మేడమీద ఉండేవారు.

ఆయన కుమారుడు బుజ్జాయి - కోడలు లక్ష్మి, భార్య పేరు రాజహంస! అందరూ నాతో బాగా చనువుగా ఉండేవాళ్లు. ఆయన ఒకసారి పాడ్ మీద రాసారు.

"నా భార్యపేరు రాజహంస! న్యాయమైతే "రాజ హంపి" అని వుండాలి. ఆవిడ నాన్నకి వ్యాకరణం తెలియదు పాపం" అని.

అంతకు ముందు ఆయన కవిత్వమూ సినిమాకు పాటలు రాసే టప్పుడు చాలా టైమ్ తీసుకునేవాడు. రాయలేక గాదు! బద్ధకం! గొంతు పోయిన తరువాత ఓపిగ్గా పేజీలకు పేజీలు రాసేవాడు. నేను రికార్డుగా ఉంటుందని కావాలని కొన్ని ప్రశ్నలు వేసేవాణ్ణి! అన్నిటికీ ఓపిగ్గా పేజీలకు పేజీలు జవాబులురాసేవాడు! ఆయనగారి పూర్వీకులు అంటే తాతలు, తండ్రుల గురించి పిఠాపురం రాజాగారిని గురించి అడిగితే వివరంగా రాసేవాడు. పిఠాపురం రాజాగారు మంచి కళా సాహిత్య పోషకుడు. శాస్త్రిగారికి ఆయనకు అభిప్రాయ భేదాలు వచ్చినయ్. కారణం శాస్త్రిగారు రఘుపతి వెంకటరత్నం నాయుడుగారి శిశ్యుడుగా, బ్రహ్మసమాజంలో చేరడం ఆపైన వ్యావహారిక భాషా ఉద్యమం.

వెంకటరత్నం నాయుడు గారు గొప్ప మేధావి, సంస్కర్త, ఎడ్యుకేషనిస్టు! ఆయనంటే శాస్త్రిగారికి ఎంతో గౌరవము, భక్తి! ఒకసారి విశ్వనాథ సత్యనారాయణగారు కృష్ణశాస్త్రిగారి యింటికి వచ్చినప్పుడు కృష్ణశాస్త్రిగారి తల్లితో అన్నారట. మీవాడు ఆ నాయుడు 'గాడి'తో తిరిగి చెడిపోతున్నాడు" అని.

నాయుడుగారిని నాయుడు 'గాడు' అన్నాడని శాస్త్రిగారు ఎంతో బాధపడుతూ చెప్పేవారు.

నాయుడుగారు ఇంగ్లీషులోరాసిన 'సూఫీ' కవితలను శాస్త్రిగారు 'ఋగ్వీథి' అన్న పేరుతో తెలుగులోకి ఎంతో అద్భుతంగా అనువదించారు.

దానిలోనే నాయుడు గారిని గురించి ఎంతో మంచి పద్యాలు రాశారు. నాయుడు గారికి "బ్రహ్మర్షి" అని బిరుదు.

"అలనాటి ఋషి వాటికల నుంచి పఱతెంచు
ఆమ్నాయ పూతగంగామృతమ్ము
అలనాటి బోధివృక్షాయతచ్ఛాయల సెలలైన బాష్పశీతల జలమ్ము
........ బాగా జ్ఞాపకం లేదు
కలసి నీలోన లోలోన కదలిపార బదను వారిన దయ్యనీ నీ హృదయసీమ"

ఎప్పుడో నలభై యాభై ఏళ్ల క్రితం కంఠస్థం చేసినవి. మధ్యమధ్య కొన్ని లైన్లు ఎగిరిపోయినై.

సినిమా రంగానికి వచ్చాక శాస్త్రిగారు ఎంతో మంచి పాటలు రాశారు. 'కృష్ణపక్షం', 'ఊర్వశి', 'ప్రవాసం' రాసిన కృష్ణశాస్త్రిగారేనా ఈ సినిమా పాటలు రాసింది అనిపిస్తుంది.

'మల్లీశ్వరి'లో -



'మనసున మల్లెల మాలలూగెనే' పాటలో

అలలు కొలనులో గలగల మనినా -
దవ్వుల వేణువు సవ్వడి వినినా -
నీవు వచ్చేవని నీపిలుపే విని
కన్నుల నీరిడి కలయ జూచితిని...

'మల్లీశ్వరి'లో పాటలన్నీ గూడ! పదలాలిత్యంలో ఆయనకు ఆయనే సాటి.

అలలు - కొలను - గలగల --
దవ్వున - సవ్వడి --
కన్నుల నీరిడి కలయ జూచితిని -
'కలయ జూచితిని' ఎంత మంచి భావప్రకటన

'బంగారు పాప'లో -

కన్న దేవకి వంతు - కన్నీరే గాని
. . . . . . . . . . . . .
పేద యశోదకు పెన్నిధులాయె!

'బంగారు పంజరం'లో

నీ పదములె చాలు - రామ!
నీ పద ధూళులె పదివేలు !
. . . . . . . . . . . . . . . .
నిను గానక నిముషము మనలేను
నువు కనబడితే నిను కనలేను

ఇలా రాస్తూపోతే ఎన్నయినా రాయవచ్చు. కృష్ణశాస్త్రిగారు రేడియోకి కూడ ఎన్నో నాటకాలు, యక్షగానాలు రాశారు. ఆయన మంచి వక్త గూడ. ఆయన ఉపన్యాసాలు ఆలిండియో రేడియోలో ఉన్నయ్!

వచన రచనలోనూ ఆయన సిద్ధహస్తుడు. ఆయన ఒకచోట అంటాడు. "నాకు మాత్రం ఎందుకో నా వచన రచనలు నా పద్యాలకీ, గేయాలకీ తీసిపోవు అనిపిస్తుంది." చివరి రోజుల్లో ఆయన మదరాసులో ఉండగా ఎప్పుడైనా ఏదైనా సాహితీ సభలకు వెళితే - ఎవరైనా ఉపన్యాసకుడు చచ్చుగా మాట్లాడుతుంటే ఆయన పక్కనున్న నాకు చూపిస్తూ చేతిలో పాడ్ మీద రాసేవారు.

"నాకే గనక గొంతు ఉంటేనా..." అంత బాధపడేవాడు! ఆయన ఎక్కువగా బయటికి వెళ్లడం తగ్గించిన తరువాత నేను స్టూడియో నుంచి ఇంటికి వెళుతూ మధ్యలో ఉన్న శాస్త్రిగారింటికి వెళ్లేవాణ్ణి.

"మీరు బుజ్జాయికి (కొడుకు) రికమెండ్ చేయాలి కారులో నన్ను బయటికి తీసుకెళ్లమని" అనేవారు. బుజ్జాయి





దేవులపల్లి కృష్ణ శాస్త్రి



దేవులపల్లి సుబ్బరాయ శాస్త్రి (బుజ్జాయి)

అసలు పేరు దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి. కృష్ణశాస్త్రిగారి పెద తండ్రి పేరనుకుంటాను. బుజ్జాయిని చదవనివ్వలేదు శాస్త్రిగారు! ఎప్పుడూ వెంటబెట్టుకుని కాకినాడ వీధుల్లోనూ, సభలకూ తిరిగేవాడట!

"అతన్ని చదువుకోనివ్వలేదేం?" అని ఎవరన్నా అంటే "నాతో ఉండడమే వాడికి ఎడ్యుకేషన్" అనేవారట శాస్త్రిగారు.

ఈ మాట చెబుతూ బుజ్జాయి. "నిజమేనండీ! ఆయనతో ఉండటమే నాకు గొప్ప ఎడ్యుకేషన్! ఆయన ద్వారా నేను చిన్నప్పటినుంచీ ఎందరెందరో గొప్ప గొప్ప వ్యక్తుల్ని కలిశాను. "నాన్న ద్వారా నేను కలిసిన వ్యక్తులూ, ఆ అనుభూతుల్ని గురించి చెబుతుంటే నా కోడలు 'చిత్ర' 'యివన్నీ మీరు రాయండి మామయ్యా" అని పదే పదే అంటుంటే - అవన్నీ రాశాను. దాదాపు 500 పేజీలు!" అని చెప్పాడు బుజ్జాయి. క్రిందటి సారి హైదరాబాద్‌లో నన్ను చూడ్డానికి మా ఇంటికి వచ్చినప్పుడు (2003 ఆగస్టులో)

మదరాసులో శాస్త్రిగారు ఆఖరి రోజుల్లో ఎప్పుడూ ఇంట్లోనే వుంటుండేవారు. నేను మధ్యాహ్నం స్టూడియోనుంచి ఇంటికి వస్తూ వెళ్లి ఆయనతో కాసేపు కబుర్లు చెప్పుకుని ఇంటికి వెళ్లేవాణ్ణి. అప్పుడు ఆయన అనేవారు పాపం:- "మీరు గనక రోజూ ఇలా తీరిక చేసుకుని నాతో ఒక గంట గడప గలిగితే నేను నిండా నూరేళ్లు బ్రతకగలను" అని!

ఒకచోట రాశారాయన: Browning ఆంగ్లకవి రాశాడు. "Grow old along with me" చాలా ఉల్లాసంగా ఉన్నప్పటికీ ముసలితనం చాలా చెడ్డది. ముసలితనంలో మూగతనం భయంకరం - శిథిల మందిరంలో అంధకారం లాగున." అలా నిస్పృహతో అన్నాగూడ ముసలితనాన్ని గురించి ఒక చోట రాశారు -

"ముసలి తనపుటడుగుల సడి
ముంగిట వినబడెనా -
వీట లేడని చెప్పించు !



వీలుకాదని పంపించు!" అన్నారు

"శీతవేళ రానీయకు

శిశిరానికి చోటీయకు" అనే గేయంలో!

ఆయన 83 ఏళ్ల వయసులో పోయారు. 1980లో నా భార్య పోయిన కొన్ని నెలలకు. ఆయన దగ్గర చాలా పెద్ద లైబ్రరీ ఉండేది. ఆయనతో పరిచయం జీవితంలో ఒక అనుభవం!

శ్రీశ్రీతో గూడ నాకు కొంచెం పరిచయం ఉండేది! ఆయన అదొకరకం మనిషి.

నేను ఒక సినిమాకు మాటలు రాసి ఫలాన situation లో పాట శ్రీశ్రీ చేత రాయించండి అని ప్రొడ్యూసర్లకు చెప్పాను. వాళ్లు తమిళ ప్రొడ్యూసర్లు.

మరునాడు మ్యూజిక్ సిటింగ్! మ్యూజిక్ డైరెక్టరు, శ్రీశ్రీ, ప్రొడ్యూసరు అతనే డైరెక్టరు - రామన్న ! తమిళ ప్రఖ్యాత నటి రాజకుమారి తమ్ముడు) నేనూ వెళ్లాను. మ్యూజిక్ డైరెక్టరు ఏదో ట్యూన్ యిచ్చాడు. శ్రీశ్రీ "రేపు రాస్తాను" అన్నాడు. అప్పుడు శ్రీశ్రీ, నేనూ గూడ రాజా అన్నామలైపురంలో ఉండేవాళ్లం! ప్రొడ్యూసరు కారు కోసం పిలిస్తే ఎందుకు నాకారులో నేను డ్రాప్ చేస్తానులెండి" అన్నాను. ఇద్దరం కారులో వెళుతుండగా - శ్రీశ్రీ అన్నాడు. "నరసరాజుగారూ! నాకొక సహాయం చేయాలి! రేపు ప్రొడ్యూసర్‌తో చెప్పి నాకు ఒక వందరూపాయలు ఇచ్చే ఏర్పాటు చేయాలి! ఎందుకంటే రేపటితో liquor permit అయిపోతుంది." అప్పటికి ఇంకా పాటకి కాగితం మీద కలం పెట్టలే! నాకు నవ్వు వచ్చింది.

ఆయన విచిత్ర వ్యక్తి. ఒకసారి దీపావళి వెళ్లిన రెండు మూడు రోజులకి మా ఇంటికి వచ్చాడు. "నరసరాజుగారూ! నాకు అర్జంటుగా ఒక వందరూపాయలు కావాలి. ఎందుకంటే నేను ఆర్డరు చేసిన పుస్తకాల పార్సెలు వచ్చింది. వాటికోసం డబ్బు ఉంచాను! కాని మొన్న దీపావళికి పిల్లలు టపాకాయలు కొని కాల్చేశారు!" అన్నాడు. నాకు నవ్వువచ్చేది ఆయన మాట చేష్టలు చూస్తుంటే! వందరూపాయలు ఇచ్చాను.

శ్రీశ్రీ చాలా మితభాషి. ఎక్కువగా మాట్లాడడు! ఎవరి ఇంట్లోనైనా కలుసుకుంటే ఏ పుస్తకం దొరికితే ఆపుస్తకం చివరికి ఏదైనా పాత కాగితం దొరికినా చదువుతూ కూర్చుంటాడు.

ఒకసారి ఒక సమావేశంలో బెజవాడ గోపాలరెడ్డిగారు ఆయన్ని అడిగారు: "శ్రీశ్రీగారూ! మీరు సినిమాలలో సంపాదించి ఏదైనా ఒక ఇల్లు వాకిలి ఏర్పాటు చేసుకున్నారా?" అని అడిగారు. "ఒకటేం కర్మమండి! రెండిళ్లున్నాయ్! వాటికి తగిన మార్వాడీ అప్పులూ ఉన్నయ్" అన్నాడు శ్రీశ్రీ.

శ్రీశ్రీ కవిగా కంటే మొదట్లో సినిమాలకి డబ్బింగ్ రచయితగా ప్రసిద్ధుడు! డబ్బింగ్ పిక్చర్లలోనే ఎక్కువ సంపాదించాడు - పాటలకంటె. సంపాదించిన వాడు ఊరుకున్నాడా? తనే సొంతంగా ఒక పిక్చరు తెలుగులోకి డబ్ చేశాడు. "చెవిలో రహస్యం" అని పేరుపెట్టి రిలీజు చేస్తే పిక్చరు ఫ్లాప్ అయింది. సంపాయించిన డబ్బు మొత్తం పోయింది.

శ్రీశ్రీ, ఆత్రేయ లాంటి కొందరు వాళ్లకి జీవితం సరళంగా జరగడం ఇష్టం ఉండదనుకుంటాను! భవిష్యత్తుగురించి ఆలోచించరు! ఎప్పుడూ అప్పులే! ఆత్రేయకి ఆల్వార్‌పేట, అశోక్‌రోడ్డులో ఒక ఇల్లుండేది. అది ఎప్పుడూ తాకట్టులోనే ఉండేది. 1968లో నేను నుంగంబాకం లేక్ ఏరియాలో ఇల్లు అమ్మేశాను. చిన్నదిగా ఉందని.





శ్రీశ్రీ



ఆత్రేయ

రాజా అన్నామలై పురంలో అద్దె ఇంట్లోకి మారి పెద్ద ఇల్లుకొందామనే ప్రయత్నంలో ఉన్నాను. ఆ ప్రయత్నంలో నా భార్య రోజా హిందూ పత్రిలో Real Estate Colum లో అమ్మకానికి ఇళ్లు ఎక్కడున్నయ్యా అని చూస్తుండేది. ప్రతి ఆరు నెలలో, ఏడాదికో, ఆ కాలంలో ఆత్రేయ ఇల్లు వేలానికి వచ్చేది. అంటే మార్వాడీ అప్పుగనక వాడికి నెల నెల వడ్డీ చెల్లించకపోతే వాడు కోర్టులో కేసువేసి యిల్లు వేలానికి తెస్తాడు. అప్పుడు ఆత్రేయ ఏ ప్రొడ్యూసరు దగ్గరో డబ్బు తీసుకుని కొంత కోర్టులో చెల్లిస్తే వేలం కొట్టేసేవాడు.

శ్రీశ్రీని గురించి ఆత్రేయని గురించి నేనిప్పుడు రాస్తున్నది వాళ్లని చిన్న బుచ్చడంకోసం కానేకాదు! వాళ్లమీద నాకు నామీద వాళ్లకు గౌరవాలు వున్నాయి. ఇవి నేను ఏ స్పిరిట్‌లో రాస్తున్నానో తెలియాలంటే ఒక విషయం చెప్పాలి.

ఈ 'అనుభవాలు - జ్ఞాపకాలు' ఆత్మకథలో రాయాలని నాలుగయిదేళ్ల క్రితం ప్రారంభించాను! పాతిక ముప్పయి పేజీలు రాసిన తరువాత ఒక మిత్రుడు సలహా యిచ్చాడు. "ఎందుకండీ యింతశ్రమ? డిక్టేట్ చేసి micro cassettes లో రికార్డ్ చేయండి. అవి ఎవరికైనా ఇచ్చి రాయించవచ్చు" అన్నాడు. ఆ సలహామేరకు నేను చెప్పేదివినడానికి ఒక మిత్రుణ్ణి ఎదురుగా కూర్చోబెట్టి, అతనికి చెబుతూ Dictaphone లో పది micro cassettes dictate చేశాను. 2000 సంవత్సరం మార్చిలో! ఆ కేసెట్స్ రాయమని ఇస్తే "మీరు స్పీడ్‌గా చెప్పారు. పైగా సంభాషణాశైలిలో చెప్పారు. రాయడం మావల్లగాదని ముగ్గురు చేతులెత్తేశారు. అప్పుడు నేనే ఓపికచేసుకుని రాద్దామని యిప్పుడు 2003 జులైలో ప్రారంభించి రాస్తున్నాను. ఆ కేసెట్‌లో శ్రీశ్రీని గురించి, ఆత్రేయని గురించి పకపక నవ్వుతూ వాళ్లమీద గౌరవంతోనూ, సానుభూతితోనూ చెప్పినట్టు ఆ కేసెట్లు వింటే అర్థమవుతుంది. అందాకా ఎందుకు ఆత్రేయతో చనువుగా ఒక పబ్లిక్ మీటింగ్‌లోనే అన్నాను.



"ఆత్రేయకు జేబులో డబ్బులుంటే నిద్రపట్టదు! నాకు Bank Account లో balance లేకపోతే నిద్రపట్టదు! మా ఇద్దరి తత్వాలు అంత భిన్నం" అని ప్రేక్షకులతోపాటు నాపక్కనే వేదిక మీద కూర్చున్న ఆత్రేయ గూడ పకపక నవ్వాడు.

ఆత్రేయ తనమీద తనే జోక్స్ వేసుకునేవాడు. ఇదివరకే చెప్పానే "నరసరాజుగారూ మీరు అదృష్టవంతులు! మీకు మంచి కంపెనీలు ఉన్నయ్" అని అతనంటే నేను "నిజమే" అన్నాను. అతను వెంటనే "నాకూ మంచి అవకాశాలే వచ్చినయ్! నేను నిలుపుకుంటేగా?" అని పకపక నవ్వాడు.

ఇది అతను బాగా బిజీ కాక ముందు 1954-55 ప్రాంతాల్లో జరిగిన సంభాషణ. తరువాత అతనూ మంచి కంపెనీలకు రాశాడు. అందాకా ఎందుకు? విజయ ప్రొడక్షన్స్ మొదటి చిత్రం 'షావుకారు'కు చక్రపాణిగారు ఆత్రేయ రచయితగా పెట్టుకున్నాడు. ఈ మహానుభావుడి పిచ్చిచేష్టలు నచ్చక తనే రాసుకున్నాడు చక్రపాణిగారు.

ఆ తరువాత దాశరథి, నారాయణ రెడ్డి గార్లు సినిమా రంగానికి వచ్చారు. వాళ్లు వచ్చినప్పటినుంచి నాకు బాగా పరిచయ స్నేహం. వాళ్లతోపాటే వచ్చాడు నేరెళ్ల వేణుమాధవ్ గారు. ఆయన చేత మిమిక్రీ కార్యక్రమం ఏర్పాటు చేయించాను. బి.యన్.రెడ్డి, నాగిరెడ్డి, చక్రపాణి, కె.వి.రెడ్డి వంటి డైరెక్టర్లను నిర్మాతలను ఆహ్వానించాం.

అలా వాళ్లు ముగ్గురూ అప్పటినుంచీ నాకు చాలా సన్నిహితులు. నేను డైలాగులు రాసిన సినిమాలకు చాలా వాటికి దాశరది, నారాయణరెడ్డి గార్లు పాటలు రాశారు. వేణుమాధవ్‌గారు బి.యన్.రెడ్డి గారి 'పూజాఫలం'లో చిన్న వేషం వేశారు సరదాకి. దాశరథిగారు లౌకికడు కాడు. పాటలు రాయించుకుని నిర్మాతలు డబ్బివ్వకపోతే బాధపడేవాడేగాని వసూలు చేసుకునే నేర్పు ఉండేదికాదు.

చివరిరోజుల్లో "నావల్ల గాదు నరసరాజుగారూ! రాయించుకుని డబ్బివ్వరు! ఏంచేయాలి? నావల్ల గాదు! వెళ్లిపోతాను" అని హైదరాబాద్ వచ్చేశాడు. మంచి స్నేహితుడు. పాటలు రాయడంలో గూడ ఎంతో చిత్త శుద్ధితో రాసేవాడు.

బి.యన్.రెడ్డిగారి 'రంగులరాట్నం'లో ఒక పాట రాశాడు.

"నడిరేయి ఏఝాములో ...."

పాటరాయడం అయిపోయింది. మరునాడు రాజేశ్వరరావు రిహార్సల్స్ చేస్తున్నాడు. రెడ్డిగారు, దాశరథిగారు వున్నారు. నేను వెళ్లాను. దాశరథిగారికి ఒక అనుమానం వచ్చింది. నాతో రహస్యంగా "నరసరాజుగారూ: 'నడిరేయి ఏ ఝాములో' ఏమిటి? నడిరేయి ఒకటే ఝాముగదా" అన్నాడు. నేను నవ్వి "నిన్నటినుంచి ఎవరికీ అనుమానం రాలేదు. నాకూ రాలేదు. ఆడియన్సుకి రాదులెండి" అన్నాను. "ఫరవాలేదంటారా?" అన్నాడు దాశరథిగారు.

తను రాసిన పాటను తానే అంత తరచి తరచి చూసుకునేవాడు. ఎ.వి.యంలో గూడ చాలా పాటలు మంచి పాటలు రాశాడు దాశరథి. మనిషి చాలా సౌమ్యుడు. దాశరథిగారు సినిమా రంగానికి వస్తూ ఆలిండియా రేడియో ఉద్యోగం రిజైన్ చేశాడు. సినిమాలలో ఇమడలేక తిరిగి హైదరాబాద్ వెళ్లిపోయాడు. రేడియో ఉద్యోగం రాజీనామా చేయడం పొరపాటుగా గ్రహించాడు. భయస్తుడు! ఉద్యోగం చేస్తూ సినిమా పాటలు రాస్తే గవర్నమెంటుకు తెలిస్తే?... భయం!






దాశరథితో...

తరువాత గొల్లపూడి మారుతీరావు వచ్చాడు. అతనికి నేను సలహా యిచ్చాను. ఉద్యోగం రిజైన్ చేయవద్దు. దాశరథి అదే పొరపాటు చేశాడు. నువ్వు అదే పొరపాటు చేయకు" అన్నాను. 'గొల్లపూడి' అనే పేరుతో సినిమా కథలు రాశాడు. అది అతని భార్య పేరన్నమాట. ఆమెచేత రసీదు ఇప్పించేవాడు.

శ్రీశ్రీ గూడ అంతే ఆత్రేయలాగానే రేపు ఏమవుతుందోనని ఆలోచించే మనుషులుగాదు.

చెప్పానుగా శ్రీశ్రీ మితభాషి. నేనంటే అభిమానంతో వుండేవాడు. నాకు గుంటూరు నుంచి ఒక స్నేహితుడు పేపర్ కటింగ్ పంపించాడు. "శ్రీశ్రీ తన ఆత్మకథ" "అనంతం'లో నిన్ను గురించి రాశాడు" అని. తరువాత 'అనంతం' పుస్తకంగా వచ్చింది. మిత్రుడు కాకరాల పుస్తకం తెచ్చి యిచ్చాడు.

అందులో రాశాడు శ్రీశ్రీ -

"సినిమా రంగంలో నాకు తెలిసినవాళ్లలో హిపోక్రసీ లేనివాళ్లు యిద్దరు. ఒకరు నటి భానుమతి, రెండు రచయిత నరసరాజు' అని అలా నాకు గొప్ప కాంప్లిమెంట్ ఇచ్చాడు శ్రీశ్రీ! వాళ్లిద్దరికీ నాకు వ్యక్తిగా, తత్వరీత్యా తూర్పుపడమర లంత భేదం.

నాకు ఉన్నది పోతుందేమో నన్న భయం! చెప్పానుగా బాంక్ అకౌంట్‌లో బేలెన్స్ లేకపోతే నిద్రపట్టదు. జీవితంలో నేనెప్పుడూ అప్పు చేయలేదు. ప్రామిసరీ నోట్ మీద సంతకం చేయలేదు. వడ్డీకి ఎవ్వరికీ అప్పు గూడా యివ్వలేదు. ఎక్కువ వడ్డీకి ఆశపడి చిట్ ఫండ్లు, అర్బన్ బ్యాంకుల్లో ఎన్నడూ డిపాజిట్లు చేయలేదు. షెడ్యూల్డు



బాంక్స్ ఇచ్చే వడ్డీతో తృప్తిపడి ఫిక్స్‌డ్ డిపాజిట్స్ చేశానేగాని, ఎక్కువ వడ్డీలకి ఆశపడలేదు. నాకు ప్రిన్సిపల్ ముఖ్యం! వడ్డీ ముఖ్యం కాదు.

I never borrowed or lent money for interest. నేనింతవరకు కోర్టులో అడుగు పెట్టలేదు. ఫిర్యాదీగాకాని, ముద్దాయిగా కాని!

వాహినీ స్టూడియో అధిపతి, నాగిరెడ్డిగారిలాంటి వాళ్లు వ్యాపార నిమిత్తం మార్వాడి వడ్డీలకి అప్పులు చేస్తారు. ఆ డబ్బుతో వ్యాపారం చేసి సంపాయిస్తారు గాబట్టి వడ్డీ ఒక లెక్కలోకి రాదు వాళ్లకి. నా దగ్గర బ్యాంక్‌లో డబ్బు వున్నదని తెలిసి గూడ నన్ను ఎప్పుడూ డబ్బు అడిగేవారు కాదు.

ఆయనే చెప్పేవాడు "మీరు తృప్తివున్న మనుషులు. మీకు కొన్ని ప్రిన్సిపుల్స్ ఉన్నయ్! మీ దగ్గర లక్ష, రెండు లక్షలో తీసుకుంటే నాకు ఎలాగూ చాలదు. అందువల్ల మీ ప్రిన్సిపుల్ ఎందుకు భంగం చేయాలి?" కొందరు వ్యక్తుల తత్వం అలావుంటుంది. టంగుటూరి ప్రకాశం పంతులుగారు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారిని గురించి చెబుతారు. ప్రకాశంగారు ఈరోజు గురించి మాత్రమే ఆలోచిస్తారట. రేపటి సంగతి ఆలోచించరట!

పట్టాభి సీతారామయ్యగారు రేపటి సంగతి ఎల్లుండి సంగతి గూడ ఆలోచిస్తారట!

అందుకే వాళ్ళిద్దరి జీవితాల్లో ఆఖరి రోజులు అంత భిన్నంగా ముగిసినయ్!

ప్రకాశంగారు కటిక పేదరికంలో కన్నుమూశారు. పట్టాభిగారు చివరి వరకు ప్రశాంతంగా జీవితం గడిపారు!

నన్ను ఒకరిద్దరు మిత్రులు అడిగారు "మీకు అన్ని అవకాశాలు వుండి సినిమాలు ఎందుకు తీయలేదు" అని.

సినిమా ప్రొడక్షన్ చాలా రిస్కీ బిజినెస్. నేను జీవితంలో 'రిస్క్' ఉన్నపని ఏదీ చెయ్యను. రూపాయి పెట్టుబడితో వంద రూపాయలు సంపాయించాలనుకోవడం జూదగాడి మనస్తత్వం!

ఒకరోజు వుదయమే నేను స్టూడియోకి వెళితే నాదేండ్ల గారు ఎందుకో డల్‌గా వున్నారు! ఏమిటని అడిగితే "Compose" వేసుకున్నాను' అన్నారు. 'ఎందుకు' అని అడిగాను! అసలు 'Compose' అంటే ఏమిటి." అని అడిగాను. ఆపేరే నాకు తెలియదు అంతకుముందు.

ఆయన నవ్వుతూ "కంపోజ్ వేసుకుంటే ఎదుటివాడు మన ముఖాన వుమ్మేసినా కోపంరాదు" అన్నారాయన!

విషయమేమిటంటే స్టూడియో వర్కర్లతో ఆయనకు పదినిముషాలలో ఒక సమావేశం ఉంది. వాళ్లు రాబోతున్నారు. వాళ్ల వాళ్ల డిమాండ్లు చెబుతారు! ఒక్కోసారి రెచ్చగొడుతూ మాట్లాడతారు! నేనుగూడా కోపంగా ఏదన్నా అన్నాననుకోండి 'అదుగో! రెడ్డిగారు తిట్టారు' అంటారు. వాళ్లు అన్నది చెప్పరు. కాబట్టి వాళ్లు ఏం చెప్పినా, ఎంత రెచ్చగొట్టినా కోపం రాకుండా వుండడానికి కంపోజ్ వేసుకుని వచ్చాను" అన్నారు.

నాకు కావలసింది జీవితంలో Peace of mind! మనశ్శాంతి! నేను చాలామందికి చెబుతుంటాను ప్రొడ్యూసర్లుగా, సినిమారంగానికి వచ్చినవాళ్లలో ఎంతోమంది తమతమ ఊళ్లలో princes లాగ బ్రతికి ఇక్కడకు వచ్చి సినిమా తీసి ఆస్తులు పోగొట్టుకుని Blood Pressure లు తెచ్చుకుని ఆరోగ్యాలు పాడుచేసుకుని మళ్లీ తిరిగి తమ ఊళ్లకి వెళ్లడానికి మొఖం చెల్లక, పువ్వులమ్మిన చోటే కట్టెలమ్మలేక అటువంటి కేసులు మీకు డజన్లు చూపిస్తా!



కొత్తగా వచ్చినవాళ్లు సక్సెస్‌ఫుల్ ప్రొడ్యూసర్స్‌నే చూస్తున్నారుగాని బికారులుగా మారిన వాళ్లని చూడడం లేదు అని చెబుతాను. సినిమా ఫెయిలై తిరిగి వూరికి వెళ్ళడానికి ముఖం చెల్లక ఒక ప్రొడ్యూసరు సతీసమేతంగా ఆత్మహత్య చేసుకున్న కేసు నాకు తెలుసు.

ఇదీ చాలా రిస్కుతో కూడుకున్న వ్యాపారం! మధ్య తరగతి వాళ్లు చేయదగిన వ్యాపారం కాదు!

50 లక్షలు పోయినా ఫరవాలేదు అనుకునే వాడన్నా తీయాలి! లేక ఆస్తి నయాపైసా గూడలేని వాడన్నా తియ్యాలి.

కొందరు 'తెలివిగలవాళ్లు' సినిమా తీయడానికి వచ్చేముందు ఆస్తి పెళ్లాం పిల్లల పేర పెట్టి వచ్చే ప్రబుద్ధులూ ఉన్నారు. ఇవన్నీ కళ్లారా చూశాను గాబట్టే నేను సినిమా ప్రొడక్షన్ జోలికి పోలేదు.

'యమగోల' సినిమా రిలీజు అయినప్పుడు సినిమా పత్రిక యజమాని ఒకడు నా అంగీకారంతోనే ప్రకటించాడు. "వచ్చే సంచికలో 'యమగోల'కు సంబంధించిన ప్రశ్నలకు నరసరాజుగారు సమాధానాలిస్తారు" అని

ఒక పాఠకుడు రాశాడు "యమగోల స్క్రిప్టు రాసేటప్పుడు ఈ చిత్రం ఇంత హిట్ అవుతుందని మీరు అనుకున్నారా?" అని రాశాడు.

"ఇంత హిట్ అవుతుందని నాకు ముందే తెలిస్తే ఆ సినిమా నేనే తీసేవాణ్ణి గదా! అని సమాధానం యిచ్చాను!

ఇప్పుడు సినిమా రంగానికి వచ్చేవాళ్లకి రామానాయుడు గారు ఒక్కడే కనబడతాడు! ఆయన ఎన్ని ఎదురుదెబ్బలు తిన్నాడో వీళ్లకి తెలియదు.

రెండుమూడుసార్లు మూటాముల్లె సర్దుకుని తిరిగి కారంచేడు పోవాలని సిద్ధమయ్యాడాయన! అదృష్టంకొద్దీ సమయానికి ఒక పిక్చరు 'పే' చేయడం మళ్లీ ఇండస్ట్రీలో నిలదొక్కుకోవడం జరిగింది. చాలామందికి తెలియదు! మూడు సినిమాలు సక్సెస్ అయి ఒక్క సినిమా ఫ్లాప్ అయిందంటే ఆమూడు సినిమాల లాభం గాలిలో కలిసిపోతుంది. రిస్క్ అంటే ఒక సంఘటన జ్ఞాపకం వస్తోంది.

ఒక ప్రొడ్యూసరు హైదరాబాద్ నుంచి మదరాసు వచ్చాడు. 30-40 ఏళ్ల క్రితం! నా దగ్గరికి వచ్చాడు. ఆయన ఇంజనీరు. మందులు తయారు చేసే కంపెనీ గూడ ఉంది. హైదరాబాద్ పరిసరాల్లో ద్రాక్షతోటలున్నయ్! ఆయన సినిమా తీస్తానని వస్తే ఆయనకి నా వేదాంతం హితబోధ చేశా" "హాయిగా ఆ వ్యాపారం చేసుకోక సినిమాలకెందుకొచ్చారండీ! యిది చాలా రిస్కీ బిజినెస్!" అన్నాను.

అంటే ఆయన అన్నాడు: "నరసరాజుగారూ! రిస్కు ఏ బిజినెస్‌లో లేదండి? మాకు ద్రాక్షతోటలున్నయ్! లక్షల ఆదాయం వస్తుంది! బాగా పక్వానికి వచ్చి రేపో ఎల్లుండో కొన్ని లక్షలకి అమ్మేద్దామనుకున్నప్పుడు వడగండ్ల వాన వచ్చింది. పండ్లన్నీ మచ్చలు పడినై! అప్పుడు అమ్మితే రావలసినదానిలో నాలుగోవంతు గూడ రాదు. కాబట్టి రిస్క్ అనేది ప్రతి బిజినెస్‌లోనూ ఉందండి!" అన్నాడు.

'నిజమే' ననుకున్నాను. మిగతా వ్యాపారాల్లో గూడ పోగొట్టుకుని దివాలాలు తీసినవాళ్లున్నారు గదా!

నాది రిస్కు తీసుకునే తత్వం కాదు! అంతే.



'మాయాబజార్' అనే శశిరేఖా పరిణయం కథ కవిత్రయం రాసిన 'భారతం'లో లేదు! ఎవరో ఏ జానపదుడో లేక ఏ కవో రాసి ఉంటాడు. వాల్మీకి రాసిన 'రామాయణం'లో లేనివి ఎందరు రాయలేదు! కాటూరి వెంకటేశ్వరరావుగారు 'పౌలస్త్యహృదయం' అని రాశాడు 'పౌలస్త్యుడు' అంటే రావణుడు. రావణుని పాత్రను ఉత్తముడుగా చిత్రిస్తూ రాశాడాయన!

'రాముడు సముద్రందాటి లంకమీదకి దండెత్తి వస్తున్నాడని' సముద్రుడు వచ్చి రావణుడికి చెబుతాడు.

అప్పుడు రావణుడు ఎంతో ఆనందంతో "ఈరోజు కోసం గదా నేను ఇన్నాళ్లు ఎదురు చూస్తున్నాను" అని

"ఎంత చేసిన గాని నాకించుకంత

మంచి దక్కగనీడాయె మాధవుండు!

సాగరా! ఏమి వచియింతు! జానకమ్మ

తల్లినే హరియింపక తప్పదాయె!" అంటాడు. అంటే రాముని చేతులో చావడానికే నేను ఎన్నో చేశాను!ఇప్పటికి నా కోరిక ఫలించబోతోంది. అని సంతోషిస్తాడు.

ఇది వాల్మీకి రామాయణం లేదుగదా అలాగే 'శశిరేఖా పరిణయం' భారతంలో లేదు!

బి.యన్.రెడ్డిగారు - కె.వి.రెడ్డిగారు - వాహినీ గ్రూప్!

నాగిరెడ్డి - చక్రపాణి - విజయగ్రూప్!

నా సంబంధం ఈ రెండు గ్రూపులతో మొదటినుంచీ లేదు. నేను సినిమాలకి వెళ్లడమే కె.వి.రెడ్డిగారి ద్వారా వెళ్లాను. 'పెద్దమనుషులు', 'దొంగరాముడు' ఆయన దర్శకత్వంలో పని చేశాను.

తరువాత బి.యన్. రెడ్డి గారితో 'రాజమకుటం' పనిచేశాను. అంతవరకు విజయాకు ఒక పిక్చరు పని చేయలేదుగదా!

నేను ఆ నలుగురిలో కలిసి మెలిసి తిరిగినా, నాగిరెడ్డి, చక్రపాణి గార్లకు నేను బి.యన్. - కె.వి. మనిషినని! 1960 దాకా! నన్ను నమ్మడానికి నాగిరెడ్డి, చక్రపాణి గార్లకు దాదాపు 10 ఏళ్లు పట్టింది. చక్రపాణిగారు అంతకు ముందు 'షావుకారు', 'పెళ్లిచేసి చూడు', 'మిస్సమ్మ', 'అప్పుచేసి పప్పుకూడు' తీశారు! 1961లో చక్రపాణిగారు నన్ను స్టూడియోకి పిలిపించి "గుండమ్మ కథ" సినిమాకు పని ప్రారంభించారు! ఆ తరువాత చక్రపాణి గారి ఆధ్వర్యంలో 'సి.ఐ.డి.', 'గంగ-మంగ', 'రాముడు-భీముడు', తమిళ హిందీ వర్షన్సుకు పని చేశాను నాగిరెడ్డి, చక్రపాణిగార్లతో!

అలా రెండు గ్రూపులతో కలిసి మెలిసి ఉండేవాణ్ణి గనక వాళ్లను గురించి వీళ్లు - వీళ్లను గురించి వాళ్లు నా ముందే ఫ్రీగా మాట్లాడుతుండేవాళ్లు! ఎందుకంటే వాళ్లందరికీ తెలుసు నేను అక్కడ కబుర్లు ఇక్కడికి ఇక్కడి కబుర్లు అక్కడికి చేరవేసేరకం కాదని! అందువల్ల ఆ రెండు గ్రూపులకి ఒకరి మీద ఒకరికి పరస్పరం ఎటువంటి అభిప్రాయాలుండేవో నాకు తెలుసు.

కె.వి. రెడ్డిగారికి, నాగిరెడ్డి గారిది ఒకే వయసు. యిద్దరిదీ 1912 జననం! ఇద్దరికీ అసలు చుట్టరికమే లేదు.

నాగిరెడ్డిగారికి కడప జిల్లా, కె.వి.ది తాడిపత్రి అనంతపూర్ జిల్లా.

కె.వి.రెడ్డిగారు మూలా నారాయణస్వామిగారూ, తాడిపత్రిలో క్లాస్‌మేట్స్. నారాయణస్వామిగారి చదువు స్కూల్ ఫైనల్‌తో ఆగిపోయింది.



కె.వి. మదరాసు ప్రెసిడెన్సీ కాలేజీలో యింటర్, బి.యస్.సి -ఫిజిక్స్ - ఆనర్స్ చదివారు. ఇంటర్‌లో తెలుగులో కాలేజి ఫస్టు!

అప్పుడి హెచ్.ఎం. రెడ్డిగారు తీస్తున్న 'గృహలక్ష్మి' సినిమాలో నారాయణస్వామిగారు బి.యన్.రెడ్డిగారు బాగస్థులు. నారాయణ స్వామిగారే కె.వి. ఉద్యోగ ప్రయత్నాలు ఫలించకపోతే తీసుకెళ్లి హెచ్.యం.రెడ్డిగారికి అప్పజెప్పారు. జీతభత్యం లేని క్యాషియర్‌గా, చదువుకున్నవాడు నమ్మకస్తుడు అని.

'గృహలక్ష్మి' అయిన తరువాత బి.యన్.రెడ్డిగారు, హెచ్.ఎం.రెడ్డిగారితో విడిపోయి వచ్చి వాహినీ ప్రారంభించారు. 1938లో వాహినీ పిక్చర్స్ పెట్టుబడి 65 వేలు 13 షేర్లు! ఒక్క షేర్ 5 వేలు.

నారాయణస్వామి గారు ఛైర్మన్! 5షేర్లు, పాతికవేలు. బి.యన్.ది జాయింట్ ఫామిలీ 4 షేర్లు, 20 వేలు. ఒక షేరు కడప రామ సుబ్బారెడ్డిగారిది! గొప్ప దేశభక్తుడు. మరో షేరు కడప ఎల్లారెడ్డిగారిది. నాగిరెడ్డిగారి తోడల్లుడు. మరో షేరు దాస్ గారిది. ఇంకో షేరు కె.వి.ది. బి.యన్. దర్శకత్వంలో 'వందేమాతరం', 'సుమంగళి', 'దేవత' మూడు సినిమాలు తీశారు. ఆ తరువాత కె.వి. మొదటి పిక్చరు 'భక్త పోతన'.

బి.యన్.లో గొప్ప విషయమేమిటంటే టెక్నీషియన్స్‌ని మంచివాళ్లని తీసుకునేవాడు! రామ్‌నాథ్ - శేఖర్ అని రామనాథ్ మళయాళీ కెమెరామన్. శేఖర్ సౌండ్ మరియు ఆర్ట్ డైరెక్టరు. బి.యన్. పిక్చర్స్‌కి రాంనాథ్ షాట్ డివిజన్ చేసి స్క్రిప్టు టైప్ చేసేవాడు. రాంనాథ్ - శేఖర్ గొప్ప టెక్నీషియన్స్.

ఈ వివరాలన్నీ నా సినిమా అనుభవాలు 'విజయచిత్ర' (అప్పుడు మాసపత్రిక - నాగిరెడ్డి గారి మూడో కుమారుడు విశ్వనాథ రెడ్డి ఎడిటర్) దానిలో 1991-93లో 'మొగిలి రేకులు' అనే శీర్షికలో రాశాను. అవి రాయడంలో ముఖ్య ఉద్దేశ్యం ఏమిటంటే రికార్డుగా ఉంటుందని.

ఈ కాలం వాళ్లకి అప్పటి విషయాలు తెలియవుగదా! బి.యన్.రెడ్డి ఎవరో నాగిరెడ్డి ఎవరో తెలియదు. ఇద్దరూ ఒకరేననుకుంటారు. ఒక రిపోర్టరు ఎక్కడో రాశాడు నాగిరెడ్డిగారు 'మాయాబజార్' డైరెక్టు చేశారని.

డి.వి. నరసరాజుకి - డి.వి.యస్ రాజు (నిర్మాత)కి తేడా తెలియదు.

అందుకే ముందు తరంవాళ్లకి తెలియడం కోసం అప్పుడు 'విజయచిత్ర'లో నా సినిమా అనుభవాలు రాశాను.

అందులో కొన్ని ఇప్పుడు రాస్తున్న ఈ స్వీయచరిత్రలో రిపీట్ అయినై. 2004లో 'తెరవెనుక కథలు' పుస్తకంగా వేశాము.

అప్పుడు అవి చదివిన వాళ్లకి ఇవి చదివితే బోర్ కొట్టవచ్చు! అవి చదవని వాళ్లకి ఇవి Information గా ఉంటాయని రాస్తున్నాను. పాఠకులు అర్థం చేసుకుని మన్నించగలరని ఆశిస్తున్నాను.

మా తరం వాళ్లలో పోగా మిగిలిన వాళ్లు చాలా తక్కువమంది. ఆమధ్య నా మొదటి చిత్రం 'పెద్ద మనుషులు' చిత్రం వీడియో చూశాను. చూస్తే అందులో పనిచేసిన టెక్నీషియన్లు, నటీనటుల్లో నేనూ, కొండారెడ్డి తప్ప మిగతావాళ్లంతా పోయారు!

కొండారెడ్డి - నాగిరెడ్డిగారి తమ్ముడు. 'పెద్ద మనుషులు' అతనికి కెమెరామేన్‌గా మొదటి పిక్చరు.

☆ ☆ ☆






**"తెర వెనుక కథలు" పుస్తకావిష్కరణ (15.07.2004), డి.వి. నరసరాజు సినీజీవిత స్వర్ణోత్సవ సందర్భం.**

నాటకాలు, సినిమాల గొడవ కాసేపు ప్రక్కన పెట్టి తిరిగి నేను పుట్టి పెరిగిన గ్రామం ముత్యాలంపాడు పోదాం. మా తాతలు, తండ్రులు, వాళ్లు ఆర్జించి నాకిచ్చి పోయిన భూములున్న గ్రామం గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకా, క్రోసూరు మండలం, తాళ్లూరు అని ఇదివరకే చెప్పాను. నా తండ్రి నాకు 3,4 ఏళ్ల వయసులోనే పోవడంవల్ల నన్ను, మా అమ్మను, అక్కయ్యను మా మేనమామలు ముత్యాలంపాడు తీసుకు వచ్చారు. నా భూముల కౌలు - వ్యవహారాలు మా పెద్ద మామయ్య సుబ్బరాజుగారు చూస్తుండేవాడు. నాకు ఊహ తెలిసినప్పటినుంచి ఎలిమెంటరీ స్కూలు చదువునుంచి, బి.ఏ పూర్తి అయ్యేవరకు అంటే 1941 వరకు ముత్యాలంపాడులోనే నా జీవితం గడిచింది. 1942లో బెజవాడ మునిసిపల్ లిమిట్స్‌లోని సత్యనారాయణపురంలో ఇల్లు కట్టాను.

ఇప్పుడు ముత్యాలంపాడు ముచ్చట్లు ముచ్చటించుకుందాం! ఇప్పుడు ముత్యాలంపాడు విజయవాడ మునిసిపాలిటీలో కలిసిపోయింది గాని అప్పుడు నా చిన్నతనంలో అది ఒక చిన్నగ్రామం! బెజవాడ మునిసిపల్ లిమిట్ దాటగానే ముత్యాలంపాడు గ్రామమే!

1948-49 ప్రాంతంలో స్వాతంత్ర్యానంతరం కాంగ్రెసు ప్రభుత్వం వచ్చిన తరువాత 'బెజవాడ' 'విజయవాడ'గా మారింది.

ముత్యాలంపాడు ప్రక్కనే ఏలూరు కాలువ ప్రవహిస్తోంది ఇప్పటికీ!

తుమ్మలపల్లి ఆడిటోరియం దగ్గర ప్రకాశం గారి విగ్రహం వద్ద సబ్‌వే ఉందిగదా! ఆ రైల్వే బ్రిడ్జి కిందఉన్న



పెద్దకాలువ. అక్కడ మూడు కాలువలుగా చీలుతుంది. తూర్పు వైపు ఏలూరు కాలువ, పడమర వైపు బందరు కాలువ, మధ్యన రైవస్ కాలువ!

ఆ రోజుల్లో అంటే నా చిన్నతనంలో 1920-30 ప్రాంతంలో ఈ మూడు కాలువల్లో పడవలమీద - సరుకు రవాణా మనుషుల పడవ ప్రయాణాలు గూడ ఉండేవి.

మనుషుల ప్రయాణానికి 'రహదారిబోట్ల' ఉండేవి! ముత్యాలంపాడు దగ్గర పడవ ఆపమంటే పడవ ఒడ్డుకు చేర్చేవాళ్లు! రహదారి పడవకి పైన 'డెక్' వుండేది. రాత్రిపూట వెన్నెట్లో పడవ ప్రయాణం ఎంతో హాయిగా ఉండేది. ఏలూరు కాలువ, ఏలూరులో రాజమండ్రి నుంచి వచ్చే గోదావరి కాలువతో కలిసేది.

ముత్యాలంపాడు కాలువ ఒడ్డునే ఉన్నా ఆఊరికి మాగాణి లేదు. ముత్యాలంపాడు భూములన్నీ కాలువకి ఉత్తరం పక్కన ఉండేవి. కాలవకంటే భూములు మెరక అవడంవల్ల కాలువనీరు ఎక్కేది కాదు. అందువల్ల ముత్యాలంపాడు రైతులకి అంతా మెట్ట వ్యవసాయమే! ఆ భూములకు 'బుడమేరు' ముంపు వచ్చేది. సడన్‌గా రాత్రికి రాత్రి బుడమేరు ముంపువస్తే పొలాల్లో నాగళ్లన్నీ కొట్టుకుపోయేవి. కాని బుడమేరు ముంపువల్ల లాభం గూడ ఉండేది. బుడమేరు ముంపులో వచ్చిన 'ఒండ్రుమట్టి' వరద తగ్గిన తరువాత భూములకి ఎరువుగా బలాన్నిచ్చేది. మెరక పంటలు బాగా పండేవి.

ముత్యాలంపాడునుంచి మా బంధువులు కొందరు మా అత్తగారి వూరు నరసన్న పాలెంకు పడవలమీద ప్రయాణం చేసేవాళ్లు. సరుకులతో గూడ! ముత్యాలంపాడు నుంచి దాదాపు 20 మైళ్ల దిగువన పెంకీడు వంతెన ఉండేది. అది పడవలరేవు అక్కడదిగి ఒక అరమైలు దూరంలో వున్న నరసన్నపాలెం నడిచివెళ్లేవాళ్లు! ముత్యాలంపాడులో రాత్రి భోజనం చేసి పడవ ఎక్కితే తెల్లారేసరికి నరసన్న పాలెం వెళ్లేవాళ్లు!

పడవలు - ఏలూరువైపు వెళ్లేటప్పుడు ఎవరి సహాయము లేకుండా కాలువ ప్రవాహంలో వెళ్లేవి! ఏలూరు నుంచి బెజవాడ వచ్చేటప్పుడు కాలువ ప్రవాహం ఎదురు గనక గాలి వీలుగావుంటే తెరచాపలు ఎత్తేవాళ్లు! బోటుకు తాడుకట్టి మనుషులు కాలువ ఒడ్డునే నడుస్తూ పాటలు పాడుకుంటూ లాక్కొచ్చేవాళ్లు! కాలవకి రెండు ప్రక్కలా పి.డబ్ల్యు గవర్నమెంటు భూమి దాదాపు పది ఇరవై గజాల వెడల్పున ఉండేది. అందువల్ల ప్రయివేటు కట్టడాలు ఏమీ అడ్డం ఉండేవి కాదు.

కృష్ణకాలవలో యీ మూడే కాదు అటు కృష్ణకు కుడివైపు గుంటూరు జిల్లాలోకి ఒక పెద్ద కాలవ ఉండేది. ఇప్పటికీ ఉంది. దానికి 'కృష్ణా కెనాల్' అనేవాళ్లు! బెజవాడ గుంటూరు రైల్వే లైనులో బెజవాడ తరువాత స్టేషన్ పేరు 'కృష్ణాకెనాల్' ఆకాలవ తెనాలి బాపట్ల చీరాల మీదుగా వెళ్లి, అటు మదరాసు నుంచి బకింగ్‌హాం కెనాల్ వచ్చేది. దానితో కలిసేది. బకింగ్‌హాం కెనాల్ మదరాసులో సముద్రంనుంచి వస్తుంది కాబట్టి ఉప్పునీరు సాగుకి పనికి వచ్చేది కాదు. కృష్ణా కెనాల్ కింద తెనాలి, బాపట్ల తాలూకా గ్రామాలకు సాగునీరు అంది మాగాణి అయ్యేది.

కృష్ణ కెనాల్ బకింగ్‌హాం కెనాల్‌లో పూర్వం మదరాసుకు సరుకుల రవాణా ద్వారా పెద్ద వ్యాపారం జరిగేదట! అప్పుడు రోడ్డు రైలు రవాణా సౌకర్యాలు ఎక్కువగా ఉండేవి కాదు గనక కాలువల మీద రవాణా జరిగేది.

ముత్యాలంపాడు నుంచి భూములన్నీ కాలవ అవతల గనక కాలవ దాటడానికి బోటు ఉండేది. దానిని 'బల్లకట్టు' అనేవాళ్లు. దానికి ఒక పల్లెవాడు. గవర్నమెంట్ పల్లెవానికి జీతమిచ్చేది. రైతులు గూడ ధాన్యం గింజల



రూపంలో కొంత ఇస్తుండేవాళ్లు. పశువులు మేతకు కాలువ అవతల బీళ్లకుపోయి తిరిగి సాయంత్రం వచ్చేవి. రాను, పోను కాలవలో ఈదుకుని పోవాలిగా! అందుకే పుట్టిందేమో సామెత "బీటిమేతకి యేటి ఈతకి సరిపోయింది" అని.

బెజవాడ పట్టణం విషయానివస్తే మా మేనమామలు చదువుకునే రోజుల్లో అంటే వంద ఏళ్లక్రితం బెజవాడ రైల్వేస్టేషనుకు పడమట ప్రక్కనే గాని తూర్పు వైపు అసలు ఊరే ఉండేది కాదట.

రైలు స్టేషన్‌కి పడమటకు అర్జునుడు తపస్సు చేసిన యింద్రకీలాద్రి కొండ, ఆ కొండమీద దుర్గగుడి, కొండ దిగువన కొన్ని దేవాలయాలు, బట్టల షాపులు వుండే పెద్ద బజారు వుండేవట..!

బెజవాడకు అప్పుడు ప్రాధాన్యానికి కారణం అది రైల్వే జంక్షను. మదరాసు కలకత్తా లైను మదరాసు ఢిల్లీ లైను. ఇవి బ్రాడ్‌గేజ్! మచిలీపట్నం (అంటే బందరు) మార్మగోవా - లైను. అది మీటరు గేజి. అప్పుడు నైజాం పాలనలో నైజాం స్టేట్ రైల్వే (ఎన్.ఎస్.ఆర్) అని నైజాంకు సొంత రైల్వే ఉండేది. అది హైదరాబాదునుంచి బెజవాడకు వచ్చి కలిసేది.

బెజవాడ తరువాత రాయనపాడు ఆ తరువాత ఎర్రుబాలెం, మధిర స్టేషన్లు. ఎర్రుబాలెం నుంచి నైజాం సంస్థానం. రాయనపాడు, బ్రిటిష్ ఏరియా!

ఇలా రైల్వేలైన్లు బెజవాడ మీదుగా వెళ్లేవి గనక బెజవాడ పెద్ద వ్యాపార కూడలిగా ప్రాధాన్యం పొందింది.

రైల్వేస్టేషన్‌కి తూర్పు వైపు టౌన్ తరువాత పెరిగింది. గవర్నరుపేట, గాంధీనగర్, సత్యనారాయణపురం, సూర్యారావుపేట వగైరాలు! గవర్నరుపేటకి, పోస్టల్‌పేరు బకింగ్‌హాంపేట! బహుశ అప్పుడు గవర్నరుపేరు. 'బకింగ్ హామ్' అయివుంటుంది. పోస్టలు ముద్ర గూడ ఆరోజుల్లో 'బకింగ్‌హాం పేట' అనే ఉండేది.

బకింగ్‌హాంపేటలో ఎక్కువగా లాయర్లు, డాక్టర్లు ఉండేవారు. లాయర్లు ఆరోజుల్లో ఎక్కువగా బ్రాహ్మణులు.

గాంధీనగర్‌లో వెల్‌కంహోటల్ పెట్టేవరకు అంతవరకే ఇళ్లు, నేను హైస్కూలులో చదవుకునేటప్పుడు వెల్‌కం హోటల్ చాలా పాప్యులర్! చుట్టుపక్కల నుంచి వచ్చే గ్రామస్తులు దానిని 'ఎలికమ్మ' హోటలు అనేవాళ్లు. వెల్‌కం హోటలు పెట్టింది లక్ష్మణరావు గారని మదరాసు నుంచి వచ్చాడు అసలు వాళ్లు కర్నాటక 'ఉడిపి' బ్రాహ్మణులు. నేను హైస్కూలులో చదివేటప్పుడే గాంధీనగర్ డెవలప్ అయింది. అక్కడక్కడ ఇళ్లు పలచగా ఉండేవి!

నేను థర్డ్‌ఫారం గవర్నరుపేటలో హిందూ బ్రాంచి స్కూలులో చదివాను. ఉన్నవే రెండు హైస్కూళ్లు. మునిసిపల్ హైస్కూలు, హిందూ హైస్కూలు. రెండు పాత టవున్‌లో ఉండేవి. వాటి బ్రాంచీలు రెండు గవర్నరుపేటలో ఉండేవి!

మా మేనమామలు చదివినప్పుడు ఆ మునిసిపల్ హైస్కూలును సి.యం.యస్. హైస్కూలు అనేవారట! క్రిస్టియన్ మిషనరీలది. తరువాత మునిసిపాలిటీ తీసుకుందేమో.

మరొక హైయర్ సెకండరీ స్కూలు మునిసిపాలిటీది. గవర్నరుపేటలో ముద్దాసుబ్బయ్యగారు మేడలో ఒకటి ఉండేది.

కాలేజీలు లేనే లేవు. 1935లో ఎస్.ఆర్.ఆర్. కాలేజి వుయ్యూరు రాజుగారు స్థాపించే వరకు బెజవాడలో కాలేజీ యేలేదు.



బెజవాడ బందరు రైల్వేలైనుకు సత్యనారాయణ పురం తరువాత వచ్చింది. అప్పుడు నేను చదువుకునేటప్పుడు సత్యనారాయణ పురం స్టేషన్ గూడ ఉండేదికాదు.

ముత్యాలంపాడు నుంచి జొన్నచేలలో పడి గవర్నరుపేట బ్రాంచి స్కూలుకు నడిచిపోయేవాళ్లం.

సిరిపురపు వెంకటరమణయ్య గారని ఆయన మొట్టమొదట ఇల్లుకట్టి ఆ ప్రాంతానికి సత్యనారాయణపురం అని పేరు పెట్టాడు. ఆయన పెంపుడుకొడుకు సిరిపురపు కోటేశ్వరరావు ఫ్రీడం ఫైటరు మునిసిపల్ కౌన్సిలర్‌గా కూడ పనిచేశాడు. యిప్పుడు శివాజీ కేఫ్ సెంటర్ అంటారే దాని ఎదురు వీధిలోనే కోటీశ్వరరావు ఇల్లు.

వెంకటరమణయ్య గారు మొదట కట్టిన ఇంటి దగ్గరే దాట్ల నరసరాజు గారని ఒకాయన యిల్లు కట్టాడు. ఆయన్ని మేము 'తోటలో నరసరాజుగారు' అనేవాళ్లం! సత్యనారాయణ పురం ఏరియా అంతా అప్పుడు మామిడితోటలే!

ఆ నరసరాజుగారు కట్టిన ఇల్లు కాలువ ఒడ్డున ముత్యాలంపాడు పోయే మెయిన్ రోడ్డులో ఉంటుంది. అది తరువాత ఎవరికి అమ్మాడో తెలియదు. ఫైనల్‌గా దాదాపు 40 ఏళ్ల క్రితం మా మేనమామ ఆదిరాజుగారు కొని డాబా కట్టాడు. దానిలో మా మేనల్లుడు పద్మరాజు ఉండేవాడు. ఈమధ్య అతని కొడుకు ఆదిరాజు హోటలు పెట్టాడు.

నేను సత్యనారాయణ పురంలో ఇల్లు కట్టింది నా కాలేజీ చదువు అయిన తరువాత. 1941-42లో. నా చిన్నతనంలో ముత్యాలంపాడు బెజవాడకు అంత దగ్గరగా వున్నా చిన్నకుగ్రామమే! వ్యవసాయమే ఆధారం! పెద్ద రైతులూ ఉండేవారు. చిన్న చిన్న రైతులూ ఉండేవారు! మా తాతగారికి 60-70 ఎకరాల పొలం ఉండేది. అటువంటి వాళ్లు పెద్ద రైతులు, నాలుగైదు కుటుంబాలు ఉండేవి. మిగతా వాళ్లు చిన్న చిన్న రైతులు ఒక్కొక్కరికి పది, పాతిక ముప్పయి ఎకరాలు ఉండేవి.

దాదాపు అన్నీ ఉమ్మడికుటుంబాలు! ఒక ఇంట్లో నలుగురైదుగురు కొడుకులు ఉన్నారనుకోండి! అందరూ చేయడానికి తగినంత భూమి ఉండేది కాదు. అందువల్ల ఒకరిద్దరు కొడుకులు బెజవాడకు పోయి ఏవో పనులు చేసుకునేవాళ్లు! వేడినీళ్లకు చన్నీళ్లతోడుగా వ్యవసాయ ఆదాయానికి తోడు బస్తీలో పదో పాతికో సంపాయిస్తే మంచిదేగా!

ముత్యాలంపాడులో నా చిన్నతనంలో ప్రధానమైన వృత్తులుమూడో నాలుగో ఉండేవి. ఒకటి ప్లీడరు గుమస్తా ఉద్యోగం!

ఊళ్లో వానపాలవారిది సంపన్న కుటుంబమే! ఇద్దరన్నదమ్ములు! పెద్దాయన సుబ్బరాజుగారు ఊరికి పెత్తందారు! (చెప్పడం మరచిపోయా! ముత్యాలంపాడు మొఖాసా గ్రామం. మొఖాసా ముత్యాలంపాడు అని ఉంటుంది రికార్డుల్లో) చిన్నాయన బసవరాజు ప్లీడరు గుమాస్తా! బెజవాడ మెట్లపల్లి కోటేశ్వరరావు గారని లీడింగ్ లాయరు. ఆయన దగ్గర గుమస్తా బసవరాజుగారు.

ఇంకొకాయన ఉప్పలపాటి సుబ్బరాజుగారు. ఆయనగారి ప్లీడరు దొర్బల శేషాద్రి శాస్త్రిగారు.

ఇంకొక ప్లీడరు శిరం నారాయణ స్వామి నాయుడుగారు. ఆయన దగ్గర గొడపర్తి కృష్ణంరాజు గారు గుమాస్తా!

మామిళ్లపల్లి మన వాళ్లా చార్లు అని ఒక ప్లీడరు. ఆయన దగ్గర గుమాస్తా ఉప్పలపాటి నరసరాజు. ఆయన్ని 'సంగీతం' నరసరాజు అనేవాళ్లు. ఎప్పుడూ కూనిరాగాలు తీసేవాడేమో! మాఇంటి ముందే ఆయన ఇల్లు.



ఇలా అయిదారుగురు ప్లీడరు గుమస్తాలు! అదొక వృత్తి.

ఇంకొక వృత్తి! ప్రింటింగ్ ప్రెస్‌లో కంపోజిటర్లు. వాణీప్రెస్ అని గవర్నరుపేటలో పెద్ద ప్రెస్ ఉండేది. ఇప్పుడు అప్సర టాకీస్ ముందు యిది లక్ష్మీటాకీసు వుండేదే ఆ లక్ష్మీటాకీసు వాళ్లు వాణీ ప్రెస్‌లో కొంతభాగం అద్దెకు తీసుకుని థియేటరు కట్టారు. వాణీ ప్రెస్ ప్రొప్రెయిటరు డి.టి.రావుగారు దాసు త్రివిక్రమరావుగారు. దాసు వారిది చాలా పెద్ద ఫ్యామిలీ! ఆ ఫ్యామిలీ ఆచారం ఏమిటంటే పుట్టిన మగపిల్లలందరికీ వరసగా 'కేశవనామాలు' పేర్లు పెట్టేవారు. దాసు వామనరావుగారని ఆంధ్ర పత్రికలో పనిచేసేవాడు. ఆ తరువాత తరంవాడు దాసు అనిరుద్ధరావు నా క్లాస్‌మేట్! దాసువారిది వాణీప్రెస్.

ఇంకో ప్రెస్ 'ఆంధ్ర గ్రంథాలయ ప్రెస్' అని ఉండేది. గాంధినగర్‌లో వెల్‌కమ్ హోటల్‌కు ఎదురుగా ఉన్న తాలూకా ఆఫీసుకు ఎదురుగా మూలమీద ఉండేది గ్రంథాలయ ప్రెస్! దాని వ్యవస్థాపకుడు అయ్యంకి వెంకటరమణయ్యగారు. ఆయన కేవలం ప్రెస్ ఓనరే గాక ఆంధ్రదేశంలో గ్రంథాలయ ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహించిన వాడు. ఆయన ప్రకృతి వైద్యం గూడ చేసేవాడు.

ముత్యాలంపాడులో దాదాపు పదిమంది ప్రింటింగ్ ప్రెస్‌లలో పనిచేసేవాళ్లు. వాటిని 'అచ్చాఫీసులు' అనేవాళ్లు! జీతం ఎంత 10 రూపాయలలోపు వున్నా కుటుంబానికి కాస్తో కూస్తో వ్యవసాయం మీద ఆదాయం వస్తుంది. వ్యవసాయం మిగతా అన్నలో, తమ్ముళ్లో చూసుకుంటారు. ఈ జీతం అదనపు ఆదాయమన్నమాట.

పాతటవున్‌లో సామారంగం చౌక్‌లో 'శ్రీరామాప్రెస్' అని ఒకటి ఉండేది. దానిలో ఒకరిద్దరు పనిచేసేవారు. దాని యజమాని సంజీవ రావుగారని నాటకాల అభిమాని! ఆయన నివాసం సత్యనారాయణ పురంలోనే. ఆరోజుల్లో సత్యనారాయణపురం నిండా బ్రాహ్మణులే.

మరొకవృత్తి కారు డ్రైవర్లు! బెజవాడలోని ప్లీడర్లకీ, డాక్టర్లకీ, వీళ్లు డ్రైవర్లు! అప్పుడు బెజవాడలో సొంతకార్లు అరడజనుమందికి ఎక్కువ ఉండేవి కావు. నేను చెప్పేది 1920-30 ప్రాంతం! ప్లీడర్లు, డాక్టర్లు అందరూ ఎక్కువగా గవర్నరు పేటలోనే! జంధ్యాల దక్షిణామూర్తిగారని డాక్టరు గారుండేవారు. ఆయన దగ్గర కళ్లేపల్లి నరసరాజు డ్రైవరు. రాజు గోపాలచారి గారి దగ్గర ఒక డ్రైవరు. కాశీనాథుని నాగేశ్వరరావుగారి దగ్గిర ఒక డ్రైవరు! ఆయన పేరు ఉప్పలపాటి వెంకట్రామరాజు! పొట్టిగా ఉండేవాడు. అందుకని ఆయన్ని బుడ్డ వెంకట్రాయుడు అనేవారు. ముత్యాలంపాడులో మరో విశేషమేమిటంటే ఒకే పేరున్న వాళ్లు ముగ్గురు నలుగురున్నారుకోండి! గుర్తుకోసం పేరు ముందు ఏదో తగిలించేవాళ్లు!

డ్రైవర్లలో ఇంకో రకం బస్సు డ్రైవర్లు! బెజవాడ, జగ్గయ్యపేట రూట్‌లో ఇద్దరు అన్నదమ్ములు డ్రైవర్లుగా ఉండేవారు. కళ్లేపల్లి వెంకట్రామరాజు, కనకరాజు. ఆ తరువాత కనకరాజు బస్ ఓనరైనాడు.

ఇతర బస్ రూట్లు బెజవాడ - నూజివీడు, బెజవాడ - ఏలూరు. బెజవాడ - బందరు.

ఇప్పుడున్నట్టుగా బెజవాడకు-నూజివీడుకు డైరెక్టు రోడ్డు వుండేది కాదు. బెజవాడ నుంచి జంక్షన్ మీదుగా నూజివీడు వెళ్లాలిసిందే. ఆ రూట్లో ఒక బస్ డ్రైవరు ఉప్పలపాటి వెంకట్రామరాజు! అదే పేరుగలాయన ఇంకొకడున్నాడుగా అందుకని ఆయన్ని చింతలవారి వెంకట్రాముడు అనేవారు.



ఈ వృత్తులన్నీగూడ రైతు కుటుంబాలకు చెందిన వ్యవసాయ ఆదాయానికి అదనపు ఆదాయం కోసం చేపట్టిన వృత్తులన్నమాట.

ఊళ్లో దాదాపు 90 శాతం రాజుల కుటుంబాలే! ఏడెనిమిది గొల్లల కుటుంబాలు, మూడో నాలుగో చాకలి కుటుంబాలు, నాలుగయిదు కాపుల కుటుంబాలు ఉండేవాళ్లు! మాల మాదిగలు సరేసరి. ఊరికి తూర్పు దిశలో ఎడంగా మాలమాదిగ పల్లెలుండేవి!

అప్పుడు అనిపించేది కాదుగాని ఇప్పుడు ఆలోచిస్తే చాలా ఘోరమైనదండి అస్పృశ్యత - అంటరానితనం! హిందూ సమాజం తలవంచుకోవలసిన మాసిపోని మచ్చ! మాలమాదిగలకు కాలవనీళ్లు తెచ్చుకోడానికి గూడ వాళ్లకు వేరే రేవు! దిగువన ఎప్పుడైనా వేసవిలో కాలవలు కట్టేస్తే ఊరుబావినీళ్లు కావలిస్తే వాళ్ల కుండలు తెచ్చుకుని బావికి దూరంగా వరసగా పెట్టుకుని నిరీక్షిస్తే యితర కులాలవాళ్లు బావిలో నీళ్ల తోడి వాళ్ల కుండల్లో పోయడం!

మాలమాదిగల్లో చాలామంది రాజుల దగ్గర పాలేళ్లుగా పనిచేసేవాళ్లు. కొందరు రైల్వేలో గ్యాంగ్ కూలీలుగా బెజవాడకెళ్లి పనిచేసి వస్తుండేవాళ్లు.

నా చిన్నతనంలో 10-12 ఏళ్లదాకా గోలీల ఆటలో మాఊళ్లో నేను expert ఛాంపియన్ని అన్నమాట.

నాతో సమానంగా ఆడేవాడు ఒక్కడే ఉండేవాడు. అతని పేరు నరసరాజే! లకంరాజు నరసరాజు. మిగతా వాళ్లు నాతో ఆడడానికి జంకేవాళ్లు. షరతులు పెట్టేవాళ్లు. మామూలుగా నడిమి వేలితో ఆడతాం గోలీలు. 'పక్కవేలితో ఆడు' 'చూపుడువేలితో ఆడు' అని షరతులు పెట్టేవాళ్లు. నడిమివేలితో ఆడినంత బాగా పక్కవేళ్లతో ఆడలేం! నాకు మిత్రుడు ఒకడు ఉండేవాడు. వేగేశిన వెంకట్రాముడని. తరువాత నేను సత్యనారాయణపురంలో ఇల్లు కట్టిన తరువాత ముత్యాలంపాడుతో సంబంధాలు బాగా సన్నగిల్లినై. వేగేశిన వెంకట్రాముడు ఎక్కడున్నాడు, ఎలా ఉన్నాడని పది పన్నెండేళ్ల క్రితం విచారిస్తే వాడు ఎలక్ట్రీషియన్‌గా చీరాలలో ఉంటున్నాడని చెప్పారు. ఈ మధ్య మళ్లీ విచారిస్తే చనిపోయాడని చెప్పారు.

వాడు ఏంజేసేవాడంటే నేను గెలిచిన గోలీలన్నీ వాడికిచ్చేవాణ్ణి! వాడు ఆ గోలీలు మిగతావాళ్లకు అమ్మేవాడు! కానికి ఆరో పదో గోలీలు! అమ్మి వాళ్లతో ఒక షరతు పెట్టేవాడు "నువ్వు మా నరసయ్యతోనే ఆడాలి" అని. నన్ను నరసయ్య అనేవాళ్లు. ఆడి వాళ్ల గోలీలన్నీ గెలుచుకుని వెంకట్రాముడికి ఇచ్చేవాణ్ణి! అలా గోలీలమ్మి వచ్చిన డబ్బు ఒక చిన్న పెట్టెలో దాచేవాడు. ఆ పెట్టె 7-8 అంగుళాల పొడుగు, 4 అంగుళాల వెడల్పు, 4 అంగుళాల ఎత్తు ఉండేది. దానికి ఎలక్షన్లలో బాలెట్ బాక్స్‌కి ఉన్నట్టు ఒక స్లాట్ వుండేది. ఆ స్లాట్ గుండా కానీలు, అణాలు, బేడలు పెట్టెలో వేసి పెట్టె తాళం వేసేవాడు. నెలకో రెండు నెలలలో తాళం తీసి ఆ డబ్బులు యిద్దరం పంచుకునేవాళ్లం.

ఆ రోజుల్లో గోలీల ఆట ఎంతో ఆసక్తిగా ఉండేది. వేసవి కాలం సెలవలు వస్తే పొద్దునా, సాయంత్రం గోలీలే! మంచి ఎండలు. వడగాల్పులు! రోహిణికార్తె! మా అమ్మ 9-10 గంటలకు నాకు అన్నం పెట్టి బయటకు పోకుండా తలుపులేసి తన మంచం పక్కన నా మంచం వేసి పండుకోమనేది. ఆమె నిద్రపోగానే చప్పుడు కాకుండా లేచి గోలీలు జేబులో వేసుకుని తలుపు తీసుకుని బయటికి పోయేవాణ్ణి. కొత్తూరుకి పాతవూరికి మధ్య ఇప్పుడు రైస్‌మిల్ రోడ్ అంటారు. అప్పుడు రోడ్డూ లేదు పాడూ లేదు. చల్లగా వేపచెట్లుండేవి. ఆ వేపచెట్ల కింద గోలీలు ఆడుతుండే వెచ్చటి వడగాలి! మధ్యాహ్నం! మా అమ్మ చెప్పులు తొడుక్కుని పైట చెంగు తలమీద కప్పుకుని



నాకోసం వచ్చేది. ఆమెను అంతదూరాన చూడగానే నేను ఆటముగించి "మా అమ్మ వస్తోందిరా" అని చెప్పి మెల్లగా తలవంచుకుని ఇంటికి పోయేవాణ్ణి. ఆమె ఏదో సనుక్కుంటూ నావెంట వచ్చేది.

అప్పటి కుర్రవాళ్ళలో చదువులో అంతగా పైకి వచ్చిన వాళ్ళులేరు! ఊళ్లో ఎలిమెంటరీ స్కూలు చదువే! బెజవాడ దగ్గరయినా బెజవాడ స్కూలుకు వెళ్లాలంటే అందరూ అంతగా పట్టించుకునే వాళ్లుకాదు. నాముందు తరం వాళ్లలో మా మేనమామల్లో గూడ హైస్కూలు చదువులు దాటినవాళ్లు లేరు! మా పెద్దమామయ్య రెండోమామయ్య అప్పట్లో 'లోయర్' 'హైయర్' అని ఉండేవట. అంతవరకే చదివారు. కాని - హైయర్‌లోనే ఇంగ్లీషులో ఉండేవి లెక్కలు! చిన్నప్పుడు మా అమ్మమ్మ చూపించేది. "పెద్ద మామయ్య చదువుకున్న పుస్తకాలురా" అని, మారెండో మామయ్య లొయర్ ప్యాసై స్కూలు మాస్టర్ ట్రయినింగ్ చదివాడట. మాఊర్లో ఎలిమెంటరీ స్కూల్లోనే అసిస్టెంటు టీచరుగా కొన్నాళ్లు పని చేశాడు! ఇద్దరేటీచర్లు! స్కూలుకు పోకుండానే హెడ్‌మాస్టర్ను బెదిరించి అటెండెన్సు సంతకం చేసివచ్చేవాడట. మామూడో మామయ్య సంగతి నాకు తెలియదు! నాకు పూహవచ్చేసరికే చనిపోయాడు ఆ మామయ్య సంగతి నాకు తెలియదు! నేను ఆ ఊరు వచ్చేసరికే చనిపోయాడు. మా నాలుగో మామయ్య అయిదో మామయ్య - బెజవాడలోని సి.యం.యస్. హైస్కూలులో చదివారట. తరువాత మా అయిదోమామయ్యని మా తాతయ్య 'చదివింది చాలులే' అని వ్యవసాయంలో పెట్టాడట. మా 'రాంమామయ్య' మాత్రం అప్పటి కాంగ్రెసు రాజకీయ ప్రభావంతో బెజవాడ పెద్దిబజారులో ఖద్దరు బట్టల షాపు పెట్టాడట! కొన్నాళ్లు. ఆయనకు అప్పుడు బి.ఎస్.ఏ సైకిల్ 26 అంగుళాల ఎత్తుది ఉండేది. నా కిప్పటికీ జ్ఞాపకం! 4,5 ఏళ్ల వయసులో నేను ఒకసారి సైకిలు పళ్లచక్రంలో వేలుపెట్టి తిప్పాను. కుడిచేతి చూపుడు వేలు నలిగి రక్తం కారింది. ఆ మచ్చయిప్పటికీ ఉంది సూక్ష్మంగా.

నేను బెజవాడ హిందూ బ్రాంచిలో మూడోఫారం చదివేనాటికి ముత్యాలంపాడులో స్కూలుఫైనలు ప్యాసయినవాళ్ల ఇద్దరే! సాగి సుబ్బరాజు ఒకడు. పాపరాజుగారి తమ్ముడు సుబ్బరాజు ఒకడు. సాగి సుబ్బరాజుకు మా రాంమామయ్య తనపలుకుబడితో కో-ఆపరేటివ్ సూపర్‌వైజర్‌గా ఉద్యోగం ఇప్పించాడు. మా రాం మామయ్య ఇంట్లో అందరికీ ఖద్దరు బట్టలు కొనితెచ్చేవాడు. రెగ్యులర్‌గా ఆంధ్రపత్రిక, కృష్ణా పత్రిక, ఇండియన్ ఎక్స్‌ప్రెస్ తెప్పించి చదివేవాడు. అందుకే ఆయన పెద్దయన తరువాత గూడ Co-operative movement లో Dairy farming - Virginia Tobacco వగైరాలు వేసేవాడు. ఖద్దరు షాపు మూసేసిన తరువాత జాయింటు కుటుంబం తరపున 'ఉప్పలపాటి రామరాజు అండ్ సన్స్' పేరుతో కలప వ్యాపారం ప్రారంభించారు. అది మా తాతయ్య పేరు. ఆయనా రామరాజే! సామాన్యంగా తండ్రి బ్రతికివుండగా కొడుకులకి అదే పేరు పెట్టరు. మా రాం మామయ్యకి 'రామరాజు' అని పెట్టిన పేరు ఆయన తాతగారిదట! అంటే ఆయన మాతామహుని పేరు.

ముత్యాలంపాడులో చదివిన కుర్రవాళ్లలో మొట్టమొదటి గ్రాడ్యుయేట్‌ను నేనే! 1941లో డిగ్రీ తీసుకున్నాను. నా తరువాత ఉప్పలపాటి వెంకట రామరాజు. అతన్ని అంబాపురం రామ్మూర్తి అనేవాళ్లు! అతను డిగ్రీ చదివాడు. గుంటూరు ఎ.సి. కాలేజీలో! బెజవాడ కాలేజీలో అతను ఇంటర్ చదివాడు తరువాత ఎల్.ఐ.సిలో ఉద్యోగం చేశాడు. షుగరు, బి.పిలతో బాధపడి కొన్ని ఏళ్ల క్రితం పోయాడు. ఆ తరువాత కొంత మంది కాలేజీ చదువులు చదివారు.



ఊళ్లో నలుగురయిదుగురు ప్లీడరు గుమస్తాలుండేవాళ్లని చెప్పేనే వాళ్లందరివీ తెలుగు చదువులే. ఇంగ్లీషు నామ మాత్రమే! ఊళ్లో ఎక్కడన్నా చిన్న చిన్న స్థలాల, భూముల తగాదాలు వస్తే ఈ గుమస్తాలే లాయర్లులాగ పోజులుపెట్టి తగాదాలు తీర్చేవాళ్లు. ఒకవేళ ఎవరైనా కోర్టుకు వెళ్లవలసి వస్తే వీళ్ల ద్వారానే వాళ్ల వాళ్ల ప్లీడర్ల దగ్గరకి తీసుకుపోయి దావాలు వేయించేవాళ్లు.

మా పెద్దమామయ్య గూడ మొదట్లో చదువుకాగానే బెజవాడలో మెట్లపల్లి కోటేశ్వరరావు గారి దగ్గర గుమస్తాగా చేశాడట. నాకు వూహ తెలియకముందో, నేను పుట్టకముందో!

నరసన్న పాలెంలో మా పెద్దమామయ్యగారింట్లో ఒక గ్రూప్ ఫోటో ఉండేది.

కొందరు ప్లీడర్లు ముందు వరుసలో కుర్చీలలో కూర్చుంటే వెనక వరసల్లో గుమస్తాలు తలపాగాలు చుట్టుకుని నిలబడి ఉన్నారు.

ముత్యాలంపాడులో నాకు తెలిసిన తరువాత గూడ ప్లీడరు గుమస్తాలు ఊళ్లో బయలుదేరేటప్పుడు పంచె, చొక్కా పైన కోటు పైపంచ (కండువ)తో వెళ్లి కోర్టుకు వెళ్లేముందు పై పంచతో తలపాగా చుట్టుకునేవాళ్లు.

ఊళ్లో ఎవరు ఏ ఉద్యోగాలు చేసినా ప్రతి కుటుంబానికి కాస్తో, కూస్తో భూవసతి ఉండేది గనక జాయింటు కుటుంబంలో ఒకరిద్దరు ఉద్యోగాలు చేస్తే కటుంబానికి అదనపు రాబడి! అందులో నెలవారీ! వ్యవసాయం వల్ల ఆదాయం ఏడాది చివరకేగా! చాలా కుటుంబాలు ఉమ్మడి కుటుంబాలు.

మా మేనమామలు అయిదుగురు అన్నదమ్ములు. ముగ్గురు అక్కచెల్లెళ్లు! మాయింటి ముందు ఉప్పలపాటి వాళ్లు నలుగురు అన్నదమ్ములు! అందులో మూడోవాడు ప్లీడరు గుమస్తా!

ఇంకో కుటుంబంలో మొదటి భార్య పెద్దకొడుకు ప్లీడరు గుమస్తా! ఒకడు వ్యవసాయం! మూడోవాడు డ్రైవరు! రెండో సంబంధానికి నలుగురు కొడుకులు. ఇద్దరు అచ్చు ఆఫీసులో పనులు, ఇద్దరు వ్యవసాయం. ఇలా ఉండేది ఊళ్లో సమాజ పరిస్థితి. అప్పుడు ఊళ్లో ఎలక్ట్రిసిటీ లేదు నేను స్కూలు ఫైనల్ దాగా కిరసనాయిలు లాంతరు ముందు కూర్చుని చదువుకున్నవాణ్ణి! ఇంటర్‌మీడియట్‌కు గుంటూరు హిందూ కాలేజి హాస్టలుకు వెళ్లినప్పుడే మొట్టమొదటిసారి ఎలక్ట్రిక్ లైటు కింద చదువు!

బెజవాడకు అంత దగ్గరలో ఉన్నా ముత్యాలంపాడు చదువుల విషయంలో చాలా వెనకబడి వుండేది.

బెజవాడ గూడ అప్పట్లో అంతే! జట్కాలు తప్ప, కార్లు ఏ నలుగురైదుగురికో ఉండేవి.

బెజవాడ బందరు రైల్వేలైనుకు తూర్పున ఏలూరు కాలవకి ఉత్తరాన యిప్పుడు సిమెంట్ ఫ్యాక్టరీ కట్టిన స్థలానికి కొంచెం ముందు -

సి.కె. రెడ్డిగారని ఒక లాయరు బంగళాఉండేది. ఆయన పూర్తిపేరు కట్టమంచి కొళందరెడ్డి. చిత్తూరు కట్టమంచి ఫ్యామిలీ వారనుకుంటాను. బారిష్టరు గూడానేమో! అక్కడ ఆయన విశాలమైన స్థలంలో బంగళాకట్టాడు. చుట్టూ మామిడితోటలు! ఇళ్లు వుండేవిగాదు. ఆయనకు ఒకటో, రెండో గుర్రాలు లాగే నాలుగు చక్రాల విక్టోరియా కోచ్ ఉండేది! ఆయన అప్పుడు మునిసిపల్ ఛైర్మన్ అయినాడు. ఆయనకు ఒక అలవాటు ఉండేదట! కొత్తగా వచ్చిన క్లయింటునైనాసరే ముందు 'ఏమిరా?" అనేవాడట!



ఆయన మునిసిపల్ ఛైర్మన్ అయి మునిసిపల్ ఆఫీసుకు వెళ్లిన మొదటిరోజునే మునిసిపల్ ఆఫీసు మేనేజరు పేరు సుబ్బారావు గారనుకుంటాను. బ్రాహ్మడు. ఛైర్మన్‌గారి రూంలోకి వచ్చాడట!

అప్పటికే ఏవో ఫైల్స్ చూచిన రెడ్డిగారు మేనేజరు లోనికి రాగానే "ఏమిరా! Is this the way to maintain files?" అని ఇంగ్లీషులో అని తరువాత తెలుగులో మాట్లాడుతూ గూడ ప్రతిమాటకూ చివర 'రా' అని సంబోధించాడట!

మేనేజరు సుబ్బారావుగారికి మతిపోయింది. అంతవరకు ఆయన్ని అందరూ గౌరవంగా మేనేజరు సుబ్బారావు 'గారు' అనేవారేగాని 'రా' అని ఎవరూ సంబోధించలేదు! గుటకలు మింగి కన్నీళ్లు కళ్లలోనే దాచుకుని తిరిగి తన రూంకు వచ్చాడట!

ఆయనకు బి.పి. పెరిగింది. ఈ ఛైర్మన్ మనిషి చూస్తే ఆజానుబాహువు! 'రా' అని తప్ప మాటరాదు! కోపం వస్తే కొట్టేట్లుగా కూడా ఉన్నాడు. ఈయనతో ఎలా ఉద్యోగం చేయడం?

సాయంత్రం ఇంటికెళ్లాడు! మంచం పట్టాడు. మరునాడు సెలవుచీటీ పంపాడు. ఆరోగ్యం దెబ్బతిన్నది. ఏమిటి చెయ్యడం?

మిత్రులు సలహా ఇచ్చారు. "వెళ్లు! చెప్పు ఏం! కొడతాడా?' అని ధైర్యం చెప్పారు.

ఆఫీసుకు వెళ్లాడు! ఛైర్మన్ గదిలోకి జంకుతూ అడుగు పెట్టాడు!

ఛైర్మన్ వెంటనే "ఏమిరా! ఆరోగ్యం ఎలా వుందిరా?" మేనేజరు నోటమాట రాలేదు.

గద్గద స్వరంతో! "అయ్యా నేను ఇన్ని యేళ్లుగా ఉద్యోగం చేస్తున్నాను! ఎంత పెద్ద ఉద్యోగులు, కమీషనర్లు, ఛైర్మన్లు గూడా నన్ను 'సుబ్బారావుగారూ' అని పిలిచారేగాని ఎవరూ 'రా' అనలేదు "అని ఏడ్పు ఆపుకోలేక ముఖం పక్కకి తిప్పుకున్నాడట.

ఆమాటలకు ఛైర్మన్ షాకయి "అదేమిరా! 'రా' అన్నందుకే ఏడుస్తావేమిరా! అదినాకు అలవాటు! కావాలంటే నన్ను 'ఏమిరా రెడ్డి" అనరా! నిన్ను గురించి విన్నానురా! నువ్వంటే నాకు చాలా గౌరవంరా!" అన్నాడట!

ఇది ఆ రోజుల్లో కథగా చెప్పుకునేవారు! ఇప్పుడు గూడ జిల్లాల వారీగా ప్రాంతాల వారీగా మనుషులకు కొన్ని పూతపదాలు అలవాట్లు వుంటయ్!

తెలంగాణా విషయం నాకు బాగా తెలియదు గాని కోస్తా రాయలసీమ జిల్లాల్లో 'నువ్వు' 'మీరు' 'తమరు' అని మర్యాదగానే సంబోధించే ఆచారాలు వున్నయి! గుంటూరు జిల్లాలో నరసరావుపేట, వినుకొండ - సత్తెనపల్లి, పల్నాడు తాలూకాల్లో కొత్తవాళ్లని గూడ 'నువ్వు' అనే అంటారు. నేను మావూరు తాళ్లూరు వెళితే "ఎప్పుడొచ్చావు?" అనే అంటారు. మర్యాదలోపంకాదు. గోదావరి జిల్లాల్లో 'నువ్వు' అంటే తప్ప 'మీరు' ఇంకా గౌరవంగా అనాలంటే 'తమరు' అని అంటారు. నెల్లూరు జిల్లా సంగతి చెప్పనే అక్కర్లేదు. సినిమాల్లో మా రమణారెడ్డి నెల్లూరు యాసతో డైలాగులు బ్రహ్మండంగా చెప్పేవాడు.

అలాగే - సి.కె.రెడ్డిగారికి కొత్తవాళ్లను గూడ "ఏమిరా" అనడం అలవాటు.

రెడ్డిగారిది చిత్తూరు జిల్లా అనుకుంటా! కట్టమంచి వారంటే చిత్తూరు జిల్లాయేగదా! మరి బెజవాడలో ఎందుకు ప్రాక్టీసు పెట్టాడో తెలియదు!



బెజవాడలో లాయర్లు చాలావరకు బ్రాహ్మణులే ఉండేవారు. అయ్యదేవర కాళేశ్వరరావుగారు నాకు తెలిసేసరికే కాంగ్రెసు ఉద్యమంలో చేరి ప్రాక్టీసు మానేశాడు.

నాకు తెలిసినంతవరకు రెండు ప్రఖ్యాత బ్రాహ్మణ కుటుంబాలు ఉండేవి. ఒకటి పాటిబండ్ల వెంకటరమణయ్యగారు రెండు - వెలగలేటి దశరథరామయ్య గారు.

నాకూ ఊహ తెలిసే సరికి వెంకటరమణయ్య గారున్నారో లేదో తెలియదు. ఆయనకు నలుగురు కొడుకులు! శ్రీయుతులు మార్కండేయులు, అప్పారావు, సుందర్రావు, శివరామకృష్ణయ్య గార్లు అందరూ 'లా' గ్రాడ్యుయేట్లే !

మార్కండేయులుగారు జిల్లా జడ్జిగా రిటైరైనారు. మంచి టెన్నిస్ ప్లేయరు! అప్పారావుగారు మంచికవి గూడ! ఆరోజుల్లో కవుల్లో అప్పారావు త్రయం అని అటుండేవారు. గురజాడ అప్పారావు బసవరాజు అప్పారావు, పాటిబండ్ల అప్పారావు. లాయర్‌గా ప్రాక్టీసు పుంజుకున్న తరువాత పాటెబండ్ల అప్పారావు గారు కవిత్వం మానేశారు. ఆయన కుమార్తె స్వరాజ్యలక్ష్మి - గవర్నరుపేట హిందూ బ్రాంచిలో IIIrd form లో నా క్లాస్‌మేట్.

మూడో ఆయన సుందరావు గారు గూడ లాయరే! మంచి అభిరుచులు గలవాడు. ఇంగ్లీషు తెలుగు సంస్కృతంలో స్కాలర్! జింఖానాక్లబ్బులో మెంబరు అలా నాకు పరిచయం!

నాలుగో ఆయన శివరామకృష్ణయ్యగారు ఆంధ్ర హైకోర్టు రిజిస్ట్రారుగా రిటైనారనుకుంటాను. వీరంతా గవర్నరు పేటలో ఉండేవారు.

వెలగలేటి దశరథరామయ్యగారు పాత 'టవున్లో హిందూ హైస్కూలు సమీపంలో ఉండేవారు! ఆయన కొడుకుల్లో ఇద్దరు నాకు తెలుసు! కోదండరామయ్యగారు గుంటూరులో బారిస్టరు పి.యస్.టి. శాయి గారి అల్లుడు రెండో కొడుకు అయోధ్య రామయ్య గారు గుంటూరులో పోలీసు ఆఫీసరు కోడూరు చంద్రశేఖర రావు గారి అల్లుడు వారి ఇల్లు, బ్రాడీపేట, రెండో లైనులో ఉండేది. వున్నవ లక్ష్మీనారాయణ గారి 'శారదానికేతనం' ప్రక్కనే, 'చంద్రశేఖర్ విలాస్' ఆ ఇంటి పేరు. ఆయన పోయాక ఆయన కుమారుడు సూర్యనారాయణగారు ఆ ఇంట్లో రెండుగదులు విద్యార్థులకు అద్దెకిచ్చేవాడు. ఇంటర్ సీనియర్ లో 1937-38లో ఒక గదిలో నేను అద్దెకు ఉండేవాణ్ణి.

'చంద్రశేఖర్ విలాస్' కు ఎదురుగానే కొండా వెంకటప్పయ్య గారి ఇల్లువుండేది. వెంకటప్పయ్యగారిది అసలు బందరు అనుకుంటాను. 'కృష్ణాపత్రిక' స్థాపకుడు ఆయనే నేమో! తరువాత గుంటూరుకు మకాం మార్చాడు! గాంధీజీ పిలుపుతో 'లా' ప్రాక్టీసు మానేసి ఉద్యమంలో చేరాడు.

గుంటూరులో దేశభక్తుల్లో చెప్పుకో దగినవాడు. నడింపల్లి నరసింహారావుగారు! ఆయన లాయరే!

సత్యాగ్రహం రోజుల్లో బ్రిటిష్ గవర్నమెంటు ఆయన్ను అరెస్టు చేసి రైలు స్టేషనుకు తీసుకుపోతే రైలు కదలడానికి వీలులేకుండా ఒక మైలు దూరం జనం రైలు పట్టాలమీద బైఠాయించారట! అంత ప్రజానాయకుడాయన!

గుంటూరుకు మంచి చరిత్ర ఉంది. గుంటూరు పుర వాసులలో అక్షరాస్యత ముఖ్యంగా కాలేజీ చదువులు ఎక్కువ! కారణం పురాతనమైన ఆంధ్ర క్రిస్టియన్ కాలేజీ స్థాపన! బెజవాడలో ఉన్న కొద్దిమంది బ్రాహ్మణేతర లాయర్లలో ప్రముఖుడు కోవెలమూడి గోపాలకృష్ణయ్యగారు! ఆయనకు గూడ నాలుగు చక్రాల విక్టోరియా కోచ్ ఉండేదని చెప్పేవారు. ఆయన్ని నేను ఎరగను. ఆయన కుమారుడే సినిమా ప్రొడ్యూసరు కోవెలమూడి భాస్కరరావు. 'స్వతంత్ర ఫిలింస్ 'ద్రోహి'లో పార్టనర్! ఆ తరువాత సొంత కంపెనీ భాస్కర ప్రొడక్షన్స్ పెట్టి 'బ్రతుకుతెరువు', 'చెరపకురా చెడేవు', 'మోహినీ రుక్మాంగద' వగైరా సినిమాలు తీశాడు.



కె.యస్. ప్రకాశరావు (కోవెలమూడి సూర్యప్రకాశరావు)కు గోపాలకృష్ణయ్య గారు కజిన్!

బెజవాడలో గవర్నరుపేటలో 'కమ్మ హాస్టలు' బిల్డింగ్ కట్టించింది గోపాలకృష్ణయ్య గారేనని చెబుతారు.

నిజానికి బెజవాడ జిల్లా హెడ్ క్వార్టర్సుకాదు! జిల్లా హెడ్ క్వార్టర్సు అప్పటికీ ఇప్పటికీ బందరే!

అయినా వ్యాపారకూడలి అయినందున బెజవాడ బాగా వృద్ధిచెందింది.

1925 ప్రాంతంలో మొదట ఆంధ్ర విశ్వవిద్యాలయం బెజవాడలో పెట్టారట! వేసవిలో బెజవాడ ఎండలు చాలా ఎక్కువ! 120 డిగ్రీలు ఫారన్ హీటు ఉండేది! అందుకే వైస్ ఛాన్సలర్ - కట్టమంచి రామలింగారెడ్డి గారు. బెజవాడకు 'Blazawada' అనేవారట. 'Intellectual Sahara' అని గూడ ఆయన బెజవాడకు బిరుదిచ్చారని చెబుతారు.

నిజానికి బెజవాడలో ఆయన రోజుల్లో సాంస్కృతిక కార్యకలాపాలు చాలా తక్కువ! అక్కడఉన్న ప్రముఖులు గూడ 'బెజవాడ' తమ సొంత ఊరని చెప్పుకునేవాళ్లుకాదు!

'మీది ఏ ఊరు' అని అడిగితే కాళేశ్వరరావుగారు 'మాది నందిగామ' అనేవాడట. ఎస్.ఆర్.ఆర్. కాలేజీలో కొన్ని దశాబ్దాలు లెక్చరర్ గా పనిచేసి అక్కడే ఇల్లుకట్టుకుని సెటిల్ అయిన విశ్వనాథ సత్యనారాయణ గారు 'మాది బందరు' అనేవాడట.

ప్రముఖ బట్టల వ్యాపారస్తులు 'మాజేటి' వారు మాది 'ఏలూరు' అనేవారు.

అందుకు కారణం బహుశా బెజవాడ ప్రధానంగా వ్యాపారకేంద్రం కావడం అక్కడికి ఇతర ఊళ్లనుంచి వచ్చి సెటిల్ అయిన వాళ్లు ఎక్కువగా ఉండడం అనుకుంటాను. నేను 1942 లో సత్యనారాయణపురంలో ఇల్లు కట్టిన తరువాత జింఖానాక్లబ్బులో మెంబరుగా చేరాను! జింఖానాక్లబ్బు మాఇంటికి చాలా దగ్గర! యిప్పుడు ఏలూరు కాలువ ఒడ్డున నీళ్లటాంకు వుందే (అక్కడ పూర్వం - కలప అడితీలుతుండేవి) దానికి ఎదురు సందు 'స్కూలువీధి'లో మా ఇల్లు!

పెద్ద పెద్ద లాయర్లు ధనికులే డబ్బు విషయంలో ఎంతకక్కుర్తి పడతారో తలుచుకుంటే ఆశ్చర్యం వేస్తుంది.

ఒక లీడింగ్ లాయరు చీట్ల పేక రమ్మీ ఆడుతుండేవాడు. నేను వెనక కూర్చుని చూస్తుండే వాణ్ని!

ఎవరైనా 'షో' చేశారనుకోండి! ఈయన చేతిలో ముక్కలన్న చుట్టబెట్టి మధ్యలో పారేసి 40-50 పాయింట్లు ఇవ్వవలసి వస్తే నావి 12 అని 12 పాయింట్లకే 'షో' చేసి ఆయనకిచ్చేవాడు.

ఇది క్రమంగా అందరికీ తెలిసింది! కాని పెద్దాయన! ఏమనగలరు? వాళ్లలో వాళ్లే విసుక్కుని అసహ్యించుకునేవారు.

గుత్తా రాజారావు అని ఒక మెంబరు ఉండేవాడు. పాతిక ముప్పయ్యేళ్ల వయసు. చాలా హుషారైనవాడు. తరువాత సోషలిస్టు పార్టీలో చేరి ఎం.ఎల్.సి. గూడ అయ్యాడు.

అతను "నేను చెబుతానుండండి! ఈయన పని?" అని ఎవరు 'షో' చేసినా రాజారావు 'నావి 5 పాయింట్లు' అని ముక్కలు కలిపి పారేసేవాడు. ఒకసారి గాదు! అలా అయిదారు సార్లు ప్రతిసారీ 'నావి అయిదు' అని ముక్కలు పారేసేవాడు.



ఒకాయన "ఏమిటి రాజారావు! నీవి ఎప్పుడు అయిదే నంటావు?" అని నిలదీస్తే -

"అవును! నావి ఎప్పుడూ అయిదే! అంతకు మించిగాని తక్కువగాని ఉండవు" అన్నాడు.

"అయితే నీ ముక్కలు పారెయ్యడానికి వీలులేదు! ఎవరైనా 'షో' చెప్పిన తరువాత నీ ముక్కలు పరచి మాకు చూపాలి!" అన్నాడాయన.

"అందరూ చూపితే నేనూ చూపుతా!" అన్నాడు. దానితో అందరూ ముక్కలు పరచి చూపాలని రూలు పెట్టడంతో లాయరు ఆటకట్టింది.

జింఖానా క్లబ్బులో సాయంత్రం పూట టెన్నిస్ కోర్టులో కుర్చీలు వేసుకుని కూర్చుని టెన్నిస్ చూస్తుండేవాణ్ణి!

టెన్నిస్ దాదాపు పది పదిహేనుమంది ఆడేవాళ్లుగాని మాధవపెద్ది జానకి రామయ్యగారు స్టేట్ టెన్నిస్ చాంపియన్! చూడ్డానికి ఆయన ఆట చాలా గ్రేస్‌ఫుల్ వుండేది. ఇంకొక ప్లేయరు భుజంగరావు! ఆరడగుల మనిషి సైకిల్ మీద వచ్చేవాడు.

జానకిరామయ్యగారు భుజంగరావు డబుల్స్‌లో స్టేట్ చాంపియన్స్. జానకి రామయ్యగారు సింగిల్స్ చాంపియన్. ఈమధ్య అంటే 1999లో నేను విజయవాడకెళ్లాను. ఆలిండియా రేడియో వాళ్ల ఆహ్వానం మీదనో లేక నాటక పోటీలు సందర్భంలోనో!

ఆ రోజు నేను తుమ్మలపల్లి కళామండపం సభలో మాట్లాడాను. మరునాడు నా ఫొటో ఉపన్యాసం చూచి జానకిరామయ్య గారు నేను మనో రమ హోటల్ లో ఉంటే నన్ను చూడ్డానికి వచ్చాడు. అంటే అతకుముందు ఏ ముప్పయ్ నలభై ఏళ్లక్రితం కలిశామో! "రాజుగారిని తప్పక చూడాలి" అని ఆఫీసర్సు క్లబ్బులో మరొక మిత్రుడు ఎల్లేపెద్ది సుబ్రహ్మణ్యంతో చెప్పి వచ్చాడట! మనోరమ హోటలుకు వచ్చి రూం తలుపు కొట్టాడు. తలుపు తీశాను. మనిషిలో ఎక్కువ మార్పులేదు.

"రాజుగారూ! నేను జ్ఞాపకం వున్నానా? జానకి రామయ్యని అన్నాడు.

నేను కావలించుకుని "ఎలా మరచిపోగలను జానకిరామయ్య గారూ!" అని గదిలో దాదాపు గంటసేపు అలనాటి కబుర్లెన్నో చెప్పు కున్నాం!

ఇంతలో నాకోసం కారు వచ్చిందని కిందనించి ఫోన్ చేశారు!

"రాజుగారూ! నాకోసం ఇంత టైమ్ స్పేర్ చేస్తారనుకోలేదు! చాలా థాంక్స్" అని లేచాడు.

"అయ్యో! మీరుంటానంటే ఇంకోగంట కూర్చోగలను! మళ్లీ కలిసే అవకాశం ఎప్పుడొస్తుందో" అన్నాను.

"వద్దు! వాళ్లు వెయిట్ చేస్తున్నారు? రండి!" అని ఇద్దరం కిందకి వెళ్లాం! అప్పుడు ఆయన వయసు అడిగితే చెప్పాడు 88అని. "నాకప్పుడు 79, అంటే మీకంటే నేను 9 ఏళ్లు పెద్ద" అని నవ్వారు. ఉయ్యూరు జమీందారు ఎం.ఆర్. అప్పారావుగారూ జానకి రామయ్యగారు చాలా సన్నిహితులు! అప్పారావుగారే తమ ఎస్.ఆర్.ఆర్. కాలేజి (బెజవాడ)లో జానకిరామయ్యగారికి ఫిజికల్ డైరెక్టర్‌గా ఉద్యోగం ఇప్పించారు.

రెండు మూడేళ్ల క్రింతం ఎం.ఆర్. అప్పారావుగారి తమ్ముడు ఎం.ఎస్. అప్పారావుగారు (మేమిద్దరం 1940 లయోలా కాలెజీ విద్యార్థులం) చెప్పారు. తను ఢిల్లీ వెళ్లినప్పుడు జానకి రామయ్యగారి కుమార్తెను కలిశారట. ఆమె



అక్కడ సుప్రీంకోర్టులో అడ్వకేటట!

భుజంగరావు విజయవాడలో ఉన్నాడటగాని ఆరోగ్యం అంత బాగాలేదు అని. ఎం.ఎస్. అప్పారావు గారే చెప్పారు! నేను విజయవాడ వెళ్లినప్పుడు భుజంగారావును చూడ్డానికి వీలులేక పోయింది.

1999లో నేను విజయవాడ వెళ్లాను. ఏవో నాటకాల పోటీలకు చీఫ్ గెస్టుగా.

విజయవాడలో ఓల్డ్ ఫ్రెండ్స్ చాలామంది ఉన్నారు. తెన్నేటి భాస్కరరావని సీనియర్ అడ్వకేట్! ఎప్పుడో స్కూలు ఫైనలు చదివేటప్పుడు స్నేహితులం! ఫోన్ చేస్తే - పాపం. "రాజా I am bedridden" అన్నాడు" "వద్దులే! నేనే వస్తాను" అని టి.వి.ఎస్. చలపతి రావు గారి కొడుకు డాక్టరు శర్మగారు కారు కంపితే ఆకారులో వెళ్లి భాస్కరరావును చూశాను. భాస్కరరావు డా॥ శర్మ దగ్గర బంధువులు! తెన్నేటివారు! తెన్నేటి వారి వీధిలోనే భాస్కర రావు ఇల్లు: హనుమాన్ పేటలో 70 ఏళ్ల క్రితం ఎలావుందో ఇప్పుడూ అలానే వుంది.

నాటక పోటీల నిర్వాహకులు నన్న చీఫ్‌గెస్ట్‌గానే పిలిచారు! ముందు నాకు చెప్పలేదు తీరా వెళ్లాక 'సన్మానం' అన్నారు. సన్మానాలంటే నాకు కాస్త చిరాకు!' "ఎందుకులే వాళ్లని నొప్పించడం" అని సరేనన్నాను. తుమ్మలపల్లి ఆడిటోరియంలో, నాకు సన్మానం చేశారు. అప్పుడు చెప్పాను "నా స్వస్థలం నేను పుట్టి పెరిగిన విజయవాడలో ఇది మొట్టమొదటి సన్మానం" అంటే అందరూ ఆశ్చర్యపోయారు. నేను సన్మానాలకు ఒప్పుకునే వాణ్ణిగాదు. అప్పుడు తెన్నేటి భాస్కరరావు వేదికమీదకి వచ్చి నా మెడలో పూలదండవేసి కావిలించుకున్నాడు. ఇద్దరికీ కళ్లు చెమ్మగిలినయ్!

☆ ☆ ☆

ఈ సన్మానాలు (అవమానాలు) అంటే నాకు మొదటినుంచీ అంత ఆసక్తి ఉండేదికాదు.

ఒక చిన్న ఉదాహరణ చెబుతాను. మదరాసులో 'ఆంధ్రమహాసభ' అని ఒక సంస్థ వుంది. అది ఎప్పటిదో! చాలా పురాతనమైనది కాశీనాథుని నాగేశ్వరరావుగారు బులుసు సాంబమూర్తి లాంటి పెద్దలు ప్రారంభించిన సంస్థ అది. కాలక్రమంలో మనుషులతోపాటు అలాంటి సంస్థల స్వరూపాలు గూడ మారడం సహజం గదా!

నేను సినిమా రంగానికి వెళ్లినప్పుడు ఆంధ్ర మహాసభ మూర్ మార్కెట్ ప్రక్కన వి.పి.హాల్ (విక్టోరియా పబ్లిక్ హాల్)లో ఉండేది. (ఇప్పుడు మూర్ మార్కెట్టు గూడ లేదనుకోండి! పూర్వం సెంట్రల్ స్టేషన్ పక్కనే వుండేది మూర్ మార్కెట్! ఇప్పుడు రైల్వే వాళ్లు తీసుకుని బుకింగ్ ఆఫీసులు వగైరాల కోసం అంతస్థుల బిల్డింగ్ కట్టారు) ఆంధ్ర మహాసభ స్థాపించిన ప్రధాన లక్ష్యాలు పోయి చివరికి అన్ని క్లబ్బుల మాదిరే చీట్ల పేక క్లబ్బుగా మారింది. అయినా బిలియర్డ్స్, బాడ్మింటన్ లాంటి గేమ్సు వుండేవి. అంతకంటే గొప్పవిషయం మొదటి నుంచీ ఉన్న సాంస్కృతిక విభాగం అలాగే కొనసాగుతుండేది. నాటకాలు, సాహితీ సదస్సులు జరుగుతుండేవి.

1975 ప్రాంతంలో ఆంధ్రమహాసభకు సెక్రటరీగా టి.జి. కమలాదేవి ఎన్నికయింది. ఆవిడ మహిళల బిలియర్డ్స్‌లో ఆలిండియా ఛాంపియన్‌గా విజయం సాధించింది. ఆవిడ మొదట నాటకాలలో వేషాలు వేసేది. తరువాత సినిమాలలో గూడ వేషాలు వేసింది. 'పాతాళభైరవి'లో 'వగలోయ్ వగలు' అని పాడుతూ డాన్సు చేసింది. 'మల్లీశ్వరి'లో మల్లీశ్వరికి చెలికత్తెగా నటించింది.

ఆంధ్రమహాసభకు ఆరోజుల్లో ఒక ఆనవాయితీ ఉండేది. ప్రతి ఏటా దసరాకో, దీపావళికో, ఒక రచయితనో, కళాకారుడినో సన్మానించడం!



బయటనుంచి అంటే ఏ విజయవాడ నుంచో రాజమండ్రి విశాఖలలాంటి పట్టణాలనుంచి కళాకారుల్ని పిలిపించి సన్మానాలు చేయడానికి ఫండ్సు ఉండేవికావు. అందువల్ల సూక్ష్మంలో మోక్షంలాగ మదరాసులోనే సినిమా రంగంలో ఉన్న కళాకారుల్ని సన్మానించి తక్కువ ఖర్చుతోముగించేవాళ్లు!

1975-76 ప్రాంతంలో ఒకరోజు కమలాచంద్రబాబు (టి.జి.కమల -కార్పొరేషన్‌లో ఆఫీసరు చంద్రబాబును వివాహమాడి కమలాచంద్రబాబు గా పేరు మార్చుకుంది) నాకు ఫోన్ చేసింది.

"నరసరాజుగారూ. ఈ దసరా పండగకి ఆంధ్రమహాసభ తరఫున ఒక ప్రసిద్ధ రచయితను సన్మానించాలని కమిటీ నిర్ణయించింది. అందుకు మిమ్మల్ని కమిటీ ఏకగ్రీవంగా ఎన్నుకున్నది" అని చెప్పింది.

నేను తప్పించుకోడానికి "మనలోమనకి సన్మానాలెందుకమ్మా! కొత్తగా మంచి రచయితలొస్తున్నారు! వాళ్లలో ఎవరికైనా చేస్తే వాళ్లు సంతోషిస్తారు" అన్నాను.

'ఎవరికి చేయమంటారో చెప్పండి' అన్నదామె! ఎవరిపేరో చెప్పాను! ఆ సంవత్సరం ఆ రచయితకు సన్మానం జరిగింది.

ఇలా మూడునాలుగు సంవత్సరాలు ప్రతి సంవత్సరం ఆమె నాకు ఫోన్ చెయ్యడం నేను ఎవరి పేరో చెప్పి ఫలానా వాళ్లకు చెయ్యమని చెప్పి నేను తప్పించుకునేవాణ్ణి!

1979లో మళ్లీ ఫోన్ చేసింది "ఈ సంవత్సరం మీకు తప్పదు! కాదనగూడదు" అన్నది.

మరొకరి పేరు చెప్పడానికి నాకు ఎవరి పేరు స్ఫురించలేదు. దురదృష్టవశాత్తు ఆ సంవత్సరం నా భార్యకు తీవ్రమైన పక్షవాతం వచ్చి విజయాహాస్పిటల్‌లో చేర్పించాను.

ఆ విషయం కమలాచంద్రబాబుకు తెలుసు. ఆ వంకతో "నీకు తెలుసు గదమ్మా - నాభార్య అనారోగ్యం సంగతి? నామనసు ఏమీ బాగోలేదు! సన్మానం ఎలా చేయించుకోమంటావు?" అన్నాను.

వెంటనే ఆమె - "నిజమే లెండి! ఆమెకు త్వరలోనే ఆరోగ్యం బాగుపడాలని భగవంతుణ్ణి కోరుకుంటున్నాను! ఒకసారి హాస్పిటల్‌కు వచ్చి చూడాలని ఉంది! వస్తాను' అని ఫోన్ పెట్టేసింది! అంటే సన్మానం తప్పించుకోడానికి నా భార్య అనారోగ్యాన్ని గూడ ఉపయోగించు కున్నానన్నమాట!

ఆ మరుసటి సంవత్సరం 1980 జనవరి 10వ తేదీ నా భార్య దివంగతురాలయింది.

దసరావచ్చింది. మళ్లీ కమలాచంద్రబాబు ఫోన్ చేసింది. సన్మానం విషయం అడిగింది.

నిజానికి నా భార్య పోయినందుకు సాకుగా చెప్పి తప్పించుకోవచ్చు!

కాని నాకు అనిపించింది. ఇన్ని అబద్ధాలు అవస్థలు పడి తప్పించుకోవడం కంటె ఒకసారి సన్మానం చేయించుకోవడమే తేలిక అనిపించింది.

సన్మానం అంటే కొడతారా? తిడతారా? ఒక శాలువా కప్పుతారు! ఏదో ఒక మెమెంటో చేతికిస్తారు! అంతేగా!

కమలా చంద్రబాబు ఫోన్ చేసి సన్మానం విషయం చెప్పగానే 'అలాగేనమ్మా' అని వెంటనే ఒప్పుకున్నాను.

ఆంధ్రమహాసభలో సన్మానం జరిగింది. సోమయాజులు గారు ప్రెసిడెంట్. ఇచ్ఛాపురపు జగన్నాథరావు గారి చేతుల మీదుగా శాలువా కప్పి మెమెంటో చేతికిచ్చారు. మిక్కిలినేని రాధకృష్ణమూర్తి గారు కూడ వున్నట్టు జ్ఞాపకం



వక్తలందరూ నన్ను గురించి నాలుగు మంచి మాటలు చెప్పారు!

నేను సమాధానం చెబుతూ పై విషయాలన్నీ చెప్పాను. నా సహజ ధోరణిలో "ఇప్పుడు నేను ఎన్ని సన్మానాలకైనా రెడీ! ఎవరొస్తారోరండి! బస్తీమేసవాల్" అన్న ధోరణిలో మాట్లాడాను.

ఇక్కడ హైదరాబాద్‌లో గూడ 1996లో ఒకతను ఫోన్ చేశాడు. అప్పుడు మేము జూబిలీహిల్స్ రోడ్ నెం. 63 లో వుంటున్నాం.

అతను ఫోన్ చేసి "సార్! యన్.టి. రామారావు గారి జన్మదిన సందర్భంగా మే 28వ తేదీన మా సమాజం తరపున, రామారావుగారికి మీరు అతి సన్నిహితులు గదా మీకు సన్మానం చేయాలని నిర్ణయించాం" అన్నాడు.

నేను మళ్లీ నా పాతపాటే పాడుతూ "నాకెందుకయ్యా సన్మానం? నేను రిటైర్ అయినాను. పైగా సన్మానాల మీద మోజు పోయింది. ఇంట్లో అలమరలన్నీ సన్మానాల శాలువాలతో నిండిపోయినై! మీరు ఇప్పుడునాకు సన్మానం చేసి ఒక శాలువా కప్పితే ఆ శాలువా తెచ్చి - మిగతా శాలువాలతో పాటు అలమరలో పెట్టేస్తాను.

నామాట విని ఇప్పుడు కొత్తగా వస్తున్న రచయితకు ఎవరికైనా పిలిచి సన్మానం చేస్తే అతను ఎంతో పరమానంద భరితుడవుతాడు. మీరు కప్పిన శాలువా ఇచ్చిన మెమెంటో ఇంటికి వచ్చిన వాళ్లకల్లా చూపి గర్విస్తాడు!" అన్నాను.

అంటే అతను ఏమన్నాడో తెలుసాండి!! "సార్! మా సమాజమే కొత్త సమాజం! ఈ ఏడే ప్రారంభించాం! మీలాంటి ప్రముఖ రచయితను సన్మానిస్తే మా సమాజానికి గుర్తింపు వస్తుందిగాని ఎవడో అనామకుడి సన్మానం చేస్తే సన్యాసి - సన్యాసి రాసుకుంటే బూడిద రాలినట్లవుతుంది" అన్నాడు నేను ఆశ్చర్యపోయాను! నిజమే! అతను ఎంత తెలివిగా దూరదృష్టితో మాట్లాడాడు!

అయినా ఏవో వేరే కారణాలు చెప్పి సన్మానం తప్పించు కున్నాననుకోండి!

## ఉగాది శుభాకాంక్షలు

నేను 1952లో కుటుంబంతో మద్రాసుకు మకాం మార్చానుగదా! నాకు ప్రయాణాలంటే అప్పటికీ, ఇప్పటికీ గూడ మహా బద్ధకం! మదరాసు నుంచి కదిలేవాణ్ని గాదు! ముఖ్యంగా చేతిలో సినిమా స్క్రిప్టు పని ఉన్నదంటే స్క్రిప్టు మొదలు పెట్టిన తరువాత మధ్యలో ఆపడం నాకు యిష్టం ఉండేది కాదు. అది చివరంటా ముగించే వరకు- మరొక - పని చెయ్యబుద్ధి అయ్యేదిగాదు. ముఖ్యమైన బంధువుల ఇళ్లలో పెళ్లిళ్లకు గూడ వెళ్లేవాణ్ణి గాదు!

ఏడాదికి ఒకసారి నా భూముల కౌలు వసూలు చేసుకోడానికి మా ఊరు తాళ్లూరు వెళ్లేవాణ్ణి. ఒక సంవత్సరం చేతిలో పనివుంటే "కవుళ్ల వసూలు చేసి పంపమని" ఎవరో ఒక రైతుకి ఉత్తరం రాసేవాణ్ణి!

ఇలా మదరాసు నుంచి కదలకపోవడం వల్ల నాతో చదువుకున్న క్లాస్‌మేట్స్ ఫ్రెండ్స్ దేశంలో ఎక్కడెక్కడో లాయర్లుగా జడ్జీలుగా ఉన్నతోద్యోగులుగా చెల్లాచెదురై ఉన్నారుగదా! వాళ్లతో కాంటాక్ట్ ఎలాగ! కలుసుకునే అవకాశాలే ఉండేవి కావు! అందువల్ల నేనొక ఉపాయం కనిపెట్టా! 1964-65 ప్రాంతంలో ప్రారంభించా తెలుగు ఉగాది శుభాకాంక్షలు - స్నేహితులకు పోస్టు చెయ్యడం. మదరాసు సిటీలో ఉన్న మిత్రులకే గాక - ఆంధ్రదేశంలోనూ బొంబాయి, ఢిల్లీ, కలకత్తా నగరాలకు, ఉద్యోగరీత్యా వ్యాపారరీత్యా వెళ్లి అక్కడే ఉండిపోయిన మిత్రులందరికీ ఉగాది శుభాకాంక్షలు పంపేవాణ్ణి!



అప్పుడు దాదాపు 400 కార్డులు పోస్టు చేసేవాణ్ణి! కొందరు తిరిగి శుభాకాంక్షలు పంపడంగాని జవాబుగా ఉత్తరాలు రాయడం గాని చేసేవాళ్లు. కొంతమంది జవాబులు రాసే అలవాటులేని వాళ్లు - శుభాకాంక్షలు అందుకని మెదలకుండా ఊరుకునే వాళ్లు! నాఉద్దేశం వాళ్లు తిరిగి ఉత్తరాలు రాయాలని గాదు! "నువ్వు నాకు గుర్తున్నావు!" ఎప్పుడైనా మదరాసు వస్తే అందులో అడ్రసు ఫోన్ నంబరు ఉంటుంది గనక ఫోన్ చెయ్యడమో వీలుంటే కలుసుకోవడమో జరగాలని నా వుద్దేశం!

అప్పుడు దాదాపు 400 ఉన్న మెయిలింగ్ లిస్ట్ (ఇప్పటికీ ఆ బుక్కువుంది.) ఇప్పుడు చూస్తే కొన్ని పేజీలు ఖాళీ! చాలామంది పోయారు. మ్యూజిక్ డైరెక్టర్లు ఆర్ట్ డైరెక్టర్లు రచయితలు కవులు కెమెరామెన్ దర్శకులు, నిర్మాతలు దాదాపు 90 శాతం పోయారు. అలాగే ఈ తరంవాళ్లలో ఉన్న స్నేహితులు గూడ చాలామంది పోయారు. 400 మించుమలె ఒక నూరు నూట యాభైమంది వుంటారేమో! ఈ మధ్య కొత్తగా కలిగిన మిత్రులుగూడ కలుపుకుంటే ఇప్పుడు మెయిలింగ్ లిస్ట్ 200 లోపుంటుంది.

చాలా ఆసక్తి కరమైన విషయం ఒకటి చెబుతాను. ఆచంట జానకిరాంగారని ఆలిండియారేడియో మదరాసు స్టేషను పెట్టినప్పటి నుండి దానిలో పనిచేసిన సీనియర్ మోస్ట్ ఎంప్లాయి! మంచి రచయితగూడ! 'జరుగుతున్న చరిత్ర' అని కాబోలు తన అనుభవాలు చాలామంచి పుస్తకం రాశాడు. ఆయన రిటైరైనాడు. ఆయన భార్య ఆచంట శారద తిరుపతిలో మహిళా కళాశాలలో ప్రొఫెసరుగా తరువాత ప్రిన్సిపాల్‌గా కూడా పనిచేసింది. ఆమె నాకు బాగా తెలుసు. ఎలాగంటే, ఆమె అన్నగారు ఎల్లేపెద్ది సుబ్రహ్మణ్యంగారని లయోలాలో నాకు ఒక ఏడాది సీనియర్! తరువాత 'లా' చదివి విజయవాడలో ప్రాక్టీసు పెట్టాడు. ఆయన స్వస్థలం గూడ విజయవాడే.

జానకిరాంగారు ఆలిండియా రేడియోలో రిటైరైన తరువాత భార్య దగ్గర తిరుపతిలో ఉండేవాడు. ప్రతిఏటా దంపతులిద్దరికీ ఉగాది శుభాకాంక్షలు పంపేవాణ్ణి! జవాబులు రాసేవాళ్లు గాదు! కొన్నాళ్ల తరువాత శ్రీమతి శారదగారు గూడ రిటైరైనారు. ఆ తరువాత ఇద్దరూ ఎక్కడికి వెళ్లారో ఏ ఊళ్లో ఉంటున్నారో - తెలియక శుభాకాంక్షలు పంపడం మానేశాను. జానకిరాం గారూ బెజవాడ గోపాలరెడ్డిగారు ఇద్దరు మంచి స్నేహితులు. ఇద్దరూ మంచి చదరంగం ఆటగాళ్లు! గోపాలరెడ్డిగారికంటే జానకిరాంగారు రెండు మూడేళ్లు పెద్ద!

దాదాపు పది పన్నెండేళ్ల క్రితం అంతకు ముందేనో జ్ఞాపకం లేదు. బెజవాడ గోపాలరెడ్డిగారు మదరాసు వచ్చారు. నెల్లూరులో ఉండేవారు. ఆయన మదరాసు వచ్చినప్పుడల్లా చెట్టినాడు ప్యాలెస్‌లో దిగేవారు. చెట్టినాడు రాజా ముత్తయ్య చెట్టియార్ ఆయనకు దగ్గర స్నేహితుడు. గోపాలరెడ్డిగారు కారులో సాహితీ కళారంగ మిత్రులందరినీ ఒక సారి కలవడం ఆయనకు అలవాటు! ముందు 'చందూర్' నికారులో ఎక్కించుకునేవారు! తరువాత నాకు ఫోన్ చేసి మాఇంటికి వచ్చారు! నేనూ కారులో కూర్చున్నాను.

"ఎక్కడికి వెళ్దాం" అన్నారు గోపాల రెడ్డిగారు. "బీచ్‌కి వెళదామా?" అన్నాను.

"బీచ్ ఎప్పుడూ చూచిన బీచేగా!- జానకిరాం దగ్గరికి వెళదామా?" అన్నారు.

నేను ఆశ్చర్యంగా "జానకిరాం ఇక్కడవున్నారా?" అన్నాను. "అవును! ఇప్పుడేం? అతని భార్య శారద గూడ రిటైరైన తరువాత నాలుగయిదేళ్ల క్రితమే తిరుపతి నుంచి మకాం మార్చి - మదరాసులోనే ఉంటున్నారు" అన్నారాయన!



మదరాసులో లాయిడ్స్ రోడ్ పక్కన శారదకు సొంత ఇల్లున్న సంగతి నాకు తెలుసు! ఆ యింటికి వెళ్లాం!

జానకి రాంగారూ - శారదగారూ నేను గోపాలరెడ్డిగారు యన్.ఆర్. చందూర్ డ్రాయింగు రూంలో కూర్చుని కబుర్లలో పడ్డాం!

పది పదిహేను నిముషాలయిన తరువాత సడన్‌గా జ్ఞాపకం వచ్చి జానకిరాంగారు నాతో "అవును! నాకు ఉగాది శుభాకాంక్షలు పంపడం మానేశారేం?" అన్నాడు.

నేను నా కథ మొదలు పెట్టాను.

"జానకి రాంగారూ! మీలాంటి గోపాలరెడ్డిగారి లాంటి మిత్రులకి దాదాపు 400 మందికి ఉగాది శుభాకాంక్షలు పంపుతుంటాను! కొంతమంది జవాబులు రాస్తారు! కొంతమందికి రాసే అలవాటులేక రాయరు!

నాకు నెల్లూరు జిల్లా కావలిలో ఒక మిత్రుడుండేవాడు. లయోలా కాలేజీలో నాకు జూనియరు. అతనికి ఏటా ఉగాది శుభాకాంక్షలు పంపేవాణ్ణి! అలవాటులేక అతను జవాబు రాసేడు కాదు!

కొన్నాళ్ల క్రితం ఆ కావలి స్నేహితునికి నాకు గూడా ఒక కామన్ ఫ్రెండ్ నెల్లూరులో ఉండేవాడు! అతను ఒకసారి మదరాసువచ్చి నప్పుడు అడిగాను. కావలి మిత్రుని విషయం!

"ప్రతి ఏటా శుభాకాంక్షలు పంపుతాను! ఒక్కసారి గూడ జవాబు రాయడు! అతను ఎలా ఉన్నాడు?" అని అడిగాను.

"వాడు పోయి పదేళ్లకు పైగానే అయింది" అన్నాడు నెల్లూరు మిత్రుడు.

"అతడు పోయిన సంగతి తెలియక పదేళ్లు నేను అతనికి శుభాకాంక్షలు పంపుతూనే ఉన్నాను!" అన్నాను!

జానకిరాంగారు సూక్ష్మ గ్రాహి గనక గ్రహించి వెంటనే లేచి పకపక నవ్వుతూ "నేను గూడ పోయాననుకున్నారా?" అని కావిలించుకుని "నేను పోయేముందు మీకు చెప్పి మరీ పోతాను. అంతవరకు నాకు శుభాకాంక్షలు పంపుతూనే ఉండండి" అన్నారు. అందరం కాసేపు నవ్వుకున్నాం!

శారద తిరుపతి కాలేజ ప్రిన్సిపాల్‌గా ఉన్నప్పుడు నాకు ఉత్తరం రాసింది మదరాసుకు!

"నరసరాజుగారూ! మీ నాటిక 'వాపస్' మంచి సెటైర్! దానిని మాకాలేజ స్టూడెంట్స్ చేత వేయించాలనుకుంటున్నాను. అందులో అన్నీ మగ వేషాలే గదా! మా స్టూడెంట్స్ అందరూ ఆడపిల్లలుగదా! మీరు నాకు పర్మిషన్‌యిస్తే ఆ నాటికలోని మగ పాత్రలన్నీ ఆడ పాత్రలకు [illegible] ప్రదర్శించాలని ఉంది. నావల్‌గా ఉంటుంది" అని వ్రాసింది ఆమెగారు. నేను సరే వేయండి అని రాశాను.

ఆ విషయం ఆమె ఆరోజు గుర్తుచేసి "నరసరాజుగారూ - జ్ఞాపకం వుందా?" అని అడిగింది.

తరువా[illegible] రెండు [illegible]ేళ్లకి జానకిరాంగారు మదరసులో పోయారు! రెండు మూడేళ్లక్రితం శారదగారు గూడ క్యాన్సర్ వ్యా[illegible] తో [illegible]ారు. ఆమె అన్నగారు సుబ్రహ్మణ్యం గారు నాకు కార్డు పంపాడు.

మరొక interes[illegible] episode చెబుతాను. P.B.K. మూర్తి అని I.L.T.D. టూబాకో కంపెనీలో కలకత్తాలో దాదాపు ఛీఫ్‌గా పనిచేసి [illegible] హైదరాబాద్ బేగంపేటలో ఉమానగర్ లో యిల్లు కట్టుకుని సెటిల్ అయినాడు. అతని తండ్రి గారు పి.యస.టి. శాయి తల్పశాయి, గారని బారిస్టరు గుంటూరులో!



నేను, మూర్తి మదరాసు లయోలా కాలేజీలో సమకాలికులం! అతను బి.ఎస్.సి., నేను బి.ఏ చదివాం!

అతనిగూడ ప్రతి సంత్సరం ఉగాది శుభాకాంక్షలు పంపేవాణ్ణి.

నేను ఈనాడు' దినపత్రికలో 'అక్షింతలు' పేరుతో 19 సంవత్సరాలు రాశాను. 1981 నుంచి 2000 సంవత్సరం వరకు.

అందులో ఒక్కొకసారి పేర్లు చెప్పకుండా కొందరు మిత్రులను గురించి రాసేవాణ్ణి!

కాలేజీలో చదివేటప్పుడు మేము అతన్ని పి.బి. అనేవాళ్లం! గుంటూరులో అతని మిత్రులు 'బలరాం' అని పిలిచేవాళ్లు. పూర్తి పేరు పంగులూరి బలరామకృష్ణమూర్తి.

I.L.T.D. కంపెనీ British Company. దానికి మూర్తి తండ్రిగారు తల్పశాయి గారు స్వాతంత్ర్యానంతరం బ్రిటిష్ ఆఫీసర్లంతా ఇంగ్లండు వెళ్లి పోతూ తమ స్థానాల్లో ఇండియన్లను అపాయింట్ చేసిపోయారు. తండ్రి లీగల్ అడ్వయిజర్ కావడంతో మూర్తికి కంపెనీలో అగ్రస్థానంలో ఉద్యోగం వచ్చింది. కంపెనీలో అంత అగ్రస్థాయిలో వుద్యోగం చేసిన మొదటి భారతీయుడు మూర్తి! చాలా స్ట్రిక్ట్ ఆఫీసర్ అని పేరు! ఎవరినీ spare చేసేవాడు గాదు. కింది ఆఫీసర్లు అతని పేరు చెబితే గడగడ లాడేవారు. ఆ కారణంగా అతను రిటైర్ అయిన తరువాత అతని దగ్గరకు వెళ్లడానికి భయపడేవాళ్లు. నాతో మాత్రం కాలేజీలో ఎలా ఉండేవాళ్లమో అలాగే ఉండేవాడు. ఎప్పుడైనా పని మీద మదరాసు వస్తే నాకు ఫోన్ చేసేవాడు. ఇద్దరం కలిసి భోజనం చేసేవాళ్లం. అతని కుమారుడి పెళ్లి - తిరుపతిలో జరిగితే నాకు ఇన్విటేషన్ పంపాడు. నేను పెళ్లికి వెళ్లాను. పేరు రాయకుండా అతన్ని దృష్టిలో పెట్టుకుని ఒకసారి 'ఈనాడు', 'అక్షింతల్లో' రాశాను. "నాకు ఒక ముఖ్య స్నేహితుడున్నాడు. ఆయనకి అన్నీ ఉన్నయ్! పెద్ద కంపెనీలో పెద్ద ఉద్యోగం చేసి రిటైరైనాడు. కొడుకు గూడ మంచి ఉద్యోగంలో ఉన్నాడు. కూతురుకు పెళ్లి చేశాడు. అల్లుడు కూడ మంచి పొజిషన్ లోవున్నాడు బోలెడు పెన్షన్ వస్తుంది. అన్నీ వున్నాయి! ఎలోటూ లేదు! కాని ఒకటేలోటు! ఒంటరితనం ఫీల్ అవుతున్నాడు. ఉద్యోగం చేసే రోజుల్లో స్ట్రిక్ట్‌గా వుండి అందరినీ అదరగొట్టిన కారణంగా ఎవరూ దగ్గరకు రారు" అని అతన్ని గురించి వివరంగా వర్ణిస్తు రాశాను.

అతను 'ఈనాడు' లో నా 'అక్షింతలు' రెగ్యులర్‌గా చదివేవాడు. ఆ ఆర్టికల్ చదివి నాకు మదరాసుకు ఉత్తరం రాశాడు.

"ఎవరీ ఫ్రెండూ? లయోలా కాలేజీలో చదివిన ఫ్రెండు అయితే నాకుగూడ తెలిసివుండాలిగదా! అతనికి అన్నీ నా లక్షణాలే ఉన్నయ్! అతనెవరో తెలుసుకోవాలని నాకు చాలా కుతూహలంగా వుంది. Plese don't deny me the pleasure of knowing your friend! (ఉత్తరం అంతా ఇంగ్లీషులోనే రాశాడు లెండి)

నేను వెంటనే రిప్లై రాశాను. ఒకటే వాక్యం ఇంగ్లీషులో 'It is your self' అని:

తరువాత నేను హైదరాబాద్ వచ్చినప్పుడు అతని యింటికి వెళ్లాను. నేను కారు దిగి గేటు తీస్తుండగానే అతను యింట్లో నుంచి వచ్చి అమాంతం కావిలించుకున్నాడు. ఇద్దరం పక పక నవ్వుకున్నాం!

అతనికి serious arthritis. కీళ్లనొప్పులు ఉండేవి. ఈ మధ్య రెండు మూడేళ్ల క్రితం సడన్‌గా పోయాడు.

నేను ప్రారంభించిన 'ఉగాది శుభాకాంక్షలు' నాకు చాలా మేలు చేసింది. కాలేజీ వదిలిపెట్టిన తరువాత



కొన్ని దశాబ్దాలపాటు కలుసుకోడానికి వీలుపడని మిత్రులతో Contact - maintain చేయడానికి అవకాశం కలిగింది. ఒక్కొకసారి జీవితంలో మరపురాని విశిష్ట వ్యక్తులతో పరిచయాలు అవుతుంటాయి.

కాశీ విశ్వనాథం గారని 'ఈనాడు' రామోజీ రావుగారికి (కజిన్) బ్రదర్! ఆయనది చాలా విలక్షణమైన వ్యక్తిత్వం! ఆయనకు రామోజీరావుగారితో చుట్టరికమే గాక - వాళ్లిద్దరూ చాలా సన్నిహితులు! విశ్వనాథం గారు కమ్యూనిస్టు! ఆయన ప్రోద్బలంవల్లే రామోజీరావు గారు మొదట్లో కమ్యూనిస్టు పార్టీలో కార్డు హోల్డరు మెంబరుగా చేరాడు.

కమ్యూనిస్టు పార్టీలో 1964 ప్రాంతంలో చీలిక వచ్చిన తరువాత రామోజీరావు గారు పార్టీ నుంచి బయటికి వచ్చేశాడు.

అప్పుడే మార్గదర్శి చిట్ ఫండ్స్ కంపెనీ ప్రారంభించాడు. ఆ ప్రారంభించింది రామోజీరావుగారూ విశ్వనాథంగారు.

విశ్వనాథంగారంటే రామోజీరావుగారికి ఎంతో నమ్మకం! హైదరాబాద్‌లో 'ఈనాడు' బిల్డింగ్ కాని వైజాగ్‌లో డాల్ఫిన్ హోటలు గాని రామోజీ ఫిల్మ్ సిటీలో హోటళ్లు - యితర కట్టడాలుగాని అన్ని సివిల్ వర్క్స్ యిన్ చార్జి విశ్వనాథం గారే!

ఆయన వైజాగ్‌లో వుండేవాడు హైదరాబాద్‌లో సివిల్ వర్క్స్ ఏమైనావుంటే వచ్చి హైదరాబాద్‌లో జూబిలీ హిల్స్‌లో ఉషాకిరణ్ గెస్ట్ హౌస్ లో ఉండేవాడు! నేను గూడ నా ప్రొఫెషనల్ పని మీద మదరాసు నుంచి హైదరాబాద్ వస్తే ఆ గెస్ట్ హౌవుస్‌లోనే ఉండేవాణ్ణి. అప్పుడు గెస్ట్‌హౌస్ జూబిలీహిల్స్ రోడ్డు నంబరు 36లో ఉండేది.

అలా ఆయనతో పరిచయమై క్రమంగా మంచి స్నేహితులమైనాం! ఆయనలో నాకు కనిపించిన విశిష్టత ఏమిటంటే ఆయన గొప్ప రేషనలిస్టు! కొన్ని కొన్ని విషయాలు మనం మామూలుగా చూచినదాని కంటె ఆయన మరో కోణం నుంచి ఆలోచించే వాడు. ఆయన నాకంటే నాలుగయిదేళ్లు చిన్నవాడే! ఆయన చదువుకున్నది గుంటూరు హిందూకాలేజీలో యింటర్ మీడియట్ వరకే అయినా తరువాత బాగా చదువుకున్నవాడు. విషయ పరిజ్ఞానం చాలా ఎక్కువ! నిర్మొహమాటంగా మాట్లాడేవాడు.

ఇప్పుడు వస్తున్న వార్తాపత్రికలు గురించి ఆయన ఆవేశంగా అంటుండేవాడు.

"ఇవి న్యూస్ పేపర్సు కావండి! వ్యూస్ (Views) పేపర్సు! వాళ్ల అభిప్రాయాలన్నీ మన నెత్తిన రుద్దుతారేమిటి? "వాడు వీణ్ణి మట్టి గరిపించాడు!" ఏమిటా హెడ్డింగ్? "వాడు వీణ్ణి ఓడించాడు" అనిరాయి! అదిన్యూస్!

"పోలీసులు చితక బాదారు" ఏమిటా హెడ్డింగ్! "పోలీసులు లాఠీచార్జీ చేశారు" అని రాయి! అది న్యూస్! అది మంచో చెడో - క్రింద నువ్వు రాసే వార్తా వివరాలను బట్టి మేము నిర్ణయించుకుంటాం!

నువ్వు అభ్యుదయ భావాలనుకునేవి ఆ భావాలతో ప్రజలను ప్రభావితుల్ని నీ పేపరు ద్వారా చేయాలనుకుంటే నీకు 'ఎడిటోరియల్' ఉందిగా! సంపాదకీయం! అందులో రాసుకో!

అంతేగాని - వార్త హెడ్డింగులోనే పక్షపాతం చూపుతావెందుకు?

అసలు సంపాదకీయం గూడా రోజూ వ్రాసి తీరాలని రూల్ వుందా!

ఎవడో ప్రారంభించాడు! దాన్ని గుడ్డిగా అనుకరించడం!



ఎడిటోరియల్‌లో రాయవలసిన ముఖ్య విషయం ఉన్నప్పుడు వ్రాయి! ఏమీలేనప్పుడు గూడ ఏదో ఒకటి చెత్త వ్రాయడం ఎందుకు?

"కేరళలో కొబ్బరి తోటలు" "ఊటీలో కాఫీ పరిశ్రమ?' ఎవడిక్కావాలి?

అసలు డెయిలీ ప్రెస్ దిన పత్రికలన్నీ కాపిటలిస్టు పత్రికలండీ! 'ఈనాడు'తో సహా! వ్యాపార దృష్టి! లేకపోతే బతకలేవు: అటువంటప్పుడు నిష్పాక్షికంగా సామాన్య ప్రజల పక్షాన ఎలా నిలబడగలవు?

ఎడ్వర్టయిజుమెంటు రెవిన్యూలేనిదే దినపత్రికేదీ బతకలేదు. ఎడ్వర్టయిజ్‌మెంట్లు భారీగా పేజీలకు పేజీలు ఇచ్చేవి భారీ పరిశ్రమలు! సామాన్య పాఠకుడు రోజూ పేపరు కొనడానికి ఇచ్చే రెండు రూపాయల్తో మూడు రూపాయలతో నీ పత్రిక బ్రతకలేదు!

న్యూస్ పేపర్లు వ్యూస్ పేపర్లుగా మారిన తరువాత వార్తల్లో నిజమేదో అబద్ధమేదో తెలియడంలేదు! ఒక మీటింగ్‌కి లక్షలమంది వచ్చారని ఒక పేపరువాడు వ్రాస్తాడు. మైదానం అంతా ఖాళీ! జనమే లేరు. అని యింకో పేపరువాడు వ్రాస్తాడు. నాలుగు పేపర్లు చదివితేగాని అసలు నిజమేదో తెలుసుకోడానికి అవకాశం లేకుండా పోయింది.

జిల్లా ఎడిషన్లు వచ్చిన తరువాత పరిస్థితి మరీ అధ్వాన్నంగా తయారయింది! వైజాగ్ జిల్లాలో ఏం జరిగిందో, గోదావరి జిల్లా వాడికి తెలీదు. నెల్లూరులో ఏం జరుగుతుందో వరంగల్లు జిల్లాలో వాడికి తెలీదు! పత్రికలకి ఆదాయం పెరగవచ్చుగాని రీడర్సుకు నష్టమే జరుగుతోంది.

జిన్నా - ఇండియాని రెండుగా చీల్చాడు గాని యీ పత్రికలవాళ్లు - రాష్ట్రాన్ని డజను ముక్కలుగా చీల్చారు. జిల్లా ఎడిషన్లతో!

ఇలా వుండేవి ఆయన అభిప్రాయాలు! ఆయన ప్రభావంతో నా ఆలోచనా సరళిలో గూడ కొంత మార్పు వచ్చిందని ఒప్పుకుంటాను!

ఆయనకి హోమియోపతి వైద్యం మీద విపరీతమైన నమ్మకముండేది. అల్లోపతి అంటే పడేదికాదు! హోమియోపతి మీద ఎన్నో పుస్తకాలుండేవి ఆయన దగ్గర.

ఒకసారి ఆయనకి ఏదో జబ్బు చేసింది. గెస్టుహౌస్‌లో ఉండగానే అప్పుడు 'ఈనాడు' మేనేజింగ్ డైరెక్టరుగా ఉండే రామమోహనరావు గారు, విశ్వనాథంగారికి అతి సన్నిహితుడు. 'కాశీ అన్నయ్య' 'కాశీ అన్నయ్యా' అంటూ పాకులాడుతూండేవాడు. రామమోహనరావు గా ఆయన్ని బలవంతంగా అల్లోపతి డాక్టరు దగ్గరకి తీసుకెళ్లాడు. ఆ డాక్టరు మందులు రాసిచ్చాడు. ఆ మందులన్నీ కొని రామమోహనరావుగారు ఆయన కిచ్చికెళ్లాడు. తప్పకుండా వేసుకోమని చెప్పిపోయాడు. "అలాగే? అన్నాడు. రెండు మూడు రోజుల తరువాత వచ్చి "మందులు వేసుకుంటున్నానా?" అని అడిగితే "వేసుకుంటున్నా! అదుగో చూడు!" అని వేస్ట్ పేపర్ బాస్కెట్‌లోని మందుల పైన వుండే రేకులు చూపించేవాడు. రామమోహనరావుగారు నమ్మి వెళ్లిపోయేవాడు.

తరువాత నాతో నవ్వుతూ చెప్పేవాడు! "ఒట్టిదే! మందు మాత్రలన్నీ కిటికీ గుండా బయటపారేసి పైన ఉన్న కవర్లు చూపించా రామమోహన్‌కి" అని పకపకనవ్వేవాడు.



అలాగే సరైన వైద్యం చేయించుకోక జబ్బు ముదర పెట్టుకుని అకస్మాత్తుగా రాజమండ్రి నుంచి వైజాగ్ వెళుతుండగా జబ్బుచేసి వైజాగ్ వెళ్లగానే చనిపోయాడు. హేమరేజితో! చాల విశిష్టమైన వ్యక్తి! మంచి స్నేహితుడు! విశ్వనాథంగారు పోయినప్పుడు రామోజీరావుగారు అన్నారు "నా కుడిభుజం పడి పోయిందండి! ఆయనకు ఏదైనా పని అప్పజెబితో అంతే! ఇక ఆలోచించే పనిలేదు! మరచిపోయేవాణ్ణి! ఇప్పుడు ఇంకొకణ్ణి వెతుక్కోవలి" అని బాధ పడ్డారు.

రామమోహనరావు గారు కూడా బాధపడ్డారు. "చేతులార చేసుకున్నాడండి! సరైన వైద్యం చేయించుకోక హోమియో మీదనే ఆధారపడి ప్రాణాల మీదకి తెచ్చుకున్నాడు" అని.

ఆయన కొన్ని కొన్ని విచిత్రమైన కామెంట్స్ చేసేవాడు. "ఎందుకండీ ఈ శిలావిగ్రహాలు! Burden to History! భవిష్యత్తు వీళ్లని జ్ఞాపకం పెట్టుకోవాలట! ఎందుకు? ఏం ఘనకార్యం చేశారని! నెత్తిన కాకులు రెట్టలు వేస్తే కడిగేవాడు గూడ ఉండడు" అనేవాడు పక పక నవ్వుతూ:- 'ఈ టీవీ' సుమన్‌కి విశ్వనాథం గారంటే ఎంత ఇష్టమో! 'కాశీ పెదనాన్న' కాశీ పెదనాన్న" అంటూ కలవరిస్తుండేవాడు! ఆయన వూళ్లోవుంటే సుమన్ గెస్ట్‌హౌస్‌కి వచ్చి గంటలకు గంటలు - గడిపేవాడు. రామోజీరావు కుటుంబంలో అందరికీ విశ్వనాథం గారంటే అంత గౌరవం. ఆయనకి గూడ వాళ్లంటే అంత అభిమానము! ప్రేమ!

☆ ☆ ☆

నా ఉగాది శుభాకాంక్షలు' విషయం చెప్పానే మదరాసు నుంచి నేను ఎక్కువగా కదలక పోవడంవల్ల ప్రయాణాలంటే బద్ధకం వల్ల స్వయంగా కలుసుకోలేని మిత్రుల్ని ఏడాదికొకసారైనా పలకరిద్దామనే ఉద్దేశంతో 'శుభాకాంక్షలు' మొదలుపెట్టాను కాని అడ్రసులు తెలియక పోవడం వల్ల కొందరు మిత్రులకి కాలేజీ రోజుల్లో సన్నిహితంగా ఉన్న వాళ్లకి కొందరికి శుభాకాంక్షలు పంపలేక పోయేవాణ్ణి!

అటువంటి వాళ్లలో కొందరిని 40, 50 ఏళ్లు - కలవకపోవడం కనీసం ఉత్తరాలు గూడ రాయని వాళ్లు గూడ ఉన్నారు. వాళ్లు ఎప్పుడో జ్ఞాపకం వచ్చేవాళ్లు!

అటువంటి వాళ్లలో ఇంతకుముందు చెప్పాననుకుంటాను జె.యస్.ఆర్. ఆంజనేయశాస్త్రి అని నాకు హైస్కూలులోనూ యింటర్‌మీడియట్‌లోనూ క్లాస్‌మేట్! చాలా హుషారుగా ఉండేవాడు. నవ్వితే బిగ్గరగా పకపక నవ్వేవాడు. ఇంటర్ చదివేటప్పుడు నేనైనా కాస్త స్టూడెంట్ మూవ్‌మెంటులో పాల్గొనే వాణ్ణిగాని ఆంజనేయ శాస్త్రి అసలు రాజకీయాల జోలికే వచ్చేవాడు కాదు.

అటువంటివాడు నేను బి.ఏ. పూర్తి చేసి విజయవాడలో ఇల్లు కట్టిన తరువాత ఒకసారి కనిపించాడు. కమ్యూనిస్టు పార్టీలో చేరానన్నాడు. ఊరికే మెంబరుగా చేరడం గాదు. చాలా యాక్టివ్‌గా పనిచేసేవాడు. 1943-44 ప్రాంతంలో బెజవాడలో మా ఇంటికి వచ్చి పార్టీలో చేరమని బ్రతిమాలాడేవాడు.

అంతే! ఆ తరువాత నేను సినిమా రంగానికి వెళ్ళిన తరువాత అతనికీ నాకూ సంబంధమే లేదు! అతను పార్టీ గొడవల్లో పడిపోయి ఉంటాడు.

దాదాపు 40 ఏళ్ల తరువాత ఏదో సందర్భంలో జ్ఞాపకం వచ్చాడు. విశ్వనాథంగారితో మాట్లాడుతున్నప్పుడే! జూబిలీ హిల్స్ గెస్ట్ హౌస్‌లో కమ్యూనిస్టు పార్టీ విషయాలు మాట్లాడుకుంటున్నాం నేను కాశీవిశ్వనాథంగారు! ఆయన



చాలా కాలం పార్టీలో ఉన్నాడు గనక ఆంజనేయ శాస్త్రి ఆయనకు బాగా తెలుసు.

నేను అన్నాను: "ఆంజనేయ శాస్త్రి నాకు చాలా సన్నిహితులండి: కొన్ని దశాబ్దాలయిందండి వాణ్ణి చూచి ఎక్కడ ఉంటాడు?" అని అడిగాను.

"హైదరాబాద్‌లోనే హాస్పిటల్లో ఉంటున్నాడని విన్నానండి! కనుక్కుంటాను" అన్నారు విశ్వనాథం గారు.

వారం రోజులయిన తరువాత ఆయనే చెప్పారు. "నరసరాజుగారూ! ఆంజనేయ శాస్త్రి క్యాన్సరు వ్యాధితో 10 రోజుల క్రితం చనిపోయాడటండీ" అని.

"అయ్యో! వాడు రెండు మూడు వారాల క్రితం జ్ఞాపకం వచ్చివుంటే వెళ్లి చూసే వాణ్ణే!" అని బాధపడ్డాను.

ఇలాగే చాలా కాలానికి జ్ఞాపకం వచ్చి చూద్దామనుకున్నప్పుడు "వాడు ఈ మధ్యనే పోయాడండీ" అన్న వార్త తెలిసింది. జగన్నాథ్ విషయంలో !

జగన్నాథ్, అంటే ఇంటర్‌లో రవి - జగన్నాథ్. నేను మొదటిసారి నాటకం వేశామనీ నా మొట్టమొదటి రచన "అంతర్వాణి" ఏలూరు పరిషత్తులో నటించాడని చెప్పానే. వాణ్ణి గూడ 40, 50 ఏళ్లుగా కలపలేదు. ఎక్కడో ఫోటోగ్రాఫర్‌గా పనిచేస్తున్నాడని వినడమే గాని అడ్రసు తెలియక శుభాకాంక్షలు గూడ పంపేవాణ్ణి గాదు. 1986-87 ప్రాంతంలో మరొక గుంటూరు మిత్రుడితో మాటల సందర్భంలో వాడి ప్రస్తావన వచ్చింది. ఆ గుంటూరు మిత్రుడు- ఎవరో కాదు. మా పాటిబండ్ల రామకృష్ణ కజిన్, పినతల్లి కొడుకు నాగభూషణం! రిటైరై జూబిలీ హిల్స్‌లో ఇల్లు గట్టుకుని సెటిల్ అయినాడు. అతనితో జగన్నాథ్ విషయం ప్రస్తావిస్తే "జగన్నాథ్ నాకు బాగా తెలుసండి! అప్పుడప్పుడు హైదరాబాద్ వస్తుంటాడు. వచ్చినప్పుడు నన్ను కలుస్తుంటాడు. ఈసారి వచ్చినప్పుడు మీకు చెబుతాను" అన్నాడు.

ఆ తరువాత నెలరోజులకి "సారీ! నరసరాజుగారు! జగన్నాథ్ రెండు నెలల క్రితం పోయాడట! నాకు నిన్ననే తెలిసింది" అన్నాడు నాగభూషణం.

అలాగ ఎన్నో దశాబ్దాలు కలవకుండా తీరా చూద్దామనుకున్నప్పుడు వాళ్ల మరణవార్త తెలియడం, అదొక విషాదకరమైన అనుభూతి.

అందరం పోయేవాళ్లమే! ఎవరూ శాశ్వతం కాదు! అయినా ఉన్నన్నాళ్లయినా స్నేహానికి ఉన్న విలువ అలా వుటుంది!

మా మనవరాలు శిరీషకు సుమన్‌తో 1994లో వివాహం అయిన తరువాత ఆమె గర్భవతి కావడం, బిడ్డను కనడం, సుమన్ సినిమా షూటింగులలో తిరగడం వల్ల ఇంట్లో ఆడ సహాయం అవసరం కావడంతో మా అమ్మాయి కవిత, నేను 1996లో హైదరాబాద్‌కు వచ్చేశాం! సినిమా పరిశ్రమ గూడ మదరాసు నుంచి దాదాపు హైదరాబాద్ వచ్చేసింది. ఇప్పుడు మదరాసులో సినిమాకు సంబంధించిన స్నేహితులు నాగిరెడ్డిగారు, భానుమతిగారు లాంటివాళ్లు నలుగురయిదుగురు - సినిమాకు సంబంధం లేనివాళ్లు యం.యస్. అప్పారావు గారు, ప్రేమ్‌చంద్, బి.యస్.ఆర్. కృష్ణ, మాలతీ చందూర్ దంపతులు ఇలా ఒక అరడజనుమంది తప్ప మదరాసులో మిత్రులు ఎక్కువగా లేరు! నిజానికి నేను మదరాసు వెళ్లి నాలుగేళ్లు పైగా అయింది. 1999లో మేలో వెళ్లాను. ఇల్లు తాళం పెట్టి షెడ్‌లో ఒక నౌకరు ఫ్యామిలీని పెట్టాం. మా అమ్మాయి ఏడాదికో ఆరు నెలలకో వెళ్లి ఇల్లు క్లోజ్ చేయించి రంగులు వేయించి వస్తుంటుంది.





కూతురు కవితతో...

In fact హైదరాబాద్‌లో నాకు ఎక్కువ మంది ఫ్రెండ్స్ ఉన్నారు! సినిమా వాళ్లు కాకుండా నాతో చదువుకున్న క్లాస్‌మేట్స్ అందరూ రిటైరై హైదరాబాద్‌లో సెటిల్ అయిన వాళ్లు సుప్రీంకోర్టు జడ్జి - జస్టిస్ చిన్నపరెడ్డి! ఆంధ్ర హైకోర్టు రిటైర్డ్ చీఫ్ జస్టిస్ కోకా రామచంద్రరావుగారు, పోలీసు ఐ.జి. కోన రామచందరరెడ్డి (పాపం నాలుగైదేళ్ల క్రితం పోయాడు). పి.బి.కె. మూర్తి (ఐ.టి.సి) అతనూ ఏడాది క్రితం పోయాడు. డా॥ ఎన్. ఆదినారాయణ శర్మ, Reserve Bank లోనూ, World Bank IMF లో పని చేసి రిటైరైనాడు. పాపం! ఆయన భార్య వారం రోజుల క్రితమే పోయింది. మేమంతా Old Loyola Group! పోయిన వాళ్లు పోగా ఉన్న వాళ్లని అప్పుడప్పుడు వెళ్లి చూచి వస్తుంటాను. మా వి.జి.ఎస్.వి. ప్రసాద్ తమ్ముడు డా॥ రాందాస్, బి.ఎస్. మూర్తి, ఆంధ్రా యూనివర్సిటీలో లా డిపార్ట్‌మెంట్ చీఫ్‌గా రిటైరైనాడు. విజయవాడకు చెందిన సీనియర్ అడ్వకేట్ చక్రవర్తి.

ఓపిక ఉన్నప్పుడల్లా వెళ్లి చూచి వస్తుంటాను! పాతకాలం కబుర్లు చెప్పుకుంటుంటాం! నాకంటె చాలా చిన్నవాడయినా Ex - CBI director విజయరామారావు కూడా! రాష్ట్ర మినిస్టరు.

ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే ఈ వయసులో పాత మిత్రులతో అప్పుడప్పుడు కలిసి కబుర్లు చెప్పుకుంటే కొంత తృప్తి! ఆరోగ్యం! ఈ తరం వాళ్లతో ఏం మాట్లాడతాం! నా పాత కబుర్లు చెబితే వాళ్లకు బోర్ కొడుతుంది. అది సహజమే! మా నడివయసులో ఎవరన్నా ముసలాయన, ఆయన చిన్ననాటి కబుర్లు చెబుతుంటే ఏదో వంక పెట్టి లేచి పోయేవాళ్లం!





కవిత

ఇక్కడ యింకో మిత్రుడి విషయం చెప్పాలి. వడ్లమూడి సీతారామారావు అని బాపట్లలో ప్లీడరు. 1966లో నేను సుందరరావుతో బాపట్ల వెళ్లినప్పుడు పరిచయం. అతను రామచంద్ర కాశ్యపకు మేనల్లుడు అక్క కుమారుడు.

1949 ఏలూరు పరిషత్తులో నేను 'అంతర్వాణి' ప్రదర్శిస్తే సీతారామరావు అతన్ని వి.యస్. అంటుండేవాళ్లం అతను 'తారాబలం' అని ఒక నాటిక రాసి తెచ్చాడు. ఏలూరు నివాసి, ప్రఖ్యాత నటుడు బందా కనకలింగేశ్వరరావు గారి భార్య వి.యస్.కు స్వయానా సోదరి.

వి.యస్. గూడ నాకంటే ముందు సినిమాలకు వెళ్లవలసిన వాడు బి.యన్. రెడ్డి గారి పిలుపుమేర. కాని ఇంటి బాధ్యతలవల్ల వెళ్లలేకపోయాడు. అతని తల్లి దండ్రులకు ఒక్కడే కొడుకు చాలామంది కూతుళ్లు. తండ్రి గూడ లాయరే! కాని పెద్ద ప్రాక్టీసు ఉండేది కాదు.

"నువ్వు పోయి సినిమాల్లో కూర్చుంటే నీ అక్కచెల్లెళ్ల పెళ్లిళ్లు ఎవరు చేస్తారురా!" అని వి.యస్. తల్లి అతను మెట్లు దిగుతుంటే మెట్ల మీద అడ్డంగా కూర్చుందట! వి.యస్. చెప్పేవాడు.

చివరి రోజుల్లో అనారోగ్యంవల్ల ప్రాక్టీసు మానేసి బాపట్లలో ఇల్లు వాకిళ్లు అమ్మేసి హైదరాబాద్, కూకట్‌పల్లిలో ఇల్లు గట్టాడు. ఆ ఇంట్లో తనూ తన భార్య  ఇద్దరు కొడుకులు, కోడళ్లు ఉండేవారు.

వి.యస్. సోదరి ఒకామెను ప్రఖ్యాత జర్నలిస్టు కోటంరాజు రామారావుగారి కుమారుడు ప్రతాప్‌కి ఇచ్చారు. కోటంరాజు రామారావుగారిది చీరాల అని వి.యస్. చెప్పినట్టు గుర్తు. రెండు కుటుంబాలకు చాలా దగ్గర సంబంధం ఉండేదట?

కోటంరాజు రామారావుగారు జవహరల్ లాల్ నెహ్రూ పత్రిక నేషనల్ హెరాల్డ్‌కు సంపాదకుడు. దేశ స్వాతంత్ర్యానికి ముందు కోటంరాజు రామారావుగారు ఎంత స్వతంత్రుడంటే ఎప్పుడూ జేబులో రాజీనామా పత్రం పెట్టుకుని ఆఫీసుకు వెళ్లేవాడట! ఎప్పుడు  నెహ్రూతో అభిప్రాయ భేదాలు వస్తే అప్పుడు వెంటనే రాజీనామా పత్రం ఇవ్వడానికి!



ఒకసారి నెహ్రూ యూరపు రాజ్యాల పర్యటనకు వెళ్లి అనేకచోట్ల వుపన్యాసాలిచ్చాడట! వాటి సారాంశం అంతా నేషనల్ హెరాల్డ్ పత్రికలో అర కాలంలో రాశాడట రామారావుగారు. అది చూచి నెహ్రూ "ఏమిటీ అన్యాయం! నేను అన్ని దేశాలు తిరిగి అన్ని ఉపన్యాసాలిస్తే నువ్వు ముక్తసరిగా మూడుముక్కలు రాసి ముగించావు?" అని కోప్పడ్డాడట.

అప్పుడు వెంటనే రామారావుగారు జేబులోంచి రాజీనామా పత్రం తీసి నెహ్రూకి యిచ్చాడట.

"ఏ న్యూస్ ఐటమ్‌కి ఎంత ప్రాధాన్యం ఇవ్వాలో ఎడిటర్‌కు స్వేచ్ఛ ఉండాలి! అంతేగాని..." అనగానే నెహ్రూ దిగివచ్చి నవ్వులాటలోపెట్టి సర్దేశాడట! వి.యస్. చెబుతుండేవాడు.

రామారావుగారు చెప్పేవాడట వి.యస్.కి "అల్లుళ్లకి కట్నం ఇవ్వవద్దు! కొడుకులిక తీసుకోవద్దు" అని! ఆయన సలహా అక్షారాల పాటించాను. నా కొడుకులకి కట్నం లేకుండా పెళ్లిళ్లు చేశాను అనేవాడు వి.యస్.

కోటంరాజు రామారావుగారి అన్నగారనుకుంటాను. కోటంరాజు పున్నయ్యగారు 'సింధ్ అబ్జర్వర్' (కరాచీ) పత్రిక ఎడిటర్! ఆయన ఒక క్రిస్టియన్‌ను పెళ్లి చేసుకున్నాడట! వి.యస్. చెప్పేవాడు. చీరాల వస్తే తను మాత్రం బంధువుల ఇళ్లకు వచ్చి వాళ్ళను ఎందుకు నొప్పించడం అని తన భార్యను ఏదో గెస్ట్‌హౌస్‌లో ఉంచేవాడట.

ఆ రోజుల్లో నార్త్ ఇండియాలో నలుగురు ప్రముఖులు ఆంధ్రులు పత్రికా సంపాదకులుగాఉండేవారు. కోటంరాజు సోదరులు, సి.వై. చింతామణి, చలపతిరావు, చలపతిరావు తరువాత నేషనల్ హెరాల్డ్ ఎడిటర్ అయ్యాడు. ఆయన బ్రహ్మచారి. ఒక రోజు పొద్దున్నే టీ తాగడానికి వీధుల్లోవున్న చిన్న టీ అంగడికి వెళ్లి అక్కడే కూర్చుని ప్రాణాలు విడిచాడట. ఆయన ఎవరో ఎవరికీ తెలియక చివరికి రెండు మూడు గంటల తరువాత గుర్తుపట్టి అంత్యక్రియలు జరిపారట.

ఆరుద్ర కూతుళ్లలో ఒక అమ్మాయిని సి.వై. చింతామణి గారి కుటుంబ వారసుల్లో ఎవరికో ఇచ్చినట్టు గుర్తు.

వి.యస్.కి సీరియస్ హార్ట్ కంప్లెయింట్ ఉండేది. ఎప్పుడయినా ఫోన్ చేసి 'ఎలావున్నావు వి.యస్." అని అడిగితే "ఏదో Pulling on" అనేవాడు. అతనికి హార్ట్ 10% మాత్రమే పని చేసేది చివరిరోజుల్లో! ఒకసారి కూకట్‌పల్లి వివేకానందనగర్‌లో అతని ఇంటికి వెళ్లి నాలుగయిదు గంటలు గడిపాను. ఆ తరువాత ఏడాదిలోపలే అతను పోయినట్టు అతని కుమారుడు ఫోన్ చేసి చెప్పాడు.

ముసలివాళ్లలో వచ్చే మార్పు మనస్తత్వాన్ని గురించి చెబుతాను! ఇవి ఈతరం వాళ్లకు అర్థంకావు. వాళ్లు ముసలాళ్లయినప్పుడు తప్ప.

ఒకసారి వి.యస్. ఫోన్ చేశాడు.

"రాజూ! రాత్రి కొంచెం ఇబ్బంది పడ్డాను. ప్రాణం పోతుందేమోనని భయం వేసింది. కింద అంతస్తులో మా వాడికి కబురు చేశాను. (కొడుక్కి) వాడు వచ్చాడు. చాలా ఆదుర్దాగా చెప్పాను. వాడి మొఖంలో expression లేదు! కూల్‌గా రాత్రి మందులు వేసుకున్నావా?" అని అడిగాడు. 'వేసుకున్నాను' అన్నాను. "రేపు పొద్దున డాక్టర్ని తీసుకువస్తాలే! అని లేచి వెళ్లిపోయాడు" అని చెప్పాడు వి.యస్.! అంటే కొడుక్కి తన ఆరోగ్యం ఆందోళన గురించి చెబితే కొడుకు గూడ అంత ఆదుర్దా, ఆందోళనతో "అలాగా! నాన్నా! ఉండు. డాక్టరుకు ఫోన్ చేస్తాను" అని అనాలని తండ్రి expectation! నాకు నవ్వు వచ్చింది. వి.యస్. మనస్తత్వం ఆ వయసులో చూచి!





ముని మనవరాలు ప్రత్యూషతో...

అతను పోయి రెండు మూడు సంవత్సరాలయింది. ఇప్పుడు నా వయసు 85 దాటి 86 వచ్చింది. మూడేళ్ల క్రితం ఒకసారి కళ్లు తిరిగి పడిపోయాను. మావాళ్లు ఆసుపత్రికి తీసుకెళ్లారు. మెదడుకు రక్తప్రసారం తగ్గిందని మందిచ్చి మరునాడే ఇంటికి పంపేశారు! ఇప్పుడు నాకు వి.యస్. మనస్తత్వం అర్థమవుతోంది. మా పిల్లలతో కూతురు, మనవరాలు, ఆమె భర్త సుమన్ అందరితో చెప్పాను నవ్వుతూ!

"అప్పుడు నా ఫ్రెండు అలా చెబితే నాకు నవ్వు వచ్చింది. ఇప్పుడు నా మనస్తత్వమూ అలాగే ఉంది! మీరు గూడ అప్పుడప్పుడు నాగది ముందుకు వచ్చి వెళుతూ "ఎలా వుంది?" అని ఒక్క మాట అడగండి! నాకు తృప్తిగా ఉంటుంది. మీరు నన్ను చాలా బాగా చూస్తున్నారు. సందేహంలేదు. కాని ఏదైనా అనారోగ్యం వచ్చినప్పుడు "ఎలావుంది?" అని ఒకటికి నాలుగుసార్లు అడిగితే నా వయసులో ముసలాళ్లకు తృప్తిగా వుంటుంది" అని చెబుతుంటాను. నా ముని మనవరాలు ప్రత్యూష నాకోరిక పాటించి ఆచరిస్తుంది. నాకు ఆరోగ్యం బాగున్నప్పుడు గూడ నా గదిలోకి తొంగిచూచి How are you తాతా! అంటుంది. I am fine అంటాను. ప్రతి రాత్రి తను పడుకోబోయే ముందు నా గదిలోకి వచ్చి నా బుగ్గ మీద ఒక ముద్దు ఇచ్చి పోతుంది. నేను థాంక్స్ చెబుతాను. వయసులో ఉన్న వాళ్ల మనస్తత్వం కొంతవరకు ముసలాళ్లకు అర్థమవుతుంది. వాళ్లూ ఒకప్పుడు యుక్త వయస్సులో ఉన్న వాళ్లే గనక! కాని ముసలాళ్ల మనస్తత్వం వాళ్లలో వచ్చే మార్పులు పిల్లలకు అర్థం కావడం కష్టం! అలాంటప్పుడు ముసలాళ్లు పిల్లలకు తమ తమ మనస్తత్వాలు ఆలోచనలు చెప్పడంలో తప్పులేదనుకుంటాను. పిల్లలు అర్థం చేసుకోగలరు.



ఏడాది క్రితం ఏదో పనిమీద షాపింగుకు వెళ్లాను. అక్కడ ఒక నడి వయస్కురాలు సేల్స్ వుమన్‌గా ఉన్నది. సినిమా వాణ్ణి కనక నన్ను ఆమె గుర్తుపట్టింది. ఆమె అంతకుముందు ఒక ఓల్డ్ ఏజ్ హోమ్‌లో మేనేజరుగా పని చేసి వచ్చిందట!

ఆమె చెప్పింది - ముసలాళ్లంటే నాకు అంతకు ముందు ఎంతో సానుభూతి ఉండేదండి! అందుకే వాళ్లకి సేవ చేసే ఉద్దేశంతో సేవా భావంతోనే మేనేజరుగా పనిచేయడానికి ఒప్పుకున్నాను. కాని ఆరు మాసాలలో తెలిసి వచ్చిందండి! ముసలి వాళ్లతో వేగడం మహా కష్టమండి! ఎంత చేసినా యింకా కంప్లెయింట్స్! కొందరికి అసలు తృప్తి అనేదే ఉండదండి! వాళ్లతో పడలేక రాజీనామా చేసి వచ్చేశాను. అని చెప్పింది.

ఆమె ఆ మాటలు చెప్పకముందే నేను ఆమెకు చనువు తీసుకుని చెప్పాను. ముసలివాళ్ల మనస్తత్వాలు ముసలితనంలో వచ్చే మార్పులు! కొందరు ముసలివాళ్లు, కొడుకు ఇంట్లో ఉంటూ తనకు వచ్చే పెన్షను డబ్బు తీసుకెళ్లి కూతురుకి యిచ్చి వస్తుంటారని కూతురు ఇంట్లో ఉండే తండ్రి పొద్దున్నే కాఫీ యివ్వడం కాస్త ఆలస్యమైతే కూతుర్ని ఆప్యాయంగా "అమ్మా! కాస్త కాఫీ యిస్తావా?" అని అడుగుతాడు. అదే తండ్రి కొడుకు ఇంట్లో వున్నప్పుడయితే కాఫీ ఇవ్వడం ఆలస్యం అయితే కోడలి మీద నిష్ఠూరంగా She won't care for me! నా సంగతి అసలు పట్టించుకునే పట్టించుకోదు అని నిందలు వేస్తాడు" అని.

నేనీ విషయాలు చెప్పిన తరువాతనే ఆ సేల్స్ ఉమన్ ధైర్యం చేసి చనువుగా 'వృద్ధాశ్రమం'లో తన అనుభవం చెప్పింది.

☆ ☆ ☆

దేవులపల్లి కృష్ణశాస్త్రిగారిది తూర్పుగోదావరి జిల్లా పిఠాపురం, పిఠాపురం జమీందారీ కుటుంబంతో కృష్ణ శాస్త్రిగారి కుటుంబానికి చాలా సాన్నిహిత్యం వుంది.

కృష్ణశాస్త్రిగారు చెబుతుండేవారు "జమీందారీ వ్యవస్థను సమర్థించలేంగాని ఆ వ్యవస్థలో వున్న మహోన్నతులయిన మనుషులు ఈ రోజుల్లో కనబడరు. ఉన్నా చాలా అరుదు!"

"సంపదను సద్వినియోగం చేసి పేదసాదలకు అండగా నిలబడి కళలను సాహిత్యాన్ని పోషించిన మహోన్నతులయిన మనుషులను నేను చూశాను" అని చెబుతుండేవారు. ఇటువంటి అభిప్రాయాన్నే వెలిబుచ్చిన మరొక సాహితీ వేత్త తంగిరాల సుబ్బారావుగారు. ఆయన స్వగ్రామం పశ్చిమ గోదావరి జిల్లా తణుకు ప్రాంతం! బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖాధిపతిగా రిటైరైనారు.

ఆయన తిరుపతి విశ్వవిద్యాలయంలో యం.ఏ. ఆ తరువాత రిసెర్చి చేసి పి.హెచ్.డి. డాక్టరేటు పొందారు. ఆయన డాక్టరేటుకు ఎంచుకున్న విషయం "తెలుగు వీర గాథా కవిత్వం".

ఆ సిద్ధాంత గ్రంథంలో నుంచి "రేనాటి సూర్యచంద్రులు" అనే గ్రంథం ప్రచురించారు. ఆ "రేనాటి సూర్యచంద్రులు" ఎవరంటే ఉయ్యాలవాడ నరసింహారెడ్డి - బుడ్డా వెంగళరెడ్డి.

ఉయ్యాలవాడ నరసింహారెడ్డి స్వాతంత్ర్య సమరయోధుడనీ ఝాన్సీ లక్ష్మీబాయి కన్న (1857) 11 సంవత్సరాల ముందే 1847లో కుంఫిణీ ప్రభుత్వంపై రేనాటి సీమలో తిరుగుబాటు జండా ఎగురవేసిన మహవీరుడని తంగిరాల సుబ్బారావుగారు రాశారు. నరసింహారెడ్డి స్వార్థంకోసం విప్లవాన్ని జరిపాడనీ, ఊళ్లనీ దోచుకున్నాడనీ కొందరు



చరిత్రకారులు నిందలు వేసారు.

"ఉయ్యాల వాడ నరసింహారెడ్డి ఉయ్యాలవాడ సంస్థానానికీ నోస్యం సంస్థానానికి వారసుడు. జమీందారీ వంశంలోనివాడు. ప్రజలకు అతని మీద గౌరవాభిమానాలున్నాయని ఆనాటి ప్రభుత్వమే అంగీకరించింది. లేకపోతే తొమ్మిదివేలమంది సైనికులు అతనికి ఎలా సమకూరుతారు?

ఆనాటి వర్తకులు - ధనికులు నరసింహారెడ్డి సైన్యానికి స్వచ్ఛందంగా ఆహార పదార్థాలు సరఫరా చేశారని, ప్రభుత్వం రికార్డులలో స్పష్టంగా ఉంది.

18-19 శతాబ్దాలలో సంస్థానాధీశులపాలనలోనూ, ఆంగ్లేయుల పాలనలోనూ మనదేశంలో బందిపోటు దొంగలు, దివిటీ దొంగలు, దారిదోపిడీ దొంగలు ఎక్కువగానే ఉండేవారు.

విప్లవకారులు వేరు! దోపిడీ దొంగలువేరు! ఈనాడు నిరుపేదల్ని ఉద్ధరించడం కోసం, భూస్వాముల దౌర్జన్యాలను, ప్రభుత్వ దోపిడీ విధానాన్ని అడ్డుకోవడం కోసం విప్లవ పంథాను ఎన్నుకున్న నక్సలైట్లు ఉన్నారు. కేవలం స్వార్థం కోసం ప్రజల్ని దోచుకునే దోపిడీ దొంగలు, బందిపోటు దొంగలూ ఉన్నారు.

నక్సల్సు వేరు! ఆ దొంగలు వేరు. ఆశయసాధన కోసం విప్లవమార్గాన్ని ఎంచుకున్న నక్సలైట్లు వేరు! స్వార్థం కోసం దోపిడీలు చేసే దొంగలు వేరు."

దీనికి ఉదాహరణగా తంగిరాల సుబ్బారావుగారు తన పీఠికలో ఇలా రాశారు.

"11-2-1999 తేదీ డెక్కన్ హెరాల్డ్‌లో ఒక వార్త పడింది. కానూ సన్యాలే - భారతదేశంలో గొప్ప నక్సల్ లీడరు! నక్సలిజానికి ఆద్యుడు చారు ముజుందార్ యొక్క శిష్యుడు! కానూ సన్యాల్ మొన్న రైల్లో ప్రయాణం చేస్తుంటే 30 మంది దోపిడీ దొంగలు రైలును ఆపి, దోచుకోవడం మొదలుపెట్టారు. కానూ సన్యాల్ తన పిస్తోలుతో ఆ దొంగల్ని ఎదిరించాడు. ఆ పోట్లాటలో బాగా గాయపడ్డాడు. కలకత్తాలో ఆసుపత్రిలో చేరాడు. ప్రభుత్వం ఆయన వైద్యానికి సాయం చేస్తానంటే ఆయన నిరాకరించాడు. అంటే నక్సలైట్లు ప్రభుత్వానికీ వ్యతిరేకులే! దోపిడీ దొంగలకూ వ్యతిరేకులే! ఆనాటి నరసింహారెడ్డి ఈనాటి కానూ సన్యాల్ వంటివాడే కాని దోపిడీ దొంగ మాత్రం కాదు!"

ఇక దానకర్ణుడు బుడ్డా వెంగళరెడ్డిని గురించి

"బుడ్డా వెంగళరెడ్డి - స్త్రీలోలుడు. చేసిన అప్పులు తీర్చలేదు. అని ఖండిస్తారు.

క్షామ పీడితులైన నిరుపేదలు వేలాది మందిని మూడునెలలు పోషించాడు. తన కున్నదంతా ఖర్చుపెట్టి ఇతరుల వద్ద అప్పులు చేశాడు.

ఇక స్త్రీలోలత్వం! ఆనాడు జమీందార్లు, భూస్వాములు ఉంపుడు గత్తెలను వుంచుకోవడం పెద్ద తప్పుకాదు! దేవాలయాలకు చెందిన దేవదాసీలు ఉండేవారు! వాళ్లు సామాన్య వేశ్యలు కాదు. ఎవరో జమీందారుకో, భూస్వామికో, రెండవ భార్యగా, నీతిగా ఒక పురుషునికే కట్టుబడి ఉండేవారు.

ఈనాటి దృష్టితో ఆనాటి సమాజాన్ని పరిశీలించగూడదు. సమాజంలోని విలువలు కాలాన్ని బట్టి మారుతూ ఉంటయ్" అని రాశారు తంగిరాల సుబ్బారావుగారు.



ఆయన వాదనలో కొంత సత్యం ఉందనిపిస్తుంది. 19వ శతాబ్దంలోనూ, 20వ శతాబ్దారంభంలోనూ బాల్య వివాహాలు ముఖ్యంగా బ్రాహ్మణులలో సర్వ సామాన్యం! అప్పుడు అవి తప్పుగాదు. పైగా పిల్లకు బాల్యంలోనే పెళ్లి చేయకపోతే ఆ కుటుంబాన్ని వెలివేసేవారని రికార్డులు చెబుతున్నాయి.

అంత మాత్రాన ఆరోజుల్లో బాల్యవివాహాలు చేసినవారిని తప్పుపట్టి, కారుణ్య శూన్యులని ఖండించడం న్యాయం కాదనిపిస్తుంది!

ఇప్పుడు హిందూ సమాజంలో స్త్రీని మాతృమూర్తిగా గౌరవిస్తున్నట్టు కథలు, కావ్యాలు రాస్తున్నారుగదా:- స్త్రీవాద ఉద్యమ మహిళలు స్త్రీని బానిసను చేసి హింసిస్తున్నారని వాదిస్తున్నారే!

మరి ఇంకొక 50 ఏళ్ల తరువాతో, 100 ఏళ్ల తరువాతనో స్త్రీ వాద ఉద్యమం విజయం సాధించి స్త్రీ పురుషునితో అన్ని రంగాల్లో సమానస్థాయిని సాధిస్తే ఇప్పటి మన తరం పురుషుల్ని రాబోయే తరంవారు నరరూప రాక్షసులుగా ఖండించవచ్చుగా! కాబట్టి తంగిరాల సుబ్బారావుగారు చెప్పినట్టు కాలాన్ని బట్టి, విలువలు మారుతుంటాయి గనక, భావితరాల ఆడవారు ఈ తరం మగవారిని స్త్రీల పాలిటి రాక్షసులుగా ఖండించడం భావ్యం కాదేమో!

చెప్పడం మరిచాను. బుడ్డా వెంగళరెడ్డి దాతృత్వాన్ని గురించి చెబుతూ - తంగిరాల సుబ్బారావుగారు యిలా రాశారు!

"బ్రాహ్మణుడు దాహంకోసం మజ్జిగ అడిగితే ఆవునే దానం చేశాడట!

మరొక బ్రాహ్మణుడు కొడుక్కి ఉపనయనం చేసుకుంటానని సాయం అడిగితే తన బంగారు మొలత్రాడు తీసి యిచ్చాడట!

అటువంటి సద్గుణరాశికి స్త్రీలోలత్వమో, మద్యపానమో లాంటి బలహీనతలు, క్షంతవ్యం కదా" అంటారు సుబ్బారావుగారు. పైగా పోతుతాడికల్లు ఆరోగ్యానికి మంచిదట! ఇప్పటికీ గూడ!

☆ ☆ ☆

జమీందారీలు - సంస్థానాల వంటి వ్యవస్థలు సమర్థనీయం కాక పోయినా ఆ వ్యవస్థలో ఉన్న గొప్ప మహోన్నత వ్యక్తుల గురించి కృష్ణశాస్త్రిగారు చెప్పారని చెప్పానే

అలాంటి గొప్ప వ్యక్తి నాకు తెలిసినాయన ఒకరున్నారు. ఆయన కృష్ణాజిల్లా తిరువూరు తాలూకా, గంపలగూడెం ఎస్టేటు. కుమార రాజాగారు! ఆయన అసలు పేరు కోటగిరి వెంకట కృష్ణారావుగారు. అందరూ ఆయనను గంపల గూడెం కుమారరాజాగారనే అనేవారు. ఆయన 1931లో ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడో, కార్యదర్శో. టంగుటూరి ప్రకాశంగారి సహచరుడు. ఆయన గొప్ప కవి గూడ. చాలా ప్రౌఢ కవిత్వం రాశారు. షేక్స్పియర్ 'రోమియో అండ్ జూలియట్' ఆధారంగా. 'ప్రణయాదర్శం' అని ఒక మంచి నాటకం రాశారు. బొబ్బిలి యుద్ధం, 'బెబ్బులి' అని మరో నాటకం, 'వేదవతి' అని ఇంకో నాటకం! 'పాదుషా పరాభవం' అని మరో నాటకం. ఆయన ఉప్పు సత్యాగ్రహం రోజుల్లో జైలుకు వెళ్లారు. జైలులో ఉన్నప్పుడు ఏ దుస్తులు వేసుకున్నారో, మోకాళ్ల వరకు ఖద్దరు నిక్కరు, అర చేతుల చొక్కా పైన ఒక తుండుగుడ్డ! జైలునుంచి విడుదలైవచ్చిన తరువాత చివరి రోజుల వరకు అదే డ్రస్సు!



ఆయనకు భార్య, ముగ్గురు కుమారులు, ఇద్దరు కుమార్తెలు ఉన్నా వేరే ఒక స్త్రీని దగ్గరకు తీసి గంపల గూడెంలోనే మామిడితోటలో ఒకఇల్లు కట్టి ఆమెతో ఉండేవారు. ఆమెకు పిల్లలు లేరు. ఒక ఆడపిల్లను పెంచుకున్నారు. ఆ పిల్లకు మంచాల అని పేరుపెట్టారు.

ఇంతకు ముందు తంగిరాల సుబ్బారావుగారు రాశారని చెప్పానే జమీందారీ వ్యవస్థలో ఉంపుడుగత్తెల నుంచుకోడం ఆరోజుల్లో పెద్ద తప్పుకాదని. అలాగే గంపలగూడెం కుమార రాజుగారు మరోకావిడతో వుండేవారు. ఆయనకు మద్యం సిగరెట్టు అలవాటు వుండేవి. అసలు విషయానికి వస్తాను.

1931లో రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడుగానో, కార్యదర్శిగానో పని చేశారని చెప్పానే. అప్పుడే ఆయన అంతరాత్మ ప్రబోధంతో "ఇంత పవిత్రమైన కాంగ్రెసు సంస్థకు అధ్యక్షుడిగా వుండడానికి నేను అర్హుణ్ణికాను! నా బలహీనతలతో ఈ పవిత్ర వుద్యమాన్ని కలుషితం చేయడానికి నా అంతరాత్మ అంగీకరించడంలేదు" అని ఆ పదవికి రాజీనామాచేసి కాంగ్రెసునుంచి బయటికి వచ్చేశారు. మళ్లీ రాజకీయాల జోలికి పోలేదు.

ఆయన గొప్పకవి అని చెప్పానుగదా! కవితా సరస్వతిని సంబోధిస్తూ "తల్లీ! నేను ఎంత ప్రయత్నించినా నా బలహీనతలు, దురలవాట్లను మానలేకపోతున్నాను! మనసు అటువైపుకే పోతున్నది. నన్ను మన్నించి దగ్గరకు తీసుకో!" అనే భావంతో మంచి పద్యాలు రాశారు!

ఆయన దగ్గర శిష్యులుగా, కాంగ్రెసులో పనిచేసిన వారంతా తరువాత చాలామంది నాయకులైనారు. ఆ శిష్యులతో 1931-32 ప్రాంతాలలో బెజవాడ మైలవరం హాలులోనూ, కళామందిరంలోనూ, నాటకాలు చూడ్డానికి వచ్చేవారు.

ఆయన సోదరి అన్నపూర్ణమ్మగారు, వెంకటగిరి కటికినేని కళ్యాణరావుగారి సతీమణి. ఆ కళ్యాణరావు గారి దేహిత్రుడు (కూతురు కుమారుడే) సి.బి.ఐ మాజీ డైరెక్టరు 2002-2003లో నారా చంద్రబాబునాయుడుగారి మంత్రివర్గంలో మంత్రి విజయరామారావు. ఆ కుటుంబాలతో నాకు 1940ల ప్రాంతం నుంచి సన్నిహిత సంబంధం!

గంపలగూడెం కుమారరాజాగారు గొప్ప వ్యక్తి! అంతరాత్మ ప్రబోధాన్ని మన్నించి మనసు మార్చుకుని జీవన విధానాన్నే మార్చుకోవడం తేలిక విషయం కాదు!

అంతరాత్మ ప్రబోధం అంటే మరో విషయం జ్ఞాపకం వచ్చింది. 'చేసిన పాపం చెబితే పోతుంది' అనే ఒక నానుడి ఉందే దానికి మరో ఉదాహరణ! ఈ మధ్యనే జరిగింది. 2000 సంవత్సరం మార్చి 12వ తేదీన ప్రపంచంలోని క్రిస్టియన్ కేథలిక్కులందరికీ దైవ సమానుడైన పోప్ - పాల్ -2 అత్యంత సంచలనకరమైన ప్రకటన ఒకటి చేశాడు.

పేపర్లలో ఫొటోగూడ వచ్చింది. ఇటలీలోని వాటికన్ సిటీలో ఏసుక్రీస్తు విగ్రహం ముందు నుంచుని ఆ బహిరంగ ప్రకటన చేశాడు. 'చేసిన పాపం చెబితే పోతుంది' అన్న మన నానుడి ఆయనకు గూడ తోచిందో! లేక ఆయన అంతరాత్మ క్షోభపడి ప్రబోధించి ఆయనచేత ఆ బహిరంగ ప్రకటన చేయించిందో చెప్పలేం!

"గత 2000 సంవత్సరాల కాలంలో మా క్రైస్తవ్యులు చేసినటువంటి 'ఏడు' మహా పాపాలనుంచి మమ్మల్ని క్షమించి రక్షించుతండ్రి!" అని ఏసుక్రీస్తుకు చెమ్మగిలిన కళ్లతో ప్రణామాలర్పించాడు! క్షమాపణ చెప్పుకున్నాడు. తన దైవానికి! అప్పటి న్యూస్ పేపర్లో కటింగ్స్ ఇప్పటికీ నాదగ్గరున్నాయ్.



నేననుకున్నాను 'మీ దైవంతో పాటు మీ క్రైస్తవుల పాపాలకు బలియైన మానవులకు గూడ క్షమాపణ చెప్పి ఉంటే బాగుండేది" అనుకున్నాను.

దేవుడు క్షమించాడో లేదో మనకి తెలియదుగాని పోప్‌పాల్ చేసిన బహిరంగ క్షమాపణ చాలా గొప్ప విషయం! చరిత్రాత్మకం! అంతరాత్మ ప్రబోధాన్ని గొప్ప వ్యక్తులు పెడచెవిన పెట్టలేరని, నిరూపించడానికి నాకు తెలిసినంతరవరకు ఈ యిద్దరు వ్యక్తులు సాక్షులు! గంపలగూడెం కుమారరాజా! పోప్‌పాల్ 2!

పోప్‌పాల్ చెప్పిన క్రైస్తవుల ఏడు పాపాలలో ఒకటి అయిదవ శాతాబ్ద ప్రాంతంలో జరిగిన క్రూసేడ్స్ ! జెరూసలెం మూడు మతాలవాళ్లకు పవిత్ర క్షేత్రం! క్రైస్తవులకి, మహ్మదీయులకి యూదులకి!

అప్పుడు టర్కీకి చెందిన ముస్లింలు - జెరూసలెంను ఆక్రమించారు. వాళ్లను అక్కడ నుంచి తరిమికొట్టి తిరిగి తమ పవిత్ర జెరూసలెంను ఆక్రమించుకోడానికి క్రైస్తవ్యులు దాడిచేసి మూడురోజులపాటు కొన్ని వేల ముస్లింలను ఊచకోత కోశారు. దీనిని గురించి 'హిందూ' ఆంగ్ల దినపత్రికలో సంపాదకీయం గూడ రాశారు.

మరొక పాపం Inquisitions! Spanish quisition! క్రిస్టియన్స్ బలవంతంగా స్పెయిన్ దేశస్తులైన ముస్లింలను, యూదులను హింసించి క్రైస్తవమతంలో చేరతారా? లేక దేశ బహిష్కరణ చేయమంటారా? అని అమానుషాలకు పాల్పడ్డారు. ఇతర మతాల వాళ్ల మీద క్రైస్తవులు చేసిన అన్యాయాలు, ఇతర మతాలను చిన్నచూపు చూచి అవమానించిన సంఘటనలు, ఇవన్నీ ఏకరువు పెట్టాడు పోప్ పాల్ 2.

ఈ బహిరంగ ప్రకటన మీద ఒక యూద్ నాయకుడు (పేరు జ్ఞాపకంలేదు) అన్నాడు: "జర్మనీలో హిట్లరు యూదులను ఊచకోత కోయడం గ్యాస్ చేంబర్స్‌లో బంధించి వధించిన విషయాలను పోప్‌పాల్ చెప్పలేదేమి?" అన్నాడు.

అప్పుడే "బలవంతంగా ఇతర మతస్థులను, క్రైస్తవ మతంలోకి మార్పిడి మత సంఘర్షణలకు దారి తీస్తుంది. ఇది క్షమించరానిది అని హైదరాబాద్ ఆర్చ్ బిషప్ అరుళప్పగూడ బహిరంగ ప్రకటన చేశాడు.

క్రైస్తవులు ఇతర మతస్థులను తమ మతంలోకి మార్పిడి చేయడం ఒక ఎత్తు! అంతకంటే ఘోరాతి ఘోరమైన పాపం యూరోప్ లాంటి విదేశాలనుంచి అమెరికాకు వలస వెళ్లిన క్రైస్తవులు, అంతకుముందు ఎప్పటినుంచో అమెరికాలో స్థిరపడి నివసిస్తున్న రెడ్ఇండియన్ల యొక్క సివిలైజేషన్ నాగరికతనే భూతలం నుంచి తుడిచి పెట్టిన దురాగతం క్రైస్తవ మతస్థులు చేసిన క్షమించరాని పాపం!

అమెరికా చరిత్ర మనకు తెలుసుగదండి! కొలంబస్ అమెరికాను కనుగొన్న తరువాత యూరోపియన్ దేశాలనుంచి కూటికోసం పొట్టచేత బట్టుకుని అమెరికాకు పోయిన వాళ్ల వీళ్లు! అమెరికా తూర్పుతీరంలో దిగారు. కష్టపడ్డారు. అడవులు నరికి, వ్యవసాయం చేసుకుని పొట్టపోసుకున్నారు. ఓడ రేవులు కట్టుకున్నారు.

ఈ కొత్త ప్రపంచంలో జీవనోపాధికి అవకాశాలు అధికంగా ఉన్నట్టు తెలిసి యూరోప్ దేశాల నుంచి తండోపతండాలుగా జనం వలస వస్తుంటే తూర్పుతీరాన ఆక్రమించిన స్థలాలు చాలక పడమటి వైపు ప్రాంతాలను ఆక్రమించుకుంటూ పోతున్నారు. అక్కడ అంతకు ముందు నుంచీ ఎన్నో శతాబ్దాలుగా నివసిస్తున్న వాళ్లు రెడ్ ఇండియన్స్. వలసవచ్చిన యూరోపియన్ క్రైస్తవులు తమ స్వార్థం కోసం రెడ్ యిండియన్లను ఊచకోత కోసి వాళ్ల భూముల్ని ఆక్రమించుకున్నారు.



నేను ఒక ఇంగ్లీషు సినిమా చూశాను. టి.ఎన్.టి. ఛానల్‌లో వచ్చింది. ఆ సినిమా కథ ఏమిటంటే 1810 ప్రాంతంలో ఒక బ్రిటీష్ సేనాధిపతి తన సైన్యంతో పశ్చిమతీరానికి భూములను ఆక్రమించుకుంటూ పోతున్నాడు. దారిలో ఒక రెడ్ యిండియన్ గ్రామం కనిపించింది. తన సైన్యాన్ని ఆ గ్రామానికి కొద్ది దూరంలో మోహరించాడు. ఆ రెండ్ ఇండియన్ గ్రామపెద్దను రమ్మని కబురు చేశాడు. ఆ గ్రామ పెద్ద వచ్చాడు.

"మీరు ఈ గ్రామం ఖాళీ చేసి వెళ్లిపోవాలి" అన్నాడు ఆ సేనాధిపతి.

"ఎందుకు ఖాళీ చేయాలి?" అన్నాడు ఆ గ్రామపెద్ద.

"ఈ ప్రదేశాన్నంతా మేం కొనేశాం!" అన్నాడు సేనాపతి. ఆ గ్రామపెద్ద. ఆ మాటలు విని నిర్ఘాంతపోయి షాక్‌తో -

"ఏమిటి? మీరు ఈ ప్రదేశాన్ని కొ...న్నా...రా?" అని ప్రశ్నించాడు.

"అవును" అన్నాడు సేనాపతి.

ఆ గ్రామపెద్ద ఆశ్చర్యంతో "కొనడానికి భూమి, అమ్మే వస్తువుకాదే! ఈ భూమి అందరి ఉమ్మడి ఆస్తి! ఏ ఒక్కడిది కాదు! సమాజానిది! అందరికీ చెందినది! అమ్మడానికి గాని, కొనడానికి గాని ఎవడికీ హక్కులేదే!" అన్నాడు.

అదీ వాళ్ల సంస్కృతి!

మనం పంచభూతాలు అంటామే భూమి, ఆకాశం, నిప్పు, నీరు, గాలి, ఈ అయిదు ఏ ఒక్కరి సొత్తు కాదు! సమాజం సొత్తు! ప్రకృతి ప్రజలకు ఇచ్చిన కానుక! అదీ వాళ్ల సంస్కృతి! నాగరికత!

మనం ఈ 21వ శతాబ్దంలో ఏ స్థితికి వచ్చాం? భూమి అమ్ముకోవడం, ఎప్పుడో ప్రాథమిక హక్కుగా చేశాం! ఫండమెంట్ రైట్! ఎవరైనా ఎవరికైనా అమ్ముకోవచ్చు.

తరువాత 'నీరు' కొనుక్కుంటున్నాం! 'నిప్పు' కొనుక్కుంటున్నాం! కుక్కింగ్ గ్యాస్ రూపంలో 'గాలి' కొనుక్కోబోతున్నాం. కొద్ది రోజుల్లో! కాలుష్యంతో నిండిన గాలి నుంచి చావు తప్పించుకోడానికి ఆక్సిజన్ ప్రాణవాయువు, మాస్కుల రూపంలో.

ఇక మిగిలింది ఆకాశం! ఆకాశాన్ని గూడ 'మాది' అంటున్నాం! మా దేశంపైన ఉన్న ఆకాశం మీద హక్కు మాది. 'మా ఆకాశం' గుండా మీ విమానాలు ఎగరాలంటే మా అనుమతి కావాలి" అని శాసించి ఒప్పందాలు కుదుర్చుకుంటున్నాం. అంటే పంచభూతాలు మానవాళి అందరికీ చెందినవి అనేది వాళ్ల (రెడ్ ఇండియన్ల) సంస్కృతి!

పంచభూతాలను ఒక వస్తువుగా అమ్ముకునే దశకు ఎదిగిన సంస్కృతి మనది!

వాళ్లని 'అనాగరీకులు' అంటున్నాం! మనం "నాగరీకులం" అని గర్విస్తున్నాం! అటువంటి ఉత్కృష్టమైన నాగరికత తుడిచిపెట్టినటువంటి మహాపాపం - పోప్ పాల్ సెకండ్ చెప్పిన పాపాలలో ఘోరాతి ఘోరమైన పాపం!

అప్పుడు పోప్‌పాల్ చేసిన ప్రకటన, పాప ప్రక్షాళనకై ఏసుక్రీస్తును వేడుకున్న ఆ పరిశుద్ధాత్ముణ్ణి ప్రపంచంలోని వివిధ క్రైస్తవ గ్రూపులు ఎంతమంది 'మెచ్చు' కుంటారో, ఎంతమంది 'నొచ్చు' కుంటారో చెప్పడం కష్టం! అందరికీ అంత హృదయ సంస్కారం ఉంటుందా?



అలాగే ఆ పరిశుద్ధాత్ముడు పోప్‌పాల్ అడుగుజాడలలోనే ప్రపంచంలోని ఇతర మతాల అగ్రనేతల నుండి, ఆచార్యుల నుండి, పీఠాధిపతుల నుండి మతోద్ధారకుల నుండి వాళ్లు అందరు కూడా గతంలో వాళ్ల వాళ్ల మతస్థుల వల్ల జరిగిన పాపాలకు, పరిహారంగానో, ప్రాయశ్చిత్తంగానో, క్షమాపణలు చెప్పుకోగలరా? అని నా ప్రశ్న!

చెప్పుకుంటే ఎంత బాగుంటుంది! కాని ఆ పని చెయ్యరు. పోప్‌పాల్ గూడ తట్టుకోలేని ఆత్మ ప్రబోధ ప్రభావం వల్ల ఆ ప్రకటన చేశాడు గాని, లేకపోతే చేసేవాడు కాదు.

ప్రపంచంలో పాపాలు చెయ్యని మతంలేదు! "మతసామరస్యం", "పరమత సహనం", అని అన్ని మతాచార్యులు గొంతులు చించుకుని చెబుతారుగాని, ఆచరణ మాత్రం శూన్యం!

ఒక క్రీస్తు మతమేగాదు అన్యమతద్వేషంలేని మతం మానవచరిత్రలోలేదు.

జైన-బౌద్ధ-హిందూమతాలనే తీసుకోండి! బౌద్ధం - హిందూ మతాన్ని నాశనం చేసిందని శంకరాచార్యులు హిందూమతోద్ధరణ పేరుతో మఠాలు స్థాపించారు. భారతదేశంలో బౌద్ధ విగ్రహాలను, ఆరామాలను, ముస్లింలు చేసిన నాశనం కంటె హిందూమతోద్ధారకులు శంకరాచార్యుల శిష్యులు చేసిన నాశనం ఎక్కువ!

ప్రపంచ చరిత్రలో మతాలపేరుతో జరిగినంత మారణహోమం మరి దేనివల్ల జరగలేదు. చేసిన పాపాలకు ప్రాయశ్చిత్తంగా ఏఏ మతాధిపతులు ముందుకువచ్చి క్షమాపణలు చెప్పగలరు?

హిందూమతంలో అస్పృశ్యత! అంటరానితనం! ఎంత ఘోరమైన పాపం! ఈ పాపానికి ప్రాయశ్చిత్తంగా ఏ ఒక్క హిందూ మతాధిపతయినా దేవుడికి క్షమాపణ చెప్పగలడా? ఈఒక్క విషయంలో మటుకు పోప్‌పాల్ చేసిన ప్రకటన చరిత్రలోనే అపూర్వం!

ఆ మహానుభావుడికి ఎందుకు కలిగింది అంత ఆత్మపరిశోధన! ఈ వయసులో (ఆయనకు 80 ఏళ్లుదాటినయ్) పాలస్తీనాకు జోర్డాన్‌కు వెళ్లి 'అందరూ కలిసి ఉండండి' అని ప్రబోధిస్తున్నాడు. అంతరాత్మ అనేది అందరిలోనూ ధర్మ మార్గాన్ని అనుసరించమని గోల పెడుతూనే వుంటుంది. కాని దురాశ, కీర్తిదాహం, ఇత్యాది ప్రలోభాలు, బలహీనతలు, అంతరాత్మనోరు నొక్కుతుంటే ఆత్మఘోష, పాపం! హీన స్వరానే పడిపోతుంటుంది!

☆ ☆ ☆

మళ్లీ ఒకసారి మా ముత్యాలంపాడు ముచ్చట్లు చెప్పుకుందాం! ముత్యాలంపాడులో ముఖ్యమైన వృత్తి వ్యవసాయం! ఒక కుటుంబంలో నలుగురయిదుగురు కొడుకులుంటే అందరూ వ్యవసాయం చేయగల భూమి ఉండేది గాదు. అందువల్ల కుటుంబంలో కొందరు ఇతర వృత్తులపై ఆధారపడేవారు.

ఆ వృత్తులకు కేంద్రం దగ్గరలోనే వున్న బెజవాడ పట్టణం! ముత్యాలంపాడులోని కొందరికి బెజవాడలో చేసే వృత్తులు ఒకటి ప్లీడరు గుమాస్తా ఉద్యోగం! రెండు ప్రింటింగ్ ప్రెస్‌లో కంపోజిటర్లు. మూడు కొద్దిమంది కారు డ్రైవర్లు. నలుగురయిదుగురు బస్సు డ్రైవర్లు! ముఖ్యంగా బస్ సర్వీసులు బెజవాడ-బందరు, బెజవాడ-ఏలూరు, బెజవాడ-నూజివీడు, బెజవాడ-జగ్గయ్యపేట ఈ విషయాలు ఇదివరకే చెప్పాను.

ఇవిగాక కాశీనాథుని నాగేశ్వరరావుగారు 1928-29 ప్రాంతంలో గాంధీనగరంలో కట్టిన దుర్గా కళామందిరంలో గేట్లు దగ్గర ఉద్యోగాలు! నాగేశ్వరరావుగారికి సొంతకారు డ్రైవరు దగ్గరనుంచి థియేటర్లో గేట్లుదాకా ముత్యాలంపాడు రాజులంటే అంత నమ్మకం!



థియేటర్లో గేటు దగ్గిర మావూరి మనుషులు వుండ బట్టి నేను కళామందిరంలో నాటకాలు, సినిమాలు ఎక్కువగా చూసేవాణ్ణి!

మరొక విశేషమేమిటంటే సంక్రాంతి పండగకి కోడిపందాలు!

ఇప్పుడు విజయవాడ నుంచి నూజివీడుకు డైరెక్టు రోడ్డు ఉంది. అప్పుడు ఈ రోడ్డు లేదు. జంక్షనుకు వెళ్లి నూజివీడు వెళ్లవలసిందే! ఇప్పటి విజయవాడ - నూజివీడురోడ్డులో నున్న పాతపాడు గ్రామాలు ఉండేవి. ఇప్పుడూ ఉన్నయ్యనుకోండి! పాతపాడులో ఒక మామిడితోటలో సంక్రాంతి పండగకి కోడిపందాలు వేసేవాళ్లు!

పాతపాడు, నున్న, నయనవరం ఒక పక్షం! ముత్యాలంపాడు ఒక పక్షం. రెంటికీ కోడిపందాల పోటీ.

పాతపాడులో ఒక కోడిపందాల నిపుణుడు ఉండేవాడు. అతన్ని 'పిట్టలవాడు' అనేవారు. అసలు పేరు ఏమిటో తెలియదు. మా ముత్యాలంపాడుకు ఊరి పెత్తందారు వానపాల సుబ్బరాజుగారు నిపుణుడు.

సంక్రాంతి పండుగ మూడురోజులు. భోగి, సంక్రాంతి, కనుమ, సంక్రాంతి పండగనాడు చనిపోయిన పెద్దలకు తర్పణాలు విడిచేరోజు. మాంసాహారం తినగూడదు! మూడోరోజు కనుమ పండగరోజు. విధిగా మాంసాహారం తిని తీరాలి. కోడి పందాలలో చనిపోయిన కోళ్లు, కనుమపండగరోజు మాంసాహారమన్నమాట!

కోడిపందాలకి ఒక శాస్త్రం వుంది. కోడి పుంజులకి వాటివాటి రంగులనుబట్టి పేర్లు ఉండేవి! నల్లగా ఉన్న పుంజుని 'కాకి' అనేవాళ్లు! ఎర్రగా 'మెరూన్' కలర్‌లో ఉంటే 'డేగ' అనేవాళ్లు! నలుపు, ఎరుపు కలిసివుంటే 'కాకిడేగ' అనేవాళ్లు! నలుపు ఒకరకమైన నెమలిరంగు ఉంటే దానిని కాకి నెమలి అనేవాళ్లు. అచ్చం తెల్లగా ఉంటే దానిని 'శీతువా' అనేవాళ్లు.

ఈ రంగులకి 'శాస్త్రం'లో ఒక విశిష్టత ఉంది. ఒక్కొక్కరంగు కోడికి పగలు సూర్యుడి స్థానాన్నిబట్టి 'ఉచ్ఛ' దశ వుంటుంది. టైం చూడడం - గడియారాలను బట్టి కాదు! అప్పుడు చేతి గడియారాలు చాలా తక్కువ! టైం చూడడానికి ఒక లెక్క వుంది.

మనిషి నిలబడతాడు! ఎదురుగా నీడ వుంటుంది నేలమీద! చెవులలో వేళ్లు పెట్టుకుంటాడు. చెవుల దగ్గర గీత గీయమంటాడు! తను నిలబడిన చోట నుంచి చెవుల దగ్గర గీసిన గీత వరకు అడుగులతో కొలుస్తాడు. దానిని బట్టి 'దశ' నిర్ణయిస్తాడు. ఆ దశలో ఏ రంగు కోడి 'ఉచ్ఛ' దిశలో ఉంటుందో నిర్ణయిస్తాడు. తన పక్క తోటలో వెతికి ఆ రంగుగల కోడిని తెచ్చి రంగంలో దించుతాడు.

వాటిని 'ఎత్తుడు దింపుడు' పందాలనేవాళ్లు! ఒకసారి ఒక పార్టీవాడు ముందుకోడిని తెచ్చి దించితే రెండోసారి రెండో పార్టీవాడు దించాలి. ఒక పార్టీవాడు తను 'ఉచ్ఛ' దశలోనున్నదనుకున్న కోడిని తెచ్చి దించితే

రెండో పార్టీవాడు అంతకంటె 'ఉచ్ఛ' దశలో ఉన్న కోడిని తెచ్చి పోటీకి పెట్టేవాడు.

కత్తి పందాలు రెండు : కోళ్ల కాళ్లకి కత్తులు కట్టేవాళ్లు. ఆ కత్తులు కట్టడం ఒక ఆర్టు! అందరికీ చేతగాదు. దానికి నిపుణులు వుంటారు! పందెంలో ఒకటి చచ్చిపోతుంది.

ఇద్దరూ 'ఉచ్ఛ' దశలో ఉన్న కోళ్లనే దింపితే మరి ఒకటి ఓడిపోయి చావడమేమిటి? అని సందేహం రావచ్చు.



ఇప్పుడు ఎన్నికల్లో ఇద్దరు అభ్యర్థులూ తిరుపతి వెంకన్న దర్శనానికి పోయి విజయం కోసం పూజలు చేయించి కానుకలిచ్చి వస్తే అందులో ఒక్కడేగా గెలిచేది! రెండోవాడు ఓడిపోతున్నాడుగదా! ఇదీ అంతే!

మా మేనమామలకి కోడిపందాలంటే గిట్టేది కాదు! అందుకని నన్ను పందాలకి పోనిచ్చేవాళ్లు కాదు. వాళ్లకు తెలీకుండా మా అమ్మ నన్ను పందాలకు వెళ్లేవాళ్లలో ఎవరితోనైనా పంపేది!

గొట్టు ముక్కల నరసరాజు అని ఉండేవాడు. ఆయనది పెద్ద మూడంతస్తుల మేడ! ఇప్పటికీ ఉంది. మా రాంమామయ్యగారి ఇంటిపక్కన.

ఆయన్ని అడిగి నేనొక కోడిపుంజు తీసుకుని పెంచాను! మామూలు గింజలు కాక కోడికి తవుడు అన్నం మెత్తగా పిసికి కోడిని రెండు కాళ్ల మధ్య పెట్టుకుని ఒక చేత్తో దాని నోరు తెరిచి తవుడు, అన్నం కలిపిన ముద్దలు పెట్టేవాళ్లమన్నమాట! దానిని తీసుకుపోయి కాలవలోకి విసిరేస్తే యీదుకుంటూ ఒడ్డుకొచ్చేది. అంటే అది దానికి ఎక్సర్‌సైజ్ అన్నమాట!

మా మేనమామలు చూచి చూడనట్టు ఊరుకునేవాళ్లు!

ఇప్పుడు గుర్రపు పందాలలో ఉన్నట్టే అప్పుడు కోళ్ల మీద గూడ పై పందాలు కట్టేవాళ్లు! చిన్నవాళ్లు తక్కువ పందాలు కడితే ధనవంతులు పెద్ద మొత్తంలో కట్టేవాళ్లేమో. అందుకే దానిని జూదంగా భావించి గవర్నమెంటు కోడి పందాలు నిషేధించింది.

జూదాలు నిషిద్ధమేగదా!

మదరాసులో యం.జి. ఆర్ పాలనలో రేసులు నిషేధించాడు. మరి రేసు గుర్రాల ఓనర్లు కోటీశ్వరులుగదా! మళ్లీ డి.యం.కె. కరుణానిధి అధికారానికి వచ్చాక రేసులు మళ్లీ అనుమతించారు.

ముత్యాలంపాడు భూములన్నీ ఏలూరు కాలవకి అవతలే ఉత్తరంవైపు ఉండేవి. కాలవకి ఇవతల చాలా తక్కువ ఉండేవి భూములు.

పశువులు గూడ బీళ్లలో మేతకి కాలవ అవతలకి పోవాలి. వెళ్లేటప్పుడు వచ్చేటప్పుడూ పశువులన్నీ కాలవ ఈదుకుని రావాలి. గోదావరిజిల్లాలో సామెత చెబుతారు 'లంకమేతకి గోదారి ఈతకి సరిపోయింది' అని.

సృష్టిలో విచిత్రం ఏమిటంటే పశువులు, మేకలు, కోళ్లు, ఇవన్నీ గూడ ఈదుకుని వచ్చేవి! వాటికి ఈత ఎవరు నేర్పారు? మాఊళ్లో కుర్రాళ్లు చాలామందికి కాలవలో ఈత నేర్చుకున్నారు. నాకు ఈతరాదు. మా పెద్దవాళ్లు పోనిచ్చేవాళ్లు కాదు. అతి గారాబమన్నమాట! ఏం ప్రమాదం జరుగుతుందోనని భయం!

కాలవకంటే భూములు మెరక కావడంతో వూరి పక్కనే కాలవ ఉన్నా ఊరికి మాగాణి లేదు! మెరక వ్యవసాయమే!

నాగళ్లన్నీ పొలాల్లోనే వదిలి వచ్చేవాళ్లు! రోజూ ప్రొద్దున్నే చద్దన్నం తిని మధ్యాహ్నానికి అన్నంమూట కట్టుకుని తాబేటి కాయలో మంచినీళ్లు నింపుకుని భుజాన కర్రకి అవి తగిలించుకుని హడావుడిగా చుట్టకాల్చుకుంటూ పరుగెత్తేవాళ్లు. కాలవ దాటాలంటే ఇప్పటిలాగా వంతెనలు లేవు. ఒకే ఒక పడవ ('బల్లకట్టు' అనేవాళ్లు) ఉండేది. దానికి ఒక పల్లెం వెంకటస్వామి అని ఉండేవాడు. బల్లకట్టుమీద ఎక్కువమంది ఎక్కితే మునిగిపోతుందిగా అందుకని



పల్లెవాడు కొందరిని వదిలేసి తరువాత ట్రిప్పులో కాలవ దాటించేవాడు!

కాలవ లెవెల్ కంటే భూములు మెరక అయితే పంపిగు స్కీములు ఉండేవి. ఎందుకో ముత్యాలంపాడులో అప్పటికీ ఇప్పటికీ పంపింగ్ స్కీములు లేవు.

కాలవ దిగువన మా అత్తవారి వూరందని చెప్పానే నరసన్నపాలెం. అక్కడ ఒకాయన పంపింగ్ స్కీము శాంక్షన్ చేయించుకుని కాలవలో నీరు దాదాపు 60 కిలోమీటర్ల దూరంలో ఒక చెరువులోకి పంప్‌చేసి చెరువు కింద మాగాణి చేసేవాడు. ఆయనకు అక్కడ ఒక రైస్ మిల్లు గూడ ఉండేది! ఆయన పేరు అడపా రంగయ్య అనుకుంటాను.

ఇప్పుడు "కాలుష్యం! కాలుష్యం" అని గగ్గోలు పెడుతున్నాంగాని అప్పుడు విజయవాడలో, ఏలూరు కాలవ మీద మూడు వంతెనలు ఉండేవి! ఒకటి విజయవాడ బందరు రైల్వేలైనులో, ఏలూరు కాలవ మీద రైలుబ్రిడ్జి. దానిని ఒకటో వంతెన అనేవాళ్లం!

రెండో వంతెన రైలుస్టేషను నుంచి గాంధీనగరానికి రావడానికి ఏలూరు కాలవ మీద బ్రిడ్జి! ఇది రోడ్ బ్రిడ్జి! మూడో బ్రిడ్జి యిప్పుడు ప్రకాశం విగ్రహం దగ్గర సబ్‌వే ఉందే అక్కడ ఉండేది! దాన్ని మూడో వంతెన అనేవాళ్లం!

అసలు చెప్పవచ్చిందేమిటంటే రెండోవంతెన, మూడోవంతెన మధ్యలో రైల్వే క్వార్టర్సు నుంచి పెద్ద డ్రెయిన్ మురికికాలవ నుంచి చెప్పలేనంత మురికి ఏలూరు కాలవలోకి వదిలేవాళ్లు! ముక్కులు మూసుకోవలసినంత దుర్గంధం! రోజూ నిరంతరాయంగా ఆ మురికి కాలవలోకి ప్రవహించేది.

కాని ఇదే కాలంలో దిగువన మా అత్తవారి పూరువుందని చెప్పానే. పెరికీడు బ్రిడ్జి దగ్గర ఆ వూళ్ల వాళ్లు ఈ కాలవ నీళ్లు మంచినీళ్లుగా కావిళ్లలో మోసుకుని తీసుకువచ్చేవాళ్లు.

నరసన్నపాలెంలో చవిటినేల! బావుల్లో నీళ్లు ఉప్పగా వుండేవి. అందుకని దాదాపు కిలోమీటరు దూరంలో ఉన్న ఏలూరు కాలవకు పోయి కావిళ్లతో మంచినీళ్లు తెచ్చుకుని తాగేవాళ్లు!

విజయవాడలో ఇదే కాలవలో కలిసే కాలుష్యం చూస్తే ఆ కాలవనీళ్లని మంచినీళ్లుగా ఎలా తాగేవాళ్లో ఆశ్చర్యం!

కాని ఒక థియరీ వుంది! ఎక్కడో చదివాను! పారే నీటిలో ఏవో రసాయనాలు వుత్పత్తి అవుతాయట! ఆ రసాయనాలు ఈ కాలుష్యాన్ని న్యూట్రలైజ్ చేసి శుద్ధి చేస్తయ్యట!

దేశంలో నదులున్నయ్ గదా! గంగానదే ఉంది. కాశీ ప్రక్కగా ప్రవహిస్తుంది. ఆ నదిలో శవాలని పారేస్తారు!

హిమాలయాలనుంచి నదులు ప్రారంభమవుతయ్! దోవలో బురద, కుళ్లిన ఆకులు, చచ్చిన పక్షులు, మృగాలు, అన్నిటినీ ప్రవాహంలో తీసుకువస్తున్నయ్ గదా!

ఆ నదుల దిగువనే కొన్ని పుణ్యక్షేత్రాలలో త్రివేణీ సంగమం వగైరా లాంటి చోట అవి చాలా పవిత్ర జలాలని స్నానాలు చేసి తాగి పండగలు చేస్తున్నారుగదా!

దీనికి ఏమిటి సమాధానం?

ప్రవహించే నీటిలో ఏవో రసాయనాలు వుత్పత్తి అయి కాలుష్యాలను శుద్ధి చేస్తాయన్న థియరీలో నిజమున్నదేమో! ఇది సైంటిఫిక్‌గా ఎంతవరకు కరెక్టో తెలియదు. ఏలూరు కాలువలో పైన చెప్పిన కాలుష్యాలన్నీ



అలా ఉంచండి! సత్యనారాయణపురం ముత్యాలంపాడులాగానే కాలవ దిగువన, ప్రక్కలనే వున్న ఊళ్ల అన్నిటిలో కాలవకు ఇరుప్రక్కలా ఆయా వూళ్లవాళ్లకి పబ్లిక్ లెట్రిన్‌లు కాలవ ఒడ్డే కదండి! అప్పటికి ఇప్పటికి గూడ!

నా చదువుకు సంబంధించిన 'రెండు' విషయాలు నాకు బాగా గుర్తు.

సామాన్యంగా ఆ రోజుల్లో 5వ ఏట అక్షరాభ్యాసం చేయించి ఎలిమెంటరీ స్కూల్లో చేర్చేవాళ్లు. నేను మొట్టమొదటి సారి నోట్ పుస్తకం మీద తారీఖు వేసిన సంవత్సరం 1927. అంటే బహుశా 2వ క్లాసు అయిఉండాలి.

మరొక విశేషం:

నేను హిందూ హైస్కూలులో 5వ ఫారం చదువుతుండగా అంటే 1934-35లో మా తాతయ్య పోరు పడలేక మా రాంమామయ్య నాకు సైకిల్ కొనిపెట్టాడని చెప్పానే ఆ సంవత్సరమే బెజవాడలో మెయిన్ రోడ్లు మొట్ట మొదటిసారి తారు రోడ్లు వేశారు. అంతకు ముందు మునిసిపాలిటీలో మొత్తం కంకర రోడ్లే!

మధ్యాహ్నం భోజనానికి గంట విరామం. హైస్కూలు నుంచి సైకిల్‌మీద బయలుదేరి తారురోడ్డు మీద స్పీడుగా ముత్యాలంపాడు వచ్చి భోజనంచేసి మళ్లీ పావుగంట ముందుగా స్కూలుకు వెళ్లేవాణ్ణి. అంటే కొత్త సైకిల్ మోజు. కొత్తగా వేసిన తారురోడ్డు. సైకిల్ టైర్లు కొత్తవి. తారురోడ్డు మీద స్పీడుగా సైకిల్ తొక్కుతుంటే 'రయ్'మని సంగీతంలాంటి శబ్దం వచ్చేది. కుర్రతనం అదొక సరదా!

అప్పటికీ, ఇప్పటికీ డబ్బు కరెన్సీలో వచ్చిన మార్పు గురించి చెప్పుకోవాలి. ఈతరం వాళ్లకు తెలియని విషయాలు!

అప్పుడు రూపాయి, అణా పైసలు ఉండేవి! అన్నీ నాణాలే! కాగితపు కరెన్సీ రూపాయి పై డినామినేషన్లకే!

మూడు పైసలు ఒక కాణీ! నాలుగు కాణులు ఒక్కణా! రెండు అణాలు బేడా! రెండు బేడలు అంటే నాలుగు అణాలు పావలా! రెండు పావలాలు అర్ధరూపాయి! రెండు అర్ధరూపాయిలు అంటే నాలుగు పావలాలు ఒకరూపాయి. అంటే రూపాయికి 16 అణాలు! 64 కాసులు! కానీకి 3 పైసలు! ఎవరైనా బాకీవుంటే "నాకు అణాపైసలతో చెల్లించు!" అనేవాళ్లు.

ఈ పద్ధతిలో కూడికలు, తీసివేతలు, హెచ్చువేతలు, భాగహారాలు చాలా కష్టంగా ఉండేవి. వ్యాపారాలు లెక్కలు రాసుకోవడానికి గూడ ఇబ్బందిగానే ఉండేది.

దీనిని సులభతరం చేయడం కోసం 1955-56 ప్రాంతంలో ప్రస్తుతమున్న మెట్రిక్ సిస్టం ప్రవేశపెట్టారు. రూపాయికి వందపైసలు. అంతే! అణాలు, బేడలు, పావలాలు వగైరాలు పోయినాయి!

నాణాలు గూడ 5 పైసలు, 10పైసలు, 25 పైసలు, 50 పైసలు రూపాయి! వెరీ సింపుల్! కొత్తగా వచ్చినై గనక పైసల్ని నయా పైసలు అనేవారు. పాతబడిపోయింది గనక ఇప్పుడు నయా' పోయింది.

పూర్వపు అణాలు, బేడల కాలంలో రూపాయి నాణెం శుద్ధమయిన వెండితో ఉండేది. విక్టోరియా రాణి బొమ్మతో ఉండే రూపాయిని జడరూపాయి అనేవాళ్లు! ఆమెకు జడ ఉండేదేమో!

బంగారు తూకం వేయడానికి గూడ వెండిరూపాయిలు ఉపయోగించేవారు!

డబ్బుతో పాటు 'దూరం' విషయంలో గూడ మెట్రిక్ సిస్టం వచ్చింది.



అంతకుముందు అంగుళం (inch), పన్నెండు అంగుళాలు, ఒక అడుగు (Foot), మూడు అడుగులు ఒక గజం! (Yard) 220 గజాలు ఒక ఫర్లాంగ్ (Furlong) ఎనిమిది ఫర్లాంగులు ఒక మైలు (Mile).

దీనిని Simplify (సులభతరం) చేయాలని ఇప్పటి మెట్రిక్ సిస్టం ప్రవేశపెట్టారు.

ఒక మిల్లీమీటరు పది మిల్లీమీటర్లు ఒక సెంటిమీటరు, వంద సెంటీమీటర్లు ఒక మీటరు. వెయ్యి మీటర్లు ఒక కిలోమీటరు. బరువులు అంతే! ఒక మిల్లిగ్రాం వెయ్యి మిల్లీగ్రాములు ఒక గ్రాము. వెయ్యి గ్రాములు ఒక కిలోగ్రాము. వెయ్యి కిలోగ్రాములు ఒక టన్ను! అంతకు ముందు తులము, ఫలము, శేరు, వీశె, మణుగు, పుట్టి అలావుండేవి. 3 తులములు ఒక ఫలము. 8 ఫలములు 1 శేరు. 5 శేర్లు 1 వీశె 8 వీశెలు 1 మణుగు. 20 మణుగులు 1 పుట్టి.

ఇప్పటికీ నాకు దూరం కిలోమీటర్లలో చెబితే వెంటనే అర్థంకాదు! వాటిని మైళ్ళలోకి మార్చుకుంటే తప్ప బుర్రకెక్కదు. 16 కిలోమీటర్లు 10 మైళ్లు.

ఎవరైనా ఈవూరు నుంచి ఆ ఊరుకి 200 కిలోమీటర్లు అంటే దానిని 16తో భాగించి మళ్లీ దానిని 10తో హెచ్చువేస్తే తప్ప దూరం మైళ్లలో తెలియదు. అంటే 1.6 కిలోమీటర్లు - 1 మైలు.

కారులో స్పీడోమీటరు గూడ మీటర్లలో ఉంటుందిగదా! వారు 80 కి.మీటర్ల స్పీడులో పోతుంటే "ఓహో 50 మైళ్ల స్పీడులో పోతున్నారన్నమాట! అని అర్థం చేసుకోవాలి.

80/16 = 5 ; 5×10 = 50 అలా!

రోడ్డు మీద కారు వెలుతున్నా అంతే రోడ్డు పక్కన రాళ్ల మీద కి.మీలలో వేసి ఉంటయ్. వాటిని మైళ్లలోకి కన్వర్ట్ చేసుకుంటేగాని అర్థం కాదు. ఇది చరిత్ర! ఈ తరం వాళ్లకోసం చెబుతున్నాను.

బెజవాడ గోపాలరెడ్డిగారి పేరు ఈతరం వాళ్లకి తెలిసే ఉండాలి. రాష్ట్ర ముఖ్యమంత్రి, కేంద్రమంత్రి, గవర్నరు పదవులు నిర్వహించారు. ఆయన జననం 1907. 90 ఏళ్లు బతికాడు. 1997లో కాబోలు పోయాడు. ఆయన సగర్వంగా చెబుతుండేవాడు నవ్వుతూ!

"నేను 20వ శతాబ్దపు అన్ని 'దశాబ్దాలు' చూశాను" అని! అంటే పుట్టింది మొదటి దశాబ్దం. పోయింది ఆఖరి దశాబ్దం!

ఇప్పుడు నేను గర్వంగా చెప్పుకోవాలంటే 20వ శతాబ్దం 21వ శతాబ్దం రెండూ చూశాను అని చెప్పుకోవాలి! (ఇది రాస్తున్నది 2005వ సంవత్సరం)

ఇవన్నీ నవ్వుకుంటూ కాలక్షేపానికి చెప్పుకునే కబుర్లు! జ్ఞాపకాలు!

నా మొట్టమొదటి సినిమా 'పెద్దమనుషులు' ద్వారా కొసరాజు రాఘవయ్య చౌదరి గారి సినిమారంగ పునః ప్రవేశాన్ని గురించి కొంత చెప్పాలి.

'పునఃప్రవేశం అని ఎందుకన్నానంటే ఆయన అంతకు ముందు దాదాపు 10-12 సంవత్సరాల క్రితం గూడవల్లి రామబ్రహ్మం గారికి కొసరాజు గారికి గల మైత్రిని గురించి తరువాత చెబుతాను)



ఆ తరువాత యుద్ధపురోజుల్లో రామబ్రహ్మం గారు బెజవాడకు షిఫ్టుకావడం, కొసరాజుగారు గుంటూరు వెళ్లి స్థిరపడడం జరిగాయి.

కొసరాజు గారిది గుంటూరు జిల్లా బాపట్ల తాలూకా, అప్పికట్ల ఆయన స్వగ్రామం.

నాకు కొసరాజు గారితో ప్రథమ పరిచయం 1937-38లో నేను గుంటూరు హిందూ కాలేజీలో ఇంటర్మీడియట్ చదివేటప్పుడు బ్రాడీపేటలో కొండా వెంకటప్పయ్యగారి ఇంటికి ఎదురుగా ఉన్నవ లక్ష్మీనారాయణగారి శారదా నికేతనం ప్రక్కనే ఉన్న "చంద్రశేఖర విలాస్" అనే బంగళాలో ఒక గదిలో ఉంటుండేవాణ్ణి. నాతోపాటు ఇంకా ముగ్గురు విద్యార్థులు ఆ గదుల్లో ఉండేవారు. వాళ్లలో ఒకడు గుంటుపల్లి వెంకటేశ్వరరావు. అతను నాకు జూనియర్. ఆ వెంకటేశ్వరరావుకి కొసరాజు గారు ఫ్యామిలీ ఫ్రెండ్. ఆ కారణంగా కొసరాజు గారు మా గదులకు తరచు వస్తుండేవారు. జానపదగేయాలు, ఆయన రాసిన పద్యాలు చదివి వినిపిస్తుండేవారు. ఎలక్షన్లకు ప్రచార గీతాలు గూడా రాసేవారు. జానపద సాహిత్యంలో ఆయన దిట్ట! చిన్నతనంలోనే అష్టావధానాలు చేశాడట! 'బాలకవి' అని బిరుదు గూడ ఉండేదట! ఆయన పెద్ద వాడయిన తరువాత గూడ ఆయన్ని 'బాలకవి' అని ఆటలు పట్టిస్తుండేవాళ్లం! ఇదీ కొసరాజుగారితో నా పరిచయ చరిత్ర.

కె.వి.రెడ్డిగారి దర్శకత్వంలో నామొదటి చిత్రం 'పెద్దమనుషులు' కథ - మాటలు పూర్తి అయినయ్ ఇక పాటలు రాయాలి.

"నరసరాజుగారూ! మీరు పాటలు కూడ రాస్తారా?" అని అడిగారు రెడ్డిగారు నేను నవ్వుతూ "రాస్తాను గాని బాగా రాయలేను" అన్నాను.

"అయితే పాటలు రాయడానికి ఊటుకూరు సత్యనారాయణ రావుగారిని పిలిపిద్దాం" అన్నారు రెడ్డిగారు.

ఊటుకూరు సత్యనారాయణరావుగారు నాకు బాగా సన్నిహితులు. మంచి కవి! నాటక కర్త! 'రఘునాథ్' 'వీరాభిమన్య' నాటకాలు రాశారు. బందా కనకలింగేశ్వరరావుగారు ప్రదర్శించారు.

సత్యనారాయణరావు గారిని విజయా ప్రొడక్షన్స్ (నాగిరెడ్డి, చక్రపాణి)లో కవిగా నియమించుకుని ఎందువల్లనో 'పాతాళభైరవి' తరువాత పింగళి నాగేంద్రరావు గారిని నెలజీతం మీద కుదుర్చుకుని సత్యనారాయణరావు గారిని తొలగించారు. సత్యనారాయణరావు గారు "పెళ్లిచేసి చూడు"లో ఒకటో రెండో పాటలు రాశారు. సత్యనారాయణగారు కె.వి. రెడ్డిగారి దగ్గరకు వచ్చి విషయం చెప్పి "మీరు తీయబోయే చిత్రంలో పాటలు రాసే అవకాశం ఇప్పించండి" అని అడిగారట.

ఆ విషయం రెడ్డిగారు నాకు చెప్పారు.

"సత్యనారాయణరావుగారు నాకు గూడ చాలా సన్నిహితులు! ఆయన చేత మిగతా పాటలు రాయించండి! కాని ఈ మూడు పాటలకి 'నందామయా గురుడ నందామయి', 'శివ శివ మూర్తివి గణనాథా', 'చెట్టు లెక్కగలవా?' సన్నివేశాలు, జానపద పాటల బాణీలు అదివరకే నిర్ణయించాం!

ఈ మూడు పాటలు మాత్రం కొసరాజు గారి చేత రాయిద్దాం!" అన్నాను. "ఎవరీ కొసరాజుగారు?" అన్నారు రెడ్డిగారు. ఆయన కొసరాజుగారి పేరే వినలేదు.

"ఈ మూడు పాటలు ఆయన బ్రహ్మాండంగా రాస్తారు! నేను గ్యారంటీ!" అన్నాను.



'అయితే పిలిపించండి!" అన్నారాయన.

('నందామయా - గురుడ...' పాట వెనక ఒక కథ వుంది. ఒక పోలీసు కానిస్టేబులు సెలవుపెట్టి సినిమాలలో వేషాల కోసం మదరాసు వచ్చి ఒకరోజు వాహినీ ఆఫీసుకు వచ్చాడు. "పాటలు పాడతానని" 'నందామయా గురుడ నందామయా! ఆనంద దేవికి నందామయా' అని మరికొన్ని చరణాలు పాడి వినిపించాడు. కె.వి.రెడ్డిగారు పకపక నవ్వి "ఆనంద దేవి... ఈమెవరండీ?" అన్నారు. ఆయన అంతకు ముందు ఆ పాటే వినలేదట.

నేను చెప్పాను. "ఇది బ్రహ్మంగారి తత్వం లాంటిదండి. మా సర్కారు జిల్లాలో చాలా పాప్యులర్" అన్నాను.

"అయితే దీనిని రేలంగికి టైటిల్ సాంగుగా పెడదాం" అన్నారు.

కొసరాజుగారి కోసం నేను గుంటూరుకు నా మిత్రుడు గుంటుపల్లి వెంకటేశ్వరరావుకు ఉత్తరం రాశాను.

"కొసరాజుగారు ఇప్పుడు ఇక్కడ లేడు. గుంటూరు - పొన్నూరు బస్ సర్వీసులో భాగస్తుడుగా ఉన్నాడు. ఒకవేళ పొన్నూరులో ఉన్నాడేమో కనుక్కుని ఉత్తరం రాస్తాను" అని రాశాడు.

వారం తరువాత "కొసరాజు పొన్నూరులో గూడా లేడట! ఎక్కడున్నాడో తెలియదు!" అని వెంకటేశ్వరరావు నాకు రాశాడు.

ఈయన్ని పట్టుకోవడం ఎలాగ? అని అనుకుంటుండగా ఒకరోజు కాకతాళీయంగా నేను కారులో ఆఫీసుకు వెళుతుంటే గోపతి నారాయణస్వామి రోడ్డులో నార్తు బోగ్ రోడ్డుకు ఎదురుగా బస్‌స్టాండులో నిలబడి ఉన్నాడు కొసరాజుగారు.

నేను కారు ఆపి -"ఏమిటి ఇక్కడ ఉన్నారు" అన్నాను. "నా భార్యకు చిన్న ఆపరేషన్ జరిగింది. బోగ్ రోడ్డులో ఉన్న యార్లగడ్డ వెంకన్నచౌదరి గారి ఇంట్లో వుంటున్నాను" అన్నారాయన.

"మీ కోసం దేశమంతా వెతుకుతున్నాను! మీతో పని పడింది" అన్నాను.

"ఏమిటి?" అన్నాడాయన.

"కారు ఎక్కండి! ఆఫీసుకు వెళదాం!" అన్నాను. అంతలో బస్సు వచ్చింది "నాకు మైలాపూరులో పనిఉంది. వెళ్లాలి" అని బస్సు ఎక్కబోతుంటే-

"అయితే సాయంత్రం మా ఇంటికి రండి. మాట్లాడుకుందాం" అని మా ఇంటి అడ్రసు దగ్గరలోనే నార్తు క్రెసెంట్ రోడ్, నంబరు 11 అని చెప్పాను.

ఆ సాయంత్రం మా ఇంటికొచ్చాడాయన. ముందు నన్ను అభినందించాడు. "వాహినీకి అందులో కె.వి. రెడ్డిగారి పిక్చరుకు రాస్తున్నారని విన్నాను. చాలా సంతోషం" అన్నారాయన.

"ఆ పిక్చరులోనే మీరు పాటలు రాయాలి! మీ కోసం గుంటూరుకు, పొన్నూరుకు ఉత్తరాలు గూడ రాశాను" అన్నాను.

ఆయన కొంచెం విరక్తిగా "ఎందుకు రాజుగారూ! సినిమాలు వదిలేసి వెళ్లి ఏదో వ్యాపారంలో పడ్డానుగా! అన్నారు. మీరు వ్యాపారాలు మానుకోనక్కరలేదు. ఈ ఊళ్లో ఉండనూ అక్కరలేదు! మీరు రాయాల్సినవి మూడే పాటలు! అవి మూడు గంటల్లో రాసేయగలరు! రేపు ఆఫీసుకు తీసుకు వెళతాను! రండి" అన్నాను.



మరునాడు ఆయన్ను ఆఫీసుకు తీసుకెళ్లి కె.వి. రెడ్డిగారికి పరిచయం చేశాను! (అప్పుడు వాహినీ ప్రొడక్షన్సు ఆఫీసు యిప్పుడు 'పాంగ్రోవ్' హోటలువున్న చోటికి ఎదురుగా ఒక పాత బంగళాలో వుండేది) కథ, పాటల సన్నివేశాలు చెప్పాం! మూడు నాలుగు రోజుల్లో ఆఫీసుకు వచ్చి మూడు పాటలకి ఇంత కట్ట కాగితాలు ఇచ్చాడు. 'నందామయా గురుడ' పాటకి ఎన్నో చరణాలు రాశాడు మేము కావలసిన 'లెంగ్త్'కి ఎడిట్ చేసుకున్నాం.

అప్పుడు 1952 ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీ మంత్రులు చాలా మంది ఓడిపోయారు. కమ్యూనిస్టులు గెలిచారు.

'శివశివ మూర్తివి గణనాథా' పాటలో

'ఒక్కసారి  మంత్రి చెయ్యి గణనాథా

నువ్వు ఓడకుంటె - ఒట్టు బెట్టు గణనాథా!'అని సెటైర్ రాశాడు.

'బ్లాకు మార్కెట్టు చెయ్యి గణనాథా!

నిన్ను పట్టుకుంటె ఒట్టు బెట్టు గణనాథా!

బొక్క పెట్ట కుంటె ఒట్టు బెట్టు గణనాథా" అని రాశాడు.

'చెట్టులెక్కగలవా నరహరి' పాటకి -

'పట్నమెళ్లగలవా బావా!

పర్మిట్ తేగలవా?' అని రాశాడు! ఆరోజుల్లో గవర్నమెంటుకి 'పర్మిట్ లైసెన్స్ రాజ్' అని సి.రాజగోపాలాచారి పేరు బెట్టాడు.

(రెండు మూడేళ్ల క్రితం నాకు ఎవరో 'పెద్ద మనుసులు' సినిమా క్యాసెట్  దూరదర్శన్‌లో ప్రసారమైనది. రికార్డు చేసి ఇచ్చారు. దానిలో 'శివశివమూర్తివి' పాటలో -

ఒక్కసారి మంత్రి చెయ్యిగణనాథా!

నువ్వు ఓడకుంటె ఒట్టు బెట్టు గణనాథా!' చరణం కట్ చేశారు! వాళ్లకు కావలసిన లెంగ్త్ కోసం కుదించి మరికొన్ని సీన్లు గూడ కట్ చేశారు.)

కొసరాజుగారు మాకు పాటలు రాసి ఇచ్చేసి తన పనులమీద వెళ్లిపోయారు. 'పెద్ద మనుషులు' రిలీజు అయింది. కొసరాజు పాటలు జనాదరణ పొందినై!

తరువాత కొన్నాళ్లకి కొసరాజుగారు మా ఇంటికి వచ్చి "రాజుగారూ! మీరు రాయమంటే పాటలు రాసి ఇచ్చాను. ఇప్పుడు ఇంకెవళ్లో వచ్చి అడుగుతున్నారు. పాటలు రాయమని! వాళ్లెవరో నాకు తెలియదు! ఎవరో ప్రొడ్యూసర్ సుందర్‌లాల్ పిక్చరు 'రాజు-పేద' అని చెప్పారు! ఏం చేయమంటారు?" అన్నారు.

"పిక్చరు షూటింగు పూర్తి అయింది. ఇంకా రిలీజు కాలేదు. పిక్చరు బాగుందని ఇండస్ట్రీలో టాక్! రాజేశ్వరరావు సంగీతం! రాయండి" అన్నాను. పిక్చరు వేసి చూపించారట.

'పిక్చరంతా అయిపోయిందంటున్నారు! నేనేమి రాయను?' అని కొసరాజు గారంటే -

"మీ ఇష్టం! మీకు ఇష్టమయిన పాట రాయండి! అన్నాడట సుందరలాల్!



"రేలంగి జేబులో ఒక బొమ్మ ఉంది! ఆ బొమ్మ మీద పాటరాస్తాను" అని

"జేబులో బొమ్మ! జేజేలబొమ్మ" అని పాట పూర్తిగా రాసి పాడి వినిపిస్తే

"రాజేశ్వరరావు "మీరు పాడిన ట్యూన్ ఎక్కడో విన్నట్టుందే?" అన్నాడట.

కొసరాజుగారు నవ్వుతూ "నావన్నీ జానపద పాటలే" అని నవ్వుతూ "ఏమిరా రామ! నావల్లనేర మేమిరారామ" అనే ట్యూన్ అన్నాడట!

రాజేశ్వరరావు మెచ్చుకుంటూ చాలా మంచి ట్యూన్ అని అభినందించాడట. 'పెద్దమనుషులు', 'రాజు-పేద' సినిమాలు రిలీజు అయిన తరువాత మా సినిమావాళ్లకు అలవాటేగా సారథి పిలింస్ రామకృష్ణ ప్రసాద్ ప్రొడ్యూసరు.

"ఎవరీ కొసరాజు?" అని విచారించి "ఓహో" మా కొసరాజా?" అని "రోజులు మారాయి" సినిమాకు ఏరువాక పాట రాయించారు.

అసలు కొసరాజు - రామకృష్ణప్రసాద్ గారి చల్లపల్లి ఎస్టేట్‌లో ఆస్థానకవి లాంటివాడు. అంతవరకూ గుర్తురాని కొసరాజు రెండు సినిమాల్లో పాటలు పాప్యులర్ అయ్యేసరికి వెంటబడ్డారు.

ఆ తరువాత సినిమా తరువాత సినిమాకు రాస్తూ కొసరాజు గారు మదరాసులోనే సెటిలైపోయి ఇల్లుగూడ కట్టుకున్నాడు.

ప్రతి పిక్చరులోనూ కొసరాజు గారిది ఒకపాటయినా ఉండాలి అనేటంత పాప్యులర్ అయినాడాయన!

గతంలోకి వెళితే కొసరాజుగారిని గురించి కొన్ని విషయాలు గుర్తుకు వస్తున్నయ్!

నేను గుంటూరులో ఇంటర్ చదివేరోజుల్లో (1937-38) కొసరాజుగారు మా రూంకి వస్తుండేవాడని చెప్పానే అప్పుడు కొమెరపూడి కరణంగారి రాజశేఖర శతకం పద్యాలు చదివి వినిపించేవాడు.

కొమెరపూడి కరణంగారి చరిత్ర ఏమిటంటే - గుంటూరు జిల్లా, సత్తెపల్లి ప్రాంతంలో అనుకుంటాను. కొమెరపూడి అనే పల్లెటూరు! ఆ ఊరికి కరణాలు తుళ్లూరువారు! తుళ్లూరు వారు తరతరాలుగా కవులు! వారిలో ఏకాంబర కవి ఒకాయన మంచి ధారాశుద్ధిగల కవిత్వం రాశాడట! ఊళ్లో అతని కత్తికి ఎదురులేదన్నట్లుగా కరణీకం చేశాడట! వూళ్లోవున్న రైతులందరూ కమ్మ, రెడ్డి, కాపు కులస్థులు! చదువు సంధ్యలేని నిరక్షరాస్యులు! చుట్టాలకు ఉత్తరం రాయాలన్నా చుట్టాలనుంచి వచ్చిన ఉత్తరాలు చదివించుకోవాలన్నా కరణంగారే దిక్కు!

కరణం గారు ఎంత శిస్తు కట్టమంటే అంత కట్టవలసిందే! ఆరోజుల్లో అంటే ఈ శతాబ్దం మొదటి రోజుల్లో అంతకుముందు గూడా బ్రిటిష్ ప్రభుత్వ హయాంలో గూడ రెవెన్యూ ఇన్‌స్పెక్టర్లు తాశీల్దారులూ, బ్రాహ్మలే! చదువుకున్న వాళ్లు బ్రాహ్మణులే కాబట్టి!

ఈ నేపథ్యంలో పల్లెలలో కరణాలు పెత్తనం చెలాయించడం, మిగతా బ్రాహ్మణేతర రైతులు సహించినన్నాళ్లు సహించి కొన్నాళ్లకు అవమానాలు భరించలేని పరిస్థితి రావడం, వచ్చి చేసేదేమీలేక పోవడం, కోర్టులకు పోవడానికయినా బ్రాహ్మలనే ఆశ్రయించాలి గనక రైతులలో అసహనం పెరిగింది! (దీనివలననే బ్రాహ్మణ వ్యతిరేకోద్యమం జస్టిస్ పార్టీరూపంలో ఆవిర్భవించి ఉంటుంది.)

కొమెరపూడి కరణంగారి మీద అసహనం, ఆగ్రహం పెరిగి, రైతులకు కక్ష తీర్చుకునేందుకు వేరే మార్గంలేక



ఒక రాత్రి పూట కరణంగారు రైలుదిగి ఊరి నడచినస్తుంటే దారికాచి, కర్రలతో ఆయన్ని చితక బాదారు.

చుట్టుపక్క పది పన్నెండు గ్రామాలలో ఎంతో గౌరవంగా బ్రతికిన కరణం గారికి యిది పెద్ద అవమానంగా పరిణమించింది.

"కొమెరపూడి కరణం గారిని, రైతులు కొట్టారు." అనే వార్త - దావానలంలా చుట్టు ప్రక్కల ఊళ్లలో వ్యాపించింది. ఆ అవమానం భరించలేక మనో వ్యాధిలో ఆయన మంచమెక్కాడు. ఆ రోజునుంచి బయట ప్రపంచానికి మొఖం చూపలేకపోయాడు. కవిగదా! మంచంమీదనే ఉండి కడుపులోవున్న మంటనంతా వెళ్లగక్కుతూ రైతుల మూర్ఖత్వం నిరసిస్తూ వ్యంగ్యంగా 'రాజశేఖర' మకుటంతో 'మూఢశతకం' రాశాడు.

"మాల చినంగదాసుకు చుమారుగ తెల్బును వర్సయోగమియ్యాల గుర్తుదంటే పయిటాలకు నేనియు వర్సమొచ్చు చాత్రాలుపూరాండముల్ సదివి రాసులు యాల్లతో లెక్కలుబెట్టు నాయాళల కేమి తెచ్చునని పల్కును మూర్ఖుడు రాజశేఖరా!"

"భారతమందు రావణుడు పార్వతిదేవిని సెరలు బెడితే.." అనేది మరో పద్యం!

"కోటయ కొండకాడ - వైకుంఠము..."

కోటప్పకొండ శివక్షేత్రం! వైకుంఠం హరినివాసం! యిలా శతకం రాశాడు ఏకాంబరకవి!

అతని మరణానంతరం అతని కొడుకో - మనవడో, ఆ శతకాన్ని ముద్రించి, తాలూకాబోర్డు ప్రెసిడెంటును పట్టుకుని తాలూకాలోని అన్ని గ్రంథాలయాలలో ఆ పుస్తకాలు పంచి పెట్టాడు. స్కూళ్లలో గూడ పెట్టించాడని చెబుతారు.

తరువాత కొన్నాళ్లకు సత్తెనపల్లి సమీపంలోని పెద మక్కెన గ్రామానికి చెందిన చెరుకూరి సీతారామయ్య తాలూకా బోర్డు ప్రెసిడెంటయ్యాడు. ఆయన సహోదరి సాధువమ్మ గారని గాంధీగారి శిష్యురాలు! సంఘసేవకురాలు! చదువుకున్నది. ఆమె ఈ రాజశేఖరశతకం చదివి, సోదరుని సహాయంతో ఆ పుస్తకాలను, లైబ్రరీలనుంచి తొలగించి తగులబెట్టించిందనిన చెబుతారు ' రాజశేఖరశతకం' మొత్తం కొసరాజు గారికి కంఠస్థం!

చెరుకూరి సీతారామయ్యగారు కొసరాజు గారికి స్నేహితుడు. ఆయన ప్రోద్బలంతో కొసరాజుగారు రాజవేఖర శతకానికి జవాబుగా 'వీర శేఖర శతకం' రాశారు.

"వడియములప్పడంబులును వాసినగట్టెనచింత

వచ్చిడిన్...." పద్యాలు గుర్తులేవు.

"మా పెద్దసుబ్బలక్ష్మిమడి మడిగాదని పల్కును విప్రుడు

వీరశేఖరా!"

కొసరాజు రాఘవయ్య చౌదరిగారు కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరిగారికి బంధువు! రామస్వామి చౌదరిగారి మొదటి భార్య పున్నమ్మ గారు చనిపోయిన తరువాత ఆయన ద్వితీయ వివాహం చేసుకున్నాడు. ఆమె పేరు చంద్రమతి! ఆ చంద్రమతి గారి పినతండ్రి కూతురు లక్ష్మమ్మగారు కొసరాజుగారితల్లి! అలా కవిరాజుగారు కొసరాజుగారికి పినతండ్రి వరస!



అలా పద్యం గూడ రాసుకున్నాడు కొసరాజుగారు.

"వరుసకు పినతండ్రివి, నీ

యొరవడి నేర్పించినట్టి ఒజ్జవు.."

పినతండ్రేగాక గురుతుల్యుడని చెప్పుకున్నాడు.

మరోవిశేషం!

గూడవల్లి రామబ్రహ్మంగారికి కొసరాజుగారికి పరిచయం ఎలాగంటే - గుంటూరులో ఒకసారి కారంచేడుకు చెందిన జాగర్లమూడి కుప్పుస్వామిచౌదరిగారు, త్రిపురనేని రామస్వామి చౌదరిగారు 'మాలపల్లి' నవలా రచయిత ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు ఒక సందర్భంలో కలిశారట!

అప్పుడు లక్ష్మీనారాయణ పంతులుగారు కుప్పుస్వామిగారితో అన్నారట!

"కట్టమంచి రామలింగారెడ్డిగారు 'రెడ్ల చరిత్ర' రాయిస్తున్నాడట! మీరు కమ్మవారి చరిత్ర రాయిస్తే ఆంధ్రదేశ చరిత్ర చాలావరకు తెలుస్తుందిగదా!' అని.

అప్పుడు కుప్పుస్వామిగారు, కొసరాజుగారితో "నీవు వెంటనే మదరాసువెళ్లు! ఇల్లు అద్దెకు తీసుకుని కాపురంపెట్టు!" అని

తరువాత సముద్రాల రాఘవాచార్యులుగారిని గూడవల్లి రామబ్రహ్మంగారిని గూడ మదరాసు పంపించి, ఈ ముగ్గురిని కమ్మవారి చరిత్ర పరిశోధనార్థం మదరాసులో మకాం పెట్టించారట!

ఈ విషయం నాకు ఈమధ్య తెలిసింది. నల్లూరి రామారావుగారని నరసరావుపేటలో కొత్త రఘురామయ్య జూనియర్ కళాశాలలో తెలుగు లెక్చరర్‌గా పనిచేస్తున్నారు. ఆయన కొసరాజుగారి జీవితం రచనల మీద రిసెర్చిచేసి పి.హెచ్‌డి. డాక్టరేటు పొందారు! ఆయన సిద్ధాంత గ్రంథంలో ఉన్నయ్ ఈ వివరాలు!

నన్ను చాలామంది అడుగుతుంటారు: "మీరు 40 ఏళ్లకుపైగా సినిమారంగంలో రచయితగా యాక్టివ్‌గా ఉండి సినిమా ఎందుకు తీయలేదూ?' అని

"సినిమా తీయడానికి మీకు ఎన్నో సదుపాయాలున్నయ్! డైరెక్టర్లు కె.వి. రెడ్డిగారు, బి.యన్. రెడ్డిగారిలాంటివారు, నాగేశ్వరరావు, యన్.టి.రామారావు, యస్.వి. రంగారావుగారు లాంటి నటులు స్టూడియో ఓనర్లు నాగిరెడ్డి, చక్రపాణి గార్లు ఏ.వి.యం. చెట్టియార్ గారు, ఇందరితో సన్నిహిత సంబంధాలుండి గూడ ఒక్క సినిమా అయినా ఎందుకు తీయలేదూ?" అని అడుగుతుంటారు. సహజమే! వాళ్లలా అడగడం సహజమే!

నేను స్వయంగా సినిమా తీయకపోగా నా దగ్గరకి ఎవరైనా కొత్త ప్రొడ్యూసర్లు సినిమా తీస్తామని వస్తే -

"ఎందుకయ్యా సినిమాలు? ఇది చాలా రిస్కీ బిజినెస్" అని నిరుత్సాహపరిస్తే వాళ్లు అనుకునేవాళ్లు "ఇదేమిటి? సినిమాకి రాసిపెట్టమని అడిగితే అసలు సినిమా తీయవద్దంటాడేమిటి ఈయన? అనుకునేవాళ్లు.

నేను వద్దంటే మానుకునేవాళ్లు కాదనుకోండి! ఇంకొకళ్ల చేత రాయించుకుని చేతులు కాల్చుకుని మళ్లీ కనబడకుండా పోయిన వాళ్లు కొందరున్నారు. నేను సినిమా ఎందుకు తీయలేదో ఇంతకు ముందే యీ "తెరవెనక కథలు" పుస్తకంలో 'గాంధిరాజుగారి' ఉదంతం రాస్తూ చెప్పాను.



యార్లగడ్డ వెంకన్న చౌదరిగారు! ఆయన స్వగ్రామం ప్రకాశం జిల్లా కారంచేడు. ఏదో వ్యాపారాల్లో బాగా సంపాయించాడు.

ఆయన "నమ్మినబంటు" అనే సినిమా తీశాడు. నాగేశ్వరరావు, సావిత్రి, రంగారావు వగైరాలతో. పెద్ద తారాగణం. దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు. చాలా విజయవంతమైన పిక్చరు! అంతర్జాతీయ చలన చిత్రోత్సవాలకు గూడ ఎన్నికయింది.

ఆయనతో నాకు చాలా బాగా చనువు! ఒకసారి అడిగాను. "వెంకన్న చౌదరిగారూ! ఒక్క పిక్చరుతోనే మానేశారు! పిక్చరు సక్సెస్ అయిందిగూడా! మళ్లీ పిక్చరు తీయడంలేదేం?" అన్నాను.

"వద్దండి బాబూ! ఇదేం వ్యాపారమండి బాబూ! డబ్బిచ్చి అందరికీ దండాలు పెట్టాలి!" అన్నాడు నమస్కరిస్తూ!

నాకు ఇతర వ్యాపారాల సంగతి బొత్తిగా తెలియదు గనక ఒక సినిమా వ్యాపారమే రిస్కీ అనుకుని అందరికీ సలహాలిస్తుండేవాణ్ణి. సినిమా వ్యాపారం చాలా రిస్కీ! వెళ్లి వేరే ఏదైనా వ్యాపారం చేసుకోమని చెబుతుండేవాణ్ణి!

"నమ్మినబంటు" సినిమా నిర్మాత యార్లగడ్డ వెంకన్నచౌదరి గారిని గురించి కొన్ని ఆసక్తికరమైన విషయాలు చెప్పాలి.

ఆయనకు సినిమా రంగం కొత్త! అదే మొదటి పిక్చరు! మొదటి షెడ్యూలు వాహినీ స్టూడియోలో సెట్టువేశారు! మధ్యాహ్నం - 2 గంటలనుంచి రాత్రి 9 గంటల దాకా కాల్‌షీట్.

ఆయన మధ్యాహ్నం 1.30కే స్టూడియోకి వెళ్లి కూర్చున్నాడు. తన ప్రొడక్షనుకు సంబంధించిన వాళ్లు ఎవరూ కనబడలేదు. 2 అయింది. 2.30 అయింది. ప్రొడక్షన్ తాలూకు అసిస్టెంటు ఒకడు వచ్చాడు.

"ఏమయ్యా! 2.30 అయింది. మనవాళ్లు ఇంకా ఎవరూ రాలేదేం?" అని అడిగాడు వెంకన్న చౌదరిగారు. "వస్తారండి" అని ముక్తసరిగా చెప్పి వెళ్లిపోయాడు.

3 అయింది! మూడున్నరయింది! అసిస్టెంటు డైరెక్టర్లు వచ్చారు. "ఏమయ్యా! రెండుగంటలకు కాల్‌షీట్ అన్నారు 3.30 అయింది. యింకా డైరెక్టరుగారు రాలేదేం?"

"వస్తారండి' అని ఒక్కముక్క చెప్పి వాళ్లదారిన వాళ్లు లోపలికి వెళ్ళిపోయారు. 4 అయింది. డైరెక్టరు ఆదుర్తి సుబ్బారావుగారు వచ్చారు. "ఏమండీ! 4 అయింది! ఇంకా షూటింగ్ ఎప్పుడు మొదలుపెడతారు?"

"ఆర్టిస్టులు రావాలిగా!" డైరెక్టరు సమాధానం! "ఎన్నిగంటలకు వస్తారు?" ప్రొడ్యూసరు ప్రశ్న!

"వస్తారు!" సిగరెట్టు వెలిగించుకుని లోపలికి వెళ్లిపోయాడు డైరెక్టరు.

5 అయింది!

ప్రొడ్యూసరు, డైరెక్టరుతో "ఇంకెప్పుడండీ షూటింగు మొదలు పెట్టేది?" విసుగ్గా!

"ఆర్టిస్టులు మేకప్ వేసుకోవద్దూ? వేసుకుంటున్నారు" మొదటి షాట్ ఆరుగంటలకి ప్రారంభం!

వెంకన్నచౌదరిగారికి చిరాకు! కోపం!

మొదటిషాట్ అయిన తరువాత ప్రొడ్యూసరు డైరెక్టరుతో "ఏమండీ! 6 గంటలకు షూటింగు మొదలెట్టాంగదా! 2 గంటల నుంచి 9 గంటల దాకా కాల్‌షీటు బదులు 6 గంటలనుంచి అర్ధరాత్రి దాకా షూట్ చెయ్యొచ్చుగా!" "6



గంటలకి కాల్‌షీట్ అంటే ఆర్టిస్టులు 9 గంటలకి గాని రెడీగారు!" కూల్‌గా సమాధానం!

వెంకన్నచౌదరిగారు నిట్టూర్చి నోరు మూసుకుని షూటింగు చూస్తూ కూర్చున్నాడు.

ఈ అనుభవం ఆయన నాతో ఎంతో రసవత్తరంగా వర్ణించి చెప్పాడు!

పిక్చరు రిలీజు అయింది. బాగాపోతుంది. పిక్చరులో నటించడానికి వెంకన్న చౌదరిగారు రెండు మంచి గిత్తల్ని తీసుకువచ్చి మదరాసులో వాటిని బాగామేపి షూటింగులో పాల్గొనడానికి బాగా తర్ఫీదుయిచ్చి రిహార్సల్సు చేయించారు. అవి బాగా నటించినయ్ గూడా!

పిక్చరు రిలీజు అయి బాగా పోతున్నప్పుడు పబ్లిసిటీ పోస్టర్లతో ఎద్దుల బొమ్మలు మాత్రమే వేసి "మేటి నటీనటులకంటె బాగా నటించిన" అని రాశారు.

దానితో పిక్చర్‌లో నటించిన మేటి నటీనటులకు కోపం వచ్చింది.

స్పెయిన్ (యూరప్) లో జరిగిన ఒక చలన చిత్రోత్సవానికి 'నమ్మినబంటు' ప్రదర్శనకు ఎంపిక అయినది. అప్పుడు ప్రొడ్యూసరు చిత్రంలో నటించిన అగ్రనటీనటులను స్పెయిన్ ఫెస్టివల్‌కు రావలసిందని ఆహ్వానిస్తే -

"మేటి నటీనటుల కంటె ఎద్దులు బాగా నటించినయ్యని పబ్లిసిటీ చేశారుగదా ఫెస్టివల్‌కి ఎద్దులనే తీసుకెళ్లండి! మేము ఎందుకురావడం?" అని వెళ్లడానికి నిరాకరించారు.

ప్రొడ్యూసర్‌తో నటుడు రంగారావు వెళ్లాడనుకుంటాను. తరువాత వెంకన్న చౌదరి గారి బావమరిది (భార్యసోదరుడు) దగ్గుబాటి లక్ష్మీనారాయణగారు సినిమా తీయాలని వచ్చినప్పుడు వెంకన్న చౌదరిగారు - "వద్దురా! సినిమా నిర్మాణం మనకి తగినది కాదు" అని చెప్పినా వినకుండా లక్ష్మీనారాయణగారు బి.యన్.రెడ్డిగారి దర్శకత్వంలో 'పూజాఫలం' సినిమా తీశారు. దానికి డైలాగ్స్ నేను రాశాను.

'పూజాఫలం' తరువాత లక్ష్మీనారాయణగారు ఇంకా రెండు మూడు సినిమాలు తీసి బాగా నష్టపోయాడు.

వెంకన్న చౌదరిగారు చనిపోయాక ఆయన కుమారుడు శంభుప్రసాద్‌గూడ ఒకటో రెండో సినిమాలు తీసి నష్టపోయాడు.

అప్పుడు నేను 'శంభు'తో వాళ్ల నాన్న అన్నమాటలు గుర్తు చేశా!

"ఏదో అయిందేదో అయిపోయిందిలెండి" అన్నాడు శంభు!

శంభుకు ఒక్కతే కూతురు! పెళ్లిచేశాడు! మంచి సంబంధం! అంతా బాగానే ఉంది.

ఒకసారి తిరుమల తిరుపతి వెళ్లి మొక్కు తీర్చుకుని తిరిగి వచ్చేటప్పుడు కార్ యాక్సిడెంటులో శంభు, అతని భార్య ఇద్దరూ చనిపోయారు. చాలా హృదయవిదారకర విషాద సంఘటన.

సినిమా ఆర్టిస్టులతో కొన్ని కొన్ని విచిత్రమైన అనుభవాలు :

సావిత్రి విషయం తెలుసుగదా సినిమాలుతీసి నానా అవస్థలు పడిందని!

కన్నాంబగూడ ప్రొడ్యూసరేనండి! రాజరాజేశ్వరీ ఫిలింస్ పేరు మీద సినిమాలు తీశారు. ఆమె, ఆమె భర్త కడారు నాగభూషణంగారు. ఆరుద్ర తన సినిమా తొలిరోజులు ఆ కంపెనీతోనే ప్రారంభించాడనుకుంటాను.



అన్నపూర్ణా పిక్చర్సు మొదటి చిత్రం "దొంగరాముడు" జరుగుతుండగా 1954-55 ప్రాంతం. కె.వి.రెడ్డిగారికి 'సతీ సక్కుబాయి' సినిమా తీయాలని కోరిక! ఆయన పురాణాలు పోతన, వేమన, మాయాబజార్, హరిశ్చంద్ర లాంటి సినిమాలు తీశాడంటే (చాలామందికి తెలియని విషయం) ఆయనకు తెలుగు సాహిత్యంలో చాలా ప్రవేశం ఉంది. ప్రెసిడెన్సీ కాలేజీలో ఆయన ఇంటర్మీడియట్ లో తెలుగులో కాలేజీ ఫస్టు! భారత భాగవతాలు, పురాణాలు బాగా చదువుకున్నవాడు. సక్కుబాయి నాటకం అందులోని పాటలు ఆయనకు చాలా ఇష్టం!

సక్కుబాయి నాటకం సర్కారు జిల్లాలలోనే చాలా ప్రసిద్ధి అనుకునేవాణ్ణి! రాయలసీమలో గూడ చాలా పాప్యులర్ అని రెడ్డిగారు చెబుతుండేవారు. అందులో సక్కుబాయిగా "తుంగల చలపతిరావు ఏం కంఠమండి! ఎంత బాగా పాడేవాడు! "ఆటలాడుకోరా! నాముద్దుల మూటగదరా" దైతా గోపాలంగారు రాసిన పాటలు. రెడ్డిగారికి ఆ నాటకం పాటలు ఎంతో యిష్టం.

"సక్కుబాయి" సినిమా తీయాలని ఆ నాటకం హక్కులు ఎవరి దగ్గర వున్నాయో విచారించమని విజయవాడలో వాహినీ పిక్చర్సు డిస్ట్రిబ్యూషన్ ఆఫీసు మేనేజరు కాశీనాథుని సుబ్రహ్మణ్యం గారికి (విశ్వనాథ్ తండ్రిగారు) రెడ్డిగారు లెటరు రాశారు! విచారిస్తే ఆ హక్కులు రాజమండ్రిలో ఎవరిదగ్గరో వున్నట్టు తెలిస్తే వెళ్లి ఆ హక్కులు కొనుక్కురమ్మని సుబ్రహ్మణ్యంగారిని పంపించి ఆ హక్కులు తన పేరుకొన్నుక్కున్నాడు రెడ్డిగారు.

తరువాత కన్నాంబ - "సక్కుబాయి" సినిమా తీస్తున్నానని పేపర్లో ప్రకటించింది.

అది చూచి రెడ్డిగారు "ఇదేమిటి? హక్కులు మాదగ్గరుంటే ఈవిడ ఎలా తీస్తుంది?" అని -

కన్నాబంబ ఆయనకి బాగా తెలుసు హెచ్.ఎం.రెడ్డిగారి "గృహలక్ష్మి"లో కన్నాంబ హీరోయిన్. రెడ్డిగారు మొట్టమొదటగా ఆ కంపెనీలో కేషియర్‌గా పనిచేశారుగదా! అలా పరిచయం ఆమెతో!

బహుశా "సక్కుబాయి" నాటకం హక్కులు తన దగ్గరున్నట్టు కన్నాంబకు తెలియదేమో చెబుదామని రెడ్డిగారు ఒకరోజు కన్నాంబగారి ఆఫీసుకు వెళ్లారు. "సక్కుబాయి" హక్కులు తన దగ్గర వున్నట్టు చెప్పారు.

ఆమె - (నిజమో - అబద్ధమో) "అయ్యో! హక్కులు మీ దగ్గర ఉన్నట్టు నాకు తెలియదండి" అని తన దీనగాథ మొదలుపెట్టింది. అంతకుముందు ఆమె తీసిన సినిమాలు ఫెయిల్ అయి కంపెనీ నష్టాలలో ఉన్నమాట నిజమే.

"నేను సినిమాలలో నటించి సంపాయిస్తుంటే మా ఆయన సినిమాలు తీసి అంతా నాశనం చేస్తున్నాడు" అని కన్నీళ్లు తుడుచుకుంటూ ఆ నష్టాలు పూడ్చుకోవడానికి - ఇప్పుడు మళ్లీ పిక్చరు తీయాలంటే సబ్జక్టు దొరక్క చస్తున్నాం రెడ్డిగారూ! ఏ సబ్జక్టు చెప్పినా మా డిస్ట్రిబ్యూటరు సుందర్‌లాల్‌గారు 'అది వద్దు', 'ఇదివద్దు' అంటూన్నాడు. మాకు ప్రొడక్షన్ ఆఫీసు ఖర్చులు నెలనెలా పెరిగిపోతున్నాయ్! నేను ఎంత బాధలు పడుతున్నానో మీకు తెలియదు రెడ్డిగారూ! రాత్రిళ్లు నిద్ర పట్టడంలేదు!

"సక్కుబాయి" అని చెబితే మా అదృష్టం కొద్దీ సుందర్‌లాల్‌గారు 'సరే' అన్నాడు. అందువల్ల రెడ్డిగారూ! మీకు చేతులెత్తి నమస్కారం చేస్తాను! మీరు ఎంతకు కొన్నారో ఆ డబ్బు మీకు నేనిస్తాను! మీకేమండి! ఏ సబ్జక్టయినా రాసుకుని మట్టిని గూడ బంగారం చేసుకోగలరు! నాకింతకంటె దిక్కులేదు. యీ 'సక్కుబాయి' నాకు వదిలేయండి!" అని వలవల ఏడవడం మొదలెట్టింది!



కె.వి.రెడ్డిగారు తరువాత అన్నపూర్ణ ఆఫీసుకు వచ్చినప్పుడు ఆ కథంతా చెప్పారు.

"ఆవిడ అలా కన్నీరుమున్నీరుగా ప్రాథేయ పడితే నేనేం చేయగలను? అదీగాక నేను హక్కులు ఇవ్వను అన్నాననుకోండి యిక కోర్టుకు పోవాలి! పైగా నేను ఎప్పుడు ఏ కంపెనీకి తీస్తానో నాకే తెలియదు! నాటకం మీద మోజుతో హక్కులు కొనిపెట్టుకున్నాను! కాదు కూడదంటే ఆవిడ మూడు నెలల్లో పిక్చరు తీసి రిలీజ్ చేయగలదు! అందుకని మర్యాదయినా దక్కుతుందని "అలాగేనమ్మా! నువ్వే తీసుకో" అని వచ్చేశాను" అని చెప్పారు రెడ్డిగారు. తరువాత హక్కులు కొన్న డబ్బు కన్నాంబ గారు రెడ్డిగారికి పంపించింది.

రెడ్డిగారు నవ్వుతూ అన్నారు : "నరసరాజుగారూ! ఆర్టిస్టులు అలా ఏడుస్తుంటే నిజంగా బాధతో ఏడుస్తున్నారా? లేక సినిమాలో లాగ నటిస్తున్నారా? అని అనుమానం వస్తుంది.

నన్ను నోరెత్తనివ్వకుండా వలవల ఏడుస్తూ అలా అడుగుతుంటే ఏం చేయాలి?" అన్నారు రెడ్డిగారు.

అదీ "సక్కుబాయి"కథ! కన్నాంబ "సక్కుబాయి" సినిమా తీసింది. తను 'అత్త'గానూ యస్. వరలక్ష్మి కాబోలు సక్కుబాయిగానూ నటించారు. బాగా జ్ఞాపకంలేదు.

కన్నాంబ చాలా గొప్ప మాటకారి! కేవలం సినిమాలో నటిగానే గాక - నిజ జీవితంలో గూడ - చాలా చమత్కారి!

బి.యన్. రెడ్డిగారు వాహినీకి తీసిన "రాజమకుటం"లో ఆమె యన్.టి.రామారావుగారి తల్లిగా నటించింది!

అప్పటి అనుభవం ఒకటి చెబుతాను.

నేను సామాన్యంగా షూటింగు జరిగేటప్పుడు సెట్స్ మీదకి వెళ్లే వాణ్ణిగాదు. ఒక షెడ్యూలులో బి.యన్.రెడ్డిగారు

"నరసరాజుగారూ! మీరు ఫ్రీగా ఉంటే ఈ షెడ్యూలులో సెట్స్‌కు రాకూడదూ? నాకు తోడుగా వుంటుంది" అన్నారు.

ఆ సినిమాకి నేను డైలాగ్స్‌రాశాను.

"అలాగే! ఫ్రీగానే ఉన్నాను లెండి. వస్తాను" అన్నాను. రోజూ ఆయనే నన్ను పిక్ చేసుకుని ఇద్దరం స్టూడియోకి వెళ్లేవాళ్లం. వాహినీ స్టూడియోలో షూటింగ్ ఉదయం 9 గంటల నుంచి రాత్రి 9 గంటల దాకా కాల్‌షీటు!

మధ్యాహ్నం ఒకటి రెండు గంటల మధ్య 'లంచ్ బ్రేక్! చాలామందికి స్టూడియోలోనే భోజనాలు ఏర్పాటు చేసేవారు. కొందరు ఇళ్లకు వెళ్లి భోజనం చేసి 2 గంటలకి వచ్చే వాళ్లు! కన్నాంబగారు కూడ మధ్యాహ్నం భోజనానికి ఇంటికి వెళ్లేది. భోజనమేగాక ఆమెకు షుగర్ ఉండేదో, లేక మరేదైనా సుస్తీ ఉండేదో.

మధ్యాహ్నం ఆమెకు ఇంజక్షను ఇవ్వడానికి పాత మదరాసు జార్జిటవునులో ఆచారప్పన్ వీధి నుంచి డాక్టరు అలగ సింగర నాయుడుగారని (బి.యన్.రెడ్డిగారికి ఫ్యామిలీ ఫ్రెండు) ఆయన వచ్చేవాడు సొంతంగా కారు డ్రైవ్ చేసుకుని. అందుకని కన్నాంబగారు మధ్యాహ్నం లంచ్‌టైంలో ఇంటికి వెళ్లి మూడున్నర నాలుగు గంటలకి వచ్చేది. ఏం చేయగలడు బి.యన్.రెడ్డిగారు. లోలోపల బాధతో విసుక్కునేవాడు. ఆమెకోసం అందరూ వెయిట్ చేయాలి గదా- షూటింగ్ చేయాలంటే!



ప్రొడ్యూసరు సగంతి అంతేమరి! ఆర్టిస్టుల మీద కోప్పడడానికి వీలులేదు! కోప్పడితే సినిమా చెడుతుంది. పైగా బాగా చనువు గల మనిషి!

ఆమె ఏ నాలుగు గంటల కోవచ్చి 'సారీ, రెడ్డిగారూ! డాక్టరుగారు ఆలస్యంగా వచ్చారండీ!" అంటూ రోజూ ఏవేవో కారణాలు చెప్పేది!

"ఫరవాలేదమ్మా" అనాలి గదా ప్రొడ్యూసరు!

ఒకరోజు బి.యన్. రెడ్డిగారు అన్నారు. "నరసరాజుగారూ! మధ్యాహ్నం కారులో ఆమెతో మీరు గూడ వెళ్లండి. (కన్నాంబ గారి యింటిదగ్గరే మా ఇల్లు. త్యాగరాయనగర్‌లో ఆమె 'మొలనీ' రోడ్డులో ఉండేది. నేను పక్కనే థామస్ రోడ్డులో ఉండేవాణ్ణి)

"మీరు వెళితే ఆమె మీతో పాటు రావాలి గదా!" అని నన్నుగూడ ఆమెతో పంపించాడు.

నేను కన్నాంబగారితో "కన్నాంబగారూ! నాకు ఇక్కడ హోటలు భోజనం సరిపడడంలేదు! నేను గూడ మీతో వస్తాను" అన్నాను.

"నిజమేనండి! రండి! వెళదాం!" అని ఇద్దరం కారులో వెళ్లాం!

ఆమెని ఆమె ఇంట్లో 'డ్రాప్' చేసి నేను వెళ్లి భోజనం చేసి అరగంటలో తిరిగి ఆమె ఇంటికి వచ్చాను.

ఆమె నన్ను చూచి ఆశ్చర్యపోయి "అప్పుడే వచ్చారా?" అని "ఉండండి! పదినిమిషాల్లో వచ్చేస్తాను" అని లోనికి పోయి ఇంజక్షన్ తీసుకుని వచ్చింది. నేను హాల్లో కూర్చుని ఉన్నాను!

లోలోపల ఏమనుకుంటుందో ఏమో "ఈయన ఎక్కడ దొరికాడు నా ప్రాణానికి!" అనుకుందో ఏమో హడావుడిగా వచ్చింది. ఎలాగో మూడుగంటలలోపే స్టూడియోకి వెళ్లాం!

బి.యన్.రెడ్డిగారు చాలా సంతోసించారు. "చూశారా! మీరున్నారు గాబట్టి మిమ్మల్ని వెయిట్ చేయించడం ఇష్టంలేక త్వరగా వచ్చేసింది! రోజూ యిలాగే చేద్దాం" అన్నారు.

మరునాడు మళ్లీ అలాగే మధ్యాహ్నం ఇద్దరం కారులో వెళ్లాం భోజనానికి!

ఆమెని ఇంటిదగ్గర డ్రాప్ చేసి నేను వెళ్లి భోజనం చేసి బయటికి వచ్చేటప్పటికి ఇంటిముందు కారు లేదు. కారు కంపెనీదే! డ్రయివరూ మావాడే! సామాన్యంగా నాకు చెప్పకుండా పోడు! ఏమయినాడు? ఎక్కడికి వెళ్లాడు?" అని నేను మా ఇంటి వరండాలో కూర్చున్నాను. రెండు అయింది! రెండున్నర, మూడు, మూడున్నరయింది. డ్రయివరు వచ్చాడు కారులో!

నాకు కోపం వచ్చి "కన్నయ్యా? ఎక్కడికెళ్లావ్? నాతో చెప్పనక్కరలేదా?" అన్నాను.

"లేదండి! కన్నాంబ గారు మిమ్మల్ని డ్రాప్ చేసి వెంటనే తనయింటికి రమ్మంది! వెళ్లాను" అన్నాడు.

కారు మాఇంటి దగ్గరవుంటే నేను భోజనంచేసి అరగంటలో వెళ్లి గొంతుమీద కూర్చుంటానుగదా! అందుకని ఆమె ఈ ప్లాన్ వేసింది. తను రెడీ అయిన తరువాత నాకు కారుపంపిందన్నమాట! నేను వెళ్లి ఆమెను పికప్ చేసుకుని స్టూడియోకి వెళ్లేసరికి నాలుగయింది.



కారుదిగి షూటింగ్ ఫ్లోర్ దగ్గరికి వెళుతూ దూరంగా రెడ్డిగారిని చూచి కన్నాంబ గారు నాతో మెల్లగా "రండి! రండి. రెడ్డిగారు కోపంగా వున్నారు" అనంటూ ఫ్లోర్‌లోకి వెళుతూ అక్కడున్న వాళ్లతో "రండి! రండి! నాలుగు గంటలయిపోయింది." రండి! రండి!" అని వాళ్లని తొందరపెడుతూ లోనికి వెళ్లింది. వాళ్లు ఆలస్యం చేసినట్టు! తరువాత రెడ్డిగారు నన్ను అడిగారు "ఏమిటి? ఇంత ఆలస్యంగా వచ్చారు?" అని

నేను నవ్వుతూ! "అయ్యా! మనలాంటివాళ్లని ఎంతమందిని చూసిందో ఆవిడ! ఆమె ముందు మన తెలివితేటలేమీ పనిచేయవు!" అని జరిగిందంతా వివరంగా చెప్పాను.

బి.యన్. నిస్సహాయంగా "Incorrigible lady" అని కోపం దిగమింగుకున్నాడు.

సెట్‌లో ఉన్నప్పుడు గూడ కన్నాంబగారు అందరినీ నవ్విస్తూ, చలాకీగా ఉండేది! మంచి ఆర్టిస్టు! డైలాగ్స్ బ్రహ్మాండంగా చెప్పేది! తెలుగే కాదు, తమిళంలోగూడ ఆవిడ డైలాగ్స్‌కి ప్రేక్షకులు చప్పట్లు కొట్టేవారు. అందుకే నేను ఫ్రెండ్స్‌తో చెబుతుంటాను. "వాళ్ల అనుభవాలముందు మనం ఎంతండి! వాళ్లు లైఫ్ చూశారు!"

కన్నాంబగారు స్టేజి నాటకాల నుంచి సినిమాలకి వచ్చింది. ఎన్ని కష్టాలు పడిందో! ఎంతమందిని చూసిందో! ఆమె కడారు నాగభూషణంగారు భార్యాభర్తలుగా ఒకే కంపెనీలో వున్నా నాగభూషణంగారికి వేరే భార్య, పిల్లలుఉన్నారు.

కన్నాంబగారికి పిల్లల్లేరు! ఒక పిల్లను పెంచుకుని పెళ్లి చేసింది.

ఎందుకోమరి! చివరికి చనిపోయేముందు వీలునామా రాసింది. నాగభూషణంగారికి ఏమీ లేకుండా రాసింది. కన్నాంబగారు చనిపోయిన తరువాత పాపం నాగభూషణంగారు చాలా దీనస్థితిలో ఉంటే

అక్కినేని నాగేశ్వరరావుగారు వాళ్ల పిక్చర్సులో నటించిన అభిమానంతో నాగభూషణంగారికి నెలనెల కొంత డబ్బు పంపే ఏర్పాటు చేశారు. చాలా హెల్ప్ చేశారు.

సినిమాల్లో ఒక్కొక్క ప్రొడ్యూసరు ఒక్కొక్క ఆర్టిస్టు జీవితాలు చెబుతుంటే కాశీమజిలీ కథలు వాటిముందు ఎందుకూ పనికిరావు!

సినిమా రంగంలో నేను చూచిన కొందరు వ్యక్తులు ప్రొడ్యూసర్లు కానివ్వండి - రచయితలు కానివ్వండి, ఆర్టిస్టులు కానివ్వండి, వాళ్ల జీవితాలమీద నేను కొన్ని వ్యంగ్య రచనలు రాశాను.

కల్పిత కథలేననుకోండి! 1976లో నేను ఒక ప్రొడ్యూసరు దగ్గరకు వెళ్లినట్టు అప్పటికి నేను నిజంగానే సినిమా రంగప్రవేశం చేసి పాతిక సంవత్సరాలయినందున ఆ సందర్భాన్ని పురస్కరించుకుని నాకు చిన్న సన్మానం చేయమని ఆ ప్రొడ్యూసర్ని అడిగినట్టు-

ఆ ప్రొడ్యూసరు "ఎందుకు చేయాలయ్యానీకు సన్మానం?" అని అడిగినట్టు -

"అదేమిటండీ! మీరు ఎందరో హీరో హీరోయిన్లకు మీ చేతుల మీద ఎన్నో ఘనంగా సన్మానాలు చేశారుగదా! నాకు గూడ చేస్తే ఏంపోతుంది?" అని నేను అడిగినట్టు.

ఆయన "హీరోహీరోయిన్లకు సన్మానాలు చేశామంటే వాళ్లమీద ప్రేమ ఉండిచేశానా? వాళ్లతో నాకు అవసరం ఉంది కాబట్టి చేశాను" అంటాడు అని పైగా "నీతో నాకేమిటి అవసరం?" అని అంటాడు.

"అదేమిటండి? సినిమాకి కథే ప్రాణం అని మీరే ఎన్నోసార్లు ఎన్నో వేదికలమీద మహా ఉపన్యాసాలు చేశారుగదా..."



"సినిమాకి 'కథ' ప్రాణం అన్నానుగాని, రచయిత ప్రాణం అనలేదుగా!" అని ఆయన -

"కథ రాసేది రచయితేగదండి" అని నేను.

"ఎవడా చెప్పింది? సినిమాకి కథ రాయడానికి నీలాంటి మహా రచయితలే కావాలా? ఇప్పుడు నేను సినిమా తీస్తున్నాను. దీనికి కథ మా అమ్మాయి రాసింది. డైలాగులు గూడ నువ్వు ఉసూరుమంటావని నీచేత రాయించానుగాని, ఆమాత్రం నేను రాసుకోలేనా? ఇప్పుడు మనం మాట్లాడుకుంటున్నట్లు "వచ్చావు" 'పోయావు' అనేగదా! దానికి పెద్ద పాండిత్యం కావాలా?" అని ఆయన అన్నట్టు.

"అదేమిటండీ! పాతికేళ్లనుంచి సినిమారంగానికి సేవ చేస్తున్న నన్ను అంత తేలిగ్గా తీసేస్తున్నారు?...."

"ఏమిటయ్యా నువ్వు చేసిన సేవ? రాస్తున్నావు, డబ్బు తీసుకుంటున్నావు! డబ్బు తీసుకుని చేసే పని 'సేవ' అనరయ్యా! మా ఆఫీసు పక్కనే డాక్టరున్నాడు గదా! పెద్ద సర్జను! ఎన్నో పెద్ద పెద్ద ఆపరేషన్లు చేసి ఎందరి ప్రాణాలో కాపాడాడు! అది ఆయన వృత్తి! డబ్బు తీసుకుంటున్నాడు. ఆయన తనకు సన్మానం చేయమని ఎవరినైనా అడిగాడా? ఎవరైనా చేశారా?

అది అట్లావుంచు! నేనొక ప్రశ్న అడుగుతా జవాబు చెప్పు మేము అంటే ప్రొడ్యూసర్లం. ఎందరో హీరోలకీ, హీరోయిన్లకి, డైరెక్టర్లకి ఇన్ని సన్మానాలు చేశామే ప్రొడ్యూసర్లలో ఒక్కడికి మీలో ఎవడైనా సన్మానం చేసిన పాపాన పోయాడా?

ప్రొడ్యూసరే లేకపోతే మీరంతా ఏమవుతారయ్యా! అటువంటి ప్రొడ్యూసరు పిక్చరు ఫ్లాప్ అయి దివాలా తీసి తిండికి గూడ లేకుండా రోడ్ల వెంట తిరుగుతుంటే మీలో ఒక్కరైనా అతనికి సన్మానం చేశారా? సన్మానం సంగతి దేవుడెరుకు వాడిని పిలిచి కప్పు కాఫీ యిచ్చిన వాళ్లున్నారా?" అన్నాడు.

నేను "నిజమేనండి! ఆమాట నిజమే! కొందరు ప్రొడ్యూసర్లు పాపం తిండికి గూడలేక బికారులైపోయినమాట నిజమే!" అన్నాను.

ఈ మాట రాసినప్పుడు నిజంగా నాకు కడారు నాగభూషణంగారే దృష్టిలో ఉన్నారు. ఆయన మనిషిగా చాలామంచివాడు. చివరి రోజుల్లో నాగేశ్వరరావుగారు ఆర్థిక సహాయం చేశారుగాని లేకపోతే ఆయన ఏమైపోయేవాడు.

నేను 'ఈనాడు' దిన పత్రికలో వారం వారం "అక్షింతలు" రాసేవాణ్నిగదా! అందులోగూడ ఎవర్నో దృష్టిలో పెట్టుకుని పేరుమార్చి కొన్ని కొన్ని పాత్రలు సృష్టించి రాసేవాణ్ణి! రాస్తే "ఎవరండీ ఆ ఫలానా వ్యక్తి" అని పాఠకులు ఉత్తరాలు రాసేవారు!

పైన రాసిన విషయమే ఉందనుకోండి రచయితగా నేనే ఆ రచయితనైనట్టు నేను అమాయకుణ్ణి అయినట్టు సన్మానం కోసం దేబిరించినట్టు రాయాలి గాని ఎవరి మీదనో రాయగూడదు గదా!

అసలు నాకు సన్మానాలమీద మొదట్నుంచీ మోజు లేదు! కొన్ని సాంస్కృతిక సమాజాలున్నాయి! సన్మానాలు చేయడమే వాళ్లపని! అది వాళ్ల వ్యాపారం! ఎవడో పారిశ్రామికవేత్త లేక వ్యాపారి ఫైనాన్స్ చేస్తాడు. సన్మానం చేయించుకోడానికి ఎవడో ఒక "బలిపశువు" కావాలి వాళ్లకి!

అలా నేనెవరో తెలియకుండానే నాకు సన్మానం చేస్తామని ఒక సమాజం వారు వచ్చినట్టు కల్పించి ఒక సెటైర్ రాశాను.



ఆ కథ ఏమిటంటే -

మదరాసులో ఒక రోజు ఉదయం నాకు ఫోన్ వస్తుంది.

"మేం హైదరాబాదునుంచి వచ్చామండి. మీతో మాట్లాడాలి! ఎప్పుడు రమ్మంటారు?"

ఎవరో ప్రొడ్యూసర్లయి ఉంటారన్న ఆశతో "ఇప్పుడే రండి! నేను ఖాళీగానే ఉన్నాను" అని ఫోన్‌పెట్టేసి గబగబ వంట గదిలోకి వెళ్లి నా భార్యతో "ఎవరో హైదరాబాద్ నుంచి వస్తున్నారు! ఎంతమంది వస్తారో చూచి కాఫీలు పంపించు" అని చెప్పి వచ్చి హాల్లో కూర్చున్నాను.

వాళ్లు వచ్చారు! వాళ్లు ప్రొడ్యూసర్లుకాదు! నాకు హైదరాబాద్‌లో సన్మానం చేస్తామన్నారు. పోనీలే సన్మానంగూడ మంచిదే గదా అనుకున్నాను. వాళ్ల సమాజం పేరు చెప్పారు. ఒక సాంస్కృతిక సంస్థ.

ఒక పెద్ద ఆల్బం చూపించారు. ఇదివరకు వాళ్లు పెద్ద, పెద్ద ప్రముఖులకు సన్మానాలు చేసిన ఫోటోలన్నీ ఉన్నయ్ అందులో!

నేను చాలా సంతోషించాను! వాళ్లలో ఒకాయన సెక్రటరీకాబోలు ఒక కాగితం కలం తీసుకుని నా బయోడేటా రాసుకోవడానికి

"మీరు ఇప్పటికి ఎన్ని సినిమాలు తీశారండీ?" అన్నాడు

"అబ్బే! నేను సినిమాలు తీయలేదండి! ఆయన డి.వి.యస్. రాజుగారు! ప్రొడ్యూసరు" అన్నాను.

"ఓహో! ఆయనా? డి.వి.యస్. రాజుగారా.." అని సర్దుకుని మళ్లీ

"మీరు సినిమా రంగానికి రాకముందు లాయరుగా ప్రాక్టీసు చేశారుగదూ?"

"అబ్బే! ఆయన దువ్వూరి నరసరాజుగారండి! ఆయన ఇప్పుడులేరు! పోయారు" అన్నాను.

"ఓహో!... ఆయన దువ్వూరి  నరసరాజుగారా? మీకు ఇంటర్నేషనల్ కథల పోటీలో మీ కథకి బహుమతి వచ్చింది గదూ?"

"అది నాకు గాదండి పాలగుమ్మి పద్మరాజుగారికి."

"ఓహో!.. ఆయన పద్మరాజుగారు కదూ." ... అని ఆయన నీళ్లు నములుతుంటే

నేను "రేపు సన్మాన సభలో నన్ను గురించి మాట్లాడే వారు. నా జీవిత వివరాలు తెలిసిన వాళ్లని మాట్లాడమనండి."

"అలాగే అలాగే మీరే మీ బయోడేటా రాసివ్వండి! అలాగే తప్పులు లేకుండా మాట్లాడిస్తాం!

మీకు ఒక బిరుదు గూడ ఒకటివ్వాలనుకుంటున్నాం.

"ఏం బిరుదు ఇవ్వాలనుకుంటున్నారు?"

"మీరు హాస్యం బాగా రాస్తారు గనక మీకు "హాస్యాస్పదబ్రహ్మ" అని బిరుదు ఇవ్వాలనుకుంటున్నాం."

నాగుండె గతుక్కుమన్నది. తమాయించుకుని "ఎవరైనా భాషాజ్ఞానం ఉన్నవాళ్లను సంప్రదించి ఇవ్వండి బిరుదు" అన్నాను. ప్రాథేయపూర్వకంగా.



"అలాగే! పోనీ మీకు ఏం బిరుదు కావాలో మీరే చెప్పండి! మీరు కోరుకున్న బిరుదే ఇస్తాం" అన్నాడాయన.

నేనేం మాట్లాడలేదు.

మళ్లీ ఆయనే "మీకు ఒక పర్సు గూడ బహూకరించాలని నిర్ణయించాం." అన్నాడు.

"సంతోషం" అన్నాను.

"మేము వచ్చేటప్పుడు హడావుడిగా బయలుదేరి వచ్చాం! అనుకోకుండా ఇక్కడ ఖర్చులు ఎక్కువయినై. ఒక్క వెయ్యి రూపాయలివ్వండి! మీకు ఇవ్వబోయే పర్సుతో పాటు కలిపి తిరిగి యీ వెయ్యి రూపాయలు ఇచ్చేస్తాం!"

నాగుండెల్లో రాయిపడ్డా అది నా ముఖంలో కనబడుతుందేమోనన్న భయంతో క్షణం కూడా ఆలోచించకుండా లేచి వంటగదిలోకి వెళ్లి నా భార్యతో "నా చెక్‌బుక్ ఎక్కడుంది?" అని అడిగాను. మా సంభాషణంతా ఆమె వింటూనే వుంది.

"నన్నడుగుతారేం? మీ టేబుల్ డ్రాయర్‌లోనే ఉంటుంది! చూడండి!" అన్నది కాస్త రుసరుసలాడుతూ.

"కాఫీలు చేశావా?"

"లేదు! ఇక చెయ్యాలి!"

"అక్కర్లేదులే" అని చెప్పి నాగదిలోకి వెళ్లి చెక్కుబుక్ తీసుకొచ్చి వెయ్యిరూపాయలకు సెల్ఫ్ చెక్కు రాసి ఆయనకిచ్చాను.

ఆయన థాంక్స్ చెప్పి లేచి వెళుతూ

"హైదరాబాద్ వెళ్లి మీ సన్మానం తేదీ ఫోన్‌చేసి వివరాలు ఉత్తరం రాస్తాను!" అని వాళ్లందరూ వెళ్లిపోయారు.

నాభార్య నా దగ్గరకు వచ్చి

"డబ్బిచ్చి సన్మానం చేయించుకుంటారా? ఆత్మగౌరవం ఉన్నవాళ్లు చేసే పనేనాఇది?" అన్నది బాధతో!

"ఏం చేయమంటావు? సన్మానం చేస్తామంటే 'సరే' నని కమిట్ అయినాను. డబ్బు అడిగేసరికి 'సన్మానం వద్దు' అంటే ఏం బాగుంటుంది?" అని నీళ్లు నమిలాను.

"ఈ వెయ్యి రూపాయలతో పోరు. వాళ్లు మీదగ్గర ఇంకా గుంజుతారు" అన్నదామె.

"అబ్బే! అలా జరగదులే" అన్నాను.

"జరగదని ఏమిటి గ్యారంటీ?"

"జరగదని చెప్పానుగా!"

"అంత గట్టిగా ఎలా చెప్పగలరు?

"నాకూ కాస్త తెలివితేటలున్నయ్! ఎంత చెడ్డా సీనియర్ రచయితని! నన్ను మరీ తేలిగ్గా అంచనా వేయకు?"

"వాళ్లు మళ్లీ వస్తారు?"



"రారు!"

"వస్తారు చూడండి."

"రారు! కారణం చెప్పమంటావా? నా బ్యాంకు అకౌంటులో బాలెన్స్ లేదు! నేనిచ్చిన ఈ చెక్కు చెల్లదు! మళ్లీ ఏ ముఖం పెట్టుకుని వస్తారు నా దగ్గరికి? నువ్వేం భయపడకు! వాళ్లు రానూరారు! ఈ సన్మానం జరగనూ జరగదు! పద! భోజనం వడ్డించు!" అని లేచి లోనికి వెళ్లాను.

ఇప్పుడు జరిగే సన్మానాలమీద అప్పుడే అలా 'సెటైర్ రాశాను' అప్పుడే ఏదో పత్రికలో ప్రింటు అయింది గూడా!

ఇలాగే సన్మానం చేస్తామని చెప్పి కమిట్ చేయించి వెంటనే డబ్బు అడిగిన సంఘటన ఒకసారి నా కళ్లముందే ప్రముఖ చిత్ర నిర్మాత దర్శకుడు బి.యన్. రెడ్డిగారికి జరిగింది.

1974-75 ప్రాంతంలో ఒకరోజు బోగ్‌రోడ్డులో ఆయన ఇంట్లో నేనూ ఆయన కూర్చుని ఏవో కబుర్లు చెప్పుకుంటున్నాం. నలుగురు తమిళులు లోపలికి వచ్చి ఆయనకు నమస్కరించారు. ఆయన వాళ్లను కూర్చోమన్నారు! వాళ్లు సోఫాలో కూర్చున్నారు. వాళ్ల చేతుల్లో ఏవో ఫైల్స్ - ఆల్బంలు ఉన్నయ్! ఎవరో చందాల కోసం వచ్చారనుకున్నాను.

వాళ్లు మొదలు పెట్టారు. "రెడ్డిగారూ! మీరు తెలుగు వారైనా కొన్ని దశాబ్దాలుగా మదరాసులోవుండి 'స్వర్గసీమ', 'మల్లీశ్వరి' లాంటి గొప్ప సినిమాలు తీశారు. వాటిని తమిళ ప్రజలు చూచి ఎంతో మెచ్చుకున్నారు. మదరాసులో సినిమా పరిశ్రమకు మూల పురుషులలో మీరు ముఖ్యులు! తమిళనాడుకు మీ సినిమాల ద్వారా ఎంతో పేరు ప్రఖ్యాతలు సంపాయించి పెట్టారు.

మీ ప్రతిభకు గుర్తింపుగా మీకు మా సమాజం తరపున ఘనంగా సన్మానం జరపదలుచుకున్నాం" అని వాళ్ల చేతుల్లో ఉన్న ఆల్బమ్ ఒక్కొక్కటీ తీసి ఆయనకు చూపడం మొదలెట్టారు!

ఆ ఆల్బమ్‌లో తమిళ ప్రముఖ నాయకులు కామరాజ్‌నాడార్, భక్తవత్సలం, అన్నాదొరై, సి. రాజగోపాలాచారి, మొదలైనవారికి చేసిన సన్మానాల ఫోటోలు ఉన్నయ్!

రెడ్డిగారు చాలా సంతోషంతో అవన్నీ 'తీరిగ్గా చూశారు' తరువాత ఇంకా వాళ్లు రెడ్డి గారి ప్రతిభను పొగిడి చేయబోయే సన్మానం వివరాలు వేదిక, అందులో పాల్గొనబోయే ప్రముఖ తమిళ నాయకుల గురించి చెప్పారు.

ఈలోగా లోపలనుంచి కాఫీలు వచ్చినై! అందరం సేవించాం! అరగంటకు పైగా ఈ తతంగం జరిగింది.

"ముందు కొన్ని చిల్లర ఖర్చులకు కొంత డబ్బు అవసరం వుంటుంది! ఒక్క వెయ్యిరూపాయలు ఇప్పించండి!" అని అడిగారు.

మారుమాటాడలేక రెడ్డిగారు చెక్కురాసియిచ్చి పంపించారు. వాళ్లు వెళ్లిపోయాక నేను నవ్వుతూ రెడ్డిగారిని అడిగా! ఏమిటి సన్మానానికి డబ్బివ్వడమేమిటి?" అని ఆయన అన్నారు. "ఏం చేయను! సన్మానానికి ఒప్పుకుని డబ్బు అడిగినప్పుడు ఏం చేయాలి? సన్మానం వద్దులెమ్మంటే ఏం బాగుంటుంది?" నాలాగా కాకుండా ఆయన బ్యాంకు అక్కవుంటులో బాలెన్స్ ఉంది. ఆ చెక్కు వాళ్లు కాష్ చేసుకున్నారు! మళ్లీ వాళ్ల జాడతెలియలేదు.

ఆ సంఘటన స్ఫూర్తితో మరి కొంత కల్పించి నేను పైన చెప్పిన సెటైర్ రాసి పత్రికకు పంపించాను.



నాకు అప్పుడు, ఇప్పుడు, ఎప్పుడూ ఒక ధర్మసందేహం!

"సినిమా ఫెయిలయితే నష్టం ఎవరికి? డబ్బు ఎవరిదిపోతుంది?" ఆ సినిమా ప్రొడ్యూసరు కనబడ్డప్పుడు అడుగుతాం!

"ఏమండీ! పాపం! మీ పిక్చరు ఫెయిలయిందట! నష్టం ఏమాత్రం?" అని.

ఆయన వెంటనే "అబ్బెబ్బె! మనకేం నష్టం లేదండి! రిలీజుకు ముందే అన్ని జిల్లాలు అమ్మేశాంగా! మనకి కాస్తో కూస్తో లాభమేగాని నష్టం ఏమీలేదు!" అంటాడు.

జిల్లాలు కొన్నవాణ్ణి అడిగితే "అబ్బెబ్బె! మనకేమీ నష్టం లేదండి! ముందుగానే థియేటర్ల వాళ్ల దగ్గర అడ్వాన్సులు తీసుకున్నాం గదండి! మనం కొన్నడబ్బు మనకు ముందే వసూలయిందండి."

అడ్వాన్సు ఇచ్చిన థియేటరు వాణ్ణి అడిగితే "అబ్బె! మనకేంనష్టం లేదండి! కమ్మర్షియల్ టాక్సు డిపార్ట్‌మెంటు వాళ్లకి మనకి ఏవో లావాదేవీలుంటయ్ గదండి! వాళ్లు మనతో బాగా కోఆపరేట్ చేస్తారండి! కాబట్టి మన డబ్బు మనం ఎలాగో రాబట్టుకుంటామండి" అంటాడు.

అసలు ఫేక్ట్ ఏమిటంటే డబ్బుపోయేది సినిమా చూసిన ప్రేక్షకుడిది! వాడు కొన్న టికెట్ డబ్బు ఎవడూ వాపస్ యివ్వడుగదా!

మరి సినిమా తీయడానికి అయిన ఖర్చు ఎవరు భరిస్తున్నట్టు! ఈ మాటే ఒక ప్రొడ్యూసర్ని అడిగితే ఆయన కాస్త కోసంగా -

"డబ్బు ఎవరిది పోతే మీకెందుకండి! ప్రొడ్యూసరుకి నష్టం వస్తే మీరు రచయితగా తీసుకున్న డబ్బు తిరిగి యిస్తారా? అలాంటప్పుడు ఎందుకు మీ యక్షప్రశ్నలు?

మా ఇబ్బందులు మాకుంటయ్! "పిక్చరు ఫెయిలయింది. డబ్బు మొత్తం పోయింది 'మొర్రో' అని గోలపెడితే-

మరునాడే అప్పులవాళ్లు వచ్చి వాకిట్లో కూర్చుంటారు. తరువాత పిక్చరు తీయాలంటే డబ్బు పెట్టుబడి పెట్టేవాడు పెట్టుబడి పెట్టడు. అప్పు పుట్టదు! మాకు ఇన్ని బాధలుంటయ్!" అన్నాడు.

అందుకే చూశారా? failure picture తీసిన ప్రొడ్యూసరు వెంటనే రెండు పిక్చర్లు అనౌన్స్ చేస్తాడు. అప్పులవాళ్లు కాస్త ఆగుతారు! సక్సెస్‌ఫుల్ పిక్చర్ తీసిన ప్రొడ్యూసరు next picture announce చేయడానికి ఆరునెలలు ఆలోచిస్తాడు. వచ్చిన లాభం పోతుందేమోనని భయం.

ఇది ఒక పత్రికకి రాస్తే వాళ్లు ప్రింటు చేశారు! అది చదివిన ఒక ప్రొడ్యూసరు నాకు ఫోన్ చేసి -

"నరసరాజుగారూ! మీరు చివరన రాశారే అప్పులవాళ్లు వచ్చి వాకిట్లో కూర్చుంటారనీ Next picture కి అప్పుపుట్టదని! అది కరెక్ట్!" అన్నాడు.

కాశీమజిలీకథల్లాగ ఇవీ సినిమా కథలు!

అన్ని విధాల బాగా బ్రతికిన వాళ్లకి గూడ జీవితం ఆఖరి దశ ముగింపు ఎలా ఉంటుందో ఊహకందని విషయం!



పింగళి నాగేంద్రరావుగారు సినిమారంగంలోనూ, నాటకరంగంలోనూ ప్రసిద్ధ రచయిత - పండితుడు.

ఆయనది మచిలీపట్టణం (బందరు). బందరులో డి.వి. సుబ్బారావుగారు ప్రసిద్ధ రంగస్థల నటుడు. ఆయన 'హరిశ్చంద్ర' నాటకం ఆంధ్రదేశంలో సుప్రసిద్ధం. ఆయన బందరులో ఇండియన్ డ్రమెటిక్ కంపెనీ అని ఒకనాటక సమాజాన్ని నడిపేవాడు. ఆ సమాజంలో పింగళినాగేంద్రరావుగారు నాటక కర్త, మేనేజరు గూడ. అంతకుముందు నాగేంద్రరావుగారి జీవిత విశేషాలు నాకు బాగా తెలియవు. 'రారాజు' 'వింధ్యరాణి' అని రెండు నాటకాలు రాశారు నాగేంద్రరావు గారు. డి.వి. సుబ్బారావుగారు ఆ నాటకాలు ఆంధ్రదేశమంతటా ప్రదర్శించారు. 'వింధ్యరాణి'లో ప్రసిద్ధ సినిమా కళాదర్శకుడు తోట వెంకటేశ్వరరావు (తోట తరణి తండ్రి) కథానాయిక ఆడవేషం వేసి బ్రహ్మాండంగా ఒప్పించేవాడు. అతను బాగా పాడేవాడు గూడ.

1940 తరువాతనుకుంటాను. "భలేపెళ్లి", "తారుమారు" అని జంట సినిమాలు తీశారు. ప్రొడ్యూసరు ఎవరో తెలియదు. జగన్నాథ్ దర్శకుడు. 'భలేపెళ్లి'కి నాగేంద్రరావుగారు మాటలు, పాటలు రాశారు. డా॥ శివరామకృష్ణయ్య గారు, గరికపాటి రాజారావు గారు నటించినట్టు గుర్తు!

'తారుమారు' కొడవటిగంటి కుటుంబరావుగారి కథ.

అది అలావుండగా నాగేంద్రరావుగారి సినిమారంగప్రవేశం "వింధ్యరాణి" సినిమా ద్వారా జరిగింది. 1947 ప్రాంతం అనుకుంటాను. అందులో డి.వి. సుబ్బారావుగారే నటించారు. సినిమా ఫెయిలయింది. నాగేంద్రరావుగారికి తిరిగి బందరు వెళ్లాలంటే కాస్త బెరుకు! "సినిమాకి వెళ్లాడు! వచ్చాడు!" అని సాటివాళ్లు ఎగతాళి చేస్తారనే అనుమానం భయం గూడా ఉండవచ్చు.

అదే సమయంలో కె.వి.రెడ్డిగారు కొత్త రచయిత కోసం వెతుకుతున్నారు. అంతకు ముందు ఆయన "భక్త పోతన", "యోగి వేమన" రెండు సినిమాలు తీశారు. ఆరెంటికీ సముద్రాల రాఘవాచార్యులుగారే రచయిత.

కె.వి.రెడ్డిగారికి ఎప్పుడూ exclusive writer కావాలి. అంటే తన సినిమా పూర్తి అయ్యేవరకు రచయిత మరో సినిమాకు పనిచేయగూడదు (నేను ఆయన దర్శకత్వంలో వాహినీ 'పెద్దమనుషులు'కు అన్నపూర్ణ పిక్చర్సు మొదటి చిత్రం "దొంగ రాముడు" కు అలాగే పనిచేశాను)

"యోగి వేమన" తరువాత రెడ్డిగారే సముద్రాలతో "ఆచారీ! పిల్లలు గలవాడివి! ఫ్రీలాన్సర్‌గా ఏ సినిమాలకయినా రాసుకో!" అని పంపించేవారు.

రెడ్డిగారు ఒక జానపద చిత్రం తీయాలన్న ప్రయత్నంలో ఉన్నారు. ఆ విషయం ఆయనకు అసోసియేట్ డైరెక్టరుగా వాహినీలో పనిచేస్తున్న కమలాకర కామేశ్వరరావుగారికి తెలుసు!

కామేశ్వరరావుగారి స్వస్థలం గూడ బందరే! నాగేంద్రరావుగారితో బాగా పరిచయం! కామేశ్వరరావుగారు నాగేంద్రరావుగారిని తీసుకెళ్లి కె.వి.రెడ్డిగారికి పరిచయం చేశారు! ఆయన రాసిన నాటకాలను గురించి ఆయన పాండిత్యాన్ని గురించి చెప్పారు!

అలా వాహినీ వారి "గుణసుందరి కథ"కు నాగేంద్రరావు గారు మాటలు-పాటలు రాశారు. ఆ పిక్చరు మంచి హిట్టయింది.



ఆ తరువాత రెడ్డిగారు నాగేంద్రరావుగారు విజయా ప్రొడక్షన్స్ నాగిరెడ్డి, చక్రపాణిగార్ల "పాతాళభైరవి" కి పనిచేశారు.

అప్పుడు నాగేంద్రరావుగారు విజయా ప్రొడక్షన్సుకు పర్మినెంట్ రైటర్‌గా నెలజీతం మీద ఉద్యోగం ప్రారంభించారు!

ఆ తరువాత కె.వి.రెడ్డిగారు విజయా ప్రొడక్షన్సుకు తీసిన "మాయాబజార్", "జగదేక వీరునికథ", "హరిశ్చంద్ర", "ఉమా చండీ గౌరీ శంకరుల కథ" సినిమాలకు మాటలు-పాటలు రాశారు!

చక్రపాణిగారు తీసిన "పెళ్లిచేసి చూడు", "మిస్సమ్మ", "అప్పుచేసి పప్పుకూడు", "గుండమ్మ కథ" చిత్రాలకు గూడ పాటలు నాగేంద్రరావుగారే రాశారు!

ఆయనకు నెలజీతమేగాక - పాటలు రాసినందుకు వేరే పారితోషికం ఇచ్చేవారు.

జయంతి పిక్చర్సు పేరుతో కె.వి.రెడ్డిగారు, పి.ఎస్.రెడ్డిగారు, పట్టాభిగార్లు తీసిన "శ్రీకృష్ణార్జునయుద్ధం", "పెళ్లినాటి ప్రమాణాలు", "భాగ్యచక్రం" సినిమాలకు గూడ నాగేంద్రరావుగారే మాటలు-పాటలు రాశారు!

ఇవిగాక బయట ప్రొడ్యూసర్లకు "మహాకవి కాళిదాసు", "శ్రీకృష్ణవిజయం", "ప్రమీలార్జునీయం", "మహామంత్రి తిమ్మరుసు" వగైరా చిత్రాలకు గూడ రచనలు చేశారు. నాగేంద్రరావుగారు బ్రహ్మచారి! తల్లి దాదాపు 90 ఏళ్లు బ్రతికింది. తల్లికి సేవచేయడానికి, ఇంట్లో వంటచేయడానికి 'అనసూయమ్మ' అని ఒకామెను నియమించుకున్నారు. మొదట్లో చాలారోజులు త్యాగరాయ నగరు, రామానుజం వీధిలో అద్దె ఇంట్లోనే ఉండేవారు.

1960 ప్రాంతంలో అనుకుంటాను బాగా జ్ఞాపకం లేదు. నాగేంద్రరావుగారు, మాధవపెద్ది గోఖలే (కళాదర్శకుడు) ప్లేబాక్ గాయకుడు మాధవపెద్ది సత్యం (వాళ్లిద్దరూ సోదరులు) డా॥ గాలి బాలసుందరరావుగారు (తరువాత సినీనటుడు చంద్రమోహన్‌కు పిల్లనిచ్చి పెళ్లి చేసి మామగారైనారు) వీళ్లూ మరికొందరు త్యాగరాయనగరులో గోపతి నారాయణ స్వామి రోడ్డులోని నార్త్ క్రెసెంటు రోడ్డులో, లక్ష్మీకాలనీ పేరుతో యిళ్లు కట్టుకున్నారు.

అక్కడ ఇల్లు కట్టుకున్న తరువాతనే నాగేంద్రరావుగారి తల్లి మరణించింది. ఆరోజు నాకు బాగా జ్ఞాపకం. నాగేంద్రరావుగారు చిన్న పిల్లవాడిలా ఏడ్చాడు తల్లిగారి మరణానికి.

ఆ తరువాత గూడ వంటమనిషి అనసూయమ్మ కొడుకు రామమూర్తిని, మనమరాలుని పిలిపించి తనఇంట్లోనే పెట్టుకుని రామమూర్తికి వయోలిన్ నేర్పించాడు. అనసూయమ్మ మనవరాలికి కాలేజి చదువు చెప్పించాడు. వాళ్లుగూడ సొంత బంధువుల్లా నాగేంద్రరావుగారిని బాగానే చూశారు.

ఇంతకూ చెప్పవచ్చిందేమంటే "ఉమా చండి గౌరి శంకరుల కథ" ఫెయిల్ కావడంతో నాగిరెడ్డి, చక్రపాణిగార్లు కె.వి. రెడ్డిగారి యూనిట్‌ని (నాగేంద్రరావు గారితో సహా) మూసేశారు. ప్రొడక్షన్ మేనేజర్ని అసిస్టెంటు డైరక్టర్లను గూడ తీసేశారు.

అంతవరకు 1950 నుంచి 1967 -68 వరకు దాదాపు 17,18 సంవత్సరాలు నికర ఆదాయంతో స్థిమితంగా కాలం గడిపిన నాగేంద్రరావుగారికి జీవితంలో 'అభద్రత' తోచిందేమో ఎవరికీ చెప్పకుండా ఘంటసాల వెంకటేశ్వరరావుగారికి తన ఇల్లు అమ్మేశాడు. చాలా చౌకగా! 50 వేల కనుకుంటాను. తను మాత్రమే మేడమీద పోర్షన్‌లో అద్దెకుంటుండేవాడు. క్రింద ఘంటసాలగారు ఎవరికో అద్దెకిచ్చారు.



1969-70 ప్రాంతంలో ననుకుంటాను నాగేంద్రరావుగారికి గొంతులో కాన్సర్ వ్యాధి వచ్చింది. యన్.టి.రామారావుగారు తనకు తెలిసిన డాక్టరుకు ఫోన్‌చేసి నాగేంద్రరావుగారిని వెల్లూరు హాస్పిటలుకు పంపారు చికిత్సకోసం! అప్పటికే రామారావుగారి కొరకు "శ్రీకృష్ణ సత్య", "చాణక్య చంద్రగుప్త" స్క్రిప్టులు రాసేశారు నాగేంద్రరావుగారు. వెల్లూరు హాస్పిటల్లో చికిత్సానంతరం వ్యాధి కొంత మెరుగు పడటంతో నాగేంద్రరావుగారు మదరాసు తిరిగివచ్చేశారు. కొన్నాళ్లకు మళ్లీ వ్యాధిలక్షణాలు ప్రకోపించడంతో కొన్నాళ్లు టి.నగర్‌లోని సుందరరామన్ నర్సింగ్‌హోంలో చికిత్స చేయించుకున్నారు. తరువాత ఇంట్లోనే ఉంటూ మౌంట్ రోడ్డులో ఉన్న ఒక కాన్సర్ హాస్పిటల్‌కి రోజూ వెళ్లి Cobalt చికిత్స ప్రారంభించారు.

నేను అప్పుడప్పుడు వెళ్లి చూచివస్తుండేవాణ్ణి! ఏవో పనులమీద తీరక లేక నేను రెండు మూడు వారాలు నాగేంద్రరావుగారిని చూడడానికి వీలుపడలేదు. ఒకరోజు స్టూడియో నుంచి వస్తూ మధ్యాన్నం నాగేంద్రరావుగారిని చూడ్డానికి ఆయన ఇంటికి వెళ్లాను.

మనిషి బాగానే ఉన్నారు చూడ్డానికి! నన్ను చూడగానే "నిండా నూరేళ్లు మీకు! నేనే మీకు ఫోన్ చేద్దామనుకుంటున్నాను! నాకు cobalt చికిత్స ఒక నెలరోజుల్లో అయిపోతుంది. అయిపోగానే నాకిక్కడ ఏంపని? బందరు వెళ్లిపోతాను! మునిసిపల్ ఛైర్మన్ నా మిత్రుడు కోల్లపర్తి నరసింహారావుకి లెటర్ రాశాను. అతని ఆవరణలోని అవుట్ హౌవుస్ ఖాళీ చేయించమన్నాడు.

అందుకే ఇంట్లోవున్న వస్తువులన్నీ అమ్మేస్తున్నాను. ఇవన్నీ అక్కడికి మోసుకుపోవడమెందుకు? ఇంట్లో వున్న వెండిసామాను సినిమా శతదినోత్సవాలకు యిచ్చిన వెండికప్పులు అన్నీ అమ్మేశాను!

యిక లైబ్రరీవుంది! ఆరుద్రతో చెప్పాను. అమ్మేస్తాను. ఎవరికైనా చెప్పమని అనంతపురంలో ఎవరికో రాశానన్నాడు. అది ఇప్పట్లో జరిగేట్టు లేదు. రెండురోజుల క్రితం మీరు జ్ఞాపకం వచ్చారు! మీకయితే నా లైబ్రరీ బాగా ఉపయోగపడుతుంది! అందుకే మీకు ఫోన్ చేద్దామనుకుంటున్నాను. ఇంతలో మీరే వచ్చారు!" అన్నారు.

నేను మారుమాటాడకుండా విన్నాను! విషయం గ్రహించాను. "నాగేంద్రరావుగారూ! మీరు లైబ్రరీ అమ్మవద్దు! ఒక రైటరు లైబ్రరీ అమ్మడమంటే సాటి రచయితగా నాకు ఏమాత్రం ఇష్టం లేదు! మీకు ప్రస్తుతం డబ్బుకావాలంటే చెప్పండి! నేను ఇస్తాను" అన్నాను.

"ఎంతో అక్కరలేదు! వెయ్యిరూపాయలుంటే చాలు Cobalt treatment ఆగకుండా సాగిపోతుంది. తరువాత బందరు వెళ్లిపోతాను" అన్నారు.

మరునాడు ప్రొద్దున్నే బ్యాంక్‌కి వెళ్లి మనీ డ్రా చేసి నాగేంద్రరావుగారి ఇంటికి వెళ్లాను. డబ్బులు చేతిలోపెట్టాను! పొంగివస్తున్న దుఃఖాన్ని దిగమింగుకుంటూ గట్టిగా కావలించుకున్నారు! కన్నీళ్లు తుడుచుకుని "నరసరాజుగారూ! మీకు కృతజ్ఞత ఎలా చెప్పాలో తెలియడంలేదు! నా దగ్గర డబ్బు ఉంది! కాని బందరు దగ్గర నాకు దూరపు బంధువులకు అప్పు ఇచ్చాను. ఇవిగో ప్రామిసరీనోట్లు!" అని నోట్లుతీసి చూపించారు. "కాని వాళ్లు ఇప్పుడు ఇవ్వలేమన్నారు! వ్యవసాయదార్లు! ధాన్యం అమ్మితేగాని డబ్బురాదు!

డబ్బు కోసం రామకృష్ణా స్టూడియోకి, అనసూయమ్మ కొడుకు రామమూర్తిని యన్.టి.రామారావుగారింటికి పంపాను, నాగిరెడ్డిగారి దగ్గరికి పంపాను. వాళ్లు ఇంటర్వ్యూలే ఇవ్వలేదు! రోజూ చూడడానికి ఇంటికి వచ్చే స్నేహితులు



(పేర్లు చెప్పారు) గూడ డబ్బు అడుగుతానని రావడం మానేశారు! ఈ 'ఎద్దు' 'ఎత్తు' పడింది! ఇకలేవదు అని ఎవరూ ఇంటిఛాయలే రావడంలేదు!" అని వలవల ఏడ్చారు. నాకూ కళ్లలో నీళ్లు తిరిగినయ్!

"ఇంకా కావాలంటే ఫోన్ చేయండి! ఇస్తాను" అన్నాను. 'అలాగే' అన్నారాయన! నేను లేచి వెళ్లిపోయాను!

మూడు నాలుగు రోజుల తరువాత రామమూర్తి ఫోన్ చేశాడు. "సార్! మొన్ననే నాగేంద్రరావుగారిని మౌంట్‌రోడ్‌లో హాస్పిటల్లో చేర్చాము. ఇప్పుడే చెప్పారు!" లాభంలేదు! వారి బంధువులకు కబురు చేయండి" అని చెప్పాడు డాక్టరు!

"ఆయనకి బంధువులెవరున్నారండి" అని రామమూర్తి ఫోన్‌లోనే భోరున ఏడ్చాడు. "నేను వెంటనే బయలుదేరి వస్తున్నాను" అన్నాను.

అప్పుడు సాయంత్రం 6 గంటలయింది. చీకటి పడుతోంది. కారులో గౌతమీ పిక్చర్సు ఆఫీసుకు వెళ్లాను! ప్రొడ్యూసరు రామబ్రహ్మంగారు! ఆయన గూడ బ్రహ్మచారి! నాయర్ వంటవాడు! మంచి కాఫీ ఇచ్చాడు. రామబ్రహ్మంగారితో నాగేంద్రరావుగారి విషయం చెప్పాను.

రామబ్రహ్మంగారు "మహామంత్రి తిమ్మరుసు" ప్రొడ్యూసరు! దానికి నాగేంద్రరావుగారు రచయిత! ఆ అభిమానంతో ఆయన "నేనుగూడ వస్తాను! పదండి" అని ఇద్దరం కారులో మౌంట్ రోడ్‌లోని కాన్సర్ హాస్పిటల్‌కు వెళ్లాం!

కింద అంబులెన్స్ ఉంది. మేడపైకి వెళ్లాం! నాగేంద్రరావుగారి గదిలోకి వెళ్లాం. "ఇంటికి తీసుకెళ్లమన్నారు" అని చెప్పాడు రామమూర్తి!

నాగేంద్రరావుగారు మాకిద్దరికీ నమస్కరించారు! నేను ధైర్యం చెప్పడానికి నాగేంద్రరావుగారితో "డాక్టరుతో మాట్లాడాను నాగేంద్రరావుగారూ! ఏం ఫరవాలేదు! వారం రోజుల్లో రిలీఫ్ ఇస్తుంది అని చెప్పారు" అన్నాను!

ఆయన్ని stretcher మీద కిందకి దింపి అంబులెన్స్‌లో పడుకోబెట్టారు! ఒక నర్సుగూడ ఆయన పక్కన కూర్చుంది!

"ఈ నర్సుని ఈ రాత్రికి ఇంటిదగ్గరే ఉంచుకుంటాం! పర్మిషన్ ఇవ్వండి" అన్నాను డాక్టరుతో!

"అలాగే ఉంచుకోండి!" అన్నాడు డాక్టరు. అంబులెన్స్ వెనకనే నేనూ, రామబ్రహ్మంగారు కారులో నాగేంద్రరావుగారి ఇంటికి వెళ్లాం!

Stretcher మీద ఆయన్ని పైకి తీసుకెళ్లారు! ఆయన గదిలో పండుకోబెట్టారు! ఆయన బాగానే మాట్లాడుతున్నారు! కాకపోతే కాస్త నీరసంగా వున్నారు.

నేనూ, రామబ్రహ్మంగారు ఆయన మంచం పక్కన కూర్చున్నాం! "మీకు ఆలస్యం అవుతోంది! వెళ్లిరండి! నరసరాజుగారూ!" అన్నారు నాగేంద్రరావుగారు (అప్పటికి టైమ్ రాత్రి 9 .30 అయింది)

నేను, రామబ్రహ్మం గారు లేచి హాల్లోకి వచ్చాం! రామబ్రహ్మంగారు జేబులోంచి 500 రూపాయలనోట్లు తీసి రామమూర్తి చేతికిచ్చి "నాగేంద్రరావుగారికి చెప్పవద్దు" అన్నాడు. కాని రామమూర్తి లోనికి వెళ్లి నాగేంద్రరావుగారికి చెప్పినట్లున్నాడు. రామమూర్తి తిరిగివచ్చి "మిమ్మల్ని ఒకసారి లోనికి రమ్మంటున్నారు" అన్నాడు. ఇద్దరం గదిలోకి



వెళ్లాం! నాగేంద్రరావుగారు చేతులెత్తి నమస్కారం చేశారు రామబ్రహ్మంగారికి!

"రేపు ఉదయం వస్తాంలెండి" అని ఆయన దగ్గర సెలవు తీసుకుని నేను, రామబ్రహ్మంగారు వచ్చేశాం!

మరునాడు ఉదయం 6 గంటలకు ఫోన్! రామమూర్తి ఫోన్ చేశాడు ఏడుస్తూ, "నాగేంద్రరావుగారు రాత్రి పోయారండి! మీరు వెళ్లిన తరువాత ఒక అరగంట వరకు బాగానే మాట్లాడుతున్నారు. కళ్లు మూసుకున్నారు! పొద్దుపోయిందిగదా - నిద్రపోతున్నారేమో అనుకున్నాం! ఒంటిగంట ప్రాంతంలో నర్సు నాడి - గుండె పరీక్షించి చెప్పింది 'ప్రాణం పోయింది' అని! అర్థరాత్రి వేళ మిమ్మల్ని డిస్టర్బ్ చెయ్యడం యిష్టంలేక మీకు ఫోన్ చేయలేదు". అన్నాడు.

నేను 8 గంటలకు వెళ్లి రామమూర్తితో చెప్పాను. శాస్త్రోక్తంగా జరపవలసిన కర్మకాండ జరిపించు అని. (ఆయనకు రావలసిన బాకీల తాలూకు ప్రామిసరీ నోట్లు మీద రాశాడు "నా వారసపుత్రుడు రామమూర్తికి" అంటూ. ఆ నోట్లు రామమూర్తి పేర ట్రాన్స్‌ఫర్ చేశారు)

అందువల్ల రామమూర్తే నాగేంద్రరావుగారికి అంత్యక్రియలు జరిపాడు.

11వ రోజు పెద్ద కర్మకు నాగేంద్రరావుగారికి ముఖ్యులయిన పది పన్నెండు మందికి మాధవపెద్ది గోఖలే, సత్యం, నాకు, ఘంటసాల, గాలి బాలసుందరరావుగారు, యింకా ఆ కాలనీలో కొంతమందికి భోజనాలు ఏర్పాటు చేశాడు రామమూర్తి.

వారం పదిరోజుల తరువాత ఒకరోజు రామమూర్తి టాక్సీలో కొన్ని పుస్తకాలు వేసుకుని మాఇంటికి వచ్చాడు. నేను అప్పుడు రాజా అన్నామలైపురంలో రామకృష్ణమఠం రోడ్డులో ఉండేవాణ్ణి!

టాక్సీలోంచి పుస్తకాలు తీసుకుని మాఇంటిలోపలికి వచ్చాడు రామమూర్తి "ఏమిటిది?" అన్నాను.

నాగేంద్రరావుగారు చెప్పారండి ఆయన జ్ఞాపకార్థం ఈ పుస్తకాలు మీకిమ్మన్నారండి.

"ఆంధ్రవిజ్ఞాన సర్వస్వం" వాల్యూములు, "నిత్యానుసంధానం", "కృష్ణలీలాతరంగణి", తిరుపతి వెంకటకవుల "కథలు-గాథలు" మూడు సంపుటాలు, ఇంకా ఏవో దాదాపు పది పన్నెండు పుస్తకాలు. వాటన్నిటిమీద "నాగేంద్రరావు లైబ్రరీ" అని ఇంగ్లీషులో ముద్రలుగూడ వున్నవి. అవన్నీ ఇప్పటికీ నాదగ్గర ఉన్నాయి! తరువాత రామమూర్తి, అనసూయమ్మగారూ, ఆవిడ మనవరాలు ఏమైనారో ఎక్కడ ఉన్నారో నాకు తెలియదు! వాళ్లు మాత్రం చివరివరకు నాగేంద్రరావుగారిని సొంత బంధువుల్లా చూశారు!

తరువాత యన్.టి.రామారావుగారితోనూ, నాగిరెడ్డిగారితోనూ రామమూర్తికి ఇంటర్వ్యూ దొరకలేదన్న విషయం నేను ఆరా తీశాను.

యన్.టి.రామారావుగారికి నాగేంద్రరావుగారికి "శ్రీకృష్ణసత్య", "చాణక్య చంద్రగుప్త" స్క్రిప్టు తాలూకు రెమ్యూనరేషన్ విషయంలో ఏదో కమ్యూనికేషన్ గేప్ ఉన్నట్టు అనిపించిందండి!

రెమ్యునరేషన్ విషయం వాళ్లు ఎలా మాట్లాడుకున్నారోగాని రామారావుగారు అనుకున్న పైకం మొత్తం అంతా ఇచ్చేశాననే ఉద్దేశంతో ఉన్నారు! నాగేంద్రరావుగారు తనకు ఇంకా కొంత రావాలనే ఇంప్రెషన్‌లో ఉన్నారు.

ఒకసారి మాటల సందర్భంలో నాగిరెడ్డిగారితో చెప్పాను. నాగేంద్రరావుగారి ఆఖరిరోజుల పరిస్థితి!



ఆయన బాధ పడ్డారు! "నాకు తెలియదు. నరసరాజుగారూ! నాకెవ్వరూ చెప్పలేదు. ఆయన 15 ఏళ్లకు పైగా మన కంపెనీకి పని చేశారు! మంచి సినిమాలకు రాశారు. ఆయన పరిస్థితి తెలిస్తే నేను ఊరికే ఉండేవాణ్ణా! నేను ఎంతమందికి సహాయం చెయ్యలేదు?" అన్నారు బాధతో!

ఈ పెద్ద పెద్ద వాళ్లతో ఇంటర్వ్యూల విషయంలో సామాన్యంగా జరిగేదేమిటంటే -

వాళ్లకి పర్సనల్ సెక్రటరీలనో, లేక గేటులో బంట్రోతులనో ఉంటారు. వాళ్ల యజమానికి వచ్చిన మనిషికి గల సంబంధం తెలియక "ఇంట్లో లేరనో, బిజీగా ఉన్నారు. ఇప్పుడు వీలులేద"నో చెప్పి పంపించేస్తారు.

అలాంటిదేదో జరిగి ఉంటుంది.

దాదాపు నా 45 ఏళ్ల సినీ జీవితంలో రకరకాల అనుభవాలు! ముఖ్యంగా ప్రొడ్యూసర్లతో! వాహినీ, విజయ, ఎ.వి.యం., భరణీ, పద్మినీ పిక్చర్స్‌లాంటి సినిమా కంపెనీలలో నాకేమీ చిక్కులు యిబ్బందులు వుండేవి కాదు.

ఇతర ప్రొడ్యూసర్లు అందరితో కాదు, కొందరితో చిత్ర, విచిత్ర, వింత అనుభవాలు!

ఇంతకు ముందురాశానే నేను ఒక ప్రొడ్యూసరు దగ్గరకు వెళ్లినట్టు నాకు సన్మానం చేయించమని అడిగినట్టు కల్పిత కథ ఒకటి రాశాను.

అందులో ఆ ప్రొడ్యూసరు అంటాడు "సినిమాకి కథ రాయడానికి నీలాంటి కొమ్ములు తిరిగిన రచయితలే కావాలా? ఉదాహరణకి ఇప్పుడు నేను తీసే సినిమాకి మా అమ్మాయి కథ రాసింది. నువ్వు ఉసూరుమంటావని నీచేత డైలాగులు రాయించానుగాని ఆమాత్రం డైలాగులు నేను రాయలేనా? ఇప్పుడు మనం మాట్లాడుకునే మాటలేగా నువ్వు సినిమాలో రాసేది!" అంటాడు.

ఈ అభిప్రాయం చాలామంది ప్రొడ్యూసర్లు, డైరెక్టర్లలో ఉంది. తాము సొంతంగా కథ రాసుకోలేరు! నాబోటివాడు ఎవడో రచయిత చేత రాయించి వాడికి చెప్పను గూడా చెప్పకుండా ఆమాత్రం తమకు తెలియదా అన్న ధీమాతో కథలో మార్పులు చేసేస్తారు.

ఉదాహరణకి "యమగోల" సినిమాయే ఉంది. తెలుగులో బాగా పోయింది! ఎవరో ప్రొడ్యూసరు తమిళ హక్కులు కొని తమిళంలో శివాజీగణేశన్ హీరోగా తీశాడు. అందులో నాతో మాటమాత్రం సంప్రదించకుండానే శివాజి గణేశన్ చేత రెండు వేషాలు, హీరోవేషం, యముడు వేషం వేయించి మరికొన్ని మార్పులు వాళ్ల ఇష్టం వచ్చినట్టు చేసి తీశారు. పిక్చరు ఫ్లాప్ అయింది.

హిందీ వర్షను గూడ అంతే 'హిందీకి ప్రొడ్యూసరు తెలుగుకి ప్రొడ్యూసరయిన వెంకటరత్నమే! దర్శకుడూ తెలుగులో తీసిన తాతినేని రామారావే! కాని హిందీ రైటర్సు ఆర్టిస్టుల మీద వీళ్లకి కంట్రోలు ఉండదు! హిందీలో గూడ హిందీ రైటరు ఆర్టిస్టులు యిష్టం వచ్చిన మార్పులు చేసి పిక్చరు ఫ్లాప్ చేశారు!

యిలాగ - ఒక భాషలో సక్సెస్ అయిన సినిమాని మరోభాషలో కాపీచేస్తూ గూడ ఒరిజినల్ రైటర్ని కనీసం సంప్రదించకుండా తమకు ఆమాత్రం తెలీదా అన్న అహంతో పైగా ఉన్నదాని మీద ఇంప్రూవ్ చేస్తున్నామన్న భ్రమతో మార్పులు చేసి సినిమాలు ఫ్లాపులు చేసిన కేసులూవున్నాయ్!

కొన్ని మంచికథలు అంటే నేను మంచి కథలు అనుకున్నవి నిర్మాత దర్శకులు మంచివాళ్లయినా ఆర్థిక కారణాలవల్ల అనుకున్నట్టు తీయలేక పిక్చర్లు ఫెయిలయిన కేసులున్నయ్!



మనకు భట్టి-విక్రమార్కుడి కథల్లో 'పరకాయ ప్రవేశం' అని ఒకటి ఉంది. అంటే ఒకరి శరీరంలో మరొకరి ఆత్మ ప్రవేశించడం! ఈ ఐడియాని ఆధారంగా చేసుకుని నేనొక సెటైర్‌రాశా! పురాణాలమీద సెటైర్!

ఆ కథ ఏమిటంటే -

భూలోకంలో మనం రోజూ పేపర్లలో వార్తలు చూస్తుంటాం! ఒకేసారి అనేకచోట్ల యుద్ధాలవలన చచ్చేవాళ్లు విరోధాలవల్ల ఖూనీలు, కారు యాక్సిడెంట్లు, ఇలా పేపర్లో ప్రతిరోజూ ఎన్నో చావుకబుర్లు!

మనకి ఆనవాయితీ ఒకటివుంది! ఒక ప్రాణిని తీసుకుపోవడానికి నరకం నుంచి ఇద్దరు యమభటులు వస్తారు! భూలోకంలో చావులు ఎక్కువ కావడంతో నరకంలో భటుల సంఖ్య చాలక ఒక్కొక ప్రాణికి ఒక్కొక్క భటుడే వస్తుంటాడు. అయినా ఇంకా యుద్ధాలు, బాంబులు వగైరాలు వల్ల చచ్చే వాళ్ల సంఖ్య విపరీతంగా పెరిగిపోయి ఒక్కొక్కభటుణ్ణి పంపడానికి గూడ భటుల కొరత ఏర్పడుతుంది!

అప్పుడు యముడు బ్రహ్మ దగ్గరకుపోయి "ఇంతమందికి ఒకేసారి చావులు రాస్తే ఎలాంగండీ! నా భట వర్గం చాలడం లేదు" అని మొరబెట్టుకుంటాడు.

అంటే బ్రహ్మ అంటాడు: "అన్నీ తెలిసి గూడ నువ్వు ఇలా మాట్లాడతావేం యమధర్మరాజా! మనుషుల చావులు నాచేతుల్లో లేవు! వాళ్ల వాళ్ల పూర్వజన్మ సుకృతాలు- దుష్కృతాలనుబట్టి వాళ్ల ఆయుర్దాయం ఉంటుంది! ఇందులో నేను చేయగలిగింది ఏమీలేదు"అంటాడు. "మరి ఏమిటి ఈ సమస్యకి పరిష్కారం?" అని యముడు అడిగితే

"కొత్త భటుల్ని రిక్రూట్ చేసుకో"మంటాడు బ్రహ్మ. అప్పుడు యమలోకంలో భటులకోసం రిక్రూట్‌మెంట్ ఆఫీసు ఓపెన్ చేస్తారు. ఎందరో వస్తారు భటుడి ఉద్యోగాల కోసం! అందులో ఒకడు దేవేంద్రుడి దగ్గరనుంచి రికమెండేషన్ లెటరు తీసుకువస్తాడు. ఆ వేషం నూతనప్రసాద్ వేశాడు. నూతన్ ప్రసాద్ మదరాసులోవుండగా అతని ఇంట్లో వాకిలిపైన తగిలించి ఉంది. యమభటుడి ఫోటో! నూతనప్రసాద్‌నాకు చూపించాడు.

యమలోకంలో ఇలా వుండగా భూలోకంలో ఒక కథ. ఒక తల్లికి ఇద్దరు కూతుళ్లు! తల్లి విధవరాలు! ఉన్న రెండు ఎకరాల భూమి అమ్మి కట్నమిచ్చి పెద్దకూతురు పెళ్లి చేస్తుంది.

చిన్నకూతురు చదువుకుంటుంది. కాలేజీలో ఒకణ్ని ప్రేమిస్తుంది. ప్రేమవివాహం! కట్నం బాధలేకుండా!

రేపు ఉదయం పెళ్లిముహూర్తం! ఈరోజు సాయంత్రం పెళ్లికూతుర్ని చేస్తారు. అందరూ నిద్రపోతారు! తెల్లవారిలేచేసరికి పెళ్లికూతురు చనిపోయి ఉంటుంది! కట్ చేస్తే -

యమలోకంలో ఈ పెళ్లికూతుర్ని యమసభలో విచారిస్తుంటారు! ఆ పిల్ల ప్రాణం తెచ్చినవాడు ఈ కొత్త రిక్రూట్ నూతనప్రసాద్.

చిత్రగుప్తుడు చిట్టాతీసి ఆ పిల్ల చేసిన పాపాలు చదువుతాడు!

"ఈమె పెళ్లాడిన భర్త కళ్లలో కారం చల్లి మరొక పరపురుషుడితో సంబంధం పెట్టుకున్నది" అని చదవగానే

ఆ పిల్ల "ఓరి నీదుంపతెగ! నాకింకా పెళ్లే కాలేదు! నాకు భర్తకు తెలీకుండా పరపురుషుడితో శృంగారమేమిటి? ఇందులో ఏదో పొరపాటు ఉంది యమధర్మరాజా" అంటుంది.



"పొరపాటు ఏమీ లేదు! యిది నేను రాసిందికాదు. కంప్యూటరైజ్డ్ రికార్డ్" అని చదువుతాడు. నీపేరు లలిత గదూ?

"నీతల్లిపేరు లక్ష్మమ్మ కదూ!"

"అవును!"

"నీ తండ్రిపేరు నాగయ్య"

అవును!

"నీ తాతపేరు సుబ్బయ్య"

"కాదు! కాదు!మాతాత పేరు వెంకయ్య" అని ఆపిల్ల యముడితో "అయ్యా! నాపేరుగలదే ఇంకొకామె ఉంది! ఆమె తల్లిపేరు, తండ్రిపేరు, నాతల్లిదండ్రులపేర్లు ఒకటే! కాని తాతపేర్లు వేరు. ఆవిడ పరపురుషుడితో సంపర్కం మాట నిజమే!" అంటుంది.

"అయితే ఆవిడ ప్రాణానికి బదులు ఈ పెళ్లికూతురు ప్రాణం తీసుకొచ్చాడన్నమాట" అని యముడు కోపంగా -

"ఇది పెద్ద నేరం! బ్రహ్మకు తెలిస్తే మన ఉద్యోగాలు ఊడతయ్! వెంటనే ఈ పిల్ల ఆత్మను తీసుకుపోయి భూలోకంలో వదిలేసి రమ్మంటాడు.

ఆకాశంలో పోతూ ఆ పిల్ల అంటుంది భటుడితో! "నీ దుంపతెగ! నా పెళ్లి పాడుచేశాడుగదరా!" అంటుంది.

"లేకపోతే ఎక్కడా పేర్లు దొరకనట్టు నలుగురయిదుగురు ఒకే పేరుపెట్టుకుంటే వచ్చే చిక్కేయిది!" అంటాడు భటుడు.

తీరా భూలోకానికి పోయేసరికి ఆ పిల్ల శవాన్ని దహనం చేసేశారు.

"ఇప్పుడెట్లా! నా ఆత్మకి శరీరం కావాలిగా! ఎట్లా?" అని "రాయముడితో చెబుతా!" అని బెదిరిస్తుంది.

"అమ్మా! నీకు దండంపెడతా! నా ఉద్యోగం ఇంకా పర్మనెంటుకాలేదు! నువ్వు రిపోర్టు చేస్తే నా ఉద్యోగం ఊడుతుంది! నీ ఆత్మ దూరడానికి మంచి శరీరం చూపిస్తా! ఇదుగో నా దగ్గిర చావబోయే వాళ్ల లిస్టువుంది! రా!" అని భూలోకంలో ఒక హాస్పిటలుకు తీసుకెళతాడు!

ఒక ధనవంతురాలి రూంలోకి తీసుకెళతాడు! ఈమె లక్షాధికారి! ఒక గంటలో చావబోతోంది! ఈ శరీరంలో పరకాయ ప్రవేశం చెయ్" అంటాడు.

వీళ్లద్దరూ ఆసుపత్రి వాళ్లకి కనబడరుగదా! ఆ పిల్ల ఆ చావబోయే మహిళ మంచానికి తగిలించిన కేస్ షీట్ చదువుతుంది.

"ఛీ! దీనికి అన్నీ సుఖరోగాలే! ఈ బాడీ నాకు వద్దు" అంటుంది.

"ఇంకొకటి చూపిస్తా! రా!" అని ఒక మంత్రిగారింటికి తీసుకుపోతాడు.

"మంత్రిగారి భార్య గుండెపోటుతో చావబోతుంది! ఈ శరీరంలో దూరావా నువ్వు మంత్రిగారి భార్యవై అధికారం చలాయించవచ్చు!" అంటాడు.



అప్పుడే ఎదురుగా వున్న టి.వి.లో వార్త! మంత్రిగారి అవినీతి చర్యలవల్ల మంత్రి పదవి ఊడిందని! "మొగుడికి మంత్రి పదవిపోతే దీని మొఖమెవడు చూస్తాడు! నాకీ బాడీవద్దు" అంటుంది ఆ పిల్ల ఆత్మ!

తరువాత మరొక ఊరికి తీసుకుపోతాడు. అదొక రైతు కుటుంబం! ఆ ఇంటి కోడల్ని చూపుతాడు!

"ఓరి నీ దుంపతెగ! ఈమె నా అక్కరా!" అంటుంది."అక్కో! కుక్కో! నాకు తెలియదు. నా లిస్టులో ఉంది! ఇంకా రెండురోజుల్లో చావబోతుంది!"

"అయితే నేనూ మా అక్క శరీరంలో ప్రవేశిస్తాను" అంటుంది. "ఇంకా రెండు రోజులు టైమ్ ఉంది. నువ్వు ఇక్కడే ఉండు. నా లిస్టులో చావబోయేవాళ్లని తీసుకుని వస్తా" అని భటుడు పోతాడు.

అక్కడ ఆ 'అక్క' పరిస్థితి ఏమిటంటే అక్క చక్కనిది! అత్త గయ్యాళి! భర్త మేదకుడు! పైగా అత్త తమ్ముడు (రామలింగయ్య) కోడలిమీద కన్నేసి వేధిస్తుంటాడు. అత్తతో చెబితే తన మీదే ఎగిరి పడుతుంది! అలా నలిగిపోతున్నది అక్క! పైగా అక్కకు పిల్లలు లేరు! అందువల్ల కోడలికి విషమిచ్చి చంపి కొడుక్కి మంచి కట్నంతో రెండో పెళ్లి చెయ్యాలని అత్త ప్లాను!

రెండు రోజుల తరువాత రాత్రిపూట కోడలికి విషం కలిపిన పాలు గ్లాసు ఇస్తుంది!

కోడలు - కొడుకు గదిలో నిదురిస్తుంటారు! తెల్లారేసరికి కోడలు చచ్చి ఉంటుంది గదా అని తలుపు తీస్తే కోడలు బ్రతికేవుంటుంది! అంటే రాత్రే అక్క శరీరంలో చెల్లెలి ఆత్మ దూరి ఉంటుందన్నమాట!

అక్క అమాయకురాలుగాని చెల్లెలు గడుసుది! అత్త మీద ఎదురుతిరుగుతుంది. అత్త తమ్ముడు ఇదివరకు లాగానే కన్ను గొడితే చెల్లెలు మెత్తబడినట్టు నటిస్తుంది. ఆ రాత్రికి భార్యను పుట్టింటికి పంపి చెల్లెల్ని తన ఇంటికి రమ్మంటాడు రామలింగయ్య. చెల్లెలు సరేనంటుంది. ఆ రాత్రికి రామలింగయ్య యింటికి వెళుతుంది! రామలింగయ్య బలవంతం చేయబోతే రోకలితో వాడి నెత్తిన కొడుతుంది. వాడు చస్తాడు. తను ఏమీ ఎరగనట్టు ఇంటికి పోతుంది!

అక్కడ యమలోకంలో నూతనప్రసాద్‌కి డ్యూటీ మారుతుంది. మనుషుల ప్రాణాలు తెమ్మంటే ఒకరికి బదులు మరొకరి ప్రాణం తెచ్చాడు గనక అతన్ని వెటర్నరీ జంతువుల శాఖకు బదిలీ చేస్తారు!

ఒకరోజు గాడిద ప్రాణం తీసుకువస్తాడు! "గుర్రం ప్రాణం తెమ్మంటే గాడిద ప్రాణం" తెచ్చావు! ఇది చాలా పెద్దనేరం!" అంటాడు చిత్రగుప్తుడు.

"ఏమోనండి! మానవుల లోకమే బెటరు! ఆడ, మగ! రెండే జాతులు!

పశువుల్లో గుర్రం-గాడిద, కుక్క, నక్క ఒకే లాగవుంటున్నయ్!" అంటాడు భటుడు.

"గాడిద ప్రాణాన్ని భూలోకంలో వదిలి 'రమ్మంటాడు" యముడు.

భూలోకానికి పోయేసరికి గాడిద శవాన్ని రాబందులు తినేశాయి!

"నీకు పులి శరీరం చూపిస్తా! అందులో దూరు!" అంటాడు భటుడు! గాడిద 'వద్దు' అని ఓండ్రపెడుతూ తల వూపుతుంది.

"సింహం శరీరం?"



"వద్దు" అంటుంది.

"అన్ని జన్మలలోకి మానవ జన్మ ఉత్తమం! మానవశరీరంలో దూరతావా?"

"దూరతానంటుంది గాడిద!

రామలింగయ్య శవాన్ని పాడెమీద కట్టి శ్మశానానికి తీసుకుపోతుంటారు! గాడిద ఆత్మ రామలింగయ్య బొందిలో దూరుతుంది.

అతను పాడె మీదనుంచి లేచి గాడిదలా ఓండ్రుపెడుతూ క్రిందకి దూకుతాడు.

భార్యవచ్చి సంతోషంతో ఇంటికి తీసుకెళుతుంది.

మామూలు అన్నం తినడు. పచ్చిగడ్డి ఇష్టంగా తింటాడు." ఇలా నడుస్తుంది కథ!

పాపం ప్రొడ్యూసరు భాగస్తులు విడిపోవడంతో పిక్చరు అనుకున్నట్టు తీయలేక ఎలాగో రిలీజు చేశారు!

పిక్చరు ఫ్లాప్ అయింది!

రచన వృత్తిగా స్వీకరించిన నేను రచయితగా నా అనుభవాలు, తెలుసుకున్న విషయాలు తప్పులో, ఒప్పులో పాఠకుల ముందుంచడమే ఈ రచన ప్రధాన కర్తవ్యం! రచయితకి గాని ఏ ఇతర కళాకారుడికి గాని కావలసినవి ముఖ్యంగా ఆత్మవిమర్శ, ఆత్మవిశ్వాసం!

ఆత్మవిమర్శ ముందడుగు వెయ్యడానికి ఉపయోగపడుతుంది. ఆత్మ విశ్వాసం చేసేపనిని ధైర్యంగా చేయడానికి దోహదం చేస్తుంది.

ఈ అభిప్రాయాలను విపులీకరించడానికి ఒక ఉదాహరణ చెబుతాను.

1981లో ప్రారంభించి 1982లో అనుకుంటాను అక్కినేని నాగేశ్వరరావుగారు అన్నపూర్ణా స్టూడియోస్ తరపున నిర్మాతగా "శ్రీరంగ నీతులు" చిత్రం నిర్మించారు.

దానికి మాతృక తమిళ సినిమా - "ఊటీవరైవరవు" శివాజీ గణేశన్ ప్రధాన పాత్ర పోషించాడు. దానిని తెలుగులో తీయాలని అనుకున్నప్పుడు ఆ కథ నాగేశ్వరరావుగారికి అంతగా నచ్చలేదు. కారణం శివాజీ గణేశన్ పాత్రకి సినిమాలో ఉండవలసిన ప్రాధాన్యత లేదు గనక!

అయినా మిగతా సినిమా బాగున్నది గదా అని మిత్రులు చెప్పిన మీదట "నరసరాజుగారి అభిప్రాయం తీసుకుందాం" అని నిర్ణయించుకుని నాకు మదరాసులో ఆ తమిళచిత్రం చూసే అవకాశం కల్పించారు! తమిళ సినిమాల్లో ఆ రోజుల్లో హాస్యనటులు వి.కె. రామస్వామి, బాలయ్య, తంగవేలు, నాగేష్ వగైరాలు ప్రాబల్యం ఎక్కువగా ఉండేది. వాళ్ల సీన్లు రచయిత రాసేవాడు గాదు. కథలో సందర్భం చెబితే పైన చెప్పిన హాస్యనటుల్లో ఇద్దరో, ముగ్గురో, నలుగురో షూటింగు సమయంలో సెట్‌లో కూర్చుని ఒకరిమీద ఒకరు జోకులు, మాటకు మాటల ఎత్తిపొడుపులు వాళ్ల ఇష్టం వచ్చినట్లు మాట్లాడి హాస్యాన్ని పండించేవారు! ప్రేక్షకులు గూడ ఆనందించేవారు.

ఈ విధంగానే నేను చూసిన ఊటీ వరైవురవు' చిత్రంలో హాస్యనటుల పాత్రలు ఎక్కువై డామినేట్ చేయడంవల్ల హీరో శివాజీ గణేశన్‌పాత్ర మరుగునపడి ప్రాధాన్యత కోల్పోయింది.



కాని కథలో మొదట్లోనే ఒక మంచి ట్విస్ట్ వుంది. దానిని ఆధారంగా చేసుకుని హాస్యనటుల పాత్రలు తగ్గించి హీరో పాత్ర అవసరమైనంతవరకు పెంచి మంచి కథగా రూపొందించవచ్చని నాకు తోచింది.

ఈ విషయం మదరాసునుంచి హైదరాబాద్‌లోవున్న నాగేశ్వరరావుగారికి చెప్పి వారంరోజుల్లో ఒక వర్షన్ కథరాసి హైదరాబాద్ వెళ్లి నాగేశ్వరరావు గారికి వినిపించాను.

ఆయన "బాగానే వుంది గాని నరసరాజుగారూ! నిర్మాతగా ప్రస్తుతం నా స్థితి చెబుతాను వినండి.

అన్నపూర్ణ పిక్చర్సు మొట్ట మొదటి పిక్చరు "దొంగరాముడు" మీరు రాశారు! స్క్రిప్టు పూర్తిగా రాసి ఆర్టిస్టులను ఆఫీసుకు పిలిపించి డైలాగ్స్ రిహార్సల్సు చేయించేవారు!

ఆ తరువాత ఏ సెట్టుకు ఆ సెట్టుకు డైలాగ్స్ రాసి యివ్వడం ప్రారంభమయింది. నటుడుగా అదీ సహించాను.

ఆ తరువాత మరీ దారుణంగా షూటింగ్ మొదటి రోజు సెట్‌లో కూర్చుని దర్శకుడు - రచయిత - అసిస్టెంట్లు కథ చర్చించడం ప్రారంభించారు!

కథలో "తల్లికి ఇద్దరు కొడుకులు గదా! ఒక కూతురుగూడ ఉంటే ఎలావుంటుంది?" అని డైరెక్టరు అంటే మిగతావాళ్లు "బ్రహ్మాండంగా ఉంటుంది" అని వంతపాడడం -

అయితే ఈరోజు షూటింగు కేన్సిల్ చేసి మదరాసుకు ఫోన్ చేసి ఫలాన లేడీ ఆర్టిస్టును రేపు ఉదయానికి విమానంలో పంపించే ఏర్పాటు చేయమని డైరెక్టరు ఆదేశించడం! ఇదీ సహిస్తున్నాను.

ఇది ఎక్కడో గాదు! ప్రస్తుతం ప్రొడక్షన్ లో వున్న నా సొంతపిక్చరులోనే జరుగుతోంది!

ఇంతవరకు నేనిప్పుడు తీస్తున్న పిక్చరు ఒక ఫ్రేమ్ గూడ చూడలేదు! ఎందుకంటే అది ఎలాఉంటుందో చూస్తూనే ఉన్నానుగదా!

అందువల్ల ఇదే ఆఖరు పిక్చరు! ఇక నిర్మాతగా సినిమాలు తీయగూడదని నిర్ణయించుకున్నాను" అన్నారు.

అంతా విని నేనన్నాను. "నాగేశ్వరరావుగారూ నా పరిస్థితి గూడ కాస్త ఓపిగ్గా వినండి!

నేను రాసిన పిక్చరు సక్సెస్ అయితే అంతా నా ప్రతిభే అనుకుంటున్నాను. ఫెయిలయితే నేను అనుకున్నట్టు తీయలేదు అందువల్ల ఫెయిలయింది అని ఇతరుల మీద నింద వేస్తున్నాను.

ఈ దశలో ఆత్మ విమర్శలో పడ్డాను! పిక్చరు ఫెయిల్ అయితే దర్శకుణ్ణో, నిర్మాతనో నిందిస్తున్నాను గాని ఒకవేళ నా రచన లోనే లోపంఉందేమో! అనే అనుమానం వస్తోంది. ఇప్పటికి నేను ఇండస్ట్రీకి వచ్చి సరిగ్గా 30 సంవత్సరాలయింది. ఈనాటి ప్రేక్షకులకు నాభావాలు, నేను దూరమైపోతున్నామేమో!

అందువల్ల ఈనాటి ప్రేక్షకుల అభిరుచులకు నేను దగ్గరగా ఉన్నానా? దూరంగా ఉన్నానా? అని ఆత్మ విమర్శ చేసుకోవలసిన సమయం ఆసన్నమైంది.

కాబట్టి నాకు ఈ ఒక్క అవకాశం ఇవ్వండి! నేను రాసే స్క్రిప్టు అక్షరం మార్చకుండా నేను అనుకున్నట్టు సెట్లో నేను దగ్గరవుండి సినిమా తీద్దాం! దర్శకుడు కోదండరామిరెడ్డి మనవాడేగనక చెబితే ఒప్పుకుంటాడు. ఒకవేళ పిక్చరు ఫెయిలయితే ఇంకా రచయితగానే సాగి ప్రొడ్యూసర్ల డబ్బు తగలెయ్యడమెందుకు? హాయిగా తృప్తిగా సినిమారంగం వదిలేసి రిటైరవుతాను.



ఇంతవరకు ఇతరులవల్ల ఎన్నో సినిమాలు తీసి నష్టపోయానంటున్నారుగదా! నా అకౌంటులో ఒక్క అయిదు లక్షలు నష్టపోండి! ఒకవేళ పిక్చరు సక్సెస్ అయితే ఓహో! నేను ప్రేక్షకుల అభిరుచులకు దగ్గరగానే ఉన్నానన్న ఆత్మ విశ్వాసంతో ఇంకా కొన్నాళ్లు సినిమాలలో కొనసాగుతాను" అన్నాను.

'అలాగె లెండి' అన్నారాయన!

"శ్రీరంగనీతులు" సినిమా మొత్తం నేను సెట్‌లో లేకుండా ఒక్క షాట్ గూడ తీయలేదు! సీనులో యాక్షన్ డైలాగ్ ఆర్టిస్టుల చేత చేయించి చూపేవాణ్ణి! కోదండరామిరెడ్డి షాట్స్ డిజైన్ చేసుకునేవాడు. పాటలు మొత్తం అతనే షూట్ చేసేవాడు. నేను interfere అయ్యేవాణ్ణికాను. "శ్రీరంగనీతులు" హిట్ అయింది. నాలో ఆత్మవిశ్వాసం పెరిగింది.

సినిమా శతదినోత్సవం నాగేశ్వరరావుగారు మదరాసులో 'సవేరా' హోటల్‌లో ఏర్పాటు చేశారు.

ఆ సభలో చెప్పారు నాగేశ్వరరావుగారు: "సాధారణంగా నిర్మాతలు ఫెయిల్యూర్ పిక్చరు తీసి సినిమాలు తీయడం మానేస్తారు! నేను ఈ సక్సెస్‌ఫుల్ పిక్చరు తీసి సినిమాలు తీయడం మానేస్తున్నాను! నిర్మాతగా ఇదే నా ఆఖరు పిక్చరు. ఈ సినిమాకు పేరుకు నేను నిర్మాతనుగాని నిజానికి నిర్మాత నరసరాజుగారు. ఆయన ప్రోత్సాహం లేకపోతే నేను ఈ సినిమా తీసేవాణ్ణి కాదు" అన్నారు.

రెమ్యూనరేషన్ గూడ అనుకున్నదానికంటే పాతిక ముప్ఫయి వేలు అదనంగా పంపారు నాకు.

"శ్రీరంగనీతులు" సినిమాతో నాలో పెరిగిన ఆత్మవిశ్వాసంతో ఇంకా పది పన్నెండేళ్లు సినిమా రంగంలో రచయితగా కొనసాగాను' తరువాత పరిస్థితులు మారినై! సినిమాలనుంచి రిటైర్ కావడానికి వేరే కారణాలున్నయ్! అవి తరువాత ప్రస్తావిస్తాను.

ఆ సినిమా నా ఆత్మవిమర్శకు 'ఆత్మవిశ్వాసానికి' అవకాశం కల్పించింది. అందుకు నాగేశ్వరరావుగారికి నేను కృతజ్ఞుణ్ణి.

సినిమాలను గురించి సమాజంలో కొన్ని వర్గాలు చేసే విమర్శలను గురించి ప్రస్తావిస్తాను.

కొందరు విమర్శకులు సినిమాలు ఎప్పుడో ఒకటీ అరా తప్ప ఎక్కువగా సినిమాలు చూడని విద్యాధికులైన డాక్టర్లు, ప్లీడర్లు, టీచర్లు, మేథావులుగా పేరు గడించిన వాళ్లు, తరచు సినిమాలలోని అసహజత్వాన్ని గురించి విమర్శిస్తుంటారు.

ముఖ్యంగా సినిమాలలో హీరో పాత్రల ఔచిత్య-అనౌచిత్యాలను గురించి, ఫైట్స్ దృశ్యాల గురించి.

"ఏమిటండీ! మరీ అంత అన్యాయం! హీరో మీదకి విలనూ, అతని తాలూకు రౌడీలు డజనుమంది వచ్చి దాడిచేస్తే హీరో ఇలా విసిరితే ముగ్గురు మనుషులు తల్లకిందులుగా పల్టీలు కొట్టి అవతల పడతారా?

పైగా గుంపుగా రాకుండా ఒక్కొక్కడే వచ్చి - ఒక్క దెబ్బకి ఎగిరి పదిగజాల దూరాన పడతాడా?

'డిషుం' - 'డిషుం' అంటూ హీరో డజను మందిని చితగ్గొట్టి పారదోలినా అతనికి మాత్రం చొక్కా నలగదు' జుట్టు చెరగదు! మొఖం మీదగాని, ఒంటిమీదగాని ఒక్క చెమట బొట్టు గూడ కనబడదు. ఇది సహజంగా ఎక్కడైనా జరుగుతుందా?" హీరో హీరోయిన్లు శ్రావ్యంగా మధురంగా 'మల్లీశ్వరి' లాంటి చిత్రాలలో పాడే



డ్యూయట్లలోని అసహజత్వాన్ని ఈ వర్గాలవారు ప్రశ్నించరు! ఫైట్ల విషయంలోనే వీళ్ల అభ్యంతరం!

ఆ ఫైట్లు చూస్తూ కింది క్లాసు ప్రేక్షకులు ఈలలు వేసి చప్పట్లు కొట్టి ఆనందిస్తుంటే వాళ్లది చవకబారు అభిరుచి కింది కొట్టేస్తారు!

సినిమా మాధ్యమాన్ని గురించి కాస్తయినా ఆలోచించని వారే ఇటువంటి విమర్శలు చేసేది!

ఫైట్స్‌లో హీరోగూడ దెబ్బలుతిని చొక్కాలు చిరిగి తల చెరిగి ముఖాన నెత్తురు కారుతున్న దెబ్బలతో కాలికి తగిలిన దెబ్బలతో కుంటుకుంటూ నడచి వస్తుంటే వీరికి సహజంగా కనిపిస్తుంది.

అలా అయితే అతను మామూలు మనిషే అవుతాడు గాని - సామాన్య ప్రేక్షకుడి దృష్టిలో హీరో ఎలా అవుతాడు?

ఈ ఆర్గ్యుమెంటును మేథావులు అంగీకరించరు! సినిమా మాధ్యమంలో ఉన్న ఒక ప్రత్యేకతను పైన చెప్పిన మేథావి వర్గం అర్థం చేసుకోవాలి!

సినిమాచూసే సామాన్య, నిష్పక్షపాత ప్రేక్షకుడు, కథలోని పాత్రయొక్క గుణాలను, మంచిగుణాలను చెడ్డ గుణాలను గూడ ఆ పాత్ర పోషించిన నటుడికీ, నటీమణికి ఆపాదిస్తారు!

ఇది ఎవరూ కాదనలేని సత్యం! ఉదాహరణకి రాముడు, కృష్ణుడు పాత్రలు పోషించిన యన్.టి.రామారావును కొందరు ప్రేక్షకులు. నిజజీవితంలో గూడ ఆయన్ని దైవంగా ఎంచి పాదాభివందనాలు చేసి ఓట్లువేసి గెలిపించి అనతికాలంలో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిని చేసింది ప్రేక్షకుల ఈ మనస్తత్వమేనని ఒప్పుకుంటున్నారుగదా! (దానికి తోడు అప్పటి కాంగ్రెసు రాజకీయ పరిస్థితులుగూడ కొంతవరకు అనుకూలించిన మాట గూడ వాస్తవమే కావచ్చు!) అలాగే దుష్టపాత్రలు, విలన్లుగూడ! విలన్‌పాత్ర ధరించిన నటుడు ఎంత మంచివాడయినా, అతను ధరించిన పాత్రయొక్క చెడ్డగుణాలు ఆ నటుడికి ఆపాదిస్తారు ప్రేక్షకులు!

ఉదాహరణకి తమిళ సినిమాలలో యం.జి.రామచంద్రన్ హీరోగా నటించిన చాలా సినిమాల్లో విలన్‌గా నటించిన నటుడు 'నంబియార్'!

నిజ జీవితంలో నంబియార్ చాలా మంచివాడు! పెద్ద మనిషి అయ్యప్ప భక్తుడు! తోటి నటీనటులు అతన్ని ఎంతో గౌరవిస్తారు! ఏ దురలవాట్లు లేనివాడు!

విలన్ వేషాలు వేశాడుగనక అతనిని వ్యక్తిగతంగా తెలియని సామాన్యప్రేక్షకులు అతనిని 'దుష్టుని' గా ద్వేషిస్తారు.

అందాకా ఎందుకు? మన సినిమాలలోనే 'సూర్యకాంతం' సంగతేమిటి? ఆవిడ పోషించిన పాత్రలన్నీ గయ్యాళి పాత్రలేగదా! ప్రేక్షకులు ఆమెను నిజంగానే గయ్యాళిగా పరిగణిస్తున్నారుగదా! అసలు తమ బిడ్డలకు సూర్యకాంతం అని పేరు పెట్టుకోడానికే సాహసించనంత చెడ్డపేరు సూర్యకాంతానికి!

కాని నిజజీవితంలో ఆమె ఎంతోమంచిది! ఎంతోకలుపుగోలుమనిషి! సాటి నటీనటులతో దర్శకులతో, నిర్మాతలతో ఎంతో సన్నిహితంగా వుండేది!

ఆమె గురించి సామాన్యప్రేక్షకుల్లో ఉన్న అభిప్రాయానికి చిన్న ఉదాహరణ:



ఆమెది కాకినాడ! మదరాసులో తనఇంట్లోకి ఒక వంటమనిషి కావలసి వచ్చింది! ఎవరైనా మంచి వంటమనిషిని పంపమని కాకినాడలోని తన బంధువుకు ఉత్తరం రాసింది:

ఆ బంధువు ఒక వంటమనిషిని మాట్లాడింది! మదరాసు అని చెప్పిందిగాని మిగతా వివరాలు చెప్పలేదు. మదరాసు సెంట్రల్ స్టేషనుకు వచ్చి మావాళ్లు నిన్ను తీసుకెళతారు అని మాత్రం చెప్పింది.

కాకినాడ స్టేషనుకు వెళ్లి వంటమనిషిని రైలెక్కించింది. రైలు కదలడానికి ఇంకా పదినిమిషాలుంది. ఆ బంధువుకు తెలిసినావిడ ఒకామె "మదరాసు వెళుతున్నావా?" అని అడిగింది.

"లేదు! మా సూర్యకాంతం వంట మనిషి కావాలని ఉత్తరం రాసింది. పంపించడానికి వచ్చాను" అన్నదా బంధువు. రైలుపెట్టెలో కూర్చున్న వంట మనిషి ఈ మాటలు విని దిగ్గునలేచి "అమ్మో! సూర్యకాంతం యింటికా! నేను చస్తేపోను" అని పెట్టె తీసుకుని రైలుదిగి పరుగు పరుగున అదేపోత! దీనికేమంటారు?

ప్రేక్షకులు నటుడు ధరించిన పాత్ర లక్షణాలను నటునికి ఆపాదించి చూస్తారు అన్న సత్యానికి గొప్ప ఉదాహరణ. ప్రఖ్యాత తమిళ హీరో తమిళనాడు ముఖ్యమంత్రి యం.జి.రామచంద్రన్!

యన్.టి.రామారావుగారు రాముడు, కృష్ణుడు లాంటి ఉదాత్త పాత్రలతోపాటు రావణుడు, దుర్యోధనుడు పాత్రలు గూడ ధరించాడు.

యం.జి.రామచంద్రన్ పురాణాలలో నటించలేదు. అన్నీ సాంఘిక, జానపద, చారిత్రక చిత్రాలే! అయినా తన పాత్ర విషయంలో ఎంతో జాగ్రత్త తీసుకునేవాడు. ప్రేక్షకుల పాత్రయొక్క లక్షణాలు, ఆ పాత్రధారికి ఆపాదించి చూస్తారన్న సత్యం పూర్తిగా గ్రహించిన వాడు గనకనే - అతను నటించిన ప్రతి చిత్రంలోనూ (ప్రేక్షకుని మనస్సులో తన ఇమేజ్ పెంచుకోవడంకోసం) అతను ధరించిన పాత్ర (స్క్రీన్‌మీద గూడ) మద్యం సేవించదు! సిగరెట్టు తాగడు! అబద్ధమాడడు! తల్లిదండ్రులను దైవంలా పూజిస్తాడు. గౌరవిస్తాడు. ఎప్పుడూ తన సంభాషణల్లో దళితులను, అసహాయ స్త్రీలను బలపరుస్తాడు. వాళ్ల తరపునే నిలబడి వాదిస్తాడు. అంతేకాదు! దళితులను, స్త్రీలను హింసించే ధనికులను నిర్దాక్షిణ్యంగా తిడతాడు! శిక్షిస్తాడు.

ఒక చిన్న ఉదాహరణః

నేను తెలుగులో రాసిన రామానాయుడుగారి మొదటి చిత్రం "రాముడు-భీముడు" వాహినీ స్టూడియో అధినేతి నాగిరెడ్డిగారు తమిళ, హిందీ హక్కులు కొని తమిళంలో యం.జి.రామచంద్రన్ ద్విపాత్రాభినయ హీరోగా "ఎంగవీట్టుపిళ్లై" (మా ఇంటిబిడ్డ) అనే పేరుతో తీశారు.

తమిళ చిత్రం షూటింగ్ వాహినీ స్టూడియోలో జరుగుతున్నది. నేను, నాగిరెడ్డిగారు, చక్రపాణిగారు నాగిరెడ్డిగారి రూంలో కూర్చుని వున్నాం. షూటింగ్‌లోవున్న యం.జి.రామచంద్రన్ నుంచి కబురు వచ్చింది.

"సార్! నరసరాజుగారిని ఒకసారి సెట్‌లోకి రమ్మని యం.జి.ఆర్. సార్ పంపారుసార్!" అని అసిస్టెంటు డైరెక్టరు వచ్చి చెప్పాడు.

నేను వెళ్లాను.

భీముడు గూడ పల్లెలో తన ఇంట్లోనుంచి తల్లి కన్నుగప్పి టౌనుకు వస్తాడు! ఆకలివేస్తుంది. జేబులో



డబ్బులులేవు. అయినా ఒక కాఫీ హోటలులోకి వెళ్లాడు. టిఫిన్ కడుపునిండా తిన్నాడు. సర్వరు కాఫీ తెచ్చేలోపల అటూయిటూ చూచి మెల్లగా బిల్లుచెల్లించకుండా గుంపులో చాటుగా మెయిన్ వాకిలిగుండా బయటికి జారుకుంటాడు.

అదే సమయంలో అదే గేటుగుండా రాముడు హోటలులోకి వస్తాడు. యాదృశ్చికంగా భీముడు కూర్చుని వెళ్లిన బల్లదగ్గర కుర్చీలోనే కూర్చుంటాడు.

సర్వరు కాఫీ తెస్తాడు. (భీముడు ఆర్డరు చేసింది) రాముడు "కాఫీ ఇప్పుడు వద్దు! టిఫిన్ తిన్న తరువాత తాగుతాను" అంటాడు.

సర్వరు ఆశ్చర్యపోయి "ఇంతకుముందు లాగించేశావుగా- ఇడ్లీ, వడ, దోసె..."

రాముడు అమాయకంగా "అబద్ధం! నేనెప్పుడు తిన్నాను? ఇప్పుడేగా నేను వచ్చింది" అంటాడు.

సర్వరు మేనేజరును కేకవేసి "ఇతను తిని తిన లేదంటున్నాడు" అనగానే నలుగురు మూగుతారు! రాముడు అసలే భయస్తుడు ఇంట్లోనుంచి పారిపోయి వచ్చాడు! పాపం టిఫిన్ తినకుండానే భీముడు తినిపోయిన టిఫిన్ బిల్లు చెల్లించి బయటికి పోతాడు.

ఇదీ సీను! (రాముడుపాత్ర - భీముడుపాత్ర ఒకేనటుడు! ద్విపాత్రాభినయం) యం.జి.ఆర్. నన్ను పిలిచి చెప్పిన అభ్యంతరం ఏమిటంటే -

"నేను భీముడుగా హోటల్లో టిఫిన్ తిని బిల్లుచెల్లించకుండా వెళితే నా అభిమానులు (ఫాన్స్) ఒప్పుకోరు! నా ఇమేజ్ దెబ్బతింటుంది" అన్నాడు.

నేను ఆశ్చర్యపోయాను! సన్నివేశాన్ని వివరించాను. "మిస్టర్ రామచంద్రన్! రాముణ్ని చూచి భీముడుగాను, భీముణ్ణి చూచి రాముడుగానూ కథలో పాత్రలు భ్రమించే అవకాశం ఉంది అని establish చేయడానికే నేనీ సీను రాశాను! తరువాత జరిగే కథలో ఈ సీనుకి చాలా ప్రాధాన్యం వుంది" అన్నాను.

ఆయన "ఏమో!సార్! మీరు ఈసీను మార్చి రాయాలి!" అన్నాడు.

నేను వినయంగానే I am sorry Mr. Ramachandran! నేను చెప్పవలసింది చెప్పాను! మీఇష్టం వచ్చినట్టు రాయించుకోండి" (తమిళంగదా) అని వచ్చేశాను.

తరువాత విచారిస్తే ఆయన కాసేపు ఆలోచించి "సరే తెలుగులో ఉన్నట్టే తీద్దాం" అని నేను తెలుగులో రాసినట్టే తీశారు!

తరువాత సీను భీముడు హోటలునుంచి బయటికి వచ్చి బస్స్టాండు దగ్గర నిలబడతాడు! హీరోయిన్ చేతిలో Hand bag ఒక దొంగ లాక్కుని పరుగెడుతుంటే భీముడు వాడివెంటపడి వాణ్ణి తన్ని బేగ్ తెచ్చి హీరోయిన్కి ఇస్తాడు. ఇదీసీను!

తరువాత వారం పదిరోజులకి ఈ సీన్ షూట్ చేశారు. నేను నాగిరెడ్డిగారు, చక్రపాణిగారు లేబ్లో రష్ చూశాం!

అందులో-

భీముడు బస్స్టాండు దగ్గరనుంచుని తనలో తాను అనుకుంటాడు "ఛీ! ఛీ! వెధవ పనిచేసాను! టిఫిన్ తిని



డబ్బులు ఇవ్వకుండా వచ్చేశాను! డబ్బులు రాగానే వెళ్లి వాడి బిల్లు వాడికి చెల్లించేస్తాను" ఈ వాక్యం. యం.జి.ఆర్. అదనంగా రాసుకున్నాడు. తన అభిమాన ప్రేక్షకుల మనసులలో తన ఇమేజ్ దెబ్బతినకుండా!

అంటే "అన్న డబ్బులివ్వకుండా తినడు", "ఒకరిని మోసం చేయడు" అని అభిమానులు అనుకోవాలన్నమాట!

ఈ విధంగా ప్రజల్లో తన ఇమేజ్ పెంచుకున్నాడు గనకనే మాట పడిపోయిన తరువాత గూడ తమిళనాడును ముఖ్యమంత్రిగా పాలించాడు!

యం.జి.ఆర్.ని గురించి ఒక కథ చెబుతారు. సినిమా హీరోలకి పెద్ద మొత్తంలో లక్షలలో (ఇప్పుడు అవి కోట్లకు పెరిగినయ్యనుకోండి) రెమ్యూనరేషన్లు ఇస్తుంటారు గదా!

ఒక తమిళ ప్రొడ్యూసరు యం.జి.ఆర్.కు చాలా పెద్ద మొత్తం బ్లాక్ మనీ సంచులలో పెట్టి ఇచ్చాడట! యిచ్చి, తన నిజాయితీని నిరూపించుకోవడం కోసం ఒట్టువేసుకున్నాడట. ఏమని?

"దేవుడిమీద ఒట్టువేసుకుని చెబుతున్నాను. మీకు ఈ డబ్బు ఇచ్చినట్టు ఎవరికీ చెప్పను" అన్నాడట.

అందుకు యం.జి.ఆర్. "చెబితే ప్రమాదం నీకేగాని నాకుగాదు! అన్న మీద అబద్ధాలు చెబుతావా?" అని వాళ్లు నిన్నే తంతారు" అన్నాడట.

తన అభిమానుల్లో అంత నమ్మకం కలిగించానన్న ధీమా! మరో విషయం! అతను కరుణానిధితో విభేదాలు వచ్చి అన్నా డి.యం.కె. పార్టీ పెట్టకముందు డి.యం.కె.లోనే ప్రముఖ స్థానంలో ఉండేవాడు. అప్పుడు అన్నాదొరై డి.యం.కె. అగ్రనేత.

డి.యం.కె. వాళ్లు నిరీశ్వరవాదులని గద ప్రతీతి. Atheists!

యం.జి.ఆర్. డి.యం.కె.లో ఉండగానే అతని ఇంట్లో ఒక పూజగది ఉండేదని రోజా షూటింగుకు వచ్చేటప్పుడు రహస్యంగా ఇంట్లో పూజచేసి వచ్చేవాడని మా ప్రొడక్షన్ మేనేజర్లు ("ఎంగ వీట్టుపిళ్లై" - నాగిరెడ్డిగారి తీసేటప్పుడు) చెప్పేవాళ్లు! వాళ్లు తరచు అతని ఇంటికి లోపలికి గూడ అవసరం వచ్చినప్పుడు వెళ్లేవాళ్లుగదా!

ఆ తరువాత అతను తమిళనాడు ముఖ్యమంత్రి అయిన తరువాత బహిరంగంగానే 'మూకాంబిక' దేవాలయానికి వెళ్లి పూజలు చేసి వస్తుండేవాడు!

దీనిని బట్టి అర్థం చేసుకోవచ్చుగదా ప్రజానాయకులనబడేవాళ్లు ఎన్ని విధాలుగా ప్రజలను మభ్యపెట్టి మోసాలు చేయగలరో!

దీనికంతకూ మూలకారణం ప్రజలలో శతాబ్దాలుగా పాతుకుపోయిన "ఆరాధనా" భావం!

ఆలయంలో దేవుణ్ణి ఆరాధించినట్టుగానే ఏవో కొన్ని సద్గుణాలు, మహిమలు ఉన్న మానవుణ్ణి దేవుడుతో సమానంగా భావించి ఆరాధించడం!

మనిషిలో మంచితనం దానగుణం, నీతి, నిజాయితీ, సేవాభావం లాంటి సద్గుణాలు ఉండవచ్చు! అటువంటి వాళ్లను అభినందించవచ్చుగాని దైవసమానుడుగా ఆరాధించడంలోనే వస్తున్నది చిక్కు!

"మనిషిలో ఎన్ని సద్గుణాలున్నా వాడు మనిషేగాని దేవుడుకాదు! కామ, క్రోధ, లోభ, మోహ, మద,



మాత్సర్యాలనే అరిషడ్వర్గాలను జయించిన మానవుడు ఈ ప్రపంచంలో లేనే లేడు" అన్న ధృఢమైన నమ్మకం వున్నప్పుడు -

ఈ బాబాలకు, స్వామీజీలకు, సాష్టాంగ నమస్కారాలు చేసి మితిమీరిన భక్తిభావంతో స్వామీజీని వుయ్యాలలో కూర్చోబెట్టి వూపుతూ యవ్వనంలో ఉన్న పదిమంది ఆడపడుచులు ఆయన మీద పువ్వులు, అత్తర్లు, పన్నీరు వగైరా సుగంధాలు చల్లి, గంధం రాసి చుట్టూ తిరుగుతూ పవళింపు సేవలు, భజనలు, పాటలు పాడుతుంటే

కాస్తో కూస్తో సద్గుణాలున్న వాడికి గూడ దుర్బుద్ధులు పుడతాయి!

అందుకే దేశానికి ప్రస్తుతం పుట్టిన పెద్ద జాడ్యం - నకిలీ బాబాలు, దొంగస్వాముల స్వైర విహారాలు!

నకిలీబాబాయే చెబుతాడు, తన భక్తులకు "నకిలీబాబాలను నమ్మవద్దు"! అని గాలిలోనుంచి విభూది, కుంకుమలు, వజ్రపుటుంగరాలు, డైమండ్ నెక్లెసులూ, స్విస్ గడియారాలు సృష్టించే బాబాలు మోసగాళ్లేగాని దేవుళ్లు, దైవాంశ సంభూతాలు కారు అని కేవలం అవి గారడీలు మ్యాజిక్‌లేనని. మిత్రుడు బి.వి. పట్టాభిరాం లాంటి మెజీషియన్లు పబ్లిక్ థియేటర్లలో ప్రజల ముందు ప్రత్యక్షంగా చేసి నిరూపించినా మామూలు అమాయక ప్రజలనే గాక దేశాధ్యక్షులు, ప్రధానమంత్రులు, ముఖ్యమంత్రులు, బడాబడా రాజకీయ నాయకులను, మేధావులను, విద్యాధికులను గూడ ఎయిడ్స్ కంటే భయంకరమైన వైరస్ పట్టి పీడిస్తున్నదంటే ఈ దేశ భవిష్యత్తును గురించి భయపడడం బాధపడడం సహేతుకమేగదా!

సరే! ఇలాంటి నిరాశానిస్పృహల వాతావరణం నుంచి కాస్త మనసుకు చల్లని ఉల్లాసం కలిగించే కబుర్లకు పోదాం!

తమిళ సినిమారంగంలో యన్.యస్. కృష్ణన్ అని ఒక మంచి హాస్యనటుడుండేవాడు. అతని భార్య టి.ఎ. మధురం! వాళ్లిద్దరూ ఆరోజుల్లో చాలా పాప్యులర్ హాస్యనటద్వయం!

యన్.యస్. కృష్ణన్ ఎంత పాప్యులర్ అంటే అతనికి హాస్య సన్నివేశాలు, రచనలు ఎవరో ఒకరు రాసియిచ్చే పరిస్థితి దాటిపోయి అతనే ప్రొడ్యూసర్లను "మీకు కామెడీ ఎంతనిడివికావాలి? అని అడిగి తనే రాసి షూట్ చేసి ప్రొడ్యూసర్లకు ఇచ్చేవాడు. అసలుకథకు అతికేటట్లు, ఏవైనా లింక్సు కావాలంటే షూట్ చేసి ఇచ్చేవాడు.

అతడు మొదట నాటకాలలో చిన్న చిన్న వేషాలు వేసి ఆర్థికంగా చాలా కష్టాలు పడి తరువాత సినిమాలలోకి వచ్చి డబ్బు, పేరు ప్రతిష్టలు సంపాదించాడు. సినిమాలలో సంపాదించిన డబ్బు మొదటిసారిగా ఒక జట్కా స్టాండుకు విరాళంగా యిచ్చాడు.

ఆ ఊళ్లో జట్కాస్టాండుకు షెడ్డులేదు. గుర్రాలు ఎండకు ఎండి వానకు తడిసి అవస్థపడుతున్నాయి! అందువల్ల ఆ స్టాండులో ఒక రేకుల షెడ్డు వేయించాడు. దాని ప్రారంభోత్సవంలో మాట్లాడుతూ అతను అన్నాడు : "నా సంపాదనలోంచి మొదటి విరాళం జట్కాస్టాండుకు ఎందుకిచ్చానంటే - నేను జీవితంలో ఎన్నో కష్టాలు పడ్డాను! ఎవరూ నన్ను ఆదుకోలేదు! ప్రోత్సహించలేదు!

నన్ను 'పైకిరా', "ముందుకురా!" అని ప్రోత్సహించినవాడు జట్కావాడే! అందుకే జట్కాస్టాండుకు విరాళమిచ్చాను" అన్నాడు.



జట్కాబండిలో వెనక బరువైతే గుర్రం లాగలేదు! అందుకని జట్కావాడు "పైకిరండి! ముందుకు రండి" అని ప్రాథేయపడతాడు. అలా ఉండేవి యన్.యస్. కృష్ణన్ హాస్యప్రసంగాలు!

ఎన్.ఎస్. కృష్ణన్ తనే కామెడీ ఎపిసోడ్స్ రాసి తనే షూట్ చేసి ప్రొడ్యూసర్లకి ఇచ్చేవాడని చెప్పానే - అతని కామెడీ రచనలన్నీ అద్భుతంగా ఉండేవి. ముఖ్యంగా అన్ని తరగతుల ప్రేక్షకులను అలరించేట్లుగా ఉండేవి!

ఒక పిక్చర్లో కృష్ణన్ రాసి షూట్‌చేసిన కామెడీ! కృష్ణన్ ఒక అమ్మాయిని ప్రేమిస్తాడు. కాని ఆపిల్ల తండ్రి అతన్ని ఇంటి ఛాయలకు గూడా రానివ్వడు. ఆ పిల్ల ఇంట్లో నుంచి తరచు బయటకు రాదు. ఏంచేయాలి?

ఆ పిల్ల తండ్రి పాల వ్యాపారం చేస్తుంటాడు ఒక మంచి గేదె ఉంటుంది. ఒకరోజు ఆ గేదె మెడకు పలుపువేసి ఆ పలుపు చేతబట్టుకుని యజమాని గేదెను రోడ్డుమీద తీసుకుపోతుంటాడు. కృష్ణన్ ఒక కిరీటము, చంకీదుస్తులు వేసుకుని వెనకనుంచి వెళ్ళి. మెల్లగా ఆగేదె మెడలోని పలుపు విప్పి గేదెను పక్కకు తోలి తన మెడకు ఆ పలుపు తగిలించుకుంటాడు. పిల్ల తండ్రి తలవంచుకుని నడిచిపోతుంటాడు పలుపు పట్టుకుని. అతని దృష్టిని రాబట్టడానికి కృష్ణన్ ఆగుతాడు. పిల్ల తండ్రి ఏమిటా అని వెనక్కి తిరిగి చూస్తాడు. ఆశ్చర్యపోతాడు. అప్పుడు కృష్ణన్ అతనికి నమస్కరించి "స్వామీ! నేను పూర్వజన్మలో ఒక గంధర్వుడును! శాపవశమున మీ ఇంట్లో గేదెగా పుట్టాను. ఈ రోజుతో నాకు శాప విమోచనం అయింది. నేను గంధర్వలోకానికి పోతాను! ఇన్నాళ్ళు నన్ను మీరు ఎంతో దయతో, ఏలోటు లేకుండా మంచి మంచి దాణాలు, తిండి పెట్టి పోషించారు! కృతజ్ఞుణ్ణి! మీ ఋణం ఎలా తీర్చుకోవాలో తెలియడంలేదు! కాని ఏదో విధంగా మీకు ఏదో మేలుచేసి మీ ఋణం తీర్చుకుంటాను!" అంటాడు.

ఆ పాలవాడు ఆశ్చర్యపోయి "అయ్యో! ఇన్నాళ్ళు మా ఇంట్లో గేదెగా ఉన్నది మీరా! ఇన్నాళ్ల అనుబంధం తెంచుకుని పోతారా? కనీసం ఒక వారం పదిరోజులయినా మా ఇంట్లో ఉండి నా ఆతిథ్యం స్వీకరించాలి" అంటాడు.

"లేదు! నేను పోవాలి" అని కాస్త బెట్టుచేస్తే, "వీల్లేదు! నా ప్రార్థన మన్నించాలి" అని వాణ్ణి ఇంటికి తీసుకుపోయి కూతురుకు పరిచయం చేస్తాడు.

అలా ప్రేమికులు కలుసుకుంటారు.

దీనినే నేను "పూజాఫలం" సినిమాలో చిన్న మార్పు చేసి ఉపయోగించుకున్నాను. గేదెకు బదులు పెంపుడు కుక్కను పెట్టాను! మిగతా కథంతా అదే. కృష్ణన్ వేషం పొట్టి ప్రసాద్ వేశాడు. పాలవాడి వేషం రేలంగి!

తన పెంపుడు కుక్క గంధర్వుడని తెలిసినప్పుడు రేలంగి! "అయ్యో! మీరు నిజంగా కుక్కేననుకుని ఒకసారి తమరు నా చెప్పులు కొరికితే ఆ చెప్పుతోనే తమర్ని చచ్చేట్టు కొట్టాను! ఆ పాప పరిహారార్థం మీరు నా ఆతిథ్యం స్వీకరించాలి" అని ఇంటికి తీసుకెళ్లి కూతురుకు పరిచయం చేస్తాడు. అదనంగా నేను చేసిన మార్పు ఆ కుక్క రోజంతా అక్కడా ఇక్కడా తిరిగి సాయంత్రానికి ఇంటికి వస్తుంది. అప్పుడు 'గంధర్వుడి' అసలు రంగు బయటపడుతుంది. రేలంగి అతన్ని తన్ని తరిమేస్తాడు.

ఇటువంటిదే మంచికామెడీ ఎపిసోడ్! సినిమా పేరు గుర్తులేదు

ఎన్.ఎస్. కృష్ణన్ టి.ఏ మధురం దంపతులు! భార్యగడుసుది! కాస్త గయ్యాళి. ఒక రోజు కృష్ణన్‌కి తనకు చిన్నప్పుడు చదువు చెప్పిన గురువు కనబడతాడు. పరస్పరం యోగక్షేమాలు గురించి మాట్లాడుకున్న తరువాత కృష్ణన్ తన గురువుగారిని భోజనానికి ఆహ్వానిస్తాడు.



గురువుగారూ శిష్యుని భక్తికి ఎంతో సంతోషించి చెరువుకు వెళ్లి స్నానం చేసివస్తాను. అని అతని ఇంటి అడ్రసు తీసుకుని స్నానానికి వెళతాడు.

కృష్ణన్ ఇంటికి వెళ్లి భార్యకు విషయం చెబుతాడు. గురువుగారిముందు తన పరువు ఆధిక్యత నిలబెట్టమని ప్రాధేయపడతాడు. "ఏం చేయమంటావు? పాయసం చేయనా? పరమాన్నం చేయనా?" అని అడుగుతుంది.

"అవేమీ కాదు! మా గురువుగారిముందు నిన్ను తిడతాను! నువ్వు పడాలి" అంటాడు.

"ఎన్ని తిట్లు తిడతావు"

"వంద!"

"వంద నావల్లగాదు! పాతిక తిట్లువరకు పడతాను" అంటుంది.

"సరే! అంతవరకే ప్రాప్తం అనుకుంటాను" అంటాడు.

గురువుగారు వస్తాడు భోజనాలకు కూర్చుంటారు. భార్య వడ్డిస్తుంది.

కృష్ణన్ "నీకు బుద్ధి వుందాలేదా? అన్నం యింత బిరుసుగానా వండేది? నీకు రోజురోజుకు పొగరు ఎక్కువవుతోంది. ఒళ్లు చీరేస్తాను! జాగ్రత్త" అని తిడతాడు భార్య మాట్లాడకుండా లోనికి పోతుంది. లోపల తిట్లు లెక్క రాసుకుంటుంది గోడమీద! గురువుగారు సంతోషిస్తాడు. తన శిష్యుడికి అనుకూలవతి యైన భార్య లభించిందని. భోజనం మూడు వంతులు అయింది భార్య వేడి వేడి సాంబారు తెస్తుంది. లెక్క మరచిపోయి కృష్ణన్ పాతికకు మించి 26వ తిట్టు తిడతాడు. భార్య చేతిలోని వేడివేడి సాంబారు వాళ్లిద్దరి నెత్తిన కుమ్మరిస్తుంది! వాళ్లు లబోదిబో మని లేచి పారిపోతారు. యిటువంటి కామెడీలు ఎంజాయ్ చేయని ప్రేక్షకులుంటారా?

ప్రతిమనిషీ జీవితంలో అనుభవాల వల్లనే కొన్ని పాఠాలు నేర్చుకుంటాడు. కొన్ని నమ్మకాలు ఏర్పడతయ్!

యన్.టి.రామారావుగారి సొంత పిక్చరు 'కోడలు దిద్దిన కాపురం' సినిమాకి నేను మొదటిసారి స్క్రిప్టు రాశాను.

అప్పటి అనుభవం నాకు బాగా జ్ఞాపకం!

రోజూ వుదయం 8.30 నుంచి 12.30 వరకు మా కథా చర్చలు. ఉదయం సరిగ్గా 8.30కు కారు స్వయంగా డ్రైవ్ చేసుకుని మదరాసు బజుల్లా రోడ్‌లోని ఆయన యింటికి వెళ్లేవాణ్ణి!

ప్రతిరోజూ నేను వెళ్లేసరికి రామారావుగారి యింటి బయట రోడ్డుమీద రెండు మూడు బస్సులు తిరుపతి ప్రయాణీకులతో నిలబడివుండేవి! పాపం ఎంతసేపటినుంచి వేచివున్నారో, నాకారు గేటులోకి వెళ్లగానే ఆప్రయాణీకుల్లో యిద్దరు ముగ్గురు వచ్చి -

"సార్! మీరు చెప్పండి! రామారావుగారితో వుదయం 6 గంటలనుంచి వేచివున్నాం! పిల్లలు పాలకోసం కొందరు టిఫిన్ కోసం అల్లాడుతున్నారు. ఒక్కసారి ఆయన్ని బయటికి వచ్చి దర్శనం యివ్వమనండి." అని నన్ను బ్రతిమాలాడేవారు.

ఒకసారి ఒక బస్సుకంట్రాక్టరు చెప్పాడు "తిరుమల కొండమీద దేవుడి దర్శనం కాకపోయినా ఫరవాలేదు గాని మదరాసులో యన్.టి.రామారావుగారిని గనక చూపించకపోతే నీకిచ్చే డబ్బులో కట్‌చేస్తాం" అని ఖచ్చితంగా చెప్పేవారట ప్రయాణీకులు. నేను లోపలికివెళ్లి రామారావుగారితో చెప్పేవాణ్ణి.



"రామారావుగారూ! మన చర్చలు తరువాత చేసుకోవచ్చు! ముందు ఆ తిరుపతి ప్రయాణీకుల్ని పంపించిరండి! పాపం పిల్లా పాపలతో పొద్దుటినుంచి ఎండలో నిలబడివున్నారు."

"అవును నిజమే!" అని ఆయన లేచివెళ్లి వరండాలో నిలబడేవాడు. గదిముందు వరండా! నేను గది వాకిట్లో నిలబడి చూస్తుండేవాణ్ణి! ఆయన గేటుదగ్గర గూర్ఖాకు సైగచేయగానే గూర్ఖా గేటు తెరిచేవాడు.

బస్సులోని ప్రయాణీకులు గబగబ తోసుకుంటూ వెల్లువలా లోపలికి పరిగెత్తుకొచ్చేవారు. అందరూ ఆయన ముందు నిలబడేవారు. కొందరు పండ్లు, తిరుపతి లడ్లు ఇచ్చేవారు! పాదాభివందనాలు చేసేవారు.

అన్ని వయసుల వారు అలా నోరువెళ్లబెట్టి కన్నార్పకుండా ఆయనవంక దేవుణ్ణి చూసినట్టు చూస్తూ నమస్కరిస్తూ నిలబడేవారు!

నాకు అనిపించేది "ఈయన పూర్వజన్మలో ఎంత పుణ్యం చేసుకున్నాడో! మనం ఎవరికైనా "వందరూపాయలిస్తాను నాకాళ్లకు దండం పెట్టు" మంటే ఒక్కడూ పెట్టడే! ఈయనకు పూర్వజన్మ సుకృతం కాకపోతే మరేమిటి?" అనుకునేవాణ్ణి.

అందుకే తెలుగుదేశం పార్టీ పెట్టిన 9 నెలల్లోనే రాష్ట్రానికి ముఖ్యమంత్రిని చేశారు జనం! అపూర్వం! రామారావుగారిలో కొన్ని గొప్పగుణాలున్నాయి. ! నా అనుభవంలో నేను చూచినవి -

భానుమతిగారంటే ఆయనకు చాలా గౌరవం! ఆయన సొంత చిత్రం 'తాతమ్మకల'లో ఆమె నటించింది. షూటింగు జరిగేటప్పుడు గూడ ఆమెను ఎంతో గౌరవంగా చూసేవాడు.

వాహినీ స్టూడియోలో షూటింగు జరుగుతోందని తెలిసి ఊరికే చూద్దామని సెట్‌లోకి వెళ్లాను.

భానుమతిగారు మేకప్ వేసుకుని సెట్‌లోకి రాగానే ఒకరి కొకరు నమస్కారాలయిన తరువాత ఆమెను ఖాళీగా కూర్చోబెట్టకుండా సీనులో ఆమె ఉన్న షాట్స్ అన్నీ ముందుగా ప్లాన్ చేసిన వరసనే ఆమెకు సంబంధించిన షాట్స్ తీసి సీన్ అయిపోయిన తరువాత ఎంతో మర్యాదగా "మేడమ్! ఈ పూటకు మీ వర్కు అయిపోయింది! ఇక మీరు వెళ్లవచ్చు" అని ఆమె వెంట బయటఉన్న కారు దాకా వెళ్లి కారు తలుపు తీసి ఆమె కారులో కూర్చున్న తరువాత తలుపువేసి నమస్కరించి "సెలవు! ఉంటాను మేడమ్!" అని కారు బయలుదేరి వెళ్లిందాకా అక్కడే నుండి తిరిగివచ్చేవాడు.

అలాగే నా విషయంలో గూడ! నాకు చాలా embarassing గా వుండేది.

ఆయన ఇంట్లో - ఆఫీసులో కథా చర్చలు అయిపోయిన తరువాత గడియారం చూచుకుని "12.30 అయింది రామారావు గారూ! వస్తాను" అని నేను నా కారు దగ్గరకు వెళితే నావెంట వచ్చి (నాది సెల్ఫ్ డ్రైవింగ్) ముందు తలుపు తీసి నేను కారులో కూర్చుని కారు స్టార్ట్ చేసేదాకా నిలబడి కారు కదలబోతుండగా 'నమస్కారం' అని చెప్పి లోనికి వెళ్లేవాడు!

మరొకసారి హైదరాబాద్‌లో **1972-73లో అనుకుంటాను.**

నేను స్క్రిప్టు రాస్తున్న ఒక ప్రొడ్యూసరు నాచారంలో రామారావుగారి స్టూడియోలో "ఏదో మనకి పనికి వచ్చే సెట్ ఉందట" అని చెప్తే అందరం నాచారం స్టూడియోకి వెళ్లాం. వెళ్లిన తరువాత రామారావుగారు స్టూడియోలోనే



ఆయన రూంలో ఉన్నారని తెలిసింది. ఆ ప్రొడ్యూసర్లకి రామారావుగారు బాగా తెలుసు! అందరం రామారావుగారి రూంలోకి వెళ్లాం!

నేను ఆ ప్రొడ్యూసర్లకు రాస్తున్న స్క్రిప్టు తాలూకు కబుర్లలో ఆ ప్రొడ్యూసరు అన్నాడు "రామారావుగారూ! నరసరాజుగారు మాకు ఒక కథ చెప్పారు! చాలా బాగుంది! ఆ కథ పిక్చరు తీస్తున్నాం" అన్నారు. రామారావుగారు వెంటనే "నరసరాజుగారు చెప్పిన కథ బాగుందని మీ సర్టిఫికెట్ ఎందుకు? ముందు ఆయనకు బాగుంటేనే ఎవరికైనా ఇస్తారు" అన్నారు.

ప్రొడ్యూసరు నిరుత్తరుడైనాడు. కాసేపు ఆ కబుర్లు ఈ కబుర్లు అయిన తరువాత "వస్తామండి" అని అందరం లేచాం!

రామారావుగారు నాతో "మీరు కూర్చోండి" అని, వాళ్లతో "మీరు వెళ్లండి! నరసరాజుగారు తరువాత వస్తారు" అన్నారు.

వాళ్లంతా బయటికి వెళ్లారు. నేనూ రామారావుగారు దాదాపు అరగంటసేపు పాత అనుభవాలు కుటుంబ క్షేమ సమాచారాలు మాట్లాడుకున్నాం! రామారావుగారిని ఎప్పుడో పని ఉన్నప్పుడు తప్ప నేను ఎక్కువగా కలిసేవాణ్ణి గాదు!

ఆయన ముఖ్యమంత్రి అయిన తరువాత మొత్తం ఆరు-ఏడు సార్లకంటె ఎక్కువ కలవలేదు! ఏం పని ఉంటుంది? ఆయన టైం వృధా చేయడమెందుకని నేను వెళ్లేవాణ్ణి కాదు! నేను వచ్చి చూడలేదేమని ఆయన అనుకునేవాడుగాదు! ఆయనంటే నాకు గౌరవం ఉండేది! నేనంటే ఆయనకు గౌరవం ఉండేది.

ఆ రోజు యిద్దరం అరగంటకు పైగా మాట్లాడుకున్న తరువాత "వస్తాను, రామారావుగారు" అని లేచాను! ఆయన గూడ నాతో రూం వాకిలి దాకా వచ్చారు. బయట ఆ ప్రొడ్యూసర్లు నిలబడి వున్నారు!

నేను కారు దగ్గరకు పోతుంటే ఆయన గూడ వెంటవచ్చి "ఉంటాను! నరసరాజుగారూ" అని నమస్కరించి తిరిగి రూంలోకి వెళ్ళిపోయారు అది చూచిన ప్రొడ్యూసరు ఆశ్చర్యంగా -

"నరసరాజుగారూ! నేనూ రామారావుగారిని చాలా సార్లు కలిసాను! చూశాను! ఒక్క వి.పి. సింగ్ గారిని తప్ప వెంట వచ్చి వాకిలి దాకా పంపడం నేను చూడలేదు" అన్నాడు.

"ఇందులో ఏముంది! ఇది మాకు మామూలే!" అన్నాను. కారులో వెళ్లిపోయాం!

ఇందులో చిన్న తిరకాసు ఉంది! ఇంటికి వచ్చిన స్నేహితుల్ని మర్యాదగా కారు దాకా వెళ్లి కారులో కూర్చున్న తరువాత సెలవు తీసుకుని రావడం సభ్యతగల వాళ్లందరూ చేసే పనే!

విషయం వచ్చింది గనక చెబుతాను! జస్టిస్ చాగ్లా అని ముంబాయి హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా పనిచేశారు. కేంద్ర మంత్రిమండలిలో 'లా' మినిస్టరుగా కూడా పనిచేశారు. చాలా గౌరవనీయుడైన మనిషి!

బాగా వయసు పైబడిన తరువాత ముసలివాడై నడవడం గూడ కాస్త ఇబ్బంది పడుతున్న సమయంలో ఎవరో మిత్రులు ఆయన్ని చూడ్డానికి ఆయన ఇంటికి వచ్చారట! ఆ మిత్రులు తిరిగి వెళ్లబోయేటప్పుడు కారు దగ్గరకు చాగ్లా కూడా రాబోతుంటే- ఆ మిత్రులు మర్యాదగా "ఎందుకు మీరు" అని వారించారట! అప్పుడు ఆయన ఇంగ్లీషులో అన్నారట! It is too late in life to learn bad manners!" అని



కాబట్టి ఇంటికి వచ్చిన మిత్రులను సగౌరవంగా పంపడం చాలామంది చేసే పనే! కాని అలా పంపడంలో చూపే గౌరవ మర్యాదలు - మనస్ఫూర్తిగా చేసేవా లేక కేవలం లాంఛనానికి చేసేవా? అని అనుమానం వస్తుంది అప్పుడప్పుడు!

గోటేటి రామచంద్రరావుగారని గవర్నమెంటు ఆఫీసరు. రామారావుగారు ముఖ్యమంత్రిగాఉన్నప్పుడు ఆయనకు రామచంద్రరావు గారు పర్సనల్ సెక్రటరీ గా ఉండేవారట!

రామారావు గారు పోయిన తరువాత రామచంద్రరావుగారు ఆంధ్రప్రభుత్వ ఉద్యోగిగా కల్చరల్ కౌన్సిల్ కార్యదర్శిగా పనిచేస్తున్నారు. అంతవరకు ఆయనతో నాకు పరిచయం లేదు. రవీంద్ర భారతిలో ఏదో కల్చరల్ ప్రోగ్రాం సందర్భంలో రామచంద్రరావుగారితో పరిచయమయింది! ఆ తరువాత ఢిల్లీలో ఆంధ్రప్రభుత్వం తరపున 'హాస్యోత్సవం' జరిపారు రామచంద్రరావుగారు! ఆ సందర్భంగా నేను-జంధ్యాల-గొల్లపూడి మారుతీరావు, రావికొండలరావు మరికొంతమంది ఢిల్లీ వెళ్లాం! ఆ విధంగా రామచంద్రరావుగారితో పరిచయం స్నేహంగా మారింది. ఏదో ఒక సందర్భంలో అప్పుడు అన్నారు రామచంద్రరావుగారు "మీరంటే యన్.టి.రామారావుగారికి చాలా గౌరవమండి" అన్నారు. అప్పుడు నాకొక తృప్తి. రామారావుగారు ఇదివరలో నాపై చూపిన గౌరవ మర్యాదలు మనస్ఫూర్తిగా చేసినవేగాని లాంఛనానికి చేసినవి కావు అని! అంటే ఆ మర్యాదలు లాంఛనానికి చేసినవని అంతకుముందు నేను అనుకున్నానని కాదు సుమా!

అలాగే నెల, రెండు నెలల క్రితం హైదరాబాద్‌లో బ్రహ్మానందరెడ్డి పార్కులో ఉదయం నడకలో పరిచయమై స్నేహితుడిగా మారిన మిత్రుడు ఒకసారి అన్నాడు!

"ఆయన అంతకు ముందు రెండు రోజుల క్రితం ఏదో పార్టీలో అక్కినేని నాగేశ్వరరావు గారిని కలిశాడట! అప్పుడు మాటల్లో నా విషయం వచ్చిందట!

ఒకరోజు ఉదయం నడకలో కలిసి ఆ మిత్రుడు నాతో అన్నాడు - "నాగేశ్వరరావు గారికి మీరంటే చాలా గౌరవమండి He is a gentleman!"అన్నారు" అన్నాడు.

ఈ రెండు అభిమానాలవల్ల తెలిసేదేమంటే - మనమీద మన మిత్రులకు సద్భావం గౌరవం ఉన్నాయని మనకు తెలిసినా, పరోక్షంగా ఎవరితోనో ఆ మాటలు అన్నారని తెలిసినప్పుడు అదొకరకమైన తృప్తి! ఆనందం!

ఇవి అనుభవైకవేద్యం! అనుభవించినవాళ్లకే అర్థమవుతాయి!

ఎన్.టి.రామారావుగారు రాజకీయాల్లోకి రావడం నాకు సుతరామూ యిష్టంలేదు! ఆయన రాజకీయాల్లోకి వచ్చాడు. ఆయన సినిమా గ్లామర్ వల్ల కొంత, అప్పటి రాష్ట్ర రాజకీయ వాతావరణం వల్ల కొంత కారణంగా ప్రజలు ఆయనకు పట్టం కట్టారు. ముఖ్యమంత్రి అయినాడు. ఆంధ్రులకు దేశంలోనూ, విదేశాలలోనూ గుర్తింపు, పేరు ప్రఖ్యాతలు సంపాయించి పెట్టాడు. ఆడపిల్లలకు ఆస్తిలో వాటా కావాలని శాసనాలు చేయించాడు. ఇంకా ఎన్నో మంచి పనులు చేశాడు! కాదనను!

కాని ఆయన రాజకీయాలకు తగడు అని నా నిశ్చితాభిప్రాయం! ఎందుకంటే ఆయనకు పార్టీ నిర్మాణం, ప్రజాస్వామ్యం లాంటి విషయాలలో అనుభవం లేకపోగా కొన్ని దురభిప్రాయాలు గూడ వున్నాయి!

ముఖ్యంగా ప్రస్తుత పరిస్థితుల్లో రాజకీయ నాయకులకుండవలసిన లక్షణాలు ఆయనకు లేవు!



ఆయనకు కుట్రలు, కుతంత్రాలు తెలియవు! మనసులో ఉన్నది ఏదో వీక్ మూమెంట్‌లో బయటికి అనేస్తాడు. యిది రాజకీయ నాయకుల కుండవలసిన లక్షణం కాదు! ప్రస్తుతం రాజకీయాలలో కుట్రలు, కుతంత్రాలు లేకుండా పని జరగదు!

పైగా ఆయనది ఫ్యూడల్ మనస్తత్వం! పబ్లిక్‌గా అనకపోయినా ఆయన ప్రయివేటుగా అంటుండేవాడు. ఆయనకు భూ సంస్కరణలలో నమ్మకంలేదు.

"15 ఎకరాల ఆదాయంలో రైతు - పిల్లల్ని ఎలా చదివించగలడు? పట్టణాలలో నివసించే ఉద్యోగులు, డాక్టర్లు, లాయర్లు తమ పిల్లలను పైచదువులు చదివించి విదేశాలకు పంపించుకుంటారా?

రైతుమాత్రం తరతరాలు మట్టి పిసుక్కుని బ్రతకాలా? ఇలా వుండేవి ఆయన ఆలోచనలు!

ప్రజాస్వామ్యం అంటే బొత్తిగా అవగాహనలేదు! ఒకొక్కసారి బహిరంగంగానే అనేవాడు!

"నేనే పార్టీ! పార్టీయేనేను! నేను పోయిన తరువాత పార్టీ వుండదు!" అని.

ఇవిగాక ఆయనకు ఆవేశం ఎక్కువ! అది రాజకీయ నాయకుడికి ఉండగూడదు. ఆచితూచి మాట్లాడాలి! ఆవేశపరుడికి అది సాధ్యంకాదు. ఆయన పోయిన తరువాత ఆయనతో నాకున్న సంబంధ బాంధవ్యాలు - అనుభవాలు 'ఈనాడు' దినపత్రికలో 'అక్షింతలు' కాలంలో రాస్తూ చివరన పైన చెప్పిన విషయాలు గూడ రాశాను.

అవి నావ్యక్తిగతాభిప్రాయాలు అని గూడ రాశాను! ఆయన రాజకీయాలలోకి రాకుండా ఉంటే యింకా పది పదిహేనేళ్లు బ్రతికేవాడు. ఇంకా నాలుగు మంచి సినిమాలు తీసేవాడు అని గూడ రాశాను.

మన ప్రజల్లో 'ఆరాధనాభావం' 'వీరపూజ' లాంటి గుణాలను గురించి చెప్పానే ఆ సందర్భంగా కొన్ని ప్రమాదాలు గూడ ఉన్నాయండి! ప్రమాదాలు ఆరాధించే ప్రజలకే గాదు ఆరాధింపబడే వాళ్లకు గూడ!

ఏ రంగంలోనైనా, సినిమాల్లోగాని, నాటకాలలోగాని, రాజకీయాలలోగాని, క్రీడారంగంలోగాని, ఆధ్యాత్మిక రంగంలోగానీ, ఎవరైనా గొప్ప విజయాలు సాధించినా, గారడీ హస్తలాఘం లాంటి విద్యల ద్వారా అతీంద్రియ శక్తులు ప్రదర్శించిగాని ప్రజల్లో ప్రాచుర్యం పొందిన వాళ్లకి కొన్ని ప్రమాదాలున్నాయి!

అటువంటి విజయాలు - అతీంద్రియ శక్తులు ప్రదర్శించిన వాళ్లని, మనవాళ్లు ఆకాశానికెత్తి 'ఇంద్రుడు', 'చంద్రుడు' అని పొగిడి నానా హంగామా చేస్తారు! ప్రజలేగాదు - కొన్ని విషయాల్లో ప్రస్తుతం మన ప్రభుత్వాలుగూడ అలాంటి పనులు చేస్తున్నయ్!

ఏ రంగంలోనైనా అపూర్వ విజయాలు సాధించిన వాళ్లకి మన ప్రభుత్వాలు చేసే మర్యాదలు, సన్మానాలు చూస్తున్నాం గదా!

కాని ఈ సన్మానాలు, సత్కారాలు, పొగడ్తలు, వీర పూజలు స్వీకరించేవాళ్లు తమకు జరిగే సన్మాన సత్కార పూజా వగైరాలకు తాము తగుదుమా అని ఆత్మ విమర్శ చేసుకోకుండా నిజంగానే తాము మానవాతీతులమని అనుకుంటే ఒక్కొక్కప్పుడు ప్రమాదాల్లో పడతారు!

ఇక్కడ నాకు ఒక కథ జ్ఞాపకం వస్తోంది. "కామమ్మ మొగుడు, కామమ్మ మొగుడంటే "కామోసు" "కామోసు" (కాబోలు) అనుకున్నానని ఒక కథ ఉంది. ఒక పల్లెటూళ్లో కామమ్మ అని ఒక ఆడపిల్ల! ఆ పిల్లకి బాల్య వివాహం,



నాలుగయిదేళ్లకే పెళ్లిచేశారు. మొగుడు ఎందువల్లనో ఇంట్లో చెప్పకుండా పోయాడు తరువాత తెలిసింది సన్యాసుల్లో కలిశాడని!

ఊళ్లో జనం పోనీలెమ్మని ఊరుకున్నారు! మరచిపోయారు! కాలం గడిచింది.

కొంత కాలం తరువాత అంటే తొమ్మిది పదేళ్ల తరువాత ఆఊళ్లోకి ఒక సన్యాసి వచ్చాడు. వాడికి అచ్చం కామమ్మ మొగుడి పోలికలున్నయ్! అది గమనించిన ఆసామి ఒకడు పోయి కామమ్మ తల్లిదండ్రులకి చెప్పాడు. అందరూ వచ్చి చూశారు!

'కామమ్మ మొగుడే' నని అందరూ నిశ్చయానికి వచ్చారు. కామమ్మ తల్లి దండ్రులు పరమానంద భరితులయ్యారు! అతన్ని ఇంట్లోనే ఉంచుకుని సకల మర్యాదలు భోగ, భాగ్యాలతో తమ కుటుంబంలో కలుపుకున్నారు.

చివరకి పిల్లకు వయసు వచ్చింది గనక శోభనానికి ముహూర్తంగూడ పెట్టారు!

సరిగ్గా ఆ ముహూర్తానికి ముందు రోజు కామమ్మ అసలు మొగుడు వచ్చాడు. సన్యాసం మీద విరక్తి కలిగిందేమో! జ్ఞానోదయమై మామూలు మనిషిగా వచ్చాడు.

అందరూ ఆశ్చర్యపోయారు! వాడి ఒంటి మీద పుట్టుమచ్చలు చిన్నప్పుడు ఆటపాటల్లో తగిలిన దెబ్బల గుర్తులు అన్నీ చూచి కామమ్మ అసలు మొగుడేనని తీర్మానించి అంతకుముందు వచ్చిన వాణ్ణి మోసగాడని తన్నడానికి సిద్ధమయ్యారు!

వాడన్నాడు "నేను మోసం చెయ్యాలని చెయ్యలేదండి! మీరందరూ నన్ను 'కామమ్మమొగుడు" "కామమ్మమొగుడు" అంటే నేనుగూడ "కామోసు" "కామోసు" అనుకున్నాను!

నాకర్రా, బుర్రా నాకు పారెయ్యండి పోతాను" అన్నాడట!

ఇలాగే ప్రస్తుతం 'ఇంద్రుడు', 'చంద్రుడు' 'మానవాతీతుడు' 'దైవాంశ సంభూతుడు' అని ప్రజలు ప్రభుత్వం చేస్తున్న మితి మీరిన సన్మాన సత్కారాలు పాదాభివందనాలు చూచి తాము నిజంగానే అంత గొప్పవాళ్లం కాబోలు అనుకుంటే వాళ్లకి గూడ అసలు 'నిజం' బయట పడ్డప్పుడు 'కామమ్మ మొగుడు" కథలో లాగ చివరికి శృంగభంగం అయ్యే ప్రమాదం ఉంది.

లోకాభిరామాయణం కాసేపు వదిలేసి మళ్లీ స్వవిషయానికి వస్తాను!

తండ్రి చిన్నప్పుడే పోతే నేను మా మేనమామల పోషణలో ముత్యాలంపాడులో పెరిగానని చెప్పానుగదా!

మా మేనమామలందరూ (అయిదుగురు అన్నదమ్ములు) నన్ను తమ పిల్లలకంటె గూడ బాగా చూశారు! తండ్రిలేని పిల్లవాడన్న కారణం గూడ కావచ్చు! మొత్తంమీద తండ్రిలేని లోటు లేకుండా పెంచి పెద్ద చేశారు.

1941లో నా కాలేజీ చదువు అయిపోయిన తరువాత బెజవాడ సత్యనారాయణపురంలో అంతకుముందే నేను మైనరుగా ఉన్నప్పుడు మా మేనమామలు నా డబ్బుతో కొన్న స్థలంలో ఒక డాబా కట్టాను. 1942 జనవరిలో గృహప్రవేశం జరిగింది. నిజానికి ఆఇల్లు మా ఆదిమామయ్య (రెండో మేనమామ) కట్టించాడు. కొంత ఆయన డబ్బు, కొంత నాడబ్బుతో! ఆయనకు పిల్లలు లేరు. అందువల్ల నాతో ఉండాలని ఉద్దేశం! నేను చెల్లెలి కొడుకుని,



నాభార్య ఆయనకు అన్న కూతురు.

అంతకుముందు ముత్యాలంపాడులోనే మా తాతయ్యగారి స్థలంలో మాకోసం ఇటుకగోడలతో పూరి ఇల్లు కట్టించి అందులో మాకుటుంబాన్ని ఉంచారు. నేను, మా అమ్మ, మా అక్కయ్య.

1942 నుంచి 1951 లో నేను సినిమా రంగానికి వెళ్లేవరకు నేను చేసింది ఏమీలేదు. క్లబ్బుకు వెళ్లడం, బిలియర్డ్స్ ఆడుకోవడం తప్ప చెప్పుకోదగ్గ యాక్టివిటీస్ ఏమీ ఉండేదికాదు! ఏడాదికోసారి మాఊరు తాళ్లూరు వెళ్లడం, భూముల కవుళ్లు వసూలు చేసుకురావడం, బ్యాంకులో వేసుకోవడం, కుటుంబానికి ఖర్చు పెట్టుకోవడం!

ఆ పదేళ్లలో నాకు కృష్ణాజిల్లాలోని తిరువూరు, మైలవరం, గంపలగూడెం, నూజివీడు జమీందార్ల కుటుంబాలతో సాన్నిహిత్యం వుండేది. (ఆ సాన్నిహిత్యం ఎలా ఏర్పడిందో ఇదివరకే చెప్పాను.) సామాన్యంగా జమీందార్ల పిల్లలకు దుర్వ్యసనాలు ఉంటాయని ప్రతీతి గదా! అలాగే వాళ్ల స్నేహాల వల్ల నేను గూడ ఆ దుర్వ్యసనాలకు లోనవుతానేమోనని మా బంధువుల్లో కొందరికి అనుమానాలు, భయాలు ఉండేవి.

ఆ భయాలకు సంబంధించిన ఒక సంఘటన చెబుతాను. ముత్యాలంపాడులో మా రాంమామయ్య (నాలుగో మేనమామ) గారింట్లో ఏదో ఫంక్షన్ జరిగింది. మధ్యాహ్నం 12 గంటలకు భోజనాలయినాయి అది రెండతస్తులమేడ! భోజనం చేసి నేను వెళ్లి మేడమీద హాల్లో పడుకున్నాను. ఇంకా నిద్రపట్టలేదు. మా రాంమామయ్య ఆయనతో పాటు మరొక దగ్గర బంధువు మేడమీదకు వచ్చారు. నేను మేలుకుని వుంటే వాళ్లమాటలు వింటూ కూర్చోవాలి అందుకని నిద్రిస్తున్నట్టు నటిస్తూ కళ్లుమూసుకుని అటుతిరిగి పడుకున్నాను. ఆ బంధువు నన్ను చూపుతూ "ఎవరితను?" అన్నాడు. 'మా మేనల్లుడు' అని చెప్పాడు మా రాంమామయ్య. "ఓహో! బి.ఏ ప్యాసయ్యాడుగదూ! సత్యనారాయణపురంలో ఇల్లు కట్టి అక్కడ ఉంటున్నాడుగదూ!" అన్నాడాయన.

అవునన్నాడు మా మామయ్య!

"జమీందార్లతో సావాసాలు చేస్తున్నాడని విన్నాను! జాగ్రత్తగా చూసుకో!" అని హెచ్చరించాడాయన!

మా రాంమామయ్య మెల్లగా నవ్వి "ఆ భయం ఏమీ అక్కరలేదు. మావాడు కుమ్మరిపురుగు!" అన్నాడు. (కుమ్మరి పురుగు బురదలో తిరుగుతంది! కాని బురదనుంచి బయటికి వచ్చేసరికి ఒంటికి బురద అంటదు)

మా మామయ్య నోటివెంట ఆమాటలు విన్నప్పుడు నాఒళ్లు పులకరించింది. ఆయనకు నామీద ఎంత నమ్మకం!

1951లో నేను సినిమాల్లోకి వెళుతున్నప్పుడు గూడ ఆయనతో చెప్పాను. 'మామయ్య! వాహినీ ఫిలింస్ డైరెక్టరు కె.వి. రెడ్డిగారు తన సినిమాకి స్క్రిప్టు రాయడానికి మదరాసు రమ్మన్నారు. వెలుతున్నాను." అని.

ఆయన ఎక్కువగా చూడకపోయినా కొన్ని సినిమాలు చూస్తుండేవాడు."అవునురా! వాహినీ గ్రూపు మంచి disciplined decent people అని, వెళ్లు" అన్నాడు. మిగతా బంధువుల్లో కొందరు నేను సినిమాల్లోకి పోతున్నానంటే రైటర్‌గా పోతున్నాన్న విషయం మరచి సినిమాలకి పోతున్నాడంటే చెడిపోతాడనే గదా చాలామంది అభిప్రాయం! అందులో పిత్రార్జితం ఆస్తివుంది. సినిమాలకి తగలేస్తానని వాళ్ల అభిప్రాయం.

నాకు బి.ఏ.లో యూనివర్సిటీ ఫస్టు గోల్డ్‌మెడల్ వచ్చిందని చెప్పినప్పుడు గూడ ఎంతో సంతోషించాడాయన!



నేను సినిమాల్లోకి మదరాసు వెళ్లిన తరువాత గూడ రెండు మూడు సార్లు మదరాసు వచ్చాడు. ఆయన మాటల్లో ఎంతో తృప్తి కనిపించేది. ఇదివరకే చెప్పానుగదండీ నా చదువుకి ఆయన కారణమని! ఆయన పట్టించుకోకపోతే నా చదువు సాగేదికాదు! నేనింతవాణ్ణి అయ్యేవాణ్ణి కాదు! ఆయన 1989లో తన 88వ ఏట పోయాడు. ఒక్కొక్కరి జీవితాల్లో మలుపులకు ఒక్కొక్కరు కారకులవుతారు. నా జీవితానికి ప్రాణవాయువు మా రాంమామయ్య!

నాకు జమీందార్ల కుటుంబాలతో సన్నిహిత సంబంధాలుండేవని చెప్పానే. దానిని గురించి కాస్త ప్రస్తావిస్తాను.

ఇంతకుముందు కటికినేని జగన్నాథరావు ప్రస్తావన వచ్చినప్పుడు జగన్నాధరావు కుటుంబంద్వారా జగన్నాధరావు తండ్రిగారి మేనమామగారు గంపలగూడెం జమీందారు గారితో, వారి కుటుంబంతో నాకు సాన్నిహిత్యం ఏర్పడింది. గంపలగూడెం తిరువూరుకు దాదాపు 10 మైళ్లు ఉండేదనుకుంటాను. బెజవాడనుంచి బస్సులో గంపలగూడెం వెళ్లాలంటే బెజవాడ తిరువూరు బస్సులో వెళ్లి మధ్యలో దిగి గంపలగూడెం వెళ్లాలి. అది చాలా చుట్టు!

సామాన్యంగా మేము గంపలగూడెం వెళ్లాలంటే రైలులో వెళ్లేవాళ్లం! బెజవాడ తరువాత స్టేషను రాయనపాడు. తరువాత నైజాం స్టేట్ రైల్వే! ఎర్రుబాలెం, మదిర స్టేషన్లు నైజాం స్టేటులోవి! మేము బెజవాడనుంచి రైలులో వెళ్లి మధిర స్టేషన్లో దిగేవాళ్లం. మధిర రైల్వే స్టేషనుకు గంపలగూడెం నుంచి రెండెడ్లబళ్లు, గూడు, లోపల పరుపులు వేసిన బండ్లు వచ్చేవి. మధిర నైజాం ఏరియా! గంపలగూడెం బ్రిటిష్ కృష్ణాజిల్లా! స్టేషనునుంచి దాదాపు పదిమైళ్లు. రెండెడ్ల బండ్లలో ప్రయాణం గంపలగూడెంకు!

ఒక విచిత్ర మైన అనుభవం ఏమిటంటే నైజాం స్టేట్‌లో అప్పుడు దొంగతనం అనేదిలేదని చెప్పవచ్చు!

మొదటిసారి నేను గంపలగూడెం వెళ్లినప్పుడు నేనూ మరొక స్నేహితుడు మధిర స్టేషన్లోదిగాం! పెట్టె - బెడ్డింగులు ప్లాట్‌ఫారం మీద పెట్టి గంపలగూడెం నుంచి బండ్లు వచ్చినవో లేదో చూడాలి! అప్పటికి చీకటి పడింది. దాదాపు 8 గంటలయింది. మా కోసం బండ్లు వచ్చాయో లేదో స్టేషన్ బయటికి వెళ్లి చూడాలి! అందుకని రైల్వే తాలూకు అసిస్టెంటు స్టేషన్ మాస్టరుతో పెట్టెలు బెడ్డింగులు కాస్త చూస్తూ ఉండండి అన్నాం!

"ఏమిటి చూసేది?" అన్నాడాయన!

"పెట్టెలు బెడ్డింగులు కాస్త చూస్తుండండి!" అన్నాం!

"ఏం భయంలేదు! మీరు వారం రోజుల తరువాత వచ్చినా మీ సామాన్లు ఎక్కడికీ పోవు! ఇక్కడే ఉంటాయి." అని నవ్వుతూ "ఇది నైజాంస్టేట్! మీ సర్కార్‌కాదు" అన్నాడు.

దొంగతనాలు లేకపోవడానికి ముఖ్యకారణం జనంలో భయం! దొంగతనానికి జైలులో వేస్తే కోర్టు విచారణ ఉండదు! అలా జైల్లో ఉండాలిసిందే ఎన్ని రోజులయినా!

చిన్న ఉదాహరణ చెబుతాను శ్రీరామనవమి రాములవారి కళ్యాణం చూడ్డానికి గంపలగూడెం నుంచి నలుగురు భద్రాచలం బయలుదేరారట. నడచివెళ్లాలి! తిరువూరు తాలూకా తరువాత ఖమ్మంజిల్లా నైజాం స్టేట్! నడచి వెళుతూ మధ్యలో చీకటి పడితే ఏదైనా ఊర్లో ఆగి ఆ రాత్రి అక్కడ ఉండి మర్నాడు ఉదయం బయలుదేరి భద్రాచలం వెళ్లాలి! గంపలగూడెం నుంచి బయలుదేరి భక్తులు నడచివెళ్లి చీకటిపడితే ఖమ్మం జిల్లాలో ఒక ఊళ్లో రాత్రి మకాం చేశారు! సత్రంలో పడుకున్నారు.



ఎందుకు వచ్చారో నైజాం పోలీసులు వచ్చి "ఎవరుమీరు?" అని అడిగితే 'భద్రాచలం పోతున్నాం' అని చెప్పారట!

'జైల్ మే డాల్‌రే' అని ఉర్దూలో చెబితే పోలీసులు వాళ్లను తీసుకెళ్లి జైలులో వేశారు. ఎందుకో తెలియదు! పదిరోజులయింది, పదిహేను రోజులయింది. పోయిన వాళ్లు తిరిగిరాలేదని గంపలగూడెంలో బంధువులకు ఆందోళన! నెలరోజులయింది! "అడవులగుండా నడచిపోతుంటే ఏ చిరుతపులి చంపి తిన్నదోలే" అని సరిపెట్టుకున్నారు. తరువాత ఆరునెలలకి ఆ భక్తులు తిరిగి గంపగూడెం వచ్చారు! కేవలం అస్తిపంజరాలు! చావుకు సిద్ధంగా ఉన్నారు! 'ఏం జరిగింది?' అని అడిగితే -

"ఏమో మాకే తెలియదు! ఫలానా ఊళ్లో రాత్రిపూట సత్రంలో పండుకున్నాం. పోలీసులు వచ్చారు! తీసుకెళ్లి జైలులో వేశారు! ఎందుకో మాకు తెలియదు. ఆ తరువాత కోర్టులో విచారణలేదు, పాడులేదు! జైలులో ఉన్నాం ఆరునెలలు! మొన్న ఒక పోలీసు ఆఫీసరు జైలుకు వచ్చి మమ్మల్ని చూచి "కౌన్‌రే" అన్నాడు. జైలు వాళ్లు ఏదో ఉర్దూలో చెప్పారు! 'ఛోడ్‌దేవ్' అన్నాడా ఆఫీసరు. మమ్మల్ని వదిలేశారు! చచ్చి చెడీ ఇలా ఇల్లు చేరుకున్నాం. మమ్మల్ని ఎందుకు అరెస్టు చేశారో ఎందుకు వదిలేశారో మాకు తెలియదు" అన్నారాభక్తులు కన్నీళ్లతో! అలా ఉండేదన్నమాట నైజాం పరిపాలన! అటువంటప్పుడు ఎవడైనా దొంగతనానికి పాల్పడాలంటే సాహసిస్తాడా?

ఇప్పుడు మనదేశంలో గూడ నేరానికి తగినంత శిక్షలులేక పోవడంవల్లే ఇన్ని దొంగతనాలు, దోపిడీలు జరుగుతున్నయ్! దొంగతనం చేస్తే పట్టుబడితే రెండుమూడు నెలలు జైల్లో వేస్తారు' బయటికి వచ్చి మళ్లీ అదేపని చేస్తాడు!

ఈ మధ్య ఒక పేపర్లో చూశాను. ఒకడు దొంగతనం చేసి నాలుగు నెలలు జైలులో ఉండి బయటికి వచ్చాడు. వాడు చెప్పాడు. జైలులో సీనియర్ దొంగల దగ్గర దొంగతనాల టెక్నిక్‌లు నేర్చుకుని వచ్చాను! ఒక విధంగా జైలు శిక్షణాకేంద్రం! కొత్త కొత్త పద్ధతులు నేర్పే పాఠశాల.

కంప్యూటర్లు, హైటెక్కుల విషయంలో దేశం పురోగమిస్తుందేమోగాని పట్టణాలలో పౌరజీవితం భయంకరంగా ఉంది.

పట్టపగలే దొంగతనాలు, దోపిడీలు! పట్టపగలు తలుపులు వేసుకుని ఇంట్లో కూర్చుంటే నలుగురువచ్చి తలుపు తడతారు! తలుపు తీస్తే నలుగురూ లోపలికొచ్చి కత్తులతో బెదిరించి దోచుకుపోతారు. ఎదురుతిరిగితే కత్తులతో పొడిచి చంపుతారు! ఆ తరువాత దొంగలు పడ్డ ఆరునెలలకి కుక్కలు మొరిగిన సామెతగా పోలీసులు వచ్చి దర్యాప్తు ప్రారంభిస్తారు. దొంగల్ని పట్టుకుంటారు. కేసులు పెడతారు. కొందరు దొంగలు కోర్టులోనో జైల్లోనుంచో తప్పించుకుపోతారు.

దీనంతటికీ ముఖ్యకారణం నేరానికి తగినంత శిక్ష లేకపోవడం! ఎప్పుడో మాతాతలనాటి శాసనాలు అమలు పరుస్తారు! మారుతున్న కాలాన్ని బట్టి శాసనాలు మార్చరు! ఈ శాసనసభ్యులు తమ తమ ఇళ్లు ఒక్కబెట్టుకుని కోట్లు సంపాదించడమే గాని ప్రజల బాధల్ని గురించి పట్టించుకునేవాడేలేడు.

టి.విలలోనూ, బహిరంగ సభలలోనూ ఉపన్యాసాలు! "మేము ప్రజాసేవకోసమే పుట్టాం" మేం ప్రజలకోసం మా ప్రాణాలైనా ఇస్తాం" ఎవడికి కావాలి వీళ్ల ప్రాణాలు? ఏం జేసుకుంటాం?



సరే! ఇదంతా అందరికీ తెలిసిందే. దీన్ని ఇంతటితో వదిలేసి నా జమీందారీ స్నేహితుల గురించి చెబుతా:

గంపలగూడెం జమీందారు గారి కొడుకు పార్థసారథి బెజవాడ లో హైస్కూలులో స్కూలు ఫైనల్ ప్యాసయి మదరాసు ప్రెసిడెన్సీ కాలేజీలో యింటర్‌లో చేరాడు. నాకు అప్పటికి బి.ఏ. అయిపోయింది. 1941లో నేను కాన్వకేషన్‌కి మదరాసు వెళ్లినప్పుడు విక్టోరియా హాస్టలులో అతని రూంలోనే వున్నా! అతను నాకంటే 4 ఏళ్లు చిన్న!

అతను ఇంటర్ మొదటి సంవత్సరం రెండో టరమ్‌లో అతని తండ్రిగారికి అనారోగ్యంగాఉందని కబురు వచ్చింది! అప్పటికే ఆయనకి వయసు మళ్లింది. పార్థసారథి చదువు ఆపేసి ఇంటికి వెళ్లాడు. తరువాత కొన్ని నెలలకి తండ్రిపోవడంతో ఆస్తి వ్యవహారాలు చూచుకోడానికి చదువు మానేశాడు.

తరువాత అతనికి ఇద్దరు కొడుకులు, నలుగురు కూతుళ్లు, దురదృష్టవశాత్తు అతనికి బ్లడ్ కాన్సర్ వచ్చి వెల్లూరు హాస్పిటల్‌లో చికిత్సపొందినా లాభంలేకపోయింది. 1974లో పోయాడు.

ఇద్దరు కొడుకులు ఇప్పుడు విజయవాడలో ఉంటున్నారు. ఆడపిల్లలకి పెళ్లిళ్లయినై. పెద్దకూతురు తిరువూరు తాలూకా మల్లేలలో (మేనమామనే చేసుకుంది) రెండో కూతురు తిరువూరులోనూ మిగతా ఇద్దరు కూతుళ్లు హైదరాబాదులోనే "సెటిలై కాపురాలు చేస్తున్నారు."

మళ్లీ కాస్త వెనక్కి వెళదాం! వెంకటగిరిలో కటికినేని సోదరులలో పెద్దాయన కళ్యాణరావుగారు. చిన్నాయన వెంకట్రామారావుగారని చెప్పానుగదా. వెంకట్రామారావుగారికి ముగ్గురు కొడుకులే! ఆడపిల్లలు లేరు. అలాగే కళ్యాణరావుగారికి ముగ్గురూ కూతుళ్లే! మగపిల్లలు లేరు.

పెద్దకూతురు ఒక ఆడపిల్లనుకని చనిపోయింది. రెండోకూతుర్ని వరంగల్‌జిల్లా ఏటూరు నాగారం ఇచ్చారు. అల్లుడు పేరు గోపాలరావుగారు. ఆ రెండో కూతురు పెద్దకొడుకు విజయరామారావు (మాజీ సి.యి.బి. డైరెక్టరు! (1999-2003) చంద్రబాబు నాయుడుగారి రాష్ట్ర ప్రభుత్వంలో మంత్రి.

కళ్యాణరావుగారికి మగపిల్లలు లేనందున మనవడు విజయరామారావును వెంకటగిరిలో తన వద్దనే ఉంచుకున్నారు. హైస్కూలు చదువు వెంకటగిరిలో అయిపోయింది. కాలేజీ చదువుకు తల్లిదండ్రులు వరంగల్ తీసుకెళ్తామన్నారు. తమ స్వగ్రామానికి దగ్గరగా ఉంటాడు గదా అని! కాని కళ్యాణరావుగారికి అప్పటి నైజాం చదువులంటే ఇష్టంలేదు. మదరాసులో చదివించాలని ఆయన కోరిక. కళ్యాణరావుగారు కొన్నాళ్లు ఉమ్మడి మదరాసు రాష్ట్రంలో లెజిస్లేటివ్ కౌన్సిలు మెంబరు! కాని మదరాసు అంటే విజయరామారావు తల్లిదండ్రులకు ఇష్టం లేదు. తమకు చాలా దూరం అవుతాడని.

అప్పుడు కళ్యాణరావుగారు "మద్రాసు దూరమైతే మటుకు ఏం? మదరాసులో మన రాజుగారు ఉన్నారు. ఆయనకు అప్పజెబుదాం! ఆయన చూచుకుంటారు" అన్నారు.

అప్పుడే నేను 1951లో సినిమా రంగంలో చేరి మదరాసులో కాపురం పెట్టాను! విజయరామారావు ఇంటర్ ఆర్ట్సు కాలేజీలో చదివాడు. ఆనర్సుకు తాంబరంలోని క్రిస్టియన్ కాలేజీలో చేరాడు. అప్పుడు నేను అతనికి లోకల్ గార్డియన్‌ని! హాస్టల్లోఉంటుండేవాడు. శని, ఆదివారాల్లోగాని వేరే సెలవల్లోగాని మాఇంటికి వస్తుండేవాడు. అప్పుడు నేను టి నగర్‌లో థామస్ రోడ్డులో ఉంటుండేవాణ్ణి. మాఇంటికి వస్తే ఎక్కువగా వంటగదిలో నా భార్యతో 'అక్కయ్యగారూ! అంటూ కబుర్లు చెబుతుండేవాడు.



ఆ తరువాత కరీంనగర్ కాలేజీలో లెక్చరర్‌గా ఉన్నప్పుడు వివాహం అయింది. ఆతరువాత ఐ.పి.ఎస్. ఉద్యోగం రావడం అలా పోలీసు అధికారిగా సి.బి.ఐ డైరెక్టరు స్థాయికి ఎదిగాడు. అప్పటినుంచి ఇప్పటికి గూడ మేము చాలా క్లోజ్ ఫ్యామిలీ ఫ్రెండ్స్! ఒకరిమీద ఒకరికి ఉన్న గౌరవాలు ఎలా తెలుస్తయ్! సమయం రావాలిగదా!

ఈ మధ్య హైదరాబాద్‌లో ఒక కల్చరల్ మీటింగులో అతను అధ్యక్షుడు! నేను ముఖ్య అతిథిని. నన్ను సంభోదిస్తూ "గురుతుల్యులు నరసరాజుగారూ!" అన్నాడు. మీటింగు అయిన తరువాత "విజయరామారావు! నేను నీకు గురుతుల్యుణ్ణా?" అన్నాను నవ్వుతూ!

"అంతకంటే గూడ ఎక్కువ! మాట దొరకక అంతటితో ఆపాను" అన్నాడు నవ్వుతూ.

అలాగ నాకు జమీందారీ కుటుంబంతో చాలా దగ్గర సంబంధాలుండేవి.

జమీందారీ వ్యవస్థను సమర్థించలేంగాని వాళ్లలో చాలా గొప్ప వ్యక్తులున్నారండి! చాలా ఉదారులు మంచి పనులు చేసిన వాళ్లు ఉన్నారు.

ముఖ్యంగా ఉయ్యూరు ఎస్టేటు ఉండే నాకు చాలా ఆప్తులు. యం.యస్. అప్పారావుగారు ఆయన అన్నగారు యం. ఆర్. అప్పారావుగారు. (ఈ మధ్యనే పోయారు) చాలా ఉత్తములు! వారి తండ్రిగారు ఉయ్యూరు రాజాగారు పండితులు! సంస్కృతం చదువుకున్నారు అన్నిటికీ మించి అమృత హృదయులు! దయా స్వరూపులు.

విజయవాడ-ఏలూరు రోడ్డు రూట్‌లో హనుమాన్ జంక్షన్ ఉందే దానికి కిలోమీటరు దూరంలో మా అత్తగారి ఊరు నరసన్నపాలెం! ఆ గ్రామం ఉయ్యూరు ఎస్టేటు గ్రామం! (జమీందారీ రద్దుకు ముందు) అప్పుడు నేను చాలా చిన్నవాణ్ణి!. 5, 6 ఏళ్లుంటయ్. సెలవలకి నరసన్నపాలెం వెళుతుండేవాణ్ణి! ఉయ్యూరు రాజాగారు ఆవూరు వస్తే ఊరంతా పండగ చేసుకునేవారు! స్కూలు పిల్లలకు పప్పుబెల్లాలు పంచి పెట్టేవాళ్లు! ఊళ్లో రైతులు తలపాగాలతో చేతులుకట్టుకుని ఆయన ఎదుటనిలబడే వాళ్లు. ప్రేమాభిమానాలు, వినయ విధేయతలతో.

ఆయన నూజివీడులో ఉండేవారు. ఆయనే గాదు ఇతర జమీందార్లు గూడ నూజివీడులోనే ఉండేవారు. నూజివీడులో ఎస్టేటు విభాగాలలున్నప్పుడు ఉయ్యూరు ఎస్టేటు, యలమర్రు ఎస్టేటు, మీర్జాపురం ఎస్టేటు, గొల్లపల్లి ఎస్టేటు ఇలా రెవిన్యూ రికార్డుల కోసం పేర్లు పెట్టేవాళ్లుగాని అందరూ నూజివీడులోనే వుండేవారు.

అందరిలోనూ ఉయ్యూరు రాజాగారికి ఎంతమంచి పేరంటే తన ఎస్టేటు గ్రామాల రైతులు ఎవరైనా నూజివీడు వెళ్లి "ఈ ఏడు పంటలు పండలేదండి! శిస్తులు కట్టలేమండి!" అని విజ్ఞాపన పత్రాలు సమర్పిస్తే - వాళ్లకి శిస్తులు మాఫీచేయడమేగాక, వాళ్లకు భోజనాలు, కొత్త బట్టలు పెట్టి కొంత రొఖ్ఖం గూడాయిచ్చి పంపేవారు!

మంచివాళ్లు, చెడ్డవాళ్లు అన్ని వర్గాలలో ఉంటారనుకోండి! ఉయ్యూరు రాజాగారి పెద్ద కుమారులు నాటక కళాపరిషత్తుకు అధ్యక్షులు! ఆయన ఆంధ్ర యూనివర్సిటీ వైస్ చాన్సలర్‌గానూ, రాష్ట్ర మంత్రిగానూ గూడ పనిచేశారు! నాకు చాలా సన్నిహితులు. రెండో కుమారుడు యం.యస్. అప్పారావుగారు. నాకు మదరాసు లయోలా కాలేజీలో జూనియర్! వారితమ్ముడు యం.వి.జి. అప్పారావు అకాల మరణం పాలైనారు. ఆ సోదరులందరూ మంచి టెన్నిస్ ప్లేయర్లు! యం.యస్. అప్పారావుగారు మదరాసు యూనివర్సిటీ ఛాంపియన్. ఆయనకు ఒక కుమారుడు. నలుగురు కుమార్తెలు! రెండవ కుమార్తె భర్త పూసపాటి అశోక గజపతిరాజు! రాష్ట్ర మంత్రి వారిది విజయనగర సంస్థానం!



మరొక ప్రసిద్ధ జమీందారీ కృష్ణాజిల్లా మైలవరం ఎస్టేటు! మైలవరం జమీందార్లు ముగ్గురు అన్నదమ్ములు రెండోరాజాగారికి పిల్లలు లేరు! ఆయన ఎస్టేటు అంతా నాటక కళాపోషణకే ఖర్చు చేశారు. బెజవాడలో పాతబస్తీలో హిందూ హైస్కూలు దగ్గర మైలవరం హాలు ఉండేది. నాటకాలు వేసేవాళ్లు. ఆయన ఒక నాటక సమాజం స్థాపించి నడిపించారు! పేరు "బాలభారతీ నాటక సమాజం" అనుకుంటాను.

మైలవరం పెద్ద రాజాగారికి ముగ్గురు భార్యలు! ఒకరు చనిపోతే మరొకరు అలా ముగ్గురు భార్యలు! 5గురు మగ సంతానం! ఆడపిల్లలు ఎంతమందో నాకు తెలియదు.

మూడవ రాజాగారు వుయ్యూరు రాజుగారి బావమరిది. ఉయ్యూరు రాజాగారి సోదరినిచ్చి చేశారు. మూడోరాజాగారికి ఒక్కడే కుమారుడు. నరసింహరావుగారు. బెజవాడ సత్యనారాయణపురంలో మాఇంటి దగ్గరే ఒక ఇల్లు కొని అందులో ఉండేవారు. జింఖానా క్లబ్బులో టెన్నిస్ ఆడేవారు! ఆయన యలమర్రు (నూజివీడు) రాజాగారి అల్లుడు. నాకు చాలా సన్నిహితుడు.

మైలవరం మూడోరాజాగారి అల్లుడు చిట్టిబాబుగారు. ఆయన ఊటుకూరు జమీందారు బెజవాడలోనే ఉండేవారు. గంపలగూడెం రాజాగారికి మేనల్లుడు. ఆంధ్రప్రదేశ్‌లో ముఖ్యమంత్రి జలగం వెంకట్రావుగారి తమ్ముడు కెప్టెన్ రామారావుగారి మామగారు! పాపం కాన్సర్ వ్యాధితో మరణించారు.

ఇలా జమీందారీ కుటుంబాలతో నాకు సన్నిహిత స్నేహాలుండేవి!

అందరికంటే గంపలగూడెం జమీందారీ కుటుంబంతో నాకు చాలా సాన్నిహిత్యం! నన్ను వారి కుటుంబంలో ఒకరుగా చూసుకునేవారు. ఆ కుటుంబం తాలూకు మూడోతరం వాళ్లు కొందరు ఇప్పుడు హైదరాబాద్‌లో ఉన్నారు. వాళ్లు నాకన్నా బాగా చిన్నవాళ్లయినా నేనంటే ఎంతో గౌరవంగా అభిమానంగా ఉంటారు. ఆ కుటుంబాల యీతరం పిల్లలను చూస్తుంటే అప్పటి రోజులు జ్ఞాపకం వస్తాయ్! అప్పుడు వాళ్ల పూర్తి పేర్లు గూడ నాకు తెలియవు! ముఖ్యంగా ఆడపిల్లల్ని చిన్నమ్మ, కన్నమ్మ, చిట్టెమ్మ, బుజ్జమ్మ అనే పిలిచేవాళ్లం! ఇప్పటికీ విజయరామారావుగారి తల్లి గారిని నేను కన్నమ్మగారూ అనే సంబోధిస్తాను! ఆమె అసలు పేరు నాకు ఇప్పటికీ తెలియదు!

బహుశా యీ స్ఫూర్తితోనేమో 'గుండమ్మకథ' సినిమాలో సావిత్రి, జమునల పాత్రలకు బుల్లెమ్మ, చిట్టెమ్మ అని పేర్లు పెట్టాను.

అలాగే నన్ను ఆ కుటుంబాలలో అందరూ 'రాజుగారు' అనే అంటారుగాని 'నరసరాజుగారు' అంటే వాళ్లకి తెలియదు! హైస్కూలు, కాలేజీలో చదువు కున్నప్పుడు గూడ నన్ను నా సహాధ్యాయులందరూ 'రాజూ' అనేవాళ్లు!

సినిమా రంగానికి వెళ్లిన తరువాత డి.వి. నరసరాజు అని సినిమా టైటిల్స్‌లో వేయించడం మొదలు లెట్టాను! ఎందుకంటే సినిమా రంగంలో చాలామంది రాజులున్నారు. డి.వి.యస్. రాజు, డి.వి.యస్. రాజు టి.వి.రాజు ఈ పేర్లతో కన్‌ఫ్యూజ్ రాకుండా వుండడం కోసం మొదటి నుంచి డి.వి. నరసరాజు అనే నాపేరు స్థిరం చేశాను.

అయినా ఇప్పటికీ ఈతరం సినిమా పత్రికా రిపోర్టర్లు నాపేరు రాయవలసినప్పుడు "ప్రఖ్యాత సినీ నిర్మాత డి.వి. నరసరాజు" అని రాస్తారు. నేనెప్పుడు ఒక్క సినిమాగూడ తీయలేదు! వాళ్ల ఉద్దేశం నిర్మాత డి.వి.యస్. రాజుగారని!



అందాకా ఎందుకు నేను 'ఈనాడు' దినపత్రికలో 'అక్షింతలు' శీర్షికన 19 సంవత్సరాలు ఒక కాలం రాశాను! అది చదివి ప్రఖ్యాత మహిళా నాయకురాలు నన్నపనేని రాజకుమారి డి.వి.యస్.రాజుగారిని కలిసినప్పుడు, "మీ "అక్షింతలు" నేను రెగ్యులర్‌గా చదువుతానండి. చాలా బాగుంటయ్" అన్నదట!

దానికి డి.వి.యస్. రాజుగారు "అవి రాసేది నేను కాదు తల్లీ! ఆయన డి.వి.నరసరాజుగారు" అని ఒకసారి గాదు రెండు మూడు సార్లు అలా జరిగిందని డి.వి.యస్. రాజుగారు నాతో చెప్పారు. నాతో పరిచయమయ్యాక రాజకుమారిగారికి ఆ కన్‌ఫ్యూషన్ ఇప్పుడు తొలగిపోయింది!

మరొక విచిత్రమైన విషయం చెబుతాను. గుంటూరులో నాకొక స్నేహితుండేవాడు. గుంటుపల్లి వెంకటేశ్వరరావు! అడ్వకేటు. అతనూ నేను 1936లో నేను ఇంటర్ చదివేటప్పటినుంచి స్నేహితులం. అతను నాకు ఒక ఏడాది జూనియర్! హాస్టల్‌లో ఉండే వాళ్లం! అప్పటినుంచి ఈమధ్య అతను పోయేవరకు మా ఇద్దరి కుటుంబాలు చాలా సన్నిహితంగాఉండేవి.

మా పిల్లలు అతన్ని 'గుంటూరు మామయ్య' అనేవాళ్లు! అతని కుమార్తెలు మేనకోడళ్లునన్ను 'రాజుమామ' అనేవాళ్లు. అతని మేనకోడళ్లలో ఒకామె, ఆమె పేరు జ్యోతి, ఇప్పుడు అమెరికాలో ఉంటోంది. ఆమె భర్త డాక్టరు!

1991లో నేను 'తానా' ఆహ్వానం మీద అమెరికా వెళ్లినప్పుడు 'న్యూయార్క్' వెళ్లాను! దుక్కిపాటి మధుసూదనరావుగారి కుమారుడు డాక్టరు స్వామి ఇంట్లో వున్నాను! అక్కడకు నన్ను చూడడానికి ఈ జ్యోతి వచ్చింది.

ఇప్పటికీ ఆమె తన బంధువుననే అనుకుంటున్నది గాని మేము రాజులము, ఆమె కమ్మవారు అన్న సంగతి ఆమెకు ఇప్పటికీ తెలియదు. ఈ విషయం ఆ సమావేశంలో ఉన్న మిగతా మిత్రులతో నేను చెబుతుంటే అప్పుడు తెలిసింది. ఆమెకు నేను తన బంధువును కాననీ తన మేనమామ స్నేహితుణ్ణనీ! నేను చెబుతున్నది వింటూ నోరు వెళ్లబెట్టి చూస్తోంది ఆశ్చర్యంగా!

ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే నేను నా స్నేహితులకుటుంబాలతో అలా కలసిపోయి ఉండేవాణ్ణి!

ఆనాటి జమీందారీ స్నేహితుల మనమలు, మనమరాళ్లు, ఇప్పుడు ఎక్కడయినా పెళ్లిళ్లలో కనిపిస్తే నేను 'ఫలాన రాజుగారు' అని వాళ్ల తల్లిదండ్రులు వాళ్లకు పరిచయం చేస్తారు. వాళ్లు అప్పటికి పుట్టనేలేదుగదా! నేనెవరో వాళ్లకి ఎలా తెలుస్తుంది?

"ఈవిడ మాధవరావు మనవరాలండీ!" అని ఒక ఇద్దరు బిడ్డల తల్లిని ఈమధ్య ఒక పెళ్లిలో పరిచయం చేశారు. నాకు తెలిసినప్పుడు మాధవరావే చిన్నవాడు. 'అతని మనమరాలు' అంటే నాకే ఆశ్చర్యం వేసి "అలాగా" అనేవాణ్ణి! (మాధవరావు గంపలగూడెం కుమార రాజాగారి పెద్దకొడుకు)

అలనాటి జీవితం నెమరు వేసుకుంటుంటే ఎన్నో విచిత్రమైన అనుభవాలు గుర్తుకు వస్తుంటయ్! గంపలగూడెం జమిందారు పార్థసారథి విషయం చెప్పానే అతను నాకంటె నాలుగేళ్లు చిన్నవాడు. బెజవాడ మునిసిపల్ హైస్కూల్లో 1938లో చేర్చారు అతన్ని! అప్పటికి నాకు ఇంటర్మీడియట్ అయిపోయింది. అతను మామూలుగా సిగరెట్లు కాల్చేవాడు. కాని నాముందు కాల్చేవాడుకాదు. నన్ను చూడగానే కాలుస్తున్న సిగరెట్టు అవతలపారేసేవాడు. స్కూలు ఫైనల్ అయిపోయి మదరాసు ప్రెసిడెన్సీ కాలేజిలో యింటర్‌లో చేరాడు. అక్కడ ఎలాగో డ్రింకు (మద్యం) అలవాటయింది. నాముందు సిగరెట్టు కాల్చనివాడు డ్రింకు ఎలా తీసుకుంటాడు?



అతని తండ్రిగారు పోయాక 1942లో చదువు మానేశాడు. అతనికి 1941లోనే పెళ్లి అయింది. 1944లో కూతురు పుట్టింది! నాకు ఇప్పటికీ బాగా జ్ఞాపకం. అతని పెద్ద కూతురు పుట్టినతేదీ 4-4-1944. ఆ సందర్భంగా బెజవాడ జింఖానా క్లబ్బులో పార్టీ యిచ్చాడు. కోవెలమూడి ప్రకాశరావు (రాఘవేంద్రరావు తండ్రి) master of ceremonics డ్రింక్స్ ఏర్పాటు చేశారు. నాకు అప్పటికీ, ఇప్పటికీ డ్రింకు అలవాటు లేదు! పార్థసారథి నా ముందు డ్రింకు తీసుకోడానికి వెనకాడుతున్నాడు. నేనే "హోస్టువి నువ్వేతీసుకోకపోతే ఎలా? ఫరవాలేదులే! తీసుకో" అన్నాను. అప్పటినుంచి నాముందే డ్రింకు తీసుకునేవాడు.

ఒకసారి, అప్పటికి అతని తండ్రిగారు పోయారు. కొంత మంది స్నేహితులను బెజవాడ క్లబు మెంబర్లను గంపలగూడెం తీసుకువెళ్లాడు! ఆరాత్రి మందు పార్టీ ఏర్పాటు చేశాడు. నేను వాళ్లతో చేరకుండా పెందలాడే భోజనంచేసి వెళ్లి గదిలో పడుకున్నాను. పార్టీ అర్ధరాత్రి దాటిన దాకా జరిగింది. తెల్లవారి వాళ్లంతా ఇంకా నిద్రలు లేవలేదు! నేను నిద్ర లేచి మొఖం కడుక్కుని కాఫీ తాగుతున్నాను! లోపలనుంచి నౌకరు ద్వారా కబురు.

"అమ్మగారు తమరిని ఒకసారి లోపలికి రమ్మంటున్నారు" అన్నాడు నౌకరు.

అది పెద్దబంగళా! వెనక భాగం జనానా! అప్పటికి పార్థసారథి భార్య నాకు కనబడేదిగాదు! నాకు ఆశ్చర్యం వేసింది. నేను జనానాలోకి వెళ్లాను. ఆమె పేరు రాజమ్మగారు. తలుపు చాటున నిలబడి వినయంగా 'ఏం? రాజుగారూ! బాబుగారికి చెప్పవలసిన మీరుగూడ వాళ్లతో చేరి తాగితే...' అనేసరికి నేను షాక్ అయి... "ఏమిటమ్మా మీరనేది? నేను తాగానా? నేను 8 గంటలకే భోజనంచేసి వెళ్లి పడుకున్నాను. నేను వాళ్లతో చేరి తాగానని మీకు ఎవరు చెప్పారు?"అన్నాను కాస్త కోపంగా.

"రంగడు చెప్పారు" అన్నారామె. రంగడంటే పార్థసారథి పర్సనల్ నౌకరు.

"పిలవండి రంగణ్ణి!" అన్నాను.

'రంగా' అని కేకవేస్తే రంగడు వచ్చాడు.

"నువ్వు చెప్పలేదంట్రా రాజుగారు గూడ తాగుతున్నారని" అనగానే - వాడు "నేను చెప్పింది ఈ రాజుగారి సంగతి కాదమ్మా! సిమెంటు ఫ్యాక్టరీ రాజుగారి సంగతి" అన్నాడు.

బెజవాడ ఆంధ్రా సిమెంటు యాజమాన్యం తాలూకు రాజుగారు ఒకడున్నాడు. నాయీడు వాడే! అతను గూడ క్లబ్బుమెంబరు.

"అలాగా! క్షమించండి రాజుగారు! రాజుగారంటే మీరనుకున్నాను!!" అన్నదామె!

అంటె పార్థసారథికి నన్ను దాదాపు గార్డియన్‌గా పరిగణించేవాళ్లు ఆ ఫామిలీ సభ్యులు!

రాజమ్మగారు ఇప్పటికీ వున్నారు. విజయవాడలో కొడుకుల దగ్గర ఉంటున్నారు. ఎప్పుడన్నా హైదరాబాద్ కూతుళ్ల దగ్గరకు వచ్చినప్పుడు కనబడితే ఎంతో గౌరవంగా మాట్లాడతారు! నేను గూడ ఆమెను సొంత బిడ్డగా పలకరిస్తాను!

ఇప్పటికీ నా పాత స్నేహితుల కుటుంబాలు తాలూకు యీతరం పిల్లలు కనిపిస్తే ప్రాణం లేచివస్తుంది! నేను గూడ ఈవయసులో ఆరోగ్యంగా వున్నానంటే వాళ్లు ఎంతో సంతోషిస్తారు.



భార్య, కూతురులతో...

ఇప్పుడు నాకున్న నిధులలో - పెన్నిధులలో ఆ తృప్తి ఒకటి! నేనూ సకల సద్గుణ సంపణ్ణుని గాదు - తప్పులు అందరూ చేస్తారు! నేనూ ఎన్నో తప్పులు చేసిఉండవచ్చు తెలిసో తెలియకో!

తృప్తికి మించిన ధనం లేదు!

దురాశకు మించిన దరిద్రం లేదు!

దురాశా పరుడు నిత్యదరిద్రుడు!

వాడికి ఎప్పుడూ తృప్తి వుండదు!

కాని ప్రతి విషయంలో తృప్తిపడి చేతులు ముడుచుకు కూర్చుంటే జీవితంలో ప్రగతి ఉండదు! ఒకవేళ ప్రగతి సాధించినా ఎక్కడో ఏదో ఒక దశలో తృప్తిపడాలి!

ఇప్పుడు ఈ అనుభవాలు - జ్ఞాపకాలు రాసేది ఎవరికోసమో కాదు! మా కుటుంబ సభ్యుల కోసమే. మా మేనమామ కొడుకులు, మా మేనళ్లుళ్లు, మేనకోడళ్లు, మనమలు, మనమరాళ్లు, అప్పుడప్పుడు అడుగుతుంటారు. మా తాతయ్య తండ్రి పేరేమిటి? అమ్మమ్మ పుట్టింటి పేరేమిటి? ఆమెకు అన్నదమ్ములు, అక్క చెల్లెళ్లు ఎవరు? ఎంతమంది? మన పూర్వీకుల్ని రెండు మూడుతరాల ముందు వాళ్లని గురించి ఒక వయసులో



తెలుసుకోవాలనిపిస్తుంది. మా మేనల్లుళ్లు, మేనకోడళ్లు, మా పిల్లలు అడుగుతున్న ప్రశ్నలకు సమాధానాలుగా వుపయోగపడతయ్యనే ఇవన్నీ వ్రాస్తున్నాను.

నిజానికి మా తాతలు, తండ్రులగురించి నాకు ఎక్కువగా తెలియదు. మా అమ్మనిగాని, అమ్మమ్మనిగాని, పెత్తల్లి, పినతల్లుల్ని గాని, మేనమామల్ని గాని అడిగితే చెప్పేవాళ్లే. అంతకుముందు తరాల వాళ్లని గురించి! కాని ఆ వయసులో పూర్వీకుల వివరాలు తెలుసుకోవాలని అందరికీ ఉండదు.

ఇప్పుడు ఈ వయసులో నాకు అనిపిస్తుంది "అయ్యో! మా అమ్మని అడక్కపోతినే! మా మేనమామల్ని అడక్కపోతినే మా పూర్వీకుల్ని గురించి! వాళ్లు ఎక్కడ చదువుకున్నారు? ఎంతవరకు చదువుకున్నారు? ఫలాన కుటుంబానికి మనకు చుట్టరికం ఏమిటి? ఇవి పెద్ద వాళ్లని అడిగి తెలుసుకోకపోతినే అనిపిస్తుంది.

అలాగే మా పిల్లలకు ఇప్పుడు ఆశక్తిలేక పోయినా ముందు ముందు వాళ్లు నావయసు వాళ్లయిన తరువాత నాలాగే వాళ్లకూ పూర్వీకుల్ని గురించి తెలుసుకోవాలని ఉంటుందిగదా! అందుకని ఇవన్నీ రాస్తున్నాను.

80 ఏళ్ల అనుభవాలు - జ్ఞాపకాలు రాయాలంటే మహాగ్రంథమవుతుంది! పైగా రాయడం కూడా కష్టమని బద్ధకించాను. కాని ఇప్పుడు డిక్టేట్ చేస్తే రికార్డు చేసే వసతి వుండి అయిదేళ్ల క్రితం బుద్ధి పుట్టింది. డిక్టేట్ చేయాలంటే ఆసక్తిగా వినేవాడుండాలి ఎదురుగా! లేకపోతే ఒక్కణ్ణేకూర్చుని గోడకి చెప్పినట్లుంటుంది.

వినడానికి ఆసక్తిగల ఒక కొత్త మిత్రుడు దొరికాడు. అడబాల రవి అని యంగ్ లాయర్. 'నేను వింటాను సార్! చెప్పండి' అన్నాడు. 2000 సంవత్సరం మార్చిలో మొదలుపెట్టి ఓపిక ఉన్నప్పుడల్లా అతనికి చెబుతూ దాదాపు 10 మైక్రో కేసెట్స్ రికార్డ్ చేశాను. వాటిని ఎవరికన్నా ఇచ్చి రాయిద్దామని వుద్దేశం!

కాని నేను డిక్టేట్ చేయడంలో ఒక లోపం జరిగింది. చాలా ఫాస్ట్‌గా డిక్టేట్ చేయడమేగాక కర్త - కర్మ క్రమంతో వాక్యాలుగా కాక మనం మామూలుగా మాట్లాడుకున్నట్టు టిక్టేట్ చేశాను. ఇద్దరు ముగ్గురికిస్తే రాయడం మావల్ల కాదని చేతులెత్తేశారు.

మొత్తం రాస్తే అయిదారు వందల పేజీలు అయ్యేట్టుంది. అయినా ఫరవాలేదు. ముందుతరం కుటుంబ సభ్యులకి ఎప్పటికైనా పనికి రాకపోతుందా అన్న ధైర్యంతో రాస్తున్నాను.

ఇంతకు ముందు నాకు జీవితంలో సన్నిహితమైన కుటుంబాలు అనుభవాలను గురించి రాశానే అలాంటి సన్నిహితమైన కుటుంబం 'ఈనాడు' దినపత్రిక అధిపతి రామోజీరావుగారి కుటుంబం! దాదాపు 20 ఏళ్లపైగా అనుభవం!

'ఈనాడు' దినపత్రికలో "అక్షింతలు" అనే పేరుతో వారం వారం 19 సంవత్సరాలు రాశాను. 2000 సం॥ జనవరిలో ఆపేశాను.

1981 జనవరిలో ప్రారంభించినప్పుడు రామోజీరావుగారితో నాకు పరిచయమే లేదు! అప్పుడు నా నివాసం మదరాసు! గత 20 ఏళ్లకు పైగా మదరాసులో నాకు ఉదయం నడక అలవాటు! మదరాసులో మా ఇంటి దగ్గిరలో బోట్‌క్లబ్బు రోడ్డు ఉంది. ప్రశాంతంగా ఉంటుంది. ట్రాఫిక్ అసలు ఉండదు! ఉదయం నడకలో తెలుగు, తమిళ, మళయాళ, కన్నడ మిత్రులుండేవాళ్లు! ముఖ్యంగా మిత్రులు యం.యస్. అప్పారావుగారి ఇల్లు ఆరోడ్డులోనే. ఆయన ఇంటికి వెళ్లి ఇద్దరం కలిసి మిగతా వాళ్లతో దాదాపు గంటసేపు పైగా నడిచేవాళ్లం! ఆ నడకలో రాజకీయాలు,





'ఈనాడు' శ్రీ రామోజీరావుతో...

సాంఘిక విషయాలు, అనుభవాలు, అవాకులు, చవాకులు మాట్లాడుతుండేవాళ్లం! కొందరు మిత్రులు ఆరోజు వార్త ఏదో చెప్పి దీనిమీద మీ కామెంట్ ఏమిటి అనేవాళ్లు! నా సహజ వంగ్య ధోరణిలో ఏదో వాగేవాణ్ణి. ఇది దినచర్యగా మారింది.నా వ్యంగ వాఖ్యలు రోజూ వింటూ మిత్రులు అప్పారావుగారూ, "ఇవి పత్రికల్లో రాయగూడదూ? తెలుగులో సెటైర్ రాసేవాళ్లు లేరు" అన్నారు. "ఆఁ రాస్తే ఎవడు చదువుతాడు?" అని నిర్లక్ష్యం చేసేవాణ్ణి!

'ఈనాడు' దినపత్రిక మదరాసు రిపోర్టరు తాజీ ప్రసాద్ అని తరచు మా ఇంటికి వస్తుండేవాడు. ఆంధ్ర ముఖ్యమంత్రిగా అంజయ్య గారున్న రోజుల్లో ఆయన ఒక ప్రకటన చేశాడు. "రాష్ట్రంలో అవినీతిని పెరికి వేయడానికి 'కంకణం' కట్టుకున్నాను" అని. ఆ 'కంకణం' అన్నమాట నన్ను ఆకర్షించింది. దాని ఆధారంగా చిన్న ఆర్టికల్ రాశాను. తాజీ ప్రసాద్ మా ఇంటికి వచ్చినప్పుడు ఆ ఆర్టికల్ ఇచ్చి "మీ 'ఈనాడు'కు పంపవయ్యా వేస్తారేమో!" అన్నాను! అతను పంపాడు! "ఈనాడు"లో వేశారు అలా ప్రారంభమయింది. నా కాలం రచన. ఆ తరువాత కొన్ని నెలల తరువాత 'సితార' సినిమా ప్రారంభించబోతూ మదరాసులోని సినీ ప్రముఖులను కలుసుకుని సలహాలు తీసుకోడానికి రామోజీరావుగారు మదరాసు వచ్చారు! అప్పుడు తొలిపరిచయం అయింది! "బాగుంది ఆర్టికల్! ప్రతివారం రాయండి" అన్నారాయన! "ప్రతివారం వీలుకాదేమో లెండి! నా సినిమా పనులుంటయ్! విషయం ఉన్నప్పుడు రాస్తాను" అన్నాను. అలా అప్పుడప్పుడు రాస్తుండేవాణ్ణి! "రియాక్షన్ బాగుంది! నరసరాజుగారిని వారం వారం వ్రాయమని చెప్ప"మని అప్పటి సినీ రిపోర్టరు మిక్కిలినేని జగదీశ్వరరావుతో కబురు చేశారు రామోజీరావుగారు! అప్పటినుంచి రెగ్యులర్‌గా రాయడం మొదలెట్టాను. 'అక్షింతలు' పేరు రామోజీరావుగారు పెట్టిందే!





'ఈ టీవి' శ్రీ సుమన్‌తో...

1983-84 ప్రాంతం నుంచి రామోజీరావుగారు "శ్రీవారికి ప్రేమలేఖ" సినిమాతో సినిమా ప్రొడక్షన్ మొదలెట్టారు. నేను రచయితగా ఉషాకిరణ్ మూవీస్‌కి తొలిచిత్రం "కాంచన గంగ"తో మొదలుపెట్టి "కారుదిద్దిన కాపురం", "మనసు-మమత", "మామాశ్రీ" నాలుగు సినిమాలు రాశాను! తప్పనిసరయి "కారుదిద్దిన కాపురం" డైరెక్షను గూడ చేయవలసి వచ్చింది.

సినిమా పనిమీద హైదరాబాద్ వస్తే జూబిలీ హిల్స్‌లోని ఉషాకిరణ్ మూవీస్ (36 నంబరు రోడ్డు) గెస్టు హౌవుస్ నా పర్మనెంట్ అడ్రసు అయింది.

సినిమారచనతో పాటు రామోజీరావుగారి కుటుంబంతోనూ, స్టాఫ్‌తోనూ సంబంధాలు ఏర్పడి ఆ సంస్థలో ఒకడిగా మారిపోయాను. హైదరాబాద్ వచ్చినప్పుడల్లా మదరాసు తిరిగి వెళ్లే ముందురోజు తప్పనిసరిగా 'ఈనాడు' ఆఫీసుకు వెళ్లి రామోజీరావుగారితో ఒక గంటో, రెండు గంటలో గడిపేవాణ్ణి!

అప్పుడు ఆయన ఆఫీసు 'ఈనాడు' బిల్డింగులో రెండో అంతస్తులో ఉండేది. నేను ఆయన గదిలో కాలు పెట్టగానే ఆయన నన్ను చూచి చిరునవ్వుతో "బట్టలు నలగకుండా సిల్కులాల్చీ ధోవతితో పెళ్లికొడుకులా వస్తారు" అనేవారు. నేను అనేవాణ్ణి "రామోజీరావుగారూ! గాడిదల్లో రెండు రకాలున్నయ్! మేసేగాడిదలు! మోసేగాడిదలు!

మేము మేసే గాడిదలం! మీరు మోసే గాడిదలు!



అది మీ జాతకం! ఇది మా జాతకం!" అనేవాణ్ణి! ఆయనతోపాటు ఆయన కుటుంబ సభ్యులతో గూడ సాన్నిహిత్యం ఏర్పడింది. ఆయన కుమారులిద్దరి పెళ్లిళ్లు నాకళ్ల ముందే జరిగినయ్. ముఖ్యంగా నేను ఊళ్లోవుంటే అప్పుడు స్టూడెంటుగా ఉన్న సుమన్ (రామోజీరావుగారి చిన్నకొడుకు) గెస్టుహౌవుసకు వచ్చి నాతో చాలాసేపు గడిపేవాడు!

ఇప్పుడు (2002-2003) రామోజీరావు గారు 'రామోజీ ఫిల్మ్‌సిటీ'కి మకాం మార్చారు. ఫిల్మ్‌సిటీ చాలా బాగా అభివృద్ధి చేశారు! ఇంటర్నేషనల్ స్టాండర్డ్సుతో ముందుకు పోతోంది. చాలా దూరం కావడంవల్ల మేము తరచు కలుసుకోవడం వీలు కావడంలేదు! నేను గూడా గత 6-7 సంవత్సరాలనుంచి హైదరాబాద్‌లోనే మా మనమరాలు (హీరో సుమన్ భార్య) ఇంట్లో వుంటున్నాను.

ఈ మధ్య రామోజీరావుగారిని కలవాలని ప్రయత్నించి ఫిల్మ్‌సిటీకి పోయి వలవేసి పట్టుకుని మాట్లాడవలసి వస్తోంది. ఒకసారి ఫోన్ చేసి అడిగాను "ఎలావున్నారు?" అని. ఆయన నవ్వుతూ "మీరే ఇచ్చారుగా బిరుదు! మోసేగాడిదనని! మోస్తున్నాను" అన్నారు.

ఇలా చెప్పుకుంటూ పోతే చాలా పెద్ద గ్రంథమవుతుంది. ఇతర మిత్రులలాగ రామోజీరావుగారికి నాపై ఉన్న అభిప్రాయం నాతోనే చెప్పారు.

"You are a contented man! That is the secret of your health!"

జీవితంలో సజ్జన సాంగత్యం ఒక పెన్నిధి! మనిషి 'ఎన్నాళ్లు' బ్రతికాడని కాదు. 'ఎలా' బ్రతికాడనేది ముఖ్యం!

కాలం గడిచిపోతున్నది. 21వ శతాబ్దం వచ్చేసింది. ప్రపంచంలో ఎన్నో మార్పులు వచ్చేస్తున్నయ్! ముఖ్యంగా వైద్యరంగం ఎంతో అభివృద్ధి చెందుతోంది. కొత్త కొత్త మందులు వస్తున్నయ్. మనుషుల ఆయుర్దాయం పెరుగుతోంది. కొత్తకొత్త మందులతోపాటు కొత్త కొత్త రోగాలూ వస్తున్నయ్!

వైద్యరంగంలో మరో ముఖ్యమైన మార్పు ఏమిటంటే ఏ వైద్య విధానంలోనూ అన్ని రోగాలు కుదరడం లేదు! భూత వైద్యులు, మంత్ర తంత్రాలు, తాయెత్తులూ వగైరాలు వదిలేస్తే ప్రస్తుతం ఉన్న ప్రధాన వైద్య విధానాలు నాలుగయిదు ఉన్నాయి!

అల్లోపతి, హోమియోపతి, ఆయుర్వేదం, యునాని, ప్రకృతి వైద్యం వగైరాలు చాలా ప్రాచుర్యం పొందుతున్నయ్!

మరో విచిత్రమైన మార్పు ఏమిటంటే "ఏ వైద్య విధానంలోనూ అన్ని రోగాలకు మందులు లేవు" అని ఆయా వైద్యవిధాన వైద్యులే ఒప్పుకుంటున్నారు.

కొన్ని కొన్ని రుగ్మతలకి ఏదైనా వైద్యుడి దగ్గరకి వెళితే అతనే చెబుతున్నాడు. 'దీనికి ఆయుర్వేదం మంచిదండి' అని ఒకరు, "దీనికి కేరళ వైద్యం బెటరండీ!" అని ఇంకొందరు.

అల్లోపతి వైద్యునికి లొంగని మానసిక వ్యాధులకు "ఆహార నియమాలు, యోగ, ధ్యానం, హోమియో, ప్రయత్నించండి" అని అల్లోపతి వైద్యులు కొందరు చెబుతున్నారు.

హోమియోపతి శాస్త్రీయమైన వైద్యం కాదని వాదించేవాళ్లు ఉన్నారు. కాని వాళ్లు చాలా కొద్దిమంది మాత్రమే!



అందరూ ఒప్పుకునేది ఆహార నియమాలు, వ్యాయామం, వేళకు భోజనం, నిద్ర వగైరాలు. ఇవి ముఖ్యంగా ప్రకృతి వైద్యం కోవలోకి వస్తాయి!

నాకు ప్రకృతి వైద్యంతో చాలా అనుభవం ఉంది! చిన్నప్పుడు అంటే ముత్యాలంపాడు ఎలిమెంటరీ స్కూలులో రెండోక్లాసో, మూడోక్లాసో చదువుతున్నప్పుడు నాకు 'మూర్ఛలు' వచ్చేవి! EPILEPTIC FITS.

ముత్యాలంపాడులో వూరిబయట మైదానాన్ని 'పాటెదిబ్బ' అనేవాళ్లు! ఆ పాటె మైదానానికి దక్షిణాన ఎలిమెంటరీ స్కూలు ఉండేది. ఇప్పటికీ ఉంది. కాస్త పెంచినట్టున్నారు బిల్డింగు. దానికి ఎదురుగా ఉత్తరాన రాములవారి గుడి ఉంది. దానికి అర్చనలూ, వగైరాలు ఏమీ ఉండేవి కాదు. రామనవమికి పానకం, వడపప్పు పంచిపెట్టేవాళ్లు. ఇప్పుడు ఆలయం వెనక ప్రభుత్వ పిడబ్ల్యుడి స్థలం సేకరించి ఆలయం పెంచి కట్టారు. మైదానానికి తూర్పు వైపున ఒక వేపచెట్టు, రావిచెట్టు ఉండేవి. వాటికి పూజలు చేసేవారు! ఇప్పుడు ఆ చెట్లచుట్టు రెండడుగుల ఎత్తున చుట్టూ అరుగులాంటిది నాపరాళ్లతో పరచి కట్టారు! నేను చదువుకునేప్పుడు ఆ అరుగు లేదు! రావిచెట్టు వేళ్లు, వేపచెట్టు వేళ్లు నేలపైకి ఉండేవి. హెడ్మాస్టరు వస్తేగాని స్కూలు తెరువరు గదా! అందుకు మేము ఆ చెట్ల నీడన కూర్చునేవాళ్లం!

ఒకరోజు అకస్మాత్తుగా నాకు ఎడమచేతి వేళ్లు వంకర్లు తిరగడం ప్రారంభించి క్రమంగా ఎడమ చేయి వణకడం మొదలెట్టింది. నొప్పి ఏమీ లేదు గనక నేను నవ్వుతూ చుట్టూవున్న కుర్రాళ్లతో - "అరె! చూడండిరా! నా చెయ్యి ఎలా వణుకుతుందో" అన్నాను! అందరూ అదేదో గారడీ అనుకుని నవ్వడం మొదలెట్టారు! ఒక అయిదు పది నిమిషాలు తరువాత చేయి వణకడం ఆగిపోయింది. కాని లేపబోతే ఎడమచెయ్యి పట్టు యివ్వలేదు! చచ్చుపడిపోయింది. ఇంతలో స్కూలు తెరిచారు. క్లాసులోకి వెళ్లాను. క్రమంగా ఎడమచేయి మామూలు స్థితికి వచ్చింది.

ఇదేదో అనారోగ్యం అని తెలియక ఇంట్లో మా అమ్మకు గూడ చెప్పలేదు! మరునాడు క్లాసులో ఉన్నప్పుడే వచ్చింది మూర్ఛ! అంతా నాకు తెలుస్తూనే ఉండేది. స్పృహ ఉండేదన్నమాట!

కంగారుగా టీచరు మా అమ్మకు కబురుచేస్తే మా అమ్మ వచ్చి ఏడుస్తూ ఇంటికి తీసుకెళ్లింది. యిల్లు స్కూలుకు దగ్గర్లోనే ఉండేది.

రోజూ అలా రెండుమూడు సార్లు రావడంతో స్కూలుకు వెళ్లడం మానేసి కాయగూర వైద్యాలు మొదలయినై. అమృతాంజనంతో చచ్చుబడిన చేతికి మర్దనా చేయడం. చెయ్యి మామూలు స్థితికి రావడం. యీ రకంగా అనారోగ్యం ఏమీ ఉండేది కాదు.

అప్పుడు మా రాంమామయ్య (నాలుగో మేనమామ) ఒక ప్రకృతి వైద్యుణ్ణి తీసుకువచ్చాడు. ఆయన పేరు గంధం కృష్ణారావుగారు. ఆయన ఇల్లు (ఇప్పుడు సిమెంటు ఫ్యాక్టరీ వద్ద వున్న వంతెనకు ఎదురుగా ఉన్న) బ్రహ్మయ్య పంతులు వీధిలో ఉండేది. యిప్పటికీ ఆ వీధిపేరు అదే అనుకుంటాను. ఆ వీధి మునిసిపాలిటీలో ఆఖరివీధి. ఆ తరువాత ముత్యాలంపాడు మామిడితోటలు.

బ్రహ్మయ్య పంతులుగారు ఎవరో పోలీసు ఆఫీసరని జ్ఞాపకం! ఆయనదే మొదటి ఇల్లు. మెయిన్‌రోడ్డుకి సందుకి మూలమీద ఉండేది. ఆయన్ని నేను ఎరగను! తరువాత 1940 ప్రాంతంలో ఆ ఇల్లు మైలవరం జమీందారు



నరసింహారావుగారు కొన్నారు. ఆయన నాకు క్లబ్బులో మిత్రుడు. 1960 తరువాత విజయా పబ్లిసిటీ వాళ్లు కొన్నట్టున్నారు. నా మూర్ఛలకు గంధం కృష్ణారావుగారి ప్రకృతి వైద్యం వివరాలు ఇదివరకే రాశాను.

1946 జనవరిలో నా భార్యను భీమవరం ప్రకృతి ఆశ్రమానికి తీసుకువెళ్లాను. ఆ ఆశ్రమాన్ని గురించి ఇదివరకు రాశాను.

ఆ ఆశ్రమం డాక్టరు వేగిరాజు కృష్ణంరాజుగారి వైద్యవిధానం గురించి చెబుతాను.

ఎందుకంటే ఇప్పుడు ఎన్నో ప్రకృతి వైద్యశాలలు వెలసినై దేశంలో! ఒక్కొక్క డాక్టరుది ఒక్కొక పద్ధతి. అందుకు ముఖ్యకారణం యీ వైద్య విధానాన్ని గురించి పరిశోధన లేకపోవడం!

భీమవరం ఆశ్రమంలో శిక్షణ పొందిన డాక్టరే ఒకాయన హైదరాబాద్‌లో ప్రకృతి వైద్యశాల ఆరంభించాడు! ఆయన మిల్క్ ప్రొడక్ట్స్ - పాలకు సంబంధించినవన్నీ నిషేధించాడు. నాకు ఆశ్చర్యం వేసింది. భీమవరంలో రోగులు ఆహారం తీసుకోవడం ప్రారంభించిన ఆవుపాలు తాగమనేవారు.

నాకు వ్యాధి ఏమీ లేకపోయినా రోజూ గ్లాసులో ఒకటి రెండు స్పూన్లు తేనె తీసుకుని ఆవుల కాపరి వద్దకు వెళ్లి గ్లాసులో డైరెక్టుగా పాలు పితికించేవాణ్ణి. వెచ్చగా ఎంత రుచిగా వుండేవో చెప్పలేను!

ఆశ్రమం నుంచి మేము 1947లో బెజవాడ వచ్చిన తరువాతగూడ సత్యనారాయణపురంలో మాయింటికి దగ్గర్లో ఒకతను ఆవులు, గేదెల్ని మేపి పాలవ్యాపారం చేసేవాడు. నేను అలవాటు ప్రకారం గ్లాసులో తేనె తీసుకుని అతని యింటికి వెళితే నాముందే గ్లాసులోకి ఆవుపాలు పితికియిచ్చేవాడు.

యిప్పుడు ఆవులూ లేవు! పితికేవాడూ లేడు. అసలు ఆవుపాలే వైద్యానికి గూడ దొరకవు! యిదీ మన అభివృద్ధి! ప్రగతి! సంచుల్లో సప్లయ్ చేసే పాలే గతి!

భీమవరంలోని ప్రకృతి ఆశ్రమ వైద్యని విధానాన్ని గురించి ఇదివరకే రాశాను.

ఉపవాసాల తరువాత, క్రమంగా పళ్లరసం, అరటిపండు, కొబ్బరి, పచ్చికూరగాయలు, వండిన పదార్థాలు ఇలా క్రమంగా ఆహారం పెంచాలి!

ఏ పదిరోజులో పదిహేను రోజులో ఉపవాసం తరువాత ఒక్కసారి మృష్టాన్నభోజనం, నవకాయ పిండి వంటలతో విందుభోజనం పెట్టామనుకోండి. మనిషి 'ఢాం' అని చచ్చివూరుకుంటాడు. అందుకే రాజకీయ నాయకులు ఉపవాసాలు చేస్తే వుపవాసం మానేసిన తరువాత హాస్పిటలుకు తీసుకెళ్లి గ్లూకోసు, పళ్లరసం, వగైరాలతో ఆహారం ప్రారంభిస్తారు!

ప్రకృతి వైద్య విధానంలో ఎన్నో దీర్ఘవ్యాధులు, గుండెజబ్బులు, కిడ్నీ వ్యాధులు నయమైనటువంటివి నేను భీమవరం ఆశ్రమంలో కళ్లారా చూశాను. అక్కడ రోగ నిర్ధారణ (రోగనిదానం) అంటారు. డాక్టరు రోగిని ముట్టుకోడు! నాడి పరీక్షించడు. స్కెతస్కోపు, థర్మామీటరు అసలు ఉండవు. రోగిని నడవమంటారు. నడకనుబట్టి శరీరంలో ఎక్కడ కొవ్వు వ్యర్థ పదార్థం వుందో కనిపెడతారు. శరీరంలో పృష్ఠభారం, పురోభారం అని వుంటాయి! పృష్ఠభారం అంటే వెనక భాగాన బరువు ఎక్కువ వుందన్నమాట. అటువంటప్పుడు ముందుకు వంగి నడుస్తాడు. చాకలి గుడ్డల మూట వీపున వేసుకుని నడిచేటప్పుడు ముందుకు వంగి నడుస్తాడు. ఎందుకు? వీపుమీద అంటే శరీరం వెనక బరువు ఉన్నదన్నమాట!



భార్యతో... ( 1948 ప్రాంతం )

పురోభారం అంటే పెద్ద పొట్ట వున్న రోగి. వెనకకు విరగబడి నడుస్తాడు. ఒకణ్ణి నిలబడమంటే ఒంటికాలి మీద నిలబడి రెండో కాలు లూజ్‌గా ఊపుతుంటాడు!

రోగ నిర్ధారణలో 'ముఖవైఖరీ విద్య' అని ఉంది. మొఖం చూచి రోగి యొక్క రోగం కనిపెడతారు!

భీమవరం ఆశ్రమానికి రకరకాల రోగులు వస్తుండేవారు! ఒకటి, రెండు ఉదాహరణలు చెబుతాను. ఒక యువకుడు పాతికేళ్లవాడు! ఎడ్లబండి మీద ఎక్కించి తాళ్లతో కాళ్లు చేతులు కట్టి తీసుకొచ్చారు! కారణం మనుషుల్ని మీద బడి కొడుతున్నాడు.

బండి ఆశ్రమంలోకి రాగానే రోగి బంధువులు, రోగి లక్షణాలు చెప్పారు! తాళ్లు విప్పేయమన్నాడు డాక్టరుగారు!

"ప్రమాదమండి! పైనబడి కొడతాడు" అన్నారు వాళ్లు.

"ఫరవాలేదు విప్పండి" అన్నారు. విప్పారు. బండి మీద నుంచి దూకి, తొడకొడుతూ "ఒరే! డాక్టర్! నాతో కుస్తీ పడతావ్రా?"

డాక్టరుగారు ఏమాత్రం చలించకుండా "తీసుకెళ్లి ఆ గదిలో వేసి తలుపుమూసి రండి" అన్నారు.

నలుగురు మనుషులు బలవంతంగా తీసుకెళ్లి గదిలో వేసి (అది తాటాకులపాక) తలుపులు మూసివచ్చారు.



రోగి అలాగే సవాలు చేస్తు అరుస్తున్నాడు. మధ్యాహ్నం అయింది.

"ఒరే! ఆకలి అవుతున్నదిరా! అన్నం పెట్టండిరా!" అని కేక వేశాడు. నిమ్మకాయరసం పిండిన నీళ్లు ఇచ్చారు!

"యిదేమిటో! అన్నం అడిగితే నీళ్లిస్తారు?" ఆరోజు, తరువాత రాత్రి నిమ్మకాయనీళ్లు తప్ప ఆహారం యివ్వలేదు! మరునాడూ అంతే!

నీరసం వచ్చేసింది! కేకలు, సవాళ్లు మాయమైనయ్! "తలుపు తీయండి" అన్నారు డాక్టరుగారు. రోగి బయటికి అడుగుపెడితే ఒట్టు! పదిరోజుల ఉపవాసం! క్రమంగా పళ్లరసం వగైరాలు! రెండునెలల్లో మామూలు మనిషి అయినాడు.

రోజూ అందరితోపాటు కాలవకు వెళ్లి స్నానం చేసేవాడు. భీమవరంలో సాగరం గారని ఒక గాంధేయవాది ఉండేవాడు. రోజూ ఆశ్రమానికివచ్చి రోగులను పలకరించి మంచి చెడ్డలు అడిగి పోయేవాడు.

ఒకరోజు నిశ్శబ్దంగా ఒంటరిగా కూర్చున్న ఆ యువకుణ్ణి అడిగాడు!

"ఎలాఉంది? తగ్గిందా?" అని అడిగాడు. ఆ యువకుడు కూల్‌గా ".... ఎండగడితే తగ్గక ఏంజేస్తుంది" అన్నాడు.

మరొక కేసు! అనకాపల్లినుంచి ఒక వైశ్య యువకుడు పాతిక ముప్పయ్ ఏళ్లు! పెళ్లి అయింది. విపరీతమయిన స్థూలకాయం! ఉపవాసాలు పెట్టారు! ఒంట్లో ఉన్న కొవ్వు తగ్గడానికి నెలరోజులు పట్టింది. ఇంకాఉంది కొవ్వు! మెడకింద ఒక కణితిలాగ వచ్చింది.

డాక్టరుగారు నేను ఒకరోజు ఏదో పనిమీద నరసాపురం వెళ్లాం! డాక్టరుగారు పరధ్యానంగా విచారంగా ఉన్నారు.

"ఏమిటి విషయం" అన్నాను.

"ఆ కణితి కుడిపక్కన రాగూడదు! ప్రమాదం" అన్నారు. 'ప్రకృతి వైద్యంలో 'మందు' అనేమాటకు తావులేదు గదా! వైద్యం అలాగే సాగించారు. పదిరోజుల తరువాత పాపం ఆ వైశ్య యువకుడు చనిపోయాడు.

ఆ అనుభవంతో అప్పటినుంచి డాక్టరుగారు రోగులకు ఉపవాసాలు మానేశాడు. వైద్యం ప్రారంభించడమే పండ్లరసంతో ప్రారంభించేవాడు.

ఇలాగ దేశంలోని ప్రకృతి వైద్యులు వారి వారి అనుభవాలను బట్టి నమ్మకాలను బట్టి వైద్యాలు చేస్తున్నారేగాని శాస్త్రీయంగా, పరిశోధనలు చేసి, ప్రకృతి వైద్యం గూడ ఒక శాస్త్రీయమైన వైద్యం అని నిరూపించలేక పోతున్నారు. హైదరాబాద్‌లో ఇప్పుడున్న 'ప్రకృతి వైద్యశాల' ప్రారంభించింది వెంకట్రావుగారు! ఆయన భీమవరం ఆశ్రమంలో శిక్షణ పొందారు.

ఇప్పుడు ఆ వైద్యశాలను ప్రభుత్వం స్వాధీనం చేసుకున్నట్టు విన్నాను! వైద్యవిధానం ఏ రీతిలో జరుగుతున్నదో తెలియదు.

కాబట్టి ప్రకృతి వైద్యంలో లోపం లేదు! దాని విధానం, ఆచరణలోనే లోపం ఉండడంవల్ల పొందవలసినంత ప్రాచుర్యం పొందలేదని నా అభిప్రాయం!



మా పెద్దన్నయ్య గురవరాజుగారు కూడ బూర్జువాయే! కాని పార్టీ పట్ల ఆయన భక్తి, నిజాయితీలను శంకించలేం! ఊరిమీద ఆయనదే పెత్తనం! వూళ్లో ఎవడైనా తప్పు చేస్తే పట్టుకుని కొట్టేవాడు. ఆయన మీద గౌరవంతో పడివుండేవాళ్లు!

అండర్‌గ్రౌండ్‌లో వున్న కమ్యూనిస్టు పార్టీ సభ్యులకి ఎంతోమందికి ఆశ్రయం యిచ్చాడు. తాళ్లూరి దగ్గర రెంటపాళ్ల అని ఒకవూరు. ఆ వూళ్లో కమ్యూనిస్టు నాయకుడు మస్తాన్‌రావుకి మా అన్నయ్య ఆశ్రయం యిచ్చాడు!

యింకొక చిన్న వుదాహరణ చెబుతాను. నేను సినిమా రంగంలో ప్రవేశించిన తరువాత ఒకరోజు నేను వాహినీ దర్శకుడు బి.యన్.రెడ్డి గారింట్లో వున్నాను. బి.యన్.రెడ్డి స్నేహితులు యిద్దరు వచ్చారు. ఒకరు కోట్ల విజయభాస్కరరెడ్డిగారు, ఇంకొకరు మేడూరి నాగేశ్వరరావు! రెండో ఆయన గుంటూరు ఎం.ఎల్.ఏ.గా గూడ చేశాడనుకుంటా!

విజయభాస్కరరెడ్డిగారు నాకు అంతకుముందే 1946 నుంచి తెలుసు! మేడూరి నాగేశ్వరరావుగారికి నన్ను పరిచయం చేశారు! మాది తాళ్లూరు అని గురవరాజుగారు మా అన్నగారని చెప్పాను.

నాగేశ్వరరావుగారు ఆశ్చర్యంగా "ఏమండీ! యిదేం అన్యాయమండి! మీ వూళ్లో మా కాంగ్రెసు ఎలక్షను మీటింగు గూడ పెట్టుకోనివ్వలేదు మీ అన్నగారు" అన్నాడు.

"ఎందుకని?" అన్నాను నేను.

"ఆయన తప్పేం లేదు లెండి" ప్లెయిన్‌గా చెప్పాడాయన! "మా వూళ్లో మీకు ఎవడూ ఓటు వెయ్యడు. మీరు మీటింగు పెట్టడం అనవసరం! పెట్టినా ఎవరూ రారు! ఎవరైనా నలుగురు వచ్చినా మీమీద రాళ్లు వేసేవాళ్లేగాని మీ వుపన్యాసాలు సాగనివ్వరు. తరువాత మీయిష్టం అన్నాడు మీ అన్నయ్య! యిక మీటింగు ఎలా పెట్టుకుంటాం?" అని ఆయన నవ్వాడు.

వూళ్లో మా అన్నయ్యకి అంత గౌరవమూ పలుకుబడి వుండేవి!

కమ్యూనిస్టు పార్టీకి అంత విధేయతతో, భక్తితో, గౌరవంతో వున్న మా అన్నగారికి ఒక దశలో కమ్యూనిస్టు పార్టీవల్ల ఎంత కీడు జరిగిందో, ఎన్ని అవస్థలు, కష్టాలు పడ్డాడో యిదివరకే చెప్పాను.

అప్పుడు అంటే 1952లో మద్రాసు ఉమ్మడి రాష్ట్రం. ఆంధ్ర విడిపోలేదు. ఆంధ్రలో విజృంభించిన కమ్యూనిస్టు ప్రభావం తమిళనాడుకు గూడ పాకుతుందేమోనని భయపడి -

సి. రాజగోపాలచారి గారిని ముఖ్యమంత్రిగా తీసుకువచ్చారు తమిళ నాయకులు. అప్పుడు ఆయన శాసనసభ్యుడు గూడ కాదనుకుంటాను. బాగా జ్ఞాపకం లేదు. లెజిస్లేటివ్ కౌన్సిలుకు ఆయన్ను నామినేట్ చేసి తద్వారా ముఖ్యమంత్రిని చేసినట్టు జ్ఞాపకం. తమిళనాడుకు కమ్యూనిజం పాకకుండా రక్షించగలవాడు ఆయన ఒక్కడేననే నమ్మకంతో!

ముఖ్యమంత్రిగా ఆయన ఏం చెప్పాడో తెలుసునాండి! "మనరాష్ట్రంలో కమ్యూనిజాన్ని మనము ఏమీ చేయనక్కరలేదు. తనంతటతానే it will die a natural death!" అన్నాడు.

యవ్వనంలో అంటే దాదాపు పాతికేళ్ల వయసులో ఒక మనిషికి కమ్యూనిజం ఆకర్షణీయం కాకపోయినా 60 ఏళ్ల తరువాత గూడ ఒక మనిషికి కమ్యూనిజం పట్ల ఆకర్షణ కొనసాగుతున్నా ఆ మనుషుల్లో ఏదో లోపం



వుండివుంటుందని చమత్కరిస్తుంటారు కొందరు. అంటే యవ్వనంలో వ్యక్తిని ఆకర్షించే మొట్టమొదటి రాజకీయ సిద్ధాంతం కమ్యూనిజం అని అర్థం! అలాగే నాకు యవ్వనంలో కాలేజీ చదువు పూర్తికాగానే మొదటి ఆకర్షణ కమ్యూనిజం. నేను కాలేజీ చదువు ముగించుకుని మావూరు తాళ్లూరులో భూములు చూచుకోడానికి తరచు వెళ్లేవాణ్ణి. చెప్పానుగదా మా పెద్దన్నయ్య కమ్యూనిస్టు. ఆయన సహచరులు సత్తెనపల్లిలో కమ్యూనిస్టు యూనిట్ నాయకుడు నాళం నరసింహారావు. యింకా చాలామంది వుండేవాళ్లు కమ్యూనిస్టులు. 'జందు' శాస్త్రిగారని వుండేవాడు. చతుర్వేదుల సీతారామశాస్త్రి అనుకుంటాను. ఆయన కమ్యూనిస్టుల మెడికల్ షాపు వుండేది. ఆయన డాక్టరు. పేదలకు ఉచితంగా వైద్యం చేయడమేగాక ఉచితంగా మందులు గూడ యిచ్చేవాడు. అలాగ అందరూ అంకితభావంతో ప్రజాసేవ చేస్తూ ప్రజాదరణ పొందుతుండేవారు. వాళ్లందరితోటి నాకు పరిచయాలు ఏర్పడినయ్. నన్ను పార్టీలో చేర్చడానికి స్వల్పంగా ప్రయత్నాలు జరిగినయ్ గాని నేను మొగ్గలేదు.

1943-44 ప్రాంతంలో విజయవాడ జింఖానా క్లబ్బు గ్రౌండ్సులో కమ్యూనిస్టుల ఆధ్వర్యంలో రాష్ట్ర రైతు మహాసభలు వగైరాలు జరుగుతుండేవి. అప్పుడు సత్తెనపల్లి నుంచి వచ్చిన కామ్రేడ్లు మా యింట్లోనే వుండేవారు.

అంతకుముందే నేను కారల్ మార్క్స్ రాసిన 'కాపిటల్'చదివాను. అర్థమైనంతవరకు అర్థమయింది. అర్థంకానిది కాలేదు! 'కాపిటల్' పూర్తిగా అర్థమైనవాళ్లు చాలా తక్కువమంది కమ్యూనిస్టు పార్టీ సభ్యులు గూడ. 1946-47లో నేను భీమవరం ప్రకృతి ఆశ్రమంలో వున్నప్పుడు Sidney & Beatrice Webb రాసిన "సోవియట్ కమ్యూనిజమ్" అనే గ్రంథం చదివానని చెప్పానే అది తేలిగ్గా అర్థమయ్యేది. ఎందుకంటే వాళ్లు సోవియట్ రష్యాలో కమ్యూనిజం ఎలా స్టాలిన్ అమలు చేసింది రాశారు. కాని 'కాపిటల్' (మార్క్స్) ఎక్కువగా థియరీ! సిద్ధాంతం! అర్థం కావడం చాలా కష్టం.

కమ్యూనిస్టు రాజ్యం స్థాపనలో Dictatorship of the Proletariat అది ఎలా డెవలప్‌కావాలి? ఆ డెవలప్‌మెంట్‌లో అనేక దశలు! ఒక దశ "From each according to his Capacity to each according to his needs" అంటే ప్రతి పౌరుడు తన శక్తిమేరకు వుత్పత్తి చేయడం దానిలో నుంచి తనకు అవసరమైనంత వరకే తీసుకోవడం! యిప్పటి మానవస్వభావాన్ని బట్టి యిది యుటోపియాగానే కనిపిస్తుంది. 'యుటోపియా' అంటే ఊహాజనితమైన వ్యవస్థ అని అర్థం.

ప్రతి వ్యక్తి తన శక్త్యానుసారం ఉత్పత్తి చేసి తనకు కావలసినంతే తీసుకుని మిగతాది సమాజపరం చేయాలని సిద్ధాంతం! అలా జరిగినప్పుడు యిక ప్రభుత్వ యంత్రాంగంతో పని వుండదని "The state withers away" అంటే ప్రభుత్వం అనేది క్రమంగా దానంతట అదే అదృశ్యమైపోతుందని మార్క్సిజం భావం.

రష్యాలో స్టాలిన్ పరిపాలనలో దీనికి పూర్తి వ్యతిరేకంగా జరిగింది. ప్రభుత్వం 'అదృశ్యం' కావడానికి బదులు ప్రభుత్వం అంతా తానే అయి విశ్వరూపం దాల్చింది. ఆయన dictatorship of the proletariat కు బదులు dictatorship of the communist party అమలుచేశాడు. యిప్పుడు 21వ శతాబ్దంలో సోవియట్ రష్యాలో కమ్యూనిజం ఫెయిల్ అయిందని అంటారే అది చాలా తప్పు! ఎందుకంటే రష్యాలో స్టాలిన్ అమలు చేసింది మార్క్సిజం కాదు. మార్క్స్ ఎదిరించిన వాళ్లని Concentration Camps లో పెట్టమనీ పెద్ద పెద్ద భూస్వాముల్ని ఆకలితో మాడ్చి చంపమని ఎప్పుడూ చెప్పలేదు. Marx is a great Humanisti! మార్క్సిజం సోవియట్ రష్యాలో ఫెయిల్ అయితే మనం ఏమనుకోవాలంటే ఇండియాలో గాంధిజం ఫెయిల్ అయిందని చెప్పకోవాలి.



అంతేగదామరి! గాంధి నాయకత్వంలో నడచిన కాంగ్రెసు గదా అధికారంలోకి వచ్చింది! మరి ఈ 50 ఏళ్లలో ఇండియా ఇంత అధోగతికి వచ్చిందంటే మరి గాంధిజం ఫెయిల్ అయిందనే ఒప్పుకోవాలి గదా!

కాని అది ఎంతవరకు నిజమో మనం చూస్తూనే ఉన్నాంగదా! ఇండియాలో అధికారంలోకి వచ్చిన కాంగ్రెసు గాంధి సిద్ధాంతాన్ని ఎంతవరకు అమలు చేసిందో చూశాంగదా!

అక్కడా అంతే! రష్యాలో స్టాలిన్ మార్క్సిజం 'పేరు'తో విప్లవం తీసుకొచ్చాడు గాని మార్క్సిజాన్ని అమలు చేయలేదు.

రష్యాలో మార్క్సిజం ఫెయిల్ అయిందని అంటే ఇండియాలో గాంధిజం ఫెయిల్ అయిందని ఒప్పుకోవాలి! ఇది వాస్తవానికి పూర్తి విరుద్ధం!

అలాగే ఈ 'ఇజాలు' ఆచరణలోకి వచ్చేసరికి చాలా మార్పులు వస్తున్నయ్!

నేను లయోలా కాలేజీలో 1939-41లో విద్యార్థిగా ఉన్నప్పుడు గాంధి సంపాదకత్వాన 'యంగ్ ఇండియా' అని ఒక పేపరు ఉండేది! ఆ పేపరు పాత కాపీలు వాల్యూమ్స్‌గా చేసి పాత పుస్తకాల షాపుల్లో అమ్మేవాళ్లు! అవి చదివేవాణ్ణి! ఒక విద్యార్థిగా ఏ నాయకుడు ఏం చెప్పాడు? ఏ సిద్ధాంతంలో ఏముంది అని తెలుసుకోవడానికి చదివినవే గాని గుడ్డిగా ఒక సిద్ధాంతం వెంట బడిపోదామని కాదు.

గాంధి ఆత్మకథ "My Experiments with Truth" పుస్తకంలో నాకు కొన్ని నచ్చేవి కాదు. ఆయన కాంగ్రెసులో '4 అణాల' సభ్యుడు కాదు. అప్పుడు కాంగ్రెసు సభ్యత్వ రుసుము పావలా! ఆయన కాంగ్రెసులో మెంబరు కాదు. కాని కాంగ్రెసు నాయకులు ఆయన మాట జవదాటేవాళ్లు కాదు. ఇతర నాయకులతో ఏదైనా భేదం వచ్చినప్పుడు తన మాట నెగ్గించుకోవడం కోసం "My inner voice tells me" అనేవాడు. "నా అంతర్వాణి చెబుతుంది" అనేవాడు. ఆ మాట అన్న తరువాత ఇంకెవరైనా ఏం చేస్తారు? నోరు మూసుకుని ఊరుకోవలిసిందేగా!

అది నాకు నచ్చేదిగాదు.

నెహ్రూకి గాంధియన్ ఆర్థిక విధానం మీద అంతగా నమ్మకం లేదు. ఆయన దృష్టి అప్పట్లో (స్వాతంత్ర్యా నంతరం) రష్యా విధానాలు, పంచవర్ష ప్రణాళికలు, భారీ పరిశ్రమల మీద ఉండేది. పెద్ద పెద్ద పరిశ్రమలు, డ్యాంలు కట్టి అవన్నీ టెంపుల్స్ (దేవాలయాలు) అన్నాడు.

అలాగ గాంధి ఆర్థిక విధానాలనుంచి deviate అయిపోయి గ్రామాలను నెగ్లెక్ట్ చేసి, గ్రామ పరిశ్రమలను ప్రోత్సహించకుండా సవతి తల్లి ప్రేమతో చూసి గ్రామాలను నిర్వీర్యం చేసి గ్రామాలు నివాస యోగ్యం కాకుండా చేసింది ప్రభుత్వం యీ 50 ఏళ్లలో! Village Industries Association అని పేరేగాని గ్రామాలను పూర్తిగా విస్మరించారు. పైగా యీ 50 ఏళ్లలో రాజకీయ నాయకులు, పార్టీలు, కేవలం సంపాదనే ప్రధాన ధ్యేయంగా ఆదర్శాలు, సిద్ధాంతాలు, విలువలు తుంగలో తొక్కి, ప్రతి ఊళ్లో రెండు మూడు రాజకీయపార్టీలు, దెబ్బలాటలు, ఖూనీలతో గ్రామ జీవితం దుర్భరమైపోయింది.

గాంధి ఆర్థిక విధానం అన్ని సమస్యలకు పరిష్కార మార్గమని చెప్పలేం గాని, గ్రామాలను నెగ్లెక్ట్ చేసి నందువల్ల యీ 50 ఏళ్లలో గ్రామాలలో వచ్చిన పరిణామాలు దారుణం! భయంకరం!



కొన్ని పల్లెటూళ్లలో స్కూళ్లే లేవు. స్కూళ్లుంటే టీచర్లు లేరు. టీచర్లుంటే స్టూడెంట్స్ లేరు. ఒక వేళ గ్రామంలో హైస్కూలు పెట్టినా గూడ 10 వరకు చదువుతాడు. పై కాలేజి చదువుకు పోవాలంటే ఖర్చుతో కూడిన పని. తండ్రికి తాహతు ఉండదు. అప్పుడేం చేస్తాడు కుర్రాడు? వ్యవసాయమూ చేయడు. యిస్త్రీ బట్టలు వేసుకుని పొలం పని ఎలా చేస్తాడు? యిస్త్రీ బట్టలకి కాఫీలకి, టిఫిన్‌లకి అలవాటు పడినవాడు దగ్గరలో వున్న టువునుకు పోయి ఏ చిన్న క్లబ్బులోనో చీట్లపేక, జూదం, తాగుడు వగైరాలకు అలవాటు పడతాడు.

ఇక్కడ ఉద్యోగాలు దొరకవని, ఉద్యోగాన్వేషణలో సిటీలకు వెళతాడు. వెళ్లేటప్పుడు కాస్తో, కూస్తో డబ్బులు జేబులో వేసుకెళతాడు గదా! సిటీలో ఉండడానికి ఒక రూం కావాలి గదా! రూంకి అద్దె ఎక్కువ పెట్టలేడు. చవకగా రూం దొరకాలంటే ఎక్కడ దొరుకుతుంది. ఏ బస్తీ గుడిసెల్లోనో దొరుకుతుంది. ఆ గుడిసెల్లో నెలకు 5 రూపాయలకో, పది రూపాయలకో అద్దెకు దిగుతాడు. చుట్టు పక్కల గుడిసెల్లో ఉన్న వాళ్లంతా ఎవరు? ఇతని లాగానే పల్లెలనుంచి సిటీకి ఉద్యోగాల కోసం వచ్చి వుద్యోగాలు దొరక్క చివరికి తేలిక సంపాదన కోసం దొంగతనాలకు అలవాటు పడతారు. వాళ్లనే anti social elements అంటారే- సంఘవ్యతిరేక శక్తులు వాళ్లతో చేరతాడు. వాళ్లది తేలిక సంపాదన! దొంగతనాలు, దారులు కొట్టడం! పల్లెనుంచి ఉద్యోగం కోసం వచ్చిన కుర్రాడికి వుద్దేశం మంచిదయినా దొంగతనం తేలిక సంపాదన! ఉద్యోగంలో చేరినా నెలకి మూడు వందలో ఐదు వందలో వస్తే తిండికి, ఇంటి అద్దెకి చాలదు! ప్రక్కన చూస్తే దొంగతనాలు చేసి తేలికగా సంపాయించి విలాస జీవితాలు గడుపుతున్నవాళ్లు కనబడతారు. వాళ్లతో చేరతాడు. వాళ్లతో పాటు రెండు కత్తులు చేతబట్టుకుని పోయి పట్టపగలు ఒక ఇంటికి పోయి తలుపు కొడితే ఒంటరిగా ఉన్న ఒక ఆడది తలుపు తెరుస్తుంది. లోపలికి వెళ్లి కత్తులు చూపించి బెదిరించి ఒంటిమీద నగలు దోచుకుని వచ్చి ఆ నగలు అమ్ముకుంటే వందలు వేలు వస్తయ్! గోల్డ్ ప్లేక్ సిగరెట్లు, సినిమాలు, ఖరీదైన బట్టలు హాయిగా బ్రతకవచ్చు! కష్టపడి పనిచేయవలసిన పనేముంటుంది?

ఇప్పుడు యిలా గ్రామాలను అశ్రద్ధ చేసి హైటెక్ కంప్యూటర్ల మీద కేంద్రీకరిస్తే జరిగేదేమిటి? హైటెక్ కంప్యూటర్లు, అధునాతనమైనవే! అవసరమే! కాని భారతదేశంలో 90 శాతం జనం గ్రామాల్లో నివసిస్తున్నారు. ఈ కంప్యూటర్లు హైటెక్ టెక్నాలజీ గ్రామాలకు తీసుకెళ్లగలరా? కంప్యూటర్లు వచ్చిన తరువాత సిటీల్లో టవునుల్లో ఉద్యోగాలు చేసేవాళ్లకే ఉద్యోగాలు వూడుతున్నయ్యని గోలపెడుతున్నారే!

అయితే గాంధి సిద్ధాంతం ప్రకారం రాట్నాలు ప్రవేశపెట్టి దేశాన్ని కొన్ని శతాబ్దాలు వెనక్కి తీసుకెళతారా అని కొందరు అడగవచ్చు! నిజమే, అదీ వాంఛనీయం కాదు!

మరి అలాంటప్పుడు ఈ సమస్యకు సొల్యూషన్ - పరిష్కార మార్గమేమిటి?

పొద్దునే లేచి బయటికెళితే మళ్లీ ఇంటికి తిరిగివచ్చేదాకా సామాన్య పౌరుడికి గ్యారంటీ లేదు!

ఇంట్లో కూర్చున్నా భద్రత లేదు! చీకటి పడిన తరువాత ఉద్యోగం చేసే భర్త యింటికి వస్తాడు. భార్య పిల్లలతో కూర్చుని టి.వి. చూస్తుంటాడు. నలుగురు గూండాలు కత్తులు తీసుకుని ఇంట్లో జొరబడతారు. దొరికినంత వరకు లూటీ చేసుకుని పోతున్నారు. పోలీసుకి రిపోర్టు చేస్తే 'మాకు చాలినంత సిబ్బంది లేదు' అంటారు. వి.ఐ.పి.లకి రాజకీయ నాయకులకి సెక్యూరిటీ కోసం, గన్‌మెన్‌లని పెట్టాలాయ్! పెరుగుతున్న ట్రాఫిక్ కోసం అదనపు పోలీసులు కావలసివచ్చె! ఎంతమంది పోలీసుల్ని అదనంగా రిక్రూట్ చేస్తారు? అక్కడగూడ లంచాలిచ్చినవాళ్ల రిక్రూట్‌మెంట్ ఉద్యోగాలు. వుద్యోగం కోసం ఇచ్చిన లంచం మళ్లీ సంపాయించుకోవాలిగదా! దానికి మార్గం మళ్లీ లంచాలే!



ఇది ఒక విషవలయం! మొన్న ఒక రాజకీయ నాయకుడు చెబుతున్నాడు. ఒక కానిస్టేబుల్ అతని దగ్గరకు వచ్చాడట! తనకు ఫలాన చోటికి బదిలీ చేయిస్తే 50 వేలు లంచం ఇస్తానన్నాడట!

"బదిలీకే 50 వేలు లంచమా?" "అవును సార్! ఫలాన చోటికి అయితేనే! మిగతాచోట్లకయితే అనవసరం!"

ఆ కానిస్టేబులు ఫలాన చోటికి బదిలీకి అంత డబ్బు ఎందుకిస్తానన్నాడంటే - ఆ కానిస్టేబులే చెప్పాడట!

"ఎక్కడయితే రౌడీయిజం ఉన్నదో, ఎక్కడయితే వ్యభిచార గృహాలుంటయ్యో అటువంటి చోట్ల మాకు ఆదాయం లంచాలరూపంలో ఎక్కువ వస్తుందండి!

ఏమీలేని చోట మాకు లంచం ఎవడిస్తాడు? మీకు ఇవ్వబోయే 50 వేలు నాకు ఒక లెక్కగాదు! నేను అడిగిన చోటికి నన్ను బదిలీచేస్తే యీ 50 వేలు మూడునెలల్లో సంపాదిస్తాను" అన్నాడట.

నిజమే రౌడీలు, మాఫియాలు ఉన్నచోట వాళ్లు దోచుకుని వచ్చిన సొమ్ములో కానిస్టేబులుకి వాటా యిస్తారు.

ఒక్కమాటలో చెప్పాలంటే నీతిగా సంపాయించాలనేటటువంటి రూల్ పోయింది. ఈ పోవడం పైనుంచి కింది దాకా పోయింది. ఎలక్షన్‌లో కోటి రూపాయలు ఖర్చు పెడుతుంటే చూస్తూ ఊరుకునేది యిది ఏమి కాన్‌స్టిట్యూషను? యిది ఏమి ఎలక్షన్ కమీషన్?

ఎం.ఎల్.ఏ. అంటే ఎవరు? శాసనాలు చేయబోయేవాడు? శాసనాలు చేయబోయేవాడు శాసనకర్త కాబోయే (ప్రొపెస్) దోవలోనే శాసనాన్ని వుల్లంఘిస్తున్నాడు!

ఎలక్షన్ రూల్స్‌కు వ్యతిరేకంగా ఎలక్షన్‌కు కోటి రూపాయలు ఖర్చు పెట్టి 5 లక్షలే ఖర్చుపెట్టానని ఎలక్షన్ కమీషన్‌కు అబద్ధపు స్టేటుమెంటు ఇస్తున్నాడు!

దీనిని మనం 'ప్రజాస్వామ్యం' అంటున్నాం! ఎంత అవమానం! ఎంత సిగ్గుచేటు?

ఇది ప్రజాస్వామ్యం కానేకాదు! ఇది ధన స్వామ్యం! ఇప్పుడు పవిత్ర భారతదేశాన్ని ఏలుతున్నది.

Money Power and Muscle Power. అర్థబలం! అంగబలం!

అప్పుడు (1920 ప్రాంతంలో) ఇండియన్ నేషనల్ కాంగ్రెసును గురించి లెనిన్ చెప్పినది -ఇప్పుడు అక్షరాల నిజమైందని గ్రహించడం ముఖ్యం!

1947లో తెల్లదొరలను వెళ్లగొట్టి నల్లదొరలు అధికారంలోకి వచ్చారు. దూరదృష్టి, చరిత్రగమనం తెలిసినవాడు గనక మహాత్మగాంధి స్వాతంత్ర్యం రాగానే కాంగ్రెసును రద్దుచేసి కాంగ్రెసు వాళ్లను వేరేపేరుతో పార్టీ పెట్టుకోమన్నాడు. కాని చెట్టుపేరు చెప్పుకుని కాయలు అమ్ముకునే కాంగ్రెసు వాళ్లు గాంధిమాట ఎందుకు వింటారు? ఎవరి గొంతుక వాళ్లు కోసుకుంటారా!

1951 జనవరి 26 నాటికి (రిపబ్లిక్‌డే) దేశంలోని మేధావులు, రాజ్యాంగ సభగా ఏర్పడి భారత రాజ్యాంగం రాసుకున్నారు. దానిని "ప్రజాస్వామ్యం" అన్నారు. దానికి 'సోషలిస్టు' అనే బిరుదుగూడ చేర్చింది ప్రధాని ఇందిరాగాంధి.

రాజ్యాంగ నిపుణులు తమ తమ మేదస్సునంతా దారపోసి రాసిన 'ప్రజాస్వామ్య' రాజ్యాంగం యీ 50 ఏళ్లలో 'ధనస్వామ్యం' గా మారింది. అందుకు కారకులు ఈ 50 ఏళ్లు దేశాన్ని పాలించిన ఎందరో మహానుభావులు! అందరికీ వందనాలు!!



డెమోక్రసీ అంటే పెద్దలు చెప్పిన నిర్వచనం Government of the people, by the people, for the people. అంటే ప్రజలయొక్క, ప్రజలకొరకు, ప్రజలచేత నడపబడే ప్రభుత్వమన్నమాట!

ఈ 50 ఏళ్లలో ఘనతవహించిన మన వివిధ రాజకీయ పార్టీలనాయకులు డెమోక్రసి నిర్వచనం మార్చేశారు.

'Government of the politicians, by the politicians, for the politicians' గా మార్చారు! ఈ పరిణామంలో 'పీపుల్' అంటే ప్రజలు గాలికి పోయారు. రాజకీయ నాయకులు ఆడే స్వార్థ రాజకీయ చదరంగంలో కేవలం 'పావు'లుగా మిగిలిపోయి నిస్సాహాయంగా దీన ప్రేక్షకపాత్ర వహిస్తున్నారు.

సామ్రాజ్యవాద "తెల్లదొరలను" పారద్రోలినంత తేలిగ్గా స్వాతంత్ర్యానంతరం ప్రభుత్వాల పగ్గాలు పట్టిన "నల్లదొరలను" పారద్రోలడం 'కష్టసాధ్యమే'గాదు దాదాపు 'అసాధ్యం' అన్నా అతిశయోక్తి గాదు.

దేశం విడిచిపోయిన తెల్లదొరల కంటె ప్రస్తుత దేశపాలకులైన నల్లదొరలు చాల - చాల - చాల - చాల బలవంతులు. తెల్లదొరలకున్న ఆయుధాలు లేకున్నా యీ నల్లదొరల ఆయుధాలు, కవచాలు, బహుశక్తివంతమైనవి!

తెల్లదొరలకు లేని బలమైన బలాతిబలమైన 'వజ్రకవచం' ఉంది యీ నల్లదొరలకి! అది జాతీయత! దేశభక్తి! 'ప్రజాసేవ' అనే ఉక్కు ముసుగు! వీళ్లని ఎక్కడికి వెళ్లగొట్టగలం?

తెల్లవాళ్లను వాళ్లదేశానికి పొమ్మన్నాం! వీళ్లనెక్కడికి పొమ్మంటాం! 'ఈ దేశమే మాది' అంటారే!

"దేశమును ప్రేమించుమన్నా"

"ఏ దేశమేగినా ఎందుకాలిడిన - పొగడరా నీ తల్లి భూమి భారతిని"

మనది వేద సాంప్రదాయ సంస్కృతి కదా!

"తల్లిభూమి" మాతృభూమి! భారత మాతను అడ్డంపెట్టుకుని యిష్టారాజ్యంగా రాజ్యమేల్తారు. పేదల రక్త మాంసాలు పీక్కుతింటారు.

అదేమంటే 'దేశభక్తులు' అంటారు. 'తెలుగుతల్లి', 'భరతమాత' అని కవిత్వాలు, గేయాలు రాసి పూజలు, పునస్కారాలు బ్రహ్మాండంగా చేస్తారు గాని 'తెలుగు తండ్రి', 'భరతమాత భర్త' ఎవరో ఎవరూ చెప్పలేరు.

అందుకే జాతీయత, దేశభక్తి, "Nationalism is diabolique" అన్నాడు మహామేధావి జిడ్డు కృష్ణమూర్తి.

ఈ జాతీయ వాదం సామ్రాజ్యవాదం కంటె వెయ్యిరెట్లు బలవంతమైనది! ప్రమాదకరమైనది!!

ఇప్పుడు దేశంలో జరుగుతున్నదాన్ని అచ్చతెలుగులో చెప్పాలంటే "కంచే చేను మేస్తోంది! కాపు ఏమి చేయగలడు?" ఈ "ప్రజాసేవకుల్ని", "దేశభక్తుల్ని" ఏమైనా అంటే 'నువ్వు దేశద్రోహివి' అంటారు.

'ప్రజాద్రోహం' చేయడానికి 'దేశభక్తి' చాలా వీలైన పదునైన, మెత్తని నొప్పిలేకుండా గొంతుకోసే ఆయుధం!

అందాకా ఎందుకు? ఇండియాకు, పాకిస్తాన్‌కు జరిగిన యుద్ధం ఎవరెవరి మధ్య జరిగింది?

పాకిస్తాన్ 'ప్రజలు', భారత్ 'ప్రజల' మధ్య కాదు. పాకిస్తాన్ ప్రభుత్వం - భారతప్రభుత్వం మధ్య!

'ప్రభుత్వం అంటే ప్రజలే గదా' అని నమ్మబలుకుతారు నాయకులు. కాదు! ప్రభుత్వం ప్రజలది కాదు! డబ్బుది! డబ్బుగలవాడిది.



డబ్బుగలవాడి వెనక ఉన్నది ఒక మహాశక్తి! మాఫియా! గూండా! ఖూనీకోర్! దోపిడి వర్గం!

భారత్‌లోనూ, పాకిస్తాన్‌లోనూ సామాన్యమానవుల నిష్పాక్షిక మనోభావాలు Plebicite ప్రజాభిప్రాయం తీసుకోండి!

"మీకు యుద్ధం కావాలా?" అని అడగండి! ఏకగ్రీవంగా వద్దు అంటారు! కాని యుద్ధంవల్ల లాభంపొందే అధికార ధనికవర్గం ఎలక్షన్లని పేరుపెట్టి 'దేశభక్తి' మత్తుమందు ఎక్కించి ప్రజలచేత ఎన్నుకోబడి స్వార్థంకోసం యుద్ధాలు చేసి 'ఇది ప్రజాభిప్రాయం' అంటారు! "మమ్మల్ని ఎన్నుకున్నది ప్రజలు! వాళ్ల చేయమంటేనే చేస్తున్నాం యుద్ధాలు! ప్రజలకోసం! ప్రజాక్షేమం కోసం!" అంటారు.

VAZ అని భారతదేశానికి మెక్సికో రాయబారిగా పనిచేశాడు అతను Nationalism (జాతీయత - దేశభక్తి)కు చాలమంచి నిర్వచనం యిచ్చాడు.

"Nationalism is Political Religion!" అన్నాడు. మతాలలో ఎంత 'మౌఢ్యం' - 'మత్తుమందు వుందో' నేషనలిజం (జాతీయత)లో అంత మత్తుమందు మౌఢ్యం ఉన్నయ్! సామ్రాజ్యవాదాన్ని పారద్రోలడానికి భారతీయులకి 50,60 ఏళ్లకంటె ఎక్కువ పట్టలా! కాని ఈ నేషనలిజమ్ - జాతీయత mixed & supported by Religion. దీనిని దేశం నుండి పారద్రోలడానికి కొన్ని శతాబ్దాలు పట్టవచ్చు! నేషనలిజమ్ (జాతీయత - దేశభక్తి)కు ప్రత్యామ్నాయం ఏమిటి? అని అడగవచ్చు! One World Govt. దేశాల సరిహద్దులు చెరిపేయాలి! దీనిని కేవలం 'ఊహాజనితం'గా కొట్టిపారవేయవచ్చు. కాని ఎప్పటికైనా దేశాల ఎల్లలు చెరిపేసి నెలకొల్పబడే One World Govt. ఒక్కటే తరణోపాయం!' అందుకు వందల వేల సంవత్సరాలు పట్టవచ్చు!

ఇప్పుడు యూరపులోని దేశాలు ఆర్థికంగానూ, ఇతర విధానాలుగానూ, ఒకరి కొకరు దగ్గరకావడానికి చేసే ప్రయత్నాలు One World Govt. వైపు చేయబోయే సుదీర్ఘయానంలో పడే పురిటినొప్పులేమో!

నేను సినిమాలలో పాటలు రాయకపోవడానికి కారణాలు ఉన్నయ్! నా మొట్టమొదటి చిత్రం వాహినీ వారి "పెద్దమనుషులు" స్క్రిప్టు అంతా రాసిన తరువాత డైరెక్టరు కె.వి. రెడ్డిగారు నన్ను అడిగారు "నరసరాజుగారూ! పాటలు గూడ రాస్తారా?" అని. నేను నవ్వుతూ అన్నాను "రాయగలను గాని బాగా రాయలేను" అని. అదీగాక "పెద్దమనుషులు" చిత్రంలో మూడు సన్నివేశాలలో పాటలు కొసరాజు రాఘవయ్యగారి చేతనే రాయించాలని నేను సూచించడం, రెడ్డిగారు అంగీకరించడం జరిగిపోయాయి. మిగతా పాటల విషయంలో ఊటుకూరి సత్యానారాయణ రావుగారని ప్రఖ్యాత కవి - నాటక కర్త. ఆయనతో బెజవాడలో నాకు అంతకు ముందు పదేళ్లకు పైగా పరిచయం! మంచి నాటకాలు రాశారు.

ఆయన వాహినీ స్టూడియో తొలిదశలో కవిగా పనిచేశారు. కారణం తెలియదు! ఎందుకో సడన్‌గా తీసేశారు. ఆయన కెవి.రెడ్డిగారి దగ్గరకు వచ్చాడు.

వచ్చి "స్టూడియోలో ఉద్యోగం పోయిందండి. మీరు తీస్తున్న సినిమాలో నాకు అవకాశం ఇస్తారేమోనని అడుగుదామని వచ్చాను" అన్నారు.

ఈ విషయం కె.వి. రెడ్డిగారు నాతో చెప్పారు. నేను వెంటనే "అయ్యో! ఆయన నాకు గూడ దగ్గర స్నేహితులు! ఆయన రాసిన నాటకాలు చూశాను గూడ! గొప్ప రచయిత! మిగతా పాటలు ఆయన చేత రాయించండి! నాకూ



సంతోషం!" అన్నాను. ఊటుకూరు సత్యనారాయణగారు "రఘునాథ్", "వీరాభిమన్యు" లాంటి మంచి నాటకాలు రాశారు. 'వీరాభిమన్యు' నేను రెండు సార్లు చూశాను. గంపలగూడెంలో స్థానం, మాధవపెద్ది లాంటి ఉద్దండులు నటించగా మదరాసులో నేను లయోలా కాలేజీలో చదివేటప్పుడు (1939-41) వి.పి. హాలులో వేశారు. అందులో గుమ్మిడిదల దుర్గాబాయిగారు 'సుభద్ర'గా నటించారు.

ఇక నా రెండవ చిత్రం అన్నపూర్ణ పిక్చర్సువారి "దొంగరాముడు". అన్నపూర్ణ పిక్చర్సు నిర్మాత దుక్కిపాటి మధుసూదనరావు గారు మొట్టమొదట భరణీ రామకృష్ణ గారిని దర్శకుడుగా, సముద్రాల సీనియర్ రచయితగా సినిమా తీయాలనుకున్నారు. ఇద్దరికీ అడ్వాన్సులు గూడ ఇచ్చారు. కాని రామకృష్ణగారు సొంత భరణీ స్టూడియో నిర్మాణ పనుల్లో నిమగ్నుడవడం వల్ల దర్శకత్వం చేయలేనని చెప్పి అడ్వాన్సు తిరిగి ఇచ్చేశారు.

ఆ తరువాత కె.వి. రెడ్డిగారు దర్శకుడుగా, నేను మాటల రచయితగా నిర్ణయం జరిగింది.

ఇదివరకే అడ్వాన్సు గూడ ఇచ్చివుండడం వల్లనూ, అదీగాక సముద్రాల సీనియర్ మధుసూదనరావు, అక్కినేని నాగేశ్వరరావు గార్లకు చాల సన్నిహితులు కావడం వల్లనూ ఆయన చేత కనీసం పాటలు రాయించడం సముచితమని అందరం నిర్ణయించడంతో "దొంగరాముడు" చిత్రానికి నేను పాటలు రాసే సమస్యే తలెత్తలేదు.

ఆ తరువాత నా సినిమాలకు పాటలు రాయాలన్న ఆసక్తి గూడ లేకపోవడం వల్ల నేను కేవలం కథ, మాటలకే పరిమితమైపోయాను.

అదీగాక హైస్కూలు, కాలేజీ చదువులలో పరీక్షలకోసం వ్యాకరణం - ఛందస్సు తప్పనిసరై చదువుకున్నానేగాని సినిమా పాటలు, పద్యాలు రాయడానికి నాకు అంత సామర్థ్యము, అర్హత గూడ లేవనే చెప్పాలి!

సినిమా రంగం - అది ఒక ప్రత్యేక ప్రపంచం! అందులో ఉన్న మాకు తప్ప బయటి వాళ్లకెవరికీ అర్థంకాని ప్రపంచం! ఇందులో రకరకాల వ్యక్తులు! రకరకాల సమస్యలు, సన్నివేశాలు!

జెమినీ స్టూడియో అధినేత ఎస్.ఎస్. వాసన్‌గారు "మనుషులు మారాలి" సినిమాకు మాటలు వ్రాయమని కబురు చేస్తే నేను వేరే పనిలో ఉండి "సారీ!" అని చెప్పి రాయలేకపోయాను. ఇది జరిగింది 1970 మొదట్లోనని జ్ఞాపకం. అప్పుడు అన్నపూర్ణ పిక్చర్స్ "జై జవాన్" చిత్రానికి రాస్తున్నాను.

వాసన్‌గారు పోయిన తరువాత ఆయన కుమారుడు బాలన్ తెలుగులో ఒక సినిమా డైరెక్ట్ చేశాడు. ప్రొడ్యూసరు ఎవరో తమిళ పాత్రికేయుడు. పేరు జ్ఞాపకం లేదు.

ఆ సినిమాకు మూలం శాంతారాం హిందీలో తీసిన "దో-ఆంఖేఁ బారాహాత్". దానిని తమిళంలో యం.జి. రామచంద్రన్ ప్రధాన పాత్రగా తీశారు. పేరు జ్ఞాపకం లేదు.

దానిని తెలుగులో తీయాలనుకున్నప్పుడు బాలన్ నాకు కబురు చేశాడు. అతనితో నాకు అంతకు ముందు పరిచయం లేదు. రచయితగా నాపేరు తెలిసి పంపించాడు. జెమినీ స్టూడియోలోనే ఆ ప్రొడక్షన్ ఆఫీసు.

జెమినీ స్టూడియోకి వెళ్లాను. ఆఫీసులోకి వెళ్లగానే బాలన్ నన్ను చూచి (తమిళంలో అన్నాడు) "అబ్బ! ఇన్నాళ్లకు దొరికాడయ్యా ఈయన నాకు!" అన్నాడు. నేను ఆశ్చర్యంతో "అంటే ఏమిటి మీరనేది?" అన్నాను. "ఇదివరలో నేను మీకోసం మూడుసార్లు 'ట్రై' చేసాను. మూడుసార్లూ - "ఆయన బిజీగా ఉన్నారు! ఒక పిక్చరు చేతిలో ఉండగా మరో పిక్చరుకు రాయరు! అని చెప్పారు" అన్నాడు.



నేను అన్నాను "మిమ్మల్ని ఎవరో టోకరా వేశారు. నిజానికి నా దగ్గరకు మీ మనిషి ఎవ్వరూ ఒక్కసారి గూడ రాలేదు" అన్నాను.

అతను ఆశ్చర్యంగా చూశాడు.

నేను అన్నాను - ఇందులో ఆశ్చర్యపడవలసినదేమీ లేదు! సినిమా రంగం మీకు తెలియనిది కాదు! సామాన్యంగా మా దగ్గరకి మీ ప్రొడక్షన్ మేనేజర్లని పంపిస్తారు. ఇది మీ సంస్థలోనే గాదు. వాహినీ, ఎ.వి.యం. లాంటి పెద్ద పెద్ద సంస్థలలో ఉండే అలవాటు ఆచారమే! వాళ్లకి అంటే ప్రొడక్షన్ మేనేజర్లకి కమీషన్లు ఉంటయ్, ఆర్టిస్టుల దగ్గర కమీషన్లు తీసుకుంటారు. రైటర్ల దగ్గర కమీషన్లు తీసుకుంటారు. టెక్నీషియన్ల దగ్గర కమీషన్లు తీసుకుంటారు. మీకేమో అంటే ప్రొడ్యూసర్లకి వాళ్ల మీద నమ్మకం! వాళ్లని నమ్మితే గాని మీకు పనిజరగదు. వాళ్ల నీతి, నిజాయితీ పరులనే అనుకుంటారు మీరు.

నేను ఎవరికీ లంచాలు ఇవ్వను! నా సంగతి తెలిసిన వాళ్లెవరూ నా దగ్గర లంచాలు ఆశించరు అడగరు! అందువల్ల నేను రైటర్‌గా వస్తే వాళ్లకి ఏమీ గిట్టుబాటు కాదు కాబట్టి -

"వెళ్లామండి! ఆయన్ని అడిగామండి! బిజిగా ఉన్నారండి! ఇప్పుడు పనిచేయడానికి వీల్లేదన్నాండి!" అని మీకు ఏవో సాకులు చెబుతారు. మీరు వాళ్లని అనుమానించవలసిన అవసరం ఉండదు. వాళ్లు చెప్పింది నమ్ముతారు. మీకు నాతో పరిచయం లేదు గాబట్టి ఫోన్‌లోనైనా నాతో మాట్లాడరు. ఇలా చాలాచోట్ల జరుగుతుంటయ్" అన్నాను.

ఆయన "అవును! అవును! I can understand" అన్నాడు.

ఇలాగ ప్రొడక్షన్ మేనేజర్లు కొంతమంది 'అందరూ' అనడం భావ్యం కాదు చాలామంది తమకు కేవలం కమీషన్లు ఇచ్చే వాళ్లనే గాదు తమకు అనుకూలమైన వాళ్లని తెచ్చి అవకాశాలు యిస్తుంటారు.

హిందీ పిక్చరు "రాం ఔర్ శ్యాం" అనుభవం చెబుతాను. "రాముడు-భీముడు" హిందీలో నాగిరెడ్డిగారు దిలీప్ కుమార్‌తో తీయాలనుకున్నప్పుడు అక్కడ ఒక ప్రొడక్షన్ మేనేజరు వుండేవాడు (పేరు చెప్పడం బాగుండదు. అవసరంలేదు గూడ! అతను యిప్పుడు లేకపోయినా అతని కొడుకులో కూతుళ్లో బంధువులో తెలిస్తే సహజంగా బాధపడతారు గదా!) దిలీప్ కుమార్ బెంగుళూరులో వున్నప్పుడు అతను పిక్చరు చేస్తాడా? చేస్తే ఎప్పటినుంచి కాల్‌షీట్లు యిస్తాడో అడగడానికి నాగిరెడ్డిగారు ఆ ప్రొడక్షన్ మేనేజర్ని పంపించారు బెంగుళూరుకి!

యితను దిలీప్‌తో ఏం మాట్లాడాడో మనకి (అంటే నాగిరెడ్డిగారికి) తెలియదు. తిరిగి వచ్చి దిలీప్‌ను గురించి అతను ఏం చెబితే అది నమ్మడం! "ఫలానప్పటినుంచి కాల్ షీట్స్ ఇస్తానన్నాడండి" అని చెప్పాడు.

"పిక్చరు చూస్తాను! బెంగుళూరు పంపమన్నాడండి."

అతన్ని మదరాసు వచ్చి చూడమంటే చూస్తాడు. కాని వీళ్లు పడనివ్వరు. ముందుగా వీళ్లే "ప్రింటు ఇక్కడికి పంపుతాం చూడండి" అని అంటారు.

ఎంతసేపటికీ ప్రొడ్యూసర్నీ, హీరోని దూరంగా ఉంచాలని వీళ్ల ఉద్దేశం! అప్పుడే వీళ్లు ఆడే నాటకాలకి అవకాశం! అప్పటికీ యన్.టి.ఆర్‌తో "రాముడు-భీముడు" యం.జి.ఆర్.తో తమిళంలో "ఎంగవీట్టుపిళ్లై" తీశాం!



తెలుగు ప్రింటు చూపిస్తే ఒక చిక్కుంది. మధ్యలో నేను వస్తాను రంగంలోకి! శిఖండిని!

అందుకని నాగిరెడ్డి దిలీప్ కుమార్ కలవకుండానే తమిళ ప్రింట్ బెంగుళూరు తీసుకెళ్లి దిలీప్‌కు చూపించి రెండు భాషల్లో అదివరకే తీసిన సినిమా కథ మీద చర్చలకోసం ఒకసారి బొంబాయి వెళ్లి రావలసిన పని ఉందని దిలీప్ బొంబాయి వెళ్లివచ్చి బెంగుళూరునుంచి ఊటీ వెళ్లారు.

వెళ్లింది ఎవరెవరు? డైరెక్టరు చాణక్య, ప్రొడక్షన్ మేనేజరు, దిలీప్ కుమార్ సొంత బృందం. అదొక ప్రపంచం! బొంబాయినుంచి వస్తూ వస్తూ దిలీప్ కుమార్ వెంట ఒక బెంగాలీ రచయితను తీసుకువచ్చాడు.

అవి బొంబాయిలో మామూలుగా జరిగేవేనట. ఎవరైనా ఒక పనిలేని రచయితని ఒక హీరో దగ్గరికి తీసుకొచ్చి "పాపం! ఇతనికి ఏమీ పని దొరకలేదండి. ఆర్థికంగా బాధలు పడుతున్నాడు! ఇతనికి ఏదైనా దారిచూపండి" అని హీరోకి అప్ప చెబితే ఆ హీరో ఆ రచయితను తాను పనిచేసే పిక్చరు ప్రొడ్యూసరు నెత్తిన రుద్దుతాడట.

అలా వచ్చినవాడు దిలీప్ వెంటతీసుకొచ్చిన బెంగాలీ రైటరు! ఆ రైటరు రావడం ఒంటరిగా కాక 'సకుటుంబంగా' వచ్చాడు.

వీరందరూ కథా చర్చలకోసం వూటీ వెళ్లి దాదాపు 15 రోజులు మకాం వేసి ఆరోజుల్లోనే (1967-68 ప్రాంతం) 60,70 వేలు తగలబెట్టి వచ్చారు. దిలీప్ మటుకు నేరుగా ముంబాయి వెళ్లిపోయాడు మదరాసు రాకుండానే!

దిలీప్‌కుమార్‌కి కథ బాగా నచ్చిందనీ క్షుణ్ణంగా అర్థం చేసుకున్నాడని - ఈకథ అతని నరనరాల్లోకి ఎక్కిపోయిందనీ - అర్ధరాత్రి వేళ అతన్ని నిద్రలేపి అడిగినా కథ పొల్లుపోకుండా గడ గడ చెప్పగలడనే ఇంప్రెషన్ కలగచేశారు నాగిరెడ్డిగారికి! (ఇందులో నిజమెంతో ముందు ముందు తెలుస్తుంది!)

ఇక బెంగాలీ రచయిత సంగతి: అతను భార్యా బిడ్డలను బొంబాయి పంపి తను మదరాసులో ఉండిపోయాడు. డబ్బు తీసుకున్నందుకు ఊరికే ఉన్నాడనిపించుకుంటే ఎలా? అందుకని రామ్ - ఔర్ శ్యామ్" కథ తన సొంత ధోరణిలో రాశాడు. నిర్మాత గదా నాగిరెడ్డి గారిని వినమన్నాడు. ఆయనకు టైంలేక అది నాకు తగిలించాడు. నన్ను వినమన్నాడు సరే వింటానన్నాను. నేను రాసిన కథే తిరిగి రాసి నాకే అర్థంకాకుండా చెబుతున్నాడు. పది నిమిషాలు వినేసరికి నాకు తలనొప్పి వచ్చింది. 'ఇప్పుడే వస్తా'నని లేచివెళ్లి నాగిరెడ్డిగారితో చెప్పాను. "నాకు ఈ శిక్ష తప్ప మరే శిక్షయినా వేయండి! నేను రాసిన కథే అతనికి అర్థంకాక వేరే కథనాకు చెబుతున్నాడు" అన్నాను. నాగిరెడ్డిగారు నవ్వి "సరే! అతన్ని హోటలుకు పంపించేద్దాంలెండి" అని 'శాంతోం'లో వున్న 'ఓషియానిక్' హోటలుకు పంపారు. (ఇప్పుడా హోటలు లేదు) బొంబాయి నుంచి దిలీప్ వచ్చాడు. హీరోయిన్‌గా వైజయంతీమాలను బుక్‌చేశారు నాగిరెడ్డిగారు. షూటింగ్ ప్రారంభించాలి.

ఇక్కడ దిలీప్ గురించి కొంత చెప్పాలి. అతను నటించే సినిమా కథలు అంతకు ముందు ఎంతమంది రచయితలు రాసినా అవన్నీ కుదించి ఫైనల్‌గా తనే రాసుకుంటాడు డైలాగ్స్‌తో సహా!

ఇప్పుడు సినిమా రంగంలో హీరోలు డామినేట్ చేస్తున్నారని ఒక వదంతి వుంది. యిది యిప్పుడే గాదు! పూర్వం దిలీప్, యం.జి.ఆర్. లాంటి అగ్రనటులందరూ అంతే ఫైనల్‌గా వాళ్లు చెప్పినట్టు చేయాలిసిందే.

ఒక టేక్ తీసి 'బాగాలేదు! యింకో టేక్ తీద్దాం' అని ఎం.జి.ఆర్. అంటే డైరెక్టరు నోరుమూసుకుని తీయాలిసిందే.



ఒక షాట్ ఒకవేళ యం.జి.ఆర్. ఓకే అన్నాడనుకోండి. "ఇంకో టేక్ తీద్దాం సార్' అని డైరెక్టర్ అంటే చురచుర చూస్తాడు. డైరెక్టర్లకు హడల్. యం.జి.ఆర్‌తో 'రాముడు - భీముడు' తమిళంలో 'ఎంగవీట్టు పిళ్లె' తీశాంగా! చూశాను. ఈ అగ్రహీరోలదే డామినేషన్. వాళ్ల మాటే ఫైనల్.

ఒకసారి చనువుగా దిలీప్‌తో నేను అన్నాను "పిక్చరు ప్రొడక్షన్‌లో మీరు డామినేట్ చేస్తారని పేరుంది..." అంటే అతను అన్నాడు నవ్వుతూనే "ఎవరో ఒకరు డామినేట్ చేయాలిగదా' ఒకప్పుడు డైరెక్టర్లు డామినేట్ చేసేవాళ్లు! సైలెంట్ పిక్చర్స్ రోజుల్లోనూ, టాకీల మొదటి రోజుల్లోను, యాక్టర్లు బాగా చెయ్యకపోతే డైరెక్టర్లు కొరడా తీసుకుని కొట్టేవాళ్లు! ప్రొడ్యూసరు గట్టివాడైతే ప్రొడ్యూసరు డామినేట్ చేస్తాడు. ఇప్పుడు మాకు ఆర్టిస్టుకు కాస్త ఛాన్స్ ఇవ్వగూడదు"? అన్నాడు - చిరునవ్వుతో!

"రాం ఔర్ శ్యాం" పూర్తి అయింది. రిలీజ్ అయింది. పిక్చరు బాగా పోతోంది. ఒకరోజు దిలీప్ వేరేపని మీద మదరాసు వస్తూ ఒక హిందీ ప్రొడ్యూసర్ని తీసుకొచ్చి నా దగ్గరకు పంపించబోతూ హోటల్‌నుంచి మా యింటికి ఫోన్ చేశాడు.

"మంచి ప్రొడ్యూసరు! యిది వరకు నాలుగు సినిమాలు తీశాడు. మనిషిగూడ మంచి వాడు..." అని ఏవేవో చెప్పబోయాడు.

"నేను వచ్చి మాట్లాడతానులెండి' అని ఫోన్ పెట్టేశాను. ఈ బొంబాయి పద్ధతులు నాకు అసలు నచ్చవు. అందరూ వేళగాని వేళల్లో వస్తారు. రూంలలో కూర్చోటం. తాగటం! తప్ప - అసలు పని ఏమీ జరగదు. పైగా పని అయిన తరువాత ఎవరి ఇళ్లకు వాళ్లుపోతారు. నేను ఒకణ్ణి హోటల్ రూంలో కూర్చోవాలి! పలకరించే దిక్కుఉండదు!

అందుకని దిలీప్‌ని కన్విన్స్ చేసి బొంబాయి రానని చెప్పేశాను. హిందీ ఆర్టిస్టు గూడ మదరాసు ప్రొడక్షన్స్ ప్రిఫర్ చేసే కారణం ఇక్కడ పని ఖచ్చితంగా జరుగుతుందని. డబ్బు ఖచ్చితంగా వస్తుందని. జితేంద్ర చాలా రోజులు మద్రాసులోని హిందీ మార్కెట్ డామినేట్ చేసి బాగా సంపాయించాడు.

దిలీప్ ఒకసారి ఎవరిదో పిక్చరులో యాక్ట్ చేయడానికి మంచి సమ్మర్‌లో మదరాసు వచ్చాడు. 1983-84 ప్రాంతంలో. భార్య సయిరాబాను గూడ వచ్చింది వెంట. ఏదో హోటల్‌లో ఉన్నాడు. అతను వస్తున్నాడని తెలిసి నేను హోటల్‌కి ఫోన్ చేశా "మీరు ఖాళీగా వున్నప్పుడు వచ్చి కలుసుకుంటాను! చాలనాళ్లయింది కలిసి!" అన్నాను.

"అలాగే రేపు రాత్రి భోజనానికి రండి" అన్నాడు. మరునాడు సాయంత్రం హోటల్‌కు ఫోన్ చేశా! అతని భార్య 'సయిరాబాను' ఫోన్ తీసింది. "దిలీప్ షూటింగ్ నుంచి ఎన్నిగంటలకి వస్తారు?" అని అడిగాను. "ఈరోజు షూటింగ్‌కు వెళ్లలేదు! చాలా అలసిపోయివున్నారు. ప్రస్తుతం నిద్రపోతున్నారు" అన్నదామె.

"అదేమిటి సాయంత్రం నిద్రపోవడమేమిటి?" అన్నాను. ఇంతలో అతనే లేచాడు. లేచి ఫోన్ తీసుకుని "Mr Raju! I did a mistake in coming to Madras during this season! It is very hot in the studio floor! I am very much tired! I cancelled the shooting and came to the hotel."

నేనన్నాను "మీకు మదరాసు క్లయిమేట్ సంగతి తెలుసుగదా! ఈ సమ్మర్‌లో ఎందుకు ఇచ్చారు Call sheets?" అన్నాను.

అంటే అతనేమన్నాడో తెలుసాండి!



"Beggars are not Choosers, Mr. Raju" అన్నాడు. నిజానికి ఇన్ని సినిమాల్లో యాక్ట్ చేసినా ఇంత పేరు ప్రతిష్టలు సంపాయించినా దిలీప్ పెద్దగా సంపాయించలేదు. మరునాడు వెళ్లి రెండు మూడు గంటలు కబుర్లు చెప్పుకుంటూ కాలక్షేపం చేశాం!

ఈ మధ్య కూడ ఒకసారి దిలీప్ రామోజీ ఫిలిం సిటీకి వచ్చినట్టు తెలిసింది. ఏదో పిక్చర్ షూటింగుకోసం! అతను తిరిగి వెళ్లిపోయాక తెలిసింది నాకు! అందువల్ల కలుసుకోలేకపోయాను.

ఇదంతా ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే సినిమా ఖర్చులు పెరగడానికి 'కొందరు' ప్రొడక్షన్ మేనేజర్లు తమ స్వార్థం కోసం ఆడేనాటకాలు చేసే చేష్టలు, పన్నే కుట్రలు చెప్పడానికి! సినిమా నిర్మాణంలో డబ్బు ఖర్చు పెట్టేది ఒక్కడు ప్రొడ్యూసరు! తీసుకునేది దాదాపు వందమంది నటీనటులు, టెక్నీషియనులు వగైరాలు!

యార్లగడ్డ వెంకన్నచౌదరిగారు చెప్పింది నిజమే! అనుభవపూర్వకంగా చెప్పాడు. "డబ్బిచ్చి అందరికీ దణ్ణాలు పెట్టాలి." ఎవరికి కోపమొచ్చినా సినిమా చెడుతుంది! కాబట్టి సినిమా నిర్మాత పరిస్థితి అసూయ పడవలసినది కాదు! అవసరమయితే జాలిపడవలసినది!!

ఈ మధ్య దాదాపు 10 ఏళ్ల క్రితం 'ఈ టివి' వచ్చింది గదా! అందులో నావి కొన్ని యింటర్వ్యూలు టెలికాస్ట్ అవుతుండేవి! దాంతో నా మొఖం చాలామందికి తెలిసింది. సినిమాల్లో వున్నప్పుడు నాపేరేగాని, నా మొఖం ఎవరికి తెలియదు.

'ఈ టివి' పరిచయంతో "ఓహో! అక్షింతలు రాసేది ఈయనా?" అని కొందరు గుర్తుపట్టడం మొదలెట్టారు. సాధారణంగా రచయితకి తన రచనలు ఎవరు చదువుతున్నారో తెలిసినప్పుడు - ముఖ్యంగా ఎవరి మీదయితే రచయితకి గౌరవం ఉంటుందో వాళ్లు చదువుతున్నారని తెలిసినప్పుడు రచయితకు కొంత తృప్తి! మదరాసులో ఒక సందర్భంలో మోటూరి సత్యనారాయణ గారిని పరిచయం చేశారు ఒక సమావేశంలో! ఆయన మదరాసులో హిందీ ప్రచార సభ స్థాపకుల్లో ఒకరు! చాలాకాలం పార్లమెంటు మెంబరు! పరిచయం లేకపోయినా ఆయనంటే నాకు ఎంతో గౌరవం! ఆయనకి నన్ను పరిచయం చేస్తే "ఓహో! అక్షింతలు' నరసరాజుగారా?" అన్నాడు. నేను ఆశ్చర్యపోయి 'మీరు 'అక్షింతలు' చదువుతారా?" అన్నాను. 'రెగ్యులర్‌గా చదువుతాను. హ్యూమన్ సైకాలజీ బాగా స్టడీ చేశారు" అన్నారు.

హైదరాబాద్‌లో రామకృష్ణమఠం, స్వామి పరమార్థానంద! ఆయనతో నాకు పరిచయం లేదు. ఒకరోజు రవీంద్రభారతి లో ఆయన ఉపన్యాసం విన్నాను. దానిని గురించి మరునాడు 'అక్షింతలు' రాశాను! పరమార్థానంద నుంచి ఫోన్! "అక్షింతలు చదివాను! చాలా బాగుంది! మీకు ఫోన్ చేసి అభినందించాలంటే నాదగ్గర మీఫోన్ నెంబరు లేదు! 'ఈనాడు'కు ఫోన్ చేసి మీ నెంబరు తీసుకుని ఫోన్ చేస్తున్నాను! ఆర్టికల్ చాలా బాగుంది. నేను రెగ్యులర్‌గా మీ 'అక్షింతలు' చదువుతాను" అన్నారు.

ప్రతి రచయిత తన రచనలు పెద్దవాళ్లు, మేధావులు, ముఖ్యంగా తాను గౌరవించేవాళ్లు చదువుతున్నారంటే అదొకరకమైన తృప్తి!

'అక్షింతలు' "ఈనాడు"లో 19 సంవత్సరాలు రాశాను!

1936లో నేను హిందూ కాలేజి హాస్టలులో ఉండేవాణ్ణి! హాస్టల్లో భోజనాలు బ్రాహ్మణులకి, బ్రాహ్మణేతర



విద్యార్థులకి వేరు వేరు గదుల్లో భోజనాలు వడ్డించేవారు. వంటగది కాస్త పెద్దదిగా వుండేది. అందులోనే బ్రాహ్మణ విద్యార్థులకు భోజనాలు వడ్డించేవారు. నాన్ బ్రాహ్మిన్స్‌కి ఇవతల హాలులో వడ్డించేవారు. హాస్టల్లో ఉన్న రెండేళ్ల అంతే! హాస్టలులోనేగాదు! బ్రాడీపేట రెండవలైను మొదట్లో ఒక భోజన హోటలు ఉండేది. దానిని సభాపతి హోటలు అనేవాళ్లు! సభాపతి ప్రొప్రయిటరు. తమిళుడో, కన్నడిగుడో! అందరూ హాస్టలులో వుండేవాళ్లు కాదు గదా! వేరే గదుల్లో అద్దెకుండి హోటళ్లలో భోజనాలు చేసేవారు. సభాపతి హోటల్లో గూడ బ్రాహ్మణులకు, బ్రాహ్మణేతరులకు భోజనాలు వేరు వేరు గదుల్లో వడ్డించేవారు.

కాని ఎప్పుడూ ఫీల్ అయ్యేవాళ్లం గాదు. ఎవరూ అభ్యంతర పెట్టేవాళ్లుగాదు!

ఆ తరువాత నేను బి.ఏ చదవడానికి మదరాసు 'లయోలా కళాశాల' వెళ్లాను గదా! అక్కడా హాస్టల్లో వున్నాను. అప్పుడు మదరాసు ఉమ్మడి రాష్ట్రం! బ్రాహ్మణ, బ్రాహ్మణేతర భేదాలు లేవు. తెలుగు, తమిళ, కేరళ, కన్నడ విద్యార్థులుండేవాళ్లు. అందువల్ల విడివిడిగా ఆంధ్రామెస్, తమిళమెస్, కేరళమెస్, ఇవన్నీ శాఖాహార భోజనశాలలు. శాకాహారంలో తమిళ, తెలుగు, కేరళ వాళ్లకు తేడాఉంటుంది గనక విడివిడిగా మెస్‌లు పెట్టేవారు. ఉదాహరణకి కేరళవాళ్లు కొబ్బరినూనెతో వంటలు చేస్తారు. తెలుగు వంటకాల్లో కాస్త కారం ఎక్కువ! తమిళులకి సాంబారు - కూటు! అందుకని వేరువేరుగా మెస్‌లు పెట్టేవారు!

మాంసాహారులకు మటుకు అన్ని ప్రాంతాలవాళ్లకు కలిసి ఒకే మెస్ ఉండేది! దానిని కాస్మాపాలిటన్ మెస్ అనేవాళ్లు! ఇవికాక యూరోపియన్ మెస్ అని ఒకటి ఉండేది. దానిలో ఆంగ్లో ఇండియన్స్‌తోపాటు ఇండియన్స్‌లో గూడ పెద్ద పెద్ద ఆఫీసర్ల కొడుకులు, పాశ్చాత్య పద్ధతులకు అలవాటు పడ్డవాళ్లు, యూరోపియన్ మెస్‌లో భోంచేసేవాళ్లు! కొంతమంది హోదా కోసం భోంచేసేవాళ్లు! నైట్ డ్రెస్‌లు వేసుకోవడం, కత్తులు ఫోర్కులుతో తినడం అదొక ఫాషన్‌గా ఉండేది కొందరికి!

గుంటూరులో బ్రాహ్మణ, బ్రాహ్మణేతరులకు విడివిడి భోజనాలు ఎన్నాళ్లు అలా సాగినయ్యో నాకు జ్ఞాపకంలేదు.

ఇటువంటిదే మాల, మాదిగల సమస్య! ఇప్పుడు దళితులంటున్నారే అప్పుడు హరిజనులనేవారు! అది గాంధిపెట్టిన పేరనుకుంటాను.

బ్రాహ్మణ, బ్రాహ్మణేతరులకు విడివిడిగా భోజనాలు పెడితే ఎలాగయితే అప్పుడు మేము అభ్యంతర పెట్టలేదో అలాగే మాల-మాదిగలను అంటరానివాళ్లుగా చూస్తే అప్పట్లో వాళ్లూ పెద్దగా అభ్యంతరం పెట్టేవాళ్లుగాదు. పట్టణాలు వదిలెయ్యండి! నేను చెప్పేది పల్లెటూళ్ల సంగతి.

బ్రాహ్మణ, బ్రాహ్మణేతరులతో లాగే మాలమాదిగలలో గూడ "మేమేం తక్కువవాళ్లమా? ఏమిటి మీగొప్ప?' అనే Sense of Protest ధిక్కరణ! అది ఎప్పుడో చరిత్రలో ఒక్కసారిగా వస్తుందనుకుంటాను.

నా అనుభవంలో ఒక ఉదాహరణ చెబుతాను!

1960 దశకం ప్రథమార్థాలలో అనుకుంటాను. అనంతపురం ఇంజనీరింగు కాలేజీ విద్యార్థులు నేను రాసిన 'నాటకం' అనే నాటకం నా సమక్షంలో ప్రదర్శించాలన్న కుతూహలంతో మదరాసువచ్చి, నన్ను ఆహ్వానించారు. నాకు ప్రయాణాలంటే అప్పుడూ, ఇప్పుడూ, ఎప్పుడూ బద్ధకమే! రెండు గంటల నాటకం చూడడం కోసం యింతదూరం



రైలు ప్రయాణం అనవసరం అని "నేను ప్రయాణాలు చేయలేనయ్యా" అన్నాను. అంటే వాళ్లు దర్శకులు కె.వి. రెడ్డిగారి దగ్గరకు వెళ్లారు. రికమెండేషన్ కోసం ఆయనది అనంతపురం జిల్లా తాడిపత్రి.

రెడ్డిగారు నాతో "నరసరాజుగారూ మా జిల్లావాళ్లు! మీ మీద అభిమానం కొద్దీ ముచ్చటపడుతున్నారు. మీరు అనంతపురం చూడలేదు గదా! ఓపిక చేసుకుని వెళ్లివస్తే వాళ్లూ సంతోషిస్తారు" అన్నారు.

ఆయన మాట తీసేయలేక "సరే వస్తాను" అన్నాను. (అంతకుముందు ఒకసారి అనంతపురంలో ఆంధ్రనాటక కళాపరిషత్తు జరిగినప్పుడు 1949 అనుకుంటాను. నాకు సన్మానం చేసినట్లు గుర్తు! ఇప్పటికీ గూడ ఫోటోలు వున్నయ్!)

నాతోపాటు ఆరుద్ర, గుమ్మడి గార్లను గూడ ఆహ్వానించారు. ముగ్గురం వెళ్లాం!

ఆ రోజు అక్కడ కార్యక్రమం ఏమిటంటే ముందు సాయంత్రం 6 గంటలకు మా ఉపన్యాసాలు, ఉపన్యాసాల తరువాత భోజనాలు, భోజనాల తరువాత నా 'నాటకం' ప్రదర్శన! మా ఉపన్యాసాల కార్యక్రమంలో ఆరుద్ర కవిత్వాన్ని గురించి మాట్లాడాడు. గుమ్మడి 'నటన' గురించి మాట్లాడాడు. నేను 'ప్లే ప్రొడక్షన్' 'నాటక ప్రయోగం' గురించి మాట్లాడాను.

నాటకాన్ని ప్రదర్శించేటప్పుడు రంగస్థలంమీద 'ఏవి చేయాలి' 'ఏవి చేయగూడదు' D's and Don'ts వాటిని demonstrate చేసి చూపించాను.

ఉదాహరణకి స్టేజీమీద ఒక మూల 'ఫోన్' ఉంటుందనుకోండి! ఫోన్ మోగుతుంది. "ఫోన్ మోగితే వెంకయ్య ఫోన్ ఎత్తుతాడు" అని నాటకంలో ఉంటుందనుకోండి. వెంకయ్య ఫోన్‌కి దూరంలో ఉంటాడు. కాని సుబ్బయ్య ఫోన్ పక్కనే ఉంటాడు. ఫోన్ మోగగానే ఫోన్ దగ్గర ఉన్నవాడు ఎత్తాలి గదా సహజంగా! ఎత్తడు! కారణం నాటకంలో 'వెంకయ్య ఎత్తాలి' అని ఉందిగనక. ఫోన్ దగ్గర ఉన్న సుబ్బయ్య ఎత్తకుండా దూరంగా ఉన్న వెంకయ్య వచ్చి ఫోన్ ఎత్తితే అసహజంగా ఉండదూ? అందువల్ల రిహార్సల్సు వేసేటప్పుడే నాటకాన్ని డైరెక్ట్ చేసే దర్శకుడు ఫోన్ దగ్గర సుబ్బయ్య కాకుండా వెంకయ్య ఉండేటట్లు artistes movements manipulate చేసుకోవాలి! అప్పుడు సహజంగా ఉంటుంది. ఫోన్ వెంకయ్య కోసం వచ్చినట్టు ఫోన్ మీద రాసి ఉండదు గదా! ఇలాటి ఉదాహరణలు కొన్ని చూపించాను.

ఇంకో విషయం? స్టేజీమీద Not to act is more important than acting! ఎందుకంటే డైలాగ్ ఉన్నప్పుడు నటుడికి యాక్ట్ చేయడం కష్టం కాదు. అవతల నటులు డైలాగులు చెబుతున్నప్పుడు డైలాగ్ ఏమీ లేనటువంటి నటుడు యాక్ట్ చేయగూడదు. అలా యాక్ట్ చేయకుండా స్టేజీమీద నిలబడడం కష్టం. తనకు ఏమీ డాలైగ్ లేదు గదా అని 'టై' సర్దుకోడమో, చొక్కా మడతలు సరిచేసుకోవడమో, స్త్రీ పాత్ర అయితే పైట సర్దుకోవటమో జుట్టు సరిచేసుకోవటమో చేస్తే ఆడియన్స్ attention divert అవుతుంది. ప్రేక్షకులు వీడివైపు చూస్తారు. అందువల్ల నీకు డైలాగు లేనప్పుడు నీవు స్టేజీమీద ఏం చేయాలి? ఇది చాలా ముఖ్యం నటుడికి!

చిన్న ఉదాహరణ! బళ్లారి రాఘవాచారిగారు ఇంగ్లీషు నాటకాలు వేస్తుండేవారు. ఒక నాటకంలో బెజవాడకు చెందిన లాయరు ఒకాయన గూడ నటిస్తుండేవాడు. ఆ సమాజంలో! ఆయనది చిన్న నౌకరు వేషం! ఆయనకు కాస్త చర్మవ్యాధి వున్నది. ముఖ్యంగా తొడల భాగంలో దురద.



రాఘవాచారి గారు స్టేజి మీద చాల ఎమోషనల్‌గా నటిస్తున్నాడు. నౌకరు వేషం వేసిన లాయరు గారు నెమ్మదిగా అప్పుడప్పుడు తొడలు దురద పుట్టి గోక్కుంటుండేవాడు. అది చూచి ప్రేక్షకులు నవ్వడం మొదలు పెట్టారు. ఒకసారిగాదు. ఆయన నిముష నిముషానికి గోక్కోవడం జనం నవ్వడం రాఘవాచారి గారికి అర్థంకాలా! తను అంత ఎమోషనల్‌గా బ్రహ్మాండంగా నటిస్తుంటే ఎందుకు నవ్వుతున్నారోనని కలవరపడ్డాడు. సీను అయిపోయిన తరువాత తెరపడింది. స్టేజిలోపల రాఘవాచారి గారు కంగారు పడిపోతున్నారు. జనం ఎందుకు నవ్వుతున్నారో తెలియక. మరొక సభ్యుడు అసలు సంగతి చెప్పాడు. "మీ నౌకరు తొడల దురదకోసం గోక్కుంటున్నాడు. అందుకు నవ్వుతున్నారు" అని.

"వీడి రోగం కుదురుస్తా" అని తరువాత సీనులో ఆ నౌకరు పాత్రధారికి రెండు చేతులలో రెండు వెలిగించిన కొవ్వొత్తులు పెట్టాడు. అది రాత్రి సీను కాబట్టి. తెరలేచింది. సీను మొదలైంది. పెద్ద సీను, నౌకరు పాత్రధారి ఓర్చుకున్నంతసేపు ఓర్చుకున్నాడు. ఇక ఓర్చుకోలేక ఆ రెండు కొవ్వొత్తులు బల్లమీద పెట్టి రెండు చేతులతో తొడలు తనివి తీరా గోక్కోవడం మొదలుపెట్టాడు.

రాఘవాచారిగారు తెర దించమన్నారు. తరువాత నాటకంలో నటుణ్ణి మార్చారు. ఈ ఉదాహరణ ఎందుకు చెప్పానంటే నాటకం జరుగుతున్నప్పుడు ప్రేక్షకుల దృష్టిని తప్పుదోవ పట్టించగూడదు.

ఒక్కొకసారి నాటకం జరుగుతూఉంటుంది. ఒక పాత్రకు డైలాగు ఏమీ ఉండదు. కాని స్టేజి మీద మరోమూలకు పోవాలి! అప్పుడు ఆడియన్సు దృష్టి తెలియకుండా మెల్లగా అడుగులో అడుగువేసుకుంటూ జరుగుతున్న యాక్షనుకు రియాక్ట్ అవుతున్నట్టు నటిస్తూ వాళ్లవంకే చూస్తూ, మెల్లగా తన పోదలుచుకున్న చోటికి పోవాలి అలా నాఉపన్యాసం ముగించా!

దురదృష్టవశాత్తు నేను ఉపన్యసిస్తున్నంతసేపూ 'నాటకం' లో నటించే నటులు గ్రీన్‌రూంలో వేషాలు వేసుకుంటున్నారు. నా ఉపన్యాసం వాళ్లు వినలా!

తరువాత భోజనాలు! భోజనాలయిన తరువాత 'నాటకం' ప్రారంభమయింది. నా ఉపన్యాసంలో ఏవైతే చేయగూడదని చెప్పానో అవన్నీ వాళ్లు చేస్తున్నారు! ఎక్కడో ఉన్నవాడు వచ్చి ఫోన్ ఎత్తితే జనం నవ్వుతున్నారు. ఎందుకు నవ్వుతున్నారో నటులకు అర్థంకాలా! నాటకంలో ఒకే ఒక ఆడవేషం! ఆ వేషం ఒక కుర్రవాడు వేశాడు. జనం నవ్వుతుంటే తన పైట జారిపోయిందేమోనని కంగారుగా సర్దుకోవడం చీర కుచ్చెళ్లు సవరించుకోవడం మొదలెట్టాడు. జనం ఇంకా నవ్వారు. నవ్వడానికి అవసరం లేనిచోట జనం నవ్వుతుంటే నటులు కంగారుపడుతున్నారు. నా ఉపన్యాసం విన్నజనం. నేను చేయగూడదన్న పనులన్నీ నటులు చేస్తుంటే జనానికి నవ్వురాక ఏంచేస్తుంది?

మొదటి సీను అయిపోయింది. నాపక్కనే కూర్చున్న గుమ్మడిగారన్నారు! "నరసరాజుగారూ! మీరు వాళ్లకి చాలా ద్రోహం చేశారు!" అని మొదటి సీను అయిన తరువాత నేను గ్రీన్‌రూంలోకి వెళ్లి నటులకు చెప్పాను. "కంగారు పడకండి నాయనా! తప్పునాది! మీరు రిహార్సల్సులో చేసినట్టు చేసుకోండి. నేను యిచ్చిన demonstration lecture మీరు వినలేదు. అందువల్ల ఈ అనర్థం వచ్చింది" అని క్షమాపణ చెప్పుకున్నాను.

కాని మిగతా రెండు సీన్లు గూడ మొదటి సీనులాగే రసాభాస అయింది.

ఇప్పుడు హైదరాబాద్‌లో నాటకాలు చూస్తుంటాను. నటులు కొందరు వూరికే స్టేజిమీద అటూ ఇటూ





ఆంధ్ర నాటక కళా పరిషత్తు, అనంతపూర్ సమావేశం (1964) లో సన్మానం

ఎడమ నుండి - డి.వి. నరసరాజు, వల్లమూడి సీతారామారావు (అడ్వకేట్, బాపట్ల), కాజ వెంకట్రామయ్య, (?), గిడుగు సీతాపతి

తిరుగుతుంటారు తమకు డైలాగులు లేనప్పుడు. స్టేజి మీద అనవసరపు movements యివ్వకూడదు. Play Production అంటే కొన్ని ప్రిన్సిపుల్స్ ఉన్నయ్. నాటక రచన, అభినయం వగైరాలు ఎలాగో, అలాగే నాటక ప్రయోగం ప్లే ప్రొడక్షన్ అధ్యయనం చేయవలసిన కళ!

చాట్ల శ్రీరాములు గారు థియేటర్ ఆర్ట్స్ మీద అధ్యయనం చేసినవాడు గదా! ఆయన చెబుతుంటాడు. బెజవాడలో ఎప్పుడో ఆయన రైల్వే ఉద్యోగం చేసేటప్పుడు 1950 ప్రాంతంలో నేను బెజవాడ విజయాటాకీస్‌లో డిమానుస్ట్రేషన్ లెక్చర్ ఇచ్చానట. ప్లే ప్రొడక్షన్ గురించి. నాకు జ్ఞాపకంలేదు.

నాటక రచన ఎంత గొప్పదయినా ఒక్కోసారి ప్రొడక్షన్ లోపాలవల్ల నాటకం దెబ్బతింటుంది.

1950లో ఆంధ్రనాటక కళాపరిషత్తు నాటక పోటీలు కాకినాడలో జరిగినై. అప్పుడు 'ఇనప తెరలు' నాటకం వేశాం! కొప్పరపు సుబ్బారావుగారు అనువాదం చేశారు జె.బి. ప్రీస్ట్లీ నాటకం An Inspector Calls ని.

రెండు నెలలు బెజవాడలో రిహార్సల్సు చేశాం! రిహార్సల్సులో ఏమనిషి ఎక్కడ నుంచోవాలి! ఏ పాత్ర ఏ డైలాగు చెబుతున్నాడు. ఏ పాత్ర ఎలా రియాక్ట్ అవుతూ మూవ్ అవ్వాలి!

అలాగే 1951 నా 'నాటకం' రిహార్సల్సు గూడ అలాగే చేశాం! నా 'నాటకం'లో నేను నటించలేదు. ఆరోగ్యం అంత బాగుండక! కేవలం డైరెక్షన్ మాత్రం చేశాను!



బెజవాడ 'రాఘవ కళాకేంద్రం' ఆధ్వర్యంలో మేము శాస్త్రబద్ధంగా రిహార్సల్సు వేసి ప్రదర్శించిన నాటకాలు ముఖ్యంగా రెండు ఒకటి కొప్పరపు సుబ్బారావుగారు అనువదించిన 'ఇనపతెరలు' రెండు. నేను రాసిన 'నాటకం' అనే నాటకం. నాటకం రిహార్సల్సు అనేక నాటక సమాజాలు అనేక విధాలుగా వేయవచ్చు!

మేము అనుసరించిన విధానం గురించి చెబుతాను.

నాటకం జరిగేటప్పుడు స్టేజిమీద ఏ పాత్రధారి ఎక్కడ వుండాలి. ఆ పాత్రకు డైలాగు లేకపోయినాసరే! డైలాగు చెప్పేవాడు చెబుతుండగా మిగతా పాత్రధారులు ఎక్కడ ఎలా వుండాలి. ఆడియన్స్ యొక్క అటెన్షన్ డైవర్ట్ చేయకుండా ఉండడం కోసం పాత్రల స్థానాలు ఫిక్స్ చేసేవాళ్లం. నాటకంలో సినిమాలాగ క్లోజప్ ఉండవుగదా! అన్నీ ప్రేక్షకుల దృష్టిలో Long shots లోనే ఉంటయ్! కాబట్టి ఆర్టిస్టు మొఖంలోని expression ఆడియన్సుకు తెలియడం కోసం ప్రధానమైన పాత్ర స్టేజి ముందు ఆడియన్స్‌కి సాధ్యమైనంత దగ్గరగా నిలబెట్టడం మేలు. ఎక్కడా స్టేజిలో వెనక ఏ మూలనో నిలబెట్టి మాట్లాడించడం కంటె! ఇవన్నీ డైరెక్టర్ ఫిక్స్ చేసుకోవాలి రిహార్సల్సులో. అలా ఫిక్స్ చేస్తే స్టేజీ మీద ఉన్న నటులందరికీ తెలిసిఉంటుంది. ఎవరు ఎక్కడ ఉండాలనేది! ఎక్కడైనా ఒక నటుడు పొరపాటున మందు నిలబడవలసిన నటుడు ఎక్కడో వెనక నిలబడ్డాడనుకోండి! మిగతా నటులందరికీ తెలుస్తుంది.

"నేను ఈ డైలాగ్ చెప్పేటప్పుడు ఫలాన నటుడు ఇక్కడ ఉండవలసినవాడు ఎక్కడో ఉన్నాడు అని ప్రతి నటుడికి తెలిసిపోతుంది. అప్పుడు సరిదిద్దుకోవడానికి అవకాశం ఉంటుంది.

తరువాత పాత్రల ప్రవేశాలు, నిష్క్రమణలు! ఒకోసారి ఆర్టిస్టులు స్టేజి మీదకి ప్రవేశించవలసిన సమయంలో ఎక్కడో గ్రీన్ రూంలో మేకప్ సరిజేసుకుంటుంటారు. అందుకోసం ప్రతినాటకానికి ప్రొడక్షన్ స్క్రిప్ట్ అని ముందు "ఫలాన పాత్ర ప్రవేశానికి రెడీగా ఉండవలెను' అని ప్రొడక్షన్ స్క్రిప్టులో రాసి ఉంటుంది. ఆ ప్రొడక్షన్ స్క్రిప్టు దర్శకుడి చేతిలోనో, మరో ప్రొడక్షన్ చూసే మనిషి చేతిలోనో ఉంటుంది. అతని పక్కన ఒక అసిస్టెంటు ఉంటాడు. ఆ అసిస్టెంటుకు ముందుగానే చెబుతాడు స్క్రిప్టు ఇన్‌చార్జి. "ఫలాన పాత్రను రెడీ చేసి తీసుకురా" అని ఆ అసిస్టెంటు వెళ్లి ఫలాన పాత్రను తెచ్చి అక్కడ నిలబెడతాడు.

పాత్ర ప్రవేశించవలసిన టైంలో అతను ఏ గ్రీన్ రూంలోనో, మేకప్ దిద్దుకుంటుంటే వాడు వచ్చేవరకు నాటకం ఆగుతుందా? ప్రొడక్షన్ స్క్రిప్ట్ తయారు చేయడంలో కొప్పరపు సుబ్బారావుగారు అనుభవజ్ఞుడు గనక ముందు జాగ్రత్తలు తీసుకునేవాడు.

ఇప్పుడంటే డ్రామా స్కూల్సు వచ్చినయ్‌గాని మారోజుల్లో అంటే 50 ఏళ్ల క్రితం పుస్తకాలు చదువుకుని నేర్చుకున్న పాఠాలే! కొప్పరపు సుబ్బారావు 'లిటిల్ థియేటర్ లైబ్రేరీలో నాటకాల గురించి నాటక ప్రయోగాల గురించి ఇంగ్లీషులో మంచి పుస్తకాలు ఉండేవి.

అవి చదివి నాటకాలు వెయ్యడమే గాక ఆ తరువాత రామచంద్ర కాశ్యప, విన్నకోట రామన్నపంతులు, మాచినేని వెంకటేశ్వరరావు ప్రభృతులు నటరాజ కళాసమితి తరపున ఒక యాక్టింగ్ స్కూల్ నిర్వహించారు!

ఇప్పుడు ప్రొడక్షన్ గురించి కంటె లైటింగ్ స్పెషల్ ఎఫెక్ట్ - సౌండ్ మీద ఎక్కువ దృష్టి కేంద్రీకరిస్తున్నారు.



అప్పుడు మేము ప్రదర్శించినప్పుడు 'మైకు' లేలేవు! ఇప్పుడు మైక్స్ వచ్చిన తరువాత ఒక విధంగా నాటకాలు చెడుతున్నయ్. డైలాగ్ చెప్పేవాడు. పక్కవాడితో మాట్లాడుతూ చెప్పవలసిన డైలాగు మైకు దగ్గరకెళ్లి చెబుతున్నాడు. ఈ మైకులు ఉపన్యాసాలకు ఉపయోగించే మైకులు.

అసలు నాటకరంగానికి కావలసిన మైకులు వేరే ఉన్నయ్! అవి ఆడియన్స్‌కు కనబడవు! స్టేజి మీద ఆ పాత్రల movements and dialogues ను ఆర్టిస్టుల డైలాగులను బాగా రిసీవ్ చేసే స్థలాల్లో పెట్టివుంచుతారు. ఉంచవలసిన చోట ఆ మైకులు ఉంచితే ప్రతి నటుని డైలాగు ప్రేక్షకుడి చెవిలో చెప్పినట్టు స్పష్టంగా వినబడతయ్! ఇప్పుడు పైనుంచి వేలాడే మైకులు పబ్లిక్ మీటింగుకు ఉపయోగించే మైక్స్‌వల్ల నాటకాలు చాల రసాభస అవుతున్నాయి.

నాటక ప్రదర్శనలకు సెట్స్‌కు లైటింగుకు ఆహార్యానికి మిగతా స్పెషల్ ఎఫెక్ట్స్ కోసం వేలకు వేలు ఖర్చు పెడుతున్న నాటక సమాజాలు స్టేజ్ మైక్స్ కోసం ఎందుకు ఖర్చుపెట్టడంలేదో తెలియదు.

రాష్ట్రంలో కొన్ని సమాజాల వారు స్టేజ్ మైక్స్ ఉపయోగిస్తున్నారేమో తెలియదు. నేను అన్ని నాటకాలు చూడడం లేదుగదా! నేను చూచినంతవరకు సాధారణంగా వేలాడే మైకులు మీటింగు ఉపన్యాసాల మైకులే ఉపయోగిస్తున్నారు.

మంచి నాటకం ప్రదర్శించాలంటే ఈ మైకులు సాయపడవు.

ప్రస్తుం నాటక రంగం అభివృద్ధి చెందవలసినంతగా అభివృద్ధి చెందకపోవడానికి కారణం.

స్టాండర్డ్ డైమెన్షన్స్ గల స్టేజి లేకపోవడం! మంచి నాటకం వెయ్యాలంటె సెట్ తయారు చేసుకోవలసిన అవసరం ఉందనుకొండి! ఆ సెట్టు ఎంత సైజు సెట్టుతయారు చేసుకోవాలి! ఒక్కొక ఊళ్లో స్టేజి ఒక్కొక సైజులో ఉంటుంది. అందువల్ల నాటకరంగ అభివృద్ధి చేయాలనే చిత్తశుద్ధిగల ప్రభుత్వం ఏం చేయాలంటే!

కనీసం ప్రతి మునిసిపాలిటీలోనూ ప్రభుత్వ ఖర్చుతో Standard dimentions తో రంగస్థలం నిర్మించాలి.

ఆడిటోరియం చిన్నదైనా, పెద్దదైనా ఫరవాలేదు. స్టేజి మాత్రం Standard measurements తో నిర్మించాలి! అప్పుడే నాటక సమాజాలవారు స్టేజికి తగిన కొలతలతో సెట్ తయారు చేసుకోగలరు.

ఈ గొంతెమ్మ కోరికలు మేము నాటకాలు వేసేటప్పటి నుంచి అంటే 50,60 ఏళ్లనుంచి ప్రభుత్వాన్ని కోరుతూనే ఉన్నాం! వినతిపత్రాలు సమర్పిస్తూనే వున్నాం!

కాని ఆంధ్రనాటక రంగం ఎక్కడ వేసిన గొంగళి అక్కడే ఉందన్న సామెతగా వుంది.

కొసమెరుపు : నాటకరంగ అభివృద్ధి విషయంలో ప్రభుత్వాన్ని నిందించటంలో న్యాయం లేదు! 'నాటక రంగ అభివృద్ధి' ఏ రాజకీయ పార్టీ అజెండాలోనైనా ఉందా? అలాంటప్పుడు అధికారంలోకి ఏ పార్టీ వచ్చినా ఆ ప్రభుత్వాన్ని నిందించడం పాపం!



## నా అమెరికా యాత్ర

1991 ఫిబ్రవరి, మార్చి ప్రాంతం! ఒక రోజు మదరాసులో - B.S.R. KRISHNA (U.S.I.S లో వుద్యోగం చేస్తుండేవాడు) నల్లమోతు సత్యనారాయణ గారిని వెంటబెట్టుకుని వచ్చాడు నాకు పరిచయం చేయడానికి.

నల్లమోతు సత్యనారాయణగారు N.R.I అమెరికాలో డెట్రాయిట్ లో డాక్టరు. TANA (Telugu Association of North America) కు సెక్రటరీ.

ఆ సంవత్సరం జులైలో - అమెరికాలో - ATLANTA లో జరగబోయే - 'తానా' సభలకు నన్ను అహ్వానించడానికి వచ్చారు సత్యనారాయణగారు. నన్ను వ్యక్తిగతంగా ఆహ్వానించడమే గాక - అమెరికాలో ప్రదర్శననివ్వడానికి ఒక cultural Troup ని తీసుకురావాలని అడిగారు. నేను చెప్పాను Troup ని organise చేయడం నావల్ల కాదు. అది నాకు చేతకాని పని.

"ఆ పని కోసం మీరు గుమ్మడి వెంకటేశ్వరరావు గారిని కలవండి! కావాలంటే - ఒక నాటకమో - చిన్న నాటికలో రాసి యివ్వగలను నా శక్తి అంత వరకే" అన్నాను.

'సరే' నని - సత్యనారాయణగారు 'గుమ్మడి' గారిని కలిశారు. అంతకు ముందు కొద్ది రోజుల క్రితమే - గుమ్మడిగారి భార్య చని పోయారు. అందువల్ల "మనసు ఏమీ బాగాలేదు. యీస్థితిలో యింత భారం నెత్తిపెట్టుకోలేను. cultural Troup ను తయారుచేయడానికి - ఆ తరువాత ప్రయాణాలు - వీసాలు వగైరాలు గూడా ఏర్పాట్లుచేయడానికి అనుభవం ఉన్నవాడు. సమర్థుడు - మురళీమోహన్! అతన్ని కలవండి" అని గుమ్మడిగారు సలహా యిచ్చారు.

ఆ సలహామేరకు - సత్యనారాయణగారు మురళీమోహన్ కలిశారు. మురళీమోహన్ అందుకు అంగీకరించాడు. కాని అతను అన్నాడు - నరసరాజుగారు రాసి యిచ్చే నాటకంగాని, నాటికలు గాని - యిప్పుడు తయారు చేయడం కష్టమండి. నాటకాలకి రిహార్సిలు చెయ్యాలిగదా! అందరూ సినిమా నటీనటులు. బిజీగా వుంటారు. రిహార్సల్సుకు-ఒకరు వస్తే ఒకరు రారు. Practical గా ఆలోచిస్తే రిహార్సల్సు conduct చేయడం దాదాపు అసంభవం! కాబట్టి యిది వరకే ప్రదర్శించిన నాటకం ఒకటి వుంది. భమిడిపాటి రాధాకృష్ణ "తరం - అంతరం" అని ఒక నాటకం రాశాడు. ఆ నాటకం - బెంగుళూరులో ఏదో సభలో సందర్భంగా మన సినీ నటీ నటులే ప్రదర్శించారు. ఆ నాటకానికయితే ఎక్కువ రిహార్సల్సు అక్కరలేదు. ఎలాగో manage చేయవచ్చు. అని సలహా యిచ్చాడు.

ఆ సలహా బాగానే వుందని - మురళీమోహన్ మీద ఆ భారం గాక - 'వీసా'లు ఏర్పాటు చేసే పనిగూడ అతనికి అప్పజెప్పి - సత్యనారాయణగారు వెళ్లిపోయారు.

'తరం - అంతరం' నాటకంలో నటీ నటులు షావుకారు జానకి, గుమ్మడి, సాక్షి రంగారావు, రమణమూర్తి, రాళ్లపల్లి వగైరాలు కాక - జానపద సంగీత కార్యక్రమాలను - యితర వినోద కార్యక్రమాలకు - మురళీమోహన్ ఏర్పాట్లు చేశాడు. వందేమాతరం శ్రీనివాస్ - మిమిక్రీ ఆర్టిస్టు సెల్విస్టర్‌లతో సహా! దర్శకుడు కోడిరామకృష్ణ - అతని భార్య - కూతురు, 5.6 ఏళ్ల పిల్ల రావడానికి సిద్ధమయ్యారు.

మా మనమరాలు శిరీషను గూడా నావెంట అమెరికాకు తీసుకెళదామని 'వీసా' కు అప్లయి చేస్తే అమెరికా ఎంబసీవారు నిరాకరించారు. అందువల్ల ఆమెను తీసుకువెళ్లలేకపోయాను. అప్పుడు ఆమె వయసు 16 సంవత్సరాలు.



మొత్తం Troupe దాదాపు 15 మంది - 1991 జూన్ 10వ తేదీ - రాత్రి 11.50 నిముషాలకు మదరాసు నుండి సింగపూర్ ఎయిర్‌లైన్స్ విమానంలో బయలుదేరాం. సింగపూర్ నుంచి - జపాన్ ఎయిర్‌లైన్స్‌లో టోకియో - అక్కడినుంచి direct filght పసఫిక్ సముద్రం మీదుగా - అమెరికాలోని Los Angeles (L.A. అంటారు) చేరాం - 11 వ తేదీ ఉదయం 11.30 గంటలకు అక్కడ బలరామరెడ్డి - దేవసేన దంపతులు మాకు స్వాగతం చెప్పారు. వారి యింట్లో ఒకరోజు విశ్రాంతి తీసుకుని 13వ తేదీ వుదయం విమానంలో బయలుదేరాం. తరువాత మజిలీ - ఒహయో (0410) రాష్ట్రంలోని కొలంబస్ నగరం. విమానప్రయాణం మధ్యలో సిన్‌సి నాటివరకు. ఆ తరువాత కొలంబస్ నగరానికి కారు ప్రయాణం.

మా Troupe 15 మందిని - ఒక్కొక యింటికి యిద్దరు ముగ్గురు చొప్పున - అక్కడ తెలుగు కుటుంబాలవాళ్లు పంచుకున్నారు. నాకు ఆతిధ్యం - సంతోష్‌కుమార్ యింట్లో. అతనిది తూర్పు గోదావరి జిల్లా. అతని భార్య పేరు విజయ. సంతోష్‌కుమార్ నా అభిమాని(Fan). 'పెద్దమనుషులు' చిత్రంలోని డైలాగులు చెప్పడం మొదలుపెట్టాడు. సంగీత, సాహిత్యాభిమాని. భార్యాభర్తలు యిద్దరూ పని చేస్తారు. లేకపోతే కుటుంబం గడవదు. అమెరిగా జీవితం సంతోష్‌కుమార్‌కు యిష్టంలేదు. "గోదావరి ఒడ్డున ఒక పాక వేసుకొని జీవించడం యింతకంటె - ఎంతో సుఖం" అన్నాడు. అతని భార్యగూడా "రాత్రింబవళ్లు - కష్టపడి పని చేయాలండి" అన్నది దీనంగా. మరునాడు వుదయానికి - నాకు కుడి కాలి పాదం కాస్త వాచింది. సంతోష్‌కుమార్ తన కారులో హాస్పిటల్ తీసుకువెళ్లాడు. అది గవర్నమెంటు హాస్పిటల్. బ్రహ్మాండంగా వుంది. అది University Campus లో వుంది. ఆ University అమెరికాలోని Top Ten Universities లో ఒకటట! నాకాలికి కట్టుకట్టి మందులిచ్చిన డాక్టరు తెలుగువాడు పేరు డా॥ లింగం పాండురంగారావు. గుడివాడ అనుకుంటాను.

ఆ హాస్పిటల్ Campus లోనే థియేటర్లో మా ప్రదర్శన.

మా ప్రదర్శన వివరాలు మొదట "తరం - అంతరం" నాటకం - నటీ నటులు - షావుకారు జానకి - గుమ్మడి - రమణమూర్తి - మురళీమోహన్ - సాక్షి రంగారావు - రాళ్లపల్లి వగైరాలు. నాటకం తరువాత - రాళ్లపల్లి - వందేమాతరం శ్రీనివాస్ జానపద హాస్య గీతాలు - ఆ తరువాత - సెల్విస్టర్ మిమిక్రీ. చివరకు నా హాస్య వ్యంగ్య ప్రసంగం. మొత్తం దాదాపు మూడు గంటల వినోదం!

తరువాత మజిలీ - చికాగో!

అమెరికాలో Time Zones వుంటాయ్. సిన్ సినాటిలో - వుదయం 10.30 కి బయలుదేరితే - చికాగో చేరినా అక్కడ కూడా Time 10.30 గడియారాలు వెనక్కి తిప్పుకోవాల్సిందే.

యిలాగ లాస్ ఏంజిలిస్, కొలంబస్, చికాగో, డెట్రాయిట్, అర్లెండో, మియామీ, ఒకేలా, Tampa, St.LOUIS, GKLAHAMA, HOUSTON, NEW ORLEANS, ATLANTA, PITSBURG, ఫిలడెల్ఫియా, న్యూజెర్సీ, న్యూయార్క్, వాషింగ్టన్, శాన్‌ఫ్రాన్సిస్కో లాంటి ముఖ్య నగరాలు సందర్శించి - 19 నగరాలలో మా ప్రదర్శనలు యిచ్చాం. తెలుగువాళ్లు ఎక్కువ వున్న నగరాలలో ప్రేక్షకులు హాలు నిండా వచ్చేవారు. తెలుగువాళ్లు తక్కువ వున్న చోట ప్రేక్షకాగమనం పలచబడి వుండేది.





అమెరికా టూర్- రమణమూర్తి, గుమ్మడి, మురళీమోహన్, నరసరాజు, డా॥ హేమ్ కుమార్ (పిట్స్‌బర్గ్), చంద్రహాసన్, కోడి రామకృష్ణ

మొత్తంమీద - arrangements చాలా బాగున్నాయ్. మాకు ఎక్కడా ఏ యిబ్బంది లేకుండా ప్రయాణాలు సాగినయ్! ఒక నగరం నుంచి మరొక నగరానికి - టికెట్లు మురళీమోహన్ సమర్థవంతంగా నిర్వహించాడు. అక్కడ విమానాశ్రమాలలో - కూలీలు వుండరు. మన సామాను మనమే మోసుకోవాలి. రాళ్లపల్లి, వందేమాతరం శ్రీనివాస్ నా suitcase, bag నన్ను పట్టుకోనిచ్చేవాళ్లుకారు. షావుకారు జానకి bag ఎవరికీ యిచ్చేదికాదు. తనే మోసుకునేది. బహుశా దానిలో నగలు వున్నయేమోనని నా అనుమానం.

అమెరికాలో నాకు అంతకు ముందే తెలిసినవాళ్లు యిద్దరు - దుక్కిపాటి మధుసూదనరావు గారి (అన్నపూర్ణా పిక్చర్స్) కుమారుడు, డా॥ స్వాతి. న్యూయార్క్‌లో అతని యింట్లోనే వున్నాను. అతను కారులో న్యూయార్క్ అంతా చూపించాడు. Manhattan, United Nations building, Empire State building, Harlem వగైరాలు చూపించాడు. న్యూయార్క్‌లో మదరాసు Woodlands Hotel వుంది. అందులో LUNCH, దోసెలు, యిడ్లీలు, పెరుగువడలు, కాఫీ సేవించాం.

Bookshop కి తీసుకుళ్లి. Best American Screenplays యింకా కొన్ని పుస్తకాలు కొని యిచ్చాడు.

ఆ నాటి మా ప్రదర్శనకు 'ఈనాడు' రామోజీరావుగారు వచ్చారు. ఆయన ప్రసంగం తరువాతే మా ప్రదర్శనలు!

ఆ మరునాడు స్వామి నన్ను World Trade Centre కు తీసువెళ్లాడు. అతని కారు పార్కింగ్ చార్జి 6.5 డాలర్లు! నాలుగు గంటలు మాత్రమే సుమా!



World Trade Centre 107 అంతస్థులు Lift లో 58 Seconds వెళ్లాం. మొత్తం ఆ బిల్డింగ్ 110 అంతస్థులు. పై అంతస్థుకు వెళ్లి చుట్టూ చూస్తే - Statue of Libirty వున్న Island కనబడుతుంది.

(ఈ World Trade Centre building నే ఈ మధ్య - అల్‌ఖైదా టెర్రరిస్టులు - విమానంతో 'ఢీ' కొట్టి - అమెరికన్లను హడలు కొట్టించారు).

నాటక రచయితను గనక - ఒకటైనా నాటకం చూడాలనిపించింది. న్యూయార్క్ బ్రాడ్‌వేలో వుంటాయ్ అని నాటకశాలలు! ఒక రోజు 'Grand Hotel' అనే Musical play చూశాను.

న్యూయార్క్ నుంచి - నయగరా జలపాతం చూడడానికి బఫెలో (Buffalo) (గెదె) నగరానికివెళ్లాం. నయగరా జలపాతం చూశాం! అమెరికాకు - కెనడాకు సరిహద్దు ఆ జలపాతం. మా ప్రోగ్రాం ప్రకారం కెనడా వెళ్లాసిందే! కాని అక్కడకు Host కు ఏదో యిబ్బంది వల్ల వెళ్లలేకపోయాం.

నాకు అంతకు ముందే తెలిసిన మరో వ్యక్తి - డా॥ మంతెన నరసరాజు. St. Louis లో డాక్టరుగా స్థిరపడ్డాడు. షుమారు పాతికేళ్ల తరువాత యిప్పుడు యిండియాకు వచ్చి గుంటూరు జిల్లా మంగళగిరి వద్ద - మరి కొంత మంది N.R.I. మిత్రులతో కలిసి మంచి హాస్పిటల్ కట్టి - తను మేనేజింగు డైరెక్టరుగా నడుపుతున్నాడు. ఆ హాస్పిటల్‌కు మంచి పేరుంది. అతని స్వగ్రామం బాపట్ల తాలూకా ఖాజీపాలెం దగ్గర (అలకాపురి!) 1990లో అమెరికాలో TANA సెక్రటరీగా పనిచేశాడు. నేను St. Louis వెళ్లినప్పుడు అతని యింట్లోనే వున్నాను. అంతకు ముందే తెలిసిన మరొక వ్యక్తి - మా బంధువు విజయ్ - అతని భార్య లీల. Dalls airport కు వచ్చి నన్ను receive చేసుకుని - కారులో వాళ్ల యింటికి తీసురువెళ్లారు.

అమెరికాలో సంసార జీవితాలు విచిత్రంగా వుంటాయ్! అన్ని పనులు తామే చేసుకోవాలి. నౌకర్లను పెట్టుకోవాలంటే చాలా ఖరీదు. విజయ్, లీల యింట్లో భోజనం చేసి - నేను మధ్యాహ్నం నిద్ర లేచాను. నేను లేచే సరికి - విజయ్ - నా బట్టలు ధోవతీలు - లాల్చీలు యిస్త్రీ చేస్తున్నాడు. 'చాలా బాగా చేస్తాడు' అని అతని భార్యా కితాబు యిచ్చింది.

కాని అన్ని పనులు అందరు చేయలేరు. ఉదాహరణకు మియామి (ఫ్లోరిడా రాష్ట్రం) లో మాకు ఆతిధ్యం - నిడదవోలు డాక్టరు గారి కుమార్తె శాంతి యింట్లో. ఆమె భర్త డాక్టరు. వాళ్ల యింట్లో రెండు పామరేనియర్ తెల్లబొచ్చు కుక్కలున్నాయ్. అవి అంటే వాళ్లకు ప్రాణం. వాటితో మాట్లాడుతారు వాళ్లు. ఆ కుక్క పిల్లలకు నెలకో పదిహేను రోజులకో ఒక వ్యక్తి కారులో వచ్చి - వాటి వెంట్రుకలు కత్తిరించి, స్నానం చేయించి వెళతాడు. చాలా Costly! ఇంకొక విచిత్రమైన అనుభవం - Buffalo నగరంలో మా హోస్ట్ డా॥ సుధాకరరావుగారని - తెలంగాణాలోని వరంగల్-కరీంనగర్ ప్రాంతాలకు చెందినవారు. విజయరామారావు, వెంగళరావు గార్లు తెలుసునని చెప్పారు.

వారి యింట్లో వుండగా ప్రొద్దున్నే నేను Bath Room కి వెళ్లాను. Bath Room నుంచి బయటికి వచ్చేసరికి - వారింట్లో ఒక తెల్ల దొరసాని నిలబడి వుంది. ఆమె సుధాకరరావు గారి భార్య అనుకొని నమస్కరించాను. ఆమె చిరునవ్వుతో తల వూపింది. నేను నా Room కి వెళ్లాను. భోజనానికి వెళ్లినప్పుడు Dining room లో సుధాకరరావు తన భార్యను నాకు పరిచయం చేసారు. ఆమె తెలుగావిడ మరి - Bath Room బయట నాకు కనబడిన దొరసాని ఎవరు? వాళ్లు చెబితే తెలిసింది. Bath Room clean చేయడానికి రోజు తన సొంత కారులో వచ్చి - Bath Room clean చేసి వెళుతుందట! చాలా charge చేస్తుందట!



మరొక వింత అనుభవం.

Washington లో ప్రదర్శనకు వెళ్లినప్పుడు - మా Host చంద్రహాసన్ - సరళ దంపతులు. నిజానికి వాళ్లు వుండేది Marryland లో Washington ప్రక్కగానే వుంటుంది Marryland. (అసలు - Marryland రాష్ట్రంలో కొంత భాగం - Virginia లో కొంత భాగం తీసుకుని Washington నగరం కట్టారట). చంద్రహాసన్ గారిది చిత్తూరు జిల్లా. తెలుగువాడే.

మా హోస్టు చంద్రహాసన్ గారికి ఒక్కతే కూతురు. నేను అక్కడ వున్నప్పుడు యిగ్లండు నుంచి - ఆయన భార్య చెల్లెలు కూతురు వచ్చింది.

ఆ రాత్రి - చంద్రహాసన్ గారి కుమార్తె పడక గది నాకిచ్చారు. ఆ అమ్మాయి రాత్రి రెండు మూడు సార్లు నా గదిలోకి వచ్చి అలమర నుంచి ఎవో బట్టలు తీసుకువెళ్లింది.

తరువాత తెలిసిందేమిటంటే -

ఆ రాత్రంతా ఆ ఆడపిల్లలిద్దరికి - తల్లి - చీర కట్టుకోవడం నేర్పుతున్నదట.

మరునాడు సాయంత్రం - Washington లో మా ప్రదర్శన.

కారులో బయలుదేరాం చంద్రహాసన్ గారు drive చేస్తున్నారు, నేను ఆయన ప్రక్కన కూర్చున్నాను. వెనక సీట్లో - తల్లీ - ఆడపిల్లలిద్దరు కూర్చున్నారు. పాపం - ఆ ఆడ పిల్లలు పొద్దుట నుంచీ చీరలు కట్టుకుని భోజనాల దగ్గరకు వచ్చినప్పుడు చీర ఎక్కడ జారిపోతుందోనని - ఎంతో యిబ్బంది పడడం చూసి నాకు జాలి వేసింది.

ప్రదర్శనకు కారులో వెళుతుండగా నేను అడిగాను - చంద్రహాసన్ గారిని ...

"ఏమండి! పాపం! రాత్రంతా వాళ్లని హింసించి - చీరలు కట్టుకోవడం నేర్పారు! మరి మీరు ధోవతి కట్టుకోకుండా సూట్‌లో వస్తున్నారేం" అని.

ఆయన పక పకా నవ్వి "అయ్యో నాకు ధోవతి కట్టుకోవడం అలవాటు లేదండి" అన్నారు.

"తెలుగు తనం ఆడవాళ్లకే గాని మగ వాళ్లకు అక్కరలేదా?" అన్నాను.

అమెరికాలో అనుభవాలు యిలా చెప్పుకుంటూ పోతే మహా గ్రంధమవుతుంది.

ముగిస్తాను.

జూలై 25వ తేదీ లాస్ ఏంజిలీస్ నుంచి తిరుగు ప్రయాణం. జపనీస్ ఎయిర్‌లైన్స్ - గుమ్మడి, మురళీమోహన్, షావుకారు జానకి, రమణమూర్తి అక్కడే వుండి పోయారు.

మిగతావాళ్లం - జపాన్ విమానంలో మధ్యానం 12 గంటలకు బయలుదేరాం. టోకియో (జపాన్)కి 11 గంటల 20 నిముషాల ప్రయాణం!

కాని రాత్రి అన్నది లేదు.

అయితే - L.A లో 12 గంటలకు బయలుదేరినప్పుడు. Tokyo లో తెల్లవారుజాము ఏ 4 గంటలో అయివుంటుంది.



అందువల్ల సాయంత్రం - 7 గంటలకు Plane లో Air hostess ని అడిగితే Tokyo Time 10.30 అని చెప్పింది.

గడియారం 3 గంటలు ముందుకు తిప్పాం.

బయలుదేరగానే 1 P.M. కి Plane లో Lunch. శుక్రవారం ప్రవేశించి - Tokyo Time మళ్లీ 1 గంట - మళ్లీ Lunch.

Tokyo Time శుక్రవారం 3.30 P.M. కి Tokyo చేరాం.

Singapore Flight 5.30 P.M. కి

Tokyo Airport లో కూర్చున్నాం.

గురువారం లేకుండానే - శుక్రవారం ప్రవేశించి - శుక్రవారం సాయంత్రం 3.30 కి Tokyo చేరామన్నమాట.

Singapore Flight 6.00 P.M. కి బయలుదేరింది. Flight Time 6 hours 45 mins. అంటే అర్ధరాత్రి 12.45 నిముషాలకి చేరాలి.

కాని Singapore Time 1 గంట ముందుంటుంది. అందువల్ల Singapore Time 11.45 కి చేరాం. అర్ధగంట ఆలస్యంగా.

Singapore Airport లో సామాన్లు Clock room లో వేసి - Taxi లో (arranged by J.A. L Kings Hotel) రాత్రి 1.45 కి చేరాం.

మరునాడు సింగపూర్‌లో shopping.

సింగపూర్ నుంచి రాత్రి 9.45 కి బయలుదేరి మరునాడు (Indian Standard Time) 10.30 P.M. కు చేరాం. లగేజీతో బయటకి వచ్చేసరికి బయట నా కుమార్తె కవిత - మనుమరాలు శిరీషా కారుతో రెడీగా వున్నారు.

దాదాపు అర్ధరాత్రికి యిల్లు చేరాం.

అంటే జూన్ 10వ తేదీన బయలుదేరి జూలై 1 వ తేదీన మదరాసు చేరాను.

యివీ నా అమెరికా యాత్ర విశేషాలు.

ఆ తరువాత అమెరికాలోని కొందరు ఆంధ్రులు TANA కు పోటీగా మరో సంస్థను స్థాపించారు. దాని పేరు A.T.A . (American Telugu Association).

TANA కమ్మ వారిదని - A.T.A రెడ్లదని ప్రతీతి. ఎక్కడికి పోయినా ఈ కుల మహమ్మారి ఆంధ్రులను వదలదు. ఆంధ్రప్రదేశ్‌లోని కులం Virus అమెరికాలో కూడ పాకిందన్నమాట.

గుడ్డిలో మెల్ల! ఆ రెండు సంస్థలు రాజీ పడి ఒకరు ఒక సంవత్సరం - రెండో వారు మరుసటి సంవత్సరం Confrence లు నిర్వహించేటట్లు సర్దుబాటు చేసుకున్నారట! శుభం!



# చివరిమాట

ప్రస్తుతం మా కుటుంబపరిస్థితి - 1994లో మా మనవరాలు శిరీష పెళ్లి మదరాసులో జరిగింది. వరుడు సినిమా నటుడు శ్రీ సుమన్.

ఆ మరుసటి సంవత్సరం శిరీష ఆడపిల్లను కన్నది. పిల్లపేరు ప్రత్యూష.

హైదరాబాద్‌లో సుమన్ షూటింగులకోసం అప్పుడప్పుడు ఇతర ఊళ్లకు పోవలసి ఉంటుంది. హైదరాబాద్‌లోనే షూటింగ్ ఉన్నా ఇంటిదగ్గర శిరీష పసిపిల్లతో ఒక్కతే ఉండాలి. అందువల్ల ఇంట్లో తోడుకోసం మా అమ్మాయి కవిత గూడ హైదరాబాద్ రావలసి వచ్చింది. యిక మిగిలింది నేను. మదరాసులో నేను ఒక్కణ్ణి ఏం చేయగలను? అందుకని మదరాసులోని ఇంటికి తాళం వేసి కారుషెడ్‌లో ఇంటి కాపలాకి ఒక కుటుంబాన్ని పెట్టి నేను గూడ 1996లో హైదరాబాద్ వచ్చేశాను. సినిమాలనుంచి ఆ సంవత్సరమే రిటైరైనాను.

ఇప్పుడు ఇంట్లో నేను, సుమన్, శిరీష ఆమె కూతురు ప్రత్యూష, నా కుమార్తె కవిత. ఇదే ప్రస్తుతం మా కుటుంబం. నాకు 85 వెళ్లి 86 జరుగుతున్నది. ఆరోగ్యం బాగానే వున్నది. మా పిల్లలు నన్ను బాగా చూస్తున్నారు. నేను గూడ రిటైరవడమేగాక రిలాక్స్ అవడానికి అవకాశాలు కల్పించుకున్నాను.

నాకు ఇంట్లో ఏ బాధ్యతలు లేవు. వేళకు తినడం, చదువుకోవడం, సంగీతం వినడం. అదృష్టవశాత్తు చదవడానికి కళ్లు, వినడానికి చెవులు, బాగున్నయ్. ఇంటి సంగతులు నేనేమీ పట్టించుకోను. నేను అడగను. వాళ్లు చెప్పరు.

జీవితం ప్రశాంతంగా గడచిపోతున్నది. మిత్రులు, అభిమానులు ఎవరో వస్తుంటారు కాలక్షేపానికి. నేనూ ఓపిక ఉన్నప్పుడు సాంస్కృతిక కార్యక్రమాలలో పాల్గొంటాను. చూడడానికి వెళుతుంటాను.

నేను యిదివరకే చెప్పాను జీవితంలో నేను భయపడేవి రెండు! పేదరికం, అనారోగ్యం.

ఇవి రెండు ఇంతవరకు నా జోలికి రాలేదు. ఇక ముందు గూడ రావని ఆశిస్తున్నాను.

నా జీవితం శ్రీశ్రీ చెప్పినట్టు వడ్డించిన విస్తరి. I was born with a silver spoon in my mouth ఊహ తెలియక ముందే తండ్రి పోయినా, తండ్రిలేని లోటు లేకుండా మేనమామలు పెంచి పెద్దచేశారు.

పెద్దమామ పిల్లనిచ్చి పెళ్లి చేశాడు.

రెండో మామ యిల్లు కట్టించిపెట్టాడు

మూడో మామ నాకు ఊహతెలియక ముందు పోయాడు.

నాలుగో మామ శ్రద్ధతో నాకు చదువు చెప్పించాడు.

అయిదో మామ నా తోబుట్టువును చేసుకున్నాడు.

జీవితంలో నేను కష్టం అంటే ఏమిటో ఎరగను. ఇదంతా నా అదృష్టం గదూ! అందుకే ఈ పుస్తకానికి 'అదృష్టవంతుని ఆత్మకథ' అని పేరు పెట్టాను.



ఇవి అడిగి వ్రాయించుకున్నవి కావు, వాళ్లంతట వాళ్లు వ్రాసిచ్చినవి.

ఆ॥వె॥
నరసరాజుగారి నాటకావతారచనల,
చదివి చదివి మనము సంతసించె
సమయమునకు తగిన సాహిత్యమందించె
సరస భావయుతములు నరసరాజు॥

రచన
(P.B-Srinivas) "కళాదాసు"!
Play-Back Singer

---

అక్షయ "అక్షింతలు" రచయిత
శ్రీ డి.వి. నరసరాజు గారికి
అక్షయాభి వందనములు

డి.వి. నరసరాజు భావభవ్యోక్తుల
కుటిల వర్తనాల కుళ్లు కాల్చి
వ్యంగ్య భంగి వ్యాఖ్యలందు జేసెడియుక్తి
వచన నిపుణ మాకు వందనములు

"అక్షింతలు" నిరంతర పఠిత
విజయవాడ
5-8-'97 గుమ్మడి సీతారామయ్య

---

[illegible]
[illegible]

[illegible]
[illegible]

[illegible]
19-2-1999

# తప్పొప్పుల పట్టిక

| పేజి నెం. | లైను నెం. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 7 | 9 | అప్పటికే | అప్పటికీ |
| 9 | 19 | చిన్నావిడ మనసు గాయపరచింది | ఈ వాక్యము లేదు. |
| 12 | 22 | మొక్కలు | ముక్కలు |
| 12 | 25 | మోటుబావి | మోటబావి |
| 14 | 2 | బిరుదాంకితులు. | బిరుదాంకితు- |
| 16 | 9 | యిటువాన | యిటువంటి |
| 22 | 15 | అనిశ్చిత | అనిశ్చితి |
| 24 | 15 | దానిలో | దానితో |
| 24 | చివరిలైన్ | రాబట్టంలోగాని | రాబట్టడంలోగాని |
| 31 | 16 | పెడుతూండేవాళ్తు | పెడుతూండేవాళ్లు |
| 31 | 22 | చావిల్లో | చావిట్లో |
| 31 | 28 | మరీ పొట్టి కాదూ! | మరీ పొట్టి కాదు |
| 32 | 9 | పెంచుతాయ్యో | పెంచుతాయో |
| 33 | 1 | వెంకట రమయ్యగారికి | వెంకట రమణయ్యగారికి |
| 34 | 25 | బిగ్‌వెన్ | బిగ్‌బెన్ |
| 36 | 3 | అవతల వుండేది | అవతల వుండేవి |
| 38 | 9 | మోఖాసా | మొఖాసా |
| 38 | 16 | తానొక్కడై | తానొక్కొక్కడై |
| 41 | 27 | సీతారాయుడు | సీతారాముడు |
| 42 | 2 | హైస్కూలు వేళలో | హైస్కూలు వేళలు |
| 42 | 11 | పట్టించుకునేవాడు. | పట్టించుకునేవాడు కాదు. |
| 42 | 18 | తెలుసులేపోయ్! | తెలుసులేవోయ్! |
| 42 | 20 | రూపాయలు చిల్లర | రూపాయల చిల్లర |
| 42 | 23 | రోడ్డన్నీ | రోడ్లన్నీ |
| 43 | 1 | మా రోడ్డులో | మారుతీ సినిమా రోడ్డులో |
| 43 | 4 | ఆప్టికల్ | ఆఫ్రికన్ |
| 43 | 13 | ఉన్నా | ఉన్న |
| 44 | 10 | సెక్షనుకు | సెక్షనుకు |
| 46 | 4 | సంభోదించారు | సంబోధించారు |
| 48 | 19 | గమ్ముత్తయిన | గమ్మత్తయిన |
| 49 | 5 | కోటలరాజు | కోటంరాజు |
| 49 | 6 | తిరుగుతుండేవాళ్లు | తిరుగుతుండేవాళ్లం! |

| పేజి నెం. | లైను నెం. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 49 | 18 | రిగ్జామినేషన్ | రీ-ఎగ్జామినేషన్ |
| 49 | 28 | సబ్జక్టు | సబ్జక్టు |
| 50 | 4 | బిల్లింగ్ | బిల్డింగ్ |
| 50 | 13 | రాఘవయ్యగారు | రాఘవయ్యంగారు |
| 50 | 20 | మేనేజీ | మేనేజ్ |
| 51 | 9 | వార్డ్న్ | వార్డెన్ |
| 53 | 7 | మూడో ఫారంలో | మూడో టరంలో |
| 56 | 19 | భార్యా | భార్య |
| 57 | 1 | బొరాలీ | బోరల్ |
| 57 | 9 | తెలుగే | తెలుగె |
| 60 | 14 | జగన్నాధరావుగారు | జగన్నాధరాయణంగారు |
| 66 | 15 | చాణుక్యుడు | చాణక్యుడు |
| 66 | 17 | బెంగాళి | బెంగాలి |
| 66 | 21 | తీసుకురావడానికి | కనీసం రిహార్సల్సుకయినా తీసుకురావడానకి |
| 67 | 5 | ఆడుతుంటేవాడు | ఆడుతుండేవాడు |
| 67 | 15 | రాఘవ కళాసమితి | రాఘవ కళాకేంద్రం |
| 68 | 13 | 1999లో నాకు దాదాపు 80 అయితే | ఈ వాక్యం లేదు |
| 68 | 15 | క్లాస్ బ్రైట్ | క్లాస్‌లో బ్రైట్ |
| 68 | 27 | ఇవి చదవోయ్ | ఇవి చదవ్వోయ్ |
| 69 | 17 | ప్రఖ్యాత | ప్రాచ్య |
| 69 | 18 | పాశ్చాత్య | ప్రాచ్య |
| 69 | 21 | బీచ్‌లో బిల్డింగ్స్ | బీచ్‌లో యూనివర్సిటీ బిల్డింగ్స్ |
| 69 | 23 | హాలుకు వెళ్లడానికి | హాలుకు వెళ్లడానికి. |
| 69 | 26 | ఏమిట్రా మొండితనం | ఏమిటా మొండితనం |
| 69 | 28 | కన్‌వైజింగ్‌గా | కన్‌విన్సింగ్‌గా |
| 71 | 3 | ఇటితే | యిటివ్వ |
| 73 | 14 | సెక్షన్ | సెక్షన్ |
| 73 | 15 | సెక్షన్ | సెక్షన్ |
| 80 | 1 | ఏనుగుల | ఏనుగు |
| 80 | 2 | ఒక్క బజారు | ఒక్క బజారులో |
| 81 | 10 | చాపలపాడు | బాపలపాడు |
| 89 | 23 | SOVIET COMMUNIUSM | SOVIET COMMUNISM |

| పేజి నెం. | లైను నెం. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 92 | 12 | విలేజ్ వుంది | విలేజ్ |
| 92 | 27 | మగవాళ్లు | మగవాళ్ల |
| 99 | 16 | MARYISM | MARXISM |
| 99 | 23 | Maryist | Marxist |
| 99 | 24 | Maryist | Marxist |
| 108 | 8 | మసలుతున్నారు | మనుషులున్నారు |
| 110 | 2 | మోతుబారి రైతు | మోతుబరి రైతు |
| 112 | 9 | రావాలని లేక - ఇనాళ్లు | రావలను గాక - ఇన్నాళ్లు |
| 122 | 10 | డ్రెస్సుతోనే | డ్రెస్‌తోనే |
| 158 | 26 | ప్రదర్శించామని | ప్రదర్శించమని |
| 160 | 3 | కర్టెన్లు వచ్చినా | కర్టెన్లు వచ్చినయ్ |
| 175 | 23 | కవితకవం | కవిత్వం |
| 176 | 4 | రజనీకాంతరావును | రజనీకాంతరావు |
| 185 | 5 | రాజహంపి | రాజహంసి |
| 192 | 19 | నాదెండ్లగారు | నాగిరెడ్డిగారు |
| 195 | 3 | అప్పుడి | అప్పుడే |
| 197 | 23 | కృష్ణ కాలవలో | కృష్ణ కాలవల్లో |
| 199 | 30 | మన వాళ్లా చార్లు | మనవాళ్లాచార్లు |
| 200 | 3 | యిది | delete |
| 201 | చివరి లైన్ | ఆడుతుండే | ఆడుతుంటే |
| 208 | 10 | నన్న | నన్ను |
| 215 | 24 | రామమోహనరావుగా | రామమోహనరావు గారు |
| 217 | చివరి లైన్ | క్లోజ్ చేయించి | క్లీన్ చేయించి |
| 227 | 18 | ఫండమెంట్ | ఫండమెంటల్ |
| 227 | 25 | ఎదిగిన | "ఎదిగిన" |
| 236 | 10 | పట్టుకుంటె | పట్టకుంటె |
| 238 | 1 | ఊరి | ఊరికి |
| 241 | 25 | విదారకర | విరాదక |
| 242 | 13 | పేరుకొన్ను్కన్నాడు | పేర కొనుక్కున్నాడు |
| 250 | 23 | పంపించేవారు | పంపించేశారు |
| 253 | 14 | చేయించమన్నాడు | చేయించమన్నాను |
| 255 | 9 | వారసపుత్రుడు | ఔరసపుత్రుడు |
| 258 | 15 | పెళ్లి పాడుచేశాడుగదరా! | పెళ్లి పాడుచేశావుగదరా! |

| పేజి నెం. | లైను నెం. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 263 | 3 | కింది | కింద |
| 264 | చివరి లైన్ | టటౌనుకు | టౌనుకు |
| 270 | 22 | నుండి | వుండి |
| 273 | 19 | హస్తలాఖం | హస్తలాఘవం |
| 279 | 20 | విభాగాలలున్నప్పుడు | విభాగాలయినప్పుడు |
| 281 | 8 | చదివిటేప్పటినుంచి | చదివేటప్పటినుంచి |
| 281 | 13 | ఆహ్వాంనం | ఆహ్వానం |
| 282 | 4 | ceremonics | ceremonies |
| 282 | 17 | చెప్పారు | చెప్పాడు |
| 285 | 9 | ఆశక్తి | ఆసక్తి |
| 285 | 18 | క్రమంలో | క్రియలతో |
| 290 | 10 | ప్రారంభించిన | ప్రారంభించి |
| 297 | 4 | కానిస్టేలులే | కానిస్టేబులే |
| 313 | 3 | విమానాశ్రమాలలో | విమానాశ్రయాలలో |
| 313 | 7 | డా॥ స్వాతి | డా॥ స్వామి |
| 314 | 5 | అని | అన్ని |
| 314 | 15 | Dalls | Dallas |
| 316 | 14 | Clock room | Cloak room |
| 316 | 20 | జులై 1 | జులై 27 |

మనవి : ముందు - యీ పట్టిక ప్రకారం తప్పులను ఒప్పులుగా దిద్దుకుని ఆ తరువాత చదవండి.

# ఇప్పటి కుటుంబం



కుమార్తె కవిత, మునిమనవరాలు ప్రత్యూష,
మనవరాలి భర్త సుమన్, మనవరాలు శిరీష, నేను

